శ్రీరస్తు.

# వైదికమతచరిత్రము

అనఁగా:

## 'హిందూమత' మనెడి మతముయొక్క చరిత్రము

మొదటి భాగము.

(మొదటిసంపుటము)



మొదటికూర్పు, 500 ప్రతులు.



గ్రంథకర్త:

గోపరాజు వైకుంఠరావు.

సృష్ట్యాది: ౧౯౫,౫౮,౮౫,౦౩౭ సం॥

కలియుగాది: ౫,౦౩౭ సం॥

క్రీ. శ. 1936.

శ్రీ ర స్తు.

# వైదికమతచరిత్రము

అనఁగా:

## 'హిందూమత'మనెడి మతముయొక్క చరిత్రము

మొదటి భాగము.

(మొదటి సంపుటము)



మొదటికూర్పు, 500 ప్రతులు.

గ్రంథకర్త:

గోపరాజు వైకుంఠరావు.

సృష్ట్యాది: ౧౯౫,౫౮,౮౫,౦౩౭ సం॥

కలియుగాది: ౫,౦౩౭ సం॥

క్రీ. శ. 1936.

# పీఠిక.

ప్రస్తుతకాలమున వైదికమత, సాంఘికధర్మములకు వాటిల్లిన విప్లవములచే నేర్పడినవిషమపరిస్థితులను బరిష్కరించుట కిట్టిగ్రంథ మొకటి యవసరమనునూహ చిరకాలముగ (నంగా రమారమి పండ్రెండేండ్లకుఁబూర్వమునుంచియు) హృదయగతమై యుండుటచే, నిట్టిగ్రంథరచనకు సమర్థులగు మహనీయులెవరైనఁ బూనుకొనుట మంచిదనునభిప్రాయమును మాత్రము సూచించుచు నాంధ్రపత్రిక, వర్ణాశ్రమధర్మసంస్థాపనము మొదలగు పత్రికలలో నొకటిరెండు వ్యాసముల నాకాలములో వ్రాసి ప్రకటించియుంటిమి. అప్పటి కింకను విశాఖపట్టణమున 'ఎంజినీరింగ్-స్కూల్' (Engineering School) లో మేము విద్యార్థిదశయందుండుటచే నంతకంటె నెక్కువ ప్రయత్నమును జేయుటకు పరిస్థితు లనుకూలింపనందున నిట్టిగ్రంథ రచనమునకుఁ గడంగుటకు బుద్ధిపుట్టియుండలేదు. విద్యార్థిదశ ముగిసినపిమ్మటనైనను జీవితమం దెక్కుడుకాల ముదరపోషణనిమిత్తమై యుద్యోగాన్వేషణమందును, మఱికొంతకాల మనారోగ్యముచేతను వ్యర్థమగుచువచ్చెను. తుదకు బళ్లారిమండలమందలి 'హాస్పేట' యను పట్టణమునఁ గ్రోధనసంవత్సరమునకు సరియైన క్రీ. శ. 1925 సం॥ర మున నుద్యోగముచేయుచున్నకాలమున శక్తికొలఁది నీగ్రంథరచనకు స్వయముగ బ్రయత్నింపవలయునని బుద్ధిప్రేరేపించుటచే, నందులకుఁ బ్రారంభించితిమి. అందుచే నాపట్టణమునకు సమీపముననున్న శ్రీహంపీవిరూపాక్షక్షేత్రమందలి భువనేశ్వరీవిరూపాక్షుల కృపా విశేషమే మాగ్రంథరచనాప్రేరేపణకుఁ గారణమనియు హాస్పేట పట్టణమే మాయీకృతిసంతానమునకు జన్మభూమియనియు భావించు చున్నాము.

ప్రారంభించునాఁటికి గ్రంథమింతటిపరిమాణముగలది (పెద్దది) యగు ననునూహ మాకులేదు. ఐనను బ్రారంభించి విషయములు

లభించినంతవఱకు సేకరించి రచనకుఁ గడంగుచుంటిమి. క్రమక్రమముగ గ్రంథరచన కెక్కువవిషయములు లభించుచువచ్చినకొలఁదిని గ్రంథము వ్రాయుట కభ్యంతరములుగూడ వృద్ధియగుచువచ్చెను. అట్టి యభ్యంతరములలో ముఖ్యమైనవి రెండు; మొదటిది యుద్యోగము దొరకకపోవుటయును నదితప్ప వేఱుగ సరియైనజీవనాధారము లేక పోవుటయును. రెండవది, యిటీవల కొంతకాలమువఱకును మాకు నిత్యానపాయినిగ వర్తించుచుండిన యనారోగ్యము. మధ్యమధ్య గొలదికాల ముద్యోగములు లభించి మనసునకుఁ గొంచెము స్వాస్థత చేకూరినను నట్టియుద్యోగములు కొన్నిమాసములపరిమితిమాత్రమే కలవిగనుండుటచే ననంతరము తిరిగియుద్యోగ మెచటదొఱకును భగవంతుఁడా యనునాందోళన కవకాశము గలుగుచుండెను. ఈవిధ ములగు నభ్యంతరములచే గ్రంథమారంభించి యేడెనిమిదేండ్లుగడ చినను నప్పటి కీగ్రంథములో సగముభాగముకంటె నెక్కువ పూర్తి చేయఁజాలకయుంటిమి. దైవకృపచే గడచిన సుమారుపదేండ్లనుంచియు నుదరపోషణమార్గాన్వేషణాందోళన మనసరము లేక యుద్యోగ మీ చెన్నపట్టణమున నవిచ్ఛిన్నముగ నడచుచున్నప్పటికిని మధ్యమధ్య నుద్యోగసంబంధమగు కార్యభారముచేఁ గల్గుచువచ్చినయాందోళన మును, మధ్యమధ్య కతిపయమాసపరిమితిగల దీర్ఘానారోగ్యములచే గల్గినయాందోళనయుఁగూడ గ్రంథరచన కభ్యంతరములైనవని చెప్పక తప్పదు. ఉద్యోగము లేక యింటనున్న కాలమునఁ జదివిన గ్రంథము లందలి జ్ఞానము మెదడులోనుండుటచే, నుద్యోగముకొఱకు దేశాం తరములలో నల్లాడుకాలమునఁగూడ యవకాశము చిక్కినపుడెల్లను జేతికిదొఱకిన కాఁగితముపై గ్రంథవిషయములను వ్రాసిపడవైచుచుం డెడివారము. ఎప్పు డేవిషయమున నూహాలుబయలువెడలిన నప్పుడే వానిని గాఁగితముపై వ్రాసి పడవైచుచు వచ్చుచుండుటచేఁ దుదకు వానినన్నిఁటి నొకదానితోనొకటి సందర్భపడునట్లును సంబంధించి యుండునట్లును గ్రంథరూపముగఁ గూర్పవలసివచ్చుసరి కించుక శ్రమ యనిపించినది. ప్రథమప్రయత్నమగుటచేఁ గాఁబోలును కొన్ని ముఖ్యవిషయములు సమయోచితముగ స్ఫురింపక యనంతరము మాత్రమే స్ఫురించుటచే, వానిని వేఱుకాఁగితములపై చిత్తులువ్రాసి

యవి చేర్పవలసినసందర్భముల కెదురుగఁ గొండగుర్తులువైచి వాని నన్నిఁటిని బ్రోగుచేసియుంచి స్వస్థలమునకు వచ్చినపుడు, గుంటూరు మండలమందలి రేపల్లెతాలూకాలోని పల్లెకోన గ్రామవాస్తవ్యులును మాప్రియమిత్రులునగు వైద్యవిద్వాన్ బ్రహ్మశ్రీ చివుకుల లక్ష్మీ నారాయణశాస్త్రిగారి కిచ్చుచుంటిమి. ఆవిధముగ నాచిత్తులనన్నిఁటిని బ్రోవుచేసి యోపికతో వానికి సరిగ్రాసి యారీతిగ నీగ్రంథముయొక్క మొదటిరెండుప్రకరణములలోని చాలాభాగములను నిర్మించుటలో వారు మాకు మిక్కిలితోడ్పడియుండిరి. అందుచే వారికెంతయుఁ గృతజ్ఞులము.

## గ్రంథరచనాసాధనములు.

ఈగ్రంథరచనకుఁ బ్రధానమార్గదర్శకములగు స్మృతిపురాణేతి హాసాది ప్రాచీన ముఖ్యగ్రంథములమాట యట్లుండ, మే మిపు డీ చరిత్రగ్రంథమును గూర్చినవిధముననే కూర్పకున్నను, మొత్తము మీఁద నిట్టియుద్దేశ్యమునే దృక్పథమునకునిల్పికొని కొన్నిగ్రంథముల నిదివఱకే నిర్మించియున్న నవీనగ్రంథకర్తలు కొందఱు లేకపోలేదు. అట్టివారిగ్రంథములుకూడ మాయీగ్రంథరచనకుఁ దగినంత సహాయమొనర్చియుండుటచే వానిలో ముఖ్యగ్రంథములను, వానిని వ్రాసిన గ్రంథకర్తలను నిచటఁ జేర్కొని వారికి మాకృతజ్ఞతను వెల్ల డించుకొనుట యవసరమైయున్నది.

అట్టిగ్రంథములలో ముఖ్యమైనవి, శ్రీపరమహంసపరివ్రాజకా చార్యవర్య జగద్గురు శ్రీకల్యాణానందభారతీమాంతాచార్యస్వాముల వారు రచించిన "శ్రీకల్యాణానందభారతీగ్రంథమాల"లోని గ్రంథ ములును, నందు ముఖ్యముగా, వా రింగ్లీషుభాషలో వ్రాసిన 'మానవ రహస్యము' (Manavarahasyam)ను, 'సంస్కృతవాఙ్మయకాలాను క్రమణిక' (Chronology of Sanskrit Literature)ను, 'శ్రుతిధర్మ సంజీవనీ' పత్త్రికాధిపతులును, గీర్తిశేషులునునైన బ్రహ్మశ్రీ శివపురపు వీరభద్రపాకయాజిగారు రచించి తమపత్త్రికలోఁ బ్రకటించుచు వచ్చిన ప్రమాణాదర్శము, మానవచరిత్రము, మహర్షిచరిత్రముఁ, జండాలా స్పర్శమండనము, రజస్వలావివాహఖండనము, జాతివిభాగాదర్శముఁ,

బ్రశ్నార్ణవాపోశనము మొదలగువిమర్శగ్రంథములును, బ్ర. శ్రీ. ప్రభాకరఉమామహేశ్వరపండితుల 'మతప్రభాకరగ్రంథమాలా' గ్రంథములును, బ్ర. శ్రీ. ముక్తినూతలపాటి గోపాలకృష్ణశాస్త్రిగారి 'లోకములు, లోకాంతరములు, తద్యాత్రాదికము' అను గ్రంథమును, శ్రీఅచ్యుతుని వేంకటాచలపతిరావుగారిచే రచింపఁబడి స్వధర్మప్రకాశినీ పత్రికలోఁ బ్రకటింపఁబడుచువచ్చిన 'వేదభూమి' యనుగ్రంథమును, శ్రీగోవిందరాజు సత్యహరిశ్చంద్రరావుగారిచే వ్రాయఁబడిన 'వర్ణావశ్యకత' యును, శ్రీనడింపల్లిజగన్నాథరావుగారిచే రచింపబడిన 'The Age of Mahabharatha War' (మహాభారతయుద్ధకాలము) అను గ్రంథమును, బ్ర. శ్రీ. కాశీభట్టబ్రహ్మయ్యశాస్త్రిగారిచే వ్రాయఁబడిన యుపన్యాసపయోనిధి మొదలగుగ్రంథములును ముఖ్యమైనవి.

ఇవిగాక శ్రీశ్రుతిధర్మ సంజీవనీ, స్వధర్మప్రకాశినీ, వర్ణాశ్రమ ధర్మసంస్థాపనము, బ్రాహ్మణపత్రిక, ఆంధ్రసంరక్షణి, త్రిలిఙ్గ, మొదలగు తెనుఁగుపత్రికారాజములలో నాయాపత్రికాధిపతులచేతను, విమర్శకాగ్రేసరులచేతను, విలేఖరులచేతను, బలువురుపండితులచేతను బ్రకటింపఁబడుచు వచ్చిన పెక్కుశాస్త్రచర్చలును, మత సాంఘికవిషయిక గ్రంథములును, విమర్శనలునుగూడ మాయీగ్రంథరచన కవసరమగు జ్ఞానాభివృద్ధికిని, విషయసంగ్రహామునకును, దోడ్పడియుండుటచే వారెల్లరును మాకుఁ బ్రశంసాపాత్రులే. మఱియు నింగ్లీషుభాషలో వెనుకఁ బ్రకటింపఁబడుచుః చ్చిన 'Vedic World' (వేదిక్, వరల్డు) అనుపత్రికయును, 'Vaidika Dharma Sanjivini' (వైదికధర్మసంజీవిని) పత్రికయును, 'Sanatanist' (సనాతనిస్టు) పత్రికయును, 'Dharma' (ధర్మ) యనుపత్రికయును బ్రస్తుతమునడచుచున్న 'Indian Mirror' (ఇండియన్-మిర్రర్) పత్రికయును, 'Dharmarajya' (ధర్మరాజ్య) పత్రికయును, నివిగాక యింకను మాయీగ్రంథమున సందర్భానుసారముగ నుల్లేఖింపఁబడి పేర్కొనఁబడిన సమస్త పత్రికలును నితర సమస్త గ్రంథములును, నందు ముఖ్యముగ శ్రుతులును స్మృతిసూత్రపురాణేతిహాసాది ప్రాచీనగ్రంథములునుగూడ మాయీగ్రంథరచన కేదో విధముగ సాధనములై యుండుటచే నాయాగ్రంథకర్తలెల్లరునుగూడ మాకుఁ బ్రశంసనీయులే యైయున్నారు.

## గ్రంథరచనావిధానము.

గ్రంథరచనాసాధనములను జేర్కొనుటయైనందున, నిఁక గ్రంథ నిర్మాణప్రకారమును బాఠకులసౌలభ్యముకొఱకై యించుక విశదీక రించుచున్నవారము. ఈగ్రంథరచనకు హేతువులను మొదటిప్రకరణ మందుఁ దొలుదొల్త నుపోద్ఘాతమునవినిపించి, యందులకు ముఖ్య హేతువు నవనాగరకులగు నవీనవిద్యార్థిబృందములకును నవీనవిద్యా వంతులకును బెక్కుమందికి వైదికమతముయొక్క సత్యమగుచరిత్ర చాలావఱకు తెలియకపోవుటయే యని నిరూపించి యుంటిమి. అందుచే వైదికమతముయొక్క సత్యమగుచరిత్ర నెఱుఁగుట కాధార ములను వెదకికొనవలసిరాఁగా నట్టియాధారములు రెండు గనుపించు చున్నవనియు నందొకటి మన ప్రాచీనచరిత్రగ్రంథసముదాయ మగుస్మృతిసూత్రపురాణేతిహాసాదులును, రెండవది, యిటీవలి విదేశీ యస్వదేశీయచరిత్రకారులు వ్రాసిన నవీనచరిత్రగ్రంథసముదాయమునని తెలిపియుంటిమి. కాని, యా రెండుసాధనము లొండొంటితో నేకీభవిం పక ప్రబలవిరుద్ధములగు చరిత్రవిషయములను బోధించుచుంటచే నం దేది సత్యమును, విశ్వాసనీయము నని విమర్శింపవలసివచ్చినది. అట్లువిమ ర్శింపఁబోఁగా మొదటిసాధనమగు ప్రాచీనచరిత్రగ్రంథము లేర్పడినవిధా నమునుగుఱించి యాగ్రంథములం దొకరీతిగఁజెప్పఁబడియుండుటయు, నవీనచరిత్రలయం దావిషయమే విరుద్ధముగ మఱియొకరీతిని జెప్పఁబడి యుండుటయును గనుపట్టినది. అనఁగా, వైదికమతమునుగుఱించిన చరి త్రవిషయములలోఁ ప్రాచీనచరిత్రలు చెప్పినసంగతులకు విరుద్ధములగు సంగతులను నవీనచరిత్రలు చెప్పినట్లే, ప్రాచీనచరిత్ర లేర్పడినవిధాన మునుగుఱించి కూడ యాచరిత్రలు చెప్పుకొనుసంగతులకు విరుద్ధముల గువిషయములను నవీనచరిత్రలు చెప్పుచుండుట పొడకట్టినది. వైదిక మతమునుగుఱించి ప్రాచీనచరిత్రలు చెప్పినవిషయములయొక్క సత్యత్వమును నసత్యత్వమును నాచరిత్రలయొక్క యోగ్యతాఽ యోగ్యతలపైననే యాధారపడియుండుట సహజమైనందునఁ, బైమత మునుగుఱించి యాచరిత్రలు చెప్పినవిషయములు సత్యమా, కాక నవీన చరిత్రలుచెప్పినవిషయములు సత్యమా యనువిమర్శ బయలుదేరుటకు ముందుగనే ప్రాచీనచరిత్రలయొక్క యోగ్యతాఽయోగ్యతలను

జర్చించు టవసరమైనది. అందుచే నాచరిత్ర లేర్పడినవిధానమును గుఱించి యాచరిత్రలు స్వయముగఁజెప్పుకొనుచున్న విషయము లే సత్యమా, కాక నవీనచరిత్రలు చెప్పుచున్న విషయములే సత్యమా యనువిమర్శకుఁ దొలుదొల్తఁ బూర్ణమగునవసర మేర్పడినది. నవీనచరిత్ర లేర్పడినవిధానమునుగుఱించి యాచరిత్రలు స్వయముగఁజెప్పుకొను విషయ మేతప్ప, యందువిషయమై ప్రాచీనచరిత్ర లేమియుఁజెప్పకు న్నందున, నావిషయమున నవీనచరిత్రలు చెప్పుకొనుసంగతులనే సత్యముగ గ్రహింప నవకాశముగల్గినది. అందుచే నవీనచరిత్ర వేర్పడిన విధానమునుగుఱించి యాచరిత్రలు స్వయముగఁజెప్పుకొనువిషయము లనే సత్యముగ గ్రహించి ముందిడికొని, వానిసహాయముననే, "ప్రాచీన చరిత్ర లేర్పడినవిధానమునుగుఱించి యాచరిత్రలు స్వయముగఁజెప్పు కొనువిషయములు సత్యమా, కాక యందులకువిరుద్ధముగ నవీన చరిత్రలు చెప్పుచున్నవిషయములు సత్యమా"యనువిమర్శకుఁ గడంగి యుంటిమి. ఈగ్రంథముయొక్క మొదటిమూఁడుప్రకరణములందును విమర్శింపఁబడినవిషయ మిదియే. అనఁగా వైదికమతసత్యచరిత్ర నిర్ణయ మునకుముందు దానికిఁ దగినప్రమాణనిర్ణయమును గావించుటకే యీ మొదటిమూఁడుప్రకరణము లేర్పడినవని చెప్పవలసియున్నది. అనఁగా వైదికమతసత్యచరిత్రభవననిర్మాణమునకీమూఁడుప్రకరణము లును మూలశిలలని (Foundation stones) (బునాదులని) చెప్పఁదగి యున్నవి.

అందు మొదటి ప్రకరణమున, స్మృతిసూత్రపురాణేతిహాసాది సమస్తప్రాచీనచరిత్రగ్రంథములకును మూలాధారమగు శ్రుతిని(అనఁగా వేదమును) గుఱించియును, రెండవప్రకరణమున వేదముతరువాతవి యగు స్మృతులను (అనఁగా ధర్మశాస్త్రములను) గుఱించియును మూఁడవప్రకరణమునఁ బ్రాచీన చరిత్రగ్రంథములలోఁ బ్రధానము లని చెప్పఁదగిన పురాణేతిహాసములనుగుఱించియును జర్చించియుంటిమి. ఆమూఁడుప్రకరణములలోను విమర్శనాక్రమ మీాక్రిందిరీతిగ నించు మించుగ నొక్కటేవిధమున నుండునని చెప్పవచ్చును. ఎట్లనఁగాఁ: బ్రతిప్రకరణముననుఁ దొలుత వేదము మొదలగు పైవానినిగుఱించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పునని చర్చించియుంటిమి; పిదప వానినిగుఱిం

చియే, నవీనచరిత్రలేమి చెప్పునని చర్చించియుంటిమి; అటుపై యా యాచరిత్రలు చెప్పువిషయములలో వానివానికిఁగల యాధారములఁ గుఱించియు, బలాబలములను గుఱించియుఁ జర్చించి పిమ్మట, ప్రాచీన చరిత్రలు చెప్పువిషయములు సత్యమా, కాక నవీనచరిత్రలు చెప్పువిషయములు సత్యమా యనుప్రశ్నకు సమాధానములను నిర్ణ యించియుంటిమి. ఈలోపల జరుగుచర్చలలో సందర్భానుసారముగ సంభవించుసంశయములను దర్కించి వాని కచ్చటచ్చటనే సమాధాన ములను జెప్పియుంటిమి. అట్లు సందర్భానుసారముగ గలుగుసంశయ ములుగాక, యాయాప్రకరణములందుఁ జర్చింపఁబడు వేదము మొదలగు ప్రధానవిషయములకు సంబంధించిన యితరసంశయముల నటుపై యా యాప్రకరణములలోఁ జివరభాగమునఁ జేర్చి వేఱువేఱుగఁ జర్చించి వానికిఁ దగిన సమాధానములను జెప్పియుంటిమి. అట్లు చర్చింపఁబడిన సంశయములుగాక యింకను వేఱుగ నేమైననున్నచో వానిని మాపా ఠకులు దయతో మాకుఁ దెలియఁజేసినచో నీగ్రంథముయొక్క తుదిని, "అనుబంధవ్యాసము" లను పేర నొకప్రకరణమేర్పఱచి యందా సంశ యములకు మాయోపినరీతిని సమాధానములను దెల్ప నిశ్చయించి యుంటిమి. ఇది యీగ్రంథములోని మొదటిమూఁడుప్రకరణముల యొక్క నిర్మాణక్రమము.

ఇఁక నట్టిప్రమాణగ్రంథముల నాధారముగఁ గొని గ్రహింప వలసిన ముఖ్యమగుచరిత్రవిషయములలో మొదటిది "సృష్టి యెప్పుడు జరిగె?" నను విషయము. అది యీగ్రంథముయొక్క నాల్గవప్రకరణ మునఁ జర్చింపఁబడును. అటుపై "సృష్టి యెక్కడజరిగె" నను విషయ మును, "సృష్టి యెట్లుజరిగె" ననువిషయమును గ్రమముగా నైదవ ప్రకరణమునను, నాఱవప్రకరణమునను విమర్శింపఁబడును. ఈమూఁ డును మిక్కిలి ముఖ్యవిషయములై యున్నవి. ఏమనినఁ, బ్రాచీననవీన చరిత్రల కీవిషయములలో నేర్పడిన యభిప్రాయభేదములే ప్రస్తుత కాలపు వైదికమతకల్లోలమునకును, దేశక్షోభకును ముఖ్యకారణ ములై యున్నవి. ఈమూఁడుప్రకరణములందునుగూడ విమర్శనవిధా నము మొదటిమూఁడుప్రకరణములందువలెనె యుండును. అనఁగా, నాయావిషయమునుగుఱించి ప్రాచీనచరిత్ర లేమి చెప్పుననని తొలుతను,

నవీనచరిత్ర లేమి చెప్పునని పిమ్మటను, నం దేదిసత్యమని యటుపైనను, గ్రమముగను విపులముగను విమర్శించి, ప్రాచీనచరిత్రలు చెప్పువిష యమే సత్యమని బుజువుచేసి, యందువిషయమున నవనాగరకులకుఁ గలసంశయములను, నాక్షేపణములను వరుసగావిమర్శించి వానికిఁదగిన సమాధానములు చెప్పఁబడును. ఆవిషయమున బ్రాచీన, నవీన, చరిత్రలనడుమఁ గల యెట్టియెట్టియభిప్రాయభేదములచే నెట్టియెట్టియనర్థములువాటిల్లినదియుఁగూడ సందర్భానుసారముగఁ బైప్రకరణములందే వివరింపఁబడి విమర్శింపఁబడును. కావున నామూఁడుప్రకరణములను జదువుటచే యథార్థచరిత్రజ్ఞానమేర్పడి వైదికమతాచారములందును నాగ్రంథములందును గలనిరసనబుద్ధియు, నిర్లక్ష్యభావమును దొలఁగి పోయి వానియెడను, నందలిధర్మముల యాచరణమునందును భక్తి విశ్వాసములును, శ్రద్ధయు నేర్పడును. అదియేగదా యీగ్రంథనిర్మాణప్రయోజనము.

"నవీనచరిత్ర లెట్లుపరిణమించె?" నను నేడవప్రకరణమునఁ, బ్రస్తుతము వైదికమతమునకును, భారతవర్షమునకును సంభవించినదురవస్థలును, వానివానికి మూలములగు నాయానవీనచారిత్రకవిషయములును విపులముగను వివరముగను వర్ణింపఁబడును. ఆచరిత్రవిషయములజ్ఞానమే యీదురవస్థలరూపముగ మారినదని నిరూపింపఁబడును.

ఇంతవఱకును గ్రంథము విమర్శనాత్మకముగనే యుండును. ఇటుపై యెనిమిదవప్రకరణమున 'వైదికమతతత్త్వ' మను పేర, నామతస్వరూపమును నందలి వివిధశాఖలును, వానివానికిఁ గలయన్యోన్యసంబంధమును, నందలిభిన్నభిన్నసాంప్రదాయములకుఁ గలసామరస్యమును, నందువిషయమున నవనాగరకులకుఁ గలసంశయములకు సమాధానములతోఁగూడ విశదీకరింపఁబడును. ఇంతకుముందరిప్రకరణముల లోని విమర్శనలచే నేర్పడినజ్ఞాన మీప్రకరణమందలి జ్ఞానసాధనిర్మాణమునకు బునాది కాఁగలదు. ఇదియే వీనికిఁగల యవినాభావసంబంధము. ఇట్టిబునాది లోపించియున్నకతముననే వైదికమతతత్త్వవిషయమునఁ బూర్ణజ్ఞానముగల విద్వాంసులుసహిత మొకప్పుడు నవనాగరకులుచేయు విమర్శనలధాటికి నిలువజాలక తలయొగ్గి తొలఁగిచనవలసి వచ్చుచున్నది. అట్టిదుస్థితి నరికట్టుటే యీగ్రంథముఖ్యోద్దేశమును,

బ్రథానప్రయోజనమును. దీనిని సక్రమముగఁ బఠించి పైప్రయోజన మందవలసినభారము పాఠకులపై నున్నది.

ఈపైప్రకరణములలో సందర్భానుసారముగఁ జేర్పఁదగినట్టియు నిఁకమీఁద లభించునట్టియు నూతనాంశములను జేర్చి 'వైదికమతచరిత్రానుబంధ' మనుపేర నొకయనుబంధమును దొమ్మిదవప్రకరణముగాఁ గూర్పఁ దలంపుగలదు. ఇది గ్రంథనిర్మాణవిధానము.

## గ్రంథనామ నిర్వచనము.

"వైదికమత మనుపే రెట్లుగలిగె" ననువిషయము నుపోద్ఘాత ప్రకరణమందే కొంత చర్చించియుంటిమి. "...వేదమునుండి పుట్టిన గ్రంథములును, ధర్మములును, మంత్రములును, దంత్రములును, గర్మలును మొదలగునన్నింటికిని 'వైదిక' మనువిశేషణమును జేర్చి వైదిక గ్రంథములనియు, వైదికధర్మములనియు, వైదికమంత్రములనియు, వైదికతంత్రములనియు వైదికకర్మలనియు నామతగ్రంథములం దచ్చచ్చట వాడఁబడఁగాఁ జూచుచున్నార" మని యచటఁ దెలిపియుంటి మేగాని నిదర్శనములను గనఁబఱచియుండలేదు. కావున నీదిగువఁ గనఁబఱచుచున్నాము.

౧"శ్లో. కామాత్మతా నప్రశస్తా నచైవేహా స్త్యకామతా,
కామ్యోహి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః."—
(మనుస్మృతిః)

(ఈశ్లోకనందలికట్టకడపటి 'వైదిక' శబ్దమును గనునది.)

౨ పరీక్షితుఁడు శుకునిఁ బ్రపంచోద్భవాదికంబు నడుగుట.

"సీ. విను శుకయోగికి మనుజేశుఁ డిట్లను "మునినాథ!......
... ... ... ... ...

వ. మఱియును..................మహాప్రళయంబును నిష్టాపూర్తంబులును, యాగాదివైదికకర్మజాలంబులును వాపీకూపతటాక దేవాలయాదినిర్మాణంబులును, ........బ్రపన్నుండనైన నాకు నెఱింగింపుము............" 222

శ్రీమదాంధ్రభాగవతము, ద్వితీయస్కంధము.

పై వచనంబునఁ స్ఫుటాక్షరములుగల "వైదికకర్మజాలంబు"లను శబ్దమును గాంచునది. (ఈపైవచనము నేయీగ్రంథమున మూఁడవప్రకరణముయొక్క చివర వేఱొకసందర్భమునఁ గనఁబఱచియుండుట కాకతాళీయముగ సంభవించియున్నది. కావున నచటఁగూడఁ జూడదగును. "పురాణములు పుక్కిటికథలుగావా" యనుశీర్షిక క్రిందఁ జూడుఁడు.)

3శ్లో. "స్థాపయధ్వ మిమంమార్గం ప్రయత్నేనాపి హేద్విజాః!
స్థాపితే వైదికేమార్గే సకలం సుస్థితంభవేత్."... (స్మృతిః.)
"వైదికధర్మసంజీవిని" పత్రిక,(ముఖపత్రము)

ఇందలి "వైదికేమార్గే" యనుపదమును గమనించునది.

౪ మఱియును శ్రీస్కాందమహాపురాణాంతర్గత "సూతసంహిత" యనుగ్రంథమునకుఁ "దాత్పర్యదీపిక" యనుపేర వ్యాఖ్యానమును రచించిన సుప్రసిద్ధవిద్వాంసులగు శ్రీమాధవాచార్యులవారావ్యాఖ్యయందు, (యజ్ఞవైభవఖండమందలి "మార్గప్రామాణ్య"మను ౨౨-వ యధ్యాయముక్రింద) నీక్రిందిరీతిని వ్రాసియున్నారు: [ఈవ్యాఖ్యను గూడ నీగ్రంథముననే మూఁడవప్రకరణమునఁ "పురాణములను గుఱించి ప్రాచీనచరిత్రలు చెప్పినవిషయములు సత్యమా? నవీనచరిత్రలుచెప్పువిషయములు సత్యమా?" యనుశీర్షికక్రిందఁ, పురాణములుబోధించు సర్వమతసామరస్యసందర్భమునఁ గనబఱచియుండుట కాకతాళీయముగ సంభవించియున్నదిగావున వివరముల నటఁ జూడవచ్చును.]

"..........అతో వైదికమార్గవ్యతిరిక్తానాం సర్వేషామప్రామాణ్యమేవేత్యాశంక్య తత్ప్రామాణ్యం సమర్థయితుమారభతే........శ్రుతిస్మృతీతిహాసపురాణాదీని వైదికానిశాస్త్రాణి,..."

ఇందలి స్ఫుటాక్షరములుగల "వైదికమార్గ" "వైదికశాస్త్ర" శబ్దము లనుగ్రహించునది.

౫ ఇందుకుఁదోడుగ నీగ్రంథమున 2-వప్రకరణమున 22౬-వ పుటలోని శ్రీపూరీశంకరాచార్యస్వాముల వారియీక్రిందివాక్యము లనుగ్రహింపఁదగును.—

" .........It is clear therefore that the Sanatani Vaidika system was based ...... on a thorough-going & thoroughly Scientific basis........."

(Dharmarajya, Vol. 1, No. 13, pp. 8)

ఇందలి 'Vaidika' (వైదిక) పదప్రయోగమునుగూడ జూడుడు. ఇందుచే 'వైదిక' మను విశేషణరూపముయొక్క సాధుత్వము స్థిరపడు చున్నది.

వేదములు ధర్మచోదకములేగాని వాని కొకమతము లేదనియు, గావున "వైదికధర్మ" మనుటయే యుక్తముగాని "వైదికమత" మను టలో స్వారస్యము లేదనియుఁ, గావున "వైదికధర్మచరిత్ర" యను నామకరణమే సమంజసమనియు, "వైదికమతచరిత్ర" యనుపే రసమంజ సమనియుఁ గొందఱుప్రాజ్ఞులు సూచనగావించియుండిరి. కాని, 'వైదిక మత' శబ్దము మేముమాత్రమే క్రొత్తగాఁ గొనితెచ్చినదిగాదు. మాకుఁ బూర్వమే దానినివాడినవిద్వాంసులు ప్రాచీనులందును, నాధునికు లందునుగూడఁ గలరు. ఇందులకు నిదర్శనముగాఁ బైనదెల్పియున్న శ్రీమాధవాచార్యులవారే యాగ్రంథవ్యాఖ్యానముననే 'శివ మాహాత్మ్యఖండమున 'హిరణ్యగర్భాది విశేషసృష్టికథనమ్' అను ౧౧-వ యధ్యాయముక్రిందనీక్రిందిరీతిని వాడియున్నారు. [ఈ భాగ మునుగూడ, నీగ్రంథముననే రెండవప్రకరణమున "ధర్మమనఁగా నెట్టిది?" యను ముఖ్యశీర్షికక్రింద, "సుఖదుఃఖములకుఁ గారణము పూర్వకర్మయా, యదృష్టమా, కాక దైవకృపయా?" యను నుపశీర్షిక క్రింద వేఱొకసందర్భమునఁ గనఁబఱచియుండుటగూడఁ గాకతాళీ యముగనే సమకూడియున్నది; కావున వివరముల నచటఁ గాంచ నగును.]

"..........సర్వమేవైతత్స్వభావమితిచేదీదృగ్విధస్య లోకా యతికపక్షస్య వైదికమతావిశేషా, త్కర్మణైవే త్యనీశ్వరవాదినః శ్రుతిస్మృతివాదస్య విరుద్ధమితి......"

ఇందలి స్ఫుటాక్షరములుగల "వైదికమతావిశేషాత్" అను ప్రయోగమును బరికించునది.

మఱియును జగద్గురు శ్రీశ్రీశ్రీకల్యాణానందభారతీమహాంతా చార్యస్వాములవారు రచియించి లోగడ శ్రుతిధర్మసంజీవనీపత్త్రికలోఁ బ్రకటించుచువచ్చిన "శ్రుతిధర్మసంగ్రహ" మను గ్రంథముయొక్క నుపోద్ఘాతమున 'మత' మనుశబ్ద మీ క్రిందిరీతిని సమర్థింపఁబడి యున్నది.—

"మతము —........మతముల విమర్శించుటకుముందు మత శబ్దలక్షణము నొకింతవిచారించెదము. మతశబ్దము అవబోధనమందు వినియోగింపఁబడు "మన" ధాతువునకు "క్తః" అను ప్రత్యయమును జేర్చుటచేఁ గల్గినది. దానంజేసి మతమన నవబోధనవిషయమని యర్థము తెలియవచ్చుచున్నయది అవబోధనవిషయమనఁ దెలిసికొనవలసిన విషయమని సుస్పష్టమగుచున్నయది. ప్రకృతిప్రత్యయములచే నీశబ్ద మును బరిశీలించిన నీశబ్దార్థము సకలప్రజలకును దెలిసికొనఁదగిన విష యమేకాని యొకరికి నవసరమనియు మరియొకరికి ననవసరమనియుఁ దెలియరాదు; గావున మతశబ్దవాచ్యము సకలజనులకును దెలిసికొన వలసినవిషయముగా నుండవలయును......"

శ్రుతిధర్మసంగ్రహము, ఉపోద్ఘాతము,పు. 63-64
(శ్రుతిధర్మసంజీవని, సంపు. 3, సంచి. 10)

మఱియు నాగ్రంథముననే యీ క్రిందిరీతిని 'వైదికమత'శబ్ద మునే వాడియుఁగూడ నున్నారు.

"వైదికమతము:—ఇయ్యది పరమేశ్వరముఖమునుండి యప్ర యత్నముగాఁ బురుషనిశ్వాసమువలె వెలువడిన ఋగ్యజుస్సామాథర్వణ రూపంబగు వేదరాశి నాలవాలముగాఁ గల్గియుండుటచేఁ దీని కీపేరు గల్గె. వైదికజాతికంతకును నీవేదము పరమప్రమాణముగ సృష్ట్యాది నుండియు నేఁటివఱకు నలరారుచున్నయది. వేద మపౌరుషేయమును నిత్యమును స్వతఃప్రమాణమును నని వేదవేత్తలందఱును శాస్త్ర యుక్త్యనుభవంబుచే బోధింపుచున్నారలు. దానంజేసి వైదికమత మొకపురుషునిచేఁ గల్పింపఁబడిన దెంతమాత్రమును గాదు......"

శ్రుతిధర్మసంగ్రహము, ఉపోద్ఘాతము, పు. 70.
(శ్రుతిధర్మసంజీవని, సంపు. 3, సంచి 11-12)

ఇందలి స్ఫుటాక్షరములుగల మూఁడుపదముల నాలోకింపుఁడు. ఇందుచే 'వైదికమతచరిత్ర' యను నామకరణ మసమంజసముగాదని నిశ్చయించి యందులకు సాహసించితిమి. ఇట్లిన్నివిధముల 'వైదిక' శబ్దమును, 'వైదికమత'శబ్దమును ననాదిగ నామతగ్రంథములలో వాడఁబడియుండఁగా వానినిమాని,పుట్టుపూర్వోత్తరములు తెలియరా నట్టియు, నందువిషయమున వివాదముల కాస్పదమైనట్టియు, విదేశీయ మైనట్టియు 'హిందూ' 'హిందూమత'శబ్దములను బట్టికొని మన దేశీయు లేల ప్రాకులాడవలెనో తెలియరాకున్నది!

## గ్రంథప్రచురణము.

మేము మద్రాసుచేరునాటికే గ్రంథరచన ప్రారంభించి మొదటి రెండుప్రకరణములును నించుమించుగఁ బూర్తియైయున్నను నీపీతి కలోఁ దొలుత చేర్కొనియున్న యసందర్భములచే గ్రంథముద్రణ మునకును బ్రచురణమునకును దలంపుగలిగియుండలేదు. ఎన్నటికో గ్రంథరచనయంతయు ముగిసినపిమ్మట ముద్రణవిషయ మాలోచింప వచ్చును లెమ్మని పడవేసియుంచితిమి. కాని, యటుపై కొద్దికాలముననే మాప్రియమిత్రులును, లోఁగడ బెజవాడలోఁ బ్రకటింపఁబడుచు వచ్చిన "శ్రుతిధర్మసంజీవని" పత్రికాసంపాదకులై పేరువడసి కీర్తిశేషులైన బ్ర. శ్రీ. శివపురపు వీరభద్రపాకయాజిగారి ప్రియ పుత్రులునునైన కీ. శే. నాగవీరయ్యగా రీపురమునకు నుద్యోగ సంపాదనార్థము వచ్చుటయు, మాబసకుఁ జేరువనే నివాసమేర్పఱచి కొనియుండుటయుఁ దటిస్థించినందున, మాయీగ్రంథరచనసమాచా రమును దెలిసికొనియుండిరి. అటుపై కొలదికాలముననే "త్రిలిజ్గ" పత్రికాకార్యాలయమున వారి కుద్యోగము లభించియుండెను. ఒక తూరి ప్రసంగవశమున నీగ్రంథప్రచురణప్రశంస రాఁగా, "గ్రంథర చన యావత్తును ముగిసినపిదప ముద్రణవిషయ మాలోచింపవచ్చునని తలంచినచో, రచనమునం దుపేక్షగలిగి యెప్పుడో బుద్ధిపుట్టినపు డేవోనాల్గుపంక్తులు వ్రాయుటయు నటుపై యవతలఁ బడవేయుటయు జరుగుచుండును; అందుచే రచనము పూర్తియగుటకే యత్యంతాలస్య మగును. అట్లుగాక వ్రాసినంతవఱకే ముద్రణప్రారంభించినచో, నది

ముద్రణయగులోపల మిగిలిన దింకకొంత వ్రాసి వెంటవెంటనే ముద్రణ కందిచ్చుటకు సిద్ధముగానుండవలసివచ్చుటచే నుపేక్షకెడము లేక రచ నాకార్యమునందుఁ జులుకుఁదనము వొడమును; కావున ముద్రణ మును ద్వరలోఁ బ్రారంభింపవలసిన" దని యందులకు మమ్ముఁబురికొలిపి, గ్రంథముగ నచ్చువేయించుటకుఁదోఁడు, పత్రికలోఁగూడఁ బ్రకటిం చుచువచ్చినచోఁ బాఠకలోకమునకుఁగూడఁ బ్రయోజనముగల్గునని యూహించి, త్రిలిఙ్గపత్రికాసంపాదకులగు బ్ర.శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారితోఁ దామే మాపక్షమున సంప్రదించి, యట్లు ప్రకటించు టకుఁ గావలసినయత్నములన్నియుఁ గావించి, యచ్చుచిత్తులను దిద్దు భారముగూడ స్వయముగ నేవహించి, క్రీ. శ. 1931 సం. నవంబరు నెల 23-వ తేదీకి సరియైన ప్రజోత్పత్తిసం. కార్తీకశుగ౧౩ సోమవారమునాఁటి 'త్రిలిఙ్గ' పత్రికయొక్క 12-వ సంపు 47-వసంచికలో ముద్రణమును, బ్రకటనమును బ్రారంభించిరి. అది మొదలు 1932సం మే నెల30-వ తేదీకి సరియైన ఆంగీరససం. వైశాఖ బ౧౧సోమవారము నాఁటి (త్రిలిఙ్గపత్రిక ౧౩-వసంపు. ౨౨-వసంచి.) వఱకును బైయత్నము మించుమించుగ నిర్వి ఘ్నముగనే సాగినదని చెప్పవచ్చును. అప్పటికి నాగవీరయ్యగారు యం. ఏ. (M. A.) పరీక్షలోఁ గృతార్థులగుటసంభవించి, నైజాము రా ష్ట్రమున నెచటనో కళాశాలలో నుపాధ్యాయవృత్తిలభించునాశ గనుపట్టినందున నిచటియుద్యోగమునువిడచి, దానికియత్నించుటకై వారా ప్రాంతములకు వెళ్లుటతటస్థించెను. అందుచే నిచటవారి యుద్యో గముతోఁ బాటు మా గ్రంథప్రచురణముగూడ నిలిచిపోవుట సంభ వించెను. అటుపై యది తిరిగిప్రారంభమగుటకు నొకసారియత్నించితిమి గాని, యాయత్నము సఫలముకాలేదు. కట్టకడపట మఱియొకసారి యుత్తర ప్రత్యుత్తరములద్వారా శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారితో నాలో చింపఁగా, వెనుకటివలెనె గ్రంథముద్రణమునకును, బత్రికలోఁ బ్రక టించుటకును వారుసమ్మతించినందున, 1933సం. అక్టోబరు నెల 23-వ తేదీకి సరియైన శ్రీముఖసం. కార్తీకశు. ౫ సోమవారమునాటి త్రిలిఙ్గపత్రిక యొక్క 14-వసంపు 43-వసంచికయందుఁ ముద్రణము తిరిగిప్రారంభ మైనది. అప్పటికిఁ గొంచెము ముందువెనుకగా శ్రీనాగవీరయ్యగారు పరలోకగతులైయున్నందున వారాసంగతిని వినియుండుట తటస్థించి

యుండదని విచారపడుచున్నాము అటుపైసహితము గ్రంథముద్ర ణము మరల కొన్నిమాసములపర్యంతము నడుమనడుమ నాగిపోవుచు వచ్చినను దిరిగిప్రారంభింపఁబడుచు, నెట్టకేల కిప్పటికిఁ(ననఁగా, 1936సం నవంబరు నెలకుసరియైన ధాతృసం. కార్తీకమాసమునాటికి, బరమేశ్వరా నుగ్రహమున నించుమించుగ మొదటిభాగము పరిసమాప్తిని గాంచఁ గల్గినదని వినిపించుట కానందించుచున్నారము. మాతృగర్భము సొచ్చిన జీవుఁడు వెలువడుటకు నవమాసములు పట్టునుగాని, యీగ్రంథశిశువు ముద్రాలయముసొచ్చుటకుముం దర్థపుష్కరకాలమును, నటనుండి వెలు వడుటకు మఱియొకయర్థపుష్కరమును, మొత్తముచేరి స్వరూపమును గాంచుసరి కొకపూర్ణపుష్కరకాలమునకుఁ బైగాఁబట్టినది.

మిగిలిన ప్రకరణముల ప్రకటనాదిక మిపుడు వెలువడిన భాగము నెడఁ బాఠకులు గన్పఱచునాదరణముపైనను, బ్రోత్సాహముపైనను నెక్కువగ నాధారపడియుండును.

ఇపుడు వెలువడిన మొదటిభాగమును ద్రిలిఙ్గపత్రికలోఁగూడఁ గొంచెముకొంచెముగఁ బ్రకటించుచువచ్చినందునను, నది వారపత్త్రిక యగుటచే గ్రంథము పూర్తిగఁబ్రకటించుటకు నతి దీర్ఘకాలము పట్టినందునను, నడుమ గొందఱుపాఠకులే తమవిసువును దెలుపుచుఁ గొన్నిప్రకటనములను సదరుపత్త్రికాముఖమున వెలువరచియుండిరి. అట్టితఱి నది ముద్రణకర్తలకు విసువును మాత్రమేగాక, యితరకార్య ములవిషయమున నెంతయో యసౌకర్యమునుగూడఁ గల్గించియుండు ననుట నిర్వివాదాంశము. కాని, యట్టియసౌకర్యములనుగూడ లెక్క సేయక కష్టనిష్ఠురములకోర్చి, తొలుతఁగావించిన వాగ్దానమునకు భంగమురానీక గ్రంథముద్రణమును దుదివఱకును గొనసాగించి యందుమూలమున దాని ప్రకటనమునకుఁ దోడ్పడియున్నందున శ్రీవేంకటేశ్వరశాస్త్రిగా రెంతయుఁ బ్రశంసనీయులు. అనేక సంస్కృ తాంధ్రగ్రంథప్రచురణములచే 'శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్' వారత్యంతసారస్వతసేవయొనర్చి యిదివఱకే సారస్వతాభిమాను లనేకులయొక్క మన్ననలకుఁ బాత్రులైయున్నవిషయము జగత్ప్ర సిద్ధము. దానికిఁదోడుగ శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాసాదులగు వైదికమతశాస్త్రగ్రంథములనుగూడఁ బెక్కింటి నిదివఱకుఁ బ్రకటించి

C

యుండుటయేగాక, పైనదెలిపిన యిబ్బందులకోర్చి యిపుడు మాయీ గ్రంథమునుగూడఁ బ్రకటించుటచే, వారికిఁగల నిష్కళంకమగు స్వమతాభిమానముగూడ వెల్లడి యగుచున్నందున, సారస్వతసేవనే గాక స్వమతసేవనుగూడ వారు చేయుచుండుట విదితమగుచున్నది. అందుచే స్వమతాభిమానులగు వైదికమతస్థుల మన్ననలకుఁగూడ వారిందుమూలమునఁ బాత్రు లగుచున్నారు. కావున వారికి భగవంతుఁడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యములిచ్చి యింకను గావలసియున్న సారస్వత సేవయు, స్వమతసేవయు వారిచేఁ జేయించునుగాతమని కోరుచున్నాము.

## గ్రంథకర్తృవంశాదికము

భావికవులయుపయోగార్థమును, దేశచరిత్రనిర్మాతల ప్రయోజనార్థమును, దీనినివినిపించి యింతటితోఁ బీఠిక ముగించుచున్నారము.

ఆంధ్రదేశస్థులగు బ్రాహ్మణులలో వన్నెకెక్కిన 'యాజ్ఞ్వల్క్య నియోగి'శాఖీయులము; కౌండిన్యసగోత్రులము; యజుర్వేదతైత్తిరీయ శాఖీయులము; ఆపస్తంబసూత్రులము; 'గోపరా'జనువంశనామము (ఇంటిపేరు) గలవారము; ఆదిలక్ష్మమ్మగారును వేంకటకృష్ణయ్యగారును, ననుమాతాపితలకుఁ జన్మించిన రాఘవరావు, వైకుంఠరావు నను వ్యవహారనామములుగల (సదాశివవీరరాఘవశర్మ, వైకుంఠరామ సుబ్రహ్మణ్యేశ్వరశర్మ యను శాస్త్రోక్తనామధేయములచే నలరారు) సోదరయుగ్మములోఁ గనిష్ఠులము; స్వగోత్రులును, నించుకదూరదాయాదులును నగు హనుమంతరావుగారు కోటమ్మగారు ననుదంపతులకు దత్తపుత్త్రులము; కృష్ణవేణీనదికి దక్షిణతటముననను బెజవాడ (యను విజయవాడ) పట్టణమునకు దక్షిణదిశను సార్ధయోజనదూరముననను, గుంటూరుపురమునకుఁ బూర్వదిగ్భాగమున యోజనదూరముననను, జెన్నపురినుండి కలకత్తానగరమునకు బోవునయోమార్గము చేరువను, నున్న 'కొలకలూ'రను గ్రామము మాజన్మభూమి; శాలివాహనశకము ౧౮౨౩సం. నకు సరియైన ప్లవనామసం॥ర శ్రావణశుక్లపంచమీసోమవారమునాఁడు పగలు సూర్యోదయాది ౨౭-ఘడియల ౪౧విఘడియలకు మాజననకాలమని చెప్పుదురు; ఆయయోమార్గముచెంతనే యచటి

కనతిదూరమున దక్షిణపు దెసనున్న 'తెనాలి'యనుపట్టణము మాకులౌకిక విద్యా(Arts)స్థానము; విశాఖపట్టణము, స్థాపత్యవిద్యా (Engineering 'ఎంజినీరింగ్') సంబంధమగు వృత్తివిద్యాస్థానము; ప్రభుత్వసంబంధ మగు స్థాపత్యవిద్యాశాఖ (Public works Department) లోని యుద్యోగము మాజీవికావృత్తి; యందుకొఱకై, 'మద్రా'సను వ్యవహారనామముగల చెన్నపురి సుమారు తొమ్మిదిసంవత్సరములనుంచి మాప్రస్తుతనివాసభూమి.

తోడివారివలె విదేశీయవిద్యాభ్యాసమును, విదేశీయనాగరకతాసంపర్కమును గలవారమయ్యు, ననన్యజీవనాధారులమగుటచే నాపత్కాలమున వృత్త్యంతరముచే జీవయాత్ర చేయుచున్నను, శక్తివంచనలేక యవకాశముచిక్కినంతవఱకును విడువక స్వధర్మానుష్ఠానమును జేయుటయే యిహపరసాధనమగు శ్రేయోమార్గమని త్రికరణశుద్ధిగనమ్మి మెలగువారమగుటచే, బూర్వజన్మకృత సుకృతవిశేషవాసనాప్రేరితులమై యీమహాగ్రంథమును బ్రారంభించి, పరమేశ్వరానుగ్రహమున నిప్పటి కింతవఱకీవిధముగ ముగింపఁజాలి, దీనిని, గుణగ్రహణపారీణులును, సత్యాన్వేషణతత్పరులును, రశికశిఖామణులును నగుపాఠకలోకముమ్రోల నర్పించుచు, వైదికమతధర్మములతోఁ బాటీవైదికమతచరిత్ర గ్రంథమునుసహిత మాచంద్రార్కముభూమిపై వర్ధిల్లఁజేయుమని ధర్మసంస్థాపనైకదీక్షాతత్పరుఁడగు పరమేశ్వరు ననవరతము సవినయభక్తిపూర్వకముగఁ బ్రార్థించుచున్నాము.

ఇట్లు,

గోపరాజు వైకుంఠరావు,

గ్రంథకర్త.

# కృ తి స మ ర్ప ణ ము.

తే. ఆదిలక్ష్మి, వేంకటకృష్ణ యాఖ్యులైన
నాదు తలిదండ్రులకుఁ జేల మోద మలర
మత్కృతంబైన 'వైదికమతచరిత్ర'
కృతి నొసఁగి వారిఋణము నొకింత దీర్తు.

ఇట్లు,
గోపరాజు వైకుంఠరావు,
గ్రంథకర్త.

# విషయసూచిక.



విషయము, పుట.

రెండవ ప్రకరణము.

స్మృతులు; (అనఁగా ధర్మశాస్త్రములు)

విషయము. పుట.

రెండవప్రకరణము సమాప్తము.

## మూఁడవప్రకరణము.

### పురాణములు; నితిహాసములు.

మూఁడవప్రకరణము సమాప్తము.



శ్రీరస్తు.

# వైదికమతచరిత్రము.

## ఇష్టదేవతాస్తుతి.

క. శ్రీవాణీగిరిజల వక్షోవక్త్రాంగములఁ దాల్చి సురపూజితులై
యీవిశ్వస్థితి వహులగు శ్రీవిష్ణు విరించి శివుల సేవింతు మదిన్. ౧

తే. సర్వవిఘ్నకరుండును సర్వవిఘ్న వర్జితుండును, నిజభక్తవరుల కెపుడు
సర్వసిద్ధిప్రదుఁడు, గణేశ్వరుఁడు నైనయట్టి విఘ్నేశునకు నతు లాచరింతు. ౨

## మంగళాచరణము.

క. ఎప్పుడు ధర్మగ్లానియు, నెప్పుడధర్మాభివృద్ధి యుఁ గల్గెడి నే
నప్పుడు వొడమెద ననె నెవఁ, డప్పరమాత్ముండు ధర్మ మభిరక్షించున్. ౩

క. ఈధరణి ధర్మనిరతుల, బాధలమాన్పుదురు గాత పటుకృపగీర్భా
మాధవుఁడును మాధవుఁడును, మాధవుఁడును ధర్మలోలమతు లెల్లపుడున్. ౪

## గురుస్తుతి.

తే. పరము నారాయణుని, బద్మభవు వసిష్ఠు, శక్తిఁ దత్పుత్రుఁ డగుపరాశరుని, వ్యాసు
శ్రీశుకుని గౌడపదబుధశ్రేష్ఠు, మౌని,వరుని గోవిందయోగీంద్రు, వారిశిష్య
వర్యు శ్రీశంకరాచార్యు, వారిశిష్యు,సోములను బద్మపాదు, హస్తామలకుని
ఘనుని దోటకు వార్తికకారు, మఱియు, నన్యులను మద్గురుల నిత్య మభినుతింతు. ౫

తే. ఘనుఁ డగువసిష్ఠునకు మునుమనుమఁ డరయ, శక్తికిని బౌత్రుఁడును, బరాశరున కాత్మ
జుండును దపోనిధియును, శ్రీ శుకునితండ్రి, యైనవ్యాసున కంజలి నాచరింతు. ౬

## ఉపోద్ఘాతము.

### వైదికమత మనఁగా నేమి?

ఈభారతవర్ష మునఁగల జనసంఘములలో, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు మొదలగు కులభేదములుగల జనసంఘ మొకటి గలదు. ఆసంఘముయొక్క మతమే వైదికమతము. అట్టిసంఘమువారు వివిధములగు దేశభాషలను మాట్లాడువార లుగ నున్నారు తెనుఁగుభాష మాట్లాడువారు తెనుఁగువారు. వారిలోనిబ్రాహ్మణులను

శ్రీ ర స్తు.

# వైదికమతచరిత్రము.

## ఇష్టదేవతాస్తుతి.

క. శ్రీవాణీగిరిజల వక్షోవక్త్రాంగములఁ దాల్చి సురపూజితులై
యీవిశ్వస్థితి వహులగు శ్రీవిష్ణు విరించి శివుల సేవింతు మదిన్. ౧

తే. సర్వవిఘ్నకరుండును సర్వవిఘ్న వర్జితుండును, నిజభక్తవరుల కెపుడు
సర్వసిద్ధిప్రదుఁడు,గణేశ్వరుఁడు నైనయట్టి విఘ్నేశునకు నతు లాచరింతు. ౨

## మంగళాచరణము.

క. ఎప్పుడు ధర్మగ్లానియు, నెప్పుడధర్మాభివృద్ధి యిలఁ గల్గెడి నే
నప్పుడు వొడమెద నని నెవఁ, డప్పరమాత్ముండు ధర్మ మభిరక్షించున్. ౩

క. ఈధరణి ధర్మనిరతుల, బాధలమాన్పుదురు గాత పటుకృపగీర్వా
మాధవుఁడును మాధవుఁడును, మాధవుఁడును ధర్మలోలమతు లెల్లపుడున్. ౪

## గురుస్తుతి.

తే. పరము నారాయణుని, బద్మభవు వసిష్ఠు, శక్తిఁ దత్పుత్త్రుఁ డగుపరాశరుని, వ్యాసు
శ్రీశుకుని గౌడపదుబుధశ్రేష్ఠు, మౌని,వరుని గోవిందయోగీంద్రు, వారిశిష్య
వర్యు శ్రీశంకరాచార్యు, వారిశిష్యు,సోములను బద్మపాదు, హస్తామలకుని
ఘనునితోటకు వార్తికకారు, మఱియు, నన్యులను మద్గురుల నిత్య మభినుతింతు. ౫

తే. ఘనుఁ డగువసిష్ఠునకు మునుమనుమఁ డరయ,శక్తికిని బౌత్త్రుఁడును,బరాశరున కాత్మ
జుండును దపోనిధియును, శ్రీ శుకునితండ్రి,యైనవ్యాసున కంజలి నాచరింతు. ౬

# ఉపోద్ఘాతము.

## వైదికమత మనఁగా నేమి?

ఈభారతవర్షమునఁగల జనసంఘములలో, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు మొదలగు కులభేదములుగల జనసంఘ మొకటి గలదు. ఆసంఘముయొక్క మతమే వైదికమతము. అట్టిసంఘమువారు వివిధములగు దేశభాషలను మాట్లాడువారలుగ నున్నారు తెనుఁగుభాష మాట్లాడువారు తెనుఁగువారు, వారిలోనిబ్రాహ్మణులను

తెనుఁగుబ్రాహ్మణు లందురు. వారిలో బ్రాహ్మణు లున్నటులనే ద్రవిడభాషమాటాడు వారిలోఁగూడ బ్రాహ్మణులుగలరు. వారిని ద్రావిడబ్రాహ్మణు లందురు. ఇట్లే మహారాష్ట్ర బ్రాహ్మణులును, కర్ణాటబ్రాహ్మణులును, మలయాళబ్రాహ్మణులును, గుజరాతీబ్రాహ్మణులును, బంగాళీబ్రాహ్మణులును మొదలగువారు వేఱువేఱుభాషలు మాట్లాడువారుగ నున్నారు. ఇటులనే పైభాషలు మాట్లాడు వేఱువేఱుదేశములందుఁ దక్కినకులములు గూడ గలవు. కాని, యవి పైసంస్కృతనామములతోడనే పిలువఁబడక యాయాదేశభాషలందలి వేఱుపేళ్లతోఁ బిలువఁబడుటయును గలదు. ఇందుల కుదాహరణముగ వైశ్యులను మనతెనుఁగుభాషలోఁ గోమటులని చెప్పుదుము. హిందీభాషలో వారినే బనియాలని చెప్పుదురు. పేరులో భేదమున్నను వారియొక్క ముఖ్యవృత్తినిబట్టియు, వారియాచారవ్యవహారములనుబట్టియుఁ, గోమటులును, బనియాలును నొక్కకులము వారే యని తెలియును. ఈరీతిగనే పైనాలుగుజాతులను (కులములను) వానియందలి యవాంతరజాతులను నాయాదేశములందు వేఱువేఱుపేళ్లతో వ్యవహరించుచున్నారు. ఐనప్పటికిని వారివారికులవృత్తులయొక్కయు నాచారవ్యవహారములయొక్కయుఁ బోలికలనుబట్టి వానిని మనము తెలిసికొనవచ్చును. ఆయాదేశస్థులగు సంస్కృతపండితుల కును, వారివారిదేశములందలి వేఱువేఱుజాతులయొక్క సంస్కృతపుపేళ్లు కొంతవఱకుఁ దెలిసియుండును. మొత్తముమీద భరతవర్షమందలి కులభేదములుగల పైజనసంఘములు వివిధభాషలు మాట్లాడువారుగనున్నను, వారందఱియొక్క యాచారవ్యవహారముల పోలికనుబట్టియు, వడుగులును దెండ్లిండ్లును మొదలగుసంస్కారములందు వారుపయోగించు వేదమంత్రములయొక్కయుఁ, తంత్రములయొక్కయుఁ బోలికలనుబట్టియును, వారు సేవించెడికాశీ, రామేశ్వరము, తిరుపతి, మొదలగు తీర్థయాత్రాదులపోలికలవలనను, వారు కొలిచెడిశివుఁడు, విష్ణువు, మొదలగు దేవతలపోలికలవలనను, వారు తాము పెట్టుకొనెడి, రామ, కృష్ణ, శివ, పార్వతీ, లక్ష్మీ, సరస్వతీ మొదలగు దేవతలసంబంధములగు సంస్కృతనామధేయములనుబట్టియు, వారందఱును నొక్కమతమునకుఁ జెందిన వారే యని మనము సులభముగఁ దెలిసికొనవచ్చును. ఆమతమునకే వైదికమత మని పేరు. అనఁగాఁ బ్రస్తుతకాలమున హిందువులని చెప్పఁబడెడివా రందఱును వైదికమతమునకుఁ జెందినవారే. అట్టివారు భారతవర్షమునమాత్రమే గలరు. పైనదెలిపినజాతిభేదములే (అనఁగాఁ గులభేదములే) యామతముయొక్క ముఖ్యమగుచిహ్నము. అట్టిజాతిభేదము లేయితరదేశమునందుఁగాని యేయితరమతమునందుగాని యున్నట్లుతెలియరాదు. అంతియగాక వైదికమతస్థులు భారతవర్షమునువిడిచి యితరదేశముల కేగినచో నా గ్రామములనుండి భ్రష్టులగుదురనియును, ప్రాయశ్చిత్తార్హులగుదురనియును గర్హ

భూమియగు భారతవర్షముఁతక్క నితరదేశములు వైదికమతధర్మము లనుష్ఠించుటకు నర్హములుకావనియును వైదికమతస్థుల కందుచే నివాసయోగ్యములు కావనియును నామతశాస్త్రముల సిద్ధాంతము. కావుననే వైదికమతము భారతవర్షముననఁదక్క నితర దేశములందు లేదు.

## వైదికమతమను పే రెట్లు గలిగెను.

పైనవ్రాయఁబడినదానివలన వైదికమతిమన నేమియో కొంత తెలిసియుండును. ఆమతమున కాపే రెట్లుగలిగెనో యిఁకఁగొంచెము విచారింతము.

తెనుఁగుబ్రాహ్మణులలో వైదికులును, నియోగులును మొదలగుశాఖాభేదములు గలవు. కావున వైదికమతమనుపేరు వినినతోడనే, యది పైవైదికులకు సంబంధించిన మతమై యుండుననియు, నియోగులు, మొదలగువారికి దానితోఁ బనిలేదనియుఁ గొందఱు తలఁపవచ్చును. కాని, యట్లు తలంపరాదు. ఏలననఁగా నది వైదికుల యొక్కమతమగుటచే వారినుండి దాని కాపేరు రాలేదు. వైదికమతధర్మములను వా రాచరించుటయేగాక పురోహితులై, యితరులుగూడ నామతధర్మముల నాచరించు నట్లు చేయుటలోఁ బాల్గొనుచుండుటచేతనే యామతమునుండియే వారి కాపేరు వచ్చియుండనోపును. కాని, తక్కిననియోగులు మొదలగువారు తా మాధర్మముల నాచరించుటతోమాత్రమే తనివిఁజెంది, యితరులు వాని నాచరించునట్లు చేయుటలో యోగ్యము కలుగఁజేసికొనకుండిరి. అందుచే వారికిని వీరికిని గలపైభేదమును స్పష్టపఱచుటకే యాశాఖవారిని వైదికులని వ్యవహరించుచువచ్చిరి. కాని, యావైదికులనుండి దీనికి వైదికమతమని పేరురాలేదు. కాబట్టి పైమతధర్మము లాచరించెడినియోగులు మొదలగు నన్నిశాఖలబ్రాహ్మణులయొక్కయుఁ, దక్కినక్షత్రియులు, వైశ్యులు, శూద్రులు మొదలగు నితరకులములవారియందఱియొక్కయు, మతముగూడ వైదిక మతమే యైయున్నది. కాబట్టి వైదికబ్రాహ్మణుల మతముమాత్రమే వైదికమతమనియు, నది తక్కినవారిమతము కాదనియు, నియోగులును, దక్కినకులములవారును నను కొనుట పొరపాటు. కావున దీనియభివృద్ధికై పైవారందఱును యత్నించుటయవసరమే.

ఇతరమతములకు మహమ్మదీయమతమనియుఁ, క్రైస్తవమతమనియు, బౌద్ధమత మనియు నిట్లే వేఱువేఱుపేళ్లు గలవు. కాని, యామతములన్నియు నొక్కొక్కమత పురుషునియొక్క బోధకు లోనై నడచుకొనుటచే నాయాపురుషులపేళ్లనుబట్టియే యామతములకును బేళ్లుగల్గినట్లు తోఁచుచున్నది. మహమ్మదీయమతమునకు మూలపురు షుఁడు మహమ్మదను నాతఁడు. అట్లే క్రైస్తవమతమునకుఁ గ్రీస్తును, బౌద్ధమతమునకు

బుద్ధుఁడు ననువారలు మూలపురుషులు. పైమతముల పేళ్లు వారివారిమతగ్రంథములలో నెంతవఱకు వ్యవహారములో నున్నవో చెప్పఁజాలము. కాని, లోకవ్యవహారమున మాత్రము విరివిగా వాడఁబడుచున్నవి. వైదికమతముగూడ దానికి సంబంధించిన మత గ్రంథములం దాపేరుతో వ్యవహరింపఁబడియున్నట్లుండగాఁ గానరాదు. కాని, లోక వ్యవహారమునఁ దక్కినమతములతోఁ బాటుదీనికిని నొకపేరు కావలసివచ్చుటచే హిందూమతమని దీనికిఁ బేరు పెట్టి యితరమతస్థులు వాడుచుండిరి. విదేశీయులు నెల కొల్పినబడులలోఁ జేరి చదువుకొనిన యీనాఁటిభారతీయులుగూడ వైదికమతమును హిందూమతమనియు నామతస్థులను హిందువులనియు వ్యవహరించుచున్న విషయము లోకవిదితమే. ఈమతమునకు లోకవ్యవహారమున నొకపేరుండుట యావసరమని తలఁచి నచో దానిని హిందూమతమని చెప్పుట యంత సమంజసముగాఁ గానరాదు. ఇతరమత ములవలె నీమత మొకపురుషమాత్రుని బోధల ననుసరించి యేర్పడినది కాదు. వేదమును మూలాధారముగఁ గొని యేర్పడినదగుటచే, నట్టి వేద శబ్దమునుండి పుట్టిన విశేషణ రూపమగు (adjective form) వైదిక శబ్దముతోడనే యీమతమును వ్యవహరిం చుట యుక్తము. వేదమనఁగా నేమియో, యది యెట్లేర్పడినదో, దానివలని ప్రయో జనమెట్టిదో, ముందుముందు చక్కఁగాఁ దెలుపఁబడును. అట్టి వేదమునుండి పుట్టిన గ్రంథములను ధర్మములను, మంత్రములను, తంత్రములను, కర్మలను, మొదలగు నన్నింటికిని, వైదిక మను విశేషణమును జేర్చి వైదికగ్రంథము లనియు, వైదికధర్మము లనియు, వైదికమంత్రములనియుఁ, వైదికతంత్రములనియు, వైదికకర్మలనియు, నా మతగ్రంథములం దచ్చటచ్చట వాడఁబడఁగాఁ జూచుచున్నారము. కావున నారీతి గనే వేదమునుండిపుట్టిన మతము గావున దీనిని వైదికమతమని వ్యవహరించుటయే యుక్తియుక్తము. అంతియగాక, వేదమును, నీమతమునకు సంబంధించిన మూలగ్రంథ ములన్నియును, సంస్కృతభాషయందే గానవచ్చుటచేత, నీమతమునకుసంబంధించిన పదార్థముల పేళ్లన్నియును సంస్కృతశబ్దములుగనే యున్నవి. ఇందులకు నీక్రింది శబ్దము లుదాహరణములు:— యజ్ఞోపవీతము ఆచమనము, హోమము తర్పణము, ఔపాసనము. ఈ మొదలగు వైదికమత సంబంధములగు పదములను నితరమతముల యొక్క భాషలలోఁ జెప్పవలసివచ్చినపుడు కొన్నికొన్ని మాటల సముదాయమును జేర్చి వానితోడ పైశబ్దము లందలిభావమును వెల్లడిచేయవలసినదేగాని, పైశబ్దములందలి యొక్కొక్కదానికిసరిపోవు నొక్కొక్కపదమును నితరమతభాషలందుఁ గానము. అందులకుఁ గారణము పైశబ్దములచేఁ దెలియుపదార్థములును, క్రియలును, కేవల వైదిక మతసంబంధములే యగుటచేతను, నితరమతముల కట్టిక్రియలతోడను, పదార్థముల

తోడను సంబంధములేకపోవుటచేతను, నట్టిక్రియలను, బదార్థములను దెలుపు శబ్దజాల మాయితరమతభాషలం దుండవలసినయగత్యము లేకపోవుటయే. అందుచేతనే వైదిక మతమునకును సంస్కృతభాషకును గలయత్యంతసంబంధము స్పష్టమగుచున్నది. అట్టి సంస్కృతశబ్దములన్నియు వ్యాకరణశాస్త్రబద్ధములై, యొకహల్లునో, కాకయచ్చునో యంతముగాఁగలిగి లింగ, విభక్తి, వచన, నియమములుగల్గియున్నవి. అట్టిసంస్కృత శబ్దము లించుమించుగనన్నియును వానివానియంత్యాక్షర నియమములతోడను లింగ నియమములతోడను సంస్కృత భాషానిఘంటువులలో నిరూపింపఁబడియున్నవి. కాఁబట్టి హిందూశబ్దముకూడ సంస్కృతవాఙ్మయమునకుఁ జెందినదైనచో నాయా నిఘంటువులలో నొకదానియందుఁగాకున్న వేఱొకదానియందైనను గానవచ్చితీరును. అపుడుదానినిర్వచన మచటగానవచ్చి యుండును. ఁని యది ఫలాని యంతమనియు ఫలాని లింగమనియు నెచటనునిరూపింపఁబడినట్లు గానము. కావున నది యన్యభాషా పదమై యుండనోపును. అట్టిదానిని దెచ్చి వేదమునుండిపుట్టినమతమునకు ముడిపెట్టఁ జూచుట యుక్తముగాఁదోఁపదు.

అంతియగాక, పైహిందూమతశబ్దమును మొదటవిరివిగా వ్యవహారమునకుఁ గొని వచ్చినవారు విదేశీయపండితులు. ఆశబ్దముయొక్క వ్యుత్పత్తినిగూర్చి వారిలోవారే పెక్కువిధములగు నభిప్రాయభేదములుగలిగి వాదోపవాదములను జేయుచున్నారు. వారివాదములకు ననుమానప్రమాణములతోఁగూడిన వారివారివట్టియూహాలే యాధార ములుగాని, యంతకంటె దృఢతరములగు నాధారములుగానరావు. కాన, నట్టిహిందూ పదమును దెచ్చి యీమతమునకు ముడిపెట్టుటకంటె, వైదికమతమని దీనినివ్యవహరించుటే మేలు. ఇట్టివైదికమతమునుగూర్చియు,దీనికిమూలాధారమగు వేదమునుగూర్చియు నిఁక ముందుముందు తెలిసికొందుము.

## ఇపుడీమతచరిత్ర వ్రాయుటకుఁగారణము.

వైదికమతస్థులలోఁ గొందఱికిఁ దమమతమునుగుఱించి యంతగాఁ దెలియకపో యినను, దమమతాచారములం దభిమానముంచి తమపూర్వులగు తల్లిదండ్రులను, తాత ముత్తాతలను, బ్రవర్తించినరీతిగనే తాముసు బ్రవర్తించుచున్నారు. అట్టివారు పూర్వా చారపరాయణులని పిలువఁబడుచున్నారు. మఱికొందఱు పైవారితోఁబాటుగనే విధి లేక ప్రవర్తించుచున్నను, బూర్వాచారపరాయణులయొక్క యాచారములలోఁ జాల భాగము బాగుగనుండలేదనియు,నితరమతస్థులయాచారములే కొన్ని బాగుగనున్నవనియుఁ, గావున వైదికమతాచారములనుగూడ నట్లుమార్చుకొనుట మంచిదనియుఁ దలంచుచు

న్నారు. అట్లు తలంచుటయేగాక వారిలోఁ గొందఱుసాహసించి, తమకవకాశము చిక్కినపుడెల్లను చాటుగనో మాటుగనో తమయిష్టప్రకారము చేయుచునేయున్నారు. వారివంటివారే మఱికొందఱు తాముతలంచినట్లు తమయాచారములను మార్చుకొనుటయే గాక, పూర్వాచారపరాయణులగు తక్కిన యితర వైదికమతస్థులందఱును గూడ తమ వలెనే ప్రవర్తింపవలయునని కోరుచున్నారు. తాముతలంచినట్టిమార్పులు వైదికమతాచారములలోఁ దప్పక చేయఁబడవలయుననియు, నందులకుఁ గారణమేమనఁగాఁ, బూర్వకాలమున వైదికమతాచారములు తామిపుడు మార్పఁదలంచురీతిగనే యుండెడివిగాని యిప్పటి పూర్వాచారపరాయణు లాచరించుచున్నట్లుండెడివి కావనియు, నట్టిపూర్వాచారపరాయణుల తాతముత్తాతలు మొదలగువారు మధ్యకాలమున వైదిక మతశాస్త్రములను దిన్నఁగాఁ జదివి తెలిసికొనకపోవుటచే, నామతాచారములు వారికాలమున మారిపోయి చెడిపోయినవనియు, వానినేయిపుడు పూర్వాచారపరాయణు లాచరించుచున్నందున వానినితిరిగి తాముతలంచురీతిగ మార్చుటవసరమనియు వాదించుచున్నారు. తమ మాటలయందుఁ బూర్వాచారపరాయణులకుఁగూడ నమ్మకముకలుగుటకై మతాచారములందుఁ దాముచేయఁజూచుమార్పులు వైదిక మతశాస్త్ర సమ్మతములనిచెప్పి, యాశాస్త్రములనుండి కొన్నికొన్ని ప్రమాణశ్లోకములనెత్తి చూపుచున్నారు. వారు చెప్పెడిమాటలను, నుపన్యాసములను వినుటచేతను, వారు వ్రాసెడిగ్రంథములను బత్రికలను జదువుటచేతను బూర్వాచారపరాయణులలోఁగూడ కొందఱికిఁ దమ యాచారములయెడ సందేహములు గలుగుచున్నవి; మఱికొందఱు పూర్వాచారపరాయణులు పైవారి బోధలకులోనై వారిననుసరించి ప్రవర్తించుచుఁ దమ పూర్వాచారములను వదలివేయుచున్నారు. సందేహములుగల పూర్వాచారపరాయణులు కొందఱు తమపూర్వాచారములను బూర్తిగ వదలివేయకపోయినను, వానియందలి నమ్మకముచెడుటచేఁ దగినంతశ్రద్ధతో వాని నాచరింపక లోకమునకువెఱచి కాఁబోలును బైకిమాత్రమేదియో యొకరీతిగ నాచరించుచున్నారు. ఇట్టివారు తమయిష్టమువచ్చిన ధర్మములనుమాత్ర మాచరింపుచుఁ దక్కినవానినిమానుచు, నితరమతాచారములనుండి యిష్టమువచ్చినవానిని స్వీకరింపుచు, మొత్తముమీఁద నాచారవ్యవహారములందుఁ జాలవఱకు స్వేచ్ఛగాఁ బ్రవర్తించుచున్నారు. దేశమందిట్టి స్వేచ్ఛాప్రవర్తకులసంఖ్యయే యిపుడు మిక్కిలియెక్కువగాఁ గానవచ్చుచున్నది. దీనినంతనుబట్టిచూడఁగాఁ బ్రస్తుతకాలమునఁ జాలవఱకు వైదిక మతమంతయును దారుమారై కలతనొందియున్నట్లు గానవచ్చుచున్నది. అందుచే మన దేశమున మతవిషయములందును, సాంఘిక, రాజకీయవిషయములందును, బ్రజలలోమితిమీరిన యభిప్రాయభేదములును, నంతఃకలహములును వానిమూలమున నైకమత్య

భంగము మొదలగునరర్థములు పెక్కులు గలిగియున్నవి, మఱికొన్ని గలుగుచున్నవి; ఇంకనుగొన్ని కలుగఁబోవుచున్నవి. అవియన్నియును, నవీనచరిత్రలందలి విషయముల కును బ్రాచీన చరిత్రలందలి విషయములకును గలభేదముచేఁ గలిగినకీడులను శీర్షిక క్రింద ముందుముందువిపులముగ వివరింపఁబడును.

పైయనర్థములన్నిటికిని హేతువేమియని మేమువిచారించి, పూర్వాచారపరా యణుల యాచారముల నాక్షేపించెడివారిలోఁ బలువురువిద్యార్థులతోడను, విద్యావంతు లతోడను, విమర్శకులతోడను, బలుతావులందుఁ బెక్కుసందర్భములలోఁ బలుమారులు ప్రసంగించి చర్చించియుంటిమి. అట్టి యన్నిసమయములందును బాగుగవిచారింపఁగా, మాకును, మాతోడ వాదించినవారికిని, వైదికమతము విషయమునఁ గలయూహలలో మిక్కిలిభేదముండుటయే పైయల్లకల్లోలమునకంతకును ముఖ్యకారణమని పలుమారులు మామనస్సునకు గాటముగనాటుచువచ్చినది. అనఁగా వైదికమత మెట్లేర్పడినదియో, దానిస్వరూప మెట్టిదో, దాని నేల యనుసరింపవలయునో, యట్లనుసరించుటవలన గలిగెడి ఫలమెట్టిదియో, యనుసరింపక దానికివిరుద్ధముగాఁ బ్రవర్తించుటచే గలిగెడికీడెట్టిదో, యనునీమొదలగు విషయములనుగూర్చి మేమొకవిధముగఁ దలంచుచుంటిమి. మాతోడ వాదింపఁ దటస్థించినవారు పైవిషయములనుగూర్చి మఱియొకవిధముగాఁ దలంచుచు న్నారు. మాయిరువురితలంపులకును మిక్కిలిభేదముగలదు.

అట్టిభేదమే తక్కినజనులలోగూడనుండుట ప్రస్తుతపువైదికమత కల్లోలమునకు ముఖ్యకారణమైనది. కాని, యందెవరితలంపులు సరియైనవో, యెవరివిసరియైనవి కావో, యనువిషయమును సత్యముగఁదెలిసికొనుటకు మేముపలుమారు ప్రయత్నిం పఁగా, మాతలంపేసరియైనదనుటకు మాకు నెక్కువయాధారములు గన్పట్టినవి. కావు ననే మాయూహసరియైనదని నిశ్చయించితిమి.

వైదికమతముయొక్క సత్యమగుచరిత్ర ప్రస్తుతకాలపువారిలోఁ బలువురికిఁ దిన్నఁగాఁ దెలియదనియు, దానికిమారుగ వారికితెలిసినచరిత్రలో లెక్కలేనియసత్య ములు గలవనియు, నవియే యిప్పటివైదికమతమునకుఁ గలిగినకల్లోలమునకు ముఖ్య కారణమనియు మాదృఢవిశ్వాసము. ఒకవేళ మేముతలంచిన వైదికమతముయొక్క చరిత్ర పూర్ణముగ సత్యమైనది కాకపోయినను బోవచ్చును కాని, యిప్పటివారుతలం చుచున్న చరిత్రవలె నంతటి యసత్యముమాత్రము కాదనియు, వారుతలంచెడిదాని కంటె మేముతలంచునదియే సత్యమునకెక్కువదగ్గఱగా నుండుననియునుమాత్రము మాయిగ్గుద్దిచెప్పఁగలము. ఆవిషయమును సహేతుకముగ నీక్రింద నిరూపింపఁబోవు

చున్నారము. మాచూపు హేతువులను సహేతుకముగను, సప్రమాణముగను, యుక్తి యుక్తముగను ఖండించి మాతలంచిన వైదికమతచరిత్రకంటె తాముతలంచుచున్న చరిత్రయే సత్యమునకు నెక్కుడదగ్గఱయని మావిమర్శకులు నిరూపింపఁగల్గినచో, మేమును వారివాదమునంగీకరించి వారుకోరెడిమార్పులను మతాచారములందుఁగావింపఁ దోడుపడుటకు సంసిద్ధులమైయున్నాము. కావున మాతలంచిన వైదికమత సత్యచరిత్రము నీక్రింద వ్రాయుచున్నారము.

## ఈచరిత్ర వ్రాయుటవలనఁ గలిగెడిప్రయోజనము.

మేమిపుడువ్రాయుచున్న యీవైదికమతచరిత్రమును నిష్పక్షపాతబుద్ధితో సవిమర్శముగఁ జదివినచో, వైదికమతమునుగూర్చి కలిగియున్న దురభిప్రాయములన్నియుఁ దొలఁగిపోవును. అట్లు తొలఁగిపోయినచో వైదికమతాచారములయందలి యసూయయు, నశ్రద్ధయునుగూడఁ దొలఁగిపోవును. పిమ్మట వైదికమతాచారముల నిష్టము వచ్చినట్లు మార్చుటకుఁగాని తారుమారుచేయుటకుఁగాని యవకాశముండదు. తిరిగి వానినాచరించుటయందు శ్రద్ధగలుగును. శ్రద్ధాపూర్వకముగా నాచరించుటచే వైదికమతమువలన గలుగగలఫలముగలుగును. ఇదియే యీగ్రంథమువ్రాయుటలో మాకుఁగల ముఖ్యాభిప్రాయము.

కాని మేముతలఁచిన ఈప్రయోజన మంతసులభముగాఁ గలుగఁజాలదను సంగతి మాకుఁదెలియును. ఏలననఁగాఁ బైప్రయోజనమునుద్దేశించియే మేమీచరిత్రను వ్రాసి పత్రికాముఖముననో, గ్రంథరూపముగనో ప్రకటించినప్పటికిని, వైదికమత చరిత్రయందు దురభిప్రాయములుఁగల యీనాఁటివిద్యార్థులును విద్యావంతులును గూడఁ బైపత్రికలచెంతకుఁగాని, యట్టిగ్రంథములచెంతకుఁగాని వెళ్లనేవెళ్లరు. వైదికమతకల్లోలమునకు మూలకారణము వారియందేపాదుకొని వేళ్లుబారియుండుటచే వారుమాయీగ్రంథమును జదివిననేగాని ప్రయోజనముగలుగదు. ఒకవేళ వారిలో నెవరైనను నూటికొక్కరు దీనినిజదువుట కటస్థించినను, నామూలాగ్రముగఁ జదువుదురో లేదో చెప్పఁజాలము. ఆమూలాగ్రముగఁజదివినను సవిమర్శబుద్ధితోఁ జదువుదురనుమాట సందేహమే. ఆమూలాగ్రముగను, సవిమర్శముగనుజదువనిచో విషయము తలకెక్కదు. విషయముతెలియనిచోఁ బ్రయోజనముకలుగదు. అట్టివారెవరైన నొకరు దానినామూలాగ్రముగను, సవిమర్శముగను జదివినను దమయభిప్రాయమునకు విరుద్ధమగువిషయము వచ్చినచోటఁ, దమవాదమే గెలువవలయుననను దురభిమానమును విడిచి, తమవాదము సహేతుకమా, కాక, యెదుటివారివాదము సహేతుకమాయని

నిష్పక్షపాతబుద్ధితో నాలోచించుచుఁ జదివెడివారు వారిలోనూటికొక్కరుగాదు సరి గదా, కోటికొక్కరైనను నుందురని తలంపఁజాలము. ఐనచో నీకఁ బ్రయోజనము గలుగుటెట్లు?

ఇఁకనీచరిత్రవలన గలుగవలసిన ప్రయోజనము వైదికమతస్థులలోఁ బూర్వాచారములం దభిమానముగలవారి ద్వారామాత్రమే కలుగవలయును. ఎట్లనఁగా: వైదికమతమునందు విపరీతభావములుగల ఈనాఁటివిద్యార్థులును, విద్యావంతులును వైదిక మతాచారములనుగూర్చియు, నట్టిమతమునకు మూలాధారమగు వేదమును గూర్చియు, శాస్త్రములనుగూర్చియు నుపన్యసింపుచు నాక్షేపింపుచు, నిందింపుచు, వాదింపుచునుందురు. అట్టిసమయములందు వైదికమతమునుగూర్చి వారికిఁగల విపరీత జ్ఞానము వెల్లడియగునట్లుచేయుటకు వారితోనేవిధముగఁ బ్రతివాదనుచేయవల యునో, వారుచెప్పెడియుక్తుల నేరీతిగఖండింపవలయునో, వైదికమతశాస్త్రాచారముల యొక్క ఘనత నెట్లు నిలువఁబెట్టవలయునో, వారడిగెడుప్రశ్నల కెట్లుబదులు చెప్పవలయునో, యీ మొదలగు సంగతులన్నియును మేమువ్రాయు నీవైదికమతచరిత్ర చదువుటచేఁ బ్రతివారికిని జక్కఁగను సులభముగను దెలియఁగలవు. కావునదీనిని శ్రద్ధతోఁజదివి, విషయములను జక్కఁగఁదెలిసికొని బాగుగ జ్ఞాపకముంచుకొని నచోఁ బూర్వాచారములం దభిమానముగల వైదికమతస్థులకుఁ బైవిద్యార్థులవలనను, విద్యావంతులవలననుగూడ నెట్టిభయము నుండఁజాలదు. వారిపూర్వాచారములందు వారికెట్టిసంశయములును గలుగుటకుఁగాని, శ్రద్ధతగ్గుటకుఁగాని, యవకాశముండదు. అంతియగాక వారిలోనించుక బుద్ధిబలముగలవారలు దీనినిజదువుటచేఁ బైవిద్యార్థుల యొక్కయు విద్యావంతులయొక్కయు వాదదౌర్బల్యమునుగనిపెట్టి వారితోఁదగిన రీతిగ వాదించుటకును, వారివాదమందలి దౌర్బల్యమును వినువారికి వెల్లడిచేయుటకును శక్తులగుదురు. వినువారు పైవిద్యావంతుల విపరీతవాదమందలి దౌర్బల్యమును జక్కఁగా గ్రహించుటచే నెట్టిసంశయములకును బాలుగాక, తమయాచారములందలి శ్రద్ధను గోలుపోకయుందురు. ఈవిధముగఁ దామునసంశయములపాలుగాక, తమమతాచారము లందు శ్రద్ధఁగోల్పోకయుండుట యొకలాభము; ఇతరులుగూడఁ గోలుపోకయుండు నట్లు కాపాడుట మఱియొకలాభము. ఈరెండులాభములును మాయీగ్రంథమును శ్రద్ధతోఁజదువు పూర్వాచారపరాయణులకు లభించును. వీరితో వాదింపవచ్చెడి విద్యార్థులును విద్యావంతులును బుద్ధిమంతులై దురభిమానరహితులైనయెడలఁ దమవాద మందలి లోపమును గ్రహించి తమవాదమునువిడిచి, తిరిగిమతాచారములందు శ్రద్ధ గలవారగుదురు. ఇదిమూఁడవలాభము. కాని, యీమూఁడవలాభము కలుగుటయుఁ

గలుగకపోవుటయుఁ వారితో వాదించెడి పూర్వాచారపరాయణులపైన జాలపడ
కాధారపడియుండును. ఎట్లనఁగా: సామాన్యముగఁ బైవిద్యార్థులును విద్యావంతులును
గూడఁ దమవాదములందుఁ దీవ్రమగునభిమానముగల్గి వాదించుచుందురు. అట్టితరి
వారివాదమును ఖండించువిధము తనకుఁ బాగుగఁ దెలియునుగదా యని పూర్వాచార
పరాయణుఁడు లేచి, దానినిదీవ్రముగ ఖండింపఁబూనరాదు. ఏలననఁగా నట్లుఖండించె
నేని, యాఖండనమునందలి సత్యాసత్యములను గ్రహించుటకుమారుగఁ బైవిద్యార్థులు
మొదలగువారు సామాన్యముగ దురభిమాన దూషితులయినచో, వెంటనే రోషావేశ
పరులై, తిరిగి పూర్వాచారపరాయణునియొక్క వాదమును ఖండించుటకు మార్గము
తోఁపక, యతనినిదూషించుటకునైనఁ గడగుదురు. కానిచోఁ జుట్టుప్రక్కలప్రదే
శము దద్దరిల్లునట్లును వినువారికిఁ గర్ణకఠోరముగ నుండునట్లును గేకలును బొబ్బలును
నిడుదురు. దానితోడ వినువారిప్రాణములువిసివి, వారుభయవాదులను మందలించెదరు
గాని తుదకుఁ దామైనను సత్యమును గ్రహింపఁజాలరు. కాఁబట్టి పూర్వాచారపరా
యణునిఖండనము వృథాకంఠశోషయుఁ నిష్ఫలమునునగును. పైవిద్యార్థులు మొదలగు
వారి వాదదౌర్బల్యము లోకులకువెల్లడిగాకుండునట్టి మంచియవకాశము గలుగ వారు
దాని నాధారముచేసికొని తప్పించుకొని చల్లగాఁజారుదురు. ఇది పెక్కుమారులు మాకు
స్వానుభవగోచరమగుటచే నింతగా నొక్కిచెప్పుచున్నారము. కావున నీవైదికమత
చరిత్రను జదివిన పూర్వాచారపరాయణులు, పైవిద్యార్థులు మొదలగువారివాదమును
ఖండించుమార్గము తమకుఁ దెలిసెనుగదా యని తొందరపడరాదు. అట్లుతొందరపడి
నచోఁ దాముతమప్రతివాదుల విపరీతజ్ఞానమును బోఁగొట్టుటకుమారుగ వారికిరోషము
కలిగించి వృథావైరమును దెచ్చిపెట్టుకొనినవా రగుదురు. కావునఁ బైవిద్యార్థులు
మొదలగువారితో వాదింపఁదటస్థించినపుడు, వారికిరోషోపశమనమును జేయుటకై
మధ్యమధ్య, "తామకోపపడక దయచేసి సత్యమునువిచారింపుడు" అనియును,
"విషయమెట్లున్నది; మీమాట కాదనుచుంటినని యాగ్రహింపఁబోకుఁడు; నేఁజెప్పు
నది సహేతుకమగునా, కాదా, యని దయచేసి యించుకయాలోచింపుఁడు" అని
యును నీ మొదలగుసందర్భోచితములైన శాంతిసూక్తులను బఠింపుచు, వారి కాగ్రహము
జనింపకుండునట్లు సాధ్యమైనంత శాంతముగఁ బూర్వాచారపరాయణులు వాదమును
సాగింపవలయును. ఒకవేళ రోషముపట్టఁజాలక పైప్రతివాదులేమైనను గొంచెముమిగిలి
మాటలాడ మొదలిడినయెడలఁ, బూర్వాచారపరాయణులు సహించి, శాంతముతో,
"అయ్యా! మనము విషయమునుగుఱించి మాటలాడ నెంచియుంటిమిగాని తిట్టుకొనఁ
దలంచి యుండలేదు; విషయమునుగూర్చి మాటలాడ నిష్టములేనియెడలఁగాని, శక్తి

లేనియెడలఁగాని మీరుమాటలాడుట మానుకొనవచ్చును; కాని వృథాగాఁదిట్లతో నేమిపని? యూరకుండుఁడని" చెప్పి శాంతముగ నుండలింపవలయును. ఇట్లు చేయుటచేఁ గల్గులాభ మేమనఁగాః బూర్వాచారపరాయణునివాదమే బలవత్తరముగ నున్నదనుసంగతియును, నందుచేనతనికి సరిగాబదులుచెప్పుటకు శక్తిలేక ప్రతివాదితిట్టుట కారంభించినాఁడనుసంగతియును, నుభయులవాదమును వినువారు సులభముగ గ్రహించి యా ప్రతివాదిచేయు బోధలను విననొల్లకుందురు. అందుచేవారికి స్వమతాచారములందు సంశయములుగల్గుటయు, శ్రద్ధతగ్గుటయుఁ దటస్థింపదు. అట్లుగాక పూర్వాచారపరాయణుఁడుగూడఁ దిరిగితిట్టుట కారంభించినచో నొకరికినిగూడ లాభము లేకపోగా, వినువారిరువురినిగూడ నిందించెదరు. మీఁదుమిక్కిలి కలహములుపెరిగి యొకరినొక రవమానించుకొని దుఃఖించెదరు. కావునఁ బూర్వాచారపరాయణు లీచరిత్రమునుజదివి ప్రయోజనమందవలసిన విధానమిదియని సూచింపుచు విషయమున కుపక్రమించుచున్నారము.

---

# మొదటి ప్రకరణము.

---

## వైదికమతచరిత్ర నెఱుఁగుటకాధారములు: ప్రాచీనచరిత్రలు, నవీనచరిత్రలు.

ఇంక వైదికమతచరిత్రనుగూర్చి తెలిసికొందము. ఈమత మెంతకాలముక్రింద నేర్పడినదో, యేవరేర్పఱచిరో, యెట్లేర్పఱచిరో, యీమొదలగువిషయములను మనకుఁ దెలుపఁజాలిన యాధారములు రెండు గనవచ్చుచున్నవి. అందు మొదటియాధార మేమనఁగా: వేదమును, మనపూర్వులగు ఋషులచే వ్రాయఁబడిన స్మృతులును (అనఁగా ధర్మశాస్త్రములును) బురాణములును నితిహాసములును, మొదలగు గ్రంథములు. వైదికమత చరిత్రవిషయమును నీగ్రంథములన్నియుం నించుమించుగ నొక్కరీతిగనే చెప్పుచుండుటచేత వీనినన్నిఁటిని నొక్కతరగతిక్రిందఁ జేర్పవచ్చును. ఇది మొదటియాధారము.

ఇటీవల రెండుమూఁడువందల యేండ్లక్రిందట మనదేశమునకువచ్చిన విదేశీయ పండితులు (అనఁగా నితరదేశములనుండి వచ్చినపండితులు) మనదేశచరిత్ర నింగ్లీషు

భాషలలో వ్రాసియున్నారు. మనదేశపు పూర్వనివాసులగు మనపూర్వులనుగుఱించియు, వారియొక్క మతాచార వ్యవహారములనుగుఱించియుఁగూడ నందే యావిదేశీయ పండితులు కొంతకొంత వ్రాసియున్నారు. ఈవిదేశీయులువ్రాసిన చరిత్రవిషయములను జిన్నతనమందుఁ జదివికొని, పిమ్మటవానినే యాధారముగఁబెట్టుకొని మనదేశపు పండితులుగూడఁ గొందఱిటీవల మనదేశచరిత్రలను గొన్నిఁటిని దెలుఁగుభాష యందు వ్రాసియున్నారు. అట్లే యురవము మొదలగు తక్కినదేశభాషలలోఁగూడ వ్రాసియుందురు. ఇందుల కుదాహరణముగ, నిటీవలి స్వదేశీయపండితులలో నొకరి చేఁ దెలుఁగుభాషలో వ్రాయఁబడిన "హిందూదేశ కథాసంగ్రహము"ను గ్రంథముయొక్క ప్రథమభాగమగు "హిందూమహాయుగము"ను పుస్తకముయొక్క మొదటికూర్పుపీఠికలో నాగ్రంథకర్త యీక్రిందిరీతిగ వ్రాసియున్నారు:—

"......ఇందువిషయమై నేనుచూచిన యన్నిగ్రంథముల పేళ్లిచటనిచ్చుట యనావశ్యకము. ఋగ్వేదశాస్త్రయుగములచరిత్రకు కుంటేకృతమైన 'విసిసిట్యూడ్స్-ఆఫ్- ఆర్యన్-సివిలిజేషన్- ఇన్-ఇండియా' (Vicissitudes of Aryan Civilization in India) యనుగ్రంథమును, బౌద్ధయుగచరిత్రకు విన్సెంటుస్మిథ్ కృతమగు 'ఆర్లీ-హిస్ట్రీ' (Early History) అనుగ్రంథమును, రామాయణీయ స్థలనిర్ణయముజేయు మరాటీభాషలోని కావ్యసంగ్రహానుబంధమును ముఖ్యమైన యాధారములని చెప్పినఁజాలును."

ఇట్లు విదేశీయపండితులును, మనస్వదేశీయపండితులలో నిటీవలివారును వ్రాసిన మనదేశచరిత్రలనే 'హిస్టరీస్-ఆఫ్-ఇండియా' (Histories of India) అనియును, 'ఇండియన్-హిస్టరీస్' (Indian Histories) అనియును, 'స్టోరీస్-ఫ్రమ్- ఇండియన్-హిస్టరీ' (Stories from Indian History) అనియును, . నీమొదలగు పేళ్లతో నింగ్లీషుభాషలో వ్యవహరించుచున్నారు. తెలుఁగుమొదలగు దేశభాషలందు వీనినే, 'హిందూదేశచరిత్ర' లనియును, 'హిందూదేశ చరిత్రకథలని' యును నిట్టివే యితరములగు మఱికొన్ని పేళ్లతోడను వాడుచున్నారు. ఈచరిత్రగ్రంథములలో వైదికమతమును గుఱించినవిషయములను, విదేశీయపండితులును, స్వదేశీయ పండితులునుగూడ నించుమించుగ నొక్కవిధముగనే వ్రాసియున్నారు. కావున వీని నన్నిఁటిని నొక్కతరగతిక్రిందఁ జేర్పవచ్చును. వైదికమతచరిత్ర తెలిసికొనుట కిది రెండవయాధారము.

మొదటియాధార మగుస్మృతులును, పురాణములును మొదలగునవి 'ప్రాచీన చరిత్ర'లని చెప్పఁబడును. ప్రాచీనములనఁగాఁ బూర్వకాలమునకు సంబంధించినవని

యర్థము. అవి మనపూర్వులచే వ్రాయఁబడుటచే వానికాపేరు గలిగినది. రెండవ యాధారమగు 'హిందూదేశచరిత్రలు' మొదలగునవి 'నవీనచరిత్రల'ని చెప్పఁబడును. నవీనములనఁగాఁ గ్రొత్తవియని యర్థము. క్రొత్తగా నిటీవలిపండితులచే వ్రాయఁబడుటచే వీని కీపేరుగల్గినది. వైదికమత చరిత్రపరులచే ప్రాచీనచరిత్రలందు వ్రాయఁబడిన విషయములకును, నవీనచరిత్రలందు వ్రాయఁబడిన విషయములకును మిక్కిలి యెక్కువగు భేదము గలదు. ఒక్కొక్క విషయములో నెంతెంత భేదమున్నదో యెట్టి యెట్టిభేదమున్నదో ముందుముందు క్రమముగా వ్రాసిచూపఁబడును.

## పూర్వాచారపరాయణులు.

పూర్వకాలమున ననఁగా నిప్పటికి రమారమి నూఱు, నూటయేబది సంవత్సరముల క్రిందటివఱకును మనదేశస్థులు తమబాలురకుఁ జిన్నతనమునుండియు మన ప్రాచీనచరిత్రలనే నేర్పుచుండెడివారు. మనప్రాచీనచరిత్రలగు స్మృతులును, బురాణములును, నితిహాసములును మొదలగుగ్రంథములు కేవలచరిత్ర గ్రంథములుమాత్రమేగాక మతధర్మములను దెలుపునట్టివిగను, భాషాజ్ఞానమును గలుగఁజేయునట్టివిగనుగూడ నుండెడివి. అందుచే వానినిజదివెడి యప్పటిబాలురకుఁ జరిత్రజ్ఞానము మాత్రమేగాక, మతజ్ఞానమును, భాషాజ్ఞానమును, గూడ బాగుగఁ గలుగుచుండెడివి. ఈవిధముగ నప్పటిబాలు రొక్కవిద్య యభ్యసించుటచే మూఁడుఫలములు గలుగుచుండెడివి. మనపూర్వులందఱును వారివారిబాల్యమందుఁ బైప్రాచీనచరిత్రలనే చదువుకొన్నవా రగుటచేఁ దగినంత చరిత్రజ్ఞానమును భాషాజ్ఞానమును, మతజ్ఞానమునుగూడఁ గలిగి ప్రాచీనచరిత్రలందలి విషయములన్నియు సత్యములనినమ్మి యుండెడివారు. ఇట్లునమ్మినవా రీకాలమునఁగూడఁ గొందఱుకలరు. ఇట్టివారిని బూర్వాచారపరాయణులని చెప్పుదురు. అనఁగా వారియొక్క పూర్వులయాచారములం దాసక్తికలవారని యర్థము.

## నవనాగరకులు.

ఇటీవల విదేశీయులు మనదేశమునకుఁ బ్రభువులైన నాఁటినుండియును, వారి విదేశభాషను నేర్పుపాఠశాలలను మనదేశమున స్థాపించియున్నారు. అప్పటినుండియు మనదేశస్థులలో ననేకులు తమబాలురను బైవిదేశీయుల పాఠశాలలలోఁజేర్పించి విద్య నేర్పించుచువచ్చిరి. ఆపాఠశాలలలోఁ జదువునేర్చుకొను బాలురకు విదేశభాషయగు నింగ్లీషుభాషతోఁబాటుగ దొరతనమువారు నవీనచరిత్రలనుగూడ నేర్పుచువచ్చిరి. అందుఁ జిన్నతరగతులందుఁ జదువుబాలురకు దేశభాషలలో మనదేశపు పండితులువ్రాసిన హిందూదేశపు నవీనచరిత్రలను నేర్పుచుండిరి; పెద్దతరగతులలోఁ జదువుబాలురకు విదే

శీయులు స్వయముగా నింగ్లీషుభాషలో వ్రాసిన నవీనచరిత్రలను నేర్పుచుండిరి; కాని, మన ప్రాచీనచరిత్రలను మనదేశపుబాలురకుఁ గొంచమైనను నేర్పరైరి. ఇందులకుఁ గారణమేమో సరిగాఁజెప్పఁజాలము; కాని, మనకట్టి చరిత్రలుగల వనుసంగతి వారికిఁ దెలియకపోయినైన నుండవచ్చును; వానియందలి విషయములు వారికిఁ దిన్నఁగా బోధపడకయైన నుండవచ్చును; లేక, యావిషయములు సత్యములనునమ్మకము వారికిలేక పోయినైన నుండవచ్చును; కాక, యాగ్రంథములు కేవలము మతగ్రంథములేగాని వానిలోఁ జరిత్రవిషయము లుండవని వారుపొరపడియైన నుండవచ్చును. ఎందుచేత నోగాని మనదేశపుబాలురకు మనప్రాచీనచరిత్రలను నేర్పుటకు విదేశీయులగు దొరతనమువారు తమపాఠశాలలలో నేర్పాటుచేసి యుండలేదు.

ఈవిధముగఁ బైపాఠశాలలలోఁ జదువుమనదేశస్థులకు బాల్యమున నవీనచరిత్రలనుమాత్రమే నేర్పుటచేతను, మనప్రాచీనచరిత్రలను గొంచెమైనను నేర్పకపోవుటచేతను, నట్లుచదువుకొనిన యిప్పటిమనదేశస్థులలోఁ బెద్దవారికిని జిన్నవారికినిగూడ మనప్రాచీనచరిత్రల సంబంధమగుజ్ఞానము మిక్కిలితక్కువగా నున్నది. మనకుఁ బ్రాచీనచరిత్రలు గలవనుసంగతినిగూడ నెఱుఁగనివారు ప్రస్తుతపు మనదేశస్థులలోని విద్యావంతులలో నెందఱెందఱో గలరు. మనదేశమునఁ బురాణములును నితిహాసములును మొదలగుగ్రంథములు గలవని యెఱిఁగినవారుగూడఁ బైవారిలోఁ గొందఱుగలరు; కాని, వారుగూడ నాగ్రంథములను కేవల మతగ్రంథములనియే తలఁచుచున్నారు. ఆగ్రంథములలో గొప్పగొప్ప చరిత్రవిషయములు గలవనుసంగతి వారెఱుఁగరు. ఎఱిఁగినవారు కొందఱున్నను, వారు చిన్ననాఁటినుండియుఁ విదేశభాషనుమాత్రమే నేర్చికొన్నవా ఱగుటచేఁ, దగినంత సంస్కృతభాషాజ్ఞానముగాని, దేశభాషాజ్ఞానముగాని, లేనందున నాగ్రంథములను స్వయముగాఁ జదువఁజాలరైరి. విదేశీయులుకొంద ఱాగ్రంథములను జదివి యందలిభావములఁ గొన్నిఁటి నింగ్లీషుభాషలోఁ బుస్తకములుగ వ్రాసియుండిరి. సంస్కృతభాషాజ్ఞానముగాని, దేశభాషాజ్ఞానముగాని చాలని మనదేశస్థు లాయింగ్లీషుపుస్తకములనుమాత్రము చదివి యందలిభావములనే తమహృదయములలోనికిఁ గొని యంతటితో సంతసించుచుండిరి.

మఱికొందఱు, పైవిదేశీయపండితులు వ్రాసిన యింగ్లీషుతర్జుమాలను జదువక, కొంచెము భాషాజ్ఞానమును సంపాదించి స్వయముగనే మనప్రాచీనచరిత్రలను జదువ మొదలుపెట్టిరి. కాని, వారైనను జిన్ననాఁటినుండియుఁ వానియందుఁ దగినంతపరిశ్రమ చేసినవారుకారు. అందుచేతవారు వానిని జదువఁబోఁగా వారికవితిన్నఁగా నర్థముగాక

పోవుటయును, నర్థమైనపట్ల బూర్తిగసమన్వయము గాదురకపోవుటయును దటస్థించుచున్నది.అందుచే నెవరియిష్టమువచ్చినట్లు వారర్థమును జేసికొని విడుచుచున్నారు.మఱికొంద ఱాగ్రంథకర్తలు తెలివిలేనివారనియుఁ, గావున నట్లర్థములేని వ్రాతలు వ్రాసియుండిరనియు, నాగ్రంథకర్తలను దిట్టుచున్నారు. ఇంకఁగొందఱు మనప్రాచీనచరిత్రలందలి చరిత్రవిషయములను జమత్కారముకొఱకును, నతిశయము (అనఁగాగొప్ప) కొఱకును గవులారీతిగఁ గల్పించి వర్ణించియుండురనియుఁ, నవిసత్యములు కావనియుఁ దలంచుచున్నారు.

ఆగ్రంథములే మనవైదికమత గ్రంథములగుటచే, వానియందలి మతాచార విషయములనుగూడఁ బైవారందఱును వారివారి యిష్టమువచ్చిన ట్లర్థము చేసికొని, వారివారియిష్టప్రకారము వానిని మార్చుకొనవలయునని కోరుచున్నారు. అట్టిమార్పు జనులందఱియందునుగూడఁ గలుగఁజేయవలయునని చేతనైనంతప్రయత్నము చేయుచున్నారు. అందులకుఁగాను క్రొత్తక్రొత్తసమాజములను నెలకొల్పుచున్నారు. పత్రికలను బ్రకటించుచున్నారు. ఉపన్యాసము లిచ్చుచున్నారు. దేశమంతటను బ్రచారము చేయుచున్నారు. తమప్రయత్నమునఁ దమకుఁ దోడ్పడవలసినదని శాసననిర్మాణ సభలందుఁ బ్రభుత్వమువారిని గోరుచున్నారు. ఇట్టివారందఱును మతాచారములందును సంఘమునందును మార్పులను గలుగఁజేయవలయునని కోరువారుగ నున్నందున వీరందఱును 'రిఫార్మరులు' (Reformers) (అనఁగా మార్పులకలిగించువారు) అని పిలువఁబడుచున్నారు. వీరినే నవనాగరకులని (అనఁగాఁ క్రొత్తనాగరకత కలవారని) గూడఁ జెప్పుదురు.

## నవనాగరకుల లక్షణములకుఁ బ్రమాణములు.

ఈపై మేముతెలిపిన యభిప్రాయములనే నవనాగరకులయొక్క లక్షణముగా గ్రహించిన కొందఱు ప్రముఖులయొక్కవాక్యములఁగూడ నీక్రిందఁజూపుచున్నాము.

"* * * *

The ruling classes of India are recruits from the British nation, who are made to believe that the living of their progeny, depends on their maintenance of the Indian dominion and are also taught the 'Divide and rule policy' and other allied sciences to suit their nature of work. They are provided with direct culture and history of their own nation and *a specially prepared information about Indian peoples with privelege to add to the same whenever and wherever it is necessary. The leaders of India are only Indian students of the above ruling class, who gave them the specially prepared*

*information about India with their own notes and some general information about the outside world. Deprived of their native culture and history they are disconnected with their native soil and peoples. They are made to learn in their tender age only that their ancestors do nat possess any regular culture and history worthwhile to learn and adopt. They are brought up and fed like the hounds to destroy the remaining rights, culture, religion and social order, of their countrymen. This they have justified in developing the 'divide and rule' policy of their teaches into a 'destroy and rule policy' in the new councils* under the Montague-Chelmsford Reforms granted by the British government in recognition of India's services in the Great World War. * * *"

The Vedic World, pp. 18-19, Vol. III, No. 2, May, 1929.

పైదాని యర్థమేమనఁగా:—

"భారతవర్షమును బరిపాలించు జాతివారు బ్రిటీషుజాతివారు. వారిజాతి యొక్క బ్రదుకునకు భారతవర్ష పరిపాలనము మాత్రమే యాధారము. ప్రజలను 'చీల దీసిపరిపాలించు' రాజనీతివిధానమును, నందులకుఁగావలసిన మఱికొన్ని యితరవిద్యలనే వారు నేర్చియుండిరి. వారిజాతియొక్క స్వచరిత్రను భారతవర్షమందలి జనులనుగుఱించి వ్రాయఁబడిన యొకప్రత్యేకవిధమగు చరిత్రను నవసరమైనయెడల యిష్టమువచ్చినవిష యమును దేనినైనను భరతవర్ష చరిత్రకుఁ జేర్పఁగలవిధానమును వారు నేర్చియుండిరి. భారతీయ ప్రజానాయకులగువా రాపరపాలక జాతివారిచేతిక్రిందఁ దయారైనశిష్యు లగు భారతీయులే. భారతవర్షపు ప్రజలనుగుఱించి పైగురువులు నేర్చికొనిన ప్రత్యేక చరిత్రనే శిష్యులకుఁగూడ నేర్పి ప్రపంచమందలి యితరదేశపు విషయములనుగూడఁ గొంతకొంత నేర్పిరి. అట్టిభారతీయ ప్రజానాయకులు వారిస్వదేశ సంబంధమగు (యథార్థ) చరిత్రజ్ఞానమును సాంప్రదాయవిధానములును దెలియఁనవకాశములను గోల్పోయి స్వదేశీయ విద్యావిధానమునకును బ్రజలయాచారవ్యవహార సాంప్రదాయ ములకును దూరులైరి. తమపూర్వులకు సరియైనచరిత్రయే లేదనియు నందుండి తాము నేర్చికొనఁదగిన యుక్తమగువిషయ మొక్కటియు లేదనియు మాత్రమే వారు చిన్న తనమున (విదేశీయ గురువులచేతిక్రింద) నేర్చికొనియుండిరి. తమస్వజాతి ప్రజలలో మిగిలియున్న మత, సాంఘిక, నైతిక, విద్యావిధాన సాంప్రదాయములను ధ్వంసము చేయఁ దగినవిధముగ వారు తయారుచేయఁబడిరి. ఈవిషయమును వారు ప్రస్తుతకాల పు రాజకీయ శాసనిర్మాణసభలలోఁ జేరి బుజావుచేయుచు దమగురువులయొక్క 'చీల దీసిపరిపాలించు' విధానమును 'ధ్వంసముచేసి పరిపాలించు' విధానముగ మార్చియు

న్నారు. ఈశాసనసభలలో ప్రజలకధికార మెట్లేర్పడెననఁగా గడచిన 'యైరోపామహాసంగ్రామము'నందుఁ బ్రభుత్వమువారికి భారతీయులు గావించిన సహాయమునకు బహుమానముగ 'మాంటేగ్, ఛేమ్సుఫర్డు.' అను ప్రభుత్వోద్యోగులచే భారతీయప్రజలకు రాజకీయశాసనసభలందు నధికార మొసఁగఁబడినది." "వేదిక్ వరల్డు" అనుపత్రిక 18-19 పుట, సంపు 3. సంచిక 2. (సంపాదకీయ వ్యాసము) 1929 సం॥ మేనెల.

మఱియును నైపత్రికయందే IV వ సంపుటము 3,4,5, సంచికలందు 41-వ పుటలో సంపాదకీయవ్యాసమున నీక్రిందిరీతిగఁగూడ 'రిఫార్మరుల'నుగుఱించి చెప్పఁబడియున్నది:—

"Now let us note how far these outcaste Hindus (Social Hindus) and their sympathisers, who are now influential in the Hindu society share their infuence along with our Indian Mahomedans. The Hindus, especially Brahmins, who are more accustomed to literary pursuits are the first to receive English education and western habits of living and thinking. If they had maintained their own national education along with the Western education they would have not only become the worthy leaders of Indian destiny but would have become the worthy leaders of world's destiny by sharing with the best part of that western civilisation. But the fate of irony is otherwise. They have become first prey to the worst part of the Western civilisation and consequently the first among Indians who deviate from their own national habits, living and thinking. They have become a source of weakness and division to the Hindu society in general to which they are alleged to belong, by their inroads over the individual and caste rights of the Hindu society though they are thinking and advertising contrary to this ... ... ... ..."

Editorial, "The Vedic World," P P, 41, Vol. IV, Nos. 3, 4 & 5, June, July, & August 1929.

దీనియర్థ మేమనఁగా:—

"'వైదికమతసంఘమున' బలుసుబడిగలిగి కులభేదవర్జితులైన యిప్పటి'రిఫార్మరులు'ను వారి నామోదించువారును నీదేశమందలి మహమ్మదీయులతోఁ జేరి తమపలుకుబడి నెంతవఱకు వినియోగించుచుండిరో చూతము. వైదికమతస్థులును, నందులో ముఖ్యముగ భాషాభ్యాసముల కలవడిన బ్రాహ్మణజాతివారును ఇంగ్లీషువిద్యను బాశ్చాత్త్యాచార వ్యవహారములను నేర్చికొనుటకు మొట్టమొదటివారైరి. పాశ్చాత్త్యవిద్యతోఁ బాటుగ వారు తమజాతీయ విద్యావిధానమునుగూడ వదలిపెట్టక యవలంబించియుం

న్నచోఁ బాశ్చాత్యనాగరకతనుండి (గ్రహింపఁదగిన) యత్యుత్తమ విషయములను మాత్రమే గ్రహించి భారతవర్షముయొక్క భావికాలపరిస్థితులకు నాయకులగుట మాత్రమేగాక ప్రపంచకమంతటియొక్క భావిపరిస్థితులకుఁగూడ నాయకులుగాఁ దగియుండెడివారే. కాని దైవవిధి వ్యతిరేకముగానున్నది. వారు ప్రప్రథమమునఁ బాశ్చాత్యనాగరికతయందలి యధమాధమ భాగమునకే యాహుతి గావలసివచ్చినది; అందుచే భారతీయులలో స్వజాతీయములగు నాచారములనుండియుఁ బ్రవర్తనము నుండియు బుద్ధినుండియు: భ్రష్టులయినవారిలోఁ బ్రథములయిరి. వారు తాము గూడ వైదికమతసంఘమునకుఁ జెందినవారమేయని చెప్పుకొనుచుందురు. కాని యామతమునకు సంబంధించిన సంఘధర్మములపైనను గులాచార వ్యవహారములపైనను వారు దాడివెడలుచు వానినిధ్వంసము చేయ నెంచుచుండిరి. అట్లు చేయుటవలన సంఘము బాగుపడుననియు సంఘమున నైకమత్యమును బలమునుకలుగుననియు వారు తలంచుచుఁ జెప్పుకొనుచునున్నప్పటికిని వైదికమత సంఘమందలి యైకమత్యమునశించి చీలికలేర్పడుటకును దౌర్బల్యము నెలకొనుటకును వారు హేతువగుచుండిరి."

నవనాగరకులు శాసననిర్మాణసభలలోఁజేరి మనమతాచారములను ధ్వంసము చేయఁ బ్రయత్నించుటకుఁ గారణములు విదేశీయులబడులలో మనదేశీయులకు నేర్పినచరిత్ర విషయములేయను నభిప్రాయమును న్యాయవాది యన్. నటేశఅయ్యర్ బి. ఏ., బి. యల్., గారుసహితము మధుర రామనాథ తిరునల్వేలిమండలముల బ్రాహ్మణమహాసభ కాహ్వానసంఘాధ్యక్షులై యుపన్యసించుసందర్భమున నీక్రిందిరీతిగ సూచించియున్నారు:— (ఈవిషయము 'హిందూ' (Hindu) పత్రికలోను 'వేదిక్-హరల్డ్' అనుపత్రిక 3-వ సంపుటము 1-వసంచికలో 16-వ పుటయందునుగూడఁ బ్రకటింపఁబడియున్నది.)

"... ... ... ... *Yet, it is these laws that our misinformed and misguided children in the legislative cradle are attempting to disturb.*"

The Welcome address as chairman of Reception committee by Mr. N. Natesa Iyer, B. A., B. L., Advocate, in the Brahmana Conference of Madura, Ramnad, & Tinnevelly Districts.

దీనియర్థమేమనఁగా:—"తప్పుబోధలవలనఁ దప్పుమార్గమునకు లాగఁబడిన (మననవనాగరకులను) శిశువులు శాసననిర్మాణసభలను నుయ్యాలలోనుండి యుట్టి (మన వైదికమత) ధర్మములను ధ్వంసముచేయుటకే యత్నించుచున్నారు."

నవనాగరకులనుగూర్చిన యిట్టియభిప్రాయములనే 'దివ్యజ్ఞానసమాజ భయంకరులు'ను 'వైదికధర్మసంరక్షకులును' (Terror of Theosophy & Defender of Vaidika Dharma.) శ్రీశృంగేరీ విరూపాక్షపీఠ స్వాములునగు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీకల్యాణానంద భారతీస్వాములవారుగూడ శ్రీ కల్యాణానంద భారతీగ్రంథమాలలోని ౧౭-వ సంఖ్యగల (No. XVII) 'మానవ రహస్యము'ను గ్రంథమున నీక్రిందిరీతిగఁ దెలిపియున్నారు:—

"... ... ... ... The ambitious occidental has invented a wonderful process of research and investigation, whose object is nothing but selfpraise and alien abuse; thus a good many theories have been ushered into the multitudes of India *which are dashing the brains of the socalled educated people of India*, and the consequence is the present confusion plainly seen in every activity of Indian life. Whatever the intrinsic value of the conflicting and self-contradictory inferences and theories may be, *the socalled educated bigwigs of India—bigwigs from the standpoint of the rank which they occupy in the service of the Government, who have drunk full to the neck, decoctions of Western civilisation, are at a loss to know the fact and figure, for the reason that their brains are stuffed with the gup and gossip of the occidentals alone from the beginning of the A, B, C, without any knowledge correct as to their past or present.* Hence the marvellously supernatural civilisation of India has been made a butt of ridicule by the occidentals as well as by the so called educated men of India; and the Indian Nation is tottering like a ship in the midst of a stormy ocean. *This dilemma can never be removed until and unless the superimposed fallacious notions are perfectly removed by correct knowledge, which can be acheieved only by a close examination of the so called theories of sciences, that have become the supurstitious maxims of the lost sheep of India."* ... ...

Manava Rahasyam, Preamble, P P. 3 & 4;

దీని భావమేమనఁగా:—

"పాశ్చాత్యులు విచిత్రమగు నొకపరిశోధనవిధానమును గనిపెట్టిరి; అందు వారియుద్దేశము 'ఆత్మస్తుతియుఁ బరనిందయును మాత్రమే గాని వేఱేమియును గాదు; ఆరీతిగ భారతవర్షమందలి ప్రజాసమూహములోనికి ననేకములగు సిద్ధాంతములు జొనుపఁబడినవి. అవియే భారతవర్షమం దిప్పటి విద్యావంతు లనఁబడువారి మెదడులను గ్రిందుమీఁదు చేయుచున్నవి. దానియొక్క ఫలితమే ప్రస్తుతము భార

తీయ జీవనమునకు సంబంధించిన ప్రతిసమస్యను కలతపాలు చేయుంట స్పష్టముగ గనుపించుచున్నది. పరస్పరవిరుద్ధములును స్వవచన వ్యాఘాతుకములును వివాదభూయిష్ఠములును నగుసాసిద్ధాంతముల యందలిసత్య మెట్టిదైననగునుగాక! పాశ్చాత్య నాగరకతాసారమును గుత్తుకలవఱకును గ్రోలి ప్రభుత్వోద్యోగమునం దత్యున్నత పదవుల నధిష్ఠించి విద్యావంతుల మనుకొనుచున్న యిప్పటిభారతీయ నవనాగరకులకు వారిపూర్వస్థితికి సంబంధించినట్టిగాని ప్రస్తుతస్థితికి సంబంధించినట్టిగాని సత్యమగు జ్ఞాన మేమియును లేకుండ వారి మెదడులు విద్యాభ్యాసప్రారంభమునుండియుం బాశ్చాత్యులకు సంబంధించిన నిరుపయోగములగు చెత్తవిషయములతోడ మాత్రమే నింపఁబడుటచే వారు యథార్థమేదియో కానిదేదియో (అనఁగా యుక్తాయుక్తములను) గ్రహింపఁజాలని స్థితికివచ్చియున్నారు. అందువలన నత్యాశ్చర్యకరమును నసాధారణమును నగుభారతీయ నాగరకత పైనదెలిపిన పాశ్చాత్యులకును వారివలెనె యిప్పటి విద్యావంతులనఁబడు భారతీయ నవనాగరకులకును బరిహాసాస్పద మైనది. తుపానుగాలిచే నడుసముద్రమున నల్లకల్లోలమొందు నోడవలె నిప్పుడు భారతీయ జాతి వ్యాకులపడుచున్నది. భారతీయులబుద్ధులపై నావేశించియున్న యీయపోహలను బూర్తిగఁదొలఁగించి యథార్థజ్ఞానమును నెలకొల్పిననే తక్క యప్పటివఱకును నీవ్యాకులపాటు కుదుటబడ నేరదు. ఇప్పటిభారతీయ నవనాగరకులకుఁ గలతప్పుటూహాలకును మూఢనిశ్వాసములకును మూలసూత్రములై నట్టియుం బైనఁదెలుపఁబడినట్టియుం (విదేశీయుల) శాస్త్రములను సిద్ధాంతములను మిక్కిలిజాగ్రత్తతోఁ బరిశీలించుటవలన మాత్రమే యథార్థమగుజ్ఞాన మేర్పడఁగలదు."

పాశ్చాత్య విద్యావిధానముచేఁ నేర్పడిన పైవిధమగుస్థితి యిప్పటిభారతీయ నవనాగరకులలోని పురుషులయందుమాత్రమే గాక స్త్రీలయందుసహితము కొంత వఱకు వ్యాపించియున్నది. విదేశీయపాఠశాలలందు బాలురతోబాటుగఁ గొందఱు బాలికలుగూడ విద్య నభ్యసించియుండుటచే వారుగూడ వైదికమతాచారవిషయములం దన్నివిధముల నవనాగరకులగు పురుషులవలెనే ప్రవర్తించుచున్నారు. ఈ యభిప్రాయమును సూచించుచుఁ గుంభఘోణమున న్యాయవాది దివాన్ బహదూర్ శ్రీయుత టి. ఆర్. రామచంద్రఅయ్యర్ గారి యధ్యక్షతక్రిందను న్యాయవాది రావుబహదూర్ శ్రీయుత యన్. కృష్ణస్వామి అయ్యంగారు, బి. ఏ., బి యల్., గారి యాహ్వానసంఘాధ్యక్షతక్రిందను జరిగిన తంజావూరుమండల బ్రాహ్మణసభలో నాల్గువందలమంది ప్రతినిధులయొక్కయు మూఁడు వేలమంది వైదికమతాభిమానులయొక్కయు మధ్యమున రా

బహదూర్ శ్రీయుత యస్. అప్పుశాస్త్రియార్ గారిచే నుపపాదింపఁబడి మాయవరము వాస్తవ్యులగు శ్రీయుత టి. యస్. నటేశశాస్త్రియార్ గారిచే బలపఱుపఁబడి సభ్యులందఱిచే నేకగ్రీవముగ సామోదింపఁబడిన యొనిమిదవతీర్మాన మీక్రిందిరీతిగ నున్నది:—

"8. This Conference is firmly of opinion that the education imparted to our girls in schools at the present day is not only not conducive to the promotion of "Stri Dharma," but is also destructive of all Hindu religious ideals and appoints a committee consisting of the gentlemen named below with powers to add such others as they may think fit and necessary to examine the present system of education of our girls and to suggest the best methods of imparting education to them and to define the scope, extent and limit of such education.

Messrs. 1. Prof. K. Sundararama Ayyar.
2. Rao Bahadur N. Krishnaswami Iyenger.
3. R. Swaminatha Ayyar.
4. M. K. Vaithianatha Ayyar.
5. S. Mahalinga Ayyar, as Convener, and
6. Gopaladesika Achariar.

Proposed by Rao Bahadur S. Appu Sastriar, Seconded by T. S. Natesa Sastriar of Mayavaram.

The Tanjore District Brahman Conference, Kumbakonam sessions.

[From: "The Vedic World," Vol. IV Nos. 3, 4, & 5 (P P, 48) June, July & August 1929.]

పైదాని తాత్పర్యమేమనఁగా:—

"ఈ కాలమునఁ బాఠశాలలలో మనదేశపు బాలికలకుఁ గఱపఁబడు విద్యావిధానము స్త్రీధర్మమును వృద్ధిచేయునది గాకపోవుటయేగాక వారికిఁగల వైదికమత విశ్వాసములను నశింపఁజేయునదిగా నున్నదని యీసభవారు దృఢముగానమ్ముచు మనదేశపు బాలికలయొక్క ప్రస్తుత విద్యావిధానమును బరిశీలించుటకొఱకును నట్టి బాలికలకు విద్యనుగఱపుట కత్యుత్తమమగు విధానమును నిర్ణయించుటకొఱకును నట్టివిద్యావిధానముయొక్క యభిప్రాయమును బరిమాణమును గాలపరిమితిని నిర్వచించుటకొఱకును నీక్రిందఁ బేర్కొనఁబడినపెద్దల నొకసంఘముగ నేర్పఱచి వారి కవసరమనితోఁచిన యితరులనుసహితము తగినవారిని దమతోఁ జేర్చుకొనుట కధికారమిచ్చుచున్నారు." (సంఘసభ్యులు:—)

(౧.) శ్రీయుత కే. సుందరరామ అయ్యరుగారు.
(౧.) రావుబహాదూర్ యన్. కృష్ణస్వామి అయ్యంగార్ గారు.
(౩.) ఆర్. స్వామినాథ అయ్యర్ గారు.
(౪.) యం. కె. వైద్యనాథ అయ్యర్ గారు.
(౫.) యన్. మహాలింగ అయ్యరుగారు.
(౬.) గోపాలదేశిక ఆచారియర్ గారు.

నవనాగరకులగు భారతీయులకొసంగఁబడిన విద్యావిధానమునుగురించి పైన దెలిపినరీతి నభిప్రాయముల నొసఁగినవారు భారతీయప్రముఖులలో మాత్రమేగాక యట్టిప్రముఖులు పాశ్చాత్యవిద్వాంసులలోఁగూడఁ గొందఱుగలరు. ఇందుల కుదాహరణముగ 'సర్-జాన్-వుడ్‌రాఫ్, (Sir John Woodroffe) అను పాశ్చాత్య విద్వాంసు లొకరు తామువ్రాసిన 'జాతియొక్క బీజము—భారతీయవిద్యపై నొక వ్యాసము (The Seed of Race—An Essay on Indian Education) అను గ్రంథమున నీక్రిందిరీతిగఁ దెలిపియున్నారు:—

"The point before us is however a very different one. It is not whether the English language and culture should be taught, but whether the Indian culture should be neglected. This has been the case in the past. It should be given co-ordinate rank. We all know how little value is attached to any thing Indian by Macaulay, the protagonist of English culture, and many, perhaps most, have since then shared, though somtimes in tempered form, his views. Such have regarded Indian religion as a false superstition, Indian philosophy as antiquated guess-work without present value, Indian art and literature as crude and grotesque, its science "seas of butter and oceans of milk" and so on. The young Indian has been subjected to such a strong and contineous suggestion of his inferiority, that it is a wonder that any spirit of self-assertion has at all survived. He has been told that he has had no glorious past, that the history of his country is lacking in great personalities, that the "progressive" West is superior to the "immobile" East and its old-world civilization, and so forth, and that therefore his only chance of making himself the equal of Western peoples is by giving up his "Barbarism" (as a recent English author has called it) and making himself as like his civilized Western teachers and rulers as possible. If day in and day out, suggestions of his innate inferiority are made to a boy, and the superiority of a foreign civilization is affirmed, he will according to every possibility, come to depre-

ciate his own people and culture. This is what has happened and the racial Sangskara has been veiled. These suggestions can, and should be, countered by others based on an accurate appreciation of the Indian Character and its cultural achievements. The seed of Race will then commence to spout and flower. When racial character is reestablished, an autonomous centre of receptivity is established capable of receiving (without risk of being overwhelmed thereby) every form of foreign culture. This is possible because there is then a healthy organism capable of assimilating every form of food presented to it. A knowledge of foreign life and thought is as essential to India as a knowledge of what is its own. It is this last which has been neglected.

The Seed of Race by Sir John Woodroffe, (P. P. 33—35)

... ... ... ... ... ...

"In India, for instance, in the past at any rate, attention has been given to the history of the English and Mogul occupation, the student being left in ignorance of the happenings of the specifically Hindu period. ... ... ... ..." (P P. 36—37, 1 bid.)

పైదాని యర్థమేమనఁగా:—

"మనమిపుడు చర్చింపఁదలఁచినది వేఱువిషయము. ఏమనఁగా నింగ్లీషుభాషయు నాగరకతయు నేర్పఁబడవలయునా యనువిషయముగాదు; భారతీయ నాగరకతను బోధింపక విడువవలయునా యనువిషయము. ఇదివఱలో జరిగినవిషయ మిదియే. దీనికిఁ (భారతీయనాగరకతకుఁ) గూడ సరిసమానమగు గౌరవమీయవలయును. ఆంగ్లేయ నాగరకతా పక్షపాతియగు 'మెకాలే' యనునాతఁడు భారతీయజాతికి సంబంధించిన యెట్టివిషయమునకైనను నేవిధమగు గౌరవమొసంగినదియు మనకందఱకును దెలిసినవిషయమే. అప్పటినుండియు నధికసంఖ్యాకులగువారు (అత్యధికసంఖ్యాకులనిగూడఁ జెప్పవచ్చునేమో) యాయనయంతటి తీవ్రముగ గాకున్నను నాయన యొక్క యభిప్రాయములనే గలిగియున్నారు. అట్టివారు భారతీయుల (వైదిక) మతమును నసత్యదూషితమగు మూఢవిశ్వాసముగను భారతీయవేదాంతమును నిరుపయోగములగు ముసలివారి యూహాలుగను భారతీయులకళలను ముదుకపరిశ్రమలుగను భారతీయవాఙ్మయమును మోటుగను భారతీయుల శాస్త్రవిద్యలను "పాలసముద్రము"లనియుం "వెన్నసముద్రము"లనియుఁ బరిహాసాస్పదములుగను నీమొదలగురీతిగఁ బరిగణించుచున్నారు. భారతీయులస్థితి యధమాధమమని వారికి బాల్యమున మిక్కిలితీవ్రముగను బలవత్తరముగను నెఱతెగనిరీతిని బోధించియుండుటచే నిప్పుడు

వారు తిరిగి తమనుదాము బాగుచేసికొనఁగల యుత్సాహము కొంచెమైనను వారియం దేమూలనైన నింకను నిలిచియున్నదాయని యాశ్చర్యము గల్గుచున్నది. భారతీయు లకు బోధింపఁబడిన దేమనఁగా: గడచిపోయిన భారతీయుల జీవితమునందుఁ బ్రశస్త మగు విషయమేమియును లేదనియు వారిదేశచరిత్రయందుఁ బ్రఖ్యాతినొందిన పురు షులులేరనియు నెప్పుడును నొకటేరీతిగఁ జలనములేకయున్న ప్రాచ్యదేశపు "బండ" నాగరకతకంటె "దినదినాభివృద్ధిఁజెందుచున్న" పాశ్చాత్యనాగరకతయే శ్రేష్ఠమ నియు నీమొదలగు విషయములును నందుచే వారుబాగుపడి పాశ్చాత్యులతో సరి సమానులగుటకు మార్గము (ఇటీవల నొకయాంగ్లేయగ్రంథకర్తచే 'నవనాగరకత' యని చెప్పఁబడిన) భారతీయులయొక్క మోటునాగరకతనువదలిపెట్టి వారిగురువులును బ్రభు వులునగు పాశ్చాత్యులను సాధ్యమైనంతవఱకు ననుకరించుటయే యనియును బోధింపఁ బడినది. ఒకబాలునకు వాని దధమస్థితియనియు నితరులనాగరకత శ్రేష్ఠమనియు ననుదినము బోధించినచో వాఁడు ప్రతివిషయమునను సాధ్యమైనంతవఱకు స్వజాతిజ నులను వారినాగరకతను నధమములుగాఁ బరిగణించి గర్హించును. జరిగినవిషయముకూడ నిదియే యైయున్నది; అందుచే (భారతీయుల) జాతీయసంస్కారము మరుగు పడినది. భారతీయాచారములను నాగరకతను శ్లాఘించుచు వానియందలి సత్యమగు మాహాత్మ్యమును వెల్లడింపఁగలబోధలచేఁ బైనదెలిపిన దుర్బోధలకుఁ బ్రతిక్రియఁ జేయ నవకాశముగలదు గావుననట్లు తప్పక చేయవలయును. అందుచే జాతీయబీజ మంకురించి పుష్పింపఁబ్రారంభించును. స్వజాతీయవర్తనము పాదుకొల్పఁబడినపుడు, విజాతీయనాగరకతకు సంబంధించిన ప్రతివిషయమును గ్రహించి (వానిచే గ్రసింపఁ బడునను భయములేకనిరపాయముగ) నిలువఁబడఁగల సామర్థ్యము స్వజాతీయనాగ రకతయందు నెలకొనును. ఇవియెట్లుసాధ్యపడునవనఁగా, నప్పటికిఁదనకు నొసంగఁబడిన ప్రతివిషయమునుండియు గ్రహింపఁదగిన సత్యసారమును గ్రహించి జీర్ణింపఁజేసికొనఁ గల దృఢమగు కట్టుబాటేర్పడును. భారతవర్షమునకు, విదేశీయజీవనమును, విద్యలను గుఱించిన జ్ఞానమెంతటియవసరమో స్వదేశీయములగు నావిషయములనుగుఱించిన జ్ఞానము సహితమంతటియవసరమే. కాని, యీరెండవదియే నిర్లక్ష్యముగా విడనాడఁ బడినది."

— (సర్ జార్జ్ వుడ్ రాఫ్ గారిచే వ్రాయఁబడిన "జాతియొక్క బీజము" అను గ్రంథము, పుటలు 33 నుంచి 35 వఱకును,)

మఱియును బైగ్రంథముననే 36, 37-వ పుటలలో నీక్రిందిరీతిగఁగూడ వ్రాయఁ బడినది:—

"ఇందుల కుదాహరణముగ భారతవర్షమునలోఁగడఁ గొంతవఱకునింగ్లీషువారును, మొగలాయిలును, దేశమునుజయించిన చరిత్రవిషయములకే ప్రాధాన్యమీయఁబడినది గాని, ముఖ్యముగా 'వైదికమతశాల' మెట్లు జరిగినదియుఁ గొంచెమైనను జెప్పక పోవుటచే విద్యార్థులావిషయమున నంధప్రాయులుగావింపఁబడిరి.

* * * * *

పైన వ్రాయఁబడినవిషయమున మధ్యలోఁ బై పాశ్చాత్యవిద్వాంసునిచే 'సాంగ్లేయనాగరకతాపక్షపాతి' యని పేర్కొనఁబడిన 'మెకాలే' యను విద్వాంసుఁడు గూడ భారతీయులకుఁ గల్పఁబడు పాశ్చాత్యవిద్యావిధానమునుగుఱించి యేమి చెప్పెనో కొంచెము తెలిసికొందము. అతఁ డావిద్యావిధానమునుగుఱించి తనతండ్రికి వ్రాసినజాబులో నీక్రిందిరీతిగ వ్రాసియుండెను:—

"No Hindu who has received English education ever remains sincerely attached to his religion. Some continue to profess it as a matter of policy, but others profess themselves pureilistic and some embrace Christianity. We desire to form a class who may be interpreters between us and the millions we govern, a class of persons Indians in blood and colour but English in taste, in opinion, in morals and intellect."

దీనికిఁ దెనుఁగు మేము వ్రాయుటకంటె, "స్వధర్మప్రకాశినీ" పత్రికాసంపాదకులగు బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు త్రిలిఙ్గపత్రికయొక్క ప్రజోత్పత్తినామసంవత్స రాశ్వయుజ శుద్ధ ౧౫ సోమవారపుసంచిక (౧౨-వ సంపు. ४3-సంఖ్య)లోని 3వ పుటలో, నిప్పటి భారతీయనవనాగరకులనుగుఱించి "పాశ్చాత్యమానసపుత్త్రుల విపరీతవర్తనము" అను శీర్షికతో వ్రాయువ్యాసమున వారు 'మెకాలే' గారి పై వాక్యములకిచ్చిన యాంధ్రానువాదమును వ్రాయుట మంచిదనియెంచి, యాయనువాదమునకు ముందు వారువ్రాసిన వాక్యములతోఁగూడ దాని నీక్రిందఁ జూపుచున్నాము:—

" * * * మెకాలేగా రెట్టియూహాలో నీవిద్యావిధానమును వారు ప్రవేశపెట్టినదియు, వారూహించినది యెంతవఱకు సార్థకమయినదియుఁ, నీవిద్యాభ్యసనరీతిననుసరించి యారితేఱిన విద్యార్థు లెట్లున్నదియుఁ మెకాలేగారే యొక్కచోట నిట్లు స్వయముగాఁ బలికియున్నారు:—(ఈ క్రిందవ్రాయునది, పైనఁదెలిపిన 'మెకాలే'గారి యింగ్లీషువాక్యముల కనువాదము.)

"ఇంగ్లీషువిద్యనభ్యసించిన ప్రతిహైందవుఁడును, అనగా వైదికమతస్థుఁడు మతాచారములకుఁ దిన్నఁగా బద్ధుఁడయియుండఁజాలఁడు. కొంద ఱేదో వినట్లు పోయినట్లుగా

లోకమునకు వెఱచి మతమునందు నామమాత్రముగా నిల్చియుందురు. కొందఱు గోడ మీఁద పిల్లి వాటముగ సంచరించుచుందురు. కొందఱు క్రైస్తవులగుదురు. మనము పరిపాలించునట్టి కోట్లకొలదిజనులకున్నూ, మనకున్నూ మధ్యవర్తులయి రంగుచేతను, రక్తముచేతనుమాత్రము హిందువులుగను, అభిప్రాయములలోను, అభిరుచులలోను, నీతివిధానములలోను, బుద్ధిలోను, ఇంగ్లీషువారుగను నుండు నొక (క్రొత్త)జాతిని నిర్మించుటకే మన యీవిద్యావిధానము నవలంబించితిమి."

పై యనువాదమునకుముందుఁ జేర్పఁబడిన స్వధర్మప్రకాశినీ పత్రికాసంపాదకులయొక్క వాక్యములచే వారుగూడ, లోగడ నవనాగరకులనుగుఱించి మేము తెలిపిన యభిప్రాయములవిషయమై మాతోడ నేకీభవింతురని స్పష్టమగుచున్నది.

తాము నెలకొల్పిన విద్యావిధానము భారతీయుల మతసాంఘికవిషయములందు విశ్వాసముగల్గి వానికి సేవఁజేయుటకు ఉపకరించుమనుష్యుని నొక్కనినైననుగూడ సిద్ధముఁజేయలేకపోయినదని మెకాలేగారే యొకచోట నంగీకరించియున్నారు; ఆవిధమగు విద్యావిధానముననే యారితేరినవారిలో మిక్కిలి ముఖ్యులని చెప్పఁదగిన శ్రీయుత లాలాలజపతిరాయిగారు సహిత మావిషయమునే యంగీకరించుచు 'స్వరాజ్య' పత్రికలో నీక్రిందిరీతిగ వ్రాసియున్నారు:—

*Indifferent Hindus:—*

"It must be remembered in this connection that Western knowledge, western thought and western mentality took hold of the Hindu mind at a very early period of British rule. The Brahmo Samaj was the first product of it. In the early sixties the Brahmo Samaj was a non-Hindu body, and under its influence, Hindu scholars, thinkers and students were becoming cosmopolitans. Some became Christians, others took atheism and became completely westernised. Thus a wave of indifferentism about Hinduism spread over the country. The Arya Samaj movement (an improved form of Brahmo Samaj) and aggressive Hinduism was a reaction against that un-Hinduism and indifferentism. Most of the early leaders of the Indian National Congress were in this sense non-Hindus. What did Mr. S. N. Banerjea, or Lal Mohan Ghosh, or Ananda Mohan Bhose care for Hinduism? Even Mahadeo Govind Ranade was but an indifferent Hindu. Mr. G. K. Gokhale was not a Hindu at all. I will not mention other names, (Mahatmas and Maharshis of the Modern India.)"

దీని యర్థమేమనఁగా:—"బ్రిటిషుపాలనమున మిక్కిలి కొద్దికాలముననే పాశ్చాత్యవిజ్ఞానమును, పాశ్చాత్యబుద్ధియుఁ, పాశ్చాత్యభావములును, వైదికమతస్థుల

యొక్క బుద్ధుల నావేశించినవనుసంగతి యీసందర్భమున జ్ఞాపకముంచుకొనవలయును. దానివలనఁ గలిగిన మొట్టమొదటిఫలితము బ్రహ్మసమాజము. ప్రారంభములో బ్రహ్మసమాజము వైదికమతముకంటె భిన్నమగు నొకసంఘముగానుండెడిది; దాని ప్రభావమువలన నప్పటి వైదికమతస్థులలోని విద్యార్థులును, విద్యావంతులును, వివేకులును వర్ణసాంకర్యము నొందుచుండెడివారు. కొందఱు క్రైస్తవులైపోయిరి; తక్కినవారు నాస్తికులై పూర్తిగఁ బాశ్చాత్యులక్రిందికి మారిపోయిరి. ఆరీతిగ వైదికమతవిషయమున నొక నిర్లక్ష్యప్రవాహము బయలుదేరి దేశమున వ్యాపించినది. వైదికమతబాహ్యమును, వైదికమతమును దృణీకరించునదియు, నగు పైనదెల్పిన బ్రహ్మసమాజమునకుఁ బ్రతిక్రియ యనఁదగినది (యాబ్రహ్మసమాజమందలి కొన్ని సవరణలచే నేర్పడిన) యార్యసమాజము. దీనినిబట్టి యాలోచింపఁగా, నఖిలభారతజాతీయమహాసభ (ఇండియన్-నేషనల్-కాంగ్రెస్)యొక్క మొదటినాయకులలో మిక్కిలి పెక్కుమంది వైదికమతబాహ్యులే. యస్. యన్. బెనర్జీగారుగాని, లాల్-మోహన్-ఘోష్‌గాని, ఆనందమోహన్ బోస్‌గాని, వైదికమతము నేమి లక్ష్యపెట్టిరి? మహాదేవగోవిందరెనడీ సహితము వైదికమతమును నిర్లక్ష్యముచేసినవాఁడే! శ్రీగోపాలకృష్ణగోఖేల్, వైదికమతస్థుఁడే కాఁడు. తక్కినవారిపేర్లు నేను చెప్పను. (వారు ప్రస్తుతపు భారతవర్షమందలి మహాత్ములును, మహర్షులును.)"

ఇంతవఱకు వ్రాసినదానినిబట్టి నవనాగరకు లెట్టివారో యేర్పడినది. కావున నిఁకముందలి విషయమునకుఁ బోవుదము.

## నవీనచరిత్రలందలి విషయములకును, ప్రాచీనచరిత్రలందలి విషయములకును గల భేదముచే గలిగినకీడు.

ప్రాచీనచరిత్రలందలివిషయములకును, పైరిఫార్మరుల యభిప్రాయములకును పైనదెలిపినరీతిగ మిక్కిలి భేదమేర్పడియుండుటచేఁ బూర్వాచారపరాయణులకును, రిఫార్మరులకునుగూడ మిక్కిలి యభిప్రాయభేద మేర్పడియున్నది. రిఫార్మరులు చేయఁగోరు మతాచారములందలి మార్పులు పూర్వాచారపరాయణుల మనస్సులకు మిక్కిలి కష్టములను గలిగించుచున్నవి. అందుచే నట్టిమార్పులుజరుగఁగూడదని వీరును, జరిగితీరవలయునని రిఫార్మరులును బెనగులాడుచున్నారు. ఎట్లైనను దమకుఁగల పలుకుబడిని, ధనమును, బలమును, వినియోగించి యొకరినొక రవమానింపవలయుననియు, నెట్లైన నెదుటివారినిసాధించి దమమార్గమునకుఁ ద్రిప్పుకొనవలయుననియుఁ దీవ్రముగ యత్నించుచున్నారు. అందులకై ప్రభుత్వసహాయము నపేక్షించుచున్నారు. ప్రస్తుతపు

ప్రభువులు వైదికమతస్థులు గాకపోవుటచేతను, విదేశీయులును, వేఱుమతస్థులు నై యుండుటచేతను, వైదికమతమును సంరక్షించుటలో వారికి శ్రద్ధయుండవలసిన యగత్యము కానరాదు. ఏదోవిధముగ దేశమువారి స్వాధీనములోనుండి వారివారి పాలనకు లోఁబడి యుండుటయే ప్రభుత్వమువారియొక్క సహజమగు ముఖ్యోద్దేశమై యుండుటచేఁ, బ్రజలు వైదికమతస్థులుగ నుండినప్పటికిని, కాక వైదికమతభ్రష్టులై నప్పటికిని గూడ వారికి తొందరలేదు. అందుచేఁ బైనవనాగరకులలోను బూర్వాచారపరాయణులలోను నెవరియొక్క పక్షము బలముగనున్న దొరతనమువారా పక్షమునే చేరుదురు. దానికిఁదోఁడుగఁ బ్రస్తుత విద్యావిధానమునందును నాగరకతలోను నాచారవ్యవహారములందును నవనాగరకులే ప్రభుత్వమువారి కెక్కువదగ్గఱగ నున్నందునవారు స్వల్పసంఖ్యాకులైనప్పటికిని రాజకీయరంగమున మంచి పలుకుబడిని సంపాదించియుండుటచేఁ బ్రభుత్వమువారుగూడ కొంతవఱకు నవనాగరకుల మాటలకే యెక్కువయాదరమును జూపుచుఁ, బూర్వాచారపరాయణు లధికసంఖ్యాకులైనప్పటికిని వారిమాటనంతగా లక్ష్యపెట్టకయున్నారు. ఐనప్పటికిని నిరుకక్షలవారియందును బట్టుదలకు లోపము లేకపోవుటచే నొకరినొకరు తీసిపోక, వారివారి పట్టుదలలను నెగ్గించుకొనుటకు గాఢముగ యత్నించుచున్నారు. ఇట్టి ప్రయత్నములచేఁ బ్రజలలో నైకమత్యముచెడి దేశమునకుఁ బెక్కుకీడులు మూడుచున్నవి. ఇట్టి కీడులకు మూలము వైదికమతవిషయమునఁ బై రెండు కక్షలవారికిని గల యభిప్రాయభేదమేగదా! అట్టి భేదబుద్ధి యేర్పడుటకుఁ గారణము వారివారి చిన్నతనమున వైదికమతమును గుఱించి నవీనచరిత్రలందు రిఫార్మరులు చదివికొనిన విషయములకును, బ్రాచీనచరిత్రలందుఁ బూర్వాచారపరాయణులు చదివికొనిన విషయములకును, మిక్కిలి భేదముండుటయే, ఇట్టి భేదముండుటచేత వానిలో నేచరిత్రలందలి విషయములు సత్యములో, వేనియందలి విషయము లసత్యములో, మొదట మనము తెలిసికొనవలయును. పిమ్మట నట్టి యసత్యవిషయములను సత్యములని నమ్ముటచే మనదేశమున కేవిధమగు కీడువాటిల్లినదో మనము గమనింపవలయును. పిమ్మట నట్టి కీడులు తొలఁగుటకును, నికముందట్టి కీడులు గలుగకుండుటకును, నుపాయము లాలోచింపవలయును. ముందుముందీ విషయములనన్నిఁటిని జక్కఁగాఁ దెలుపుటకే యిపుడీ గ్రంథము వ్రాయఁబడుచున్నది. కావున నవీనచరిత్రలందలి విషయములు సత్యములా, కాక ప్రాచీనచరిత్రలందలి విషయములు సత్యములా యను విషయమును ముందుగా నాలోచింపవలయును. నవీనచరిత్రలు వ్రాసినవారును బ్రాచీనచరిత్రలు వ్రాసినవారును గూడ వైదికమతచరిత్రనుఁగూర్చి యెట్లు తెలిసికొనఁగలిగిరో, యట్టి చరిత్రలను వ్రాయుటకు వారికేమి యాధారముగలదో మనమిపుడు విచారింపవలయును.

## నవీనచరిత్రకారులు.

నవీనచరిత్రలువ్రాసిన విదేశీయపండితులెట్టివారో, మొదట నించుక విచారింతము. ఈజాతివారు మొట్టమొదట వ్యాపారమునిమిత్తమై రెండుమూఁడువందలయేండ్లక్రిందట మనదేశమునకు వచ్చినట్లును పిమ్మటఁ గ్రమక్రమముగ నిచటి రాజులనుజయించి మనదేశము నాక్రమించుకొనినట్లును, తుదకు మనకిప్పుడు ప్రభువులైయున్నట్లును వీరిలోని పండితులువ్రాసిన నవీనచరిత్రలవలననే మనకుఁ దెలియుచున్నది. ఇట్లు క్రొత్తగా మనదేశమునకు వచ్చినపిమ్మట వీరిలోఁ గొందఱికి మనదేశముయొక్క చరిత్ర వ్రాయవలయునని కోరికజనించుటచేఁ గాఁబోలును నందులకుయత్నించిరి. వీరికి మనదేశమును దేశభాషలును గ్రొత్తవి. జనులలోఁ బెక్కుమతభేదములును, నొక్కొక్క మతమునఁ బెక్కు శాఖాభేదములును నుండుటచేతను, దేశీయులతోడి పరిచయము వీరికిఁ దక్కువయగుటచేతను, మనదేశచరిత్ర నెఱుఁగుట కివియన్నియు నంతగాఁ దోడ్పడియుండవు. మనదేశచరిత్రలగు ప్రాచీనచరిత్రలు మన మతగ్రంథములుగూడ నగుటచేతను, పై విదేశీయపండితు లితరమతస్థులగుటచేతను వానియందు వారికంతగా నమ్మకముండియుండదు. ఆకారణముచేతనే మన ప్రాచీనచరిత్రలందలి విషయములను వారేమియు నంతముఖ్యములుగాఁ దలంచినట్లుగానరాదు. అందుచేతనే మన ప్రాచీన గ్రంథములను బెక్కింటిని సంపాదించి పదిలపఱచికూడ యందలిముఖ్యమగు చరిత్ర విషయములను దామువ్రాయుచరిత్రలలోఁ జేర్పరైరి. మన మతగ్రంథములందలి మతరహస్యములును, సాంప్రదాయ విశేషములును వీరికిఁ దిన్నఁగాబోధపడికూడ నుండకపోవచ్చును. మన ప్రాచీనచరిత్రలందలి చరిత్రవిషయములను వీరు వ్రాసినదేశ చరిత్రలలోఁ జేర్పకుండుట కిదియునొకకారణమై యుండవచ్చును. అంతియకాక వీరిలోఁ బెక్కుమంది మన ప్రాచీనచరిత్రలందలి విషయములకు మిక్కిలి విరుద్ధముగా నున్న విషయములనుగూడ గొన్నిఁటిని దామువ్రాసిన దేశచరిత్రలందుఁ జేర్చియున్నారు. ఆవిషయము లేవియో యీగ్రంథముననే ముందుముందు వివరింపఁబడును. అందుచే మన ప్రాచీనచరిత్రలువారికి సరిగా నర్థముగాక, పైగా విపరీతముగా నర్థమయినవని మనము గ్రహింపవలసియున్నది.

## నవీనచరిత్ర లేర్పడినవిధానము.

పైవిషయములనుబట్టి చూడఁగా, మన దేశచరిత్రలను వ్రాయుటకు విదేశీయ పండితులకు మన ప్రాచీనచరిత్ర లేమియుఁ దోడుపడియున్నట్లు గానరాకున్నది. అందుచేతనే కాఁబోలును వారు మనప్రాచీనచరిత్రల నట్టేయుంచి, యితరాధారములకై

తంటాలుపడియుండిరి. ఆయాధారములలో వారికిముఖ్యమైనవి తామ్రశాసనములును, శిలాశాసనములును మొదలగునవియైయున్నవి. వానినేవారు విశేషముగఁబ్రోగుచేసి యందలివిషయములను దమగ్రంథములలోని కెక్కించుకొనియున్నారు. మనదేశ చరిత్రలనువ్రాయుటలో నీశాసనములు వారికెంత యుపయోగకరములుగ నున్నవో విచారించిచూతము. ఈవిదేశీయులు మనదేశమునకురాకపూర్వ మిచటరాజ్యముచేసిన రాజులును గొప్పగొప్పధనవంతులును దామేమయిన గొప్పధర్మకార్యములు చేసినపుడు గాని, శత్రువులనుజయించినపుడుగాని, యందుచేఁ దమకుఁగల్గినకీర్తి భూమిపై చిరకాల ముండవలయుననికోరి, యట్టివిషయములను తాలిపలకలపైనను, రాగిరేకులపైనను శెక్కించుచుండెడివారు. అట్టిశాసనములనే మనవిదేశీయులు ముఖ్యాధారములుగఁ గొనియుండిరి. కాని, యాశాసనములు దేశచరిత్రను దెలుపు నుద్దేశముతో వ్రాయఁబడి నవికావు. అందుచేవానివలన నాకాలపువారు చేసిన దానధర్మములు మొదలగువిషయ ములుమాత్రమే తెలియుటకవకాశముండును గాని దేశచరిత్ర నెఱుఁగుట కవకాశ ముండదుగదా! ఒకవేళ కొంచెమవకాశముండినను, నాశాసనములు వ్రాయఁబడినకాలపు సంగతులును, నంతకుఁగొంచెము పూర్వకాలపుసంగతులును, గొంచెముపిమ్మటికాలపు సంగతులునుమాత్రమే తెలియుటకవకాశముండును. కాని, యంతకంటెఁ బెక్కు వేలేండ్లకు ముందలిసంగతులు తెలియుట కవకాశముండదుగదా! పైశాసనములన్నియు నించుమించుగ మధ్యకాలమునఁ బుట్టినవిగనే గన్పట్టుచున్నవి. కావున నవియైనను వారికి (విదేశీయపండితులకు) మధ్యకాలపుచరిత్ర నెఱుఁగుటలోనేమైనఁ గొంచెము తోడ్పడియుండునేమోకాని, యంతకంటెఁ బూర్వకాలపుచరిత్ర నెఱుఁగుటకునెంత మాత్రమును నాధారములుగాఁజాలవు. పైరీతిగ నాలోచించిచూడఁగా, మనదేశపు ప్రాచీనకాలపు (అనఁగామిక్కిలి పూర్వకాలపు) చరిత్రను దెలిసికొని వ్రాయుటకు విదే శీయుల కేమియుండదగిన యాధారములేదనియే మనము తలంపవలసివచ్చుచున్నది. ఐనచో వారు మనప్రాచీనకాలపుచరిత్ర నెట్లువ్రాసిరనఁగా, దొఱకినశాసనములు మొద లగువానియందలి విషయములను, మనప్రాచీనచరిత్రలలోఁ దమకుఁదెలిసిన విషయ ములతోఁ జేర్చి యటుపై దమయిష్టమువచ్చినట్లెల్ల నూహింపసాగిరి. అట్లువారిలో వారెవరి యిష్టముప్రకారము వారూహాలపై యూహాలనల్లి మనప్రాచీనచరిత్రలందలి విషయములలోఁ దమకుసత్యములని తోఁచినవిషయములనువ్రాసి తక్కినవానిని గల్పి తములనియు నసత్యములనియుఁ ద్రోసిపారవైచిరి. ఆకారణముననే మనప్రాచీనచరిత్ర లందలి విషయములుగూడ కొన్నికొన్ని యీవిదేశీయులువ్రాసిన నవీనచరిత్రలందుఁ గూడ నచ్చటచ్చటఁ గాన్పించుచున్నవి నవీనచరిత్రలీరీతిగఁ గేవలమూహాలపై

నాధారపడియుండుటచేతనే కాఁబోలును వీనియందువ్రాయఁబడిన మనప్రాచీనకాలపు చరిత్ర విషయములకును మనప్రాచీనచరిత్రగ్రంథములందు వ్రాయఁబడినవిషయములకును మిక్కిలి భేదమేర్పడియున్నది.

అంతియకాక పైవిదేశీయులలోఁ గొందఱు ప్రకృతిశాస్త్రము లెఱింగినవారును గలరు. వారిలోఁగొందఱు భూగర్భశాస్త్రమును దెలిసినవారు సహితముగలరు. అట్టివారు మనదేశమునఁ గొన్నికొన్ని ప్రాంతములందు భూమినిమిక్కిలి లోతుగఁద్రవ్వి చూచి యందుండుదొఱకెడి పూర్వకాలపుమనుష్యుల యస్థిపంజరములను (ఎముకల ప్రోవులను) గుండపెంకులను మొదలగువానిని బరీక్షించెదరు. అవిదొఱకిన లోతును బట్టియు వానియందుగన్పట్టెడి గుఱుతులనుబట్టియు మార్పులనుబట్టియు నవియెంత కాలముక్రిందటివై యుండనోపునోయని యూహింప మొదలుపెట్టెదరు. వానియాకారము మొదలగువానినిబట్టి యాకాలమునమనుజు లిట్లుండి యుండవచ్చుననియు, వారిన్ని వేలయేండ్లక్రిందట జీవించియుండవచ్చుననియు వారియెముకలతోఁ బాటు కుండపెంకులుగూడ కొన్నిదొఱకియుండుటచే నాకాలపువారు కుండలనువాడుకొనుట యెఱిఁగినవారై యుండవచ్చుననియుఁ, గావునఁ దామువ్రాయుచరిత్రలలో నాకాలమునకుఁ గుండపెంకులయుగమని పేరుపెట్టవచ్చుననియు—నీవిధముగ నేమేమో వారిబుద్ధికిఁదోఁచినట్లెల్ల నూహించుచుందురు. అట్టియూహలుగూడ నవీనచరిత్రలు వ్రాయుటలో విదేశీయులు కొంతకొంతవఱ కాధారముగఁ గొనియున్నారు. అవియును కేవలమూహలేయగుటచే ననుమానప్రమాణములుమాత్రమే కాఁజాలునుగాని గట్టి యాధారములు కాఁజాలవాయెను. పైవిదేశీయపండితులగు నవీనచరిత్రకారు లెవరి బుద్ధికిఁదోఁచినట్లు వారుసూటిగ జంకునుగొంకును నదురును బెదురును లేక స్వేచ్ఛగా నూహించి మనదేశపు నవీనచరిత్రలను నిర్మించియుండుటచే వారిలోవారికే కొన్ని ముఖ్యవిషయములందు మితిమీరినగొప్పగొప్ప భేదాభిప్రాయము లేర్పడియున్నవి. అట్టివానినన్నిఁటి నెత్తిచూపవలసిన వేఱువేఱుసందర్భములు ముందుముందు పెక్కురానున్నప్పటికిని నిప్పటియీసందర్భమున నుదాహరణముగఁ గొన్నిఁటినీక్రింద స్థాలీపులాక న్యాయముననుసరించి చూపుచున్నాము.

## నవీనచరిత్రకారులు వట్టియూహలపై నాధారపడుటచే వారిలోవారికిఁ గల్గినభేదాభిప్రాయముల కుదాహరణములు.

1. భూగర్భశాస్త్రమెఱిఁగిన విదేశీయపండితులు కొందఱు మనదేశమందలి భూగర్భమునుబరీక్షచేసి యందలివేఱువేఱుభాగము (అనఁగాఁ బొర) లెంత యెంత

కాలము క్రిందనేర్పడియుండునోయని నిశ్చయింపమొదలుపెట్టిరి. వానిలో నొకా నొకభాగమేర్పడిన కాలమునునిర్ణయించుటలో 'వాల్కాట్'(Professor Walcott) అను విదేశీయపండితుఁడు ౭-కోట్ల సంవత్సరములై యుండునని నిర్ణయించెను. దానినే 'మొగ్గీ' (Professor MoGee) యనుపండితుఁడు ౬౦౦-కోట్ల సంవత్సరములై యుండునని నిర్ణయించెను. ఇరువురినిర్ణయములకును భేదము ౫౯౩ కోట్ల సంవత్సరములే సుఁడి! పాపము! వట్టియూహలపైననే యాధారపడి దేశచరిత్రను వ్రాయువారికీపాటికొద్ది భేదమువచ్చుటలో నాశ్చర్యముండరాదు.

2. "మనుష్యజాతి మొట్టమొదటఁ బుట్టినదేశమేది?" యనుచర్చ విదేశీయ పండితులలో బయలుదేరినది. కాని, యావిషయమును నిర్ణయించుటకు వారివారి బుద్ధులుతప్ప వారికేమియుఁ బ్రత్యక్షమయిన యితరాధారములేదు. వారిపూర్వులు మొదట వట్టియనాగరకులుగను, నజ్ఞానులుగను నుండి క్రమక్రమముగ నాగరకతను వృద్ధిచేసికొనుచువచ్చిరని విదేశీయచరిత్రకారులు వ్రాసికొనియున్నారు. అదిసత్యమగుట చేతనే కాఁబోలును మొదటమానవజాతి యెట్లేర్పడినదో, యెచటనేర్పడినదో, యీమొదలగువిషయములను వారిపూర్వులు వ్రాసియుంచఁజాలరైరి. అందుచేనిటీవలి విదేశీయులకు వారిపూర్వులయొక్కయుఁ, బూర్వకాలమునందలి వారిదేశముయొక్కయుఁ జరిత్రలనెఱుఁగుటకు వ్రాతమూలమైన యాధారమేమియుఁ లేదాయెను. కాఁబట్టి వారివారికిఁదోఁచినట్లెల్ల నూహించివ్రాసికొనవలసివచ్చెను. ఎవరిబుద్ధి వారికిఁ బ్రమాణమగుటచేఁ బైవిషయమున లెక్కలేనిసిద్ధాంతములు బయలుదేరెను. ఈవిషయమును 'అర్యన్-క్రేడిల్' (Aryan Cradle— అనఁగా నార్యులను మనుష్యజాతియొక్క యుయ్యెల—[అనఁగా జన్మభూమి]) యనుగ్రంథ మీక్రిందరీతిగ వర్ణించుచున్నది:—

"Tomaschek and others are for Eastern Europe. A few such as Von Loher etc., are for Germany; Fredrich Mullel, Cuno etc., are for central Europe. Linden, Schmidt and others are for Northern Europe, Penka argues that Scandinavia was the Cradle of the whole Aryan race. While Posche maintains that the Aryan race originated in the great Rakitno swamp."

Aryan Cradle p. 35.

అనఁగా:— "టోమశ్చెక్కు :అనుదొరయును మఱికొందఱును యూరప్ ఖండమందలి తూర్పుభాగమనుచున్నారు. 'వాన్‌లోహర్' మొదలైనపండితులు కొందఱు జర్మనీదేశమనుచున్నారు. 'ఫ్రెడ్రిక్ముల్లర్, 'కూనో' మొదలైనవారు మఱి

కొందఱు యూరప్-ఖండమందలి మధ్యభాగమనుచున్నారు. లిండెర్, స్మిట్, మొదలైనవారు యూరప్ ఖండమందలి యుత్తరభాగమనుచున్నారు. 'పెంకా' యను దొర, యార్యజాతికంతటికిని జన్మభూమి 'స్కాండినేవియా' యను దేశమని వాదించుచున్నాడు. ఇది యిట్లుండఁగా 'పోషీ'—యనుదొర 'రాకిటినో' యను లోయలో నార్యులు పుట్టిరని వ్రాయుచున్నాడు."

—ఆర్యన్ క్రేడిల్, పుట 35.

విదేశీయపండితులు తమస్వదేశచరిత్ర నెఱుఁగుటకుఁ గొంచెమైనను వ్రాతమూలములగు నాధారములు లేకపోవుటచే దాని నెఱుఁగుట కిన్నియగచాట్లుపడవలసివచ్చి యుందు దుదకు నొక్కనిశ్చయమునకు రాఁజాలకపోయిరి. ఇట్టి విదేశీయ విద్వాంసులు మనదేశమునకువచ్చి సృష్టి మొదటినుండియుఁ నాగరకులై స్వదేశచరిత్రనుమాత్రమే గాక ప్రపంచచరిత్రనంతనుగూడ వ్రాసియుంచిన మనపూర్వులు దేశచరిత్రను వ్రాసికొనుట యెఱుఁగరని తలంచుట మిక్కిలి చిత్రముగదా! వారితలంపులనే సత్యములుగా నమ్మి, స్వదేశీయులగు నవనాగరకులుగూడ తమ పూర్వులవిషయమై పైరీతిగనే తలంచుట యింకను జిత్రము!

3. పైనఁజెప్పిన సిద్ధాంతము విషయమై విదేశీయపండితులలో నొకరగు యం. డి. సపోర్టా (M. D. Saporta) యను పండితుఁ డార్యులకు జన్మభూమి యుత్తరధ్రువ సముద్రతీరమని యీ క్రిందిరీతిగ వ్రాయుచున్నాఁడు:—

"The entire human race originated on the shores of the polar Sea at a time when the rest of the Northern Hemisphere was too hot to be inhabited by man.

అనఁగా:—"భూగోళమందలి యర్థభాగముగును త్తరభాగము మనుష్య నివాసమునకు యోగ్యముగాక మిక్కిలి వేడిగనున్న కాలమున మానవజాతియంతయును ధ్రువ సముద్రతీరమునఁ బుట్టెను."

ఈసిద్ధాంతము తప్పని సూచించుచు 'రైస్' (Professor Rhys) అనువిద్వాంసుఁడీ క్రిందిరీతిగ ఖండించుచున్నాడు:—

"He explains himself in clear and forcible terms; but how far his hypothesis may satisfy the other students of this fascinating subject, I cannot say."

—Rhy's Hibbert Lectures, Pp. 631-3.

దీని యర్థ మేమనఁగా:— "ఆయన (అనగా 'సపోర్టా' పండితుఁడు) తన సిద్ధాంతమును స్ఫుటములును, దీవ్రములునునగు నుక్తులతో స్థాపించియుండెను. కాని, వైదిక

యుత్పత్తిరహస్యమగు విషయమున సాయనరయొక్క సిద్ధాంత మితరపండితుల నెంతవఱకు మెప్పింపఁగలదో నేను చెప్పఁజాలను."

—'రైస్-హిబ్బర్టు లెక్చర్స్'—అను గ్రంథము పుటలు 631-3.

పైన జూపిన 'సపోర్టా' పండితుని సిద్ధాంతము సరియైనది కాదను నుద్దేశ్యముతో "ఐసక్-టెయిలర్" (Isacc Taylor) అను విద్వాంసుఁడు మనుష్యజాతు లుత్తరమునఁ బుట్టి దక్షిణభూములకు వలసవచ్చుట యబద్ధమని సూచింపుచు నుత్తరభూములందలి జాతులను దక్షిణభూములకుఁ దెచ్చినచో నవి చనిపోవుననియుఁ నదేరీతిగ దక్షిణభూములందలి జాతు లుత్తరదేశమందు మచ్చుమాసిపోవుననియుఁ నీక్రిందిరీతిగ వ్రాయుచున్నాఁడు:—

"As a rule it is found that Northern races die out if transplanted to the south and southern races become extinct in the North."

'టెయిలర్' పండితునియొక్క పైసిద్ధాంతమును బలపఱచుచు, మానవజాతి యుత్తరమునబుట్టి దక్షిణమునకు వచ్చెననుటకుఁ దగినన్ని యాధారములు లేవనియుఁ నుత్తరదేశపుజాతు లీదేశమున జీవించుట యసంభవమనియుఁ 'మ్యాన్యూ్యల్-ఆఫ్-జియాలజీ' యను గ్రంథమున నీక్రిందిరీతిగ వ్రాయఁబడియున్నది:—

"The cases are not sufficiently numerous to indicate any law of migration from north to south; nor is the tendency to survival of Northern races in India universal.'

—Manual of Geology—P. Lxx.

4. ఆర్యుల జన్మభూమి యాసియాఖండపు మధ్యభాగమని (Central Asia-యని) వాదింపుచు, 'ష్లీగల్' (Prof. Schlegal) అను విద్వాంసుఁడు తనవాదము నీక్రిందియుక్తిచే స్థాపించుచున్నాఁడు:—

"It is no wise probable that the migrations which have peopled so large a part of the globe should have commenced at its southern extremity, and have been constantly directed from that point towards North and West. On the contrary, every thing concurs to persuade us that the colonies set out from the central region in divergent direction. According to this supposition, the distances which the colonists would have to travel upto the time of their definite establishment become less immense; the vicissitudes of climate to which they were exposed become less abrupt; and many of the emergent tribes would thus make an advantageous exchange, as regards fertility of so and temperature of the air. And where is this central country to

be sought for, if not in the interior of the great continent in the neighbourhood and to the east of the Caspian Sea?"

—'Origin of the Hindus' by Schlegel.

దీనియర్థ మేమనఁగా:—"భూగోళమందలి యనేకభాగములను మనుష్యులలో నింపిన మనుష్యజాలిసమూహములు దానియొక్క దక్షిణపుకొనను బయలుదేరి యెడ తెగక పశ్చిమముగను నుత్తరముగను వ్యాపించుచుండెనని చెప్పుట యంతయుక్తియుక్తముగాదు. అట్లుగాక, యొక్కమధ్యభాగమునుండి బయలువెడలి మనుష్యజాతులు నలుదిక్కులకును వ్యాపించి నివాసము లేర్పరచుకొనెనని యూహించుటకు సర్వపరిస్థితులును సమ్మతించును. ఇట్టియూహచే వలసపోవువారు వారిగమ్యస్థానములకు నడవవలసిన దూరములు తగ్గిపోవును. వారికిఁ గల్గెడి శీతోష్ణస్థితులందలి మార్పు విశేషముగనుండదు. అట్లే భూమియొక్క సారమందును, శీతోష్ణస్థితులందును విశేషభేదముండదు గావున, నెట్టి పరదేశమునకైనను వారి నివాసమును మార్చుకొనుట లాభకరముగానుండును. ఇట్టిమధ్యదేశము, మహాఖండమధ్యమువ 'కాస్పియన్' సముద్రసమీపమునఁ దూర్పు ప్రక్కగాఁ గాక, మఱెక్కడనుండునుని?"

—హిందువుల జన్మభూమి (ష్లీగల్ వ్రాసినది.)

చూచితిరా! పాశ్చాత్యవిద్వాంసుని యుక్తిబలము! అది విదేశీయులగు, వారి యితరపండితులకే నచ్చకపోవుటచేఁ గాఁబోలును, 'లార్డు-ఎల్ఫిన్‌స్టన్' (Lord Elphinston) అను విదేశీయపండితుఁడు పైవాదము నీక్రిందిరీతిగ ఖండించుచున్నాఁడు:—

"To say that it (emigration) spread from a central point is a gratutious presumption and even contrary to anology; for emigration and civilisation have not spread in a circle but from East to West."

—Lord Elphinston's History of India: P. 95.

అనఁగా:—"వలసపద్ధతి మధ్యస్థానమునుండియే బయలువెడలి నలుముఖములకును వ్యాపించియే యుండవలయుననుట వట్టి దురూహయేగాక, లోకవిరుద్ధము. ఏమనిన, వలసలుపోయినపద్ధతియును, నాగరకతయును, చక్రాకారముగ (గుండ్రముగ) వ్యాపింపలేదు. అవి తూర్పునుండి పడమరకుఁ బ్రసరించినవి."

—(లార్డు-ఎల్ఫిన్‌స్టన్ చే వ్రాయఁబడిన 'ఇండియా' దేశచరిత్ర పుట 95.)

ఇదేవిధముగ, వట్టియూహలపైననే యాధారపడి దేశచరిత్రలు వ్రాసినందున విదేశీయ విద్వాంసులకు గల్గిన భేదాభిప్రాయములకు లెక్కలేని యుదాహరణములను జూపవచ్చును. కాని, గ్రంథవిస్తరభీతిచే మచ్చునకుఁ గొన్ని యుదాహరణములను

మాత్రమే యిచ్చుట చూపితిమి. ఇట్టి యుదాహరణము లింకను బెక్కులీగ్రంథము ననే సందర్భానుసారముగ ముందుముందు విపులముగాఁ జూపఁబడును. విదేశీయపండితులు దేశచరిత్రలు వ్రాసిన విధానమందలి బలాబలములను జూపుటకే పైయుదాహరణములను గైకొని వ్రాసితిమి గాని, వానిలో నేసిద్ధాంతమును గాని ఖలపఱుపఁదలఁచి కాదు. ఏలనన, నన్నియునుగూడ పట్టియూహలపై నాధారపడినవే యగుటచేత నన్నియును సమానముగఁ బరిత్యజింపఁదగినవే. అందు గౌరవింపఁదగిన దొకటియును లేదు.

పైదానినిబట్టిచూడఁగా మనప్రాచీనకాలపు చరిత్రను వ్రాయుటకు విదేశీయులవారియూహాలే ముఖ్యమైన యాధారమని విశదమగుచున్నది. నవీన చరిత్రలువ్రాసిన విదేశీయపండితులను గుఱించియు వారు మనప్రాచీనకాలపు చరిత్రలనువ్రాసిన విధానమును గుఱించియుఁ గొంతకొంత వినిపించియుంటిమి. స్వదేశీయులు వ్రాసిన నవీన చరిత్రల కాధారములు, పైవిదేశీయులు వ్రాసిన నవీనచరిత్రలే యనుటకు నుదాహరణమును, లోగడ, "వైదికమతచరిత్ర నెఱుఁగుట కాధారములు:—ప్రాచీన చరిత్రలు; నవీన చరిత్రలు," నను శీర్షిక్రిందఁ జూపియేయుంటిమి గావున వానియొక్క (అనగా స్వదేశీయులువ్రాసిన నవీనచరిత్రలయొక్క) ముఖ్యతనుగూర్చి వేఱుగఁ జెప్పవలసినదేమియును లేదు.

## ప్రాచీన చరిత్రకారులు.

ఇఁక మన ప్రాచీనచరిత్రలువ్రాసిన మహర్షులెట్టివారో, వారాచరిత్రలనువ్రాసిన విధానమెట్టిదియో కొంచెము విచారించి చూతము.

ప్రాచీనచరిత్రలనుబట్టిచూడఁగా, వానిని వ్రాసిన మహర్షులు మొదలగువారు వైదికమతమునందే పుట్టినవారుగ నున్నారు; మఱియు వైదికమతమునకు మార్గదర్శకులై, తామా మతము నవలంబించినవారు; ఆమత గ్రంథములను శాస్త్రాదులను సమగ్రముగాఁజదివి యామతరహస్యములను సాంప్రదాయ రహస్యములను సామూలాగ్రముగ గుర్తెఱిఁగినవారు; ఇప్పటికిఁ బెక్కువేలేండ్లకు ముందే యీదేశమునఁ బుట్టియుండినవారు; అంతేగాక, కేవల సత్యసంధులు; ధర్మపరాయణులును వైరాగ్య సంపన్నులునగుటచే సంసార సౌఖ్యములను విడనాడి తపస్సు నిమిత్తమై మాత్రమే యరణ్యములకేఁగి నివసించినవారు; తమ తపోమహిమచేఁ త్రికాలజ్ఞానమును, దివ్యదృష్టిని, సంపాదించినవారు; అట్టి జ్ఞానసంపదచేత వారికాలమునఁ జరుగుచున్నసంగతులనేగాక, యంతకుఁ బూర్వ మెంతకాలము క్రిందనో జరిగినసంగతులను, ముందెంతకాలము తరువాతనో రాఁబోవు సంగతులనుగూడ తెలిసికొనెడి శక్తిగలవారు. వారిని గుఱించిన

పైవిషయములన్నియుంను వారు వ్రాసిన ప్రాచీనచరిత్రలవలననే మనకుఁ దెలియవచ్చుచున్నవి. ఇందుకుఁ బ్రమాణములు సందర్భోచితముగ ముందుముందు చూపఁబడును.

## ప్రాచీనచరిత్రకారుల గుణసంపదయెడఁగల సంశయములు; వానికి సమాధానములు.

ప్రాచీనచరిత్రలను వ్రాసిన మహర్షులు పైవిధమగు గుణసంపదగలవారని తెలిసికొనుటకాధారములు వారు వ్రాసిన ప్రాచీనచరిత్రలు మాత్రమే యగుటచే, వారియందును, వారువ్రాయు గ్రంథములందును, లోకమందలి జనులకు నమ్మకమును భక్తియుఁ గల్గుటకై వారు తమను గుఱించి తమ గ్రంథములందుఁ బైరీతిగ నాత్మస్తుతి చేసికొనియుండఁగూడదాయనియు, నంతమాత్రముచే వారట్టి గుణసంపదగలవారేయని లోకమెట్లు నమ్మవచ్చుననియు సంశయములుగలుగవచ్చును. కాని, వారు నిజముగ సదుములుగలవారు కారనియుఁ, బైరీతిగ వారు వ్రాసికొనిన విషయము లబద్ధములనియు మనము తలంచుటకేమైన నాధారముండవలయునుగదా! అట్టి యాధార మేదైననున్నచో మనమట్లు తలంపవలసినదే. కాని, యట్టి యాధార మేమియుఁ గానరాదు. అంతయేల? అట్టిమహర్షులు కొందఱుగలరనియు, వారు మన ప్రాచీనచరిత్రలను వ్రాసియుండిరనియుఁ గూడ మన యీప్రాచీనచరిత్రలు చెప్పుటచేతనే తెలియుచున్నది; కాని, యామహర్షులనుగాని, వారాగ్రంథములను వ్రాయుటఁగాని స్వయముగఁ జూచినవారు మనలోనెవరును లేరుగదా! ప్రాచీనచరిత్రలను మహర్షులు వ్రాసిరని యాచరిత్రలు చెప్పు విషయము సత్యముకాదనియు, నవియబద్ధములను జెప్పుచున్నవనియు ననెడి పక్షమున, నిజముగ నవి యెట్లేర్పడినవో, వానిని వ్రాసిన నిజమగు గ్రంథకర్తలెవరో, యను సంగతులను దెల్పెడి యితరాధారము లేమైన నుండవలయును. అట్టి యాధారము లేమైనఁ గలవా? ప్రాచీన చరిత్రలను వ్రాసినవారు మహర్షులుకారనియు, నితరులెవరో వ్రాసిరనియు, నవి వేఱువిధముగ నేర్పడినవనియు, నితరమగు నెట్టి యాధారముచేతగాని ఋజువుపఱచినవా రెవరును నింతవఱకుఁ గానరారు. అందుచే నాప్రాచీన చరిత్రలు చెప్పిన రీతిగ వానిని మహర్షులే వ్రాసిరను విషయము తప్పక నమ్మవలసివచ్చుచున్నది. వానిని వ్రాసినవారు మహర్షులని యవిచెప్పఁగా నమ్మి, యామహర్షులు పైన దెల్పిన విధమగు గుణసంపదగలవారనికూడ నాచరిత్రలే చెప్పుచుండఁగా, దానిని మాత్రమే నమ్మకయుండుటకుఁ దగిన కారణము గనుబఱచవలయును. అట్టి కారణమేమియుఁ గానరానందున, నావిషయమునుగూడ నమ్మియే తీరవలసివచ్చుచున్నది.

అంతేకాక, వారు కేవలము సత్యమును మాత్రమే వ్రాయువారు. అందుచేతనే వారిలోఁ గొందఱి ప్రవర్తనయం దవమానకరములగు విషయములున్నను వానిని గప్పిపుచ్చికొనక, వారియందలి సద్గుణములతోఁబాటుగ నావిషయములనుగూడ వెల్లడించికొనియేయున్నారు. అష్టాదశమహాపురాణములను వ్రాసిన వేదవ్యాసమహర్షి (బాదరాయణులు) తమతల్లియగు సత్యవతికి వివాహము కాకముందే పరాశరమహర్షివలనఁ దాముపుట్టినట్లును, పిమ్మట నామెను శంతనుఁ డనురాజు వివాహమైనట్లును వ్రాసికొనియున్నారు. ఇట్టిసంగతి జరిగినచోఁ దన కవమానకరమని తలంపక యెవరుఁ డెవడైనను దానిని బ్రకటించుకొనుట కిష్టపడునా? బృహస్పతియను మహర్షియొక్క భార్యయగు తారను జంద్రుఁడు తగులఁగొనిపోఁగా, నామెకు గర్భమై పిదప మగబిడ్డ బుట్టెను. అపుడాబిడ్డ తనకుఁ బుట్టినవాఁడని చంద్రుఁ డనెను. "కాదు; నాకుఁబుట్టిన బిడ్డయే" యని బృహస్పతియనెను. బిడ్డకొఱకై యిరువురును దగవులాడఁ జొచ్చిరి. తగవుఁ దీర్చుటకై బ్రహ్మదేవుఁడు తారనుజూచి "యీబిడ్డ నెవరికిఁ గంటివో నిజము దాపక చెప్పు"మనెను. చంద్రునకే కంటినని తార చెప్పెను. పిదప నాబిడ్డను జంద్రున కిచ్చివైచిరి. తారను దిరిగి బృహస్పతి కప్పించిరి. ఇదియెంత యవమానకరమగు సంగతియో యోజింపుఁడు. నిష్కల్మష హృదయులును, సత్యసంధులును నగు మహర్షులు గాక, యిట్టి సంగతి నాచంద్రార్కముగ నుండునట్లు పురాణములలో గ్రంథస్థము చేసికొనుట కితరు లెవరు సాహసింపఁగలరు? బాదరాయణమహర్షి, కొడుకును బడయఁ గోరి తపస్సుచేసి, పిమ్మట నగ్నికార్యము చేయుటకై యరణిని మథించుచుండఁగా, ఘృతాచి యను నప్సరస యాయనయొక్క కంటఁబడెను. దానిని జూడఁగనే యాయనకుఁ గామముగల్గెనఁట. అందుచే నాయనయొక్క వీర్యము స్ఖలించి యాయరణిలోఁ బడియెనఁట. ఆయన యట్లే మథించుచుండఁగా, నందుండియొక బిడ్డజనించెనఁట. ఆబిడ్డయే శుకమహర్షి యాయెను. ఇది వేదవ్యాసమహర్షి (బాదరాయణులు) కొమారునిగనిన విధానము. ఆమహర్షియే దీనిని స్వయముగ మహాభారతమున వ్రాసికొనియుండెను. ఒకస్త్రీనిజూడఁగాఁ దనకుఁగామము కల్గినచో సిగ్గుపడక దాని నితరులకెవఁడైన దాపకచెప్పికొనునా? అంతియకాక, యందుచే వీర్యము స్ఖలించినచో యా సంగతిని జెప్పికొనుటకు మఱింతసిగ్గుఁ జెందకయుండునా? అంతటితోఁబోక యావిషయములను గ్రంథములో వ్రాసికొనుటకుఁగూడ సాహసించునా? ఇట్టి సందర్భములలో నామహర్షి యెట్టి సత్యధురీణుఁడునుగానిచో నావిషయము లట్లువర్ణించి వ్రాసికొనునా? ఇట్లు స్వవిషయమునను, బరులవిషయమునను గూడ మర్మములను సహితము దాపక యున్నదియున్నట్లు వర్ణించివ్రాసికొనిన యిట్టికథలు మహర్షుల గ్రంథములగు మన

ప్రాచీన చరిత్రలలో నెన్నియోకలవు. కావున వారెట్టి రహస్యమునైనను దాపక ప్రక టించునంతటి సత్యసంధులని స్పష్టమగుచున్నది.

కాని, "యట్లు వ్రాసికొననియెడలఁ దాము సత్యసంధులైనట్లు లోకము తలంప దేమో యని తలఁచి, లోకము నెట్లైనను మోసగించి తాము సత్యసంధులమని యని పించుకొనుటకే, యేమియో యబద్ధములను గల్పించి మహర్షులు వైరీతిగ వ్రాసికొని యుండఁగూడదా?" యని సంశయము గలుగవచ్చుదు. అట్లు సంశయించుటకైనను నేదియేని యాధారముండవలయును గదా! అనఁగా మహర్షులను స్వయముగ నెఱిఁగిన వారెవరైననుండి, యట్టివారు మహర్షులందుఁ బైన దెలిపినవిధమగు కథలు జరిగియుండ లేదనియు, లోకులకు వారియందు నమ్మకము కుదురుటకై వారు స్వవిషయమున నవ మానకరములగు సంగతులను దామేకల్పించుకొని వ్రాసికొనియుండిరనియు, మనకు నిపుడు స్వయముగఁ జెప్పఁగల్గియున్నయడలగాని, కాక, యట్టివారు వ్రాసిపెట్టిపోయిన గ్రంథరూపమగు సాక్ష్యమేమయినను మనకు లభించినయడలగాని, మనము దాని నాధా రము చేసికొని మహర్షులయెడఁ బైవిధమగు దోషారోపణముఁ జేయవచ్చును. కాని, యట్టి యాధారమేమియు లేకపోవుటచే నూరక యనుమానించుట న్యాయ్యముగాదు. కావున నట్టి సంశయమున కవకాశము గానవచ్చుటలేదు.

అంతియగాక, తాము సత్యసంధులని లోకులు నమ్ముటకే మహర్షులు వైరీతిగ స్వవిషయమున నవమానకరములగు నబద్ధములను గల్పించి వ్రాసికొనిరని వాదము నిమి త్తము కొంచెము నేపంగీకరించి చూతము; అందుచే లోకులు వారిని సత్యసంధులుగఁ దలంచి వారి మతమును, మతబోధలను, గ్రహించి యనుసరించెద రనుకొందము; అంత మాత్రముచేత, సంసారసుఖములను సర్వమును విడనాడి తపోవృత్తిచేతను బరమార్థ చింతతోడను గాలము గడపుకొనుచు నడవులలో నివసించు వైరాగ్యధనులగు మహ ర్షులకుఁ గలుగఁగల లాభమేమి? లోకులువారి మతబోధలననుసరించుటచే, నిప్పటి క్రైస్తవ మతబోధకులకు (మిషనరీలకు) వేతనములు (అనఁగా నెలజీతములు) లభించు నట్లే మహర్షులకుఁగూడ నెవ్వరైన వేతనము లిచ్చెదరా? అట్టి యాశయే మహర్షు లకుఁ బ్రధానమైయున్నచో, స్వమతబోధ చేయుఁకొఱకు స్వదేశమును సహితము వదలివచ్చి యన్యమతస్థులను దమ మతములోనికి మార్చుకొనుచున్న యిప్పటి క్రైస్తవ మిషనరీలవలెనే, మహర్షులు సహితము స్వదేశమును వదలి వెడలి పరదేశసంచారము లొనర్చి పరమతస్థుల నెందఱినైనను దమ విజ్ఞానతపోబలములచే స్వమతములోనికి మార్చి పారవైచి వైదికమతమును బ్రపంచమంతటను వ్యాపింపఁజేసి యితర మతము

లను రూపుమాపుటయే గాక నామరహితములుగఁగూడ జేసియుండెడివారే. అట్లుగాక, స్వదేశమగు భరతవర్షమే కర్మభూమి యనియుఁ నదివదలి బాహ్యదేశములకు వెళ్లినచోఁ గర్మభ్రష్టతగలుగుననియుఁ బ్రాయశ్చిత్తము చేసికొనవలసివచ్చుననియుఁ శాసించు శాస్త్రవిధికిఁ గట్టుపడి స్వదేశమును విడువకుండుటయే గాక, సర్వమతములును జీవుని యొక్క శ్రేయోఽభివృద్ధికొఱకే యేర్పడినవనియు నట్టివానిని నశింపఁజేయ యత్నింపరాదనియుఁ జీవుఁడు క్రమక్రమముగ జ్ఞానాభివృద్ధిని జెందుటకే వానిపూర్వపుణ్యానుసారముగ నొక్కొక్క మతమున జన్మించుచుఁ బుణ్యముక్రమముగ నభివృద్ధినొందు కొలఁదిని గ్రమక్రమముగ నుత్తమ మతములందు జన్మింపఁగల్గుననియుఁ, నట్టి మతములన్నిఁటికంటెను వైదికమతమే సర్వోత్కృష్ట మగుటచే నందుఁ జన్మింపఁగల్గినవాఁడితర మతమును బొందుటకు యత్నింపరాదనియుఁ మహర్షులు దృఢముగ నమ్మియుండిరి. ఇతర మతస్థులను వారివారి మతములనుండి భ్రష్టులనుగావించి వైదికమతములోనికి వారిని జేర్చికొనుట కామతమవకాశ మీయకుండుటయే యీమతముయొక్క సర్వోత్కృష్టతను, నామతధర్మములయొక్కయుఁ దత్ప్రవర్తకులగు మహర్షులయొక్కయుఁ బరమతసహనమును వేయినోళ్ల ఘంటాపథముగఁ జాటుచున్నది. పరమతములయెడలనుఁ, బరమతస్థులయెడలను వైదికమతశాస్త్రములకునుఁ దత్ప్రవర్తకులగు మహర్షులకును నెట్టి యౌదార్యమును, సహనమునుగలవో యాసంగతి, యీమతశాస్త్రగ్రంథములలో నొకటియగు స్కాందమహాపురాణమునందలి రెండవభాగమగు సూతసంహితయందు నాలుగవ ఖండమగు యజ్ఞవైభవఖండములోని 'మార్గప్రామాణ్యమ'ను నిరువదిరెండవ యధ్యాయమును, దానికి శ్రీమాధవాచార్యులవారు రచించిన సూతసంహితాతాత్పర్యదీపికయనువ్యాఖ్యానమును నొక్కమారు చదివిచూచినచో విశదముకాఁగలదు. కావున మహర్షులెట్టి స్వలాభమునుగానికోరి వైదికమతధర్మబోధకుఁ గడంగలేదనియుఁ గేవలము లోకముయొక్క శ్రేయముకొఱకే తాము శ్రేయస్కరమనియుఁ సత్యమనియు నమ్మిన మతమును బోధించిరనియుఁ దెలిసికొనవలసియున్నది. అంతియగాక, యెట్టి స్వలాభమును గోరినవాఁడైనను లోకులకుఁ దనయందు నమ్మకము గలుగుటకై స్వవిషయమున నవమానకరములగు సంగతులున్నను వానిని దాచియుంచుకొనక వెల్లడించుకొనునా? అంతియగాక, లేని యబద్ధవిషయములను గూడ గల్పించుకొని తన కవమానకరమగురీతిని గ్రంథస్థముచేసికొనునా? కావునఁ బై విషయములనుబట్టిచూడఁగా బ్రాచీనచరిత్రలను వ్రాసినమహర్షులు స్వవిషయములం దవమానకరములగు సంగతులను గూడ దాపక వ్రాసికొనియుండుటకుఁ గారణము లోకమును నమ్మించి మోసగించి తమ

మతమును వ్యాపింపఁజేసికొనుటకుఁ గాదనియు, వారు కేవల సత్యసంధులును, నిర్మత్సరులును నగుటయే యందుకు ముఖ్యకారణమనియుఁ బ్రాచీనచరిత్రలవలననే రూఢియగుచున్నది. కాని, యీసంగతియబద్ధమనుట కాధారమేమియుఁ గానవచ్చుటలేదు.

అదేరీతిగ మహర్షులు త్రికాలజ్ఞానమును దివ్యదృష్టియుఁగలవారనుసంగతి గూడ ప్రాచీనచరిత్రలలో వ్రాయఁబడినరీతిగ నమ్మఁదగినదేయగుచున్నది. కాని, యిచట నొకసంశయము కలుగవచ్చును. ఏమనఁగా, లోకమున జరిగిపోయినసంగతిని, జరుగఁబోవుసంగతిని జెప్పఁగల్గుట సాధ్యముకాదనియు, నట్లు చెప్పఁగలవారెవ్వరు నుండరనియుఁ గొందఱు సందేహింపవచ్చును. అట్టి సందేహమునకుఁ గారణము తగినంతలోకానుభవము లేకపోవుటయేయని చెప్పఁదగును. ఏలననఁగా, మూఁడు కాలములందలి సంగతులను (అనఁగా జరిగిపోయినకాలమందలియు జరుగుచున్నకాలమందలియు జరుగఁబోవుకాలమందలియు సంగతులను) జెప్పుటకు సాధనములగు జ్యోతిషమును, గేరళమును, బ్రశ్నశాస్త్రమును, శకునశాస్త్రమును, సాముద్రికశాస్త్రమును మొదలగు పెక్కుశాస్త్రములు వైదికమతమునందుఁ గలవు. వాని సహాయముచే రాఁబోవుసంగతులను జరిగినసంగతులను నద్భుతముగఁజెప్పు సామర్థ్యముగలవారీనాఁటికినిగూడ మనదేశమున నెందఱెందఱోగలరు. ఆశాస్త్రములుగాక, యితరములగు క్షుద్రదేవతలనుపాసించివాని సహాయమున నట్టిసంగతులను 'సోది'యను పేరుతోఁ జెప్పఁగల యెఱుకలు మొదలగు హీనజాతులవారుగూడ మనదేశమున నెందఱెందఱోకలరు.

అట్టి మూఁడు కాలములందలి సంగతుల నెఱుఁగుటలోఁ బైనజెప్పిన సాధనముల నన్నిఁటిని మించినది తపశ్శక్తి. మహర్షులందఱికిని నీశక్తి యఱచేతిలోనేయుండెడిది. దీనిచే సాధ్యముగాని విషయము లోకమున నొకటియునుండదు. ఇట్టిశక్తిచే జరిగినసంగతులను, జరుగుచున్నసంగతులను జరుగఁబోవుసంగతులను నెఱుఁగుట యొకవింతగాదు. ఒక మహర్షికిఁ గోపమురాఁగాఁ దనతపశ్శక్తిచే సముద్రమందలి నీటినంతను మూఁడు గ్రుక్కలలో నాచమనము చేసెననియు, మఱియొకమహర్షికిఁ గోపమువచ్చుటచే సృష్టికిఁ బ్రతిసృష్టిచేసి విడచెననియు మనప్రాచీనచరిత్రలు చెప్పుచున్నవి. ఇఁకఁదపశ్శక్తికి లొంగనివిషయమేముండును? అట్టి మహాశక్తిసంపన్నులీకాలమున దురదృష్టవశమున లేనందుచే, నంతమాత్రమున మునుపెన్నఁడునుగూడ నట్టివారుండెడివారను విషయమును మనము నమ్మఁజాలకపోయినచోఁ, గంటితోఁ బ్రత్యక్షముగఁ జూడఁజాలని విషయమును దేనినిగూడ నమ్మఁజాలని దుస్థితికి నీనాఁటి మనజ్ఞానాభివృద్ధి వచ్చియున్నదని

మనము చింతింపవలసినదేగాని, యట్టి శక్తిసామర్థ్యములు గలవారుండు రనుట యసంభవమనియుం నబద్ధమనియుఁ జెప్పుట యుక్తము కాఁజాలదు.

జరిగినట్టియుం జరుగఁబోవునట్టియుం సంగతులను జెప్పఁగలయట్టివిద్య మన దేశమునమాత్రమే గాదు. ఇప్పటి మననవనాగరకుల దృష్టిలో నాగరకదేశములుగా విలసిల్లుచున్న 'యూరప్' (Europe) మొదలగు విదేశములందుఁగూడ గలదు. విదేశీయ భాషాగ్రంథములను విరివిగాఁజదువువారికీ విషయము పెక్కుగ్రంథములలోఁ బెక్కుసందర్భములలోఁ గానవచ్చియేయుండును. ఇందుల కొక్కనిదర్శనముగా, జేమ్స్-దీ-ఫస్టు' (James I) అను నింగ్లీషునాటకమునఁ గథానాయకుఁడగు జేమ్సుయొక్క మరణము జరుగుటకుముందుగ దానిని సూచించుచు నొకరాయనకు శకునము చెప్పినట్లు 'షేక్స్పియర్' మహాకవి వర్ణించియున్నాఁడు. తగినంతలోకానుభవములేని యీ నాఁటి నవనాగరకులకిట్టి విషయము లాశ్చర్యజనకములుగను నసంభవములుగను గన్పట్టునేమోకాని, లోకజ్ఞానముగల పూర్వకాలపు మనదేశీయులకుగాని, విదేశీయులకుఁగాని క్రొత్తలుగావు.

ప్రాచీనచరిత్రకారులగు మహర్షులయొక్క వైవిధమగు గుణసంపదయెడ నవీనచరిత్రకారులగు విదేశీయపండితులకైనను, నేమైనసంశయముగాని విరుద్ధాభిప్రాయముగాని కలదేమో విచారింతము. అట్టి దేదియుఁను గానరాకపోవుట మాత్రమే గాక, వారిలోఁ బెక్కుమందికి మహర్షులందును వారి గ్రంథములందును సదభిప్రాయమును బూజ్యభావమును గలవనుటకు బెక్కునిదర్శనములు గానవచ్చుచున్నవి. ప్రొఫెసర్ మాక్స్మూలర్, ఆనిబిసెంటుదొరసాని, మొదలగు విదేశీయవిద్వాంసులు మన మహర్షులు వ్రాసిన గ్రంథములను బొగడుచువాని నింగ్లీషుమొదలగు విదేశీయభాషలలోనికి భాషాంతరీకరించుకొనియుండిరి. అందుచే విదేశీయపండితులలో సహితము ప్రాజ్ఞులగువారు మహర్షులనుగుఱించి సదభిప్రాయమునే గలిగియున్నారనుట కిది నిదర్శనమగుచున్నది.

## ప్రాచీనచరిత్ర లేర్పడినవిధానము.

మన ప్రాచీనచరిత్రలను వ్రాసిన మహర్షులనుగుఱించి కొంత తెలిసికొంటిమి. వారా చరిత్రలు వ్రాసిన విధానమునుగుఱించి యిపుడు కొంత తెలిసికొందము. ఆచరిత్రలను దామేవిధముగ వ్రాయఁగలిగిరో యాసంగతిని మన మహర్షులు తామువ్రాసిన గ్రంథములందుఁ జెప్పియేయున్నారు. కాని, యాసంగతినే విదేశీయపండితులు వేఱువిధముగ నవీనచరిత్రలందు వ్రాసియున్నారు. ఈకాలమందలి మనదేశస్థులలోఁ బెక్కుమంది తమబాల్యమున మన ప్రాచీనచరిత్రలనుజదివి యెఱుంగకపోవుటచేతను, సంధులకుమారుగ

నవీనచరిత్రలను మాత్రమే చదివినవారగుటచేతను, వానియందుఁ దాము చదివితెలిసికొనిన విధముగనే మన ప్రాచీనచరిత్ర లేర్పడియుండుననివారు పొరపడుచున్నారు. అవి యేర్పడినవిధానమునుగుఱించి మన ప్రాచీనచరిత్రలలో మహర్షులుచెప్పిన విషయమునందు వీరికంతగా నమ్మకములేదు. మీఁదుమిక్కిలి యావిషయమున వీరికిఁ బెక్కుసంశయములుగూడ నేర్పడియున్నవి. అట్లు, మనప్రాచీనచరిత్రలేర్పడిన విధానమునందే వీరికి నమ్మకములేకపోవుటచేతను సంశయములు గలుగుటచేతను నాగ్రంథములందలి ప్రమాణబుద్ధియును గౌరవమును విశ్వాసమును నశించుటకు గట్టియవకాశమేర్పడినది. ఆగ్రంథములే వైదికమతమునకు మూలాధారములగుటచే నామతధర్మములందు సహితము నవనాగరకులకుఁ బ్రమాణబుద్ధియు గౌరవవిశ్వాసములును నశించుటకుఁ గారణమైనది. అందువలననే ప్రస్తుతము వైదికమతస్థులలోఁ బెక్కుమందికి స్వేచ్ఛాప్రవర్తనమునం దభిలాషగలిగి వైదికమతకల్లోలమును దన్మతధర్మవిప్లవమును దటస్థించియున్నవి. దీనికంతకును ముఖ్యకారణము వైదికమతగ్రంథములగు ప్రాచీనచరిత్రలేర్పడిన విధానమునుగుఱించి నవనాగరకులలోఁగలిగిన విరుద్ధాభిప్రాయమే యని పైవిమర్శ వలనఁ దేలుచున్నది.

కావున నిఁకముందు మనము ముఖ్యముగఁ జర్చించి తెలిసికొనవలసిన విషయము ప్రాచీనచరిత్ర లేర్పడినవిధానమే యనుసంగతిని పాఠకులు మఱచిపోక ఈగ్రంథముయొక్క మూఁడవప్రకరణము చివరవఱకును దమదృష్టిలో నిలిపికొనవలయును. అట్లు నిలిపికొనుటచే వైదికమతముయొక్క యథార్థచరిత్ర నెఱుఁగుటకాధారములు ప్రాచీనచరిత్రలా, కాక, నవీనచరిత్రలా యనువిషయమును వారుసరిగా నిర్ణయించుకొనఁగల్గుదురు. సరియగు నాధారమేదియో నిర్ణయించుకొనఁగలిగినపిదప దాని ననుసరించి వైదికమతముయొక్క యథార్థచరిత్రను దెలిసికొనుటకును నామతధర్మములయొక్క ప్రయోజనమును గుర్తెఱుఁగుటకును యథార్థచరిత్రకు మాఱుగ నసత్యచరిత్రను దెలిసికొనుటచే నేర్పడిన యనర్థములను గుర్తించి వానిని బరిత్యజించి లాభమునుబొందుటకును జక్కని యవకాశమేర్పడును.

కాఁబట్టి, ప్రాచీనచరిత్ర లేర్పడినవిధానమును జర్చించుటలో నాచరిత్రలందు మహర్షులుచెప్పిన విధానమును ముందుగవ్రాయుదుము. అటుపై నవీనచరిత్రలందు విదేశీయపండితులు చెప్పినవిధానమును వ్రాయుదుము. ఆరెండువిధానములలో నేదిసత్యమను విషయమునుజర్చించి పిమ్మట నీకాలమందలి మనదేశస్థులకు (నవనాగరకులకుఁ) గల సంశయములను వరుసగవివరించి వానికిఁదగిన సమాధానములను వ్రాయుదుము. ఈగ్రంథమున వ్రాయఁబోవునన్ని ప్రకరణములందును, నందు ముఖ్యముగ మొదటిమూఁడు

ప్రకరణములందును విమర్శనక్రమ మీపైన చెప్పినరీతిగ నేయుండునను సంగతి పాఠకులు జ్ఞాపకముంచుకొనవలయును.

మన ప్రాచీనచరిత్రలను బరీక్షించిచూడఁగా నవి వ్రాయఁబడినవిధ మీక్రింది రీతిగ వానియందే చెప్పఁబడియున్నది:—

మన ప్రాచీనచరిత్రలును వైదికమతగ్రంథములుననగు స్మృతులును, బురాణములును, నితిహాసములును మొదలగు నన్నిగ్రంథములందలి ప్రాపంచకచరిత్ర విషయములకును, వానియందలి ధర్మములకును మూలాధారము వేదము. అనఁగా వేదమునుండియే యాచరిత్ర విషయములను నన్నిధర్మములను మహర్షులు మొదటఁ దెలిసికొనిరి. పిమ్మట వానినే స్మృతులును, బురాణములును, నితిహాసములును మొదలగు గ్రంథములందు వారు వ్రాసియున్నారు. ప్రతిమహర్షియు నిఁచుమించుగ నైయభిప్రాయమునే తన గ్రంథమున గనుపఱచియుండెను. కాని, తాను వేఱువిధముగ నావిషయములను గ్రహించినట్లుగాని, వేఱురీతిగఁ దనగ్రంథమును వ్రాసినట్లుగాని యొక్కమహర్షియైనను నొక్క గ్రంథమునసైనను జెప్పికొనియుండలేదు. ఇందుల కుదాహరణము లాయాగ్రంథములేర్పడినవిధానమును బ్రత్యేకముగ నొక్కొక్కప్రకరణమునఁ జర్చించునపుడు ముందు ముందు సందర్భానుసారముగఁ జూపఁబడును. కావునఁ దొలుదొల్త నావేదమునుగుఱించి కూడ మహర్షులేమిచెప్పిరో కొంచెము విచారించి తెలిసికొందము.

## వే ద ము.

### వేదమునుగుఱించి ప్రాచీనచరిత్రలేమి చెప్పును?

వేదమునుగుఱించి మన ప్రాచీనచరిత్రలందు మహర్షులువ్రాసినకొన్ని ముఖ్యవిషయములిచట నిప్పుడు తెలుపఁబడును; మఱికొన్ని విశేషములు ముందుముందు సందర్భానుసారముగఁ దెలుపఁబడును. వేదమనఁగా, సంస్కృతభాషయందు ఛందశ్శాస్త్రమునకు సంబంధించిన వృత్తములతోడను, స్వరభేదములతోడను, స్వరభేదములకు సంబంధించిన విశేషార్థములతోడను, గూడిన పెక్కుమంత్రముల సమూహము. అది యేర్పడిన విధానమునుగుఱించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పునో తెలిసికొందము.

### వేద మపౌరుషేయమనుటకుఁ బ్రాచీనచరిత్రలనుండి ప్రమాణములు.

(౧) పరాశరమహర్షి తానువ్రాసిన ధర్మశాస్త్రములో, (అనఁగాఁ బరాశర స్మృతిలో) వేదమునుగుఱించి ఈక్రిందిరీతిగ వ్రాసియున్నారు:—

శ్లో. నకశ్చి ద్వేదకర్తాచ, వేదంస్మృత్వా చతుర్ముఖః.
తథైవ ధర్మాన్ స్మరతి; మనుఃకల్పాంతరేఽంతరే.

వేదమునకంతకును భాష్యమును రచించినట్టియు, శ్రీవిద్యారణ్యస్వాములను పేరుగలిగినట్టియు, మాధవాచార్యులవారీ పరాశరస్మృతికిఁ 'పరాశరమాధవీయ'మను పేరనొకవ్యాఖ్య వ్రాసియున్నారు. అందుఁ బైనజూపిన శ్లోకమునకు వ్యాఖ్యవ్రాయఁ బోవుచు, వారుముం దీక్రిందిరీతిగ నవతారికను బ్రారంభించియున్నారు:—

"స్మృతినిర్ణేతౄణాం మన్వాదీనాం స్మృతికర్తృత్వ దర్శనాత్, తథైవ శ్రుతినిర్ణేతౄణా మపి వేద కర్తృత్వ మాశంక్య నిరాచష్టే'నకశ్చిది'తి. నతావ ద్వ్యాసో వేదకర్తా, తస్య విభాగమాత్ర కారిత్వాత్; నాపి చతుర్ముఖః, ఈశ్వరేణ చతుర్ముఖాయ వేదప్రదానాత్; నాపి జగదీశ్వరః, తస్య వేదాభివ్యంజకత్వాత్; తదు క్తం మత్స్యపురాణే:

"అస్య సర్వస్య ధర్మజ్ఞః, కల్పాదౌ పరమేశ్వరః
వ్యంజకః కేవలం విప్రా, నైవ కర్తా నసంశయః.
బ్రహ్మాణం మునయః పూర్వం, సృష్ట్వా తస్మై మహేశ్వరః
దత్త్వా నఖిలా న్వేదాన్, విప్రా ఆత్మనిసుస్థితాన్."

........ ఇతరేషాంతు తత్కర్తృత్వం దూరాపాస్తమ్. ఉపపత్తయస్తు వేదాపౌరుషేయత్వాధికరణే ద్రష్టవ్యాః.

పైయవతారిక కర్థమేమనఁగా:—"స్మృతుల నేర్పఱచిన మనువు మొదలగువారా స్మృతులకుఁ గర్తలుగదా! అదేవిధముగ శ్రుతిని (అనఁగా వేదమును) గూడ నేర్పఱచిన కర్తలెవరోయుందురని జనులనుకొనెదరేమోయని పరాశరమహర్షి యనుమానపడి, వేదమున కట్టికర్త యెవ్వఁడునులేఁడని, 'నకశ్చిద్వేద కర్తాచ'యను పైశ్లోకమునఁజెప్పఁ బోవుచున్నాఁడు. వ్యాసుఁడు వేదకర్తయని చెప్పఁగూడదాయనినఁ, జెప్పఁగూడదు; ఎందువలననఁగా, వేదములనాయన విభాగముమాత్రమేచేసెను (అనఁగావిడఁదీసి నాల్గుభాగములను మాత్రమేచేసెనుగాని, యాయనగూడ వేదము నేర్పఱచినవాఁడు కాఁడు.) అట్లేచతుర్ముఖుఁడును (అనఁగా బ్రహ్మదేవుఁడుగూడ) వేదములకుఁగర్త కాఁడు.ఏలననఁగా, నాయనకు వేదముల నీశ్వరుఁడిచ్చెనేగాని, బ్రహ్మయునువాని నేర్ప ఱచియుండలేదు. పోనిండు; ఈశ్వరుఁడు వేదమునకుఁ గర్తయనియైనను జెప్పరాదా యనిన నట్లును జెప్పరాదు. ఏలననఁగా, నీశ్వరుఁడు తనయందనాదిగ నున్న వేదములను బ్రహ్మకుబోధించి, వానిని బ్రకాశింపఁజేసెనేగాని, తానునువానిని నిర్మించియుండ లేదు. ఈయభిప్రాయమునే మత్స్యపురాణముగూడ 'అస్యసర్వస్య ధర్మజ్ఞః' అను

శ్లోకములోను, 'బ్రహ్మాణం మునయః పూర్వమ్' అనుశ్లోకములోను జెప్పియున్నది. (ఈశ్లోకములురెండును బైయవతారికలోఁ జూపియున్నారు. వీనియర్థమేమనఁగాఁ:— 'ప్రపంచసృష్టికి మొదట ధర్మజ్ఞుఁడగు పరమేశ్వరుఁడు ధర్మములతోనిండిన వేదమునకంతటికిని వ్యంజకుఁడు (అనఁగావానిని వ్యక్తపఱచువాఁడు; తెలియఁజేయువాఁడు) మాత్రమేయైయున్నాఁడు; కాని, కర్తకాఁడు; సంశయములేదు. పరమేశ్వరుఁడు బ్రహ్మను మొదటసృష్టించి, తనయందుసుస్థిరములైయున్న సకలవేదములను సాయనకిచ్చెను.' అనిపైరెండు శ్లోకములకునర్థము.)

......... కాఁబట్టి యితరులకుఁగూడ వేదకర్తృత్వములేదని తేలినది; ఇందులకుపపత్తులు చూడఁగోరువారు 'వేదాపౌరుషేయత్వాధికరణము' నందుఁజూడఁదగును."

ఈరీతిగముందుగ నవతారికవ్రాసి, పిమ్మట శ్రీమాధవాచార్యులవారు పరాశరస్మృతిలోని "నకశ్చిద్వేదకర్తాచ" యని పైనజూపినశ్లోకమున కీక్రిందిరీతిగ వ్యాఖ్యానమును బ్రారంభించియున్నారు:—

"కర్తా నకోఽపి వేదస్యాస్తి, 'చ'శబ్దార్థో వర్తమానో వైలక్షణ్యమాహ. సన్తిహి బహవ శ్చతుర్ముఖ మను ప్రభృతయ స్స్మృతి కర్తారః; వేదకర్తా నకోఽపీతి వైలక్షణ్యమ్ ............... చతుర్ముఖ స్తస్మి న్మహాకల్పే పరమేశ్వరేణ దత్తం వేదంస్మృత్వా, తత్ర విప్రకీర్ణే వర్ణాశ్రమధర్మాన్ పరికల్ప్య స్మృతిగ్రంథరూపేణోపనిబధ్నాతి......చతుర్ముఖస్య స్మృతిశాస్త్రకర్తృత్వం మనునాప్యుక్తమ్:

"ఇదం శాస్త్రంతు కృత్వాఽసౌ, మామేవ స్వయమాదితః
విధివద్గ్రాహయామాస, మరీచ్యాదీ నహంమునీన్."

యథా చతుర్ముఖః, తథైవ స్వాయంభువో మనుః తస్మిం స్తస్మి న్నవాంతరే కల్పే వేదోక్తధర్మాన్ గ్రథ్నాతి. మనుగ్రహణేన అత్ర యాజ్ఞవల్క్య విష్ణ్వాదయ ఉపలక్ష్యంతే."

ఈవ్యాఖ్యానమున కర్థమేమనఁగా:— వేదమునకుఁగర్త యొకానొకఁడు లేఁడు. 'చ' కారమును బైశ్లోకమునవాడుటవలన నొకవిలక్షణమగు నర్థముగనుపించును; ఏమనఁగాఁ, జతుర్ముఖుఁడును, మనువును, మొదలగుస్మృతికర్తలుగలరు; కాని వేదమునకుఁగర్త యొకఁడునుగూడలేడని విలక్షణార్థము. సృష్టికి మొదటఁబరమేశ్వరుఁడిచ్చినవేదమును జతుర్ముఖుఁడుస్మరించి, దానియందునిండియున్న వర్ణాశ్రమధర్మముల నొక్కచోటఁజేర్చి, యొకస్మృతిగ్రంథమును గావించెను. ఈసంగతినే, "ఇదం శాస్త్రంతు కృత్వాఽసౌ" అనుశ్లోకములో మనువుగూడఁజెప్పియున్నాఁడు. (ఈశ్లో

కము, పైవ్యాఖ్యలో వ్రాసియున్నారు. దీనియర్థమేమనఁగా, "నీధర్మశాస్త్రమును (జతుర్ముఖుఁడు) మొదటరచించి నాకిచ్చెను; నేను మరీచ్యాదులకిచ్చితిని" యని యర్థము. చతుర్ముఖుఁడు ప్రతిబ్రహ్మకల్పము మొదటను వేదమందలి ధర్మములనొకచోటఁ గూర్చుచున్నట్లే, స్వాయంభువ మనువుగూడ, నాయాయవాంతర కల్పములలో వానినిగూర్చుచున్నాఁడు. మనువుచెప్పుటచేఁ దక్కినయాజ్ఞవల్క్యుఁడు మొదలగు వారుగూడ ధర్మశాస్త్రములను వ్రాయుచుందురని తాత్పర్యము."

ఇది పైవ్యాఖ్యానమునకర్థము. మఱియును వేదవ్యాసమహర్షి తానువ్రాసిన స్కాందపురాణములో సూతసంహితయనుభాగమున వేదముగుఱించి యీక్రిందిరీతిగఁ గూడ వ్రాసియున్నారు:—

"బ్రహ్మాణం మునయః పూర్వం, సృష్ట్వా తస్మై మహేశ్వరః,
దత్తవా నఖిలాన్వేదా, నాత్మన్యేవ స్థితానిమాన్."

పైశ్లోకమునకుఁగూడ శ్రీమాధవాచార్యులవారే ఈక్రిందిరీతిగ వ్యాఖ్యానమును వ్రాసిరి:—

"స్వయమేవలీలయా సకలవేదగ్రహణసమర్థం బ్రహ్మాణంనిర్మాయ, స్వాత్మని నిత్యమవస్థితా ఏవ వేదాస్తస్మై దత్తా ఇత్యర్థః. నచ నిత్యసిద్ధ వేదసమర్పణే శివస్యోపాధ్యాయతుల్యతా; ఉపాధ్యాయో హి స్వయమన్యతోలబ్ధ్వా శిష్యా నధ్యాపయతి; శివస్తు నైవ మన్యతోఽధీతే. స్వాత్మని నిత్య మవస్థితానామేవ తేషాం బ్రహ్మద్వారా సాంప్రదాయం ప్రవర్తయతి. 'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యో వై వేదాంశ్చ ప్రహిణోతితస్మై'. ఇతి స్థితానా మేవవేదానాం ప్రాపణశ్రుతేః."

ఈవ్యాఖ్య కర్థమేమనఁగా:— "వేదమునంతను గ్రహించుటకు బ్రహ్మసమర్థుఁడగునట్లుగ నతనినిబరశివుఁడు తానేస్వయముగ విలాసముతోనిర్మించి, తనయందు నిత్యముగ నున్నవేదములనే యాబ్రహ్మకిచ్చెను. నిత్యములైయున్నవానినే యాపరమేశ్వరుఁ డిచ్చియుండుటచే, నీశ్వరుని ఉపాధ్యాయుఁడని చెప్పుటకుఁగూడ వీలులేదు. ఎలననఁగా, నుపాధ్యాయుఁడు శిష్యులకొకవిద్య నేర్పుటకుముందు తానుదాని నితరులవలన నేర్చికొనియుండును. కాని, పరమేశ్వరుండు వేదమునట్లితరులవలన నేర్చికొనియుండలేదు. తనయందే నిత్యములుగానున్న వేదములకు బ్రహ్మద్వారా సంప్రదాయమేర్పఱచెను. ఈసంగతినే 'యో బ్రహ్మాణం .........తస్మై' అని పైనఁజూపిన శ్రుతిగూడఁజెప్పుచున్నది."

పైభావమునే, "అస్యమహతో భూతస్య .....సామవేదః" యనుమఱియొకశ్రుతిగూడ చెప్పుచున్నది. దీనియర్థమేమనఁగా:

"పరమేశ్వరునియొక్క నిశ్శ్వసితమే (అనఁగా నిట్టూరుపే) ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదములైనది" యనియర్థము. శరీరములోపలినుండి యప్రయత్నముగను స్వయముగను బయలుదేరివచ్చెడి నిట్టూర్పుయొక్క యుపమానముచే వేదము స్వయముగబయలుదేరి పరమాత్మనుండి బయటికివచ్చినదేకాని, పరమేశ్వరుఁడుసహితము దానినిగోరి స్వయముగఁ గల్పించియుండలేదని పైశ్రుతియొక్క తాత్పర్యము.

కావున, వేదము మనుష్యులెవ్వరును వ్రాసినదికాదనియుఁ బరమేశ్వరునివలన నీయఁబడినదనియుఁ, గాని పరమేశ్వరుఁడుకూడ దానికిఁగర్తకాఁడనియుఁ బైమహర్షులు మొదలగువారు వ్రాసినగ్రంథములుమాత్రమేగాక, వేదముగూడ నట్లే సాక్ష్యమిచ్చుచున్నదని పైన బ్రమాణములుగఁజూపఁబడిన రెండు శ్రుతులవలనను రూఢియగుచున్నది. ఈవిషయమునే "సూర్యసిద్ధాంతమను" జ్యోతిశ్శాస్త్రగ్రంథము కూడ ఈక్రిందిరీతిగఁ జెప్పుచున్నది:—

"త్రిపాద మమృతం గుహ్యం, పాదోఽయం ప్రకటోఽభవత్,
సోఽహంకారం జగత్సృష్ట్యై, బ్రహ్మాణ మసృజత్ప్రభుః.
తస్మై వేదాన్ వరాన్ దత్వా, సర్వలోక పితామహమ్,
ప్రతిష్ఠా ప్యాండమధ్యేఽథ, స్వయం పర్యేతిభావయన్."

దీనియర్థమేమనఁగా:—"బరమపదస్థానము నాల్గుపాదములు గలిగియున్నది. వానిలో మూఁడుపాదములు ప్రకటములుగాక గుహ్యములైయున్నవి. మిగిలిన యొక పాదముమాత్రము ప్రకటమైనది. అట్టిపరమాత్మయే జగన్నిర్మాణముకొఱకు నహంకారస్వరూపుఁడగు బ్రహ్మనుసృష్టించెను. పిదప నెల్లలోకములకును సృష్టికర్తయగు నాబ్రహ్మకువేదములనిచ్చి యాయనను బ్రహ్మాండముయొక్క మధ్యప్రతిష్ఠించి, యావేదములుచెప్పినచొప్పున సృష్టిసేయవలసినదని యాయనకాజ్ఞాపించెను."

మఱియును, వేదమునుగుఱించి స్వాయంభువమనువు మనుస్మృతిలో మొదటి యధ్యాయమున మహర్షుల కీక్రిందిరీతిగఁ జెప్పియున్నాఁడు:—

"అగ్నివాయు రవిభ్యస్తు త్రయం బ్రహ్మసనాతనమ్,
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థం ఋగ్యజుస్సామలక్షణమ్.

(మనుస్మృతి, అధ్యా. ౧. శ్లో. ౨౩.)

దీనితాత్పర్యమేమనఁగా:—పరమేశ్వరుఁడు యజ్ఞములు వేదములచే నెరవేర్పఁదగినవైనందున, నాయజ్ఞములనిమిత్తమై 'సనాతనములైన' ఋగ్యజుస్సామములనెడి వేదములనుమూఁడిఁటిని, నగ్నివాయు సూర్యులకడనుండి గ్రహించెను.

పైశ్లోకమందలి 'సనాతనమ'ను పదమునకు 'గురుబాలప్రబోధిక' యనునిఘంటు వీక్రిందియర్థమును జెప్పుచున్నది:—

"సదా౽భవః సదాతనః, సనాతనశ్చ." అనఁగాఁ బుట్టుకగాని నాశనముగాని లేక యెల్లప్పుడునుండునది యనియర్థము. ఈయర్థమునే మనుస్మృతిలోనిపైశ్లోకము యొక్కవాఖ్యలోఁ గుల్లూకభట్టను వాఖ్యాత యీక్రిందిరీతిగ ద్రువపఱచుచు న్నాఁడు:—

"* * * * * సనాతనం నిత్యం; వేదాపౌరుషేయత్వ పక్షఏవ మనోరభిమతః. * * * *"

అనఁగా, 'సనాతనమ'నుపదమునకు 'నిత్యమ'ని యర్థమనియు, వేదమపౌరుషేయమనుటయే మనువుయొక్క యభిప్రాయమనియుఁ బై వ్యాఖ్యానమునకర్థము. ఈ విషయమై విశేషము తెలియఁగోరువారు మనుస్మృతి ౧౨-వ యధ్యాయములో 'వేద ప్రశంస' యనుశీర్షిక క్రిందఁ జూడవచ్చును.

ఇట్టిప్రమాణములను మనప్రాచీనచరిత్రలనుండి వేలకొలఁది యెత్తిచూపవచ్చును. కాని గ్రంథవిస్తరభీతిచేఁ గొన్నిఁటినిమాత్రముచూపి యీవిషయమింతట విరమించుచున్నాము.

## వేదమపౌరుషేయమని చెప్పినప్రామాణికులకుఁగల గౌరవాతిశయము.

ఇంతవఱకువ్రాసినదానివలన, వేదమునకుఁ గర్తయెవ్వఁడునులేఁడని తేలుటయే గాక, వేదమును మొదటబ్రహ్మదేవునకుఁ బరమేశ్వరుఁడిచ్చెననియును, నందలిధర్మములనెల్లఁ బ్రోగుచేసి, వానితో బ్రహ్మ యొకధర్మశాస్త్రమునునిర్మించి మనువునకిచ్చెననియును, మనువు మరలదానిని మరీచి మొదలగుమహర్షులకిచ్చె ననియునుగూడ తేలినది.

ఈయర్థమును, (౧) స్వాయంభువమనువు తానువ్రాసిన మనుస్మృతిలోను, (౨) బరాశరమహర్షి పరాశరస్మృతిలోను, (3) ద్వైపాయనమహర్షి (అనఁగా వేదవ్యాసమహర్షి) మత్స్యపురాణమునందును, స్కాందపురాణమునందలి సూతసంహితయందును, (౪) శ్రీమాధవాచార్యులవారు తాము పరాశరస్మృతికివ్రాసిన 'పరాశరమాధవీయమ'ను భాష్యమునందును, సూతసంహితకు వ్రాసినవ్యాఖ్యయందును వ్రాసియున్నారని మనము తెలిసికొనియుంటిమిగదా! వీరికిని వేదమునకును గలసంబంధమును వీరికిఁగల పేరుప్రతిష్ఠలను విచారింతము.

వీరినల్గురిలో మొదటివారు (అనఁగా స్వాయంభువమనువు) వేదమును, నందలి ధర్మములను స్వయముగ బ్రహ్మదేవునివలననే తెలిసికొనియున్నవారు. రెండవవారు అనఁగా (పరాశరమహర్షి) పుత్రపౌత్రగురుశిష్య పారంపర్యము గలుగవచ్చువేదములను, వేదాంగములను, నభ్యసించినవారు; మఱియును వీరు బ్రహ్మదేవునకు నాల్గవ తరము (పురుషాంతరము) లోనివారు. (అనఁగా మునిమనువులు.) ఇఁక మూఁడవవారగు ద్వైపాయనమహర్షి పైపరాశర మహర్షులకుఁబుత్రులు. అనఁగా బ్రహ్మదేవుని కైశవ తరములోనివారు; మఱియును నీకలియుగమునఁ బుట్టుచున్న యల్పాయువులగు వారికుపయోగముకొఱకు వేదమును నాల్గుభాగములుగ విడదీయుటకై యవతరించిన శ్రీమన్నారాయణదేవుని యవతారమని చెప్పఁబడుచున్నవారు; వేదమునుజదువుటకు స్త్రీలకును, శూద్రులు మొదలగువారికిని నధికారములేకపోవుటచే, వారల యుపయోగముకొఱకై వేదమందలియర్థమునంతను మహాభారతమునందును, పదునెనిమిది మహాపురాణములందును వ్రాసినమహనీయులీద్వైపాయన మహర్షియే. వేదమును విడదీసినవారగుటచే వీరిని వేదవ్యాసులనికూడ చెప్పుదురు. వీరినిగుఱించి పైన మేము తెలిపినయభిప్రాయము నీక్రిందిరీతిగ శ్రీభాగవతపురాణము వర్ణించిచెప్పుచున్నది:—

"వ. అనియడిగిన శౌనకాదిమునిశ్రేష్ఠులకు సూతుండిట్లనియె; 'తృతీయంబయిన ద్వాపరయుగంబు దిరుగుసమయంబున నుపరిచరువసు వసువువీర్యంబున జన్మించి వాసవి నాఁదగు సత్యవతియందుఁ బరాశరునకు హరికళంజేసి విజ్ఞానియైన వేదవ్యాసుండుజన్మించి యొక్కనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీజలంబుల స్నానాదికర్మంబులందీర్చి శుచియై పరులులేనిచోట నొంటిఁగూర్చుండి సూర్యోదయవేళ నతీతానాగతవర్తమానజ్ఞుండైన యాఋషి, "వ్యక్తంబుగాని వేగంబునంగల కాలంబునంజేసి యుగధర్మంబులకు హితంబుగా భువిసాంకర్యంబునొందు; యుగయుగంబుల భౌతిక శరీరములకు శక్తిసన్నమగుఁ; బురుషులునిస్సత్త్వులు, ధైర్యశూన్యులు, మందప్రజ్ఞులు నల్పాయువులు, దుర్బలురు, నయ్యెద"రని తనదివ్యదృష్టిం జూచి, సర్వవర్ణాశ్రమధర్మంబులకు హితంబుసేయందలంచి, నలువురుహోతలచేత ననుష్ఠింపందగి ప్రజలకు శుద్ధికరంబులైన వైదికకర్మంబులగు యజ్ఞంబు లెడతెగకుండుకొఱకు నేకంబయిన వేదంబు ఋగ్యజుస్సామాథర్వంబు లనునాలుగు నామంబులవిభాగించి, యితిహాసపురాణంబులన్నియుఁ బంచమవేదంబనిపల్కె; నందు:

సీ. పైలుండు ఋగ్వేదపఠనంబు దొరకొనె, సామంబు జైమిని చదువుచుండె;
యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ, దుది నథర్వము సమంతుఁడు పఠించె;

నఖిల పురాణేతిహాసముల్ మాతండ్రి, రోమహర్షణుఁడు నిరూఢిఁదాల్చెఁ;
దమతమ వేద మాతపసులు భాగించి, శిష్యసంఘములకుఁ జెప్పిరంత
తే. శిష్యు లొండొరు లాత్మీయ శిష్యజనుల, కంత బహుమార్గములయందు ననుమతింపఁ
బెక్కుశాఖలుగలిగి యీపృథివిలోన, నిగమ మొప్పారె భూసురనివహమందు.

వ. ఇట్లు మేధామానసులయిన పురుషులచేత నట్టి వేదంబులు ధరియింపంబడుచున్నవి. మఱియును దీనవత్సలుండయిన వ్యాసుండు స్త్రీశూద్రులకుం ద్రైవర్ణికాధములకు వేదంబులు విన నర్హంబులు కావు గావున మూఢులకెల్ల మేలగునని భారతాఖ్యానంబు చేసియుం నమ్ముని భూతహితమందుఁ దనహృదయంబు సంతసింపకున్న......"

(శ్రీమదాంధ్ర మహాభాగవతము—ప్రథమస్కంధము.)

వేదమునుగుఱించి లోగడ మేము తెలిపిన యభిప్రాయము నేవ్రాసిన మొదటి మువ్వురినిగూర్చి తెలిపికొంటిమి. ఇఁక నాల్గవవారగు శ్రీమాధవాచార్యుల వారినిగుఱించి కొంచెము తెలిసికొందము. వీరు నాలుగువేదములకును భాష్యమువ్రాసి జగద్విఖ్యాతినిగాంచిన పండితశిఖామణులు; సంస్కృతభాషయం దనేక యుద్గ్రంథములకు వ్యాఖ్యానములను, బెక్కుశాస్త్రములలోఁ గ్రొత్తగ్రంథములనువ్రాసె, వీరికిఁదెలియని విద్యయేదియును లోకమున లేదని పండితులెల్లరును మెచ్చుకొనునట్లు తమసర్వతోముఖపాండిత్యమును దేశమున వెదఁజల్లి యందుమూలమున 'విద్యారణ్యుల'ను పౌరుషనామమును సంపాదించిన మహనీయులు. భారతవర్షమందలి దక్షిణభాగము మహమ్మదీయులు మొదలగు విదేశీయులయొక్కయు మతాంతరులయొక్కయు దండయాత్రలకులోనై యచటివైదికమతము విప్లవముపాలుగా నున్నసమయమున నాదండయాత్రలనరికట్టుటకును వైదికధర్మములనుద్ధరించుటకును విజయనగర సామ్రాజ్యసంస్థాపనకు శంకుస్థాపనము జేసి యాసామ్రాజ్యాధిపతులకుఁ బ్రధాన మంత్రిత్వమునువహించి రాజ్యాంగచక్రమును నడపుటయేగాక, శ్రీశృంగగిరి (శృంగేరి) జగద్గురు పీఠాధిపత్యమునుసహితము వహించి (యాపీఠాధిపతుల పరంపరలోఁ బండ్రెండవ వారై) వైదికమతపరిపాలనమును గావించిన యతిసార్వభౌములు. వీరివిషయమై సహజగౌరవమునుజూపు పూర్వాచారపరాయణుల యభిప్రాయమును మాత్రమేగాక, వీరినిగుఱించి నవనాగరకులలో నగ్రగణ్యులగువారొక రొసఁగిన సదభిప్రాయమునుగూడ యీదిగువ నుదాహరించుచున్నాము. వీరినిగుఱించి 'స్వధర్మప్రకాశినీ' పత్రికాధిపతులుతమపత్రికయొక్క క్రోధనసంవత్సర సంచికలో నొకదానియం దీక్రిందరీతిగ వ్రాయుచు దానికనుగుణ్యముగ, 'హిందూదేశ కథాసంగ్రహ' గ్రంథకర్తలును సుప్రసిద్ధ నవీనచరిత్రకారులును, నవనాగరకులునునగు శ్రీ. శే. కొమఱ్ఱాజు—వేంకట లక్ష్మణ

రావు పంతులు, ఎం. ఏ., గారియొక్క యభిప్రాయమునుగూడ జేర్చియున్నారు; చూడుఁడు, స్వధర్మప్రకాశినిలో:—

"మాధవ విద్యారణ్యుఁడు.—'విద్యారణ్యులను' నామమును అన్వర్థముగ వహించి నాల్గువేదములకు సమగ్రముగ భాష్యమునురచించి సంస్కృతభాషయందుఁగల సకలవిద్యలయందును బగదుపకారములగు ననేకగ్రంథములను స్వయముగ రచించి, మ్లేచ్ఛులబారినుండి స్వదేశస్వమతములు రూపుమాయకుండుటకయి దక్షిణ హిందూస్థానమునందు విజయనగరసామ్రాజ్యమును సంస్థాపించి స్వార్థరాహిత్యముగ సామ్రాజ్య భారమునంతయుం, నాచార్యుఁడును, మంత్రియుఁను, సైన్యాధిపతియుం, హితోపదేష్టయుంనై భరించి శతాధికవర్షజీవియయి, వాసిగాంచిన విద్యారణ్యుల వారు ... ........ మాధవ విద్యారణ్యునిగూర్చి మాయభిప్రాయమును దెలుపుట కంటె, కీర్తిశేషులును మామిత్రులునుఅగు కొ. వెం. లక్ష్మణరావుపంతులుగారు, (హిందూదేశ కథాసంగ్రహము—మహమ్మదీయ మహాయుగము, 209-31 పుటలందు) మాధవ విద్యారణ్యులనుగూర్చి వ్రాసినవ్రాత నీక్రింద వ్రాయుచున్నాఁడను:

మాధవ విద్యారణ్యులు.

"సకలవిద్యలసారమును, రాజ్యనిర్మాణ కర్తృత్వమును, లౌకిక వైదికవ్యవహార నిపుణతయుం, స్వధర్మరక్తియుం, స్వదేశజనభక్తియుం, అనుపమేయ వైరాగ్యమును ఏకీభవించి మాధవవిద్యారణ్య స్వరూపమున నవతరించెనని చెప్పుటకు సందేహములేదు. సన్న్యాసమునకుఁ బూర్వమీసత్పురుషునకు మాధవాచార్యులని పేరు. తురీయాశ్రమముస్వీకరించి శృంగేరిపీఠము నధిష్ఠించినతరువాత నీజగద్వంద్యునకు విద్యారణ్యులని పేరు. ఈమాధవులు బ్రాహ్మణులు.........ఇతనికి సాయణభోగనాథులను సోదరులిద్దఱుండిరి......."

మాధవాచార్యులవారు ప్రథమహరిహర, బుక్కరాయ, ద్వితీయ హరిహర రాజులకాలములో వారికిమంత్రిగను హితబోధకుఁడుగను ఉండెను. ఇతనితమ్ముఁడగు సాయణాచార్యులవారు హరిహరరాజుయొక్క యన్నకుమారుఁడగు సంగమరాజునొద్ద మంత్రిగానుండెను. హరిహర బుక్కరాయలను స్వరాజ్యసంస్థాపనకుఁ బురికొల్పి యనన్యసామాన్య వైభవభూషితంబగు విజయనగరసామ్రాజ్యమును నూతనముగానిర్మించిన శ్రేయస్సంతయుం మాధవాచార్యులదియేయని నొక్కి వక్కాణింపవచ్చును. హరిహర బుక్కరాయలు పేరుకుమాత్రము రాజుగానుండెననియుఁ, రాజ్యభారమంతయుం సామ్రాజ్యస్వీకారమునకుఁ బూర్వమును తరువాతను గూడ మాధవవిద్యారణ్యులే

వహించిరనియుఁ నైతిహ్యముకలదు. యత్యాశ్రమస్వీకారముచే నైహిక సౌఖ్యములం దెంతమాత్రమును నిచ్ఛలేనివారయ్యును, దేశమంతయుఁ మ్లేచ్ఛులవలన నరాజకమగు టయుఁ శ్రౌతస్మార్తకర్మములన్నియుఁ నశించుటయుఁజూచి స్వదేశస్వమతముల నుద్ధరించుటకై కేవలనిరపేక్షబుద్ధితో నీమహానుభావుఁడు విజయనగరమను హిందూసామ్రాజ్యమును నిర్మించుటఁజూడ నితఁడద్వితీయ మహాపురుషుఁడని చెప్పవలసియున్నది.

మాధవసాయణులు సంస్కృతభాషలోనున్న యన్నిశాస్త్రములలోను అపార పాండిత్యముగలవారు. వీరిద్దఱునుగలిసి రచించిన గ్రంథముల సంఖ్య నూఱును మించి యున్నవి. అందుశ్రౌతము, స్మార్తము, వేదాంతము, ధర్మశాస్త్రము, మీమాంస, జ్యోతిశ్శాస్త్రము, వైద్యము, వ్యాకరణము, చరిత్ర మొదలయిన యన్నివిషయములమీఁద వీరు ఉద్గ్రంథములువ్రాసిరి. అందు వేదభాష్యము ముఖ్యమైనది. దానికి సాయణభాష్య మని పేరు. నాలుగువేదములయొక్క సంహితలకును బ్రాహ్మణములకును, సంపూర్తిగ నీవిద్వద్వర్యులు భాష్యమువ్రాసిరి. ఈఘనకార్యము చేయుటలో వీరికిమఱికొందఱు విద్వాంసులును సహాయముచేసిరని యైతిహ్యముకలదు. ధర్మశాస్త్రమును గుఱించి మాధవాచార్యులవారిచే రచింపఁబడిన పరాశర మాధవీయ మనుగ్రంథము మనదేశములో మిక్కిలి ప్రఖ్యాతినిజెందియున్నది. వేదాంతవిషయమై విద్యారణ్యకృత పంచదశియుఁ, చరిత్రవిషయమై శంకరదిగ్విజయమును, దర్శనవిషయముగ జైమినీయ న్యాయమాల, సర్వదర్శనసంగ్రహము, అనుగ్రంథములును విద్వన్మాన్యములై యున్నవి.

ఇట్లు జైనజంగమయవనాది పరమతములవారిచే ఖండితమగుచున్న వైదికమతమును ఉద్ధరించుటకును వేదభాష్యాదికములను, దేశస్వాతంత్ర్యమును రక్షించుటకును విజయనగర సామ్రాజ్యమునునిర్మించి, శృంగేరిలోని జగద్గురుపీఠము నలంకరించిన యీ యతిశ్రేష్ఠుఁడు నూటేండ్లకంటె నెక్కుడుకాలముజీవించి (క్రీ. శ.) ౧౩౮౬లో సమాధిస్థుఁడయ్యెను." విద్యారణ్యులనుగూర్చియుఁ, వేదవిద్యయందు వారికిఁగల ప్రజ్ఞావిశేషములనుగూర్చియుఁ నింతటిఘనముగవ్రాసిన యీనవీన చరిత్రకారుఁడే తనగ్రంథమునవేదమునుగుఱించి వ్రాయునపుడు విద్యారణ్యులువ్రాసిన దానికెంతపరమవిరుద్ధముగ వ్రాసెనో ముందుచూపెదము.

వేదమునుగుఱించి ప్రాచీనచరిత్రలలో వ్రాసినపైనలుగురు మహనీయులకు వేద విద్యా సంప్రదాయములతోడఁగల సన్నిహితసంబంధమును, వారిలోఁ గడపటివారగు శ్రీవిద్యారణ్యస్వామి వారియందుఁ బూర్వాచారపరాయణులకు మాత్రమేగాక నవ

నాగరకులకును నవీనచరిత్రకారులకును సహితముగల గౌరవాతిశయములను వినిపించి యుంటిమి.

కాని, వేదమునుమహర్షులేవ్రాసి దానియందుజనులకు నమ్మకమునుగల్గించుటకై "వేదమును దేవుఁడిచ్చినాఁడ" నునబద్ధమును వేదములందును వారియితరగ్రంథములందును వ్రాసికొనియుండఁగూడదాయని యొకసంశయము గలుగవచ్చును. ఇట్టిసంశయములకు "ప్రాచీనచరిత్రకారుల గుణసంపదయెడఁగల సంశయములు; వానికి సమాధానము" అనుశీర్షికక్రింద నిదివఱకేసమాధానము వ్రాయఁబడియున్నది గావున నచటఁజూడవచ్చును.

ఇఁకఁ బ్రాచీనచరిత్రలందు వేదమునుగుఱించిచెప్పఁబడిన ముఖ్యవిషయముల సారాంశమునొక్కసారి సంగ్రహముగవినిపించి యటుపైవేదమునుగుఱించి నవీనచరిత్రలేమిచెప్పునను విషయమునకుఁబోవుదము.

## వేదమునుగుఱించి ప్రాచీనచరిత్రలందలి సారాంశము.

పరమేశ్వరుఁడు సృష్టిసేయఁగోరి యీ పనిగావించుటకు బ్రహ్మదేవునిఁ దొలుతఁబుట్టించి యతనికివేదమునిచ్చెను. ఆవేదమందలి యర్థమునుదెలిసికొని బ్రహ్మదేవుఁడు దానియొక్క సహాయముచేతనే సర్వపదార్థములను సృష్టింపఁగలిగెను. ఆ మానవులనుగూడ సృష్టించెను. ఇట్టిమానవు లెట్టికార్యములుచేయుటచేతను, నెట్టి ప్రవర్తనము కలిగియుండుటచేతను నీజన్మమందు సుఖపడుటయేగాక ముందు రాఁబోవుజన్మలందు దుఃఖములకును గష్టములకును బాలుగాక క్రమక్రమముగ నుత్తమగతులనుబొంది తుదకు మోక్షమునొందుదురో, యట్టిసత్కార్యములకును సత్ప్రవర్తనమునకును ధర్మమనిపేరు. (ఈజన్మకాక వేఱుజన్మలుకలవా, లేవా, యనువిషయమీగ్రంథముయొక్క రెండవప్రకరణమునఁ జర్చింపఁబడి వేఱుజన్మలుకలవని ఋజువు చేయఁబడి, వేఱుజన్మలులేవనువారి వాదములకచట సమాధానములు వ్రాయఁబడును; అట్లే మోక్షమనగేమియో, యదియెట్లుపడయవచ్చునో, యీవిషయము లీగ్రంథముయొక్క రెండవభాగమగు 'వైదికమతతత్త్వము'ను ప్రకరణములోఁ జర్చింపఁబడును. పైరెండు విషయములనుగుఱించి విపులముగఁ జర్చింపవలసిన యవసరమా రెండుప్రకరణములందును నెక్కువగనుండుటచేతను, నవిగాక వేఱువిషయముల నెక్కువగఁ జెప్పవలసినయవసర మీ మొదటిప్రకరణమునం దుండుటచేతను, బైవిషయముల నిచటను నచటనుగూడ చర్చించుటకు గ్రంథవిస్తరభీతిచే వీలుగానందునను నావిషయములనుగూర్చి యిచటవిపులముగఁ జెప్పవీలుగాదు. కావున 'మోక్షము'నఁగాఁ బుట్టుకలును జావులునులేక, దుఃఖమనునది యెఱుగక, యెడతెగని సుఖమనుభవించుట

యనిమాత్ర మిచటఁదెలిసికొనినఁ జాలును.) అదేరీతిగ నెట్టికార్యము లొనర్చినయెడల నీజన్మమునఁ గష్టములుగల్గుటయేగాక, రాఁబోవుజన్మములం దధోగతిగలిగి నరకము గలుగునో యట్టికార్యములకు నధర్మములని పేరు. పైరీతిగ సృష్టింపఁబడిన మానవుల యొక్క మేలుగోరి వారికి ధర్మములగురించిన జ్ఞానమును, నధర్మములను గురించిన జ్ఞానమును లెస్సగాఁగల్గించుటకే వేదమునుభగవంతుఁ డొసఁగియుండెను. అనఁగా నట్టిధర్మములను, నధర్మములను వేదమమూలముగనే భగవంతుఁడు తెలియపఱచి యుండెను. ఒక్కధర్మములును నధర్మములును మాత్రమే గాదు. సృష్టికి (ప్రపంచము నకు) సంబంధించిన ప్రతివిషయమును వేదమునందుఁ దెలుపఁబడియేయున్నది. దాని సహాయముననే బ్రహ్మదేవుఁడు సృష్టిచేయసమర్థుఁ డగుచుండెనని చెప్పినపుడు దాని ఘనతనుజాటుటకింక నంతకంటె వేఱేమి చెప్పవలయును? అట్టి వేదసంబంధమగుజ్ఞానము ప్రజలకుమిక్కిలి యవసరమగుటచే బ్రహ్మదేవుఁ డావేదమును దొలుత స్వాయంభువ మనువున కుపదేశించెను; ఆయన (మనువు) దానినిమరీచి, యత్రి, మొదలగుప్రజా పతుల కుపదేశించెను. (బ్రహ్మకును, మనువునకును, మరీచి మొదలగుప్రజాపతులకును గలయన్యోన్యసంబంధ మీగ్రంథమున నాఱవప్రకరణమున, సృష్టి యెట్లుజరిగెనను సందర్భమున మనము తెలిసికొందుము.) వారుదానిని నేర్చికొని పిమ్మటఁదమ పుత్త్రులకును శిష్యులకును నేర్పిరి. తిరిగి, వారిలోఁ బ్రతివారును మరలవారివారి పుత్త్రులకును శిష్యుల కును, వారువారుతిరిగి తమతమ పుత్త్రులకునుశిష్యులకును నీరీతిగ నుపదేశించుచు వచ్చిరి. ఈనాఁటికి భారతవర్షముననున్న ద్విజులును, దక్కినజాతులునుగూడ, మొదట సృష్టి కర్తయగు బ్రహ్మనుండిపుట్టిన వారిసంతతియే యగుటచే వేదముక్రమముగాఁ బరమే శ్వరునుండి బ్రహ్మకును, బ్రహ్మనుండి వంశపరంపరగను, గురుశిష్యపరంపరగను నేఁటి బ్రాహ్మణులవఱకును గూడ వచ్చుచున్నది. అనఁగాఁ దండ్రి నేర్చినవిద్య కొడుకునకును, పిమ్మటమనుమనికిని, నటుపై మునుమనుమనికిని, నిట్లేక్రమముగ వంశమునఁ బుట్టినవారికిని వ్యాపించెడివిధముననే వేదముకూడ మొట్టమొదట బ్రహ్మనుండిబయలుదేరి యిప్పటి బ్రాహ్మణులవఱకును వ్యాపించియున్నది.

ఆవేదము మొట్టమొదట సాక్షాత్పరమేశ్వరునివలననే బ్రహ్మకొసఁగఁబడుట చేతను, పురుషమాత్రులగు నితరులెవరివలనను గనిపెట్టఁబడినది కాకపోవుటచేతను నది 'యపౌరుషేయమ'ని కొనియాడఁబడుచున్నది. పౌరుషేయమనఁగా పురుషమాత్రు నిచే నేర్పఱుపఁబడినదనియర్థము. అపౌరుషేయమనఁగా నట్టిపురుషమాత్రునిచే నేర్ప డినదికాదని యర్థము. అట్టివేదమును దొలుతఁ బరమేశ్వరునివలన బ్రహ్మదేవుఁడు విని యెను; ఆయనవలన మనువును, పిమ్మటమరీచి మొదలగుప్రజాపతులును నటుపైఁ

క్రమక్రమముగఁ దక్కినవారందఱును నొకరివలననొకరు వినియుండిరి; అందుచే వేదమునకు 'శ్రుతి' యనికూడ పేరుగలదు. శ్రుతియనఁగా వినఁబడినయది యనియర్థము. ఈసృష్టి మొదలుకొని ముందురాఁబోవు ప్రళయము (అనఁగా సృష్టినశించుట) వఱకును జరిగెడి ప్రపంచసంబంధమగు ముఖ్యచరిత్ర విషయములను, ధర్మాధర్మవిషయములను వేదమే చెప్పును. దానినుండియే వానినా మహర్షులెఱిఁగి ప్రాచీనచరిత్రలలో వ్రాయఁగల్గిరి. (ఈసృష్టియెపుడుపుట్టెనో, యదియెపుడు నశించునో, పిమ్మట నేమిజరుగునో, యీసృష్టికిఁ బూర్వమేమియుండెనో యీమొదలగువిషయములన్నియుఁ నీగ్రంథమందలి నాల్గవప్రకరణమునఁ దెలుపఁబడును.) సర్వజ్ఞుఁడును, సర్వశక్తి సహితుఁడును నగుపరమేశ్వరున కెఱుఁగరాని సంగతియొకటియుండునా? ఈ ప్రపంచమును సృష్టింపఁగల సామర్థ్యముగలవానికి, నిదిముం దెట్లువర్ధిల్లునో, యెంతకాలముండునో పిమ్మట నేమగునో, యీమొదలగుసంగతులు తెలియుటయం దబ్బురమేమున్నది? వేద మా పరమేశ్వరునుండియే వెలువడినదగుటచే దానియం దావిషయములు చెప్పఁబడుటలో మాత్ర మాశ్చర్యమేమియుండును? అందువలననే స్వాయంభువమనువు వేదమును గుఱించి యీక్రిందిరీతిగ నభివర్ణించియున్నాఁడు.

శ్లో. * * * * *

భూతం భవ ద్భవిష్యచ్చ, సర్వం వేదా త్ప్రసిద్ధ్యతి.

—(మనుస్మృతి; అధ్యా. ౧౨ శ్లో. ౯౭)

దీనియర్థమేమనఁగా: జరిగినవియుం జరుగుచున్నవియుం జరుగఁబోవునవియుం సర్వవిషయములును వేదముననుసరించియే జరుగుచున్నవి.

అట్లు వేదముచేఁజెప్పఁబడిన ధర్మాధర్మములను ముఖ్యముగను, వానితోఁబాటు సందర్భానుసారముగవచ్చు చరిత్రవిషయములను గొంచెముగనుగైకొని వానిని మహర్షులలోఁ గొందఱు స్మృతులలో (అనఁగా ధర్మశాస్త్రములలో) వ్రాసియున్నారు. అదేరీతిగ, వేదముచేఁజెప్పఁబడిన ప్రధానములగుచరిత్ర విషయములను ముఖ్యముగను, వానితోఁబాటు సందర్భానుసారముగవచ్చు ధర్మాధర్మవిషయములను గొంచెముగను గైకొని మహర్షులుకొందరు పురాణములలోను, నితిహాసములలోను వ్రాసియున్నారు. (వీనిలోనిస్మృతులనుగుఱించి యీగ్రంథముయొక్క రెండవ ప్రకరణమునను, పురాణములను నితిహాసములనుగుఱించి మూఁడవప్రకరణమునను విపులముగాఁ దెలుపఁబడును.) అంతేగాక మహర్షులు త్రికాలవేదులు. ఆవిషయము నిదివఱకే, యీ ప్రకరణమునఁ "ప్రాచీనచరిత్రకారుల గుణసంపదయొడఁ గలసంశయములు, వానికిసమాధానములు" ననుశీర్షిక క్రింద బుజువుచేసియుంటిమి. కావున, వేదమునుండి తెలిసికొనిన

సంగతులు సత్యములా, కాక, యసత్యములా; యనివారుకమ దివ్యదృష్టిచేఁబరీక్షింపక విడుతురా! విడువరు.

అందుచేమనస్మృతులు, పురాణములు, మొదలగువానియందుఁగల ముఖ్యమగు చరిత్రవిషయములు పరమేశ్వరునిచే నొసఁగఁబడినవేదములోని వగుటయే గాక, త్రికాలజ్ఞులగు మహర్షులయొక్క పరీక్షకుఁగూడ నిలువఁజాలినవై వారిచేతనే గ్రంథములందువ్రాయఁబడినవి. కావునవి మఱింత నమ్మఁదగినవై యున్నవి. ఈపైన జెప్పినవిషయములవలన మనప్రాచీనచరిత్రగ్రంథములకు మూలమగు వేదమేర్పడిన విధానము తెలిసినది. పైసంగతులన్నియుఁగూడ మనప్రాచీనచరిత్రలందు మహర్షులచేఁ జెప్పఁబడుట చేతనే మనకుఁదెలియుచున్నవి.

## వేదమునుగుఱించి నవీనచరిత్రలేమిచెప్పును?

మనప్రాచీనచరిత్రలకు మూలమగు వేదమునుగుఱించి నవీనచరిత్రలందు విదేశీయులేమివ్రాసిరో, దానిననుసరించి మనదేశభాషలందలి నవీనచరిత్రలలో స్వదేశీయులేమివ్రాసిరో యిఁకఁగొంచెము విచారింతము. ఇప్పటి వైదికమతస్థులయొక్క (అనఁగా హిందువులని చెప్పఁబడెడివారియొక్క) పూర్వులు మొట్టమొదట దేశాంతరములనుండి యీదేశమునకువలసవచ్చిన 'యార్యులను' జాతికిఁజెందిన వారఁట. మొదటవారు నాగరకతనెఱుఁగని మోటుజాతివారఁట. పిమ్మటఁ గ్రమక్రమముగఁ దమనాగరకత వృద్ధిపఱచుకొనుచువచ్చిరఁట. ఆకాలమునఁ దమజాతియొక్క స్థితిగతులును, సంఘమర్యాదలును, దమజాతికిశత్రువులగు నితరజాతులతోడి యుద్ధములు మొదలగు చరిత్రవిషయములును వారిలో బండితులగు మహర్షులు వర్ణించియుండిరఁట. వారిభాష సంస్కృతమగుటచే నావిషయములను సంస్కృతమునందే వర్ణించిరఁట. అట్లు వేఱువేఱుమహర్షులచే వర్ణింపఁబడిన వేఱువేఱువర్ణనలన్నియుఁజేరి ఋగ్వేదమను పేరుతో వేదమందలి మొదటిభాగమేర్పడినదఁట.

కావున ఋగ్వేదము పూర్వకాలపు టార్యులయొక్క చరిత్రనుదెలుపుగ్రంథమఁట. అట్లు ఋగ్వేదమేర్పడినకాలమునకు 'ఋగ్వేదయుగమ'ని పేరఁట. అట్లేక్రమక్రమముగఁ దరువాత జరిగిన సంగతులనుజెప్పుటకే యజుర్వేదమును, సామవేదమును, నథర్వణవేదమునుననెడి తక్కిన శాఖలువరుసగా వ్రాయఁబడినవఁట.

ఈపైనఁ దెలిపినవిషయములకు లెక్కలేని యుదాహరణములు నవీనచరిత్రలలో ననేకగ్రంథములనుండి యెత్తిచూపవచ్చును. కాని గ్రంథమారక పెరిగిపోవునను భయముచే, "హిందూదేశ కథాసంగ్రహము"ను గ్రంథములోని "హిందూ మహా

యుగము"ను భాగమునుండిమాత్రము, వేదమునుగుఱించి వ్రాయఁబడిన కొన్నివాక్యములనెత్తి యీక్రిందఁ జూపుచున్నాను. [ఈగ్రంథము ముఖ్యమగు నవీనచరిత్రలలో నొకటియని చెప్పవచ్చును; నవీనచరిత్రకారులలోఁ బ్రముఖులని చెప్పఁదగిన నవనాగరకు లొకరిచేనిది తెనుఁగుభాషలో వ్రాయఁబడినది. అట్టివారేయగు మఱికొందఱు ప్రముఖులుచేరి స్థాపించిన "విజ్ఞానచంద్రిక" యనుగ్రంథమాలలోఁ బ్రకటింపఁబడినది. కావున నిదిసర్వవిధముల నవీనచరిత్రలపక్షమున సాక్ష్యముగఁ దీసికొనఁదగినదిగా నున్నది.]

## వేదమునుగుఱించి నవీనచరిత్రలు చెప్పువిషయముల కుదాహరణము.

[హిందూమహాయుగము; ఐదవకూర్పు—౧౪, ౧౫, ౧౬, పుటలు.]

### ౧. హిందూ మహాయుగము.

### క్రీ. పూ. ౨౦౦౦—క్రీ. శ. ౧౨౦౦.

నాలుగు వేలేండ్లక్రిందట మనపూర్వులగు నార్యులను వారీదేశమునకువచ్చినది మొదలు ఏడునూఱులసంవత్సరములకుఁ బూర్వము తురుష్కు లీదేశమును జయించిన కాలమువఱకును జరిగిన సమాచారములన్నియు నీమహాయుగమును వర్ణించుటలో రాఁగలవు. ఈమహాయుగమును జరిత్రకారు లయిదుయుగములుగా విభజింతురు. అవియెవ్వియనః—

౧. ఋగ్వేదయుగము. (Vedic Age):— (క్రీ. పూ. ౨౦౦౦-౧౪౦౦) ఇది దేశచరిత్రలో నాదిమయుగము. ఈకాలపుఁ జరిత్ర తెలియుటకు ముఖ్యాధారమైనగ్రంథము ఋగ్వేదమయినందున దీనికి ఋగ్వేదయుగమని పేరుపెట్టఁబడియె. వేదములునాలుగని హిందువులందఱకును దెలిసినవిషయమే. అందుఋగ్వేదము మొదటిది. ఇతరవేదములకంటెఁ బూర్వమువ్రాయఁబడినది. దీనిననుసరించియే యితరవేదములు తరువాతవ్రాయఁబడినవి. ఋగ్వేదములోనియావిసూక్తములు క్రీ. పూ. ౨౦౦౦ యేండ్లనాఁడనఁగా నేఁటికి రమారమి నాలుగువేలేండ్లక్రిందటనే వ్రాయఁబడినవని విద్వాంసులయభిప్రాయము. ఇటీవలఁ గొందఱుమనదేశపు విద్వాంసులును బరదేశపు విద్వాంసులును ఋగ్వేదసూక్తములుకొన్ని యేడువేలయేండ్ల క్రిందవ్రాయఁబడినవని సిద్ధాంతీకరించుచు, గ్రంథములవ్రాసియున్నారు. కాని, వీరిసిద్ధాంతము లింకనువాదవివాదస్థితిలోనున్నవి; ఇతరవిద్వాంసులచే నంగీకరింపఁబడలేదు. కావునఁ బ్రస్తుతము మనము ఋగ్వేదసూక్తములు నాలుగువేలేండ్లక్రిందటివి యనియే యనుకొందము.

ఋగ్వేదమంత్రములు చరిత్ర దెలుపుటకు వ్రాయఁబడినవికావు; అప్పటిఋషులచేఁ జేయఁబడిన దేవతాదిప్రార్థనలు. అయినను ఆమంత్రములలోని వర్ణనాదికమువలన నప్పటిదేశస్థితియుఁ నాచారవ్యవహారంబులును, జనులనాగరికతయుఁ మనము కనుఁగొన వచ్చును. కావున నీయుఁగపువర్ణన ఋగ్వేదమునననుసరించియే వ్రాయఁబడును.

[మఱియును ఆ గ్రంథముననే ౪౧-వ పుటలో, నీక్రిందిరీతిగఁగూడ వ్రాయఁ బడియున్నది.]

ఋగ్వేదములోని మంత్రములరచించినవారు ఋషులు. అట్టివారనేకు లుండిరి. వేదము లపౌరుషేయములనెడివారు వీరినిమంత్రకర్తలనక, మంత్రద్రష్టలనియెదరు.

[మఱియును, ౧౫-వ పుటలో,]

౨. క్షాత్రయుఁగము:— (Epic-Age) (క్రీ. పూ. ౧౪౦౦—౧౦౦౦) ............కాలముననే యజుస్సామాథర్వవేదములును, ఐతరేయ, తైత్తిరీయాదిబ్రాహ్మణములును, రామాయణ మహాభారతేతిహాసంబులును రచింపఁబడియె. ఈయుఁగచరిత్రకు నీగ్రంథములేయాధారములు.

[మఱియును, ఆగ్రంథముననే౪౫-వ పుటలో,]

వేదములునాలుగనియు, నందుఁ బ్రతివేదమునుసంహిత, బ్రాహ్మణములను, రెండుభాగములఁ గల్గియుండుననియుఁ జదువరులెఱుంగునది ............ప్రతివేదమునకును బెక్కు బ్రాహ్మణములుగలవు. ............ ఈబ్రాహ్మణములలో ఋగ్వేదాదిసంహితలలోని మంత్రములకునర్థములును, యజ్ఞయాగాదిక్రతువులు చేయవలసిన విధములును, అప్పటిరాజులయొక్కయు, రాజ్యములయొక్కయు, నితిహాసంబులును, వర్ణింపఁబడినవి. ఈగ్రంథములనుండియే మనమాకాలపుచరిత్రఁ గనుఁగొనవలసియున్నది.

ఈయుఁగము (క్షాత్రయుఁగము) యొక్క చివరభాగమున రామాయణ మహాభారతములను నితిహాసగ్రంథములు రచింపఁబడినవి. ఈగ్రంథము లీయుఁగమున రచింపఁబడలేదనియుఁ దరువాతియుఁగమున రచింపఁబడినవనియుఁ గొందఱనియెదరు."

ఈపై వ్రాయఁబడినది వేదమునుగుఱించి నవీనచరిత్రలలోఁ జెప్పఁబడిన విషయములయొక్క సారాంశమని చెప్పవచ్చును. ఇక నీవిషయములం దెంత సత్యమున్నదో కొంచెము విచారించిచూతము.

## వేదమునుగుఱించి ప్రాచీనచరిత్రలు చెప్పినవిషయములు సత్యమా? నవీనచరిత్రలు చెప్పువిషయములు సత్యమా?

వేదము మొట్టమొదటఁ బరమేశ్వరునివలననే బ్రహ్మకొసఁగఁబడినదనియును, బిమ్మట నాయననుండి మనువునకును, నటుపైఁ బ్రజాపతులకును, వారినుండి వారిసంతతి యగు మహర్షులకును బిదప వారినుండి, వారసంతతియగు నీనాఁటి ద్విజులవఱకునుగూడ బుత్రపౌత్ర పరంపరగను, గురుశిష్య పరంపరగను మన దేశమున వ్యాపించియున్నదని యును మన ప్రాచీనచరిత్రలు చెప్పినవిషయమును మనము పైన దెలిసికొనియున్నాము. అంతేగాని యాచరిత్రలు, వేదము కొందఱుమహర్షులచే నేర్పడినదని చెప్పుటలేదు. పైఁగ దాని నపౌరుషేయమని గూడ కొనియాడుచున్నవి. (అనఁగాఁ బురుషమాత్రు లెవ్వరును వ్రాసినదికాదని గూడ చెప్పుచున్నవి.) మఱియును నాచరిత్రలింక నేమి చెప్పుచున్నవనఁగా;—"వేదమే కాలమునఁగాని యొవరిచేతఁగాని, యేర్పఱుపఁబడినది కాదు; ఐనచో నెట్లేర్పడినదనఁగా నీశ్వరుఁ డేవిధముగ నేర్పడెనో, వేదమును నట్లే యేర్పడినది. అనఁగా, నీశ్వరునివలెనే వేదమును ననాదియనియు, సనాతనమనియు నర్థము. ప్రళయకాలమున నీలోకములు నశించిపోయినపుడుగూడ వేదము పరమేశ్వరునియందట్లే నిలిచియుండును. మఱల ప్రపంచమును సృష్టింపఁబోవునపుడు వేదమును గొంచెమైనను మార్చక మునుపున్నరీతిగనే బ్రహ్మకు నీశ్వరుఁడు తిరిగియిచ్చుచుండును. ఆ క్రిందటిసారి సృష్టియెట్లుజరిగినదో యట్లే కొంచెమైనను భేదములేకుండునట్లు, బ్రహ్మ యా వేదములోనున్న ప్రకారము మరల సృష్టిచేయును. ఇట్లే ప్రతిసారియును (అనఁగాఁ బ్రతిప్రళయముయొక్క చివరను) జరుగుచుండును. ఆ వేదము నున్నదానినున్నట్లే ప్రతిసారియును బ్రహ్మకు నీశ్వరుఁడు బోధింపవలసినదేగాని, యందొక్క యక్షర మైనను మార్చిచెప్పవలసిన యగత్యముగాని, యట్లుచెప్పుట కధికారముగాని, యీశ్వరునకులేదు." ఈసంగతులుసహితము వేదముచెప్పుటచేతనే మనకుఁ దెలియుచున్నవి. ఈసంగతులనే తక్కిన మన ప్రాచీనచరిత్రలుగూడ చెప్పుచున్నవి.

వానిని వ్రాసినమహర్షులు వేదములను వేదాంగములనుగూడ బూర్తిగఁ జదివికొని వానియందు గొప్పపాండిత్యమును సంపాదించినవారు. అంతేగాక, యట్టివేదముయొక్క యర్థమునుగూడ సృష్టికర్తదగ్గఱనుండియు వంశపరంపరగా విని నేర్చికొనిన వారు. అట్టివేదార్థములనే తిరిగి ధర్మశాస్త్రములందును బురాణములందును జెప్పియున్న వారు. అందువలననే యాగ్రంథములకు వేదముయొక్క యుపబృంహణములని పేరు. వానిలోఁ బదునెనిమిది మహాపురాణములనువ్రాసిన ద్వైపాయనమహర్షి వేదమును

నాల్గుభాగములుగ విడదీయుటకైయవతరించిన శ్రీవిష్ణుదేవుఁడని మనప్రాచీనచరిత్రలు చెప్పినవిషయము నిదివఱలోఁ గనుపఱచియుంటిమి. ఆయన వేదము నట్లు నాల్గుభాగములుచేసి వానిని దమనలుగురిశిష్యులలో నొక్కొక్కరి కొక్కొకభాగమును బోధించియున్నారు. ఆభాగములకే ఋగ్వేదమనియు, యజుర్వేదమనియు, సామవేదమనియు నథర్వవేదమనియుఁ బరుసగఁ బేళ్లుగలవు. అందుచేతనే యొక్కటియె యగు వేదము నొకప్పుడు మూఁడువేదములనియు,నాల్గువేదములనియుఁ బహువచన రూపముతోఁగూడ వ్యవహరింతురు. వేదమును విడదీయుటకవతరించిన భగవంతుని యవతారమగు ద్వైపాయన మహర్షికిఁగూడ వేదమునుగుఱించి, విదేశపండితులకును వారిశిష్యులగు మనస్వదేశీయ, నవీనచరిత్రకారులకును దెలిసినమాత్రమైనను దెలియదా? అట్టి వేదార్థమును లోకమునకుఁ బురాణములద్వారా సులభముగఁ దెలుపుటకే యాయన యవతరించినట్లుమన ప్రాచీనచరిత్రలు చెప్పుచున్నవిగదా! ఇఁక, మనువు, వసిష్ఠుఁడు, మొదలగు తక్కిన మహర్షులు కొందఱు బ్రహ్మదేవునియొక్క సంతతియేయైయున్నారు. వారికైనను వేదము విషయమై పైమన నవీనచరిత్రకారులకుఁ దెలిసినమాత్రముగూడ తెలియదు కాఁబోలును! అట్టివారందఱునుగూడ వేదము పరమేశ్వరునుండియె బయలుదేరి తమకందఱికిని గ్రమముగాలభించినట్లు వ్రాసియున్నారు. కాని, యందొక్కరైనను నదిమహర్షులచేఁ గల్పింపఁబడినట్లు వ్రాసియుండరైరి.

మనదేశపు వేదవిద్వాంసులగు శ్రీశంకరాచార్యులును, శ్రీవిద్యారణ్యస్వాములును, శ్రీమధ్వాచార్య, రామానుజాచార్య ప్రభృతులును, వారికి గురువులని చెప్పఁదగిన మనపూర్వులగు మనువు, వసిష్ఠుఁడు, పరాశరుఁడు, ద్వైపాయనుఁడు మొదలగు మహర్షిసత్తములును, వేదమునందలి యర్థమును గొన్నివిషయములలో బాగుగఁదెలిసికొనియుండ జాలకపోవచ్చుననియుఁ, నట్టివిషయములలో వేదమునందుఁ గృషిగావించిన జర్మనీదేశపు విద్వాంసులును, మాక్స్‌మిల్లర్, అనిబిసెంట్ దొరసాని, మొదలగు విదేశీయవిద్వాంసులును మొదలగువారు వేదమునకుఁ జెప్పునట్టియర్థమే యెక్కువసత్యమైనదైయుండవచ్చుననియుఁ గొంతకాలముక్రింద నవనాగరకులగు మాబంధువులే యొకరు మాతోడవాదించియున్నారు. పాపము! వేదమెట్లేర్పడినదో, వేదవిద్యా సాంప్రదాయము మొదట నెవరినుండి యెవరికిఁ గ్రమముగా వ్యాపించినదో, యాసంగతులు వీరికి సరిగాఁ దెలియకపోవుటయేగాక, పైగా, నవీనచరిత్రలలో వేదమునుగుఱించి వీరు నేర్చికొనినతప్పువిషయములే సత్యమైయుండునని వీరుతలంచుటయే యిట్టిదురభిప్రాయమునకుఁ గారణమైయుండును. అంతేగాక, వేదమును మహర్షులు వ్రాసిరనియేగదా వీరు నేర్చికొనియుండిరి. అప్పుడుమాత్రము మహర్షులు వ్రాసిన వేదముయొక్కయర్థము

మహర్షులకును వారివంశీయులును శిష్యులును వైదికమతస్థులునగు మనదేశపువిద్వాంసుల కును దెలియదనియు, విదేశీయులును, నన్యమతస్థులును మనదేశమున నడుగుపెట్టక ముందు వేదము పేరును విని యైన నెఱుంగనివారునునగు విదేశీయవిద్వాంసులకుమాత్రమే తెలియుననియుఁ దలంచుటమాత్ర మెట్లు యుక్తియుక్తమగును. అట్లైనచో, నేమత సంబంధములగు శాస్త్రములును వానియర్థమును సాంప్రదాయములును నామతము యొక్క మూలపురుషులకును, నామతప్రవర్తకులకును సరిగాఁ దెలియవనియు నితరమత స్థులకును నితరమతవిద్వాంసులకును మాత్రమే తెలియుననియును జెప్పనచ్చునుగదా! అనఁగా మహమ్మదీయ మతశాస్త్రమగు 'ఖొరాను' యొక్క యర్థమును నామతధర్మ ములును నామతమునకు మూలపురుషుఁడగు మహమ్మదునకుగాని, యాయనయొక్క యనుచరులును మహమ్మదీయ మతప్రవర్తకులును నగుముసల్మానులకుగాని తెలియవనియు, వానిని మహమ్మదీయులు క్రైస్తవమిషనరీల యొద్దనుండి నేర్చికొనవలసి యుండునని యును జెప్పవలసివచ్చునుగదా! అట్లే క్రైస్తవమత సిద్ధాంతములును, నామతశాస్త్రమగు 'బైబిల్' యొక్క యర్థమును, క్రైస్తవమతధర్మములును, నామతమునకు మూల పురుషుఁడగు 'ఏసుక్రీస్తు' (Jesus Christ) కు గాని, యాయనయొక్క యనుచరు లును క్రైస్తవమతప్రవర్తకులును నగు 'పోప్' లకును, 'బిషప్' లకును క్రైస్తవమిషనరీ లకును తెలియఁజాలవనియును, క్రైస్తవమతస్థులందఱును వానిని బౌద్ధమతశాస్త్రజ్ఞు లనడిగియే తెలిసికొని వారుచెప్పినప్రకార మనుష్ఠింపవలసియుండుననియును జెప్పి నచో సమంజసముగానుండునా? ఆదేరీతిగ, వేదమునుగుఱించియు, దానియర్థమును గుఱించియుఁ, వైదికమత మూలపురుషులును, నామతప్రవర్తకులును నగుమహర్షుల కును, శ్రీశంకర, రామానుజప్రభృతి వేదవిద్వచ్ఛిఖామణులకును సరిగాఁ దెలియదని యునుఁ, గావున వైదికమతస్థులు తమయభిప్రాయములను, నాచారసాంప్రదాయము లను, జర్మనీదేశపువిద్వాంసులును, మాక్స్‌మూలర్, అనిబిసెంట్, మొదలగువారును చెప్పినప్రకారము మార్చికొనవలసియుండుననియును, దలంచుటకంటె హాస్యాస్పదమగు విషయము మఱియొకటి యుండదు.

ఇట్టిసందర్భమున ఋగ్వేదము మొదట మహర్షులచే వ్రాయఁబడినదనియుఁ, బిమ్మటఁ గొంతకాలమునకు యజుర్వేదమును, నటుపైఁ గొంతకాలమునకు సామవేద మును, మఱికొంతకాలమున కథర్వవేదమును వ్రాయఁబడినవనియు, నవీనచరిత్రలలో వ్రాసినవారికేమి యాధారముకలదో విచారింతము.

వీరిలో స్వదేశీయులువ్రాసిన చరిత్రవిషయముల కాధారము విదేశీయులువ్రాసిన నవీనచరిత్రలేయని యిదివఱలోఁ దెలిపియుంటిమి. విదేశీయు లీదేశమునకురాక

పూర్వము వేదమునుగూర్చిగాని, దానికిసెలవగు బ్రాహ్మణులు మొదలగువానిగూర్చిగాని, వినియుండురనిగాని, యెఱిఁగియుండురనిగాని, యనుకొనుట కావంతయైన నవకాశము గనుపడదు. వేదముతోడ మనమహర్షులకుఁ గలసంబంధమునకును నవీనచరిత్రకారు లగు విదేశీయులకుఁ గలసంబంధమునకును బైనజూపినరీతిగ మాస్తియుకాంతరముగలదు. ఇట్టివిదేశీయులు మహర్షులకంటె వేదమునుగూర్చి యెక్కువ భాగుగనెఱిఁగియుందు రనుకొనుట మిక్కిలిపొరబాటు. నవీనచరిత్రకారులలోని స్వదేశీయులును విదేశీయు లునుగూడ నిప్పటి కేరెండుమూఁడువందల సంవత్సరములలోపలివారోగాని, యంతకుఁ బూర్వ మున్నవారుకారని వీరువ్రాసిన నవీనచరిత్రలవలననే తెలియుచున్నది. ఇఁక ఋగ్వేదము మొదలగునవి యంతకుఁబూర్వము మూఁడునాల్గువేల సంవత్సరముల క్రిందట నేర్పడియుండుననను సంగతిగూడ వీరినవీనచరిత్రలే చెప్పుచున్నవి.ఆవిషయము సత్యమనుకొన్నప్పటికిని, వీరాకాలముననుండి ఋగ్వేదము మొదలగునవి యేర్పడిన విధానమును స్వయముగాజూచియున్నవారు కాఁజాలరు. పోనిండు; ఆకాలమున జీవించియుండి యావిషయమును స్వయముగాఁజూచియున్నవా రెవరైనను నాసంగతు లను వ్రాసియుండఁగా నావ్రాతవలన వీరావిషయములను తెలిసికొనియుండిరా? లేదు! ఏలననఁగాఁ, దా మట్లు తెలిసికొనియున్నట్లు వీరు తమగ్రంథములలో నెచటను వ్రాసి కొనియుండలేదు. కానిండు; ప్రాచీనచరిత్రలను వ్రాసినమహర్షులవలెనే నవీనచరిత్రలను వ్రాసిన వీరుగూడ త్రికాలవేదులగుటచే నావిషయములను దమదివ్యదృష్టిచేఁ దెలిసి కొని వ్రాయఁగల్గిరా? లేదులేదు! అది మొదలేలేదు! అట్టిత్రికాలజ్ఞానము తమకున్నట్లు గాని, దానిసహాయమునుచేఁ దామాసంగతులను గనిపెట్టఁగల్గితిమనికాని వీరెచటను వ్రాసికొనియుండలేదు. అంతయేల! ఆట్టిత్రికాలజ్ఞానముకలవారు లోకమునఁ గొంద ఱుందురనుసంగతిని నమ్మువారుగూడ వీరిలో నెందఱుందురో చెప్పఁజాలము. ఒకవేళ నట్టిత్రికాలజ్ఞానముచేతనే వీరు పైసంగతులను గనిపెట్టివ్రాసిరని మనమనుకొన్నను, మన ప్రాచీనచరిత్రలు వ్రాసినమహర్షులును త్రికాలజ్ఞులనియే వ్రాయఁబడియున్నదిగదా! అప్పుడు మనమహర్షులు త్రికాలజ్ఞానముచేఁ దెలిసికొన్నవిషయము లబద్ధములనుటకును, నవీనచరిత్రకారులు తమయొక్క త్రికాలజ్ఞానముచేఁ దెలిసికొన్నవిషయములే సత్యము లనుటకునుమాత్రము మనకేమియాధారమున్నది? ఏమియునులేదు! పోనిండు; వేదమును స్వయముగాఁజదివి దానినుండి పైవిషయములను మననవీనచరిత్రకారులు గ్రహింపఁ గలిగిరని యనుకొనవచ్చునా? ఐనచో విచారించిచూతము. వేదమునందేదియో కొంత భాగమేగాని, నాల్గువేదములను బూర్తిగఁజదివికొనినవారు మనదేశమందలి యీనాఁటి బ్రాహ్మణులలో నేలేరని కొంతధైర్యముతోఁ జెప్పవచ్చును. ఈకలియుగమున మానవుల

యాయుర్దాయము తక్కువగుటచే వేదములు ప్రతివారును బూర్తిగఁజదువుట సాధ్యము కాదనియే త్రికాలవేదియగు ద్వైపాయనమహర్షి దానిని నాల్గుభాగములుగ విడదీసి యొక్కొకభాగమును గొందఱుకొందఱు బ్రాహ్మణు లధ్యయనము చేయునట్లేర్పాటు చేసియున్నారు. అట్లయినను గూడ యీకాలపుబ్రాహ్మణు లెవరియొక్కశాఖను వారే పూర్తిగా నధ్యయనము చేయుట కష్టసాధ్యముగనున్నది. అట్లధ్యయనము చేసినవారు కొలఁదిమందిమాత్రమే కలరు. వేదమున స్వరముల భేదమునుబట్టి యర్థము మారుచుండును. అనఁగా నొకపదమున కొకయర్థమున్నపుడు, దానియందలి యక్షరముల నట్లే యుంచి, యాయక్షరములలోఁ గొన్నిటిమీదనున్న స్వరములను బెంచిగాని, తగ్గించిగాని పలికినచో వేఱొకయర్థము నిచ్చును. అంతేగాక, సంస్కృతభాష చదివికొనినంత మాత్రముచేత వేదమున కర్థము చెప్పఁగలసామర్థ్యము రాఁజాలదు. ఏలనన, కేవల సంస్కృతవ్యాకరణ శాస్త్రనియమములచే సాధువులుకాని శబ్దములు వేదమున లెక్కకుమిక్కిలిగఁగలవు. కావున స్వరభేదమునుబట్టియు, నితరవిధముల చేతను వేదమున కర్థము తెలిసికొనవలసినవిధానము శిక్షాశాస్త్రము, నిరుక్తము, వ్యాకరణము, మొదలగు వేదాంగములనుగూడ చదివికొనిననేగాని తెలియదు. మహర్షులందఱును వేదమునందును షడ్వేదాంగములందును నిరుపమానపాండిత్యము గలవారనుసంగతి వారువ్రాసినగ్రంథములను జదువువారికిఁ దప్పక తెలియగలదు. ఈనాఁటిమనదేశపు బ్రాహ్మణులలోనైనను నాల్గువేదములను సాంగముగ (అనఁగాఁ షడంగములతోఁగూడ) పూర్తిగ నధ్యయనము చేసినవారు లేరనిచెప్పవచ్చును.

ఇఁక నవీనచరిత్రకారులగు విదేశీయవిద్వాంసులు మనదేశమునకు వచ్చువఱకును వేదమనఁగా నేమియో యెఱుఁగరనియు, వారిదేశమున వేదముగాని, వైదికమతముగాని, దానికిసంబంధించిన బ్రాహ్మణులు మొదలగు కులములవారుగాని లేరనియు నిదివఱకో తెలిపియే యుంటిమి. వారు సంస్కృతశబ్దములనే సరిగా నోటఁబట్టఁజాలరు. స్వరముల మాట చెప్పవలసినదే లేదు. ఒకవేళ వేదము దెలిసికొనినను నందేదియో కొంతభాగమునుమాత్రమే వారుచూచియుందురుగాని, నాల్గువేదములను బూర్తిగఁజదువుటకు మనదేశపుబ్రాహ్మణులకే యాయుర్దాయము చాలకయున్నపుడు వీరికిమాత్ర మదియెట్లు సాధ్యము కాఁగలదు? ఒకవేళ నాల్గువేదములను జదివిచూచినవారు విదేశీయులలో నుందురని వాదముకొఱకించుకనే యంగీకరించినను, వానిని సాంగముగఁజదువుట వారికెన్నఁటికిని సాధ్యముకాదనియే నిరాక్షేపముగఁ జెప్పవచ్చునుగదా! పోనిండు; విదేశీయ విద్వాంసులందఱును నాల్గువేదములందలి సర్వశాఖలను సస్వరముగను, సాంగోపాంగముగను నధ్యయనము చేసిరనికూడ వాదముకొఱ కంగీకరించిచూతము. ఐనచో

మనప్రాచీనచరిత్రకారులగు మను, వసిష్ఠ, పరాశర, ద్వైపాయనాదిమహర్షులు మాత్రము చదుర్వేదములను సాంగోపాంగముగ నధ్యయనముచేయలేదా? అప్పుడు వేదమందలియర్థమును మహర్షులకంటె నవీనచరిత్రకారులగు విదేశీయవిద్వాంసులే యెక్కువబాగుగ గ్రహించిరనుటకుమాత్రము మనకేమి యాధారమున్నది? ఏమియును లేదు! అంతేగాక, వేదమును, వేదార్థమును మనమహర్షులును వారిపూర్వులును సృష్టికర్తనుండియు వంశపరంపరగా నెఱుఁగుచువచ్చిరనికూడ మనము పైన దెలిసికొనియుంటిమిగదా! ఐనచో, వేదార్థము సృష్టికర్తకంటెఁగూడ విదేశీయవిద్వాంసులే యెక్కువబాగుగ నెఱుఁగుదురని మనముతలంపవలయును గాఁబోలును!! కావున వేదమునుగుఱించి నవీనచరిత్రకారులు తమగ్రంథములలో వ్రాసికొనినవిషయములకు వారు వేదమునుజదివితెలిసికొనిరని యనుకొనుట మిక్కిలియసంబద్ధము. మహర్షులకంటె వేదార్థమును వారెక్కువబాగుగ గ్రహించిరనుట యింకనునసంబద్ధము.

అది సత్యమేయైయున్నపక్షమునఁ, దాము వేదమందలి యేభాగమునుజదివి యేవిషయములను గ్రహించిరో, యేభాగము నర్థముచేసికొనుటలో మనమహర్షులకు లేని క్రొత్తసాధనమును వీరేమిసంపాదించిరో, యర్థముచేసికొనుటలో మహర్షులందఱును నేరీతిగఁబొరబడిరో, యేవివరములను నవీనచరిత్రకారులు తమగ్రంథములందు సవిమర్శముగఁ జూపియేయుండెడివారు. కాని, వారట్లుచూపియుండిరా? లేదు! వేదములను వ్రాసినది మహర్షులేయని వ్రాసిననవీనచరిత్రకారులు, దానియర్థ మామహర్షులకుఁ దెలియదనియుఁ దమకే యెక్కువబాగుగఁదెలియుననియుఁ నెట్లువ్రాయఁగల్గుదురు?

ఐనచో, వేదములను మహర్షులువ్రాసినట్లు నవీనచరిత్రకారులగువిదేశీయుల కెట్లుతెలిసినది? వేదమును, మనప్రాచీనచరిత్రలను స్వతంత్రముగఁజదివి, వానిలోని యర్థమును విపరీతముగ గ్రహించుటచేతనే తెలిసినది! కానిచో, "వేదమును బరమేశ్వరునివలననే గ్రహించితిమిగాని, మేము దానినివ్రాయలేదు" అని మహర్షులందఱు నేకగ్రీవముగఁ దమగ్రంథములలో వ్రాసికొనియుండఁగా, నామహర్షులయొక్క మొగముగాని, వేదములయొక్క మొగముగాని, యెఱుఁగని నవీనచరిత్రకారులు వేదమును మహర్షులువ్రాసిరని యెట్లుతలంచిరి?

ఇంతయేల! ఈభరతవర్షములో నడుగుపెట్టకముందు వేదముయొక్క పేరుసైన వినియెఱుంగని విదేశీయులగు నవీనచరిత్రకారులును, వారువ్రాసిన చరిత్రలనేతప్ప వేదముయొక్క మొగమైన నెఱుంగనినవనాగరకులునుమాత్రమే వేదములను మనుష్యులువ్రాసియుందురని చెప్పుచున్నారు!

కాని, వేదమును సృష్టిప్రారంభమునుండియుఁ దానియంగములతోడను నర్థములతోడను సృష్టికర్తయొద్దనుండియుఁ గురుశిష్యపరంపరగను, పుత్రపౌత్రపరంపరగను, నెఱుఁగుచువచ్చుచున్న పండితులలో నొక్కరైనఁగాని, వారువ్రాసిన మనప్రాచీనచరిత్రలలో నొక్కటియైనఁగాని, యట్లుచెప్పకపోఁగాఁ, బైఁగా నందులకువిరుద్ధముగా వేదములపౌరుషేయములనియే చాటిచెప్పుచున్నట్లు పైనధ్రువపఱచియుంటిమి. కావున, బైవిషయమున నవీనచరిత్రలందలి సంగతులును, నవనాగరకులమాటలును నెంతమాత్రమును నమ్మఁదగినవి కావని దీనిచే స్పష్టమగుచున్నది.

## వేదమునుగుఱించి నవనాగరకులకుఁ గలకొన్నిసంశయములు, వానికి సమాధానములు:—

### వేదమును దేవుఁడుదిగివచ్చి మనుష్యులకెట్లుచెప్పెను?

విదేశీయులువ్రాసిన పైవిషయములనే యిప్పటిమనదేశస్థులలోఁ బెక్కుమంది చిన్నతనమున నేర్చికొనియుండిరి. మనవేదములనుగాని, శాస్త్రములనుగాని, వారు బాగుగఁ జదివియెఱుఁగరు. అందుచేత విదేశీయులువ్రాసినట్లు వేదములను బూర్వకాలమున మహర్షులువ్రాసియుండిరనియే వీరుగూడ దమహృదయములందు గట్టిగానమ్మియున్నారు. చిన్నతనముననే మనస్సులో బాదుకొనిన విషయమగుటచే నిదిసత్యమగునా, కాదా, యనుసంశయము సహజముగ వారికిఁగల్గుటకవకాశముండదు. వేదములను శాస్త్రములను నెక్కువగఁ జదివినవారు కాకపోవుటచే వేదమును బరమేశ్వరుఁడిచ్చెననువిషయములో వీరికిఁ బెక్కుసందేహములుగలవు. అందుచే వేదమును బరమేశ్వరుఁడిచ్చెనని సందర్భవశమున నీకాలమున నెవరైనను బూర్వాచార పరాయణులు చెప్పఁగా, వెంటనే నవనాగరకులందఱుఁగొని, "పరమేశ్వరుఁడువచ్చి నీకుఁజెప్పినాఁడు కాఁబోలు"నని యాక్షేపించుచున్నారు. కాని, బాగుగవిచారించినచో నిట్లాక్షేపించుటకవకాశముండదు.

ఏమనఁగాఁ బరమేశ్వరుఁడు స్వయముగావచ్చి మనతోఁజెప్పకపోయినను మన పూర్వులందఱిలో మొట్టమొదటివాఁడును, లోకపితామహుఁడునగు బ్రహ్మదేవునకు జెప్పెను. ఆయన మనువులకును, మనుప్రజాపతులకును, వారు తమబిడ్డలగు మహర్షులకును జెప్పిరి. ఆమహర్షులుతిరిగి తమబిడ్డలకును, శిష్యులకును, వారుమరల తమబిడ్డలకును శిష్యులకును, నీక్రమముగ సృష్టికాలమునుండియుఁ నిప్పటివఱకును జెప్పికొనుచు వచ్చుచున్నారు. ఇందులో నసంభవమేమియున్నదో యాలోచింపుఁడు! ఏవిద్యయైనను నొకరివలన రెండవవారును, రెండవవారివలన మూఁడవవారును, వారినుండి నాల్గవ

వారును, నీరీతిగ నేర్చికొనుచుండుట లోకములో మనము చూచుటలేదా? ప్రస్తుతము మనము నేర్చికొన్నవిద్యలను భాషలను మనకు మన యుపాధ్యాయులు నేర్పఁగా నేర్చికొంటిమిగదా! మనయుపాధ్యాయులకెవరు నేర్పిరి? వారియుపాధ్యాయులు నేర్పిరి. వారియుపాధ్యాయులకెవరు నేర్పిరి? ఆయుపాధ్యాయుల యుపాధ్యాయులు నేర్పిరి. ఆయుపాధ్యాయుల యుపాధ్యాయులకో? వారియుపాధ్యాయులు నేర్పిరి. ఇట్లే మొట్టమొదటి యుపాధ్యాయుఁ డీశ్వరునివలన సృష్టింపబడినవాఁడైయుండఁగా, వానిని సృష్టించినయీశ్వరుఁడు వానికి వేదములను నేర్పియుండఁగూడదా? ఇదియసందర్భమా? ఇందసంభవ మేమియున్నది. ఏమియును లేదు!

అంతేగాక, పైమాత్సర్యణమును జేయుచుండు మననవనాగరకులే, యొకప్పుడు మాటలసందర్భవశమున నేదియైన నింగ్లీషుపద్యమును జదివి, "యిట్లు 'షేక్స్పియర్' (Shakespeare) చెప్పినాఁ"డనియో, 'గోల్డుస్మిత్' (Goldsmith) చెప్పినాఁడనియో ముచ్చటించుచుందురు. అప్పుడు, "షేక్స్పియర్ వచ్చి నీతోఁ జెప్పినాఁడు కాఁబోలు న"ని వీరిని, మనమాక్షేపించినయడల నేమిసమాధానము చెప్పుదురు? 'షేక్స్పియర్' గాని 'గోల్డుస్మిత్'గాని యిప్పుడున్నవారు గారుకదా! ఇఁకవీరితో వారెట్లుచెప్పిరి? "వారిపుడులేకున్నను వైపద్యమును గ్రంథములో వ్రాసియుండిరి; ఆగ్రంథమునుండి మనము తెలిసికొనఁ గలుగుచున్నాము." అని వీరుసమాధానము చెప్పవచ్చెదరు కాఁబోలును! అటే యీశ్వరుఁడును బ్రహ్మకు వేదములనీయఁగా, నాయన తనకిచ్చెననియును, దానుప్రజాపతులకిచ్చితిననియు మనువు వ్రాసియున్నాఁడు. ఆప్రజాపతులయొక్క సంతతియగు మహర్షులుగూడ వేదమును దాము పై క్రమముగనే గ్రహించితిమనియు, నాక్రమముగనే తమబిడ్డలకును శిష్యులకును నేర్పితిమనియు మన ప్రాచీనచరిత్రలలో వ్రాసియున్నారు. ఇందుల కుదాహరణములనుగూడ నిదివఱలోఁ జూపియేయుంటిమి. ఇఁక నీవిషయమును నమ్ముటలోమాత్ర మసంగతమేమియున్నది? ఏమియును లేదు!

కాని, "మేముచదివినపద్యము 'షేక్స్పియర్' వ్రాసినగ్రంథములోనిదే కావచ్చును గాని, మీప్రాచీనచరిత్రలుమాత్రము మహర్షులువ్రాసినవి కాఁజాలవు; మధ్యకాలమున నెవరోవ్రాసి వానికి మహర్షులపేరును జేర్చియుందురు; అందుచే నవినమ్మదగినవి కావు, అంతేగాని మహర్షులు వానినివ్రాయఁగా మీరుచూచివచ్చినారా?" యని మన నవనాగరకులు మనల నాక్షేపింపవచ్చును. మంచిదే! కాని, వారు చదివినపద్యము 'షేక్స్పియర్' వ్రాసినగ్రంథములోనిదే యని వారెట్లుచెప్పఁగలరు? ఆపద్యమును 'షేక్స్పియర్' తనగ్రంథములో వ్రాయుచుండఁగా వీరు వెళ్లి స్వయముగా చూచివచ్చి

నారా? 'షేక్స్పియర్' ఈనాఁటివాఁడు కాఁడుగదా! ఇప్పటికెన్నియోవందల సంవత్సరముల క్రిందటివాఁడు. కాఁబట్టి యాయన తన గ్రంథమును వ్రాయుచుండఁగా వీరు చూచియుండుట యసంభవము. ఇఁక నా గ్రంథమాయన వ్రాసినదేయని వీరికెట్లు తెలియును? ఆయన వ్రాయుచుండఁగా వీరుచూడకపోయినను, జూచినవారు వారిబిడ్డలకును, నాబిడ్డలు తిరిగి తమబిడ్డలకును, వారు మరల తమబిడ్డలకును, వారు వారిసంతతికిని, నీవిధముగ నానాఁటినుండి యీనాఁటివఱకును వంశపరంపరగాఁ జెప్పికొనుచు వచ్చుచుండుట చేతనే యాసంగతి మననవనాగరకులకుఁ దెలిసినది. అందుచే నా గ్రంథమును 'షేక్స్పియర్' వ్రాసినాఁడని వీరుచెప్పుటకుఁగూడ నవకాశముకలిగినది; ఆసంగతిని దెలిసికొనుటకును, దానినిసత్యమని తలంచుటకునుగూడ మననవనాగరకులకుఁ బైరీతి లోకవ్యవహారమే యాధారమైనది. అనఁగా నా గ్రంథమును 'షేక్స్పియర్' వ్రాసినాఁడని లోకమునందలి జనులలోఁ బ్రతీతి (అనఁగా వాడుక) యుండుటచే నాసంగతి వీరికి తెలిసినది! ఏగ్రంథమెవరు వ్రాసిరో తెలిసికొనుటకు మనకందఱకునుగూడ లోకవ్యవహారమే యాధారము. దానిని ద్రోసిపుచ్చినచో, నేగ్రంథమెవరు వ్రాసిరనుసత్యమును దెలిసికొనుట కవకాశమేయుండదు. మన మిపుడొక గ్రంథమును వ్రాసితిమనుకొనుఁడు. మనము గతించినపిదపఁగూడ నా గ్రంథము లోకమునను౦డునుగదా! అపుడు, దానినెవరు వ్రాసిరనువిషయము ముందురాఁబోవు జనులకెట్లు తెలియును? దానిని మనమే వ్రాసితిమని చెప్పికొనుటకు మన గ్రంథము లోకమునందున్నంతకాలమును మనముగూడ దానితోఁబాటు జీవించియుండగలమా? ఉండఁజాలము. అందుచే, రాఁబోవుజనులు లోకవ్యవహారమువలననే యాసత్యమును దెలిసికొనవలసియుండును. లోకమందలిజనులిట్టివఱకును, నిప్పుడునుగూడ నట్లె తెలిసికొనుచున్నారు. ఆరీతిగ మననవనాగరకులుగూడ దెలిసికొనుచున్నారు. ఆప్రకారమే మనప్రాచీనచరిత్రలను మహర్షులు వ్రాసినట్లుగూడ లోకమందలి ప్రబలప్రతీతి (అనఁగా లోకవ్యవహారము) వలననే తెల్లగాఁ దెలియుచున్నది. ఇఁక నదియబద్ధమనుటకు మననవనాగరకుల కాధారము వట్టియనుమానముమాత్రమే యగుచున్నది; కాఁబట్టి యదినమ్మఁదగినది కాఁజాలదు.

"వేదమును దేవుఁడు మనుష్యులకిచ్చెనా"
యను సంశయమునకుఁ గారణము
'డార్విన్' పండితుని పరిణామసిద్ధాంతము.

ఏనచో, మననవనాగరకులు "వేదము పరమేశ్వరుఁడిచ్చెన"ను విషయమున నేలసంశయము పడుచున్నారో, తెలియునా? అందులకుఁ గారణముకూడ కొంతవఱకు మనని వీనచరిత్రలే.

ఏమనఁగా, నిదివఱలో మేము చూపియున్న ప్రకారముగ, "మనుష్యజాతి యెచటఁబుట్టినది"ను విషయమై యెట్టిసిద్ధాంతమును గాని స్థాపించుటకు విదేశీయులకు పట్టియూహలేగాని, యంతకంటె వ్రాతమూలమగు గట్టియాధారమేమియును లేదు. అదేరీతిగ "మనుష్యజాతి మొట్టమొదట నేప్రకారముగఁబుట్టినది"ను విషయమును నిర్ణయించుటకుఁగూడ వారికి గట్టి యాధారమేమియును లేదు. అందుచే నావిషయమునఁ గూడఁ బాశ్చాత్యవిద్వాంసు లెవరియిష్టప్రకారము వారూహలపై నూహలనూహించి కొన్నిసిద్ధాంతములను సాగించిరి. విదేశీయుల ప్రకృతిశాస్త్రములలోఁ బరిణామసిద్ధాంతము" (Evolution Theory) అనునొక సిద్ధాంతముగలదు. ఈసిద్ధాంతమును మొదట నెలకొల్పినవారు "డార్విన్" అనునొక విదేశీయపండితులు. ఈసిద్ధాంతము ప్రకారము మొట్టమొదట మనుష్యజాతియే భూమిపై లేదట. కోఁతులయొక్క జాతియే క్రమక్రమముగఁ గొన్ని మార్పులనుబొంది కడకు మనుష్యజాతిగ మారిపోయినదట. ఎట్లనఁగా కోఁతులకుఁ దరములు గడచిపోయిన కొలఁదియుఁ గ్రమక్రమముగఁ దోఁకలు తగ్గుచువచ్చెనఁట. అనఁగా మొట్టమొదట వానికి నొక గజముపొడవుగల తోఁకలుండెననుకొనుఁడు ఆకోఁతులకుఁబుట్టిన బిడ్డలయొక్క తోఁకలు గజముపొడవుండక, యంతకంటెఁ గొంచెము తక్కువగనుండెనఁట. ఆబిడ్డలకుఁబుట్టిన బిడ్డలయొక్క తోఁకలంతకంటెను నింకఁగొంచెము తక్కువగా నుండెనఁట, ఇట్లె కొన్నితరములు గడచిపోయినతరువాత నప్పటి కోఁతులయొక్క తోఁకలు గజమునకు మారుగనర్ధగజము మాత్రమే యుండెడివఁట. అట్లె యింకను మఱికొన్ని తరములుగడచిపోఁగా వానియొక్క తోఁకలు తగ్గితగ్గి, తుదకు నేమియుం మిగులకపోయెనఁట. అప్పుడు తోఁకలులేని కోఁతులు పుట్టుటకారంభించెనఁట. అట్లుపుట్టినకోఁతులే మనుష్యజాతి యాయెనఁట. ఆజాతి క్రమక్రమముగ నాగరకతనువృద్ధి చేసికొని ప్రపంచమున వ్యాపించెనఁట. కాఁబట్టి లోకమున నిపుడు గానవచ్చెడి మనుష్యజాతులన్నియుఁ బైకోఁతులజాతియొక్క సంతతియేయఁట. ఈసిద్ధాంత మొకటి పాశ్చాత్యులలో నుండుటచే నిప్పటి మన దేశస్థులలో నింగ్లీషు చదివినవారు కొందఱు దీనినే గట్టిగానమ్మియుండిరి. అందుచే వీరందఱును నిప్పటి మనుష్యజాతులన్నియుఁ గోఁతులనుండియే మొదటఁబుట్టియుండునని తలంచుచున్నారు. వారట్లు తలంచుచుండఁగా, మనుష్యులు బ్రహ్మదేవునినుండి పుట్టిరనియుఁ నీశ్వరుఁడు తనకిచ్చిన వేదములను బ్రహ్మదేవుఁడపుడు మనువు, ప్రజాపతులు, మొదలగు మనపూర్వులగు మనుష్యజాతి వారికిచ్చెననియును మన ప్రాచీనచరిత్రలు చెప్పుచున్నవిషయములను మననవనాగరకులెట్లు నమ్మఁగలరు? అట్లునమ్మఁజాలక పోవు

నారా? 'షేక్స్పియర్' ఈనాఁటివాఁడు కాఁడుగదా! ఇప్పటికెన్నియోవందల సంవత్సరముల క్రిందటివాఁడు. కాఁబట్టి యాయన తన గ్రంథమును వ్రాయుచుండఁగా వీరు చూచియుండుట యసంభవము. ఇఁక నా గ్రంథమాయన వ్రాసినదేయని వీరికెట్లు తెలియును? ఆయన వ్రాయుచుండఁగా వీరుచూడకపోయినను, జూచినవారు వారిబిడ్డలకును, నాబిడ్డలు తిరిగి తమబిడ్డలకును, వారు మరల తమబిడ్డలకును, వారు వారిసంతతికిని, నీవిధముగ నానాఁటినుండి యీనాఁటివఱకును వంశపరంపరగాఁ జెప్పికొనుచు వచ్చుచుండుటచేతనే యాసంగతి మననవనాగరకులకుఁ దెలిసినది. అందుచే నా గ్రంథమును 'షేక్స్పియర్' వ్రాసినాఁడని వీరుచెప్పుటకుఁగూడ నవకాశముకలిగినది; ఆసంగతిని దెలిసికొనుటకును, దానినిసత్యమని తలంచుటకునుగూడ మననవనాగరకులకుఁ బైరీతి లోకవ్యవహారమే యాధారమైనది. అనఁగా నా గ్రంథమును 'షేక్స్పియర్' వ్రాసినాఁడని లోకమునందలి జనులలో ప్రతీతి (అనఁగా వాడుక) యుండుటచే నాసంగతి వీరికి తెలిసినది! ఏగ్రంథమెవరు వ్రాసిరో తెలిసికొనుటకు మనకందఱకును గూడ లోకవ్యవహారమే యాధారము. దానిని త్రోసిపుచ్చినచో, నే గ్రంథమెవరు వ్రాసిరనుసత్యమును దెలిసికొనుట కవకాశమేయుండదు. మన మిపుడొక గ్రంథమును వ్రాసితిమనుకొనుఁడు. మనము గతించినపిదపఁగూడ నా గ్రంథము లోకమునందుండునుగదా! అపుడు, దానినెవరు వ్రాసిరనువిషయము ముందురాఁబోవు జనులకెట్లు తెలియును? దానిని మనమే వ్రాసితిమని చెప్పికొనుటకు మన గ్రంథము లోకమునందున్నంతకాలమును మనముగూడ దానితోఁబాటు జీవించియుండఁగలమా? ఉండఁజాలము. అందుచే, రాఁబోవుజనులు లోకవ్యవహారమువలననే యాసత్యమును దెలిసికొనవలసియుండును. లోకమందలిజనులిదివఱకును, నిప్పుడునుగూడ నట్లెతెలిసికొనుచున్నారు. ఆరీతిగ మననవనాగరకులుగూడ దెలిసికొనుచున్నారు. ఆప్రకారమే మనప్రాచీనచరిత్రలను మహర్షులు వ్రాసినట్లుగూడ లోకమందలి ప్రబలప్రతీతి (అనఁగా లోకవ్యవహారము) వలననే లెస్సగాఁ దెలియుచున్నది. ఇఁక నదియబద్ధమనుటకు మననవనాగరకుల కాధారము పట్టియనుమానముమాత్రమే యగుచున్నది; కాఁబట్టి యదినమ్మఁదగినది కాఁజాలదు.

"వేదమును దేవుఁడు మనుష్యులకిచ్చెనా"
యను సంశయమునకుఁ గారణము
'డార్విన్' పండితుని పరిణామసిద్ధాంతము.

ఐనచో, మననవనాగరకులు "వేదము పరమేశ్వరుఁడిచ్చెన"ను విషయమున నేలసంశయము పడుచున్నారో, తెలియునా? అందులకుఁ గారణముకూడ కొంతవఱకు మననవీనచరిత్రలే.

ఏమనఁగా, నిదివఱలో మేముచూపియున్న ప్రకారముగ, "మనుష్యజాతి యెచటఁబుట్టినది"ను విషయమై యెట్టిసిద్ధాంతమును గాని స్థాపించుటకు విదేశీయులకు పట్టియూహలేగాని, యంతకంటె వ్రాతమూలమగు గట్టియాధారమేమియును లేదు. అదేరీతిగ "మనుష్యజాతి మొట్టమొదట నేప్రకారముగఁబుట్టినది"ను విషయమును నిర్ణయించుటకుఁగూడ వారికి గట్టియాధారమేమియునులేదు. అందుచే నావిషయమునఁ గూడఁ బాశ్చాత్యవిద్వాంసు లెవరియిష్టప్రకారము వారూహలపై నూహలనూహించి కొన్నిసిద్ధాంతములను సాగించిరి. విదేశీయుల ప్రకృతిశాస్త్రములలోఁ బరిణామసిద్ధాంతము" (Evolution Theory) అనునొక సిద్ధాంతముగలదు. ఈసిద్ధాంతమును మొదట నెలకొల్పినవారు "డార్విన్" అనునొక విదేశీయపండితులు. ఈసిద్ధాంతముప్రకారము మొట్టమొదట మనుష్యజాతియే భూమిపైలేదట. క్రోఁతులయొక్కజాతియే క్రమక్రమముగఁ గొన్నిమార్పులనుబొంది కడకు మనుష్యజాతిగ మారిపోయినదఁట. ఎట్లనఁగా క్రోఁతులకుఁ దరములు గడచిపోయిన కొలఁదియుఁ గ్రమక్రమముగఁ దోఁకలు తగ్గుచువచ్చెనఁట. అనఁగా మొట్టమొదట వానికి నొక గజముపొడవుగలతోఁకలుండెననుకొనుఁడు ఆక్రోఁతులకుఁబుట్టిన బిడ్డలయొక్కతోఁకలు గజముపొడవుండక, యంతకంటెఁ గొంచెము తక్కువగనుండెనఁట. ఆబిడ్డలకుఁబుట్టిన బిడ్డలయొక్కతోఁకలంతకంటెను నింకఁగొంచెము తక్కువగా నుండెనఁట, ఇట్లె కొన్నితరములు గడచిపోయినతరువాత నప్పటి క్రోఁతులయొక్కతోఁకలు గజమునకు మారుగనర్ధగజము మాత్రమే యుండెడివఁట. అట్లె యింకను మఱికొన్ని తరములుగడచిపోఁగా వానియొక్కతోఁకలు తగ్గితగ్గి, తుదకు నేమియును మిగులకపోయెనఁట. అప్పుడు తోఁకలులేని క్రోఁతులు పుట్టుటకారంభించెనఁట. అట్లుపుట్టినక్రోఁతులే మనుష్యజాతి యాయెనఁట. ఆజాతి క్రమక్రమముగ నాగరకతనువృద్ధిచేసికొని ప్రపంచమున వ్యాపించెనఁట. కావఁబట్టి లోకమున నిపుడుగానవచ్చెడి మనుష్యజాతులన్నియుఁ బైక్రోఁతులజాతియొక్క సంతతియేయఁట. ఈసిద్ధాంతమొకటి పాశ్చాత్యులలో నుండుటచే నిప్పటి మనదేశస్థులలో నింగ్లీషుచదివినవారు కొందఱు దీనినే గట్టిగానమ్మియుండిరి. అందుచే వీరందఱును నిప్పటి మనుష్యజాతులన్నియుఁ గ్రోఁతులనుండియే మొదటఁబుట్టియుండునని తలంచుచున్నారు. వారట్లు తలంచుచుండఁగా, మనుష్యులు బ్రహ్మదేవునినుండి పుట్టిరనియుఁ నీశ్వరుఁడు తనకిచ్చినవేదములను బ్రహ్మదేవుఁడపుడు మనువు, ప్రజాపతులు, మొదలగు మనపూర్వులగు మనుష్యజాతి వారికిచ్చెననియును మన ప్రాచీనచరిత్రలు చెప్పుచున్నవిషయములను మననవనాగరకులెట్లు నమ్మగలరు?అట్లునమ్మఁజాలకపోవు

టకుఁ గారణము మనప్రాచీనచరిత్రలకున్న యాధారములకంటెఁ బై విదేశీయ సిద్ధాంత మున కెక్కువయాధారము లుండుటగాదు. ఇఁక నేమనఁగా, వారు మొట్టమొదట బాల్యమున నేర్చుకొన్నవి విదేశీయసిద్ధాంతమునందలి సంగతులేయగుటచే నవియే వారి మనస్సులలో గట్టిగా నాటుకొనియున్నవి. అందుచే నవి సత్యమా, కాక, మనప్రాచీన చరిత్రలందలి విషయములు సత్యమా, యని వారాలోచించుట కంతగా నవకాశము గల్గుటలేదు. వారిమనస్సులకుఁ గ్రోఁతులనుండి మనుష్యులుపుట్టుటయే యెక్కువ యుక్తియుక్తముగాఁ గనుపట్టుచున్నదిగాని, సృష్టికర్తనుండి మనుష్యులు పుట్టుటగాని, ప్రపంచమందలి సమస్తచరాచరములను సృష్టింపఁగల్గిన సృష్టికర్త మనుష్యజాతినిగూడ సృష్టింపఁజాలియుండుటగాని మననవనాగరకుల కంతయుక్తియుక్తముగాఁ దోఁచుట లేదు! అట్లుతోఁచినచో నిఁక నవనాగరకతయొక్క యాధిక్యత యేమి యుండును? కావున బై విషయములం దేదిసత్యమో కొంచెము విచారించిచూతము.

## పరిణామసిద్ధాంత విమర్శనము.

పై విదేశీయ సిద్ధాంతమునకుఁ బ్రత్యక్షమగుసాధార మేమియు నున్నట్లుగాన రాదు. అనఁగా నాసిద్ధాంతము ప్రకారము క్రోఁతులజాతి మారిపోయి మనుష్యజాతియ గుచుండగా నాసిద్ధాంతమును జేసిన "డార్విన్" పండితుఁడు స్వయముగాఁ జూచి యుండడు ఏలననఁగా నది యెన్నియోవందల యేండ్లకుఁ బూర్వమే జరిగిన ట్లాయన వ్రాయుచున్నాఁడు. కావున నప్పు డాయనయుండిచూచుట పొసగదు. అంతేగాక, యాతడును మనుష్యజాతిలోనివాఁడే గదా! ఆజాతియొక్క పుట్టుకనుజూచుట కంతకుముందే యాయనపుట్టి యుండవలయుంగదా! అంతకుముందుఁ గ్రోఁతులజాతియే గాని మనుష్యులజాతిలేదని యాయనసిద్ధాంతమే చెప్పుచున్నది. కాబట్టి మనుష్యుఁ డగు నాపండితుఁడు క్రోఁతులజాతినుండి మనుష్యులజాతిపుట్టుచుండఁగా దానిని జూచి యుండుట సంభవింపనేరదు. అంతేగాక యట్టివారెవరును జూచిచెప్పినట్లుగూడ "డార్విన్" పండితుఁడు వ్రాసియుండలేదు. అట్లుచూచిన వారీపండితుని కాలము వఱకును జీవించియుండఁజాలరు. వారువ్రాసిన గ్రంథరూపమగు నాధారమేమియున్న ట్లును "డార్విన్" పండితుఁడుచెప్పియుండలేదు. క్రోఁతులజాతి మనుష్యజాతిగమారు టకు ముందు మనుష్యజాతియే యుండఁజాలనపుడు కొందఱు మనుష్యజాతివారా విష యమునుజూచివచ్చి "డార్విన్" పండితునకుఁజెప్పుటగాని, కాక, యాయనకా విష యమును గ్రంథస్థముచేసియుండుటగాని మాత్రమెట్లు జరుగఁగలదు? ఇందువలనఁ బైసిద్ధాంతమునకుఁ బ్రత్యక్షమగుసాధారమేమియును లేదనియే తేలుచున్నది. అట్టి

ప్రత్యక్షప్రమాణమేమియును లేకున్నప్పటికిని, నాపండితునకుఁ ద్రికాలజ్ఞానముకలదని కాని, దాని సహాయముచే నాయన యీసంగతిని దెలిసికొని వ్రాసెనని కాని మనము తలంచుటకైనను వీలుగానరాదు. ఏమనఁగా నట్టి త్రికాలజ్ఞానముయొక్క సహాయముచేఁ దాను దానిని వ్రాసినట్లాపండితుఁ డెచటనైనఁ జెప్పికొనియుండెనా? ఆయన యట్లువ్రాసెనని మన మెట్లు చెప్పఁగలము? ఐనచో నిఁక నాసిద్ధాంతమెట్లు కనిపెట్టె ననఁగా నట్టి యనుమాన ప్రమాణముల నాధారముగఁగొని యూహలచే దానిని నిర్మించెను. ఎట్లనఁగా, మనుష్యులయొక్క యస్థిపంజరములను (అనఁగా శరీరమునందలి యెముకలచూర్పఁబడిన విధానమును) దక్కినజంతువులయొక్క యస్థిపంజరములతోఁ బోల్చిచూడఁగాఁ గ్రోఁతుల యస్థిపంజరములకును, మనుష్యులయస్థిపంజరములకును నెక్కువపోలికలు గనుపించెనఁట. అందుచే నారెండుజాతులకును నెక్కువసంబంధముండి యుండునని యాయన యూహించెను. ఇట్టివే మఱికొన్నియూహలను (అనఁగా ననుమానములను) నాధారముగఁగొని క్రోఁతులయొక్క తోఁకలుతగ్గితగ్గి వానినుండియే మనుష్యజాతిపుట్టియుండునని యాయనసిద్ధాంతముచేసెను.

కాని, తిన్నఁగా నాలోచించిచూడఁగా నీసిద్ధాంతమునకుఁ బైనదెలిపినరీతిగఁ ప్రత్యక్షమును నాధారమేమియును లేకపోవుటయేగాక, యదియంత యుక్తియుక్తముగాఁగూడ తోఁచుటలేదు. ఏమనఁగా, సృష్టిలోఁ దోఁకలుగలజంతువు లొక్క క్రోఁతులుమాత్రమే గాదు. అట్టివనేకములున్నవి. తరములుగడచిన కొలఁదిని తోఁకలు తగ్గిపోవుట ప్రకృతిధర్మమే (law of nature) యైనచో నట్టిమార్పుపిల్లులు, కుక్కలు, మొదలగు నితరజంతువులన్నిఁటిలోఁగూడ జరిగియుండవలయును. అనఁగా, "డార్విన్" గారిసిద్ధాంతము ప్రకారము క్రోఁతులతోఁకలు తగ్గితగ్గి తుదకుశూన్యమై, (యేమియు మిగులకపోయి) యాజాతి తోఁకలేనిమనుష్యజాతిగ మారినట్లే, తక్కిన జంతువుల తోఁకలుగూడ తగ్గిపోయి యాజాతులలోనుండి కూడ తోఁకలులేని మఱికొన్ని యితరజాతులుపుట్టియుండవలెను. కాని, యట్లుపుట్టియుండుటను మన మెచ్చటను గానము. అట్టి జాతులుకొన్నిపుట్టియున్నవని యేపండితుఁడైనను నెచటనుజెప్పియున్నట్లు వినియుండము. కావున నట్లుతోఁకలుతగ్గిపోయి యాజాతు లితరజాతులుగ మారుట సృష్టిస్వభావమని తలంచుటకు వీలులేదు.

"పోనిండు; అట్టిస్వభావ మితరజంతువులకు లేకపోయినఁబోవచ్చును; కాని, క్రోఁతులలోమాత్రమే యట్టి స్వభావమేలయుండరాద"ని తలంతమన్న నందులకును వీలులేదు, ఏలననఁగా నది ప్రకృతిధర్మమేయైన యడల సామాన్యముగ నన్నిజంతువుల

మును వర్తింపవలసినదే. కాని, యొక్క క్రోఁతులకు మాత్రమువర్తించి తక్కినవానికి వర్తింపకపోవుటకుఁ దగిన ప్రత్యేక కారణమేమైననుండవలదా? అట్టి కారణమేమియును గానరాదు; ఉన్నట్లాపండితుఁడైనను గనుపఱచియుండలేదు. ఇఁకనది ప్రత్యేకముగఁ గ్రోఁతులందుమాత్రమేవర్తించెడి ప్రకృతిధర్మవిశేషమని మనమెట్లు తలంపవచ్చును.

“పోనిండు; అది ప్రత్యేకముగఁ గ్రోఁతులందుమాత్రమే వర్తించుటకుఁదగిన కారణము మనకుఁదెలియక పోఁగూడదా? ఆరీతిగ నితరజంతువులలో లేకయే, యొక్కొక్కజాతియందుఁ బ్రత్యేకముగఁ గొన్నికొన్ని ప్రకృతిధర్మములుండుటను మనము చూచుటలేదా? నాల్గుకాళ్లుగల జంతువులు (గుఱ్ఱములు, ఎద్దు, పిల్లులు, కుక్కలు,) మొదలగునవి యన్నియును బోలికలో నొక్కటేరీతిగనున్నను, నందుఁగొన్ని నెమరువేయునవిగను, మఱికొన్ని నెమరువేయనివిగను నుండలేదా? అట్టిభేదముండుటకుఁగారణము మనకుఁదెలియక పోఁగూడదా? అంతమాత్రముచే నాప్రకృతిధర్మము వానియందు వర్తింపకపోవునా? అట్లే క్రోఁతులయందుమాత్రమే తోఁకలుతగ్గిపోయి యితరజాతిగామారెడి ప్రకృతిధర్మము వర్తించుటకుఁ గారణముకూడ మనకుఁగాని “డార్విన్” పండితునికిఁగాని తెలియకపోయిన నేమి? అదియట్లేలజరుగరాద”ని కొంద ఱాక్షేపింపవచ్చును. సమాధానమువినుఁడు.

పైనాల్గుకాళ్ల జంతువులలోఁగొన్ని నెమరువేయుటకును, మఱికొన్ని వేయ కుండుటకును గారణము మనకుఁదెలియకపోయినను నట్టి ప్రకృతిధర్మమొకటి యుండుట మనము లోకమునఁజూచుచున్నాము. అందుచే నదిసత్యమని లోకముననమ్ముట కవకాశముగల్గుచున్నది. అట్లే పై ప్రకృతిధర్మము (అనఁగాఁ గ్రోఁతులకుఁ దరతరమునను దోఁకలు తగ్గితగ్గి తుదకు శూన్యమైయవి మనుష్యులుగమారిపోవుట సహితము) క్రోఁతుల యందు వర్తించుచుండుట లోకమునఁ గనుపించినయెడల నది యితరజంతువులలో లేకపోవుటకుఁగారణము మనకుఁ దెలియకపోయినప్పటికిని మనమా ప్రకృతిధర్మమును సత్యమని నమ్మితీరవలసినదే. కాని, యట్టిప్రకృతిధర్మము లోకమునఁ గన్పట్టుచున్నదా? “డార్విన్”యొక్క సిద్ధాంతము ప్రకృతి ధర్మమేయైనయెడల లోకమున నిపుడు గన్పట్టకుండుటకుఁ గారణముండవలదా? అనఁగా “డార్విన్”యొక్క సిద్ధాంతము ప్రకారము మొట్టమొదటిఁ దోఁకలుగల క్రోఁతులసంతతికిఁ గొంతకాలము గడచుసరికిఁ దోఁకలు క్షీణించిపోవునుగదా? అట్లుజరుగుట కేదియోకొంతకాలము పట్టియుండవల యునుగదా? సుమారు వేయిసంవత్సరముల కాలము పట్టినదనుకొందము. అనఁగా మొదటఁ దోఁకలుగల క్రోఁతులసంతతికి దరతరమునను క్రమక్రమముగ దోఁకలు

కొంచెముకొంచెము తగ్గుచువచ్చి, వేయిసంవత్సరములు గడచుసరికి దోఁకలు పూర్తిగ నశించి తుదకుఁ దోఁకలులేని మనుష్యజాతిగ మారెననుకొందము. అదియే ప్రకృతి ధర్మమైనచోఁ దోఁకలుగల క్రోఁతులజాతియంతయును బైఁదెలిపిన వెయ్యిసంవత్సరములును గడచుసరికిఁ బూర్తిగ మనుష్యజాతిక్రింద మారిపోయియుండవలయునుగదా! అనఁగా సృష్టిమొదటనున్న కోఁతులన్నియును మనుష్యులైపోయి యుండవలయును, ఐనచో, నిపుడును, లోకమునఁ దోఁకలుగలకోఁతులను మనముచూచుచుండుటలేదా? ఈకోఁతులు మరల నెచటనుండి దిగివచ్చినవి?

అంతేగాక, యిప్పటికి వెయ్యిసంవత్సరములక్రిందటఁగూడ లోకమునఁ దోఁకలుగలకోఁతు లున్నవా? లేవా? లేవనుటకు వీలులేదు; ఏలననఁగాఁ దోఁకలుగల కోతుల నిపుడు మనము లోకమునఁజూచుచున్నాము. "డార్విన్" పండితుని సిద్ధాంతము ప్రకారము క్రోఁతులకున్నతోఁకలు కాలముగడచినకొలఁదిని దగ్గిపోయి తుదకుఁ దోఁకలులేనిక్రోఁతులుగ మారుటయే ప్రకృతిధర్మము గాని, తోఁకలులేనిక్రోఁతులకుఁ గ్రొత్తగాఁ దోఁకలుపుట్టి, యవి పెరిగి తుదకుఁ దోఁకలుగల క్రోఁతులుగమారుట ప్రకృతి ధర్మము కాఁజాలదు. అందుచేనిపుడు గానవచ్చెడి తోఁకలుగలక్రోఁతు లింతకుబూర్వ మెప్పుడుగాని లేవనుటకువీలులేదు అప్పుడే లేనియెడల నట్టిక్రోఁతు లిప్పుడుమాత్ర మెచటనుండివచ్చును? కాఁబట్టి యప్పుడుగూడ నున్నవనియే యొప్పుకొనవలయును. ఉన్నయెడల పైప్రకృతిధర్మమునను సరించి యాక్రోఁతుల కిప్పటికి వేయిసంవత్సరములు గడచుటచే వానిసంతతి తోఁకలులేని మనుష్యజాతిగ మారుచుండుట యిప్పుడుగూడ జరుగుచుండవలయునుగదా! అనఁగాఁ గ్రోఁతులనుండి మనుష్యులుపుట్టుట యీనాఁటికిని లోకమున గనుపట్టుచునేయుండవలయును. కాని, యట్లుకనఁబడుచున్నదా? లేదు! ఏలకనబడుటలేదు? అది ప్రకృతిధర్మమే యైనయెడలఁ గనఁబడవలదా? కావున నది ప్రకృతిధర్మమనుట యుక్తియుక్త మెట్లగును?

సృష్టిలో మొదటనున్న తోఁకలుగలక్రోఁతు లన్నియుఁగూడ పైప్రకృతిధర్మము ననుసరించి మారిపోయిన వనుకొనవలయునా? కాక, కొన్నిమాత్రమే మారెనని యనుకొనవలయునా? కొన్నిమాత్రమే మారెనని యనుకొందుమా, యైనచో, దక్కినవి మారకుండుట కేమికారణము? క్రోఁతులజాతికి సంబంధించినప్రకృతిధర్మ మాజాతి లోనే కొన్నిక్రోఁతులకుమాత్రము వర్తించి మిగిలినవానికి వర్తింపకుండునా? కాఁబట్టి కొన్నిమాత్రమే మారెననుటకు వీలులేదు. ఐనచో, నన్నియునుమారెననియే యనుకొన వలయును. కాని, యట్లన్ని క్రోఁతులును తోఁకలనుగోల్పోయి మనుష్యులుగమారిపోయి

యుండినచోఁ, దోఁకలుగల క్రోఁతు లటుపై నిఁక లేవనియేగదా యర్థము! కాని, తోఁకలుగల క్రోఁతులను మనమిపుడు లోకమునఁ జూచుచుండ లేదా? చూచుచునే యుంటిమి. ఐనచో నవి మరల నెచటనుండి దిగివచ్చినవి? కావున, నన్ని క్రోఁతులును మనుష్యులుగ మారిపోయెననుటకుగూడ వీలుకనుపించుట లేదు. ఇట్లాలోచించి చూడఁగా, కొన్ని క్రోఁతులుమాత్రమే మనుష్యులుగ మారెననుటకును వీలులేదు; అన్నియును మారెననుట కంతకంటెను వీలుకనఁబడ లేదు, కావునఁ గ్రోఁతులజాతిమారి మనుష్యజాతియయ్యెననుట కవకాశమే లేదు!

లోకమున నేజాతియైనను దరములుగడచిపోవుటోను సహజముగఁ గ్రమక్రమముగ శరీరపరిమాణమునక్షీణించుట యందఱికిని ననుభవసిద్ధమే. అదియబద్ధమనుటకు వీలులేదు. ఏలననఁగా మనముత్తాతలకును, దాతలకును దండ్రులకును, గలయాయుర్దాయములును, శరీరదార్ఢ్యములును, మనయందుఁ గొంచెము లోపించియుండుట సామాన్యముగ వినుచున్నాము; మఱియును జూచుచున్నాము. అట్టిమార్పు శరీరమునందలి యన్ని యవయవములకును వానివానికిఁ దగినంత పరిణామము చొప్పున (Proportionately) గలుగుచున్నదిగాని, కొన్ని యవయవములు మితిమీరి తగ్గి మఱికొన్ని మిక్కిలి తక్కువగఁ దగ్గుచుండుటగాని, కొన్ని తగ్గక యట్లేయుండి మఱి కొన్నిమాత్రమే క్షీణించిపోవుటగాని లేదు. అట్లే యవయవములందలి పటుత్వములును తగ్గుచున్నవి. అనఁగాఁ బూర్వులయొక్క తలలకంటె మనతలలు తగ్గి కొంచెము చిన్నవైనట్లుగనే వారి కాళ్లకంటె మన కాళ్లుకూడ కొంచెము తగ్గినవి; వారి చేతులకంటె మన చేతులుగూడ నట్లే తగ్గి కొంచెము చిన్నవైనవి; పొట్టలును నట్లే కొంచెము తగ్గినవి; అట్లే తక్కిన యవయవములన్నియుఁగూడ కొంచెము కొంచెముగఁ దగ్గినవి. కాని, కాళ్లు చేతులు, పొట్టలు మొదలగు నింద్రియములన్నియు నట్లేయుండి యొక్క తలకాయలు మాత్రమేగాని, కాక, యొక్క కాళ్లుమాత్రమేగాని, కాక, యొక్క చేతులుమాత్రమే గాని తగ్గిపోవుట లేదు. అట్లు తగ్గిపోయినయెడలఁ గొంత కాలముగడచుసరికి, "డార్విన్" గారి సిద్ధాంతముప్రకారము, తోకలుమాత్రమే లేని క్రోఁతులజాతిమిగిలి మనుష్యజాతియైనట్లుగనే, కాళ్లుమాత్రమే లేని మనుష్యజాతియును, చేతులుమాత్రమే లేని మనుష్యజాతియును మిగిలి వేఱుజాతులుగ లోకమునఁ బరిణమింపవలసియుండెడిదే; అంతేగాదు; తుదకు లోకమునఁ దలలులేని మనుష్యజాతిగూడ నొకటిమిగిలి యుండెడిదే! కాని, యట్టిది యసంభవమగుటచేఁ బ్రతిజాతియొక్కయు శరీరములందలి యన్ని యవయవములును గొంచెముకొంచెముగఁ దరములవెంటఁ దగ్గుటయే ప్రకృతిధర్మమగును గాని,

యందుఁ గొన్నిమాత్రమే తగ్గుట ప్రకృతిధర్మము కాఁజాలదు. అట్టిసందర్భమున "డార్విన్" సిద్ధాంతమును ననుసరించి, క్రోఁతులతోఁకలు క్షీణించి తుదకు శూన్యమైపోవుట సత్యమైనయడలఁ దోఁకలతోబాటు వానియొక్క తక్కినయంగము లన్నియుఁగూడ శూన్యమైపోయియే యుండవలయును. అనఁగాఁ, గ్రోఁతులజాతియే లోకమున శూన్యమై పోయియుండవలయునుగాని వానితోఁకలుమాత్రము పోయి యవిమిగిలియుండుట పొసఁగనేరదు. వానికిఁ దక్కిన యంగములు క్షీణింపక, యొక్క తోఁకలుమాత్రమే క్షీణించుటకు విశేషమగు (ప్రత్యేక) కారణ మేమైననున్నయడల దానిని "డార్విన్" పండితుఁ డుదాహరించియే యుండవలదా? అట్లుదాహరించియుండెనా? కావున నాపండితునియొక్క పైసిద్ధాంతము మిక్కిలి యసంభవము గాలేదా?

అంతేగాక, లోకమునఁ గ్రోఁతులజాతినుండి మనుష్యజాతిపుట్టినరీతిగనే, యొక జాతినుండిపుట్టి మఱియొకజాతిగ మారినజంతువు లింకను వేఱేమైనఁ గలవా? అట్టి వున్నట్లు "డార్విన్" పండితుఁడు నిరూపించియుండెనా? లోకమునఁ దక్కిన జాతులను బ్రత్యేకముగ సృష్టించిన సృష్టికర్త మనుష్యజాతినిగూడ నట్లే ప్రత్యేకముగ సృష్టింపఁజాలకపోయెనా? అట్లుసృష్టింపక యాజాతిని గ్రోఁతులజాతినుండియే యేల పుట్టించెను? మనుష్యజాతి క్రోఁతులజాతినుండి యేర్పడెనుగదా! ఆక్రోఁతులజాతి యే జాతినుండి యేర్పడెను? క్రోఁతులజాతి ప్రత్యేకముగనే యేర్పడెరా? యనచో, మనుష్య జాతిమాత్ర మట్లేర్పడకుండుటకుఁ గారణమేమి?

పైవిషయములన్నియుం విచారించిచూడఁగా, "డార్విన్" పండితుని పైసిద్ధాంత మెంతయసంభవముగను, బ్రకృతివిరుద్ధముగను, హేతురహితముగను, యుక్తిశూన్యము గను, లోకానుభవహీనముగను నున్నదో యాలోచింపుఁడు! ఎందువలననో గాని యింగ్లీషు చదివిన యిప్పటిమన దేశీయులకు విదేశీయులసిద్ధాంతములందు సహజముగ మిక్కిలి నమ్మకము గల్గుచున్నది; మన ప్రాచీనచరిత్రలందును, ఋషిరాచారములందును, నమ్మకముపోయి వారికి వానియం దనాదరణమును, నిర్లక్ష్యమును గల్గుచున్నవి. అందుచే విదేశీయులసిద్ధాంతములందుఁ గలబలాబలములను విచారించుటకే వారికవసరము గల్గుట లేదు. వారికి మనప్రాచీనచరిత్రలందుఁ దగినంతయనుభవజ్ఞానము లేకపోవుట, పైదానికి మఱింత తోఁడైనది. అందుచే నెంతయుక్తిశూన్య మగువిషయమైనను విదేశీయులపండితులచే సిద్ధాంతముచేయఁబడినచో, "విస్సన్న చెప్పినదే వేదమను"నట్లుగ నది మనసవనాగరకుల మనస్సులలో గాటముగ నాటుకొనుచున్నది. ఇందులకుఁ బై "డార్విన్" పండితునిసిద్ధాంత మె నిదర్శనము. చిన్నతనమునుండియు మనప్రాచీనచరిత్రలలోఁ దగి

నంతయనుభవజ్ఞానము గల్గునట్లు వాని నిప్పటిమన దేశీయులచేఁ జదివింపకపోవుటయును, నందులకుమారుగ విదేశీయపాఠశాలలలో వానిని జదివించుటయును, వారికి మనప్రాచీన చరిత్రములందు నమ్మకములేకపోవుటకు ముఖ్యకారణములు. "డార్విన్" పండితుని సిద్ధాంతమును నమ్మియుండుటచేత మనుష్యజాతి కోఁతులనుండిపుట్టెనని యిప్పటిమన దేశీయులలోఁ గొందఱు తలంచుచున్నారు. అందుచే మనుష్యులను సృష్టికర్తసృజించె ననువిషయము గాని, వారికి వేదమునొసంగె ననుసంగతి గాని, మనవనాగరకులకు నమ్మఁ దగినవిగాఁ దోఁచుటలేదు. వేదములు పరమేశ్వరునిచే నీయఁబడెననుసంగతిని వారు నమ్మఁజాలకపోవుటకుఁ "డార్విన్" పండితునియొక్క పైసిద్ధాంత మొకకారణము. ఆసిద్ధాంతము సత్యముగాఁజాలదని పైననిరూపింపఁబడుటచే వేదమును బరమేశ్వరుఁడు మనుష్యులకిచ్చుట యసందర్భము కాఁజాలదని నిశ్చయమగుచున్నది.

## వేదమును దేవుఁడేయిచ్చినచోఁ దక్కినదేశములవారి కేలయీయలేదు.

వేదమును బరమేశ్వరుఁడు మనుష్యజాతికొఱకిచ్చెననువిషయము నిప్పటి మననవనాగరకులలో మఱికొందఱు నమ్మఁజాలకపోవుటకు మఱియొకకారణము గలదు. ఏమనఁగా ననార్యులను నొకజాతివారు మొదట మనదేశముననున్నట్లును, నటుపైఁ గొంతకాలమునకు 'ఆసియాఖండ మధ్యభాగము' (Central Asia) నుండి యార్యులను నొకజాతివారు బయలుదేరి వారిలోఁ గొందఱుమాత్ర మీదేశమునకు వలసవచ్చినట్లును, దక్కినవారిలోఁ గొందఱు, 'యూరప్‌ఖండము (Europe) నకు వలసవెళ్లినట్లును, నట్లే మఱికొందఱార్యు లితరఖండములకుఁబోయి యాయాదేశములందు నివాసమేర్పఱచుకొనినట్లును, మనదేశపు నవీనచరిత్రలయందు విదేశీయులగు నవీనచరిత్రకారులును, వారిననుసరించి స్వదేశీయులగు నవీనచరిత్రకారులునుగూడ వ్రాసియున్నారు. కాని పైయార్యులు మొట్టమొదట 'యాసియాఖండమధ్యభాగము'న కెట్లువచ్చిరో, యట్లే పైయనార్యులను జాతివారుగూడ మొదట మనదేశమున కెట్లేర్పడిరో, యాసంగతులనుమాత్రము నవీనచరిత్రకారు లెవ్వరునుగూడ వ్రాసినట్లు కానరాదు. ఇందుల కుదాహరణముగ, స్వదేశీయులు తెలుఁగులోవ్రాసిన నవీనచరిత్రలలో ముఖ్యమైనదని చెప్పఁదగిన "హిందూదేశకథాసంగ్రహము"ను గ్రంథమందలి ప్రథమభాగమగు 'హిందూమహాయుగము'లోఁ జరిత్రభాగము ప్రారంభింపఁబడిన యీక్రింది విధానమును జూడఁదగును:—

* * * * *

"ఈప్రకార మీదేశముయొక్క యాకారమును, వైశాల్యమును, ఇందలి జనులవివరణంబును, రాజ్యంబులయునికియుఁ గనుఁగొనినపిదప నీదేశమునకు ఈవివిధ జనంబు లెప్పుడెప్పు డెచ్చటినుండివచ్చినది మనము గనుఁగొనవలసియున్నది. అనఁగా ఈదేశపుఁజరిత్ర మనము తెలిసికొనవలయును.

## చరిత్రవిభాగములు.

హిందూదేశచరిత్రయంతయు మూఁడుమహాయుగములుఁగ విభజింపవచ్చును.

౧. హిందూమహాయుగము. (Hindu Period);—ఇదిహిందూరాజులు ప్రభుత్వము చేసిన కాలము. ఈమహాయుగముయొక్కవ్యాప్తి క్రీ. పూ. ౨౦౦౦ మొదలు క్రీ. శ. ౧౨౦౦ వఱకు ననఁగా మూఁడు వేల రెండువందలయేండ్లని చెప్పనగు.

* * * * * *
* * * * * *

ఈమూఁడుమహాయుగములలోని హిందూదేశచరిత్ర యిఁక వేర్వేఱ వర్ణింపఁబడును.

## ౧. హిందూమహాయుగము.

### క్రీ. పూ. ౨౦౦౦—క్రీ. శ. ౧౨౦౦.

నాలుగువేలేండ్లక్రిందట మనపూర్వులగునార్యులను వారీదేశమునకు వచ్చినది మొదలు, ఏడువందలసంవత్సరములకుఁ బూర్వము తురుష్కు లీదేశమును జయించిన కాలమువఱకును జరిగినసమాచారములన్నియు నీమహాయుగమును వర్ణించుటలో రాఁగలవు".

* * * * * *

(హిందూమహాయుగము, పుటలు. ౧౩, ౧౪.)

మనుష్యజాతి మొదట నేదేశమునసృష్టింపఁబడినదో యెఱుఁగుటకు విదేశీయ పండితులకు వట్టియూహలుమాత్ర మేతప్ప ప్రామాణికమగుగట్టి యాధారమేమియును లేదు; అందుచే నావిషయమును నిర్ధారణచేసికొనలేక యాపండితు లగచాట్లుపడి కావించికొనిన యన్యోన్యవిరుద్ధసిద్ధాంతములను వారిలో నొండొరులకు గలయభిప్రాయ భేదములను నిదివఱలోఁ జూపియేయున్నాముగదా! "నవీనచరిత్రకారులు వట్టియూహపై నాధారపడుట వారిలోవారికిఁ గల్గినభేదాభిప్రాయముల కుదాహరణము.

అందుచే నవీనచరిత్రకారులువ్రాసిన పైనవీనచరిత్రలనుజదివిన నవనాగరకు లలోఁ బెక్కుమంది, పైయార్యులు, నవార్యులు మొదలగు మనుష్యజాతు లాయాదేశ ములందు మొదట నున్నవనిమాత్రమే యెఱుఁగుదురుగాని, యచటికవి యెచటినుండి వచ్చినవో యెట్లువచ్చినవో, యెప్పుడువచ్చినవో వారికిఁదెలియదు. పైమనుష్యజాతుల నానాదేశములందే యీశ్వరుఁడు పుట్టించియుండునని వారనుకొనుచున్నారు. వేదము మనదేశమందలి జనులలోమాత్రమే కానవచ్చుచున్నదిగాని తక్కిన దేశములందలి మనుష్యజాతులలోఁ గానవచ్చుటలేదు. అందుచే నది మనపూర్వులెవరి చేతనో కల్పింపఁ బడియుండుననియుఁ, గావుననే యది మనదేశమందుమాత్రము కానవచ్చుచున్నది గాని యితరదేశములందుఁ గానవచ్చుటలేదనియుం వారు (పైనవనాగరకులు) తలంచు చున్నారు. "పరమేశ్వరుఁడే వేదము నిచ్చియున్నయెడల, లోకమందలి తక్కిన మనుష్యజాతుల కెవ్వరికినిసీయక, మనపూర్వులకు నొక్కరికిమాత్రమే యిచ్చియుం డునా? అట్లుచేయుటకు భగవంతుఁడు పక్షపాతియా? ఆయన కందఱియందును బ్రేమ సమానమేగదా!" యని వారు సందేహించుచున్నారు. ఇట్టిసందేహము గల్గుటకుఁగూడ కారణము, వారికి మనప్రాచీనచరిత్రలసంబంధమగు జ్ఞానము సరిగాలేకపోవుటయే. ఏమనఁగా, మనప్రాచీనచరిత్రలను దిన్నగాఁబరిశోధించినచో, బరమేశ్వరుఁడు మొట్ట మొదట మానవజాతినంతను మనదేశముననేపుట్టించి వారియుపయోగముకొఱకు వేద మును బ్రసాదించియుండెననియుఁ, నావేదములోఁ జెప్పఁబడినధర్మముల ప్రకారమే తొలుత మనుష్యులందఱును బ్రవర్తించుచుండిరనియును, నిపుడు లోకమున నితరదేశ ములందుఁగానవచ్చెడి మనుష్యజాతులన్నియునుగూడ సృష్టికిఁబిమ్మట గొంతకాలము గడచినవెనుక మనదేశమునుండియే చీలిపోయినవై యున్నవనియును, మనప్రాచీనచరి త్రలవలన దెలియవచ్చుచున్నది. అందుచే వానినిబట్టిచూడఁగాఁ బైదెలిపిన సంశ యము మననవనాగరకులకుఁ గలుగుటకే యవకాశము గన్పట్టుటలేదు.

లోకమున మంచిఫలముల నిచ్చెడి కార్యములన్నియుం సామాన్యముగ మొద టిలోఁ గొంచెము కష్టసాధ్యములై యుండుట సహజము. ఎట్లనఁగా, విద్య నేర్చికొనిన పిమ్మట దానివలన నెన్నియో సౌఖ్యములు గలుగునను విషయమందఱికిని దెలిసినదే. కాని, ప్రారంభములో నెన్నియో నియమములకులోనై, వేళకు సరిగా బడికిఁ బోవు చుండవలయును; ఇంటిదగ్గఱ సరిగా పాఠములు వల్లించుచుండవలయును; ఉపాధ్యా యుఁడు చెప్పెడిదానిని శ్రద్ధతో వినుచుండవలయును; విద్య నేర్పెడి గురువునందును, నేర్పించెడి తల్లిదండ్రులందును, నడకువతోడను భయభక్తులతోడను . మెలఁగుచుండవల

యుండు. ఇట్లే పెక్కు శ్రమలకులోనైనవారికే విద్యలభించునుగాని, సామాన్యముగ మొదటితోనే సుఖపడమరిగి, వేళకుఁదిన్నఁగా బడికిపోకయుండు, గురువుచెప్పునది శ్రద్ధతో వినకయుండు, నింటికడ నొడలువంచి పాఠములువల్లింపకయుండు, స్వేచ్ఛగాఁదిని తిరుగుట కలవాటుపడినవారికి విద్యరానేరదు. అట్లే పెక్కునియమములకులోనై యుక్తకాలమునఁ దగినరీతిగ బ్రహ్మచర్యవ్రతమనుష్ఠించినవారికే, తక్కిన జీవితకాలములో శరీరదార్ఢ్యమును, దీర్ఘాయురారోగ్యములును, జాఱుకుబుద్ధియుఁ లభించునుగాని, తొలుతఁ జిన్నవయస్సున స్వేచ్ఛావిహారమున కలవాటుపడి స్త్రీలోలురై బ్రహ్మచర్య మనుష్ఠింపని వారు పైనదెలిపిన శరీరదార్ఢ్యము మొదలగు భాగ్యముల నందఁజాలకయుండుట లోకానుభవసిద్ధము. అట్లె విశేషధనమువలనను, బంటలవలనను నెన్నిసౌఖ్యములుఁగల్గునో యెఱుఁగనివారులేరు. అట్టిధనమును సక్రమముగ సంపాదించుటకును, బంటలను బండించుటకును, మొదట నెన్ని కష్టములుపడవలయునో మనకందఱకును దెలియును.

కేవలముగ నిహలోక సౌఖ్యములను గలిగించు వైశార్యములే యింతటి కష్టసాధ్యములుఁగనున్నపుడీలోకమునమాత్రమేగాక పరలోకమునను రాఁబోవుజన్మములందునుగూడ సౌఖ్యముల నొడగూర్చు వేదధర్మములమాట యిఁకఁ జెప్పవలసినదేమున్నది? వానినాచరించుటగూడ కష్టసాధ్యమే. అనఁగా, నియమములకులోనై యింద్రియములను వశపఱచుకొనెడివారికి మాత్రమే యాధర్మము లాచరించుటకు సాధ్యపడును. కాని, యింద్రియలోలురై స్వేచ్ఛగాఁదినుచు దిరుగుచు నిష్టమువచ్చినట్లెల్లఁ బ్రవర్తించెడివారికి వేదధర్మముల నాచరించుట ప్రాణసంకటముగానుండును. సృష్టికర్తచే మన దేశమునఁ బుట్టింపఁబడిన మనుష్యజాతిలో నిట్టివారు కొందఱు కొంతకాలమైన పిమ్మట బయలువెడలి వైదికధర్మములనుమీరి యథేచ్ఛగాఁ బ్రవర్తింప మొదలుపెట్టిరి. అందుచే వారు మతభ్రష్టులు కావలసివచ్చెను. అప్పటికి మనదేశమున వైదికమతస్థుల ప్రభుత్వమే ప్రబలముగానుండుటచేతను, దక్కిన ప్రజలందఱును వైదికమతాభిమానులై యుండుటచేతను, భైమతభ్రష్టులకు మనదేశమున నిలువనీడదొఱకుట కష్టమయ్యెను. అందుచే వారు మనదేశమునువదలి యితరదేశముల నాశ్రయింపవలసివచ్చెను.

ఇప్పుడితరదేశములందుఁ గానవచ్చు మనుష్యజాతులన్నియుఁనుగూడ, నప్పుడట్లు మనదేశమును, వైదికమతమును వదలి యితర దేశములకు వలసవెళ్లినవారి సంతతులేయైయున్నవి. అట్టి జాతులన్నిటియొక్క పూర్వకాలఁపు చరిత్రలను బరీక్షించితిమేని, యాజాతులయొక్క పూర్వులవేషములకును, భాషలకును, నాచారవ్యవహారములకును, మనపూర్వులయొక్క వేషములతోడను, భాషతోడను, నాచారవ్యవహారముల

తోడను, కొన్ని పోలికలు గన్పట్టును. అందులకు ముఖ్యకారణము వైరీతిగ వారు మనపూర్వులలోనుండి చీలిపోయినవారై యుండుటయే. పైజాతులన్నియు మనదేశము నుండియే చీలిపోయినసంగతినిగుఱించి యీగ్రంథమందలి రెండవప్రకరణమున "సృష్టి యెచట జరిగెను?" నను సందర్భమున విపులముగఁ జెప్పఁబడును.

## భగవంతుఁడు సర్వసముఁడు కాఁడా?

"వేదమును భగవంతుఁడే యిచ్చినచో మనదేశములోనివారికి మాత్రమేగాక లోకమందలి నితరదేశస్థు లందఱికినిగూడ నిచ్చియుండెడివాఁడే; ఏలనన, భగవంతుఁడు సర్వసముఁడుకాఁడా? కావున నితరదేశములలో వేదము గానరాకుండుటచే నది మన దేశమున మనపూర్వులచేఁ గల్పింపఁబడినదై యుండవలయునేగాని దేవుఁ డిచ్చిన దెంతమాత్రమును గాఁజాలద"ని నవనాగరకులు కొందఱభిప్రాయపడుచున్నారు.

ఈసంశయముకూడ నించుమించుగ నింతకుముందు పైనజర్చింపఁబడిన సంశయమువంటిదే యగుటచే, నితరదేశస్థు లందఱినిగూడ తొలుత మనదేశముననే సృష్టించి యీశ్వరుఁడు వారికందఱికినిగూడ వేదము నిచ్చియే యున్నాఁడనియును బిమ్మట వారిలోఁ గొందఱు స్వబుద్ధిపూర్వకముగ వేదమును వైదికమతధర్మములను విడనాడి దేశాంతరముల కేఁగియున్నారనియును జెప్పఁబడిన సమాధానమే సర్వవిధముల నీసంశయమునకుఁగూడ వర్తించును. కాని, యిందుఁ జెప్పవలసిన విశేష మింకొకటిగలదు. ఏమనిన, నీశ్వరుఁడు వేదమును మనదేశస్థులకు మాత్రమే యిచ్చెననియును నితరదేశస్థుల కెప్పుడును నిచ్చియుండలేదనియునుగూడ వాదమునిమిత్త మించుక నేపంగీకరించి, యంతమాత్రముచే 'భగవంతుఁడు సర్వసముఁ' డనుటకుఁగాని, 'వేద మపౌరుషేయ' మనుటకుఁగాని యెట్టిబాధకలుగునో యించుక విచారించిచూతము.

భగవంతున కందఱును సమానమనియును, గావున వేదమును నొకదేశస్థులకిచ్చి మఱియొకదేశస్థుల కీయకుండునా యనియును సంశయించెడివారు తిన్నఁగా నాలోచించినట్లు కానరాదు. ఏమనఁగా, భగవంతున కందఱును సమానమనుమాట సత్యమే. కాని, యామాట కర్థమేమనఁగా, భగవంతుఁ డొకరిని నిష్కారణముగఁ బ్రేమించి సౌఖ్యము లిచ్చువాఁడుకాఁడనియు, నట్లే మఱియొకరిని నిష్కారణముగ ద్వేషించి కష్టపెట్టువాఁడు కాఁడనియు నర్థము. అంతేకాని, తప్పుచేసినవారికిని నొప్పుచేసినవారికిని నొక్కటే విధమగు ఫలమునిచ్చువాఁడని యర్థముకాదు. అట్లేయైనచోఁ గష్టపడి వ్యవసాయము చేసిన రైతునకుఁ బంటపండినట్లే కష్టపడక సుఖముగ నింటిలోఁగూరుచున్న రైతునకుఁగూడ బంటపండవలదా? అట్లు పండుచున్నదా? లేదు! అట్లే కష్టపడి చదివి

గొనినవారికి చదువువచ్చినట్లె బడికిపోక వీధులలో నాడుకొను బాలురకుఁగూడ చదువు రావలదా? అట్లువచ్చుచున్నదా? లేదు! ఏలలేదు? వారువారుపడిన శ్రమములు వేఱు వేఱుగనున్నవి. కాబట్టి వారివారికిఁగల్గిన ఫలములుగూడ వేఱువేఱుగనున్నవి. అట్లుగాక భగవంతుఁ డందఱికి నొకవిధమగు ఫలమునే యిచ్చువాఁడైనయెడల, లోకమందలి యన్ని ప్రాణులను నొక్కమనుష్యజాతిలోనే పుట్టింపక భూమిపై నెన్నిమోజాతులుగ నేలపుట్టించెను. ఆయన కన్నిప్రాణులును సమానమేగదా! అంతేకాదు. ఒక్కమనుష్య జాతిలోనే కొందఱిని బైరుపంటలుగల మనదేశమువంటి సారవంతమగు భూముల లోను, మఱికొందఱిని "ఆఫ్రికా" (Africa) వంటి మిక్కిలి వేడిగల యెడారిభూము లలోను, నింకఁ గొందఱిని మిక్కిలి చలిబాధకలిగి యొక్కవచ్చని మొక్కయైనను మొలవని "గ్రీన్‌లండ్" (Greenland) వంటి ధ్రువమండల ప్రాంతములలోని యెడ తెగని మంచుభూములలోను భగవంతుఁడు పుట్టించుచుండుటకుఁ గారణమేమి? ఆయన కందఱును సమానముగాదా? మఱియును నొక్కదేశముననే యొక్కయూరిలోనే కొందఱిని భాగ్యవంతులకడుపునను మఱికొందఱిని నిరుపేదల కడుపునను భగవంతుఁడు పుట్టించుట కేమికారణము? అంతయేల! ఒక్కతల్లి కడుపునఁబుట్టినవారిలోనే యొకఁ డారోగ్యవంతుఁడుగను మఱియొకఁడు దీర్ఘరోగిగను, నొకఁడు రూపవంతుఁడుగను మఱియొకఁడు కురూపిగను, నొకఁడు బలవంతుఁడుగను, మఱియొకఁడు దుర్బలుఁడు గను, నొకఁడు వివేకవంతుఁడుగను మఱియొకఁడు వివేకహీనుఁడుగను, నొకఁడంగసమృద్ధి గలవాఁడుగను, మఱియొకఁ డంగవిహీనుఁడై కుంటివాఁడుగనో, గ్రుడ్డివాఁడుగనో బుట్టుటయును జూచుచున్నాము. భగవంతుఁ డిట్లే యిందఱినిన్నిరీతులుగ బుట్టించుట యెందులకు? భగవంతున కందఱును సమానము కాదా? అట్లు పుట్టించుటకుఁ గారణ మాయనకందఱును సమానము కాకపోవుట కాదు. ఇఁక నేమనిన, వారువారు చేసికొనిన కర్మవిశేషమే కారణము. దానినిబట్టియే కొందఱు మనుష్యులను ధనమును, విద్యయు, నాగరకతయునుగల జనసంఘములమధ్య భగవంతుఁడు పుట్టించుచున్నాఁడు. మఱి కొందఱినట్టి సౌకర్యములులేని మోటుజాతుల మధ్యపుట్టించుచున్నాఁడు. ఇది లోక మున నందఱమును జూచుచునే యున్నాము. కావున నిందులో విరుద్ధమేమియును లేదు. ఆరీతిగనే మనుష్యులయొక్క కర్మభేదమునుబట్టి వేదమందు విశ్వాసముగల్గి వైదికమత ధర్మానుష్ఠానమునకు యోగ్యతగల కొందఱి నొకదేశమునఁ బుట్టించి వారికి వేదము నొసంగియుండవచ్చును. అట్టి యోగ్యత నింకను బొందకుండనివారిని దరిదరభూము లలోఁ బుట్టించి వారికి వేదమీయకపోయిగూడ నుండవచ్చును. అంతమాత్రముచే నది పక్షపాతము కాఁజాలదు. జనులయొక్క కర్మభేదము ననుసరించి దానిఫలితముగ

నొకదేశమందలి జనులకు మంచిఫలవంతములగు భూములను మఱియొకదేశపువారికి నిస్సారములగు నెడారిభూములను నిచ్చినరీతిగను, గొందఱికి సౌఖ్యకరములగు సమశీతోష్ణభూములను మఱికొందఱికి బాధాకరములగు మిక్కిలి చలిగల మంచుభూములను నిచ్చినరీతిగనే యొకదేశస్థులకు వారియోగ్యకర్మయొక్క ఫలితముగ వేదమునిచ్చి మఱియొకదేశస్థులకీయక పోవుటయుంగూడ యుక్తియుక్తమేయగును. ఆవిషయమై సంశయించి, "భగవంతుఁడు సర్వసముఁడగుటచే నితరదేశములవారి కెవ్వరికిని వేదము నిచ్చియుండనందున మనదేశమువారికిఁగూడ నిచ్చియుండ"డనుట యెంతమాత్రమును యుక్తియుక్తము కాఁజాలదు. కావున భగవంతుఁడు సర్వసముఁడనుమాట మనదేశస్థులయొక్క పూర్వులకు భగవంతుఁడు వేదమిచ్చెనను విషయమునుగాని, వేదమపౌరుషేయమను విషయమునుగాని యెంతమాత్రమును బాధింపఁజాలదు.

## వేదము మనుష్యులు వ్రాసినది కానియెడల దానిలో ఋషులపేళ్లు కొన్నియెట్లు వచ్చినవి?

వేదమును బరమేశ్వరుఁ డీయలేదనియుం దానిని మహర్షులే వ్రాసియుందురనియు నిప్పటివారు తలంచుటకు మఱియొక కారణము గలదు. ఏమనఁగా వేదమందలి విషయములుకొన్ని యొకపేరుగల మనుష్యుఁ డింకొకపేరుగల మనుష్యునితో జెప్పినట్లుగఁ గొన్ని పేళ్లు వేదమునఁగనుపడుచున్నవి. అట్టిపేళ్లుగల ఋషులును, రాజులును, మొదలగువారు కొందఱు మనప్రాచీనచరిత్రలగు పురాణములు, నితిహాసములు మొదలగువానియందుఁగూడ చెప్పఁబడియున్నారు. అందుచే వేదమందలి విషయము లాయాపేళ్లుగల యాఋషులును, రాజులును మొదలగువారిని గుఱించియే వ్రాయఁబడినవనియును మఱికొందఱు ఋషులు తమపేళ్లతోఁ గొన్నిభాగములనువ్రాసి వేదమునందుఁ జేర్చియుండిరనియుం నవనాగరకులు కొందఱు తలంచుచున్నారు. అందులకుఁగూడ కారణము నవీనచరిత్రలేయని చెప్పవలసియున్నది. ఇందుల కుదాహరణముగ నవీనచరిత్రలలో ముఖ్యమైనదని పైన మాచేఁ జెప్పఁబడిన హిందూదేశకథాసంగ్రహమందలి 'హిందూమహోదయంగములో'ని యీక్రిందివాక్యములను జూడఁదగును:—

* * * *

"ఋగ్వేదములోని మంత్రముల రచించినవారు ఋషులు. అట్టివా రనేకులుండిరి. వేదము లపౌరుషేయము లనెడివారు వీరిని మంత్రకర్తలనక మంత్రద్రష్టలనియెదరు. ప్రథమదశమ మండలములు ఋషులనేకులుకలరు; అందుస్త్రీలును పలు

వురుగలరు. వాక్, విశ్వవారా, శ్రద్ధా, సూర్యా, మొదలయినస్త్రీలు ఋగ్వేదములోని కొన్నిసూక్తములను రచించిరి."

(హిందూమహాయుగము, పుట. ౧౪)

"వేలకొలఁది ఋక్కులచే శోభితంబగు ఋగ్వేదమంతయును నొక్కసారిరచింపఁ బడెననిగాని, దానిననుసరించిన వైదికకాలములోని యార్యులనుగురించి పైఁజెప్పఁ బడిన యంశములన్నియును నొక్కకాలమునం దుండెననిగాని చదువరు లనుకొనఁ గూడదు."

* * * * * * * *

(హిందూమహాయుగము, పుట ౪౩.)

* * * * * * * *

"ఈకాలమునందే యజుర్వేదంబును, సామవేదంబును, రచింపఁబడియె."

* * * * * * * *

(హిందూమహాయుగము, పుట ౪౩.)

* * * * * * * *

"వేదమంత్రములరచించిన ఋషులసంతతివారును, వేదాధ్యయనముచేసి యజ్ఞయాగాదిక్రతువులు చేయువారును, జేయించువారును, అరణ్యములలోనివసించి పరతత్త్వవిచారము చేయువారును బ్రాహ్మణులయిరి."

* * * * * * * *

(హిందూమహాయుగము, పుట ౬౧.)

కాని, వేదము లపౌరుషేయములని (లోగడ మేము జూపినరీతిగ) వేదవిద్యాసాంప్రదాయవిదులగు పండితమండలాఖండలులు పలువురు చెప్పుచుండుటచే, మనుష్యులయొక్కయు ఋషులయొక్కయుఁ బేళ్లుకొన్ని వేదమునందు గానవచ్చినంత మాత్రమున నందలియావిషయము లాయాపేళ్లుగలఋషులు మొదలగువారికి సంబంధించినవేయనియుఁ, గావున వేదములు ఋషులచేతరచింపఁబడినవేయనియుఁ దలంపవలసిన యగత్యములేదు. అట్టిపేళ్లుంచుటకు వేఱొకహేతు వుండవచ్చును. ఏమనఁగా, మొదట వేదమునందున్న పేళ్లనే తరువాతఁబుట్టిన ఋషులును మనుష్యులును బెట్టుకొనియుండవచ్చును. ఎట్లనఁగా, రామాయణము, మహాభారతము, మొదలగుగ్రంథములందున్న దేవతలు, ఋషులు, రాజులు, మొదలగువారిపేళ్లను మనుష్యులు తమబిడ్డలకుఁ బెట్టుకొనుట లోకమున మనమిపుడు చూచుటలేదా? రాముఁడు, కృష్ణుఁడు, శివుఁడు, సీత, రుక్మిణి,

పార్వతి, మొదలగు పేళ్లను బెట్టికొనినవారిని లోకమున మనమెందఱిని నిపుడు చూచుట లేదు! అంతమాత్రముచేత రామాయణము మొదలగుగ్రంథములలో వ్రాయఁబడినసంగతులు మనమిపుడు లోకమునఁజూచుచున్న రాములు, కృష్ణులు, సీతలు, మొదలగువారినిగుఱించినవేయని మనము వాదింపవచ్చునా? ఎవరైన నట్లువాదించినయెడల నది సత్యమేయని మనమునమ్మవలసిన దేనా? నమ్మఁగూడదు.

ఆదేవిధముగఁ గొందఱుఋషులపేళ్లు వేదమునఁ గానవచ్చినంతమాత్రమున నాపేళ్లుగలవారే యావేదమును వ్రాసిరనికాని, వేదమునఁజెప్పఁబడినసంగతులు లాపేళ్లుగల ఋషులనుగుఱించి చెప్పఁబడినవేయనికాని, చేయువాదముగూడ నమ్మఁదగినది కాదు. అట్టిపేళ్లుగలమహర్షులు వేదమునువ్రాయుచుండఁగా నిప్పటి మన నవనాగరకులు కాని వారిగురువులగు నవీనచరిత్రకారులుకాని చూచియుండనులేదు; చూచినవారెవరును వీరికిఁ జెప్పియుండనులేరు; అట్లుచూచినవా రెవరుగాని యావిషయమును వ్రాసిపెట్టఁగా నది వీరికిలభించినట్లును దానిశాధారముగఁజేసికొని వేదమును ఋషులువ్రాసిరని తాముపాదించుచున్నట్లును వీరెచ్చటను జెప్పికొనియుండలేదు. ఇఁక నాసంగతివారికెట్లు తెలిసినది? ఇదివట్టిదురూహయు, ననుమానమునుమాత్రమేగాని దీనికేమియు సరియగునాధారములేదు.

"ఐనచో, వేదమును మహర్షులువ్రాయలేదనియు, దానిని దేవుఁడేయిచ్చెననియు ననుకొనుటమాత్రము వట్టియనుమానముగాదా? దానినిజూచినవారుమాత్రమెవరని" సంశయముగలుగవచ్చును. ఏయేపేళ్లుగలమహర్షులు వేదమునువ్రాసియుండురని మననవనాగరకులు భ్రమపడుచుండిరో, యాయామహర్షులే వేదము పరమేశ్వరుడిచ్చినదేయని, తాముగాని యితరులుగాని వ్రాసిన దెంతమాత్రమునుగాదని స్పష్టముగఁ దమతమగ్రంథములలో వ్రాసికొనియున్నారు. ఏపురుషమాత్రునిచేతను వ్రాయఁబడినదికాదు కావుననే దాని 'నపౌరుషేయమ'నికూడఁ గొనియాడియున్నారు. ఇందుకుమనప్రాచీన 'చరిత్రలనుండి కొన్నియుదాహరణములు,"వేదమపౌరుషేయమనుటకుఁ బ్రాచీనచరిత్రలనుండి ప్రమాణము"లను శీర్షికక్రింద నిదివఱకే చూపియున్నాముగదా!

"వేదమపౌరుషేయమేయైనచో నందుచేర్కొనబడిన పురుషులును స్త్రీలును నెవరనియు, వారికిని వేదమునకును నేమిసంబంధమనియు మఱియొకసంశయము గలుగవచ్చును, అట్టిస్త్రీపురుషులనుగుఱించి వేదమునఁజెప్పఁబడిన విషయములన్నిఁటి నాఖ్యాయిక'లని శ్రీవిద్యారణ్యస్వాములు మొదలగువేదవిద్యావిశారదులగు పండితప్రకాండులు వ్యవహరించియున్నారు. ఆఖ్యాయికలనఁగాఁ 'గథలని' యర్థము. వేద

మందలి పైకథలలోఁ జేర్పఁబడిన స్త్రీపురుషులందఱును గల్పితులే కాని యథార్థ
ముగ నున్నవారు కారు. ఐనచో నిట్టికల్పితులగు స్త్రీపురుషులకును వారితో సంబంధించిన
కల్పితకథలకును, నపౌరుషేయమును బరమప్రమాణమును, నీశ్వరునియాజ్ఞారూపమును
నగు వేదమునందుఁ బ్రసక్తియేమని సంశయముగలుగవచ్చును. ఇందులకుసమాధాన మే
మనఁగా, లోకమున నేదియైన నొకవిషయమును బోధింపవలసివచ్చినపుడు మొదటి
నుండియుఁ దుదివఱకును దానిని పాఠరూపముగనే బోధించినచోఁ గొంతవడికి నావిషయ
మున వినువారికి విసువుజనించి యందలిరక్తిగ్రహించుటలో వారిమనస్సు చొరకుండుట
సహజము. అందుచే మధ్యమధ్య నావిషయమును బ్రశ్నోత్తరరూపముగఁగాని, కాక,
కథారూపముగఁగానిమార్చినచో విసువునుబైకిరానీయక వినువారి నుత్సాహ మంకు
రింపఁజేయును. దానిచే నందలిరక్తిని వారు బాగుగ గ్రహింపఁగలుగుదురు. ఇందుల
కుదాహరణముగఁ బాఠశాలలో నొకవిద్యార్థికి నుపాధ్యాయుఁడు గణితమును బోధింప
వలసివచ్చినపుడు, కూడికలను దీసివేతలను నేర్పుటకుఁ "దొమ్మిదికి నెనిమిదినిగూడి,
యటుపై నాలుగునుజేర్చి యందులోఁ బదితీసివేసిన నేమిమిగులు"నని విద్యార్థిని బ్రశ్నిం
చినచో విద్యార్థి "పదునొకండుమిగులునని" సరిగానే సమాధానముచెప్పవచ్చును.
అటుపై మరలమరల నిట్టివే యొకటిరెండు లెక్కలనడుగఁగా సరియగుసమాధానములను
జెప్పవచ్చును. కాని కొంతవడికి విద్యార్థియొక్కమనస్సునం దొకవిధమగు విసువుజనించి
వానిబుద్ధియొక్కవికాసమును గొంచెముకొంచెముగ నరికట్టఁ బ్రారంభించును. ఉపా
ధ్యాయుఁ డింకనుబైరీతిగనే ప్రశ్నింపుచుఁబోయినచోఁ గొంతసేపటికిఁబిమ్మట విద్యార్థి
మనస్సునకు విసుగుహెచ్చి సరియగుప్రత్యుత్తరమునకు మాఱుగఁ దప్పుసమాధానములు
గూడ వానినోటినుండి వెలువడవచ్చును. అట్టితరి నుపాధ్యాయుఁడు చెప్పెడిప్రశ్నల
ధోరణినినిలిపి దానినాఖ్యాయికగా (అనఁగా: గథారూపముగ) మార్చి, పైరీతిగఁ
బ్రశ్నించుటకుమారుగ "గోవిందుఁడు నీకుఁదొమ్మిదిరూపాయిల నిచ్చెను; పిమ్మట
గోపాలుఁ డెనిమిదిరూపాయిల నిచ్చెను; అటుపై రాముఁడు మఱియొక నాల్గురూపాయి
లిచ్చెను; వీనినన్నిఁటినిజేర్చి మొత్తములోఁ బదిరూపాయిలు కృష్ణునకిచ్చి మిగిలిన
రూపాయిలు నీవు సుబ్బయ్యకిచ్చితివి; అపుడునీవు సుబ్బయ్యకిచ్చినరూపాయి లెన్ని?"
యని ప్రశ్నించినచో విద్యార్థి కంతకుముందుజనించిన విసువునిలిచిపోయి యుపా
ధ్యాయునోటినుండి వెడలుచున్న యీక్రొత్తకథాసందర్భమును నాతఁడు చెవియొగ్గి విన
బ్రారంభించును. ఇట్టివిధమగు నుపదేశములు, బోధలు మనమీనాఁటి పాఠశాలలందును
బాలురయొక్క పాఠ్యపుస్తకములు, లెక్కలపుస్తకములు, మొదలగువానియందును గథా

పార్వతి, మొదలగు పేళ్లను బెట్టికొనినవారిని లోకమున మనమెందఱి నిపుడు చూచుట లేదు! అంతమాత్రముచేత రామాయణము మొదలగుగ్రంథములలో వ్రాయఁబడినసంగతులు మనమిపుడు లోకమునఁజూచుచున్న రాములు, కృష్ణులు, సీతలు, మొదలగువారినిగుఱించినవేయని మనము వాదింపవచ్చునా? ఎవరైన నట్లువాదించినయెడల నది సత్యమేయని మనమునమ్మవలసినదేనా? నమ్మఁగూడదు.

ఆదేవిధముగఁ గొందఱుఋషుల పేళ్లు వేదమునఁ గానవచ్చినంతమాత్రమున నా పేళ్లుగలవారే యావేదమును వ్రాసిరని కాని, వేదమునఁజెప్పఁబడినసంగతు లా పేళ్లుగల ఋషులనుగుఱించి చెప్పఁబడినవేయని కాని, చేయుువాదముగూడ నమ్మఁదగినది కాదు. అట్టిపేళ్లుగలమహర్షులు వేదమునువ్రాయుచుండఁగా నిప్పటి మన నవనాగరకులు కాని వారిగురువులగు నవీనచరిత్రకారులుకాని చూచియుండను లేదు; చూచినవారెవరును వీరికిఁ జెప్పియుండను లేదు; అట్లుచూచినవా రెవరుగాని యావిషయమును వ్రాసిపెట్టఁగా నది వీరికిలభించినట్లును దానిశాధారముగఁజేసికొని వేదమును ఋషులువ్రాసిరని తామువాదించుచున్నట్లును వీరెచ్చటను జెప్పికొనియుండలేదు. ఇఁక నాసంగతి వారికెట్లు తెలిసినది? ఇదివట్టిదురూహయు, ననుమానమునుమాత్రమేగాని దీనికేమియు సరియగునాధారము లేదు.

"ఐనచో, వేదమును మహర్షులువ్రాయలేదనియు, దానిని దేవుఁడేయిచ్చెననియు ననుకొనుటమాత్రము వట్టియనుమానముగాదా? దానినిజూచినవారుమాత్రమెవరని" సంశయముగలుగవచ్చును. ఏయేపేళ్లుగలమహర్షులు వేదమునువ్రాసియుండురని మననవనాగరకులు భ్రమపడుచుండిరో, యాయామహర్షులే వేదము పరమేశ్వరుడిచ్చినదేకాని, తాముగాని యితరులుగాని వ్రాసిన దెంతమాత్రమునుగాదని స్పష్టముగఁ దమతమగ్రంథములలో వ్రాసికొనియున్నారు. ఏపురుషమాత్రునిచేతను వ్రాయఁబడినది కాదు కావుననే దాని 'నపౌరుషేయము'నికూడఁ గొనియాడియున్నారు. ఇందుకుమనప్రాచీన 'చరిత్రలనుండి కొన్నియుదాహరణములు,"వేదమపౌరుషేయమనుటకుఁ బ్రాచీనచరిత్రలనుండి ప్రమాణము"లను శీర్షిక క్రింద నిదివఱకే చూపియున్నాముగదా!

"వేదమపౌరుషేయమేయైనచో నందుపేర్కొనబడిన పురుషులును స్త్రీలును నెవరనియు, వారికిని వేదమునకును నేమిసంబంధమనియు మఱియొకసంశయము గలుగవచ్చును, అట్టిస్త్రీపురుషులనుగుఱించి వేదమునఁజెప్పఁబడిన విషయములనన్నిఁటి 'నాఖ్యాయిక'లని శ్రీవిద్యారణ్యస్వాములు మొదలగు వేదవిద్యావిశారదులగు పండితప్రకాండులు వ్యవహరించియున్నారు. ఆఖ్యాయికలనఁగాఁ 'గథలని' యర్థము. వేద

మందలి పైకథలలోఁ జేర్పఁబడిన స్త్రీపురుషులందఱును గల్పితులే కాని యథార్థముగ నున్నవారు కారు. ఐనచో నిట్టికల్పితులగు స్త్రీపురుషులకును వారితో సంబంధించిన కల్పితకథలకును, నపౌరుషేయమును బరమప్రమాణమును, నీశ్వరునియాజ్ఞారూపమును నగు వేదమునందుఁ బ్రసక్తియేమని సంశయము గలుగవచ్చును. ఇందులకు సమాధానమేమనఁగా, లోకమునఁ గేదియైన నొకవిషయమును బోధింపవలసివచ్చినపుడు మొదటినుండియుఁ దుదివఱకును దానిని పాఠరూపముగనే బోధించినచోఁ గొంతవడికి నావిషయమున వినువారికి విసువుజనించి యందలి రక్తిగ్రహించుటలో వారిమనస్సు చొరకుండుట సహజము. అందుచే మధ్యమధ్య నావిషయమును బ్రశ్నోత్తరరూపముగఁగాని, కాక, కథారూపముగఁగాని మార్చినచో విసువును బైకిరానీయక వినువారి నుత్సాహమంకురింపఁజేయును. దానిచే నందలి రక్తిని వారు బాగుగ గ్రహింపఁగలుగుదురు. ఇందుల కుదాహరణముగఁ బాఠశాలలో నొకవిద్యార్థికి నుపాధ్యాయుఁడు గణితమును బోధింపవలసివచ్చినపుడు, కూడికలను దీసివేతలను నేర్పుటకుఁ "దొమ్మిదికి నెనిమిదినిగూడి, యటుపై నాలుగును జేర్చి యందులోఁ బదితీసివేసిన నేమిమిగులు"నని విద్యార్థిని బ్రశ్నించినచో విద్యార్థి "పదునొకండుమిగులునని" సరిగానే సమాధానముచెప్పవచ్చును. అటుపై మరలమరల నిట్టివే యొకటిరెండు లెక్కలనడుగఁగా సరియగుసమాధానములను జెప్పవచ్చును. కాని కొంతవడికి విద్యార్థియొక్కమనస్సునం దొకవిధమగు విసువుజనించి వానిబుద్ధియొక్క వికాసమును గొంచెముకొంచెముగ నరికట్టఁ బ్రారంభించును. ఉపాధ్యాయుఁ డింకను బైరీతిగనే ప్రశ్నింపుచుఁ బోయినచోఁ గొంతసేపటికిఁ బిమ్మట విద్యార్థి మనస్సునకు విసుగు హెచ్చి సరియగు ప్రత్యుత్తరమునకు మారుగఁ దప్పుసమాధానములు గూడ వానినోటినుండి వెలువడవచ్చును. అట్టితరి నుపాధ్యాయుఁడు చెప్పెడిప్రశ్నల ధోరణినినిలిపి దాని నాఖ్యాయికగా (అనఁగాఁ గథారూపముగ) మార్చి, పైరీతిగఁ బ్రశ్నించుటకుమారుగ "గోవిందుఁడు నీకుఁ దొమ్మిదిరూపాయిల నిచ్చెను; పిమ్మట గోపాలుఁ డెనిమిదిరూపాయిల నిచ్చెను; అటుపై రాముఁడు మఱియొకనాల్గురూపాయి లిచ్చెను; వీనినన్నిఁటిని జేర్చి మొత్తములోఁ బదిరూపాయిలు కృష్ణునకిచ్చి మిగిలిన రూపాయిలు నీవు సుబ్బయ్యకిచ్చితివి; అపుడు నీవు సుబ్బయ్యకిచ్చినరూపాయి లెన్ని?" యని ప్రశ్నించినచో విద్యార్థి కంతకుమునుండు జనించిన విసువు నిలిచిపోయి యుపాధ్యాయు నోటినుండి వెడలుచున్న యాక్రొత్తకథాసందర్భమును నాతఁడు చెవియొగ్గి వినఁ బ్రారంభించును. ఇట్టివిధమగు నుపదేశములు, బోధలు మనమీనాఁటి పాఠశాలలందును బాలురయొక్క పాఠ్యపుస్తకములు, లెక్కలపుస్తకములు, మొదలగు వానియందును గథా

రూపములుగనుండుటను ప్రత్యక్షముగఁ జూచుచున్నాము. అట్టికథలయొక్క ప్రయోజనమునుగూడ లెస్సగ గ్రహించుచునే యున్నాము. ఆకథలయందలి విషయమును బాలురుసులభముగ గ్రహించుటయే వానియొక్క ప్రయోజనముగాని యందుఁజేర్కొనఁబడిన వ్యక్తులతో వారికేమియుఁ బనిలేదు. ఆకథలన్నియుఁ గల్పితకథలనుసంగతిగూడ మన మెఱుంగుదుము. అంతమాత్రఁచే మనము వానిని నిష్ప్రయోజనములుగఁ దలంచుచున్నామా? లేదు. అంతేగాక, విష్ణుశర్మ యనుబ్రాహ్మణుఁడు సుదర్శనుఁడనురాజుయొక్క పుత్త్రులను నీతిశాస్త్రజ్ఞానహీనులను బైన దెల్పిన కల్పితకథలవంటి కథలయొక్క ప్రభావముననే సకలనీతిశాస్త్రవిశారదులనుగా మార్చివేయుటను మనము పంచతంత్రమున వినియుండలేదా? అట్లే, ముఖ్యములగు కొన్నిధర్మరహస్యములను, వేదాంతశాస్త్రవిశేషార్థములను వినువారి కాహ్లాదకరముగ మనస్సునఁ బట్టువిధమునఁ బ్రశ్నోత్తరరూపమునను, నాఖ్యాయికలరూపమునను వేదమువర్ణించిబోధించుచున్నది. ఆయాఖ్యాయికలయొక్క ప్రయోజన మంతేగాని యందలివ్యక్తులు మనపురాణేతిహాసములందుఁ జేర్కొనఁబడినవ్యక్తులు కాఁజాలరు.

అంతియ కాక పైదెలిపిన 'హిందూమహాయుగమ'ను గ్రంథము, పైనజూపినరీతిగ, "ఋగ్వేదములోని ప్రథమదశమమండలములకు ఋషులనేకులుకలర"నియు "నందు స్త్రీలును బలువురుగలర"నియు, "వాక్, విశ్వవారా, శ్రద్ధా, సూర్యా, మొదలయిన స్త్రీలు ఋగ్వేదములోని కొన్నిసూక్తములను రచించిరి"నియుఁ దెలుపుటమాత్రమే కాక, వేదమునుగుఱించియు, వేదమందలిభాగమే యగునుపనిషత్తులనుగుఱించియు, నింక నీక్రిందిరీతిగఁగూడఁ జెప్పుచున్నది:—

"పురుషులవలెనే స్త్రీలును బ్రహ్మవిద్యనుగూడసంపాదించి రాణీవాసములేక రాజసభలలోనికివచ్చి విద్వాంసులతో శాస్త్రార్థము ముచ్చటించుచుండిరి. ఇందునకు జనకునిసభయందు యాజ్ఞవల్క్యునికిని గార్గీవాచక్నవికిని జరిగినసంవాదమే దృష్టాంతము. ఈసంవాదము బృహదారణ్యకములో వివరముగా వర్ణింపఁబడియున్నది."

* * * * * * * *

(హిందూమహాయుగము. పుట ౬౦)

కాని, యిదిమిక్కిలి విరుద్ధమగుప్రసంగము. ఏలననఁగా స్త్రీలకుఁగూడ శూద్రులవలెనే వేదమునభ్యసించుటకుగాని వినుటకుఁగాని, యర్హతలేదని సుప్రసిద్ధవేదవిద్యావిద్వాంసులును వేదవ్యాఖ్యాతలును నగుశ్రీవిద్యారణ్యయతీంద్రులు తాము సూతసంహితకువ్రాయు వ్యాఖ్యలో (సూతసంహితాతాత్పర్యదీపికయందు) వ్రాయుచుఁ, దమవాకో

ముల కనుగుణ్యముగ, వేదవిభాగనిర్ణేతయు శ్రీవిష్ణుదేవుని యంశావతారుఁడునగు వేదవ్యాసమహర్షి యొక్క వాక్యములనుగూడ క్రిందిరీతిగ నుల్లేఖించియున్నారు. (అందులోఁ బైహిందూయుగమునఁ బేర్కొనఁబడిన గార్గీవాచక్నవి మొదలగువారి ప్రశంసగూడ జేర్చియున్నారు.) చూడుఁడు, సూతసంహిత, శివమాహాత్మ్యఖండము, ఏడవయధ్యాయము, (ముక్తిసాధనకథనము,):—

"ద్విజస్త్రీణామథశ్రౌత జ్ఞానాభ్యాసేఽధికారితా,
అస్తిశూద్రస్యశుశ్రూషోః, పురాణేనైవవేదనమ్." ౨౦
వదంతికేచిద్విద్వాంసః స్త్రీణాంశూద్రసమానతామ్. ౨౧

వ్యాఖ్యా "ద్విజస్త్రీణామితి. అథహైనంగార్గీవాచక్నవీ పప్రచ్ఛేత్యాదౌ గార్గ్యాదేర్వేదవిద్యాగ్రహణ వ్యవహారదర్శనాత్. అస్తీతిపదస్య పూర్వార్థేపసంబంధః. శూద్రస్యశుశ్రూషోరితి. స్వధర్మనిష్ఠస్య ద్విజశుశ్రూషాహి శూద్రస్య ముఖ్యావృత్తిః; "శూద్రస్య ద్విజశుశ్రూషా, తయాజీవ న్వణిగ్భవేది"తి స్మృతేః. పురాణేనైవేతి. వేదవాక్యశ్రవణస్య నిషిద్ధత్వాత్—అథోహాస్య వేదముపశృణ్వతః త్రపుజతుభ్యాం శ్రోత్రపూరణమితి; ఇదమేవోక్తం వ్యాసేన: "శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్స్మృతేశ్చే"తి,. స్త్రీణాంశూద్రసమానతామితి. యదాహుః.

స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీనశ్రుతిగోచరా
ఇతిభారతమాఖ్యానం మునినాకృపయాకృతమ్.

గార్గీమైత్రేయ్యాదీనామపి శ్రుతివాక్యాన్నతత్త్వబోధః; కింతుపౌరుషేయైరేవ వాక్యైర్జ్ఞాతతత్త్వావబోధః ఆఖ్యాయికారూపయాశ్రుత్యా వ్యవహృత ఇత్యేతావదితిహితే, మన్యంతఇత్యర్థః. ౨౦౪. ౨౧."......................

పైశ్లోకములయొక్క యర్థమేమనఁగా: "ద్విజస్త్రీలకును, శుశ్రూషాపరుఁడగు శూద్రునకును శ్రుతులందుఁజెప్పఁబడిన జ్ఞానమునభ్యసించుట కధికారముకలదు; (అట్టి జ్ఞానమును) బురాణముచేతనే తెలిసికొనవలయును. స్త్రీలు శూద్రులతో సమానులని కొందఱువిద్వాంసులు చెప్పుదురు."

ఇఁకఁ బైవ్యాఖ్యయందు వ్రాయఁబడినదేమనఁగా:—

"అంతట నీవిషయమును గార్గీవాచక్నవి ప్రశ్నించెను"— ఈమొదలగు వాక్యములందు గార్గీమొదలగువారికి వేదవిద్య (అనఁగా వేదమందలి జ్ఞానము) గ్రహించుటలో వ్యవహారమున్నట్లు చూపఁబడుటచే, ద్విజస్త్రీలకు శ్రుతులందుఁ జెప్పఁబడిన జ్ఞానమభ్యసించుట కధికారముఁకలదని "ద్విజస్త్రీణాం" అను పైశ్లోకము

చెప్పుచున్నది. 'అస్తి' (అనఁగాఁ 'గలదు) అనుపదమునకు (శ్లోకమందలి) మొదటి పదభాగముతో నన్వయము. "శూద్రస్య ద్విజశుశ్రూషా.. ..." యనుస్మృతి వాక్యమునుసరించి స్వధర్మమునందు నిష్ఠగలశూద్రునకు ద్విజశుశ్రూష చేయుటయే ముఖ్యవృత్తి. అందుచే, 'శూద్రస్య శుశ్రూషాః' అనువాక్యముచేఁ బైశ్లోకమున శుశ్రూషాపరుఁడగు శూద్రునకును (శ్రుతులయందుఁజెప్పఁబడిన జ్ఞానమభ్యసించుటలో నధికారముకలదు) అని చెప్పఁబడినది. (స్త్రీలును శూద్రులును) వేదవాక్యములను వినరాదని నిషేధింపఁబడియుండుటచేతను (అట్టివారు) వేదమునినచో సీసమును లక్కను కఱిగి వారిచెవిలోఁ బోయవలయునని చెప్పఁబడియుండుటచేతను, నీప్ర కారమే (స్త్రీలును శూద్రులును) వేదమునువినుటగాని, యధ్యయనము చేయుటగాని కూడదని వ్యాసమహర్షి కూడ, 'శ్రవణాధ్యయనార్థ...' అనువాక్యమునఁ జెప్పి యుండుటచేతను 'పురాణేనైవవేదనమ్' (అనఁగాఁ) బురాణముచేతనే [యట్టిజ్ఞాన మును స్త్రీలును శూద్రులును] దెలిసికొనవలయునని) పైశ్లోకమునఁ జెప్పఁబడి యున్నది. 'స్త్రీశూద్ర ద్విజబంధూనాం...' అనుశ్లోకమున, స్త్రీలకును శూద్రుల కును, ద్విజబంధువులకును, శ్రుతిచదువరానిదగుటచే (వారికొఱకై) కృపాళుఁడగు వేదవ్యాసమునీంద్రుఁడు భారతమునురచించెనని చెప్పఁబడియుండుటచే, 'స్త్రీణాం శూద్ర సమానతామ్' (అనఁగా వేదమునుబదువువిషయమున (స్త్రీలు శూద్రులతోసమా నులు) అని పైశ్లోకము చెప్పుచున్నది.

కాఁబట్టి, గార్గీ, మైత్రేయ్యాదులకుఁగూడ తత్వబోధ శ్రుతివాక్యముచే (అనఁగా వేదవాక్యములతోఁ) గాదు; ఇఁకేమనఁ, బౌరుషేయములగు వ్యవహారభాషా వాక్యములచేతనే గలిగినతత్వావబోధ యాఖ్యాయికారూపమగుశ్రుతిచే వర్ణింపఁ బడుచున్నది........౨౦. ౨౧.

పైవిమర్శవలన, వేదమునందు ఋషులపేళ్లు కానవచ్చుటచే నాపేళ్లుగల ఋషులే యావేదమంత్రములను రచించిరనితలంపరాదనియు స్త్రీలపేళ్లుకొన్ని వేద మునందుఁ గానవచ్చినంతమాత్రమున నాస్త్రీలే యావేదమంత్రములను రచించిరని తలంచుట యింకను మిక్కిలియసంగతమనియును దేలినది. పైనమేము తెలిపిన యభి ప్రాయములనే, కృష్ణానదీతీరమందలి విజయవాడ (బెజవాడ) పురవాస్తవ్యులును, శ్రుతిధర్మసంజీవనీ పత్రికాసంపాదకులును, గీర్తిశేషులును నగుబ్రహ్మశ్రీ శివపురపు వీర భద్రపాక యాజిగారుకూడ తామురచించిన 'ప్రమాణాదర్శము—ఉత్తరభాగము' అనుగ్రంథమున నీక్రిందిరీతిగఁ బ్రకటించియున్నారు:—

"ఇట్లనిన, వేదము లపౌరుషేయములగునేని, వరుణపుత్రుఁడైన భృగువు తండ్రితో బ్రహ్మవిద్యనుగూర్చి ప్రశ్నించినట్లు భృగువల్లిచెప్పనేల? గార్గీమైత్రేయీ ప్రభృతిస్త్రీలు పలువురుబ్రహ్మసభలలో వేదాంతచర్చలు కావించిన ట్లుపనిషత్తులు తెలుపుటకుఁ గారణమేమి? వీనినన్నిఁటిని బట్టిచూడఁ బూర్వకాలమున మహర్షులును స్త్రీలును మంత్రభాగములనువ్రాసినట్లు స్పష్టముగఁ దెలియవచ్చుచుండుటలేదా? వానిని మీరేలవిశ్వసింపరు? మీరు వానిని విశ్వసింపనినాఁడు వేదము లపౌరుషేయములని మీరుచెప్పినపుడావచనములను మేమేల విశ్వసింపవలె" నని విజ్ఞానచంద్రికవారు మరలఁ బ్రశ్నింతురేమో! సమాధానమువినుఁడు. మహర్షులు మంత్రద్రష్టలుకాని, మంత్రకర్తలుకారు. కావుననే యామహర్షులు వేదము లపౌరుషేయములని చెప్పియున్నారు. వేదము లాఖ్యాయికారూపమున ధర్మములను తత్వమును బోధింపనెంచి పితృపుత్ర సంవాదమూలమునను గురుశిష్య ప్రసంగరూపమునను వాదిప్రతివాది సంభాషణాత్మకముగను, స్త్రీప్రశ్నాత్మకముగను బోధించియున్నవని మనము గ్రహింపవలయును. నీతిచంద్రిక జంతుభాషణరూపమున మనకు నీతినిబోధించియుండలేదా? అంతమాత్రమున జంతువులుమున్ను మాట్లాడియుండుటచేతనే నీతిచంద్రిక చెప్పియుండునని తలంపవలయునా? అది యనుచితముకాదా? గార్గీమైత్రేయ్యాదులు స్వభాషలోఁ బ్రశ్నింపవారికి స్వభాషలోనే తత్వబోధకావింపఁబడినది. స్త్రీశూద్రుల కధ్యయనాధికారము లేదని శాస్త్రములుచెప్పుచుండ వారికి (స్త్రీలకు) వేదకర్తృత్వముకలదని వ్రాయుట పొరపాటుకాదా?..........................స్త్రీలకు మంత్రకర్తృత్వముకాని, మంత్రద్రష్టృత్వముకాని లేదని స్పష్టమైనది.

ప్రమాణాదర్శము, (ఉత్తరభాగము) పుటలు 27-28.

ఇంకనొక్క సంశయముకలుగవచ్చును, ఏమనఁగా, "రామాయణము, మహాభారతము, మొదలగువాని యందున్న పేళ్లనే యిటీవలిలోకులు తమబిడ్డలకుఁ బెట్టుకొనుచున్నవిధముగా, మొదట వేదమునందున్న పేళ్లనే తరువాతఁబుట్టిన మహర్షులు మొదలగువారు పెట్టుకొనియుండవచ్చు" నని పైనజెప్పి యుంటిరిగదా? రామాయణాదులందుఁ జెప్పఁబడినరాముఁడు, సీత, మొదలగువారు లోకమందు మనమిపుడు చూచుచున్న రాములు, సీతలు, మొదలగువారు కాకపోయినప్పటికిని నట్టిపేరుగల యథార్థవ్యక్తులు రాముఁడును సీతయు, మొదలగువారు తొలుత నుండుటచేతనే వారిమూలముగ రామాయణాదులు వ్రాయఁబడియున్నవిగదా? అదేవిధముగ, వేదమునందుఁ జెప్పఁబడిన ఋషులును స్త్రీలును, పురాణేతిహాసాదులందుఁ జెప్పఁబడఁ

బడిన ఋషులును స్త్రీలును నొక్కరే కాకపోయినప్పటికిని, వేదములందుఁ జేర్కొనఁ బడిన పేళ్లకుమాలములగు యథార్థవ్యక్తులుగూడ వైరీతిగ నుండియే తీరవలయునని తేలుటలేదా?'' యని సంశయముగలుగవచ్చును. కాని, తొలుత నున్న పేళ్లనే తరువాతఁ బుట్టినవారు పెట్టుకొనుచుండుట కుపమానమునుజూపుటకే పైరామాయణాదులను జేర్కొనియుంటిమిగాని, పౌరుషేయగ్రంథములగు రామాయణాదు లందలి వ్యక్తులు సత్యములైనంతమాత్రముచే నపౌరుషేయములును, సృష్టికింబూర్వమునను బరమునసుగూడ శాశ్వతముగానుండునవియు, నగు వేదములందలి వ్యక్తులుగూడ యథార్థవ్యక్తులే కావలసినయవసరము లేదు. అంతియగాక, వ్యక్తులసృష్టికి మూలమగు ప్రపంచముగూడ సృష్టింపఁబడుటకుఁ బూర్వమే నిత్యమైయుండు వేదము, తరువాతఁ బుట్టఁబోవు యథార్థవ్యక్తులపై నాధారపడియుండుట, యసంగతముగూడ కాఁగలదు.

## మనప్రాచీనచరిత్రలందలి బ్రహ్మదేవుఁడు మొదలగు వారిని గుఱించినవర్ణనలు కల్పితములు కావా?

వేదము బరమేశ్వరుఁ డిచ్చియుండఁ డనియును, దానియందు జనులకు శ్రద్ధయు, భక్తియు, నమ్మకమునుగలుగుటకై బ్రహ్మదేవుఁ డొకఁడుండినట్లును, నాయనకుఁ బరమేశ్వరుఁడు వేదములనిచ్చినట్లును, నాబ్రహ్మదేవుఁడు వానిని మనువునకుఁ జెప్పినట్లును, మన పూర్వులుకల్పించి వ్రాసియుందురనియును నిప్పటివారిలోఁ గొందఱు సందేహించుచున్నారు. అట్లు సందేహించుటకు మఱియొక కారణమేమనఁగా, మనపురాణాదులందుఁ జెప్పఁబడిన బ్రహ్మమొదలగు కొందఱుదేవతల యాకారములయొక్కవర్ణనములు స్వభావవిరుద్ధముగ నున్నవనియుఁ గాబట్టి యవికల్పితములై యుండుననియునట్లే యితరవర్ణనలుగూడ నున్నవనియు వారుతలంచుచున్నారు. ఎట్లనిన, "బ్రహ్మదేవునకు నాల్గుమొగములున్నట్లు మనప్రాచీన చరిత్రలగు పురాణాదులందు వర్ణింపఁబడియున్నది, లోకమందలి మనుష్యులకును, జంతువులకును నొక్కొక్క మొగమేయుండుటను జూచుచున్నాము, కాని, నాల్గుమొగములున్న జంతువుల నెచటనైనను జూచుచుంటిమా?'' యని వీరికిసందేహము గల్గుచున్నది. బాగుగ నాలోచించిచూడఁగా, నట్లుసందేహించుటకు సరియైన హేతువుగానరాదు. ఏమనఁగా, లోకమున నెన్నియోకోట్ల విధములగుజంతువులుగలవు. వానిలో నొక జాతిలో లేనివిశేషములు మఱియొకజాతిలోఁ గానవచ్చుచున్నవి. అట్టిజాతుల నన్నిఁటిని జూచియున్నవారు సామాన్యముగ మనలో నెవ్వరునుండరు. మనదేశములో

నున్నవానినే పూర్తిగ నన్నిరకములజంతువులను మనము చూచియుండము. 'కంగారు' మొదలగువిచిత్రమైనజంతువు లితరఖండములలోనున్నవని చూచివచ్చిన విదేశీయులు వ్రాసియుండఁగా మనకుఁదెలియుచున్నది. వానియందలి విచిత్రలక్షణములను వినినపుడట్టిజంతువు నిజముగనుండునాయని కొందఱికి మొదటసంశయముగల్గుచున్నది. అట్టిజంతువు నిదివఱలోవారు చూచియుండకపోవుటయే యందులకుఁగారణము. కాని, యట్టివారందఱునుగూడఁ బైవిదేశీయులందుఁ గలనమ్మకముచే నట్టిజంతువు లుండవచ్చుననియే నమ్ముచున్నారు. అట్లునమ్ముటకుఁ గారణము పైవిదేశీయు లబద్ధమువ్రాయరనెడి నమ్మకమేగాని, మనవారు స్వయముగనట్టివానిని జూచియుండుటచేఁ గాదుగదా! కాని, తామట్టిజంతువును మనదేశమునఁ జూచియుండలేదు గావున నట్టిదిలోకమున నుండనేయుండదని వారువాదించునెడల, మనమావాదము నొప్పుకొనవచ్చునా? లోకమున నెన్నియోదేశములును, నెన్నియోరకముల విచిత్రములగుజీవములును గలవు. వానిలోఁ గొన్నిఁటిని బ్రభుత్వమువారుతెప్పించి, మద్రాసు, హైదరాబాదు, మొదలగు పెద్దపెద్దపట్టణములందలి ప్రదర్శనశాలలలోనుంచఁగా మనము వానినీకాలమునఁ జూచుచున్నాము. అట్టివానితోఁ బోల్చిచూచినయెడల మనముచూచిన దేశమెంత? అందులో మనకుఁగనఁబడిన జంతువులతెగలెన్ని? అందుచే మనకేర్పడిన లోకానుభవమెంత? మనముచూచి యెఱుఁగనంతమాత్రమున నట్టిజంతువులు లోకమునవేఱొకచోట నెక్కడనుగూడ నుండనేకూడదా? ఈలోకమందలి జంతువులలోనే యిన్నివిచిత్రములుండఁగా, నింక నితరలోకములమాట చెప్పవలయునా? ఇన్నివిచిత్రములతోఁ గూడిన జంతుజాలములను బుట్టింపఁగల్గిన పరమేశ్వరుఁడు నాల్గుమొగములతో నలరారు బ్రహ్మదేవునివంటి యొక్క వ్యక్తినిబుట్టింపఁదలఁచినచో నాయనకది దుస్సాధ్యమా? "ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిః" యనునట్లు (అనఁగా సృష్టికర్తతలంచినమాత్రముననే సృష్టిజరుగుననియర్థము.) ఏయేవస్తు వేయేయాకారముగ నుండవలయునని యాయనతలంచునో, యాయావస్తు వాయా యాకారముతోనేర్పడును. అట్టి సందర్భమున నాల్గుమొగములుగల యొకవ్యక్తి యేర్పడవలయునని పరమేశ్వరుఁడు సంకల్పించినచో నది యేర్పడుటమాత్రము దుర్లభమా? మనముచూచిన మనుష్యులలో నెవరికిని నాల్గుమొగములులేవు. కావున సృష్టికర్తకు నట్టివ్యక్తిని సృజింపఁగల సామర్థ్యముండరాదని మనముతలంచుట యుక్తియుక్తముగాదు. బ్రహ్మదేవునకును మనుష్యులకును నేమిపోలిక? ఆయనలోకమునందలి సమస్తమును బుట్టింపఁగల సామర్థ్యముతోఁ బరమేశ్వరునిచేఁ దొలుతసృజింపఁబడెనని మనమింతకుముం దీగ్రంథమునఁ దెలిసికొనియుంటిమి. అప్రకారమే యటుపై బ్రహ్మదేవుఁడు వేదముయొక్క

సహాయమున సమస్తమునుసృజించెను. అట్టిపనిని మనుష్యులుగూడ చేయఁగలరా? బ్రహ్మదేవునివలెనే జగములను సృష్టించుచున్న మనుష్యులను మన మెచటనైనను జూచుచున్నామా? లేదు. మనుష్యుల కదిసాధ్యముకాదు. కావున బ్రహ్మదేవునకుఁగూడ నది సాధ్యముకాదని చెప్పవచ్చునా? చెప్పరాదు. ఏలచెప్పరాదు, అట్టిసామర్థ్యమును దక్కినమనుష్యుల కీయకపోయినప్పటికిని బ్రహ్మదేవునకుమాత్రమే పరమేశ్వరుఁ డిచ్చియున్నాఁడు. లోకములను, లోకమందలిసూర్యుని, జంద్రుని, నక్షత్రములను, నాకాశమును, భూమిని, నదులను, సముద్రములను, బర్వతములను, నడవులను, ననేక కోట్లరకములచెట్లను, దీఁగలను, బక్షులను, మృగములను నింకనునెన్ని యెన్ని యోచిత్రములను సృష్టింపఁ గలసామర్థ్యమును బ్రహ్మదేవునకుఁ బరమేశ్వరుఁడు కలిగింపఁజాలినపుడా పరమేశ్వరునిసామర్థ్య మెట్టిదైయుండునో యూహింపసాధ్యమగునా? అంతయేల! పరమేశ్వరునికంటె నన్యమగు పదార్థమేమియును జగత్తులో లేదని మన వేదశాస్త్రములు చెప్పుచుండుటచే, బరమేశ్వరుఁడే యీజగన్నిర్మాణము కొఱకు స్వయముగ బ్రహ్మయొక్క రూపమునుధరించి సృష్టికార్యమును నెరవేర్చెనని చెప్పఁదగియున్నది. అట్టిసర్వసమర్థుఁడు తన కెట్టిరూపము కావలయుననికోరినను, నది యేర్పడుటలో నాశ్చర్యమేమున్నది? అసాధ్యమేమున్నది?

కావున, నిట్లే, బ్రహ్మదేవుఁడు తామరపువ్వునందుఁ బుట్టుటయును, నది విష్ణుదేవుని బొడ్డునుండి పుట్టుటయును, మొదలగు విషయములన్నియును మనవంటి సామాన్యులదృష్టికి నసాధ్యములుగను విపరీతములుగను గనఁబడినను, సర్వసమర్థుఁడగు సృష్టికర్తకు నసాధ్యములుకానేరవు. మన మితరదేశములందలి చిత్రములను మృగములను స్వయముగఁజూడఁ జాలకపోయినను, విదేశీయులమాటలందలి నమ్మకముచే నట్టిమృగములు కలవనువిషయమును నమ్మినట్లుగనే పూర్వాచార పరాయణులు బ్రహ్మదేవుని స్వయముగసందర్శించి యుండఁజాలకపోయినను, నట్టి సామర్థ్యముగలమహర్షులయందు వారికిఁగలనమ్మకముచే, నామహర్షు లబద్ధములు వ్రాయువారు కారనియుఁ, దాము బ్రహ్మదేవుని స్వయముగఁ జూడఁజాలియుండకపోయినను నామహర్షులుచూచియే యుండవచ్చుననియును, నందుచే బ్రహ్మదేవునకు నాల్గుమొగములుండుట సత్యమేకావచ్చుననియును, నమ్ముచున్నారు. అట్లు నమ్ముటలోఁ దెలివితక్కువయేమున్నది? ఏమియునులేదు! కాని, మననవనాగరకులు చిన్నతనము నుండియు మనప్రాచీనచరిత్రలను జదివికొనక, యందుకుమారుగ వానికి బరమవిరుద్ధములగు నవీనచరిత్రలను జదివికొనియుండుటచే, వారికి మనప్రాచీనచరిత్రలందును వానినివ్రాసిన

మనమహర్షులందును గలనమ్మకముచెడిపోయినందునఁ బైవిధములగు సంశయములేర్పడుట కవకాశముగల్గుచున్నది.

## బ్రహ్మదేవుఁడు మొదలగువారున్నచో నేలకనఁబడరు?

పైవిషయమున నవనాగరకులకు మఱియొకసంశయము గలుగవచ్చును. ఏమ నఁగా, "నితరదేశములందు విచిత్రములగు 'కంగారు' వంటి మృగములున్నసంగతి విదేశీయులు చెప్పుటయేగాదు, మనమిపు డాదేశములకువెళ్లినయెడల మనకుఁగూడ పైమృగములుకనఁబడును, కాని, బ్రహ్మదేవుఁడు మొదలగువా రేదేశమునను నిపుడు గానవచ్చుచున్నట్లు మనము వినుటలేదుగదా! కావున నట్టివా రున్నారని మన మెట్లు నమ్మవచ్చు?" నని మననవనాగరకు లడుగవచ్చును. సమాధానమేమనిన. 'కంగారు' మృగమును జూచివచ్చినవిదేశీయు లేదేశమున దానిని జూచివచ్చినట్లుచెప్పిరో యా దేశమునకే మనముగూడవెళ్లినయెడల నామృగముకనఁబడును. కాని యదిలేని యితరదేశములకువెళ్లినయెడల నామృగము కనుపించదుగదా! ఆమృగము లున్న దేశ మునకువెళ్లుటకు, మనదేశమునుండి యేదిక్కుగావెళ్లవలయునని యావిదేశీయులు చెప్పిరో, యేమార్గమున వెళ్లవలయుననిచెప్పిరో, యాదిక్కుగనే, యామార్గముననే, వెళ్లినయెడల మన మామృగమును జూడఁగల్గుదుము. కాని, మఱియొకదిక్కుగా మఱియొకమార్గమున వెళ్లినయెడల జూడఁగల్గుదుమా? అనఁగా నామృగ మున్నదేశ మునకువెళ్లుటకు మనదేశమునుండి పడమరదిక్కుగా వెళ్లవలయుననియు, దారిలో సముద్రముండుటచే నోడమీఁదనెక్కి దానిని దాఁటవలయుననియుఁ జూచివచ్చిన వారు మనకుఁజెప్పిరనుకొనుఁడు. అపుడు మన మచటికివెళ్లి యామృగమును జూడఁ దలఁచితి మనుకొనుఁడు. పడమరగావెళ్లక, యందుకుమారుగ నుత్తరదిక్కుగా వెళ్లిన యెడల నెన్నఁటికైన మనమాదేశమునుజేరి యామృగమును జూడఁగల్గుదుమా? చూడఁ జాలము. అదేరీతిగ, మార్గమధ్యముననున్న సముద్రమునుదాఁటుటకై యోడమీఁద నెక్కుటకుమారుగ సముద్రములోదిగి నడచివెళ్లుదమని బయలుదేరినయెడల వెళ్లఁ గలమా? వెళ్లలేము. పైగా, నాసముద్రములోమునిఁగి చనిపోవుదుము. కాఁబట్టి యామృగమును మనముచూడఁదలఁచినచో, నది యేదేశముననున్నదని చూచివచ్చిన వారుచెప్పిరో, యాదేశమునకే వెళ్లవలయును. ఏదిక్కుగావెళ్లవలయునని వారు చెప్పిరో, యాదిక్కుగనేవెళ్లవలయును. ఎట్టిమార్గమున వెళ్లవలయుననిచెప్పిరో, యట్టిమార్గముననే వెళ్లవలయును. అట్లుగాక, మఱియొక దేశమునకువెళ్లినను, మఱి యొకదిక్కుగఁగాని, మఱియొక మార్గమునఁగానివెళ్లినను మనమాదేశమును జేరలేకపోవు టయేగాక పైగా మఱికొన్నిచిక్కులపా లగుదుము.

ఆవిధముగనే, బ్రహ్మదేవుని మనముచూడఁగోరితి మనుకొనుఁడు. ఆయన యున్నాఁడని మన కెవరుచెప్పిరి? మనప్రాచీన చరిత్రలుచెప్పినవి. ఏదేశముననున్నాఁడనిచెప్పినవి? బ్రహ్మలోకముస నున్నాఁడనిచెప్పినవి. అచటికి కెట్టిమార్గమున వెళ్లవలయు ననిచెప్పినవి! ఆచరిత్రలలోఁ జెప్పఁబడిన కొన్ని గొప్పపుణ్యఫలములను సంపాదించి దేహాంతరమునుధరించిగాని, తపశ్శక్తిచేగాని, యోగాభ్యాసమహిమచేగాని వెళ్లవలయు ననిచెప్పినవి. అంతేగాని, బ్రహ్మదేవుఁ 'డైరోపా' ఖండముననఁగాని, 'యాఫ్రికా' ఖండముననఁగాని, యమెరికా' ఖండమందుఁగాని, 'యాస్ట్రేలియా' ఖండములోఁ గాని, యున్నాఁడని మనప్రాచీనచరిత్రలు చెప్పుటలేదు. ఓఁడలపై నెక్కిగాని, రైలుబండ్లలో నెక్కిగాని, విమానములపై నెక్కిగాని ప్రయాణముచేసినచో నా యన యున్నచోటికి మనముచేరుదుమనిగూడ యాచరిత్రలుచెప్పుటలేదు. బ్రహ్మ దేవునిజూడఁగోరిన వారెన్నెన్ని కష్టములకోర్చి యెట్టియెట్టి ఘోరతపములుచేసిన పిదప వారికాయన గనుపించెనో యా విషయములనుగూడ మనప్రాచీనచరిత్రలు వర్ణించిచెప్పినవి. అట్టితపస్సులను జేయవలసినక్రమముగఁ జేసిచూచినవా రీకాలమున నెందఱున్నారు? అట్టికష్టముల కోర్వఁగలశక్తియు, నంతటి దీర్ఘకాలము తపస్సుచేయు టకువలసిన యాయువును నిప్పటి మనదేశీయులలో నెవ్వరికిఁగాని కలవనిచెప్పుటకే వీలులేదుగదా? కాఁబట్టి వీరువైరీతిగఁ దపస్సుచేసినదియునులేదు, అపుడు బ్రహ్మ దేవుఁడు వీరికిఁ గనఁబడకపోయినదియునులేదు. అంతమాత్రముచేతనే యాయన యుండుట యబద్ధ మనవచ్చునా? విదేశీయులుచూచివచ్చిన పై 'కంగారు' వంటి మృగమును మనమువెళ్లిచూచుటకుఁ దగినధనము మొదలగు సాధనములుగాని, యోఁడలు మొదలగుపరికరములుగాని, దూరప్రయాణమునకు వలసిన ధైర్యస్థైర్యములుగాని దురదృష్టవశమున మనకులేనిచో నంతమాత్రముచే వారుచూచివచ్చి తెలిపినవిషయ మును మన మబద్ధమనవచ్చునా? అట్లే, బ్రహ్మదేవుని బ్రత్యక్షము చేసికొనఁజాలిన సాధనములు మనయందు లోపించియున్నపుడది మనదురదృష్టమనియే భావింపవల యును. కాని, యాయనగాని, మనపురాణాదులందు వర్ణింపఁబడిన యట్టి యితర లోకములుగాని యందుండు నితరదేవతలుగాని యుండుటయబద్ధమని చెప్పరాదు. అట్లు చెప్పువారికి పట్టిపట్టియూహాలే యాధారముగాని యంతకంటె వేఱేమియు నాధారము లేదు.

కాని, యింకొకసంశయము గలుగవచ్చును. ఏమన, "బ్రహ్మదేవుఁ డుండుటయే యబద్ధము, 'ఉన్నయెడల నెచటనున్నాఁడో చూపుఁడ'ని యెవరైన నడిగిపోవుదు

రేమో యనుభయముచే 'మిక్కిలి కఠినమగు తపస్సుచేసిననేగాని యాయన కానరాఁడ'ని మనమహర్షులు ప్రాచీనచరిత్రలందు వ్రాసియుందుర''ని కొందఱు సంశయింపవచ్చును.

కాని, పైవిధమగు భయముచేతనే వారట్లువ్రాసియుండిరో, కాక, యట్టిఘోరతపస్సుచేసిననేగాని యాయన కానరాకపోవుట సత్యమైయుండుటచేతనే వ్రాసియుండిరో వీరు చూచియుండిరా? చూచినవారెవరైన వీరికిఁజెప్పియుండిరా? ఏదియును లేదు! ఇఁక వీరట్లుతలంచుట కేమియాధారమున్నది? ఏమియును లేదు. వట్టియూహయే యందులకాధారము. "ఐనచో బ్రహ్మదేవుఁడు నిజముగ నున్నాఁడనియు ఘోరమగు తపస్సుచేసిననేగాని యాయన కానరాఁడనియు ననుటకుమాత్రమేమి యాధారమున్నద''ని వీరడుగవచ్చును. అందులకు మనప్రాచీనచరిత్రలే యాధారమని యిదివఱలో వ్రాసియేయుంటిమి. వానినివ్రాసిన వారిగుణసంపదనుగుఱించియు, వారి శక్తిసామర్థ్యములనుగుఱించియు, నవివ్రాయఁబడిన విధానమునుగుఱించియుఁ గలసంశయములను దీర్చియుంటిమి. ఆసంశయములకేమియు గట్టియాధారము లేదనియు, నవి వట్టియూహలుమాత్రమేయనియు ఋజువుచేసియుంటిమి. కాఁబట్టి యట్టిసంశయములు నమ్మఁదగినవి కావు.

ఇంతవఱకును వ్రాసినవిషయములనుబట్టి, మనప్రాచీనచరిత్రలకు మూలమగు వేదమునుగుఱించి యాచరిత్రలందు వ్రాయఁబడినవిషయములును, నవీనచరిత్రలందు వ్రాయఁబడినసంగతులును దెలిసినవి. వానిలో మనప్రాచీనచరిత్రలందలి విషయములే నమ్మఁదగినదనియు, నవీనచరిత్రలందలి విషయములు నిరాధారములగు వట్టియూహలు మాత్రమేయనియుఁ గావున నమ్మఁదగినవి కావనియుఁ దేల్చియుంటిమి. వేదమును గుఱించి మనప్రాచీనచరిత్రలలో వ్రాయఁబడినవిషయములపై నవనాగరకులకుఁగల సంశయములలో మే మెఱిఁగియున్న సంశయములకన్నిఁటికిని దగినసమాధానములను జెప్పి వానిని దీర్చియుంటిమి. ఇవిగాక, పైవిషయములలో వారికింకను నేమైనసంశయము లున్నచో మాకుఁదెలిపినయెడల వానినన్నిఁటి నీగ్రంథముయొక్క చివర 'అనుబంధ వ్యాసము' లనుశీర్షిక క్రిందగాని, కాక, యీగ్రంథమునకు ద్వితీయముద్రణమున కవకాశముచిక్కినపు డందులోఁగాని జేర్చి వానికన్నిఁటికిని దగినసమాధానములను వ్రాయఁదలచియున్నాము. ఇందువలన, వేదములనుగుఱించి మనప్రాచీనచరిత్రలు చెప్పిన విషయములే సత్యములనియు, నవీనచరిత్రలు చెప్పినసంగతు లసత్యములనియు మఱి కొంతరూఢియైనవి. కావున నింకమనప్రాచీనచరిత్రలలో వేదము తరువాతవియైనస్మృతులను (అనఁగా ధర్మశాస్త్రములను) గుఱించియుఁ బురాణములు, నితిహాసములు మొదలగువానిని గుఱించియు మనప్రాచీనచరిత్ర లేమిచెప్పునో నవీనచరిత్ర లేమిచెప్పునో, యాలోచింతము.

# వైదికమతచరిత్రము

## రెండవప్రకరణము.

---

### (స్మృతులు; అనఁగా ధర్మశాస్త్రములు.)

#### స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్ర లేమి చెప్పును?

మనప్రాచీనచరిత్రలకు మూలాధారమగు వేదమునుగురించి యీగ్రంథము యొక్క మొదటిప్రకరణమునఁ దెలిసికొనియుంటిమి. వేదము తరువాతవియగు స్మృతులనుగుఱించి యిఁకఁ దెలిసికొనవలసియున్నది. వీనినిగుఱించి మన ప్రాచీనచరిత్ర లేమి చెప్పుచున్నవనఁగా: వేదమందలిధర్మములనే మహర్షులు తిరిగి సంస్కృతభాషయందు వ్రాసియున్నారు. వేదముగూడ సంస్కృతభాషయందే యున్నప్పటికిని దానియం దొక్కధర్మములు మాత్రమేగాక ప్రపంచమునకు సంబంధించినట్టియుఁ మనుష్య బుద్ధికి గోచరింపఁజాలనట్టియుఁ బెక్కువిషయములుగూడ వర్ణింపఁబడియున్నవి! అంతియ గాక ద్విజులలోని (అనఁగాబ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యజాతులలోని) పురుషులకుమాత్రమే వేదమును జదువుట కధికారముండుటచేతఁ బైజాతులలోని స్త్రీలును నితరజాతులలోని స్త్రీ పురుషులునుగూడ వేదమునుజదువుట కధికారులుకారు. అనఁగా నధికారులుకాని వారు వేదమును జదువుటచే వారికి ఫలమునకుమారుగ దోషముగలుగును. మఱియును, బైద్విజులలోని పురుషులైనను సంస్కృతభాషను నేర్చినంతమాత్రముచే వేదమును జదివి దానియర్థమును గ్రహించి యందలిధర్మములను దెలిసికొనుటకు సమర్థులు కాఁజాలరు. ఏలయన, వేదమందలి స్వరభేదములననుసరించి దానియర్థము మారుచుండును. అందుచే వేదముయొక్కయర్థమును దెలిసికొనుటకు సంస్కృతభాషాజ్ఞానముతోఁబాటు, వేదాంగములయొక్కయు (అనఁగా శిక్షా, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పసూత్రము ననుశాస్త్రములయొక్కయుఁ) దర్కశాస్త్రముయొక్కయు జ్ఞానమును విమర్శనాశక్తియొక్క సహాయమునుగూడ యవసరమైయుండును. ఆశాస్త్రములయొక్క జ్ఞానముకలవారు జనసామాన్యములోను, నందుఁ గేవలద్విజులలోని పురుషులయందును మిక్కిలి తక్కువగానుందురు. కావున సామాన్యజను లందఱియొక్క యుపయోగముకొఱకై మహర్షులు వేదముయొక్క యర్థమును గొంతను దానియందలి

ధర్మమును, తిరిగి స్మృతులరూపమున వర్ణించియున్నారు. వారు (మహర్షులు వేదము) లను వేదాంగములను నితరశాస్త్రములను జదివికొనినవారే యగుటచేతను, వేదార్థమును సృష్టికాలమునుండియు సృష్టికర్తనుండియు వంశపరంపరగా విని తెలిసికొన్నవారగుట చేతను నందలిధర్మములు వారికిఁ బాగుగఁదెలియుట కవకాశమున్నది. అట్లువారు తిరిగి వ్రాసినగ్రంథములకే స్మృతులనిపేరు. స్మృతియనఁగా స్మరింపఁబడినదనియర్థము. అనఁగాఁ దిరిగిచెప్పఁబడినదనియర్థము. ఈస్మృతులు ధర్మములతో నిండియుండుటచే ధర్మశాస్త్రములనికూడ చెప్పఁబడుచున్నవి. ఈవిషయము లీక్రిందివాక్యములచేఁ దెలియ వచ్చుచున్నవి.—

"శ్లో. శ్రుతిం పశ్యంతి మునయ స్స్మరంతి చ తథా స్మృతిమ్."

* * * * * * * *

"శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రంతు వైస్మృతిః,
తేసర్వార్థే ష్వమీమాంస్యే తాభ్యాం ధర్మోహి నిర్బభౌ."

(మనుస్మృతి. అధ్యా. ౨. శ్లో. ౧౦.)

ఏఋషిచే వ్రాయఁబడినస్మృతి యాఋషిపేరులోఁ బిలువఁబడుచున్నది. అట్టి ఋషులలోఁ బ్రతిఋషియును దనధర్మశాస్త్రమందలి ధర్మములకు వేదమే మూలాధారమనియుఁ దానాధర్మములను వేదమునుండి తెలిసికొనియే వ్రాసినట్లును, దనస్మృతి యందు వ్రాసికొనియున్నాఁడు. కాని వేఱువిధముగ ధర్మములనుదెలిసికొని వ్రాసినట్టొక్కమహర్షియైనను వ్రాసికొనియుండలేదు. ఇందులకుఁ గొన్నియుదాహరణము లీక్రిందఁ జూపుచున్నాము.

## స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్రలందుఁ జెప్పఁబడిన విషయములకుఁ బ్రమాణములు.

పరాశరమాధవీయమందలి "నకశ్చిద్వేదకర్తాచ" యనుశ్లోకమునకు మాధవాచార్యులవారు వ్రాసిన వ్యాఖ్యవిషయమై వేదములనుగుఱించి చర్చించునపుడు, "వేద మపౌరుషేయమనుటకుఁ బ్రాచీనచరిత్రలనుండి ప్రమాణముల"ను శీర్షికక్రింద నీగ్రంథమునందలి మొదటిప్రకరణమునఁ దెలిసికొనియుంటిమి. ఆవ్యాఖ్యయందే స్మృతులను గుఱించికూడ నీక్రిందిరీతిగ వ్రాసియున్నారు.

"........చతుర్ముఖ స్తస్మి న్మహాకల్పే పరమేశ్వరేణదత్తం వేదంస్మృత్వా తత్ర విప్రకీర్ణే వర్ణాశ్రమధర్మాన్ సంకల్ప్య స్మృతిగ్రంథరూపేణోపనిబధ్నాతి ........చతుర్ముఖస్య స్మృతిశాస్త్రకర్తృత్వం మనునాప్యుక్తమ్.—

"శ్లో. ఇదం శాస్త్రంతు కృత్వాసౌ, మామేవ స్వయమాదితః,
విధివద్గ్రాహయామాస మరీచ్యాదీ నహంమునీన్."

యథా చతుర్ముఖ స్తథైవ స్వాయంభువో మను స్తస్మిం స్తస్మిన్నవాంతరే కల్పే వేదోక్తధర్మాన్ గ్రథ్నాతి. మనుగ్రహణేన అత్రయాజ్ఞవల్క్య విష్ణ్వాదయ ఉపలక్ష్యంతే."

దీనియర్థ మేమనఁగా: "సృష్టికిబూర్వము మొట్టమొదటఁ బరమేశ్వరుఁడిచ్చిన వేదమును జతుర్ముఖుఁడుస్మరించి దానియందు నిండియున్న వర్ణాశ్రమధర్మములను నొక్కచోటఁజేర్చి యొకస్మృతిగ్రంథమును గావించెను. ఈవిషయమునే మనువుగూడ, "ఇదంశాస్త్రంతుకృత్వాఽసౌ..." అనుశ్లోకమునఁ జెప్పియున్నాఁడు. (ఈశ్లోకము పైవ్యాఖ్యయందు వ్రాయఁబడియున్నది. దీనికర్థ మేమనఁగా: "ఈధర్మశాస్త్రమును మొట్టమొదటఁ (జతుర్ముఖుఁడు) రచియించి నాకుబోధించెను. నేను మరీచిమొదలగు మునులకు బోధించితి"నని యర్థము. చతుర్ముఖుఁడు ప్రతిబ్రహ్మకల్పము మొదటను వేద మందలి ధర్మములను స్మృతిరూపమునగూర్చినట్లే, స్వాయంభువమనువుకూడ నాయాయ వాంతరకల్పములలో వానిని గూర్చుచున్నాఁడు. మనువును జెప్పుటచేఁ దక్కినయాజ్ఞవల్క్యుఁడు మొదలగు ధర్మశాస్త్రకర్తలుగూడ కలరని తాత్పర్యము."

ఈవ్యాఖ్యవలన మనువు మొదలగువారు వ్రాసినధర్మశాస్త్రములకు వేదమే మూలమని స్పష్టమగుచున్నది. మఱియును స్వాయంభువమను వీవిషయమున నీక్రిందిరీతిగ వ్రాయుచున్నాఁడు:—

"శ్లో. వేదోఽఖిలో ధర్మమూలం స్మృతిశీలేచ తద్విదామ్,
ఆచారశ్చైవసాధూనా మాత్మనస్తుష్టి రేవచ."

(మనుస్మృతిః అధ్యా. ౨. శ్లో. ౬)

"శ్లో. అర్థకామేష్వసక్తానాం ధర్మజ్ఞానం విధీయతే,
ధర్మంజిజ్ఞాసమానానాం ప్రమాణం పరమంశ్రుతిః."

(మనుస్మృతిః అధ్యా. ౨. శ్లో. ౧౩.)

పైశ్లోకముల యర్థ మేమనఁగా: "ధర్మము నెఱుఁగుటకు సాధనములు వేదమును, వేదవిదులు (అనఁగా వేదమును బాగుగ నెఱిఁగినవారు) వ్రాసినస్మృతులును, నట్టి వేద విదులయొక్క సుగుణములును సాధువులగు నట్టి వేదవిదులయొక్క యాచారములును (నట్టివానియందెచటనైనను రెండువిధములగు భేదాభిప్రాయములు గన్పట్టినపట్ల ధర్మ మెఱుఁగఁగోరువారు రెంటిలో దనయిచ్ఛవచ్చినదానిని స్వీకరించుటకై) యాత్మతుష్టి

యును (ననఁగాఁ దనయొక్క మనః ప్రీతియునైయున్నవి.) అట్టిస్మృతులు, సదాచారము మొదలగువాని యన్నిఁటిచే దెలియవచ్చెడి ధర్మములకన్నిటికిని మూలము వేదము". అని పైరెండుశ్లోకములలోని మొదటిశ్లోకమున కర్థము.

ఇఁక రెండవశ్లోకమున కర్థమేమనఁగా; "ధనమును భోగములనుమాత్రమే ప్రధానములుగదలంపనివారికొఱకు (అనఁగా ధనముకంటెను, భోగములకంటెను, మోక్షమును, దానికిసాధనమగు ధర్మములను నెక్కువముఖ్యములుగాఁ దలంచెడివారికొఱకు) ధర్మములసంబంధమగు జ్ఞానము చెప్పఁబడుచున్నది. అట్టిధర్మముల నెఱుఁగఁగోరువారికి ముఖ్యమగుప్రమాణము శ్రుతి (అనఁగా వేదము.)"

ఇందువలన, స్మృతులు మొదలగువానివలనఁ దెలియవచ్చుచున్న ధర్మములకు మూలము వేదమేయని (అనఁగా స్మృతులలో వ్రాసినధర్మములను వేదమునుండియే తెలిసికొనినట్లు) స్వాయంభువమనువుకూడ చెప్పియుండెనని తెలియవచ్చుచున్నది.

ఇచట నొకసంశయము గలుగవచ్చును. ఏమనఁగాఁ "పైనజూపిన రెండుశ్లోకములలో మొదటిదానియందుఁ జివర "ఆత్మనస్తుష్టిరేవచ" యనిమాత్రమే మనువుచెప్పియున్నాఁడు. అనఁగా ధర్మము నెఱుఁగుటకుసాధనము ధర్మమెఱుఁగఁగోరువాని యొక్క యిష్టముమాత్రమేయని దానికర్థముగాని, మీరు పైనవ్రాసినట్లుగ వేదమును, స్మృతులును మొదలగువానియందలి ధర్మములలో నెచటనైనను రెండువిధములగు భేదాభిప్రాయములు గన్పట్టినపట్ల ధర్మమెఱుఁగఁగోరువాఁ డారెంటిలోఁ దనయిచ్చ వచ్చినదానిని స్వీకరించుటలోమాత్రమే యాత్మతుష్టి ప్రమాణమని మనువుచెప్పియుండలేదే. మీరట్లుచెప్పుటకుఁ గారణమేమి? అందుచే మనువు తనస్మృతియందలి ధర్మముల నాత్మతుష్టిననుసరించియే (అనఁగాఁ దనయొక్కయిష్టము ననుసరించియే) వ్రాసియుండవచ్చునుగాని వేదముననుసరించి వ్రాసియుండక పోవచ్చున"ని శంకింపవచ్చును.

కాని, 'ఆత్మనస్తుష్టిరేవచ' యనుదానికర్థము 'ధర్మమెఱుఁగగోరు వానియొక్క యిష్టముమాత్రమే ధర్మము నెఱుఁగుటకు సాధనమ'ని మనువుయొక్క యభిప్రాయమైనచో, ధర్మము నెఱుఁగుటకుసాధన మాత్మతుష్టియొక్కటియేయని మనువుచెప్పియుండినచో సరిపోయెడిదే. అట్లుగాక, వేదమును, వేదవిదులగువారు వ్రాసినస్మృతులును, నట్టివారియొక్క సుగుణములును సదాచారములునుగూడ ధర్మమెఱుఁగుటకు సాధనములని పైశ్లోకమునముందుగఁ జెప్పి తుట్టతుదకుమాత్రమే యాత్మతుష్టినిగూడ నొకసాధనముగఁ జెప్పియుండుటచే నితరసాధనములలో ద్వైధము (అనఁగా రెండువిధములగు భేదాభిప్రాయము) వచ్చినపట్లమాత్రమే వానిలో నొకదాని నెన్నుకొనుట కాత్మతుష్టి

యొక్క ప్రయోజనమని మనువుయొక్కయభిప్రాయమని మనము నిశ్చయింపవలసి యున్నది. అంతేగాక, యాత్మతుష్టియొక్కటియే ధర్మజ్ఞానమునకు సాధనమని మనువు యొక్క యభిప్రాయమైనచో నట్టి యాత్మతుష్టి ప్రతిప్రాణికిని సహజముగ నుండు నదేయగుటచే నెవరియిష్టముననుసరించి వారే ధర్మాధర్మములను నిర్ణయించుకొనుట కవకాశముండును గావున నింత శ్రమపడి మనువు తానొకస్మృతిని రచింపవలసిన యగత్య మేయుండెడిదిగాదు. అంతేగాక మనువు తన యాత్మతుష్టిననుసరించి తాను స్మృతిని రచించియుండినచో దానిననుసరించి యితరులుగూడ ధర్మాధర్మముల నెఱుఁగవలయు నని యాయన యభిప్రాయపడుటగూడ వెఱ్ఱితనమైయుండెడిదే. ఏలనన, నెవరియాత్మతుష్టి వారికి దేవుఁడిచ్చియున్నపుడు వారందఱును మనువుయొక్క యాత్మతుష్టిననుసరించియే యేల ధర్మాధర్మముల నెఱుంగవలయును? అపుడు మనుస్మృతి నిష్ప్రయోజనమై యుండవలదా? అట్లుగాక మనువు పైశ్లోకమున "వేదోఽఖిలోధర్మమూలం" (అనఁగా 'ధర్మములనన్నిఁటి నెఱుఁగుటకు మూలసాధనము వేదము') అనియును, దరువాతిశ్లోకమున "ధర్మంజిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః" (అనఁగా "ధర్మము నెఱుంగఁగోరువారికి ముఖ్యమగుప్రమాణము శ్రుతి") యనియునుగూడ చెప్పియుండుటచే నట్టిశ్రుతి మూలముగాఁగలధర్మముల నెఱుఁగుటకు సాధనములైన వేదములవలనను, స్మృతులవలనను, వేదవిదులయొక్క సద్గుణసదాచారములవలనను దెలియవచ్చు ధర్మములలో నెచటనైనను ద్వైధము గన్పట్టినచో నట్టియెడ నారెండుధర్మములలో నిచ్చవచ్చినదానిని స్వీకరించుటకొఱకే 'యాత్మతుష్టి'గూడ నొకసాధనమని మనువు యొక్క యభిప్రాయమని మేము పైన వ్రాసినవిషయము సిద్ధాంతమగుచున్నది.

పై మాయభిప్రాయమునే, శ్రీపరమహంస పరివ్రాజకాచార్యవర్యేత్యాద్య నేకబిరుదావళీవిరాజమానులును, శ్రీవిరూపాక్షపీఠాధ్యక్షులునునగు జగద్గురు శ్రీకల్యాణానంద భారతీమహాతాచార్యస్వాములవారుగూడ తమచేఁ బ్రకటింపఁబడిన 'వైదికధర్మసంజీవనీపత్రికా' సంచికలలో నొకదానియందు "స్మృతి"యను శీర్షికక్రింద నీక్రిందిరీతిగ వ్రాయించియున్నారు.—

## ఆత్మతుష్టి.

"ఇఁక ధర్మమునకుఁ బ్రమాణంబులలో నాత్మతుష్టియని యొకొక్కండు సెప్పఁబడియె. ఈవిషయమునుగూర్చి యెక్కడునపార్థము వాటిల్లుఁ గావున దీనింగూర్చి యొకింతవిచారించుట యావశ్యము. ఆత్మతుష్టియనఁ దనయొక్క ప్రీతియని యర్థము. తనయొక్క ప్రీతియనఁ దనమనంబున కెయ్యది ప్రీతినిగల్గింపునో యయ్యదియని

యర్థము. తన కెయ్యది ప్రీతిఁగల్గించునో యయ్యదియనఁ దన యిచ్చవచ్చినటుల నెల్లెడలవ్యవహరించుట యనునపార్థము సుకరముగఁ జేయఁబడవచ్చుఁ గాని యట్లూహించుటకు నెంతమాత్రమును వీలులేదు. ఆత్మతుష్టియనఁ దనబుద్ధికి దోఁచినదనికాదు. మఱి యేమనఁ దనబుద్ధికి సంతసమును బుట్టించునదియనుటచేఁ దనముందట సిద్ధమగు రెండు విషయములు విహితములు, నుపాదేయములు నగుచు శాస్త్రముచే విధింపఁబడినప్పుడు నందు నెయ్యది స్వీకరింపఁబడవలయుననను సందియముగలుగునప్పుడు దనతుష్టిఁగొలఁది నెద్దియో యొకదాని స్వీకరించి రెండవదాని విడిచిపెట్టవచ్చునను సావకాశమునకు నాత్మతుష్టియని ప్రమాణవిదులచేఁ బేరీయఁబడెను. అదెట్టులన శ్రుతియందుగాని, స్మృతియందుగాని, సదాచారమునందుగాని యొకధర్మమునుగూర్చి రెండువిధములుగ నాచరణమువిధింపఁబడి యవి రెండును సమానబలమును గల్గియుండినచోఁ నందుఁ దనప్రీతికొలఁది నెద్దియో యొకదానిఁ దన యిచ్చవచ్చినటుల స్వీకరింపవచ్చును. అతిరాత్రమను క్రతువిశేషమున షోడశిగ్రహప్రచారమునుగూర్చి "అతిరాత్రే షోడశినంగృహ్ణాతి," "నాతిరాత్రే షోడశినంగృహ్ణాతి" యని షోడశిగ్రహణాగ్రహణములు సమబలంబుగ విధింపఁబడుచున్నవి. ఇట్టివిషయమున నట్టిక్రతుకర్త యేమిచేయనగుననినఁ దన యిచ్చవచ్చిన గ్రహింపవచ్చును. లేనిచో విరమింపవచ్చును. దానంజేసి క్రతువునకుఁగాని తనకుఁగాని ప్రత్యవాయములేదు. కాని యేరికి నిచ్చవచ్చినటుల వారు శ్రుతిస్మృతి సదాచారముల నుల్లంఘించి వ్యవహరించుటయుఁ బలుకుటయు నుచితమని బోధించుటకు నాత్మతుష్టియనుపేర నెంతటిప్రాజ్ఞునకైన నవకాశములేదని లెస్సగ గ్రహింపనగును."

(వైదికధర్మసంజీవనీపత్రిక.)

పైవిమర్శవలన మనుస్మృతిలోనియు, వేదవిదులురచించిన యితరస్మృతుల లోనియు ధర్మములకు మూలము వేదమేయని (అనఁగా వేదమునుండియే యాస్మృతి కర్తలాధర్మములనుగ్రహించి యాస్మృతిగ్రంథములవ్రాసిరని)యు స్మృతికర్తలు స్వతంత్రముగ ధర్మములను గల్పింపలేదనియు స్వాయంభువమనువుగూడ వ్రాసియున్నాఁడని తేలినది. స్మృతులనుగుఱించి యితరమహర్షులేమి చెప్పిరో యిక నించుక తెలిసి కొందము.

"శ్లో. శ్రుతిస్మృతి స్సదాచారః స్వస్యచ ప్రియమాత్మనః,
సమ్య క్సంకల్పజః కామో ధర్మమూల మిదంస్మృతమ్."

అని యాజ్ఞవల్క్యమహర్షి వ్రాసియున్నాఁడు. శ్రుతియును, స్మృతియును, సదాచారమును మొదలగునవి ధర్మమెఱుఁగుటకు మూలములని చెప్పుచు వానిలో శ్రుతినే (అనఁగా వేదమునే) మొదటఁ జెప్పియున్నాఁడు.

సూ. "వేదో ధర్మమూలమ్." అని గౌతమమహర్షి చెప్పియున్నారు. అనఁగా ధర్మమునకు మూలమైనయాధారము వేదమని యర్థము.

ధర్మమునకును, వేదమునకును ధర్మజ్ఞులగు స్మృతికర్తలకును గల యన్యోన్యసంబంధమునుగూర్చి యాపస్తంబమహర్షి యీక్రిందిరీతిగ వ్రాసియున్నారు.—

"సూ. ధర్మజ్ఞసమయః ప్రమాణం, వేదాశ్చ॥ చోవధారణే వేదావివమూల ప్రమాణం ధర్మాధర్మయోః............తదిహాస్మదాదీనాం ధర్మజ్ఞ సమయః ప్రమాణమ్; ధర్మజ్ఞానాంతు వేదాః ప్రమాణమ్॥"

అనఁగా ధర్మము నెఱుఁగుటకు వేదములును, ధర్మ మెఱింగిన యాపస్తంబునివంటి మహనీయులయాజ్ఞయును నాధారములనియు, నట్టిమహనీయులు ధర్మ మెఱుఁగుటకు వారి కాధారము వేదమేయగుటచే ధర్మములకు మూలాధారము వేదమేయనియు నర్థము.

ధర్మ మెఱుఁగుటకు స్మృతికూడ తగినప్రమాణమే యని వేదముగూడ నీక్రిందిరీతిని సాక్ష్యము చెప్పుచున్నది.—

"స్మృతిః ప్రత్యక్ష మైతిహ్యం, అనుమాన శ్చతుష్టయమ్."

మఱియును, మనువుయొక్క స్మృతిని వేదముకూడ ప్రమాణముగ నొప్పుకొను చున్నదని శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు తమ శారీరకభాష్యమునం దీక్రిందిరీతిగఁ జెప్పియున్నరు.

"భవతిచ అన్యామనోః మాహాత్మ్యం ప్రఖ్యాపయన్తీ."

శ్రుతిః.—'యద్వైకించ మను రవదత్తద్భేషజమ్.'

(తైత్తిరీయసంహితా అ. ౨. పా. ౧. సూ. ౧)

అనఁగా మనువు చెప్పినదెల్లను (సంసారభవరోగములకు) మందువంటిదని మనువుయొక్క మాహాత్మ్యమును వేదోక్తశ్రుతిగూడ కొనియాడుచున్నదనియర్థము.

ఈయర్థమునే మనువు వ్రాసినధర్మముల నాయనయొక్క యాజ్ఞననుసరించి తక్కిన మహర్షులకు బోధించిన ప్రవక్తయగుమహర్షి యీక్రిందిరీతిగ మనుస్మృతిలో స్మరించియున్నాఁడు.—

"శ్లో. యఃకశ్చి త్కస్యచిద్ధర్మో మనునాపరికీర్తితః,
స సర్వోఽభిహితో వేదే సర్వజ్ఞానమయోహి సః." (మనుస్మృతిః.)

అనఁగా మనువు సర్వజ్ఞానమయుఁడగుటచే (ననఁగా సమస్తవిధములగు జ్ఞానముల తోడను నిండియున్నవాఁడగుటచే) నాయనచేఁ జెప్పఁబడిన యేయొక్కధర్మమైనను వేదముచే నంగీకరింపఁబడినదేయైయున్నది.

వేదము ననుసరించుటచేతనే స్మృతులకు గౌరవముకలిగినదను భావమును బై మహర్షులు చెప్పియుండుటమాత్రమేగాక, మహాకవియగు కాళిదాసుసహిత మాభావము నొక యుపమానముగఁదీసికొని తన 'రఘువంశమ'ను కావ్యమునం దీక్రిందిరీతిగ వర్ణించి యున్నాఁడు.

"శ్లో. మార్గం మనుష్యేశ్వరధర్మపత్నీ, శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్."

(రఘువంశము. స. ౨. శ్లో. ౨.)

శ్రీమల్లినాథుఁడనువ్యాఖ్యాత పైశ్లోకమున కీక్రిందిరీతిగ వ్యాఖ్యానమును వ్రాసి యున్నాఁడు.

"యథా స్మృతి శ్శ్రుతి క్షుణ్ణమేవార్థమనుసరతి, తథాసాఽపి గోఖురక్షుణ్ణమేవ మార్గమనుససార-ఇత్యర్థః."

అనఁగా శ్రుతిత్రొక్కినమార్గమునే స్మృతికూడ యనుసరించునట్లుగ రాజు భార్యయును గోవుగిట్టలక్రింద నలిగినమార్గమునే యనుసరించె" నని యర్థము. దీనిని బట్టి కాళిదాసువంటి మహాపండితులుగూడ శ్రుతిస్మృతులకుఁగల యన్యోన్యసంబంధ మునుగూర్చి యిట్టి సదభిప్రాయములను గల్గియుండెడివారో తెలియుచున్నది.

స్మృతులనుగురించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పెనో తెలిసికొంటిమి. ఆవిషయ మున నవీనచరిత్ర లేమిచెప్పునో యిక మనము తెలిసికొనవలసియున్నది.

"స్మృతులనువ్రాసిన మహర్షులు వేదమునందలి యర్థమును సరిగాగ్రహించి వ్రాయలేదనియు నందువలన వేదములుమాత్రమే ప్రమాణములగును గాని ధర్మశాస్త్ర ములు ప్రమాణములు కాఁజాలవని"యు నవనాగరకులలో నొకతెగవారు (బ్రహ్మసామా జికులని పేరుపెట్టుకొన్న సంఘమువారును, ఆర్యసామాజికులని పేరుపెట్టుకొన్న వారును) వాదించుచున్నారు. వీరందఱును పైమహర్షులును, పైకాళిదాసువంటి మహా పండితకవులును, మించిన పాండిత్యమును సంపాదించియుండిరా? లేదు. ఇఁక స్మృతులు వేదమందలి సంగతులనే చెప్పుచున్నవో, లేక వేఱుసంగతినే చెప్పుచున్నవో వీరి కెట్లు తెలిసినది?

అంతేగాక మన ధర్మశాస్త్రములు వేఱువేఱుకాలములందలి మనపూర్వులు స్వేచ్ఛగా నేర్పఱచికొనిన (సంఘమునకు సంబంధించు) కట్టుబాట్లను దెలియజేయు గ్రంథములని నవీనచరిత్రకారులును, వారిననుసరించు నవనాగరకులును నభిప్రాయపడు చున్నారు. కాని, యవివేదమునందలి ధర్మములనుబోధించుటకే యేర్పడినవియని వారు తలంచుటలేదు. వారియభిప్రాయ మెంతవఱకుసత్యమైనదో విచారించి తెలిసికొనుటకుముందుగ

ధర్మముయొక్క స్వరూపమును, దానితత్త్వమునుగుఱించియు, నందువిషయమునఁగల కొన్నిసంశయములను గుఱించియు బాగుగఁ జర్చించి మనము తెలిసికొనుట యవసరమై యున్నది. ఏలనన నీముఖ్యవిషయములలోనే నవీనచరిత్రకారులును, నవనాగరకులును బెక్కుప్రమాదములకుఁ బాల్పడియున్నారు. కావున మనము ముందుగా నావిషయములకుఁ గడంగి పిమ్మట 'స్మృతులనుగుఱించి నవీనచరిత్ర లేమిచెప్పనను' మొదలుగాగల విషయములను జర్చింతము.

## ధర్మమనఁగా నెట్టిది?

లోకమందలి ప్రతిప్రాణియుఁ దన కెల్లపుడును సుఖమే గల్గుచుండవలయునని యును, దుఃఖ మెన్నఁడును గలుగకుండవలయుననియు సహజముగఁ గోరుకొను చుండును. అనఁగా సర్వప్రాణులకును సుఖమునం దిష్టమును దుఃఖమునం దనిష్టమును స్వాభావికమైయుండును. కాని, యట్టి సుఖదుఃఖము లొక్కతీరుననుండక తొలుత స్వల్పసుఖరూపముగనుండి పిదప మిక్కిలి దుఃఖరూపముగఁ బరిణమించునవి కొన్నియును, మొదట స్వల్పముగ దుఃఖరూపముననుండి పిమ్మట మిగుల సుఖరూపముగఁ బరిణమించునవి మఱికొన్నియును నిట్లు పెక్కుభేదములతో నొప్పుచుండును. కాని, సుఖములు మొదటినుండియుఁ దుదవఱకును సుఖములుగనేగాని, యట్లే దుఃఖములును మొదటినుండియుఁ దుదవఱకును దుఃఖములుగనేగాని యుండవు. అందుచేఁ దమ కిష్టమగు సుఖములు గలుగవలయుననియు, ననిష్టమగుదుఃఖములు తొలఁగవలయుననియు నాయాప్రాణులుకోరి యందులకైచేయు యత్నములుగూడ బైరీతిగనే పెక్కుభేదములు గలిగియుండును. కొంచెము సూక్ష్మబుద్ధియు, దూరాలోచనమును, వివేకమునుగల ప్రాణులు సామాన్యముగఁ దొలుదొల్త స్వల్పమగు శ్రమలకును, దుఃఖములకును నోర్చియైనను పిదప విశేషముగగల్గునట్టి సుఖములకే యత్నించును. అట్టి దూరాలోచనయు, బుద్ధిసూక్ష్మతయు యుక్తాయుక్తవివేకమునులేని ప్రాణు లట్లుగాక, పిదప రాఁబోవు విశేషదుఃఖముల నెఱుఁగఁజాలకయో, యెఱిఁగియు వానిని సరకుగొనకయో, ప్రారంభమందలి స్వల్పసుఖములనే యాశించి, యందుకై యత్నించి కడకు నెడతెగని దుఃఖములపాలగును. ప్రాణుల కాయాజన్మములం దనుభవమునకువచ్చు సుఖదుఃఖములవిషయముననే మతిమంతులకును, మతిహీనులకును గల తారతమ్యముపైన దెలిపినరీతిగ నుండఁగా, రాఁబోవు జన్మాంతరములందలి యుత్తమాధమజన్మములకును, వానియందలి సుఖదుఃఖములకునుగూడ కారణములైన కర్మములందలి యుక్తాయుక్తములను నిర్ణయించుటకు ప్రాణులయొక్కబుద్ధు లెంతవఱకు ప్రయోజనకారులు కాఁగల్గునో

వేఱుగఁ జెప్పనక్కఱలేదు. అట్టియుత్తాయుక్తములగు కర్మలాచరించు చున్నంతవఱకును వానిఫలితములగు నుత్తమాధమజన్మములును వానికనుగుణ్యములగు సుఖదుఃఖములును గలుగకమానవు. అట్టి యుత్తమాధమజన్మము లున్నంతవఱకును నుత్తమకర్మయో యధమ కర్మయో చేయకమానుటకును సాధ్యముగాదు. కావున నట్టిజన్మములును మరణ ములును లేకుండునట్టిస్థితిని ప్రాణిచెందఁగల్గినపుడే సుఖదుఃఖములనుండియు వానికి హేతువులగు నుత్తమాధమ కర్మలనుండియు నదివిడువఁబడి యెడతెగని సుఖానుభవము నొందగల్గును. అట్టిస్థితికే మోక్షమని పేరు. ఆమోక్షమునుగుఱించియు దానిస్వరూప స్వభావములను గుఱించియు నీగ్రంథమందలి రెండవభాగమగు 'వైదికమత తత్త్వము'ను నేడవప్రకరణమున విపులముగఁ దెలిసికొందుము. మోక్షమునకు సాధనమగు ధర్మమును గుఱించియు, మోక్షప్రతిబంధకమగు నధర్మమునుగూర్చియు విస్తారముగఁ దెలిసికొన వలసిన యావశ్యకత యీప్రకరణమున నెక్కువగనుండుటచే మోక్షమునుగుఱించి యింతకంటె విపులముగ నిచటఁ దెలిసికొన వీలుకాదు.

మనుష్యుఁడెట్టి పనులుచేయుటచే నీజన్మమునందును జన్మాంతరము లందునుగూడ వానికిష్టములగు నెక్కువ సుఖములేగల్గి, యనిష్టములగు దుఃఖములు తొలఁగిపోవు టయేగాక, యధమజన్మములును నందుమూలమున నధోగతియును గలుగక, యుత్తమ జన్మములును, నుత్తమ గతులునుగల్గి వాఁడు క్రమక్రమముగ మోక్షమును సమీపింపఁ గల్గునో, యట్టిపనులకే ధర్మములని పేరు. అదేరీతిగ నెట్టిపనులు మోక్షమునొందు టకు మనుష్యునకు దోడ్పడక, యందులకుమారుగ వానిని మోక్షమార్గమునుండి దూర ముగ లాగికొనిపోయి యధమజన్మములును జన్మాంతరములం దెక్కువ దుఃఖములును గలిగించి వాని నధోగతి పాలు సేయునో యట్టిపనుల కధర్మములని పేరు. మనుష్యున కిష్టమగు సుఖానుభవమునకు నెలవయిన మోక్షమును బొందుటయే యిష్టప్రాప్తి యనియు, వానికనిష్టమగు దుఃఖమున కాస్పదమైన యధోగతిని దొలఁగించికొనుటయే యనిష్టపరిహారమనియుఁ జెప్పుదురు. ఎట్టిపనులవలనఁ బైఁదెల్పిన యిష్టప్రాప్తియు (ననఁగా నుత్తమజన్మములును నెక్కువసుఖములును తుదకు మోక్షమును గలుగుటయు) ననిష్టపరిహారమును (ననఁగా నధోగతియు నెక్కువ దుఃఖములును నధమజన్మములు గలుగకుండుటయు) సంభవించునో యాసంగతి స్వయముగఁ దెలిసికొనుట మనుష్యున కేవిధముగను సాధ్యము గానేరదు. ఏలనన నట్టిపనులయొక్క ఫలితము జన్మాంతరము ననేగాని (అనఁగా నితరజన్మము లెత్తినపిదపనేగాని) యనుభవమునకురాదు. అదేరీతిగ నెట్టిపను లనిష్టపరిహారమునకు మారుగ ననిష్టప్రాప్తికి హేతువులగునో యావిషయము లనుగూడ స్వయముగ నెఱుఁగ మనుష్యునకు సాధ్యము కాఁజాలదు.

అందువలననే ధర్మాధర్మములనునవి యతీంద్రియ విషయములని చెప్పఁబడును. అనఁగా వానివలన గల్గెడిఫలము వెంటనే మనకండ్లు, ముక్కులు, చెవులు మొదలగు నింద్రియములకు వేనికిఁగాని గనఁబడునదిగాదు. ఎట్లనఁగా నిపుడొక ధర్మమునుగుఱించియు నధర్మమునుగుఱించియు నాలోచింతము. జీవహింసచేయకుండుట ధర్మమనియు, నదిచేయుట యధర్మమనియు మన వేదశాస్త్రాదులు చెప్పినవి. అట్టిధర్మము నాచరించుటచేత గల్గెడిలాభము (అనఁగా జీవహింస చేయకుండుటచే గల్గెడిలాభము) గాని, యా యధర్మము నాచరించుటచే (ననఁగా జీవహింసచేయుటచే) గల్గెడినష్టముగాని, యిపుడు మనకండ్లకుఁ గానరాదు. చెవులకు వినరాదు. ముక్కునకు వాసనగొట్టదు, మఱి యేయింద్రియమునకును దెలియరాదు. ఎట్లనఁగా: నొకచీమను బట్టికొని యిపుడు మనమూరక నలిపిచంపితి మనుకొనుఁడు. అట్లుచంపుట యధర్మమని మనశాస్త్రములు చెప్పినవి. కాని, యందువలన నపుడు మనకేమి కష్టమును దుఃఖమును గలుగును? ఆచీమను జంపుటచే నపుడు మనకేమైనఁ గడుపునొప్పి వచ్చునా? కాక, కాలునొప్పి వచ్చునా? కాక, తలనొప్పివచ్చునా? లేక నడుమునొప్పి వచ్చునా? లేక కండ్లు మండునా? అట్టిదేదియును జరుగదు. లోకమున జీవహింసచేయువారిని (అనఁగా మేఁకలను, గొఱ్ఱెలను, నావులను మొదలగు జంతువులనుజంపి బ్రతుకుచున్నవారిని) మన మెందఱిని చూచుటలేదు? తక్కినవారికి లేనికష్టములు వారికిమాత్రమేమి కల్గుచున్నవి? వారుమాత్రము ధనము సంపాదించుటలేదా? భూములుకొనుటలేదా? ఇండ్లు కట్టుటలేదా? పెండ్లిండ్లు చేసికొనుటలేదా? ఏసౌఖ్యములు వారికిఁ దక్కువయైనవి? ఏమియునులేదు.

కాని, మన యేయింద్రియమునకునుగూడ గోచరింపని ఫలమొకటి మన మేపని చేసినను వెంటనే యేర్పడును. కాని, యప్పుడు మాత్రమది మనయనుభవమునకురాదు. పిమ్మట నెప్పుడో యనుభవమునకువచ్చును. అధర్మమును జేసినచో, దానికిఫలముగ నీజన్మమునఁగాని, మఱియొక జన్మమునఁగాని, యీలోకమునఁగాని, మఱియొక లోకమునఁగాని తగినదుఃఖమును మనమనుభవింతుము. ఆరీతిగనే ధర్మమాచరించుటచేఁ గలుగుసుఖముగూడ ననుభవమునకు వచ్చుచుండును. ఆతీరున నెన్నియో సుఖదుఃఖములను జనులందఱు ననుభవించుచునే యున్నారు. "భగవంతుఁడా, క్రిందటిజన్మములో నెవ్వరికిని బిడిచెడు మెదుకులు పెట్టిన పాపమునఁ బోలేదు గాఁబోలును, నేనెంతకష్టపడినను నాకెక్కడ నన్నముపుట్టకున్నదని" యల్లాడువారిని జగమున నిప్పుడు మన మెందఱిని జూచుటలేదు? "దేవుఁడా! క్రిందటిజన్మములో నేనెవనికూటిలో మన్నుపోసితినో యీజన్మలో నాజీవనాధారము కూలిపోయి నానోట దుమ్ముపడినద"ని యేడలు వారి

నెందఱిని జూచుటలేదు? "ఈశ్వరుఁడా! యేజన్మమున నెవరిసంసారమునుజూచి కన్నులలో నిప్పులు బోసికొంటినో, పండువంటి నాసంసారము పాడైపోయిన ద"ని వాపోవువారి నెందఱిని జూచుటలేదు? "స్వామీ! యేజన్మమున నెవరికండ్లు పొడిచితినో, యీజన్మమున గ్రుడ్డివాఁడనై పుట్టితి"నని యేడ్చువారును, "నేజన్మమున నెవరిపాడికుండలు బ్రద్దలుకొట్టితినో, యీజన్మమున నాపాడిపశువులు చనిపోయిన వ"ని పగచువారును, "నేజన్మమున నెవనికొంపకుఁ జిచ్చువెట్టితినో, నాకొంప పరశురామ ప్రీతియైనద"ని విలపించువారును, "నేనాఁడెవ్వని ఋణమెగబెట్టితినో, యీనాఁడు వీఁడు నానెత్తిన జెయ్యివెట్టినాఁడ"ని కుందువారును, "యేనాఁడేమి పాపము చేసితిమో, యీనాఁడీ ఘోరరోగము వాతఁబడి తీసికొనుచుంటిమ"ని తల్లడిల్లువారును లోకమునఁ బెక్కురుగలరనుమాట లోకానుభవము గలవారికి వింతగాదు. అట్లే, "యీ యిల్లాలేనాఁడేమి పూజచేసిపుట్టినదో, యీమెకు గంపెడుబిడ్డలు గలర"ని యనుకొనువారును, "నామహారాజేమి పుణ్యము చేసికొనెనో, యీయనకు లేవలేనికాలమున గూడ నుపచారము బాగుగ జరుగుచున్నద"ని తలపోయువారును, "నాయింటివారే నాఁడెంతపెట్టిపుట్టిరో, వారియింట లక్ష్మి తాండవమాడుచుండునని" ముచ్చటించుకొనువారును, "వారిపిల్లవాండ్రేమి నోమునోచిరో యన్నితరగతులందును శ్రమలేకయే తప్పక జయమందుచున్నారు! మాపిల్లవాండ్రెంత కష్టపడిచదివినను నక్షరమంటలేద"ని చింతించువారును, లోకమున ననేకులులేరా? ఇట్టి సుఖదుఃఖములన్నియుఁ గారణములులేకయే గల్గుచున్నవా? లేదు. ఏదో యొకకాలమునఁ జేసికొనిన ధర్మాధర్మములే వానికిఁ గారణములు.

## ధర్మాధర్మము లతీంద్రియ విషయములనుటకు బ్రమాణము.

పైనదెల్పినరీతిగ, జననమరణ రహితమును, సుఖదుఃఖాది ద్వంద్వవిరహితమును, సుఖానుభవ స్వరూపమునునగు మోక్షమును జెందుటకు సాధనములగు నుత్తమజన్మములను నుత్తమసౌఖ్యములను మాత్రమే బుద్ధిమంతులగు మనుష్యులకు నిష్టమగుటచేతను, జననమరణములకును, శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములకును నాస్పదములగు నధమజన్మములును, వానిమూలమున మోక్షమునకు దూరమగు నధోగతియును, గల్గుట యనిష్టమగుటచేతను, నట్టి యిష్టప్రాప్తికిని, ననిష్టపరిహారమునకును, బ్రత్యక్షముచేగాని, యనుమానముచేగాని దెలిసికొనవీలులేని యుపాయములను దెల్పుటకే వేదమేర్పడినదనియు, నట్టి యతీంద్రియ విషయజ్ఞానము నొసంగుటచేతనే వేదమునకుఁ బ్రాముఖ్యము గల్గినదనియు సూచించుచు, సుప్రసిద్ధవేద వ్యాఖ్యాతలగు శ్రీవిద్యారణ్య యతి

సార్వభౌములు తామురచించిన వేదవ్యాఖ్యానములో 'నైతరేయ బ్రాహ్మణవ్యాఖ్యా' ప్రారంభమున నీక్రిందిరీతిని దెలిపియున్నారు:—

"నను కోఽయం వేదో నామ? కేవాఽస్య విషయప్రయోజన సంబన్ధాధికారిణః? కథంవా తస్య ప్రామాణ్యమ్? నఖల్వేతస్మి న్నసర్వస్మి న్నసతి వేదో వ్యాఖ్యానయోగ్యో భవతి. అత్రోచ్యతే. 'ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయో రలౌకిక ముపాయం యో గ్రంథో వేదయతి సవేదః.' అలౌకికపదేన ప్రత్యక్షానుమానే వ్యావర్త్యేతే, అనుభూయమానస్య స్రక్చందనవనితాదే రిష్టప్రాప్తిహేతుత్వ మౌషధాదేరనిష్ట పరిహారహేతుత్వంచ ప్రత్యక్షత స్సిద్ధమ్, స్వే నానుభవిష్యమాణస్య పురుషాన్తరగతస్య చ తథాత్వ మనుమానగమ్యమ్, ఏవంతర్హి భావిజన్మగత మప్యనుమానగమ్య మితిచేన్న, తద్విశేషస్యానవగమాత్, నఖలు జ్యోతిష్టోమాది రిష్టప్రాప్తిహేతుః కలఞ్జభక్షణ వర్జనాది రనిష్టపరిహారహేతు రిత్యము మర్థం వేదవ్యతిరేకేణానుమాన సహస్రేణాపి తార్కికశిరోమణి రప్యవగన్తుం శక్నోతి, తస్మాదలౌకికోపాయబోధకో వేద ఇతి లక్షణస్య నాతివ్యాప్తిః.

అతఏవోక్తమ్.—

"ప్రత్యక్షే ణానుమిత్యావా, యస్తూపాయో నబుధ్యతే,
ఏనం విదన్తి వేదేన, తస్మా ద్వేదస్య వేదతా". ఇతి.
స ఏవోపాయో వేదస్యవిషయ; స్తద్బోధ ఏవ ప్రయోజనమ్;
......................................"

పైవ్యాఖ్యానమున కర్థమేమనఁగా.—

"వేదమనఁగానేమి? దానియందలి విషయమెట్టిది? దానివలని ప్రయోజన మెట్టిది? దానినెఱుగ నధికారులెట్టివారు? వారికిని వేదమునకును సంబంధమెట్టిది? వేదమునకుఁ బ్రామాణ్యమెట్లుగల్గినది? యనునీవిషయములు తేలనిచో వేదమునకు వ్యాఖ్యానమువ్రాసిన ప్రయోజనముండఁ జాలదుగదా! అందువిషయమై 'యిష్టప్రాప్తికిని ననిష్టపరిహారమునకును నలౌకికమగు నుపాయము నేగ్రంథము తెలుపునో యాగ్రంథము వేదమ'ని చెప్పఁబడినది. అలౌకికమనుపదమునకు బ్రత్యక్షానుమానముల కంటె వేఱయినదనియర్థము. స్రక్చందనవనితాదులవలన నిష్టప్రాప్తి (యనఁగా సుఖములు) గల్గుననియు నౌషధములు మొదలగువానివలన ననిష్టపరిహారము (అనఁగా రోగములు మొదలగుదుఃఖములు తొలఁగిపోవుట) జరుగుననియు ననుభవించువానికి బ్రత్యక్షముగనే తెలియవచ్చును. అట్లే తానుస్వయముగ ననుభవించు సుఖదుఃఖముల

వలన, నితరులయొక్క సుఖదుఃఖానుభవముగూడ నిట్టిదిగనే యుండునుగదాయని యనుమానముచే (ననఁగా నూహచేఁ) దెలిసికొనవచ్చును. ఐనచో రాఁబోవు జన్మములోనివిషయమునుగూడ ననుమానముచే (నూహచే) దెలిసికొనరాదాయనిన, వలనుపడదు. ఎందుచేత? అందలివిశేషమూహ కందరానిదగుటచేత. (అట్లుప్రత్యక్షము చేతఁగాని యనుమానము చేతఁగాని తెలిసికొన వీలుగానివిషయమునకే యలౌకిక మనియు నతీంద్రియ మనియుఁజెప్పుదురు. అనఁగా నీలోకసంబంధమగు సాధనములచేఁ గాని, యింద్రియములచేఁగాని యెఱుఁగవీలుగాని విషయమనియర్థము) జ్యోతిష్టో మాదియజ్ఞములవలన నిష్టప్రాప్తిగల్గుననియుఁ గలఞ్జభక్షణము (అనఁగా గంజాయితినుటను) మానుటవలన ననిష్టపరిహారముగల్గుననియు వేదమువలనమాత్రమే తెలియు నీవిష యములను వేదముకంటెవేఱగు ననుమానప్రమాణములు వేయింటిచేతనైనను నెంతటి తార్కికుఁడైనప్పటికిని తెలిసికొనశక్యముగాదుగదా! అందువలన నలౌకికోపాయమును (అనఁగా నతీంద్రియవిషయమును) దెలుపుటయే వేదముయొక్కలక్షణమనుటలో నావం తయు నతిశయోక్తి యుండఁజాలదు.

అందువలననే, 'ప్రత్యక్షముచేఁగాని యనుమానముచేఁగాని యెట్టియుపా యము నెఱుఁగవీలుకాదో యట్టియుపాయమును వేదముచేనెఱుఁగ వీలగుచున్నది కావుననే వేదమునకు వేదత్వముసిద్ధించుచున్నది' యని ('ప్రత్యక్షేణాను మిత్యా వా...—' యని పైనఁజూపఁబడినశ్లోకములోఁ) జెప్పఁబడుచున్నది. అట్టియుపాయ మును జెప్పుటయే వేదమందలివిషయము; ఆవిషయము నెఱుఁగుటయే వేదమువలనప్రయో జనము............"

దీనివలనఁ దెలియవచ్చునదేమనఁగా, మనుష్యులకు నీలోకమున మాత్రమే గాక యితరలోకములందును నితరజన్మములందునుగూడ గలుగఁగల సుఖములకు హేతువులగు యుక్తకర్మలే ధర్మములనియు, నట్లే దుఃఖములకు హేతువులగు నయుక్త కర్మలే యధర్మములనియు, నట్టి యితరజన్మములును నితరలోకములును ప్రత్యక్ష ప్రమాణముచేఁగాని యనుమానప్రమాణముచేఁగాని తెలిసికొనశక్యముగాని యతీం ద్రియ . విషయములగుటచే నట్టివానికి హేతుభూతములగు ధర్మాధర్మములుగూడ నతీంద్రియ విషయములేయనియుఁ దెలియుచున్నది. కాఁబట్టి సర్వజ్ఞుఁడగుపర మేశ్వరుఁడే యట్టిధర్మాధర్మములను, వానివలన లోకాంతరములందును జన్మాంతరము లందునుగల్గు సుఖదుఃఖములను నిర్ణయించి తెలుప సమర్థుఁడగునుగాని యితరు లెంతటి ధీమంతులైనను వానినినిర్ణయింపఁజాలరు. కావుననే పరమేశ్వరుఁడు తనయాజ్ఞా రూపమగు వేదముద్వారా యట్టిధర్మాధర్మములను నిర్ణయించి మనుష్యులకుఁ దెల్పియే

యున్నాఁడు. ఈజన్మమునఁజేయు ధర్మములవలనను నధర్మములవలనను నెట్టియెట్టి సుఖములును దుఃఖములునుగల్గునో యవి మనుష్యులకు వేఱుజన్మములందును, వేఱు లోకములందును ననుభవమునకువచ్చునవి యగుటచేతను, వాని నీజన్మమునందే యనుభవ పూర్వకముగఁదెలిసికొనుట మనుష్యులకు శక్యముగాని విషయమగుటచేతను, నిట్టి ధర్మముచే నిట్టిసుఖములుగల్గుననియు, నిట్టియధర్మముచే నిట్టిదుఃఖములు గల్గుననియు, సర్వము నెఱుఁగఁజాలినయాశ్వరుఁడే చెప్పవలసివచ్చినది. అందుచే ధర్మాధర్మ నిర్ణయ విషయమున నితరసాధనము లన్నిఁటికంటెను, నీశ్వరుని యాజ్ఞారూపమగు వేదము నకే ప్రాముఖ్యతయొసఁగఁబడి, యది యాప్తవాక్యమనియు శబ్దప్రమాణమనియుఁ గొనియాడఁబడుచున్నది. ఇందులకుదాహరణముగ ధర్మశాస్త్ర కర్తలందఱును నేక గ్రీవముగ దమగ్రంథములందుఁ దెలుపఁబడినధర్మములన్నిఁటికిని మూలము వేదమే యని చెప్పినవాక్యముల నీప్రకరణమునలోగడఁ గనఁబఱచియే యుంటిమి. ధర్మాధర్మములయొక్కఫలములు ప్రత్యక్షముచేతఁగాని యనుమానముచేతఁగాని యనుభవ పూర్వకముగఁ దెలిసికొనుటకు శక్యముగాని విషయములగుటచేతనే వానిని దెలియుటకు నీశ్వరుని యాజ్ఞారూపమగు వేదముయొక్కసహాయ మవసరమగుచున్నది. వేఱువిధముగఁ దెలియసాధ్యముగాని యట్టివిషయములను బోధింపఁజాలి యుండుటచేతనే వేదమునకంతటి ఘనతయుఁ బ్రాముఖ్యతయుఁ బ్రామాణ్యమును బూజ్యతయుఁ గల్గుచున్నవి. కాని, ప్రత్యక్షాదులచేఁ దెలియఁదగినవిషయముల కెవ్వరియొక్క ప్రామాణ్యతతోడను బనియేయుండదు. పైవేద వ్యాఖ్యానమునందు శ్రీవిద్యారణ్య యతిపుంగవులచేఁ జెప్పఁబడిన స్రక్చందనవనితాది సుఖసాధనములును, నౌషధాది రోగనివారణసాధనములునే యిందులకుదాహరణములు. అంతేగాక, ప్రత్యక్షాదిప్రమాణములచే దుఃఖప్రదములని సిద్ధించినవిషయములలో నవిదుఃఖప్రదములు గావున వానినిమానవలసినదని చెప్పుటకేప్రమాణమును నవసరమేయుండదు. ఇందులకుదాహరణముగ నిప్పుసద్రొక్కినచో కాలుగాలుననియు, ముండ్లపై నడచినచోఁ బాదమునొచ్చుననియు నెవ్వరును జెప్పనవసరములేకయే యెల్లరును దెలిసికొందురు. అట్టివిషయమును నేర్పుటకు లోకమున నొకశాస్త్రగ్రంథమే యవసరములేదు. ఉండినను నదినిష్ప్రయోజనమే యగును. ఏలనన నట్టివిషయము ప్రత్యక్షసిద్ధమే యగుటచేత. ఒకవేళనట్టి శాస్త్రగ్రంథమొకటియుండి యదిప్రత్యక్షమున కనుకూలముగ బోధించుటకుమారుగఁ బ్రతికూలముగనే బోధించినచో నిఁకనాగ్రంథము రూపనాశనమును మాత్రమేగాక నామరాహిత్యమునుగూడ చెందవలసినదే. ఎట్లనినఁ నిప్పునుద్రొక్కినచోఁ గాలుకాలదనియు ముండ్లపైనడచినచోఁ బాదమునొవ్వదనియుఁ

గావున నందఱు నట్లాచరింపవలసినదనియు నా గ్రంథము లోకమునకు బోధించి ప్రామాణ్యతను బడయనెంచినచో దానిననుసరింపఁ దలంచువాఁడు జనులలోను మూఢులలోను మూర్ఖులలోనునుండఁడు సరిగదా, యిఁక నున్మత్తులలో సహితమొక్కఁడైనను నుండుననిచెప్పుటకుఁగూడ వలనుపడదు. కావున నట్టిప్రత్యక్షసిద్ధము లగువిషయముల కనుకూలముగఁగాని ప్రతికూలముగఁగాని బోధించుట కెట్టిప్రమాణగ్రంథమును నవసరమేయుండదు. కావుననిఁక నొకప్రమాణగ్రంథము లోకముననుండుటయే యవసరమైనచో నది ప్రత్యక్షాను మానప్రమాణముల కతీతమగువిషయమును బోధింపఁజాలినదై యుండినయెడలమాత్రమే యది, ప్రామాణ్యతను బ్రయోజనమును బడయఁజాలును. అట్టియతీంద్రియజ్ఞానము సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరునికిఁ దక్క యన్యులకు దుర్లభమగుటచే నదియాయనయొక్క యాజ్ఞారూపమే యైయుండ వలయును. వేదమట్టిదే యైయున్నదని లోగడఁ బెక్కుప్రమాణములచే ఋజువు పఱచియుంటిమి. ఆవేదమందలియర్థము జనులకు సులభముగాఁ దెలియుటకొఱకే కొందఱుమహర్షులావేదమందలి ధర్మములను గ్రహించి వానినిదమధర్మ శాస్త్రములలో వ్రాసియున్నారు. ఇదిధర్మాధర్మములను గుఱించియు, వానియొక్క ఫలితములును నతీంద్రియవిషయములును నగుజన్మాంతరములను గుఱించియు, లోకాంతరములను గుఱించియు మనప్రాచీనచరిత్రలు చెప్పుచున్నవిషయము. ఇఁకనీ యతీంద్రియవిషయములగు జన్మాంతర లోకాంతరములనుగుఱించి మననవనాగరకులకుఁగల కొన్నిసంశయములవలన, వానికిమూలమగు ధర్మాధర్మములయొక్క యతీంద్రియత్వమునకుగూడ భంగమువాటిల్లుట కవకాశముగలదు గావున, ముందుముందుగా నట్టిసంశయములకుఁ దగినసమాధానములను జెప్పి, యటుపై "ధర్మములనుగుఱించియు, ధర్మశాస్త్రములను గుఱించియు నవీనచరిత్రలేమిచెప్పు"నను విషయమునకుఁబోవుదము.

## ఇతరజన్మములు; ఇతరలోకములు.

పైన చెప్పినవిషయములలో మననవనాగరకులకుఁ గొన్నిసంశయము లుండ వచ్చును. ఏమనఁగా, నీజన్మముతప్ప వేఱుజన్మములుగాని, యీలోకముతప్ప యితర లోకములుగాని లేవని వీరిలోఁగొందఱుతలంచుచున్నారు. అందుచే ధర్మాధర్మములు గాని, వానిచేఁగల్గు పుణ్యపాపములుగాని, యనియనుభవించు నితరలోకములుగాని, లేవని వీరితలంపు. అందులకుదాహరణముగ నిటీవలి నవనాగరకులలో నగ్రగణ్యులని చెప్పఁదగిన కీర్తిశేషులైన మ॥ రా॥ శ్రీ॥ కందుకూరి వీరేశలింగము పంతులుగారు మొదలగు ప్రముఖులు కొందఱు తమగ్రంథములలో జీవులకు నితరజన్మములులేవని

వ్రాసియున్నారు. ఇప్పటియింగ్లీషుబడులలోఁ జదువుకొనినబాలురును బెద్దలునుకూడ నవనాగరకులేయగుటచే వారిలోఁబ్రముఖులగు వీరేశలింగము పంతుల వారివంటి వారియొక్క గ్రంథములందు వీరికిసహజముగ నభిమానమును, నమ్మకమునునుండును. ఆగ్రంథములయందుఁ జెప్పఁబడినట్లు జీవులకు వేఱుజన్మములును నితరలోకములును లేవని వీరుతలంచుటకు నాగ్రంథములందలి నమ్మకమే కారణమగుచున్నది. మఱి యొకకారణమేమనఁగా, నితరజన్మములును నితరలోకములునుగలవని చెప్పెడివేదము నందును, ధర్మశాస్త్రములు బురాణేతిహాసములు మొదలగు మనప్రాచీనచరిత్రలం దును వీరికినమ్మకములేదు. అందులకుఁ గారణమేమనఁగా, విదేశీయులువ్రాసిన మన దేశపు నవీనచరిత్రలు, మనప్రాచీనచరిత్రలనుగుఱించి మిక్కిలివిపరీతపు సంగతులను మన నవనాగరకులకు నేర్పినవి. అందుచే వీరికి మనప్రాచీనచరిత్రలందు నమ్మకములేదు. కావున జన్మాంతరముకలదని మనచరిత్రలుచెప్పినను వీరునమ్ముటలేదు. కాని, యేది యెట్లున్నను వీరేశలింగము పంతులవారివాదమును, నట్టిదేయగు మననవనాగరకుల యొక్కవాదములును జాలవఱకు యుక్తివాదముపైననే యాధారపడి యున్నందున నట్టి యుక్తివాదమునకుఁగల బలాబలములనుగూర్చి తొలుతమనము తెలిసికొనవలసి యున్నది.

## యుక్తివాదము నమ్మఁదగినదగునా, కాదా?

ఎన్నియుక్తులైనను బరమేశ్వరునివాక్యమగు వేదముకంటె నెక్కువ నమ్మఁ దగినవి కాఁజాలవుగదా! ఏలననఁగాఁ, బరమేశ్వరుఁడుసర్వజ్ఞుఁడు. అనఁగా నన్ని సంగతులును దెలిసినవాఁడు. అన్నిలోకములను నన్నివస్తువులను బుట్టించినవానికిఁ దెలియనివిషయ మొకటియుండునా? ఉండదు. కాఁబట్టి సత్యముగ నితరజన్మము కలదో, లేదో, యావిషయము పరమేశ్వరునికిఁ దెలియకుండునా? తెలిసియేయుండును. కాఁబట్టి యితరజన్మమున్నదని వేదముద్వారా యాయనచెప్పినపు డదిలేదని మన మెట్లు చెప్పవచ్చును? యుక్తిచేతఁ జెప్పవచ్చునని యనుకొందమా. యదిసరిగాదు. ఏలననఁగా యుక్తివాదముయొక్క బలాబలము లాయావ్యక్తులయొక్క తెలివితేట లనుబట్టి మారుచుండును. దానిచే సత్యమునునిర్ణయింప నెక్కువ యవకాశముండదు. ఎట్లనఁగా, నొకనికితోఁచనియుక్తులు, వానికంటె తెలివిగల మఱియొకనికిఁదోప వచ్చును. అప్పుడు మొదటివానివాద మబద్ధము కావలసివచ్చును. రెండవవానివాదమే సత్యమని నమ్మవలసివచ్చును. కాని మఱికొంతకాలమునకు వానికంటెఁ దెలివిగల మూఁడవవాఁ డింకొకఁడుబయలుదేరి తన తెలివిచే రెండవవానియుక్తులను ద్రోసి

పుచ్చఁగల మఱికొన్ని యుక్తులను గని పెట్టును. అపుడు మరల రెండవవానివాద మసత్య మగును. ఇట్లు యుక్తివాదముచే నిలకడలేక సత్యమనుకొనిన దసత్యమనియు మరల నసత్యమనుకొనినది సత్యమనియు భ్రమించుచుఁ దుదకు సత్యమేదియో యసత్య మేదియో యా యథార్థమును నిశ్చయించుకొనజాలని దుస్థితికి జనులు పాల్పడ వలసివచ్చును. జన్మాంతరము లేదనువిషయమును సిద్ధాంతముచేసి నవనాగరకలోకము నంతను భ్రమింపఁజేసిన పైడీరేశలింగము పంతులవారి యుక్తివాదమును, దానిని దిరిగి తమప్రతియుక్తులచే ఖండించివిడచిన బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రుల వారివంటి వారి యుక్తివాదములే యిందులకుఁ బ్రబలనిదర్శనములు. మఱియును నితరజన్మములు లేవనుటకు మఱికొందఱు నవనాగరకులు మఱికొన్ని యుక్తులనుజూపి తమ వాదమును సిద్ధాంతము చేసియున్నారు. మేమిక్రింద మఱికొన్ని ప్రతియుక్తులను జూపి వారిసిద్ధాంతము సత్యము కాఁజాలదని ఋజువుచేయుచున్నాము. ఇందుచే యుక్తి వాదములయొక్క బలాబలములు బోధపడఁగలవు. నవనాగరకులయొక్క యుక్తివాద ములచే నిలువఁజాలక వ్రాలిపోవుచున్న శాస్త్రసిద్ధాంతములను యుక్తివాదముచేతనే తిరిగి యేవిధముగ నిలువఁబెట్టదగినదియుఁగూడ చూపుటకును, నందుచే యుక్తి వాదములయొక్క బలసామర్థ్యము లెన్నఁడును, నతీంద్రియవిషయములందలి సత్య మును దెలుపఁజాలవని మఱింత ఋజువు చేయుటకును మాత్రమే, మే మిక్రింద జన్మాంతరము కలదనుటకు బ్రతియుక్తులను జూపఁబోవుచుంటిమి. కాని, యంతమాత్ర ముచే, నట్టి మాయుక్తివాదముచేతనే యావిషయమును మేము సిద్ధాంతముచేసి నిలుపఁ గోరుచుంటిమని కాని, మాయుక్తులను ఖండించుటకును నందుచే మాసిద్ధాంతమును ద్రోసివైచుటకును సమర్థములగు ప్రతియుక్తులు లోకమున నుండనేయుండవని మేము పొరఁబడుచుంటిమని కాని, యట్టిప్రతియుక్త లున్నంతమాత్రముచే, శాస్త్రసిద్ధమగు మా సిద్ధాంతమున కెట్టిలోపమును వాటిల్లునని కాని, పాఠకులు భ్రమపడరాదు.

అంతియగాక, యొకవిషయము నొకఁడు తనయుక్తివాదబలముచే సత్యమని సిద్ధాంతము గావించి నిలుపఁగా, మఱియొకఁడు తన తెలివిచేఁ గొన్ని క్రొత్తప్రతియుక్తు లనుగనిపెట్టి వానిసహాయమునఁ బైవానియుక్తులను ఖండించి యావిషయము నబద్ధ మని త్రోసివైచినప్పటికిని, నయ్యది వెంటనేగాకున్నను గొంతకాలమునకైనను బ్రత్యక్షాదిప్రమాణములచేఁ దెలియవచ్చెడి యైహిక విషయమైయున్నచో (ననఁగా నీలోకముననే యీ జన్మముననే తెలియవచ్చెడి విషయమై యున్నయెడలఁ) గొంత కాలమునకుఁగాకున్న మఱికొంతకాలమునకైనను జనులు దానియొక్క సత్యమును బ్రత్యక్షముగఁ గనుఁగొని, పై యిరువురి యుక్తివాదములలో నేది యథార్థమో

యప్పటికైనను దెలిసికొనఁ జాలుదురు. అట్లుగాక, యది ప్రత్యక్షాదులకుఁ దెలియరాక, యీలోకమునఁగాని యీజన్మమునఁగాని యనుభవమునకురాక, యితరజన్మములకును నితర లోకములకును మాత్రమే సంబంధించిన విషయమేయైనచో నట్టిసందర్భమున నెంతటి తెలివిగల వానియుక్తులచేతనుగూడ ప్రయోజనమే యుండఁజాలదు. లోకమున సర్వజ్ఞుఁడగు పరమేశ్వరునికంటె నెక్కువ తెలివిగలవాఁ డింకొకఁడు పుట్టఁబోఁడు. కావున నాయనయొక్క యుక్తికి మించిన బలవత్తరమగుయుక్తి మఱియొకటి యుండఁబోదుగదా! అందుచే నితరులయొక్క యుక్తివాద మాయనయొక్క యాజ్ఞయగు వేదమునుమించిన ప్రమాణము కాఁజాలదు. వేదప్రమాణముగాని, దానితో సమానములైన స్మృతిపురాణేతిహాసాదులందలి ప్రమాణములుగాని లభింపనప్పుడును, ధర్మాధర్మములను నిశ్చయించుట కితరమగు నాధారమేమియుం దొఱకనప్పుడును మాత్రమే యుక్తి నుపయోగింపవలసియుండును. అపుడైనను దానికంటె నుత్తమమగు నాధారము మఱియొకటి దొఱకనందుననే, దానికంటె వేఱుగతిలేక దానిని వాడవలసి వచ్చునేగాని, యపుడైనను నది యుత్తమ ప్రమాణమగుటచేఁగాదు. అందుచే నతీంద్రియ విషయమగు జన్మాంతరము కలదాలేదా యను సందర్భమున, జన్మాంతరము కలదని వేదశాస్త్రములు చెప్పుచుండఁగా, నది లేదని యుక్తివాదముచే సిద్ధాంతము చేయఁ జూచుట యుక్తము కానేరదు. ఆవాదమునే యాధారముచేసికొని, ధర్మాధర్మములను వానివలనఁగల్గు పుణ్యపాపములను, వానిననుభవించు నితరలోకములును లేవని తలంచుటయుసరిగాదు. కాని యట్టివాదమును బై వీరేశలింగము పంతులవారును వారి యనుచరులగు నవనాగరకులును సాగించుటకుఁ గారణ మేమనఁగా, మన వేదమును బరమేశ్వరుఁ డిచ్చినాఁడనువిషయమునను, నావేదమందలి యర్థమునే మహర్షులు స్మృతిపురాణేతిహాసాదులమూలమునఁ బల్కిరనువిషయమునను వారికి విశ్వాసము లేదు. అందులకుఁ గారణము వారు మనదేశప్రభువులగు విదేశీయులయొక్క పాఠశాలలలోఁ జేరి, యావిదేశీయపండితులు వ్రాసిన నవీనచరిత్రలందు మనవైదికమతమునుగుఱించియు దానికిమూలమగు వేదశాస్త్రములనుగుఱించియు విపరీతములును సత్యదూరములు నగువిషయములను జదివికొనియుండుటయే. కాని, యా వేదమును గూర్చియు, దానివిషయమున మననవనాగరకులకుఁగల ముఖ్యసంశయములను గుఱించియు నిదివఱకే యీగ్రంథమున మొదటిప్రకరణమునఁ దెలిసికొనియుంటిమి. అందుచే వేదముయొక్క ఘనత తెలియవచ్చుచునేయున్నది. వేదము తరువాతివి యగుధర్మశాస్త్రములయొక్క ఘనతనుజర్చించుటకే యిపుడీ ప్రకరణము నడచుచున్నదిగదా. కావున నీకనిందు సందర్భవశమునవచ్చిన జన్మాంతరవిషయమును

గుఱించి చర్చించుటకుముందు, జన్మాంతరము కలదనువిషయము వేదశాస్త్రములచే నెట్లు సిద్ధించుచున్నదో తెలిసికొందము.

### ఇతరజన్మము కలదనుటకు వేదశాస్త్రప్రమాణములు

ఇతరజన్మముకలదనియే వేదశాస్త్రములయొక్క సిద్ధాంతమని పైనఁదెలిపియుంటిమి. తదనుగుణ్యముగ, జన్మాంతరములందుమాత్రమే తెలియవచ్చెడి యతీంద్రియ విషయములను దెలుపుటయే (యతాకికోపాయములను బోధించుటయే) వేదముయొక్క ప్రయోజనమని సుప్రసిద్ధ వేదవ్యాఖ్యాతలగు శ్రీవిద్యారణ్య యతివరేణ్యులు తమ వేదభాష్యమున నైతరేయ బ్రాహ్మణవ్యాఖ్యాప్రారంభమున వ్రాసినవాక్యములను లోగడ నీప్రకరణముననే చూపియుంటిమి. ఆట్టివే మఱికొన్ని శాస్త్రప్రమాణముల నీదిగువఁ జూపుచున్నాము. వీనిచే, జన్మాంతరము కలదనువిషయము వేదశాస్త్రసిద్ధమని సిద్ధాంతము కాఁగలదు; కాని, యితరజన్మములుఁకలవనుటకు మనప్రాచీనచరిత్రలగు వేదశాస్త్రములలో వేలకొలఁది నిదర్శనములున్నవి. అంతయేల! వేదశాస్త్రములయొక్క మతసిద్ధాంతమంతయు జన్మాంతరములమీఁదను వానికిమూలములగు పుణ్యపాపములమీఁదను, వానికిఁగారణములగు ధర్మాధర్మముల పైననుమాత్రమే యాధారపడియుండుటచే ధర్మాధర్మముఁఫలితములగు జన్మాంతరసుఖదుఃఖముల ప్రశంస వేదశాస్త్రసిద్ధాంతములందన్నిసందర్భములందును బ్రతిధ్వనించుచు నేయుండును. ఆట్టివిషయములనన్నిఁటిని బ్రోవు చేసి యిచటవ్రాయుట దుస్సాధ్యమగుటచేతను గ్రంథవిస్తరభీతివలనను వీలుకాదు. వైదిక మత సాంప్రదాయములను వేదశాస్త్రములనునెఱిఁగిన ప్రాజ్ఞులందఱికిని నట్టివిషయములు బాగుగఁ దెలిసియేయుండును. ఐనప్పటికిని, నావిషయమునఁ బ్రమాణములున్నచో నేలచూపలేదని యజ్ఞులాక్షేపింపకుండునట్లుగ ముఖ్యప్రమాణములనుమాత్రమే కొలఁదిగనెత్తి స్థాలీపులాక న్యాయానుసారముగ నీక్రిందఁజూపుచున్నాము.—

శ్రీకృష్ణభగవానులు శ్రీమహాభారతమందలి భగవద్గీతయందు దర్జునునకుఁ జెప్పిన యీక్రింది వాక్యములవలన జన్మాంతరములు (అనఁగా నితరజన్మలు) కలవని తెలుచున్నది; చూడుఁడు.—

"శ్లో. బహూనిమే వ్యతీతాని, జన్మాని తవచార్జున,
తాన్యహం వేద సర్వాణి, నత్వంవేత్థ పరంతప.
(శ్రీ మద్భగవద్గీతా; అధ్యా. ౪. శ్లో. ౫.)

"శ్లో. బహూనాం జన్మనామన్తే, జ్ఞానవాన్మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వమితి, సమహాత్మా సుదుర్లభః.
(శ్రీమద్భగవద్గీతా; అధ్యా. ౭ శ్లో ౧౯.)

అనఁగా. "ఓయర్జునా! నాకును నీకును బెక్కుజన్మములు గడచిపోయినవి; వానినన్నిఁటిని నేనెఱుఁగుదును; కాని నీవెఱుఁగ" వనియు, "ననేకజన్మము లెత్తినపిదపఁ దుదకుసర్వమును వాసుదేవుఁడేయని తెలిసికొని జ్ఞానియగువాఁడు నన్ను పాసించును; అట్టి మహానీయుఁడు మిక్కిలిదుర్లభుఁడు" అనియునర్థము. ఈభగవద్వాక్యములవలన జన్మములొక్కటిగాదనియుఁ బెక్కుగల్గుచుండుననియుఁ దెలియుచున్నది.

మఱియును, శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారివంటి వేదశాస్త్రవిద్యా విశారదులయొక్క యీక్రిందివాక్యమువలనఁగూడ జన్మమొక్కటిగాదనియుఁ బెక్కు జన్మలుండుననియుఁ దెలియుచున్నది:—

"శ్లో. జంతూనాం నరజన్మ దుర్లభ మతః పుంస్త్వం; తతో విప్రతా
తస్మా ద్వైదికమార్గధర్మపరతా; విద్వత్త్వ మస్మాత్పరమ్,
ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాదినోసంస్థితి
ర్ముక్తిర్నో శతజన్మకోటి సుకృతైః పుణ్యైర్వినా లభ్యతే."

అనఁగా: "జంతువులకు నరజన్మముకల్గుట మిక్కిలి దుర్లభమనియు......... ముక్తియనునది యనేకజన్మములందుఁజేసిన పెక్కుపుణ్యఫలముల విశేషమునఁగాని లభింపఁజాలద"నియు నర్థము.

ఇతరజన్మలుకలవనుట కీక్రిందఁజూపఁబోవు మహాభారతమునందలి యితిహాసము మఱియొక ప్రమాణము:—

[శ్రీమదాంధ్రమహాభారతము-ఆనుశాసనికపర్వము;పంచమాశ్వాసము]

"...........................................................

వ. అనినవిని యజాతశత్రుండు శంతనుపుత్రుతో, 'నప్రయత్నులకు నర్థంబు సిద్ధించుటగలుగు; ధర్మపరులును, నీతివిదులునునైన బలవంతులు బహుమార్గంబులగు నదుపాయంబుల నర్థంబులాకాంక్షింప సిద్ధింపకుండెడు గొందఱకు సిద్ధించియు నవి భోగంబుల కుపయోగ్యంబులుగాకుండు; శిషులు పెద్దలేకయుఁ గొన్నిచిత్తంబులందు విద్యలలవడు; శిక్షితులయ్యును నిర్విద్యులగుటయును గలుగుఁ; దెవుళ్లనోసియుఁ బోట్లంబడియును గొందఱుసావరు; పూరిపుడుకదాఁకి బలాధికులు సచ్చుటచూచెద; మిట్లుగాఁగతంబేమి? యెఱింగింపవే!' యనుటయు నమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె.

## శుభాశుభంబులు పూర్వజన్మకృత పుణ్యపాపంబులచేఁ గల్గునని చెప్పుట.

క. మొలవంబెట్టనియట్టిది, మొలచునె? తొలుమేనిదానములనాసార్థం

బులుసిద్ధించుఁ బ్రయత్నం,బులు లేకయుఁ నింతనిజము భూపవరేణ్యా! 430

తే. అలఘుతపములుదొలు మేనఁ గలిగెనేని, వెదకికొనివచ్చు నన్నరు విపులభోగ
ములు; పురాకృతవృద్ధ సేవలఫలించు, బుద్ధిశలిమియుం, విద్యలఁ బొలుచుటయును.

క. తొలుమేన నహింసారుచి, గలిగినదీర్ఘాయువొందుఁ; గారణభూతం
బులు భూవరయివి; యీగుణ,ములు లేమియకీడులకును మూలంబరయన్." 432

పైపద్యమందలి 'తొలుమే'నను పదమునకును 'బురాకృతమ'ను శబ్దమునకునుఁ బూర్వజన్మమనియే యర్థము. ఈజన్మమునం దప్రయత్నముగను నిమిత్తమాత్రప్రయత్నమునను జీవులకుఁదటస్థించు సుఖదుఃఖములకును, మహాప్రయత్నములు సహిత మొకప్పుడు వ్యర్థమైపోవుటకును గలకారణము లితరజన్మములలో నెప్పుడో యొకప్పుడు జీవులు చేసికొనిన ధర్మాధర్మములే (యనఁగా బుణ్యపాపములే)యని లోగడ నీప్రకరణమున నే మేము వ్రాసియున్నవిషయము నీమహాభారతకథ సర్వవిధములసమర్థించుచున్నది. ఇందుచే జన్మాంతరములు కలవనియే సిద్ధించుచున్నది.

మఱియును బైకథయందు ధర్మరాజు భీష్మాచార్యుని మొదటఁబ్రశ్నించిన వచనమధ్యమున, "......శిశులు పెద్దలేకయుం గొన్నిచిత్తంబులందు విద్యలలవడు;..." ననువాక్యమందలి యర్థమువంటి యర్థమునే పురస్కరించికొని, శ్రీస్కాందమహాపురాణాంతర్గతమగు సూతసంహితయందలి శివమాహాత్మ్యఖండమున, ముక్తిసాధనకథనమను నేడవయధ్యాయమున పరమశివుఁడు శ్రీమహావిష్ణువుతో నీక్రిందిరీతిని చెప్పియున్నాఁడు.

..................................................

"శ్లో. యేషామస్తి పరిజ్ఞానం, వినైవజ్ఞానసాధనం,
కల్ప్యం తత్సాధనం తేషాం, పూర్వజన్మని సూరిభిః."

పైశ్లోకమునకు శ్రీమాధవాచార్యులవా రీక్రిందిరీతిని వ్యాఖ్యానమును రచించియున్నారు:—

"నను నివృత్తిధర్మశ్రవణాదికమపి వినైవ వామదేవాదేః గర్భస్థస్యైవ స్వతో బోధశ్శ్రూయతే"గర్భేను సన్నన్వేషామవేదమిదం ప్రస్తుత్యగర్భ ఏవైతచ్ఛయానో వామదేవ ఏవమువాచే"తి తత్కథం శ్రవణాదిసాధన తేతి తత్రాహ 'యేషా మస్తీతి." దీనియర్థమేమనఁగా: "మోక్షస్వరూపమగు బ్రహ్మజ్ఞానమును సంపాదించుటకు సాధనములైన వేదాంతవిచారమును, శ్రవణమననాదులును లేకయే వామదేవుఁడు మొదలగు కొందఱు మహనీయులకు మాతృగర్భముననుండగనే స్వయముగనే బ్రహ్మజ్ఞానము లభించియున్నట్లు కొన్నిప్రమాణవచనములచేఁ దెలియవచ్చుచున్నది. శ్రవణమననాది సాధనములు లేకయే వారికిమాత్ర మా బ్రహ్మజ్ఞానమెట్లు కలిగినదను ప్రశ్నకు సమాధానముగ, "యేషామస్తి

పరిజ్ఞానం" అను పైశ్లోకమును బరమశివుఁడు శ్రీమహావిష్ణువునకుఁ జెప్పియున్నాఁడు. ఆశ్లోకమున కర్థమేమనఁగా; "శ్రవణమననాదిజ్ఞానసాధనము లలవడుచుండినకయే యెవరికి బ్రహ్మజ్ఞానముకల్గుచున్నదో యట్టివారి కాసాధనములు వారియొక్క పూర్వజన్మములందే యలవడియుండునని పండితులయభిప్రాయమ"ని జగదేక పండితుఁడగు పరమశివుఁడు చెప్పియున్నాఁడు. ఇందువలనఁగూడ జన్మాంతరములుకలవని సిద్ధాంతమగుచున్నది.

పైప్రమాణములవలన జన్మాంతరములు కలవనువిషయము వేదశాస్త్రసిద్ధమని సిద్ధాంతమగుచున్నది. ఇఁక జన్మాంతరములు లేవనువిషయమును యుక్తివాదముచే నవనాగరకులు సిద్ధాంతము చేసినరీతిగనే, జన్మాంతరములు కలవనువిషయమునుగూడ యుక్తివాదముచేతనే సిద్ధాంతము చేయుట కవకాశముగలదనుటకుఁ దగినయుక్తులను మనము ప్రదర్శించి, యందుమూలమున, నలౌకికవిషయముల(ననఁగా నతీంద్రియవిషయములను) సిద్ధాంతము చేయుసందర్భమున యుక్తివాదములు నిస్సారములనియుం, నిష్ప్రయోజనములనియుం వెల్లడింతము.

### ఇతరజన్మము కలదనుటకు యుక్తివాదము.

యుక్తిచే నాలోచించినను జన్మాంతరము (అనఁగా నితరజన్మము) కలదనియే చెప్పవచ్చును. ఎట్లనఁగా; లోకమునఁ గొందఱు శ్రీమంతులకడుపునఁబుట్టి పుట్టుక మొదలు శ్రీమంతులై, యమైశ్వర్యము లనుభవించుచున్నారు. మఱికొందఱు నిరుపేదల కడుపునఁ బుట్టుటచేఁ బుట్టినదాదిగ నష్టకష్టములను బడుచున్నారు. అట్లే కొందఱు పుట్టుకలోనే గ్రుడ్డివారుగనో, కుంటివారుగనో, చెవిటివారుగనో, మూగవారుగనో పుట్టుచున్నారు. మఱికొంద ఱెట్టిలోపమునులేకయే చక్కనిరూపముతోఁ బుట్టుచున్నారు. అట్లుపుట్టిన చక్కనివారిలోఁ గొందఱేరోగముచేతనో పీడింపఁబడి కొద్దికాలములోనే చనిపోవుచున్నారు. కాని, కుంటిగనో గ్రుడ్డిగనో పుట్టినవారు దీర్ఘాయుష్మంతులై బ్రతుకుచున్నారు. మఱికొంద ఱెట్లుపుట్టినను బుట్టినతోడనే చనిపోవుచుగూడనున్నారు.

### ఈజన్మమునఁ బుట్టుకలో నేకలుగు సుఖదుఃఖములకుఁ గారణమేమి?

ఇట్లు పుట్టుకలోనే కొందఱు ధనవంతులగుటకును, మఱికొందఱు పేదవారగుటకును, గొందఱు చక్కనివారగుటకును, మఱికొందఱు కురూపులగుటకును, గొందఱు

బలవంతులగుటకును, మఱికొందఱు దుర్బలులగుటకును, గారణము లేదని చెప్పవలయునా? వారు చేసికొనినకర్మయే కారణమని చెప్పనక్కరలేదా? చెప్పవలయును; ఏలననఁగా లోకమునఁ గారణము లేకయే యేకార్యమును జరుగదనువిషయము లోకానుభవసిద్ధము గదా! న్యాయమార్గమునఁ బ్రవర్తించు ప్రభువులే, యేనేరముఁ జేయకయే యెవ్వనిని శిక్షించి కష్టపెట్టరు. అట్టిచో నెల్లమతములవారి సిద్ధాంతముల ప్రకారమును బరమ దయాళుఁడును సర్వసమర్థుఁడును నగు నీశ్వరుఁడు తనప్రభుత్వమున నే నేరముఁ జేయని నిర్దోషులను నిష్కారణముగ దుఃఖములును గష్టములును గలిగించుననుట యుక్తి యుక్తము కాఁజాలునా? కాఁజాలదు. కావున వారువారు చేసికొనిన సుకృతదుష్కృత ముల ననుసరించియే (యనఁగా మంచికర్మలను జెడ్డకర్మలనుబట్టియే) వారివారికి సుఖ ములను దుఃఖములను నీశ్వరుఁడు కలిగించునని చెప్పవలయును. అనఁగాఁ బైజనులకుఁ గల్గు సుఖదుఃఖములకు వారు చేసికొనినకర్మవిశేషమే కారణమని చెప్పవలయును.

### ఈజన్మములోని సుఖదుఃఖములు జరుగఁబోవు కర్మఫలములా? జరిగిన కర్మఫలములా?

ఐనచో, జనులకుఁ బుట్టుకతోడనే గల్గుచున్న సుఖదుఃఖములకుఁ గారణములగు కర్మలను వారెప్పుడు చేసిరి? తాముపుట్టినపిమ్మటఁ జేసిరా, కాక, యంతకుముందే చేసిరా? పుట్టినపిమ్మటనే చేసిరనుకొందమా, యదిసరికాదు. ఏమనఁగా, వారు పెరిగి పెద్దవారై యేకర్మనుగాని చేయఁగలయీడు రాకముందే పుట్టుకలోనే వారికాయాఫలములుగల్గు చుండుటను మనమందఱమును బ్రత్యక్షముగఁ జూచుచునే యున్నాముగదా! వారే కర్మను జేయలేని యీడునందే, ముందుచేయఁబోవు కర్మలయొక్కఫలములను దేవుఁడు వారికిఁగలుగఁజేయునా? అట్లు చేయుట దేవునకున్యాయమా? ఎచటనైనను బ్రభువు లెవని నైనను వాఁడుచేసినతప్పులకు వానిని దండింతురుగాని, చేయఁబోవుతప్పునకు ముందుగ దండింతురా? కావునఁ బైజనులుం పుట్టుకలోనే యనుభవించుచున్న సుఖదుఃఖములకుఁ గారణములగు కర్మలను వారుపుట్టకముందే చేసియుండిరని నిశ్చయమగుచున్నది. అట్లు చేయుట కంతకుముందే వారికొకశరీర ముండితీరవలయును. అదియే జన్మాంతరము. కావున యుక్తిచేఁగూడ జన్మాంతరముకలదనుట సిద్ధించుచున్నది.

ఇచ్చటఁ గొందఱికొక సంశయము గలుగవచ్చును. ఏమనఁగా, "ముందుచేయఁ బోయెడి తప్పునకుఁగూడ మనుష్యులను బ్రభువులుదండించుట లోకమునఁగలదు; ఎట్ల నఁగా: నొకఁడు మఱియొకనిని జంపుటకు యత్నించినట్లుగాని, కాక, యేదైనను రాజ ద్రోహము చేయుటకు యత్నించుచున్నట్లుగాని తెలియవచ్చినయెడల, దొరతనమువారు

వానిని ముందుగ నేపట్టికొని చెఱసాలలోఁ బెట్టుచుండుటలేదా? అట్లే, దేవుఁడు సర్వజ్ఞుఁడగుటచే మనుష్యులు ముందు చేయఁబోయెడి పాపకర్మలను మొదటనే తాను దెలిసికొని ముందుగ వారినిశిక్షించుటకై యావిధమగు ఫలములను బుట్టుకలోనే కలిగించుచున్నాఁడుగాని, యవి పూర్వజన్మలోఁ జేసిన కర్మఫలములు గావనియు, నందుచే, నితరజన్మములు లేవనియుఁ గొందఱభిప్రాయపడవచ్చును. కాని, తిన్నఁగా నాలోచింపఁగా, నైవిధమగు నేరములను జేయఁబోవువారిని ప్రభువులు ముందుగ నేదండించుటకుఁ గారణములేక పోలేదు. కాని, యది యెప్పుడో చేయఁబోవు నేరముకొఱకే ముందుగదండించుట యనుకొనుట పొరపాటు. ఏమనఁగా: వారినిదండించుట వారు చేయఁబోవు నేరముకొఱకు గాదు; వారు చేసియున్న నేరముకొఱకే! ఆనేరమేమందురా? చేయఁగూడనిపనిని మనస్సులోసంకల్పించి యందులకుఁ బ్రయత్నించుటయే. ఒకనినిజంపుటమాత్రమే నేరము కాదు; అట్లుచంపుటకు యత్నము చేయుటకూడ నేరమేయగును. కావుననే యట్టి యత్నము చేసినవారిని ప్రభువులు శిక్షించుచున్నారు. ఒక చేయరానిపనిని జేసిన నేరము వేఱు; అందులకుఁ బ్రయత్నముచేసిన నేరము వేఱు. అందుచేతనే హత్య చేసినవారికిఁ గల్గుశిక్ష వేఱు ; హత్య చేయుటకుఁ బ్రయత్నము మాత్రమే చేసినవారికిఁ గల్గుశిక్ష వేఱు. వారు ప్రయత్నించిన నేరమునకే దొరతనమువారు వారిని శిక్షించుచున్నారుగాని, ముందు చేయఁబోవు నేరమునకుగాదు.

ఇట్లు శిక్షించుట చేయఁబోవు నేరమునకే యైనయెడల నట్టినేరమును జేసినవారి కెట్టిశిక్ష విధించెదరో యట్టిశిక్షనే నేరముఁ జేయఁబోవువారికిగూడ విధించుచుండ వలయునుగదా! అనఁగా హత్య జేసిన వానినిబట్టి వధపాలు చేసినట్లే హత్య చేయుటకు యత్నించినవానినిగూడ పట్టివధించి తీరవలయును. కాని, యట్లుజరుగుటలేనందునఁ జేయఁబోవు నేరమునకై దొరతనమువారు జనులను శిక్షించుచుండిరని తలంపరాదు. అందుచేఁ జేసిన నేరములకే శిక్షించుచుండిరని తలంపవలయును. అందుచేఁ జేయఁబోవు కార్యములకే దేవుఁడు ముందుగ ఫలమిచ్చుచున్నాఁడని తలంచుట యుక్తము గాదు.

ఈసందర్భమున నొక చిన్నచిత్రమగుకథ జ్ఞప్తికివచ్చుచున్నది. ఏమనఁగా: నొకయూరిలో నొక బడియుండెనఁట. ఆబడిలోని బాలురలోఁ గొందఱొకసారి యల్లరిచేయఁగా, బడిపంతులు (ఉపాధ్యాయుఁడు) లేచివచ్చి యల్లరిచేసినబాలురను బెత్తముతోఁ బాది, యంతటితోఁబోక, యల్లరిచేయని తక్కినబాలురనుగూడ వరుసబెట్టి బారునకొట్టుకొనుచుఁ బోయెనఁట. అంతట నాబాలురు, "అయ్యో! మేమల్లరిచేయలేదండీ! మమ్ములనుగూడ నేలకొట్టెద?" రని యడుగఁగా, నాయుపాధ్యాయుఁడు వారిని జూచి, "విధవలారా! మీరిప్పుడల్లరిచేయక పోయిననేమి? యింకఁ గొంతసేపటికైనను

జేయకుందురా? అపుడు మిమ్ములనుగొట్టుటకు నేనుమరల నింకొకసారి లేచిరావలదా? అందుచే నిపుడే పనిలోఁబని తీరిపోవునని కొట్టుచున్నా"నని సమాధానముచెప్పెనఁట! ఆరీతిగనే, ముందెప్పుడో జనులు చేయఁబోవుతప్పులకు ఫలములను వారిపుట్టుకలోనే దేవుఁడు కలిగించినయెడల, నపుడు దేవుఁడుగూడ పైయుపాధ్యాయునంతటి న్యాయమూర్తియే కావలసివచ్చును! అందుచే నాఫలములు పుట్టినపిమ్మటఁ జేసినకర్మయొక్క ఫలములనియనుట యుక్తియుక్తము గాఁజాలదు. కావున బుట్టకముందు చేసిన కర్మయొక్క ఫలములేయని యంగీకరింపకతప్పదు. పుట్టకముందు కర్మచేయవలయునన్నిన నొక శరీరముండవలయును. అట్టిశరీరమును గల్గియుండుటయే జన్మమనఁబడును. కాఁబట్టి దీనినిబట్టిగూడ నితరజన్మములున్నవనియు, వానియందుఁ జేసిన కర్మలయొక్క ఫలములే యీజన్మములో ననుభవమునకు వచ్చుచుండుననియు, నట్లే యీజన్మలోనికర్మల యొక్కఫలము రాఁబోవుజన్మలలో ననుభవమునకు వచ్చుటగూడ సిద్ధమనియు సిద్ధాంతమగుచున్నది. అట్లుచేయుకర్మలే ధర్మములు, నధర్మములునని రెండుతెరగులైయున్నవి.

### బిడ్డలసుఖదుఃఖములకు వారితల్లిదండ్రులు కారణమగుదురా? కారా?

ఇచట మఱియొకసంశయము గలుగవచ్చును; ఏమనఁగా: "జనులకుఁ బుట్టుకలోఁగలిగెడి సుఖదుఃఖరూపములగు ఫలములకుఁ గారణము వారివారి తల్లిదండ్రులయొక్క ప్రవర్తనయేగాని, యితరజన్మలందలి కర్మఫలముగాదు; అందుచే నట్టిఫలములకుఁ గారణము లితరజన్మలలో వారువారు చేసికొనినకర్మలేయనిగాని, యందువలన నితరజన్మలున్నవనిగాని తలంపవలసిన యగత్యములేదు; కాఁబట్టి జన్మాంతరములకును, వానియందలి సుఖదుఃఖములకును హేతువులు ధర్మాధర్మములని చెప్పవలసిన యవసరమునులేదు; కావున ధర్మాధర్మము లతీంద్రియవిషయములనికాని, యలౌకిక విషయములనికాని, వానిని దేవుఁడిచ్చినవేదమునుండియే తెలిసికొనవలయుననికాని, యనవలసిన పనియేలే"దని కొందఱనుకొనవచ్చును. ఇదెంతసత్యమో విచారించిచూతము. తల్లిదండ్రులప్రవర్తనమే వారిబిడ్డలపుట్టుకలోఁగల్గు సుఖదుఃఖములకుఁ గారణమనిననర్థమేమి? తల్లిదండ్రులు క్రమమైనమార్గమున నడచినయెడల మంచిబిడ్డలు పుట్టుదురనియు, నడువకపోయినఁ జెడుబిడ్డలు పుట్టుదురనియేగదా యర్థము. అదిసత్యమే. అనఁగా నొకనితల్లిదండ్రులు క్రమమైనమార్గమున నడువలేదనుకొనుఁడు. అందుచే వారికిఁ గుంటిబిడ్డయో, గ్రుడ్డిబిడ్డయో, చెవిటిబిడ్డయో పుట్టునుగదా! అట్టిబిడ్డను గనినందులకు వారుదుఃఖించెదరు. క్రమమైనమార్గమున నడువనందులకుశిక్షగా దేవుఁడు వారికట్టిదుఃఖము గలిగి

చెను. అదిన్యాయమేయగును. తప్పుచేసినవారికి శిక్షజరుగుట న్యాయమేగదా! పిమ్మటఁబెద్దవాఁడై యాబిడ్డకూడ తనకుఁగన్నులులేవనియో, కాళ్లులేవనియో, చేతులు లేవనియో, చెవులులేవనియో, నోరులేదనియో, తనతల్లిదండ్రులతోఁబాటు దుఃఖించునా? లేదా? కన్నులులేకపోవుట మొదలగునవి యెవరికి దుఃఖమును గలిగింపవు? కాఁబట్టి యాబిడ్డకూడ దుఃఖింపకమానఁడు. దేవుఁడాదుఃఖమును వానికేలగలిగించెను? వాఁడేమియైనఁ దప్పుచేయుటచేఁ గలిగించెనా, కాక, నిష్కారణముగనే కలిగించెనా? నిష్కారణముగఁ గలిగించెననుట యుక్తియుక్తముగాదు. అట్లుచెప్పినచో దేవుఁడు దయలేనివాఁడును క్రూరుఁడునని చెప్పవలసివచ్చును. కాని, యట్లుచెప్పుటకు లోకమున నేమతస్థులునుగూడ సమ్మతింపరు. దేవుఁడు దయార్ద్రహృదయుఁడును సర్వసముఁడు ననియే యందఱును నమ్ముచున్నారు. కావున నిష్కారణముగ నొకనికి దుఃఖమునుగలిగించినాఁడని చెప్పఁదగదు. అందుచేఁ దప్పుచేయుటచేతనే దుఃఖమును గలిగించినాఁడని చెప్పితీరవలయును. ఐనచో నాబిడ్డ యాతప్పునెప్పుడు చేసెను? పుట్టినపిదపఁ జేసెనా? కాక, పుట్టకముందు చేసెనా? పుట్టినపిదపఁ జేసెననుట యుక్తముగాదు. ఏలనన, నీవిషయము నింతకుముందే, "యీజన్మలోని సుఖదుఃఖములు జరుగఁబోవుకర్మఫలములా? జరిగినకర్మఫలములా?" యను శీర్షికక్రిందఁజర్చించి, జరిగినకర్మ ఫలములేయగునుగాని జరుగఁబోవు కర్మఫలములు కాఁజాలవని నిశ్చయించియుంటిమిగదా! కాఁబట్టి యాబిడ్డ పుట్టకపూర్వమే కొన్నితప్పులుచేసెనని తేలినది. అందుచే నట్టితప్పులుచేయుటకు సాధనమైన శరీరమొకటి యాబిడ్డకంతకుముం దుండియేతీరవలయును. అనఁగా దీనినిబట్టి యాలోచించిననుగూడ నితరజన్మములు కలవనియే సిద్ధాంతమగుచున్నది.

కాని జన్మాంతరము లేదనువారిచట మరల నొకచిన్నయాక్షేపణమును జెప్పవత్తురుకాఁబోలును! ఏమనఁగాఁ, "బైబిడ్డకుఁ బుట్టుకలోనే యట్టిదుఃఖమును దేవుఁడు నిష్కారణముగఁ గలిగించెనని మేముచెప్పము; కారణముండుటచేతనే కలిగించెనని మేమంగీకరించెదము; కాని, యాకారణము తల్లిదండ్రులయొక్క యక్రమవర్తనయే యని మేము తలంచెదము; కావున నంతమాత్రముచే నాబిడ్డపుట్టకముందు వాఁడుచేసి కొనినతప్పే వానికిఁబుట్టుకలోఁ గలిగినదుఃఖమునకు గారణమని కాని, యందువలన నంతకుముందే వానికి జన్మాంతరముండి తీరవలయుననిగాని మీరుచెప్పుట కవకాశములేద"ని వారాక్షేపింపవచ్చును. అట్లైనచో దేవుఁడాబిడ్డకు దుఃఖమునుగలిగించినది వాని తలిదండ్రులుచేసిన నేరమునకేనా? తల్లిదండ్రులుచేసిన నేరమునకు దేవుఁడు వారినే శిక్షింపవలయునుగాని యాబిడ్డను శిక్షింపవలసిన పనియేమున్నది? తప్పును జేసినవారినే శిక్షింపవలయునుగాని, యొకరుచేసినతప్పునకు మఱియొకరిని శిక్షించుటన్యాయమా?

తప్పుచేయనిదే యొకరిని శిక్షించుట యెట్టియన్యాయమో, యొకరు చేసినతప్పునకు మఱి యొకరిని శిక్షించుటగూడ నట్టియన్యాయమేయగును. అట్లు తల్లిదండ్రులుచేసిన నేరమునకే బిడ్డకాదుఃఖమును దేవుఁడు తెచ్చిపెట్టినాఁడని చెప్పుచో దేవుఁడన్యాయము చేసినాఁడని చెప్పవలసివచ్చుటలేదా? అదిమరల యుక్తివిరుద్ధమేయగుటలేదా? కాఁబట్టి యట్లుచెప్పరాదు. బిడ్డచేసినతప్పునకే దేవుఁడు వానికాదుఃఖమును గలిగించెనని చెప్పుటయే యుక్తియుక్తమగును. అట్టితప్పు పుట్టుకకుముందు పూర్వజన్మలో చేసినదే కావలయునుగాని, యీజన్మమునఁ జేసినదికాని చేయఁబోవునదికాని కాఁజాలదని యింతకు ముందు ఋజువుపఱచియేయుంటిమి. కావున నిందుచేఁగూడ జన్మాంతరములుకలవని తేలుచున్నది.

## ఈజన్మలో నిష్ఫలము లీజన్మలోఁ జేసిన కర్మకుఁదగినట్లే జరుగుచున్నవా?

మఱియొక హేతువుచేఁగూడ జన్మాంతరముకలదని చెప్పవచ్చును. ఏమనఁగా నేదియైనను లాభముగలుగ వలసినప్పుడుగాని, కాక, యేదైనను గార్యము నెరవేరవలసి యున్నపుడుగాని, దానికై ప్రయత్నముచేసినచో నది నెరవేరుట లోకమున సామాన్యముగఁ జూచుచున్నాము. కాని యొక్కొకపుడు మన మెంతగొప్పగఁ గష్టపడి ప్రయత్నముచేసినను నాకార్యము నెరవేరక భంగమైపోవుచుండును. అందులకుఁ గారణమేమై యుండును? మనము సరిగాఁ బ్రయత్నింపకపోవుట కారణమని చెప్పవీలులేదు. ఏలననఁగాఁ జేయవలసినవిధముగనే ప్రయత్నముచేసినపుడుకూడ నదేవిధముగఁ గార్యము లొక్కొప్పుడు చెడిపోవుచుండుట లోకానుభవముగలవారికి వింతకాక యనుభవసిద్ధమే యైయుండును. అదేవిధముగ నొక్కొక్కప్పుడు మన మెంత గొప్పప్రయత్నము చేసినను గూడ నెరవేరనికార్యములు మఱియొకప్పుడెట్టి ప్రయత్నమునుగూడ చేయనక్కఱ లేకయే వానియంతట నవియే నెరవేరుచున్నవి. అట్లే గొప్పలాభమురాఁగోరి విశేషప్రయత్నము చేసినసమయములలో లాభమురాకపోఁగా గొప్పనష్టము వచ్చుచున్నది. ఒకప్పుడు కలలోనైనను ననుకొననిలాభములును, మఱియొకప్పుడు నష్టములును నింకొకప్పుడు సుఖములును, వేఱొకప్పుడు దుఃఖములును నాకస్మికముగఁ గలుగుచుండుట లోకములోఁ జూచుచున్నాము. ఇందులకుఁ దగినకారణములు లేకయే యిట్టివి కలుగుచున్నవా? లేదు. తగినకారణములుండుటచేతనే యివిసంభవించుచున్నవి. పూర్వజన్మలోఁ జేసికొనిన పుణ్యపాపములే (యనఁగా ధర్మాధర్మములే) యిట్టిసుఖదుఃఖములకుఁ గారణములై

యున్నవి. ఇట్లని భీష్మాచార్యుఁడు ధర్మరాజునకుఁ జెప్పిన మహాభారతములోని యొక కథను "ఇతరజన్మములు కలవనుటకు వేదశాస్త్రప్రమాణములు" ను శీర్షిక క్రింద నీప్రకరణమునందే లోగడఁ జూపియుంటిమిగదా? ఇందువలనఁగూడ నితర జన్మములు కలవనియే నిశ్చయమగుచున్నది.

## ఈజన్మలోఁజేసిన కర్మలన్నిఁటికిని నీజన్మలోనే ఫలము కలుగుచున్నదా?

వేఱొకయుక్తిచేఁగూడ నితరజన్మములు గలవనిసాధింపవచ్చును. ఏమనఁగా: లోకమున దొంగతనమును, హత్యలును మొదలగు నధర్మములను జేసినవారిని బట్టికొని వచ్చి ప్రభువులు తగినవిధముగ శిక్షించుచున్నారు. కాని, యట్టి నేరములను రహస్యముగఁ జేసినవారిలోఁ గొందఱుపట్టుపడకపోవుటను లోకమున మనముచూచుచున్నాము. కాని, యట్టి నేరములును హత్యలును జరిగియుండుట మనకుఁ బ్రత్యక్షముగఁ గానవచ్చుచుండుటచే, నానేరములను జేసిన నేరస్థులెవరో జనులకును దొరతనమువారికిని దెలియరాక వారుపట్టుపడకపోయినప్పటికిని, నట్టి నేరస్థులు లోకమున గొందఱుండియే తీరవలయుననియుఁ, నేరస్థులులేకయే నేరముజరుగ నేరదనియుఁ మనకందఱకును దెలిసినవిషయమే గదా! కొందఱు నేరస్థులు పట్టుపడినప్పుడుగూడ విచారణసమయములోఁ దగినంతసాక్ష్యములభ్యపడక పోవుటచేతగాని, తప్పుడుసాక్ష్యములు తటస్థపడుటచేతఁగాని లంచముల సహాయమునఁగాని నేరములు సరిగా ఋజువుగానందున నట్టి నేరస్థులు శిక్షనుదప్పించుకొనుచున్నారు. పైవిధముగఁ బట్టువడని నేరస్థులను, కృత్రిమోపాయములచే శిక్షనుదప్పించుకొన్న నేరస్థులను ప్రభువులుపట్టి శిక్షింపఁజాలకున్నను దేవుఁడైనను వారిని శిక్షించునా? కాక, విడిచిపుచ్చునా? ఆట్టి నేరస్థులకెట్టిశిక్షయుఁ నీలోకమునఁ జరుగకముందే వారిలోఁ గొందఱు మరణించుటనుగూడ మనము లోకమునఁ జూచుచునేయున్నాముగదా! వారు చేసిననేరములకు వారిని బ్రభువులు శిక్షింపఁజాలకున్నను దేవుఁడుగూడ శిక్షింపకుండుననుట యుక్తియుక్తముగాదు. ఎందుచేతననఁగా: నట్టి నేరస్థు లొకవేళ మనుష్యుల యొక్కయుఁ బ్రభువులయొక్కయుఁ గన్నులుగప్పఁగల్గినను, సర్వాంతర్యామియుఁ సర్వజ్ఞుఁడును నైనయీశ్వరుని మోసముచేయఁజాలరు. అందుచే వారి నీశ్వరుఁడు దండింపకమానఁడు. ఆట్టిదండనము వారికిఁ జరుగుటకు నితరశరీరములును నితరప్రదేశములును నుండియే తీరవలయును. కావున నితరజన్మములును నితరలోకములును గలవనియే యొప్పుకొనవలసివచ్చుచున్నది.

## ఈజన్మలో నిష్ఫలములకుఁ బూర్వజన్మలలో నికర్మలే కారణమైనచో, నేకర్మ కేఫలముగల్గుచున్నదో, యాసంబంధమగుజ్ఞానమును మనుష్యులకు దేవుఁ డేల యీయలేదు?

ఇతరజన్మములు కలవని చెప్పుట కొకముఖ్యమైన యాక్షేపణను జెప్పి, కీర్తిశేషులైన కం॥ వీరేశలింగముపంతులవా రితరజన్మలు లేవని సిద్ధాంతము చేసియున్నారు. ఏమనఁగా: "లోకమున జనులకుఁగల్గు కష్టసుఖములకు వారివారి పూర్వజన్మలలోఁ జేసికొనినపుణ్యపాపములే (అనఁగా ధర్మాధర్మములే) కారణమైనచో, నట్టి పూర్వజన్మసంబంధమగు జ్ఞానము ను సహజముగ జనులకు దేవుఁ డిచ్చియేయుండవలయును. కాని, యట్లిచ్చియుండ లేదు. అందుచేఁ దామెట్టి పాపము చేయుటచే నెట్టిదుఃఖము తమకుఁగలిగెనో మనుష్యు లెఱుఁగఁజాలరుగదా! అపుడు వారా పాపములను జేయుటయు మానఁజాలరు; అట్టిపాపములవలననే వారికి దుఃఖములు కలుగుచున్నవని చెప్పెడియెడల, వారుచేసినతప్పులేమో వారికిఁదెలుపకయే దేవుఁడు వారిని శిక్షించుచున్నాఁడని చెప్పవలసివచ్చును; అట్టిశిక్షచే నేమియుఁ బ్రయోజనముగలుగదు; అపుడు దేవుఁ డధర్మము చేసినవాఁడని చెప్పవలసి వచ్చును; అట్లుచెప్పుట యుక్తివిరుద్ధము; కాఁబట్టి సుఖదుఃఖములకుఁగారణములు పూర్వజన్మకర్మములని చెప్పరాదు; అందుచే నితరజన్మములు గలవని చెప్పుటకు వీలులేదు." అని పంతులుగారు సిద్ధాంతము చేసినారు. ఈసిద్ధాంతమే ప్రస్తుతకాలపు నవనాగరకుల మనస్సులందు బాగుగ నాటుకొనియున్నది. వారు దానియందుఁ బరమవిశ్వాసముగలవారగుటచే దానిప్రకారము ధర్మాధర్మములనుగాని పుణ్యపాపములనుగాని పాటింపవలసిన యవసరము కొంచెమైననులేకయే విచ్చలవిడిగాఁ దిరుగఁజొచ్చిరి. అదియే బ్రహ్మసామాజికులగు పంతులవారికిఁ బరమావధి. స్వేచ్ఛానుసారముగఁ బ్రవర్తింప నభిలాషగల నవనాగరకులకందఱకును నైసిద్ధాంత మమృతప్రాయముగ నలరారుచున్నది. ఇందలిసత్యమును గొంచెము విచారించిచూతము.

పంతులవారుతలంచినట్లు జనులు చేసిన నేరములను వారికిఁదెలుపకయే దేవుఁడు వారికి శిక్షనుగలిగించినయెడల దేవుఁ డధర్మమును జేసెనని మనమును నంగీకరించియే తీరవలయును. అది యుక్తివిరుద్ధమనుటయును సత్యమే. కాని, నిజముగ దేవుఁ డట్లుచేసెనా, లేదా? యనిమాత్రము విచారించుటలోఁ బంతులవారు పొరపడినారు. ఏమనఁగా, వేదమును, వానిననుసరించి వ్రాయఁబడినధర్మశాస్త్రములును, ధర్మసూత్రములును, పురాణములును, నితిహాసములును మొదలగుగ్రంథములన్నియుఁనుగూడ నెట్టికార్యములు ధర్మములో

యావిషయమునుమాత్రమే చెప్పుటలేదు. ఏయధర్మములను జేసినయెడల నెట్టి యెట్టి దుఃఖములుగలుగునో, యేధర్మములను జేసినయెడల నెట్టియెట్టి సౌఖ్యములుగల్గునో, యావిషయమునుగూడ సందర్భానుసారముగఁ బైగ్రంథము లచ్చటచ్చట వర్ణించియే యున్నవి. అనఁగా జనులనుసృష్టించిన పరమేశ్వరుఁడే, వారియొక్క మేలుగోరి వారికొఱ కిచ్చిన వేదశాస్త్రములమూలమున, నెట్టియెట్టి ధర్మాధర్మములను జేసినయెడల నెట్టియెట్టి సుఖదుఃఖములుగలుగునో యావిషయములనుగూడ దెలిపియేయున్నాఁడు. ఇందుల కుదాహరణములు మన ప్రాచీనమతగ్రంథములగు మహాభారతము, భాగవతము, మొద లగువానిలోఁ బెక్కుఁటియందు నరకలోకవర్ణనము మొదలగుకథలచేఁ దెల్పఁబడి యున్నవి. వానినన్నిఁటిని నిచటఁ జూపఁదలఁచిన నదియు నొకమహాగ్రంథముగఁ బెరుగవలసివచ్చును. కావున గ్రంథవిస్తరభీతిచేఁ గొన్నిప్రమాణములనుమాత్రము, "ఎట్టి యెట్టి ధర్మాధర్మములచే నెట్టియెట్టిసుఖదుఃఖములుగల్గునో యావిషయమును శాస్త్రము చెప్పెనా?" యను శీర్షికక్రింద ముందు చూపఁబోవుచున్నాము. కావుననే భగవం తుఁడు శ్రీకృష్ణావతారమునుధరించి యర్జునునకు భగవద్గీతాశాస్త్రమును బోధించునపుడు గూడ, 'నిది కార్యము' (అనఁగాఁ జేయదగినపని,) యిది 'యకార్యము,' (అనఁగా జేయఁదగనిపని,) యని గుర్తెఱుంగుటకు శాస్త్రమేయాధారమనియు, నట్టిశాస్త్రము యొక్కయాజ్ఞను మీరినడచెడివాఁ డీలోకమునను బరలోకముననుగూడ సౌఖ్యపడఁ జాలడనియు, నుత్తమగతిని బొందఁజాలఁడనియు నీక్రిందిశ్లోకములమూలమునఁ జెప్పి యుండెను:—

శ్లో. యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్. (౧౬ అధ్యా. ౨౩ శ్లో.)
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహార్హసి. (౧౬ అధ్యా. ౨౪ శ్లో.)

## శాస్త్రమనఁగా నేమి?

కాని, యిచ్చట మరల నొకసంశయము గలుగవచ్చును. ఏమనఁగాఁ జేయదగిన పనులను జేయఁదగనిపనులను దెలిసికొనుటకు శాస్త్రమాధారమనిమాత్రమే శ్రీకృష్ణుఁడు పైశ్లోకములందుఁ జెప్పెనుగాని, శాస్త్రమనఁగా నేమియో చెప్పియుండలేదుగదా! అపుడు శాస్త్రమనుపదమునకు వేదములును ధర్మశాస్త్రములునని యెట్లర్థముచేయవచ్చునని సంశయము గలుగవచ్చును. కాని, వేదశాస్త్రములెఱింగిన పండితులలోను, పామరుల లోనుగూడ ననాదిగవచ్చుచున్న లోకవ్యవహారమున, వేదములును, వానిపై నాధారపడి

యున్న ధర్మశాస్త్రములును, బురాణములును, నితిహాసములును, మొదలగు గ్రంథములే శాస్త్రములను పేర వాడఁబడుచుండుటచేఁ బైరీతిగ సంశయింపవలసిన యవసరము గాన రాదు. ఐనప్పటికిని మనపూర్వుల యాచారములందును వాడుకలందును, మననవనాగర కుల కంతగా విశ్వాసములేనందున, వారికిఁ బైసంశయము తఱచుగాఁగల్గుచుండును. కాని వేదాంతదర్శనమున, "శాస్త్రయోనిత్వాత్" అను సూత్రవ్యాఖ్యానమున:—

"ఋగ్వేదాదిశాస్త్రం యోనిః కారణం ప్రమాణ మస్యబ్రహ్మణో యథా వత్స్వరూపాధిగమే శాస్త్రాదేవప్రమాణా జ్జగతో జన్మాదికారణం, బ్రహ్మాధిగమ్యత ఇత్యభిప్రాయః." అనఁగా ఋగ్వేదము మొదలగుశ్రుతియే శాస్త్రమని చెప్పఁబడునని యు, నదియే పరమప్రమాణమనియు, శ్రీశంకరభగవత్పాదులచే రచింపఁబడిన శారీరక మీమాంసాభాష్యము చెప్పుచున్నది. ఇదివరలోఁజూపినట్లు, "స్మృతిః ప్రత్యక్షమైతిహ్య మనుమానశ్చతుష్టయమ్" అని శ్రుతి చెప్పుచుండుటచే, శ్రుతివలెనే స్మృతికూడ ప్రమాణ మగుచున్నది. మఱియు శ్రీమధ్వాచార్యులు తమబ్రహ్మసూత్రభాష్యమున నీక్రింది రీతిగఁ జెప్పియున్నారు:—

"శ్లో. ఋగ్యజుస్సామాథర్వాశ్చ భారతం పాంచరాత్రకమ్,
మూలరామాయణంచైవ శాస్త్రమిత్యభిధీయతే."

అనఁగా, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదను, నథర్వవేదము, భారతము, రామాయణము మొదలగునితిహాసములును, బాంచరాత్రకమును నివియన్నియును శాస్త్ర మనియే వ్యవహరింపఁబడునని యర్థము.

పైప్రమాణములవలన శాస్త్రమనఁగా ఋగ్వేదము మొదలగువేదములును, వాని ననుసరించి వ్రాయఁబడినస్మృతులును, సూత్రములును, బురాణములును, నితిహాసములును మొదలగు మనప్రాచీనచరిత్రగ్రంథములేయనియు, వానికే శాస్త్రమని వ్యవహారమని యుఁ దెలియవచ్చుచున్నది. అట్టిశాస్త్ర మెట్టియెట్టి ధర్మాధర్మములచే నెట్టియెట్టి సుఖ దుఃఖములుగల్గునో యావిషయమును జెప్పెనాయని యాలోచింతము.

## ఎట్టియెట్టిధర్మాధర్మములచే నెట్టియెట్టిసుఖదుఃఖములు గల్గునో యావిషయమును శాస్త్రముచెప్పెనా?

ఏయేధర్మములను నధర్మములను (అనఁగాఁ బుణ్యములను బాపకర్మలను) జేయుంట చే నేయేవిధములగు సుఖదుఃఖములుఁగల్గునో యావిషయములనుగూడ ధర్మాధర్మములతోఁ బాటు శ్రుతిస్మృతులును, మహాభారతము, భాగవతము మొదలగు పురాణేతిహాసము లను మున్నగు మనశాస్త్రగ్రంథములు సందర్భానుసారముగ నరకలోకవర్ణనము మొద

లగుకథలరూపమున వర్ణించిచెప్పియేయున్నవి. వానినన్నిఁటిని గ్రంథవిస్తరభీతిచే నిచటఁ జూపవీలుగానందున, స్థాలీపులాకన్యాయముననుసరించి యొకకొన్నిటినిమాత్ర మిచటఁ జూపుచున్నాము:—

స్కాందమహాపురాణమందలి ద్వితీయభాగమగు సూతసంహితలోని రెండవఖండ మగు జ్ఞానయోగఖండమందలి తొమ్మిదవయధ్యాయమునఁ "పాపకర్మఫల విచార" మను పేర, నిషిద్ధకర్మలను (అనఁగాఁ జేయరానియధర్మములను) జేయుటచేఁ జీవులకు వారి మరణానంతరమున నరకలోకమునందుఁగల్గెడి పెక్కువిధములగు బాధలును, నటుపై తిరిగి వారి కీలోకమునఁగల్గు పెక్కువిధములగు నీచజన్మములును, నధోగతులును వర్ణింపఁబడి యున్నవి. ఆయధ్యాయమునకు వ్యాఖ్య ప్రారంభింపఁబోవుచు శ్రీమాధవాచార్యులవారీక్రిందిరీతిగ నవతారికను వ్రాసియున్నారు:—

"స్వర్గాపవర్గసాధనే ధర్మజ్ఞానే విహితే, హానాయ నిషిద్ధకర్మాభిధాతుం ప్రతిజానీతే—"అథాత"ఇతి. యతో విహిత కారిణామపి నిషిద్ధాపరిత్యాగేన నరకః,అతో విహితాభిధానానంతరం హానాయ నిషిద్ధ ముచ్యత ఇత్యర్థః. బహుతర నరకోపభోగానంతరం శేషేణ ఖరోష్ట్రాది జన్మప్రాప్తిం వక్ష్యతి........."

దీనితాత్పర్యమేమనఁగా: "స్వర్గమునకును మోక్షమునకును సాధనములగుటచేఁ దప్పక చేయదగినవగు ధర్మములనుగుఱించి (యీశ్వరుఁడు బృహస్పతికి లోగడయధ్యాయములలో) వినిపించి, యటుపైఁ, జేయకమానవలసిన నిషిద్ధకర్మలను (అధర్మములను) దెలుపుటకై వానిని జెప్పనెంచి "అథాతస్సంప్రవక్ష్యామి పాపకర్మ ఫలంమునే" యనుశ్లోకముతోఁ బ్రారంభించుచున్నాఁడు. చేయవలసినకార్యములను జేసినవారికిఁగూడఁ జేయరానిపనులను మానకపోవుటచే నరకము సంభవించునుగావునఁ, జేయవలసినపనులను వినిపించినపిమ్మటఁ, జేయరానిపనులను దెలిసికొని మానుటకొఱకై వానిని జెప్పుచున్నాఁడని యర్థము. పెక్కునరకబాధ లనుభవించినతరువాత, మిగిలినపాపఫలముచే గాడిదలు, నొంటెలు మొదలగుజన్మలుగలుగునని చెప్పుచున్నాఁడు......"

౨. పైవిధముగనే, శ్రీమద్భాగవతపురాణమందలి పంచమస్కంధము చివర, నెట్టియెట్టి పాపములను (అధర్మములను) జేసినజీవులు వారు చనిపోయినపిదప నెట్టియెట్టి నరకబాధ లనుభవించునదియు, "నరకలోకవర్ణన" మను పేర శ్రీశుకయోగి పరీక్షిన్మహారాజునకు వర్ణించిచెప్పియున్నకథవలనఁ దెలియవచ్చుచున్నది. [చూడుఁడు:—శ్రీమదాంధ్రభాగవతములోఁ బంచమస్కంధమున, ద్వితీయాశ్వాసమున, 135 మొదలు 163 పద్యమువఱకు]

౩. మఱియును బూర్వజన్మములందు జీవులుచేసికొను ధర్మములందును నధర్మములందును నెట్టియెట్టి తారతమ్యములుండుటచే వానిఫలితముగ వారికీజన్మమునగల్గుచుండు సుఖములందును దుఃఖములందునుగూడ నెట్టియెట్టితారతమ్యములు గల్గుచున్నవో, యా వివరములన్నియు "శివుఁడు పార్వతికి వర్ణకర్మపరిపాకంబుల తెఱంగెఱింగించుట" యను శీర్షికక్రింద, శ్రీమదాంధ్రమహాభారతమునందలి యానుశాసనికపర్వములోఁ బంచమాశ్వాసమునం "దుమామహేశ్వర సంవాదము"ను నితిహాసములో వర్ణింపఁబడియున్నవి. ఈ గ్రంథమున నీప్రకరణముననే యింతకుముందు "ఇతరజన్మముకలదనుటకు వేదశాస్త్ర ప్రమాణములు" అను శీర్షిక క్రిందఁజూపిన మహాభారతములోనికథలో ధర్మరాజు భీష్ముని బ్రశ్నించిన ప్రశ్నలకు భీష్ముఁడుచెప్పినసమాధానములు సంక్షేపముగనున్నవిగాని, పై "యుమామహేశ్వరసంవాదము"నం దట్లుగాక యావిధములగు ప్రశ్నలకన్నిఁటికిని మిక్కిలి విపులముగను, వివరముగను సమాధానములు చెప్పఁబడియున్నవి. [శ్రీమదాంధ్ర మహాభారతమునందలి యానుశాసనికపర్వమునఁ బంచమాశ్వాసములో ౭౦-వ పద్యము మొదలు ౧౨౧-వ పద్యమువఱకును జూడుఁడు.]

౪. అంతియగాక, మనవేదశాస్త్రములలో నుపవేదమనఁబరగుచున్న యాయుర్వేదశాస్త్రమునను, దానిననుసరించివ్రాయఁబడిన వైద్యగ్రంథములందునుగూడ, కొన్నికొన్నివిధము లగురోగములు ప్రాణులకుఁగల్గుటకు హేతు వాయాజీవులు వారివారిపూర్వజన్మములందుఁజేసికొనినపాపములయొక్క (యనఁగా నధర్మములయొక్క) ఫలములే యని చెప్పఁబడుటయేగాక, యేయేవిధములగు పాపములను (నధర్మములను) జేయుటచే నేయేవిధములగు రోగములుసంభవించి జనులనుబీడించునో యావివరములుగూడ స్పష్టముగఁ జెప్పఁబడియున్నవి. ఇందులకుదాహరణముగ, నాధునికాయుర్వేదవైద్యులలో నొకరైన "యాయుర్వేదమార్తాండ, భిషగాచార్య" బిరుదాంచితులగు పండిత హెచ్. సుబ్బరాయశాస్త్రిగారనువారు, 1931 సం॥ ఆగస్టు 15, 16, తేదీలలో రాజమహేంద్రవరములో జరిగిన 11-వ ఆంధ్రాయుర్వేదమహాసభలోఁ జదివిన "మానవాతీతశక్తు"లను నుపన్యాసమునుండి కొన్నియంశముల నీక్రిందనెత్తిచూపుచున్నారము. [ఈయుపన్యాసము త్రిలింగపత్రిక 1931 సం॥ అక్టోబరునెల 12-వ తేదికి సరియైన ప్రజోత్పత్తి సం॥ ఆశ్వయుజ శు ౧ సోమవారము (అనఁగా ౧౨-వ సంపుటమున ౪౧-వ సంఖ్యగల) సంచికలోఁ బ్రకటింపఁబడియున్నది.]

"....................................................................

## మానవాతీతశక్తులతో రోగములు గుణపడునా?

ఆయుర్వేదమతమున,

'శ్లో. జన్మాంతరకృతంపాపం వ్యాధిరూపేణ*పీడ్యతే
తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమసురార్చనైః.'

(అనఁగా) రోగములు జన్మాంతరకర్మవలనఁ గలుగుచుండుననియు, వాటి నివారణార్థము ఔషధసేవ, జపహోమబ్రాహ్మణపూజాదులు సలుపవలెననియుఁ జెప్పఁబడినది.

ఆంధ్ర కర్ణాటక దేశములలో విశేషవ్యాప్తినొందిన ఇంద్రకంఠవల్లభాచార్య ప్రణీతమైన వైద్యచింతామణిలో ప్రతిరోగముయొక్కనిదానము ఫలానిఫలాని పాపకృత్యములు చేసినందుచే కలుగుననియు, తచ్ఛాంతికై ఔషధసేవయేగాక, యేయే దేవతలనారాధించి యేయేశాంతులు చేయవలసినవిధానమును జేర్కొనంబడినది. ఇదిగో చూడుఁడు.

'శ్లో. దేవస్వహరణాచ్చైవ జాయ తేవివిధోజ్వరః,
జ్వరోమహాజ్వరశ్చైవ రౌద్రో వైష్ణవఏవచ.'

దీనికై,

'శ్లో. జ్వరే రుద్రజపం కుర్యాన్మహారుద్రం మహాజ్వరే,
మహారుద్రం జపేద్రౌద్రే వైష్ణవేతద్ద్వయంజపేత్.'

ఇంకను క్షయరోగ మెట్లుకలుగుననగా:—

'శ్లో. బ్రహ్మహాక్షయరోగీస్యా త్క్షయీస్యాత్క్షేత్రమారణే.'

బ్రహ్మహత్యచేసినవానికిని, బ్రాహ్మణక్షేత్రము హరించినవానికి, హత్యచేసినవానికి క్షయరోగము జనించును. కనుక ఏమిచేయవలెననఁగా,

'శ్లో. బ్రహ్మచర్యేణ దానేన తపసా దేవతార్చనైః,
సత్యే నాచారయోగేన రవిమండలసేవయా,
వైద్యవిప్రార్చనేనాపి రోగరాజో నివర్తతే.'

బ్రహ్మచర్యము, దానము, తపస్సు, దేవతాపూజ, సత్యము, ఆచారయోగము, సూర్యనమస్కారములు, ఔషధపూజ, బ్రాహ్మణపూజ, యిట్టిక్రియలుచేసిన క్షయరోగము నివర్తించును. వైద్యచింతామణి ఋషిప్రణీతమైన గ్రంథముకాకపోయినను అతఁ డేయాధారమునుండివ్రాసెను? నేఁటికి మనఆంధ్రసోదరవైద్యుల కది ప్రామాణ్యగ్రంథముకాదా?........."

*పీడ్యతే అనికాదు; 'బాధతే' అనియుండవలయునని తోఁచెడిని.

ఇచట నొకసంశయముగలుగవచ్చును. ఏమనఁగా, "జై వైద్యచింతామణి ఋషి ప్రోక్తము కాదుగదా, యిఁకమనవంటి సామాన్యమనుష్యుఁడే దానినివ్రాసినపుడు, దానిలో రోగములు పూర్వజన్మలోఁజేసిన పాపఫలముచేగల్గునని వ్రాయఁబడినంతమాత్రముచే నావిషయమును మన మేల నమ్మవలయు?"నని సంశయముగలుగవచ్చును. కాని, యిప్పటి కొందఱు నవనాగరికవైద్యులవలెను, నవనాగరకకవులవలెను, నవనాగరకవిద్వాంసుల వలెనుగాక, తొల్లింటివైద్యులును, గవులును, విద్వాంసులును, శాస్త్రకారులునుగూడ వేదశాస్త్రమతాచారప్రమాణబద్ధులును, నా వేదశాస్త్రమతాచారములందు బరమవిశ్వాసముగలవారును నగుటచే, వేదశాస్త్రములయొక్క యాధారములేకయే యెట్టివిషయమునుగాని నిరాధారముగ సిద్ధాంతము చేసి స్వతంత్రించి వ్రాసియుండరు. అందును నతీంద్రియవిషయమగు జన్మాంతరమునకుసంబంధించిన పాపఫలానుభవరూపములగు రోగములనుగూర్చి తమయిచ్ఛవచ్చినట్లు నిరాధారముగనూహించి వ్రాయుదురా? వ్రాయరు! అంతియగాక యెట్టియెట్టి పాపఫలముచే నెట్టియెట్టిరోగభేదము లేర్పడునో యావిషయములుగూడ ఋషిప్రణీతములగు మనమతశాస్త్రగ్రంథములలోఁ గొన్నిటియందుఁ జెప్పఁబడియేయున్నవి. అట్టివాని నాధారము చేసికొనియే పై వైద్యచింతామణిప్రణేత తనగ్రంథమున జైవిషయములను వర్ణించియున్నాఁడు. ఇందులకుదాహరణముగ ద్వైపాయనమహర్షిప్రణీతమగు మహాభారతమునందలి యానుశాసనికపర్వమునఁ బంచమాశ్వాసములోనిదని పైనఁదెలుపఁబడిన "యుమామహేశ్వరసంవాద"మను నితిహాసమున "శివుఁడు పార్వతికి వర్ణకర్మపరిపాకంబుల తెఱంగెఱింగించుట" యనుశీర్షికక్రింది కథలోని యీదిగువపద్యములు చూడనగును:—

"....................................

సీ. కాంత! జాత్యంధుండు గన్నులు సెడువాఁడు తనయొప్పు మెఱయుచుఁ దగిలియొరుని
వనితఁ దొల్మేనఁజూచినవాఁడు; కర్ణరోగార్తుండు గటుకవాక్యములఁ దొల్లి
శిష్టునొప్పించిన కష్టుండు; గడుపునఁ దెవులైనతఁడు పూర్వభవమునందు
గరదుండు; గోళమశ్మరిని శర్కరనుబాధితుఁడగు నరుడన్యసతిని గన్య

ఆ. మహిషి, గోవుఁ, దురగి మదనాతురతమున్న గవిసినాఁడు; శోషి దివిరియొరుపు
లనుభవింపఁ దెచ్చుకొనినమాంసము దొంగిపుట్టువున హరించినట్టినీచు. 99

ఆ. ఉలుముగొన్నవాఁడు దొలుమేన, నాఘాతబంధనముల నొరుల ప్రన్నఁదనము
సెఱచినాఁడు; పంగువౌఱవగఁ, గాలు సేవిఱిచి సాధుజనులఁ బఱిచినాఁడు. 100

క. పిలకాదులగంతులచే, నలమటఁబడువారు బడియనడిచియుమాష్టిం
జలమునఁబొడిచియు సాధులఁ, దొలుబాముననొంచినట్టి దుష్టచరిత్రుల్. 101

ఆ. పాదరోగు లశుచిపదముల దేవాలయముల మెట్టుటయును నసదువారిఁ
దప్పులేకక్రొవ్వి తన్నుటయును దొలుపుట్టునందుఁ గలిగినట్టివారు. 102

చ. జ్వరమున గుల్మపీడ నతిసారమునన్ బలుపుండులన్ మహో
దరమున వాతపిత్త కఫదారుణరోగములన్ నిరంతరా
తురులగువారు నిర్దయతఁ దొల్లివినోదముగాఁగ జీవులం
దరమిడిచంపినారు గురుఁదల్లడపెట్టినవారుఁ బార్వతీ! 103

తే. గూనివాఁడును బిచ్చుకకుంటు గుజ్జుఁ, గొలుచులమ్ముచోఁ గ్రచ్చులుగలిపి సరకు
దూఁచిపెట్టెడుచోటులఁ దూనిక్కదరపి, పూర్వభవమున లాభంబుఁబొందినారు. 104

సీ. వెట్టులు దొలుమేన వెడ్డున సాధుజనము మోసపుచ్చి ధనంబు గొన్న
జను; లనపత్యులు విను తొల్లి పితృకార్యదూరులు, బాలఘాతులును జూవె;
బాలఁతి! నపుంసకుల్ పూర్వభవంబున నెద్దుఁబట్టినవారు నేమితప్పఁ
బొరయకుండఁగఁ గోపమునఁ ద్రికచ్ఛేదంబుగావించినారును గామసుఖము

తే. విఘ్నపఱిచినతులువలు; విధవ దొంటి, జన్మమునయందు భర్తృవంచనమొనర్చి
ధనముగూర్చినయదియు మదంబుపేర్మి, నోర్తుమగని హరించిన యుగ్మలియును. 105

..........................................."

[శ్రీమదాంధ్రమహాభారతము, అనుశాసనికపర్వము, అశ్వా. ౫.]

మనుష్యుఁడు చేయఁదగినపనులను, జేయరానిపనులను, బరమేశ్వరుఁ డిట్లిన్నివిధముల వేదశాస్త్రములమూలమునఁ దెలిపియుండఁగా, నట్టిసంబంధమగుజ్ఞానమును దేవుడు జనులకిచ్చియుండలేదనిచెప్పుట యుక్తముగాదు. కావున జనులు వారిపూర్వజన్మలలోఁ జేసికొనిన ధర్మాధర్మములననుసరించియే దేవుఁడు వారికి సుఖదుఃఖముల నీజన్మలోఁగల్గించుట, వారుచేసినతప్పులను వారికిఁదెలుపకయే దండించుటవంటిది కాఁజాలదు. కావున నంతమాత్రముచే 'జన్మాంతరము కలద'ను సిద్ధాంతమునకు భంగమురాఁజాలదు.

కాని, యిచట మరలనొకసంశయముగలుగవచ్చును; ఏమనఁగా: "వేదశాస్త్రములు చదివి తెలిసికొననివారికిని, వానినిజదివి తెలిసికొనఁజాలనివారికిని, నట్లుచదివి తెలిసికొనఁ దగినప్రాయమురానివారికినిగూడ లోకమున సుఖదుఃఖములు గల్గుచునేయున్నవి గదా! అపుడు వారేమిధర్మాధర్మములను బూర్వజన్మమునఁజేయుటచే వారికట్టి సుఖదుఃఖములుగల్గుచున్నవో, యావిషయము వారికిఁదెలియఁజాలదుగదా! అందుచే వేదశాస్త్రములమూలముననే దేవుఁడు జనులకు ధర్మాధర్మజ్ఞాన మిచ్చినాఁడనిచెప్పెడిచోఁ బైవారివిషయమున వారితప్పులను వారికిఁదెల్పకయే దేవుఁడు వారిని శిక్షించినవాఁడగుటలేదా? అందుమూలమున వారట్టితప్పులనుండివిరమించుట కవకాశముగల్గదుగదా. కావున దేవుఁ

డారీతిగ వేదశాస్త్రములమూలమున ధర్మాధర్మజ్ఞాన మొసంగుట నిష్ప్రయోజనము కాదా?" యని సంశయింపవచ్చును. సమాధానమేమనగా: లోకమున నిపుడు జను లనుభవించు సుఖదుఃఖములు వారు పూర్వజన్మములలోఁ జేసికొనిన ధర్మాధర్మములయొక్క ఫలములు. ఇఁక వేదశాస్త్రములందలి ధర్మాధర్మజ్ఞానముచేఁ గలుగవలసిన ప్రయోజనము ముందు ముందుచేయఁబోవు కర్మములకును రాఁబోవుసుఖదుఃఖములకును సంబంధించినది. అట్టి జ్ఞానముండుటచే జనులు, తాముముందుఁ జేయబోవు కర్మలలోనిధర్మములను గుర్తెఱిఁగి యాచరించి వానిఫలముగఁ గలుగఁబోవుసుఖముల ననుభవింతురు; అధర్మములను గుర్తెఱిఁగి వానినాచరించుటమాని, యందుచే దుఃఖమునుండి తొలఁగుదురు. ఆట్టిధర్మాధర్మజ్ఞానములేనిచో, ధర్మాధర్మములను గుర్తింపఁజాలక, ధర్మములతోఁబాటు కొన్నియధర్మములనుగూడ యాచరించియో, కాక, యన్నియు నధర్మములనేయాచరించియో రాఁబోవుజన్మములందు దుఃఖభాజనులగుదురు. కావున నట్టివేదశాస్త్రజ్ఞానముండుటగాని, లేకపోవుటగాని, భావి (అనఁగా, రాఁబోవు) కర్మలకును జన్మలకును సుఖదుఃఖములకును మాత్రమే హేతువు కాఁజాలునుగాని, జరిగిపోయిన జన్మమందలి ధర్మాధర్మములఫలితముగ నీజన్మమునననుభవింపవలసిన సుఖదుఃఖములవిషయమున నెంతమాత్రమును దోడ్పడజాలదు. అనఁగా నట్టివేదశాస్త్రజనితమగు ధర్మాధర్మజ్ఞానముకలవాఁడైనను లేనివాఁడైనను గూడ మనుష్యుఁడు తనపూర్వజన్మములలోఁ జేసికొనిన సుకృతదుష్కృతములయొక్క (అనఁగా ధర్మాధర్మములయొక్క) ఫలములగు సుఖదుఃఖముల నీజన్మమునఁ దప్పకయనుభవించియే తీరవలయును. కావున నట్టిపూర్వజన్మలలోనిసుకృతదుష్కృతఫల మనుభవించుటలో నీజన్మమునఁ బ్రయోజనకారి కాఁజాలకున్నను, ధర్మాధర్మసంబంధమగు వేదశాస్త్రజ్ఞానము భావిజన్మలవిషయమునఁ బూర్ణముగఁ బ్రయోజనకారియేయగుటచే, దానివలని ప్రయోజన మట్టిదేయని గ్రహింపవలయునుగాని, యదినిష్ప్రయోజనమని చెప్పరాదు. అందుచే, సుఖదుఃఖములకు హేతువులగు ధర్మాధర్మములసంబంధమగు జ్ఞానమును దేవుఁడు వేదశాస్త్రములమూలమున నిచ్చుట నిష్ప్రయోజనమని చెప్పుటగాని, యీ జన్మలోని సుఖదుఃఖములకు హేతువులు పూర్వజన్మములలోఁ జేసికొనిన ధర్మాధర్మములే యైనచో, నెట్టికర్మలచే నెట్టిసుఖదుఃఖములు గల్గుచున్నవో యాసంబంధమగు జ్ఞానమును దేవుఁడు మనుష్యులకీయ లేదనిచెప్పుటగాని, యందుచే జన్మాంతరమును ధర్మాధర్మములును గలవనితలంచినచో దేవుఁడు జనులకు వారితప్పులను దెలుపకయేశిక్షించి యధర్మమొనర్చినవాఁడగును గావున నదియుక్తివిరుద్ధమని చెప్పుటగాని, యెంతమాత్రమును యుక్తియుక్తము కాఁజాలదు. ఐనచోఁ బైవీరేశలింగంపంతులుగారు మొదలగు ప్రముఖులు పైరీతిగవ్రాయుటకు హేతువేమనినఁ, బైవేదశాస్త్రములను బరమేశ్వరుఁ డిచ్చె

ననునమ్మకము వారికిఁ గొంచెమైనను లేదు. ఏలననఁగా వారును జిన్నతనమున, విదేశీయ చరిత్రకారులు మనవేదమునుగుఱించియుఁ శాస్త్రములనుగూర్చియు వ్రాసిన చరిత్రవిషయములనే నేర్చికొనియున్నారు. అవియే వారిమనస్సునందు గట్టిగాఁబాదుకొనినవి. వేదశాస్త్రములు, పూర్వకాలపుమహర్షులు మొదలగువారు వారికాలానుసారముగ నేర్పఱచి వ్రాసికొనిన నిబంధనగ్రంథములేగాని, యవి పరమేశ్వరుఁడిచ్చినవి కావని వారినిశ్చయము. పరమేశ్వరుఁడువచ్చి మనుష్యుల కెట్లుచెప్పుననియుఁ, జెప్పినయెడలఁ బ్రపంచకమందలి మనుష్యజాతుల కెవ్వరికిని జెప్పక, మనదేశమునందలివారి కొక్కరికిమాత్రమే చెప్పునా యనియును, నిట్టివే యించుమించుగ మననవనాగరకులకుఁ గలసంశయములన్నియును బంతులవారికిఁగూడఁగలవు. అట్టిసంశయము లన్నిఁటిని నిదివఱకే విమర్శించి వెనుకటి ప్రకరణమున సమాధానములు చెప్పియేయున్నాముగదా!

ధర్మాధర్మములజ్ఞానమును దేవుఁడు మనుష్యులకుఁ బుట్టుకతోడనే గలిగింపక, శాస్త్రమును వేఱుగ నేల యేర్పఱచెను? శాస్త్రముఁజదివి తెలిసికొనన నందఱకును సాధ్యమా? శాస్త్రమెఱుఁగనివాఁ డేమి చేయవలయును?

అవిగాక, మఱియొకసంశయముగూడ నైసందర్భమునఁ గలుగవచ్చును. ఏమనఁగా! “ప్రతిమనుష్యుఁడును వేదశాస్త్రములను జదివికొనియే, ధర్మములను నధర్మములను గుర్తెఱింగిప్రవర్తించుట లోకమున సాధ్యము కాదు; ఏలననఁగాఁ గొందఱు చదువువచ్చినవారును గొందఱు చదువురానివారునునుందురు. అందులోఁ జదువురానివారే యెక్కువగనుందురు. అట్టివారందఱును ధర్మశాస్త్రములు చదివికొనియే నడువవలయుననిన నది సాధ్యము కాఁజాలునా? కాఁబట్టి దేవుఁడే ధర్మములను నధర్మములను నిర్మించినయెడల వానిసంబంధమైనజ్ఞానము వారికిఁబుట్టుకతోడనే కలిగెడియేర్పాటు గావించియుండును గాని, వేఱుగ శాస్త్రములనేర్పఱచియుండునా? ధర్మములవలన సుఖములుగలుగుననియు నట్టివానిని మనుష్యులనుభవింపవలయుననియును, నట్లే యధర్మములవలన దుఃఖములుగల్గుననియు నట్టివానికి మనుష్యులు పాల్పడకుండవలయుననియును దేవునియుద్దేశ్యమేమైన యెడల, నట్టిసుఖములనుగల్గించుధర్మము లిట్టివనియు, దుఃఖములనుగలిగించునధర్మము లిట్టివనియును, మనుష్యులబుద్ధికిఁ దోఁచునట్లే దేవుఁడు చేసియుండవలయును. కావున మనుష్యులబుద్ధికి సుఖహేతువులుగఁ దోఁచునవియే ధర్మములును, దుఃఖహేతువులుగఁ దోఁచునవియే యధర్మములునని చెప్పుట యుక్తియుక్తముగనుండునుగాని, యట్టిధర్మాధర్మములను

వేదశాస్త్రములమూలమున దేవుఁడు తెలివెసనుట యుక్తము కాఁజాలదు.'' అని కొందఱు నవనాగరకు లభిప్రాయపడుచున్నారు.

కాని, ధర్మములను నధర్మములను దెలిసికొనుటకై నిర్మింపఁబడిన వేదశాస్త్రముల వలెనే, లోకమున, వైద్యశాస్త్రము, గణితశాస్త్రము, రసాయనశాస్త్రము, నారోగ్య శాస్త్రము మొదలగునితరశాస్త్రము లనేకములుగలవు. వీనివంటిదే ధర్మశాస్త్రముకూడ నైయున్నది. ఈశాస్త్రములన్నియును నేదోవిధముగ మనుష్యులయొక్క సౌఖ్యమున కవసరమగు సాధనములే. కాని, వానియందలి జ్ఞానమంతయును బ్రతిమనుష్యునకును బుట్టుకతోడనే కలుగుచున్నదా? లేదు! ఆయాశాస్త్రములను గష్టపడి నేర్చికొనినవారికే యాయాశాస్త్రములసంబంధమగుజ్ఞానము గల్గుచున్నది. ఆరోగ్యముగనుండుట కారోగ్య శాస్త్రమును, వచ్చియున్న రోగములను మాన్పుకొనుటకు వైద్యశాస్త్రమునుకూడ మనుష్యు లకు మిక్కిలియవసరమగు ముఖ్యమైన సౌఖ్యసాధనములే. కాని, యాశాస్త్రముల సం బంధమగుజ్ఞానములు వారికిఁ బుట్టుకతోడనేగలుగుటలేదు. అట్టిజ్ఞానము ప్రతిమనుష్యుని కిని గలిగియేయున్నయడల, లోకమున వేఱుగాఁబైశాస్త్రములుండవలసిన యవసరమును, వానిని నేర్చికొనవలసిన శ్రమయును లేకయేపోయెడివి. పుట్టుకతోడనే తమకికి వైద్య శాస్త్రజ్ఞానము దేవుఁడిచ్చియుండలేదనిచెప్పి, తమకువచ్చినరోగములను జనులు చికిత్స చేసికొనుట మానుచున్నారా? లేదు! ఏమిచేయుచున్నారు? వైద్యశాస్త్రములను నేర్చి కొని, యాజ్ఞానమునుసంపాదించుకొని, యాప్రకారము చికిత్సలుచేసికొనుచున్నారు. అట్లుచేయలేనివా రాజ్ఞానమునుసంపాదించుకొనినవారి యొద్దకువెళ్లి. వారిసలహానుబొంది యాప్రకారము చికిత్సలు చేయించుకొనుచున్నారు. కాని, యాజ్ఞానము తమకుఁబుట్టుక తోడ దేవుఁడీయలేదని యాయనపైకోపగించి యాశాస్త్రమసత్యమనివదలివేసి చికిత్సలు మానుకొనుటలేదు. అనఁగా, నొకని కొకరోగము వచ్చెననుకొనుఁడు. దానినిమాన్పుటకై యొకవైద్యుఁడువచ్చి కొన్నిదినుసులను జేర్చి యొకమందునుసిద్ధము చేసి దానినితినుమని యారోగి కిచ్చుననుకొనుఁడు. అపుడారోగి దానినితినుటవలనఁ బ్రయోజనముండునా? కాక, దేవుఁడు వైద్యశాస్త్రజ్ఞానమును బుట్టుకతోడఁ దనకీయలేదనియు, నేమందు తినుటవలన నేరోగముకుదురునో తనకుఁదెలియదు గావునఁ దానామందుతినరాదనియుఁ జెప్పుటచేఁ బ్రయోజనముండునా? అట్లుచెప్పి మందుతినుట మానినయెడలఁగాని, కాక, తనకుఁదోఁచినదానిని దేనినైననుదినినఁగాని రోగము పెరిగి మఱింత బాధపడుట కవకా శముగల్గును. అట్టిజ్ఞానమును దేవుఁడు ప్రతిమనుష్యునకును బుట్టుకతోడనే యీయనంత మాత్రముచే, జనులు తమరోగములను గుదుర్చుకొనుట దేవుని కిష్టముగాదని చెప్పవచ్చు నా? దేవుని కిష్టమైనయడలఁ బుట్టుకతోడనే యాజ్ఞానమును బ్రతిమనుష్యునకును నేల

యీయలేదు? అట్లీయకపోవుట లోపముగాదు. అందుకుఁ గారణము లేకపోలేదు. ఇది వఱలోఁ జెప్పినట్లు ధర్మశాస్త్రమువలె నుపయోగకరమయినశాస్త్రములు లోకమున మితిలేకయున్నవి. వానిసంబంధమైన జ్ఞానమంతయును బూర్ణముగఁ బ్రతిమనుష్యునకును బుట్టుకతో నేర్పడుట సాధ్యముగాదు. తుదకు మనుష్యుడు తనప్రాణమునకు ముఖ్యాధారమైన యాహారపదార్థములసంబంధమగు జ్ఞానమునుగూడ, తనతోడివారినిజూచియే నేర్చికొనుచున్నాఁడు కాని, యదియైనను నతనికిఁబుట్టుకతోడఁ గల్గుటలేదు. అనఁగాఁ దోడివారేయేపదార్థములను దినుచుండిరో తానును నవియేతినునట్లుగ బాల్యమునుండియుఁ గ్రమముగా నేర్చికొనుచున్నాఁడు. కాని, యీవస్తువుతినినచో మనుష్యశరీరమునకుఁ బడుననియు. నిదితినినచోఁ బడదనియు వానియంతట వానికే జ్ఞానముకల్గుటలేదు. లోకమున నందఱియొక్క తెలివితేటలును నొక్కటిరుగనుండనేరవు. కొందఱు మిక్కిలి చుఱుకైనబుద్ధిగలవారుగనుందురు. కొందఱు మిక్కిలిబండబుద్ధిగలవారుగ నుందురు. ఇఁకఁ బ్రతిమనుష్యునకును బూర్ణముగ నన్నిశాస్త్రములసంబంధమైన జ్ఞానమునుండవలయునని నచో, నదియెట్లుసాధ్యమగును? గణితశాస్త్రము మొదలగునితరశాస్త్రములవలనఁ గలిగెడి ప్రయోజనములను బాగుగగుర్తెఱింగినవారన్నికష్టములకైననోర్చి, యాశాస్త్రములను జదివి, యాజ్ఞానమును సంపాదించెదరు. అట్లుచేయలేనివారాజ్ఞానమును సంపాదించిన వారికడకువెళ్లి, వారివలనఁదెలిసికొందురు. కాని, దేవుఁడు జనులకు దానిని బుట్టుకతోడనీయలేదుగావున దానివలనఁ బ్రయోజనములేదని కాని, యాజ్ఞానమును గలుగఁజేసెడి శాస్త్రము లసత్యములనిగాని, చెప్పరు. దానివలనఁ గలిగెడిప్రయోజనమును బాగుగ నెఱుఁగనివారుమాత్రమే, పైయాక్షేపణను జేయుందురు. అట్లే, ధర్మశాస్త్రములవలనఁ గల్గెడి యమూల్యమగుప్రయోజనమును దెలిసికొనఁజాలనివారు మాత్రమే, ధర్మశాస్త్రములందుఁ జెప్పఁబడిన ధర్మాధర్మములయొక్కజ్ఞానము తమకుఁబుట్టుకతోఁ గలుగలేదు కావున ధర్మశాస్త్రములందలివిషయములు సత్యములు కావనియు, నిష్ప్రయోజనములనియుఁ జెప్పుదురు. కావున నట్లుచెప్పుట యుక్తియుక్తము కాఁజాలదు.

మఱియును, వేదశాస్త్రములను జదువఁజాలక, ధర్మములను నధర్మములను దెలిసికొనలేనివారు, పైనదెల్పినయితరశాస్త్రములవిషయమునఁ జేయునట్లే ధర్మశాస్త్రముల విషయమునఁ గూడఁ జేయవలయును. అనఁగా, ధర్మశాస్త్రములు దమకుఁ దెలియకపోయినచో, వానినిఁజదివి యందుమూలమున ధర్మాధర్మములను దెలిసికొనవలయును. అట్లు చేయుట సాధ్యము కానివారు, ధర్మశాస్త్రము లెఱిఁగినవారియొద్దకుఁబోయి వారిసలహా నందికొని యాప్రకారము ధర్మాధర్మములనెఱిఁగి ప్రవర్తింపవలయును. ఈవిషయమునే శ్రీమదాంధ్రమహాభారత మీక్రిందిరీతిగ వర్ణించిచెప్పుచున్నది:—

[శ్రీమదాంధ్రమహాభారతము, శాంతిపర్వము, ఆశ్వా. ౫.]

"...........................................

క. అనిచెప్పి యమరతటినీ, తనూభవుం డాదరమున ధర్మసుతునితో
"ననఘా! నీ వింకెయ్యది, వినవల త"నవుడు నతండు వినయాతురుఁడై. 445

## శాస్త్రం బెఱుంగనివాఁడు సేయవలసిన విధము.

తే. శాస్త్రతత్త్వ మెఱుంగక సంశయాత్ముఁ, డగుచుఁ బరమార్థ మిట్టిదియనఁగలేని
యట్టివాఁ డేమి కర్మంబు నాచరించు,వాఁడు? సెప్పవె ధర్మప్రవర్తనజ్ఞ!" 446

వ. అనియడిగిన నమ్మహామతి యతనికిట్లను: "గురుపూజయు, వృద్ధోపసేవనంబును విద్యాశ్రవణంబును, నవశ్యకర్తవ్యంబులు..........." 447

దీనినిబట్టిచూచినను గూడ శాస్త్రజ్ఞానముగల గురువులను వృద్ధులనునాశ్రయించి వారివలన ధర్మములను నధర్మములను విని తెలిసికొనుటయే శాస్త్రజ్ఞానములేనివాఁడు ముఖ్యముగఁ జేయవలసినపనియని స్పష్టమగుచున్నది. అట్లుగాక తనబుద్ధికిఁదోఁచినట్లు ప్రవర్తించునేని, వాఁడు, వైద్యశాస్త్రజ్ఞానములేనిరోగి యాశాస్త్రజ్ఞానముగలవారి సహాయ మొల్లక తనకుఁదోచినరీతిని దిని మఱింత రోగబాధపాలగునట్లే, యధర్మఫలమగు దుఃఖమును బొంద నవకాశముగల్గును. కావుననే శాస్త్రము దెలియనపుడు ధర్మములను నధర్మములను దెలిసికొనుటకు శిష్టులగు పెద్దలయాచారములే యాధారములగుటచే ధర్మమును దెలిసికొనుటకు సాధనములగు శ్రుతిస్మృతులతోఁబాటు శిష్టాచారమునుగూడ యొకసాధనముగ ధర్మశాస్త్రకర్తలందఱును బేర్కొనియున్నారు. ఇందుల కుదాహరణముల నీక్రిందఁ జూపుచున్నారము:—

మనువు తనధర్మశాస్త్రమున ధర్మ మెఱుఁగుటకు సాధనములను బేర్కొనుచు నందులో

"శ్లో. వేదోఽఖిలో ధర్మమూలం స్మృతిశీలేచ తద్విదామ్,
ఆచారశ్చైవ సాధూనా మాత్మనస్తుష్టి రేవచ."

(మనుస్మృతి. అధ్యా. ౨ శ్లో. ౬)

యనిచెప్పియున్నాఁడు. అనగా ధర్మములనెఱుఁగుట కాధారములు వేదమును, వేదము నెఱిగినవారు వ్రాసినస్మృతిగ్రంథములును, నట్టివారియొక్క సుగుణములును, సాధువులగు వారియొక్కయాచారములును, నాత్మతుష్టియు ననియర్థము. వీనిలో వేదమునుగుఱించి యీగ్రంథముయొక్క మొదటిప్రకరణమునఁ దెలిసికొంటిమి. వేదవిదులు వ్రాసినస్మృతులనుగుఱించి తెలుపుటకే యీ రెండవప్రకరణము నడచుచున్నది.

దీనియందే యింతకుముం దాత్మతుష్టియన నేమియో వివరించియుంటిమి. ఇంక మిగిలిన సాధనములగు వేదవిదులయొక్క సుగుణములును, సాధుజనులయాచారములును మాత్రమే ధర్మశాస్త్రజ్ఞానములేనివారికి ధర్మములను నధర్మములను నెఱుఁగుటకు సాధనములను విషయమును బైన దెలిపినదానికి నుదాహరణముగఁ బైశ్లోకమును జూపియుంటిమి. ఇట్టి యభిప్రాయము నే తక్కినయితరధర్మశాస్త్రగ్రంథకర్తలందఱును దమస్మృతులలో వ్రాసి యున్నారు. అందులో మఱికొన్నిఁటి నీక్రిందఁ జూపుచున్నాము:—

"శ్లో. శ్రుతి స్మృతి స్సదాచార స్స్వస్యచ ప్రియమాత్మనః,
సమ్యక్సంకల్పజః కామో ధర్మమూల మిదం స్మృతమ్.

అనియాజ్ఞవల్క్యమహర్షి వ్రాసియున్నాడు. ధర్మ మెఱుఁగుటకుసాధనములం శ్రుతియును, స్మృతియును, నాత్మతుష్టియును మొదలగునవని చెప్పుచు వానిలో సదాచారమునుగూడ పేర్కొనియున్నాఁడు.

అట్లే యాపస్తంబమహర్షి కూడ యీక్రిందిరీతిగఁ జెప్పియున్నారు:—

"సూ. ధర్మజ్ఞసమయః ప్రమాణమ్ వేదాశ్చ............
............తదిహాస్మదాదీనాం ధర్మజ్ఞసమయః ప్రమాణమ్."

అనఁగా, వేదముతోఁబాటు ధర్మజ్ఞసమయము (అనఁగా ధర్మ మెఱిఁగిన యాపస్తంబునివంటి మహనీయులయొక్క యాచారము)కూడ ధర్మ మెఱుఁగుటకు సాధనమని యర్థము. సమయమనుశబ్దమునకు నాచారమనియర్థము. ఎట్లనగా:—

"సమయా శ్శపథాచార కాలసిద్ధాన్త సంవిదః." అని యమరకోశము, నానార్థవర్గము.

పైప్రమాణములందు ధర్మ మెఱుఁగుటకుసాధనముగఁ బేర్కొనఁబడినయాచారములు సాధువులయొక్క యాచారములనియు, వేదవిదులయొక్క స్మృతిశీలములనియు, సదాచారమనియు, ధర్మజ్ఞులయొక్క యాచారమనియు నీమొదలగుశబ్దములచే వ్యవహరింపఁబడుటచే, వేదశాస్త్రములందును బెద్దలమతాచారములందును నభిమానమును, విశ్వాసమును, భక్తిశ్రద్ధలునుగలిగి శక్తికొలఁది యట్టిధర్మముల నాచరించువారియొక్క యాచారములే ప్రమాణములుగ గ్రహింపఁదగినవి కాని, యట్టిశాస్త్రవిశ్వాసమును మతాభిమానమును శాస్త్రధర్మమందలిశ్రద్ధయును లేక స్వేచ్ఛగాఁ (దమయిష్టమువచ్చిన ట్లెల్లను) దమయాచారములను మార్చికొనుచుండు వారియొక్క యాచారములును వారి నలహోయును గ్రహింపఁదగినవి కావని పైధర్మశాస్త్రకర్తలయాశయము.

## సుఖదుఃఖములకుఁగారణము పూర్వకర్మయా, యదృష్టమా, కాక, దైవకృపయా ?

సుఖదుఃఖములుఁగలిగినపుడు "వారివారిపూర్వజన్మములలో వారువారుచేసికొనిన పుణ్యపాపములే యందులకుఁగారణము"లని కొందఱును, "వారివారియదృష్టదురదృష్టములచేతనే గల్గుచున్న"వని మఱికొందఱును, "దేవునకు వారియందుఁగలదయననుసరించి దేవుఁ డట్లుగలిగించుచున్నాఁ"డని యింకఁగొందఱును జెప్పుచుందురు. అందుచేఁ గొందఱు పైవానిలో నదృష్టమును దైవకృపయునుండుటయు, లేకపోవుటయుమాత్రమే యట్టిసుఖదుఃఖములకుఁ గారణములుగఁ గ్రహించి, యందుల కనుకూలములగు ప్రమాణములను మనమతశాస్త్రగ్రంథములనుండి యెత్తిచూపి, యందుచేఁ బూర్వజన్మకృతపుణ్యపాపములు సుఖదుఃఖములకుఁ గారణములనుమాటను ద్రోసిపాఱవైచి పూర్వజన్మములులేవనియు, నందుచే వానికిహేతువులగు పుణ్యపాపములుగాని, వానికి సాధనములగు ధర్మాధర్మములుగానిలేవనియు వాదించెదరు. కాని, సరిగా నాలోచింపఁగా, సుఖములుగల్గుటకు నదృష్టమును దైవకృపయును హేతువులనియును, దుఃఖములుగల్గుటకు దురదృష్టమును దేవునియాగ్రహమును హేతువులనియును జెప్పినమన వేదశాస్త్రములే, యట్టిసుఖములకు హేతువులు పూర్వజన్మకృతపుణ్యవిశేషములనియు, దుఃఖములకు హేతువులు పూర్వజన్మకృత దుష్కృతము (పాపము) లనియుఁగూడ చెప్పుచున్నవి. ఇందుల కుదాహరణముగ "శుభాశుభంబులు పూర్వజన్మకృత పుణ్యపాపంబులచేఁ గల్గుననిచెప్పుట"యను నొకకథను శ్రీమహాభారతమునుండియెత్తి యీ ప్రకరణముననే, "ఇతరజన్మము కలదనుటకు వేదశాస్త్రప్రమాణము"లను శీర్షికక్రింద నిదివఱలోఁజూపియున్నాము. అట్లే, "యెట్టియెట్టి ధర్మాధర్మములచే నెట్టియెట్టి సుఖదుఃఖములుగల్గునో యావిషయమును శాస్త్రముచెప్పెనా ?" యనుశీర్షికక్రిందఁగూడ యీప్రకరణమున నిదివఱలో నితరగ్రంథములనుండి మఱికొన్ని ప్రమాణములనుగూడ చూపియున్నాము. ఐనచో, "మనవేదశాస్త్రములు పైరీతిగ నొకచోట సుఖదుఃఖములకుఁ గారణములు దైవకృపయు, నదృష్టముననియును, మఱియొకచోటఁ బూర్వజన్మకృతపుణ్యపాపములనియును జెప్పుట పరస్పరవిరుద్ధమగు ప్రసంగముగాదా ?"యని సంశయముగలుగవచ్చును. కాని,యట్లుకాఁజాలదు. ఏలననినఁ బూర్వజన్మమునఁ జేసికొనిన పుణ్యకర్మలయొక్కఫలమే యదృష్టము. అట్లే పాపకర్మలయొక్క ఫలము దురదృష్టము. అనఁగా నదృష్టమును దురదృష్టమునుగూడ పూర్వజన్మకృతపుణ్యములవలనను, బాపములవలననుమాత్రమే కల్గుచున్నవి. అనఁగా వానికిఁగారణములు పాపపుణ్యములేకాని యవి నిష్కారణముగ వానియంతట నవియే యేర్పడుటలేదు. అంతియగాక సరిగానాలో

చింపఁగా, సదృష్టమనినను దైవకృపయనినను నొకటేగాని వేఱుగావు. అదృష్టమనుశబ్దమునుగుఱించి 'గురుబాలప్రబోధిక' యనునిఘంటు వీక్రిందియర్థమును జెప్పుచున్నది:-

"శ్లో. అదృష్టం వహ్నితోయాది దృష్టం స్వపరచక్రజమ్,
సదృష్టం ఆదృష్టం—దైవకృతత్వాత్ ............"

దైవకృతమగుటవలనఁ గానఁబడనిది. వహ్నితోయాది = అగ్నిజలాదులవలనఁ బుట్టినభయము. ఆదిశబ్దముచేత వ్యాధి, దుర్భిక్ష, మూషక, శలభాదులవలనఁ బుట్టిన భయంబును అదృష్టమనంబడును."

దీనిచే దైవకృతమనినను సదృష్టదురదృష్టములనినను నొక్కటేయని తెలియుచున్నది. కాఁబట్టి దైవకృతమునకుఁగూడ హేతువులు జీవులు వారివారిపూర్వజన్మములలోఁ జేసికొనినపుణ్యపాపములేయని మనముగ్రహింపవలసియున్నది. కాని దైవమున కొకరియం దనుగ్రహంబును మఱియొకరియం దాగ్రహంబును నిష్కారణముగఁ గల్గునని మనము పొరపడరాదు. అనఁగా జీవులు వారిపూర్వజన్మలలోఁ జేసికొనిన పుణ్యములననుసరించియే దేవునకు వారియం దనుగ్రహముకలిగి వారి కీజన్మమున సుఖములను గల్గించుచున్నాఁడనియును, వారు పూర్వజన్మములలోఁ జేసికొనిన పాపములననుసరించియే వారిపై యాగ్రహముకలిగి వారి కీజన్మమున దుఃఖములను గల్గించుచున్నాఁడనియును, మనము తెలిసికొనవలసియున్నది. ఇందులకు మఱియొకప్రమాణము నీదిగువఁ జూపుచున్నాము:—

లోకమున సుఖదుఃఖములును మేలుకీడులును మనుష్యులకు వారియొక్క కర్మలను బట్టి కలుగుచున్నవా, కాక, యీశ్వరునియొక్క యిష్టముచొప్పునఁ గల్గుచున్నవా? యని పూర్వమొకసారి మహర్షులకుఁగొందఱికి సందేహముకలిగినదఁట. ఆసంశయము తీరుటకై వారు పరమేశ్వరునిగూర్చి తపస్సుచేసిరఁట. అంతట దేవుఁడు వారికిఁ బ్రత్యక్షముకాఁగా వారు తమసంశయమును దీర్పఁగోరిరఁట. ఆయన పైనదెలిపినరీతిగనే యీసంశయమునుదీర్చినట్లు స్కాందమహాపురాణమందలి సూతసంహితలోని యీక్రింది కథవలనఁ దెలియుచున్నది. చూడుఁడు:—

[సూతసంహితాయాం, శివమాహాత్మ్యఖండే, ఏకాదశోఽధ్యాయః]

### హిరణ్యగర్భాది విశేషసృష్టికథనమ్.

"శ్లో. ........................................
ఏవం కర్మానురూపేణ ప్రాణినా మంబికాపతేః
అజ్ఞయా బహవో జాతా అసంఖ్యాతా ద్విజర్షభాః. ౨౧౪

స్వభావాదేవ సంజాతం సమస్త మితికేచన. ౨౨
తన్నసిధ్యతి విప్రేంద్రా దేశకాలాద్యపేక్షయా,
కర్మణైవ సముత్పన్నం సమస్త మితికేచన. ౨౩
త చ్ఛ్రుతిస్మృతివాదస్య విరుద్ధం మునిపుంగవాః. ౨౩౪
పురా హిమవతః పార్శ్వే మునిస్సత్యవతీసుతః. ౨౪
సుమంతు ర్జైమినిశ్చైవ వైశంపాయన ఏవచ,
పైలః కపిలసంజ్ఞశ్చ తథా విప్రాః పతంజలిః. ౨౫
... ... ... ... ... ...
... ... ...తథాఽన్యేచ మహర్షయః. ౨౮
పరస్పరం విచా ర్యార్థం శ్రద్ధయా పరమర్షయః,
సంశయావిష్టమనస స్తప శ్చేరు ర్మహా త్తరమ్. ౨౯
ఏతస్మిన్నంతరే రుద్రః ప్రసన్నః కరుణానిధిః,
స్వయ మావిరభూ త్తేషాం పురతః పరమేశ్వరః. ౩౦
తం దృష్ట్వా మునయ స్సర్వే ప్రసన్నేంద్రియబుద్ధయః,
ప్రణమ్య పరయా భక్త్యా భగవంతం త్రిలోచనమ్. ౩౧
కృతాంజలిపుటా స్సర్వే పప్రచ్ఛుః పరమేశ్వరమ్. ౩౧౪
దేవదేవో మహాదేవ స్సర్వజ్ఞః కరుణానిధిః,
... ... ... ... ... ...
ఉవాచ మధురం వాక్యం మునీనాం సంశయాపహమ్. ౩౩౪

ఈశ్వరః:—

"న స్వభావా జ్జగజ్జన్మస్థితిధ్వంసా మునీశ్వరాః. ౩౪
నసమయా కేవలేనాపి నచ కేవలకర్మణా
ప్రాణినాం కర్మపాకేన మయాచ మునిసత్తమాః. ౩౫
జగత స్సంభవో నాశ స్థ్సితిశ్చ భవతి ద్విజాః
ఏవం కర్మానురూపేణ జగజ్జన్మాది యన్మయా. ౩౬
ఏష స్స్వభావో విప్రేంద్రా ఇతివేదార్థనిర్ణయః,
ఏవముక్త్వా మహాదేవ స్సర్వజ్ఞఃకరుణానిధిః. ౩౭
అనుగృహ్య మునిశ్రేష్ఠాన్ తత్రై వాంతరధీయత,
... ... ... ... ... ...

భవన్తోఽపి మునిశ్రేష్ఠాః ప్రాణికర్మానురూపతః. ౩౯
సృష్ట్వా సంహార తీశాన ఇతివిత్త జగత్సదా,......" ౪౦

పైశ్లోకములతాత్పర్య మేమనగా: సూతుఁడు శౌనకాదిమహర్షులకు హిరణ్యగర్భునివలనఁ జరిగినసృష్టిని వర్ణించిచెప్పుచు, నందులో దక్షుడు మొదలగుప్రజాపతుల వలన గలిగినస్త్రీపురుషసంతతులతో జగమంతయువ్యాపించుటను వర్ణించుసందర్భమున, "నిట్లు ప్రాణులయొక్క కర్మననుసరించి పరమేశ్వరునియాజ్ఞచే లెక్కలేనిజనులుపుట్టి" రని పైన ౨౦వశ్లోకమున జెప్పి, యటుపై, యిట్టిజగదుత్పత్తికి నితరమతస్థులు చెప్పు కారణములను ౨౨వశ్లోకమున బ్రసంగించుచున్నాఁడు. ఆశ్లోకములకు శ్రీమాధవాచార్యులవారీక్రిందిరీతిగ వ్యాఖ్యవ్రాసియున్నారు.

"న కేనచి దిదం సృష్టం, స్వాభావికమే వైతజ్జగదితి లోకాయతికాః; తన్మత ముపన్యస్యతి. ౧౯౫. ౨౦౫. ౨౧౫. ౨౨. తదితి. కాశ్మీరేష్వేవ కుంకుమమితి దేశాపేక్షా; అహన్యేవ కమలానాం వికాసః, రాత్రావే వోత్పలానా మిత్యహోరాత్రాది రూపకాలాపేక్షా; ఆదిశబ్దేన పుణ్యకృత ఏవసుఖం, పాపిన ఏవదుఃఖ మిత్యదృష్టాపేక్షా; సర్వమిద మీశ్వరేచ్ఛయేతి ఈశ్వరాపేక్షా. సర్వమే వైతత్స్వభావమితిచే దీదృగ్విధస్య లోకాయతికపక్షస్య వైదికమతావిశేషా త్కర్మణైవే త్యనీశ్వరవాదినః శ్రుతిస్మృతివాదస్య విరుద్ధమితి. నను. శ్రు. 'పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేనే'తి వాజసనేయోపనిషది. కర్మణైవేతిపక్షః స్వీకృతఇతిచే న్న; ఈశ్వరాధిష్ఠితయో రేవ తయో స్స్వరూపలాభః స్వకార్యకరత్వం చేత్యపి శ్రుతావే వోదీరణా చ్ఛ్రూయతేహి— ఏషహ ఏవ సాధుకర్మ కారయతి తయమధునో నినీషతీతి— వ్యాసోఽపి ఈశ్వరాదేవ ఫలప్రాప్తి మాహ—'ఫల మత ఉపపత్తే'రితి—స్మర్యతేచ. "అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే" ఇతి. ౧౦. ౩౫.............."

పైవ్యాఖ్య కర్థ మేమనఁగా: "ఈజగత్తు నెవ్వరునుసృష్టింపలేదు. అది స్వాభావికముగఁ దనంతటఁదానేపుట్టినద"ని లోకాయతికు లను మతస్థులయొక్కసిద్ధాంతము. దానినే(సూతుఁడు) "స్వభావాదేవ సంజాతం" అనుశ్లోకపాదమున వినిపించి, దేశకాలాద్యపేక్షచే నాసిద్ధాంతము సిద్ధింపఁజాలదని "తన్నసిధ్యతి" యనుతరువాతపాదమున వినిపించియున్నాఁడు. దేశకాలాద్యపేక్షయన నేమనఁగా, సృష్టిలో స్వభావముగ జరుగు పనులు సహితము కొన్నిసందర్భములలో దేశభేదమును, గాలభేదమును, మొదలగువానిపై యాధారపడియుండుట. ఎట్లనఁగాఁ గుంకుమపువ్వు కాశ్మీరదేశములందుమాత్రమేపుట్టుట దేశాపేక్ష; తామరపువ్వులు పగటిపూటమాత్రమును, గలువపూలు రాత్రిపూటమాత్రమును వికసించుట కాలాపేక్ష. అట్లే పుణ్యమువలనమాత్రమే సుఖమును, బాపములనవ

దుఃఖమును గలుగుట యదృష్టాపేక్ష; ఈజగమంతయుం నీశ్వరునియిష్టముచొప్పుననే యేర్పడెననుట యీశ్వరాపేక్ష. వీనియన్నిఁటితోఁ గూడినజగమంతయుం స్వభావము చేతనే గల్గుననుట లోకాయతికమతము. అంతకును గారణము కర్మమాత్రమేయనుట నిరీశ్వరవాదులమతము. జగత్తులోని యుత్పత్తిస్థితినాశములకన్నిఁటికిఁ గర్మయుంను నీశ్వరుఁడునుగూడ హేతువేయని మనశ్రుతులును స్మృతులును జెప్పుచుండుటచేఁ గేవలస్వభావమే కారణమనిగాని, కేవలకర్మయే కారణమనిగాని, చెప్పుట శ్రుతిస్మృతులమతమునకు విరుద్ధము. [కర్మయుంను హేతువేయనుటకును నీశ్వరుఁడును హేతువేయనుటకునుగూడ శ్రుతిస్మృతులలోనుండి ప్రమాణములనెత్తి వ్యాఖ్యాతలు పైవ్యాఖ్యానమునఁ జూపించియున్నారు.] ఇది పైవ్యాఖ్యానమునకర్థము.

ఈవిషయమున గలసంశయమునుదీర్చుటకై పరమేశ్వరునివాక్యమొకటి ప్రమాణముగఁజూపఁదలఁచి సూతుఁ డొకపలికథ నుపక్రమించుచున్నాఁడు. ఆకథను సంగ్రహముగ నీప్రమాణమునుజూపుటకుముందు వినిపించియేయుంటిమి. అట్టిసంశయముఁదీర్చుటకై మహర్షుల కీశ్వరుఁడుచెప్పిన శ్లోకములయొక్కతాత్పర్యము నీకవినిపించెదము. "ఓమునీశ్వరులారా! ఈజగత్తుయొక్కపుట్టుకయుంను, వృద్ధియుంను, నాశనమును, గేవలము స్వభావముచేతమాత్రమే జరుగుటలేదు; కేవలము నాచేతమాత్రమే జరుగుటయుంను లేదు; కాక, కేవలము కర్మవలనమాత్రమే జరుగుటయుంనులేదు. ఇఁకనేమనిన, యీజగత్తు పుట్టుటయుంను, బెఱుగుటయుంను, నశించుటయుంను, బ్రాణులయొక్క కర్మఫలము ననుసరించియుంను నావలననుగూడ జరుగుచున్నవి. ఇట్లు కర్మానుసారముగ నాచేఁజేయఁబడు జగదుత్పత్తి మొదలగునవియే స్వభావమనిచెప్పఁబడును. ఇదియే వేదశాస్త్రములసిద్ధాంతము." ఇట్లుచెప్పి పరమేశ్వరుఁ డామహర్షులయెదుట నంతర్ధానమొందెనని సూతుఁడు శౌనకాదులగుమునీశ్వరులకుఁ జెప్పి, "ఓమునిశ్రేష్ఠులారా! ప్రాణులయొక్క కర్మననుసరించియే యీశ్వరుఁడు జగమునుసృష్టించుననియుం, సంహరించుననియుఁ మీరుకూడ తెలిసికొనుఁ"డని వారికిఁబోధించెను.

దీనివలనఁగూడ జనులసుఖదుఃఖములకుఁ గేవల మీశ్వరుఁడుమాత్రమేగాని, కేవలమదృష్టము, దురదృష్టము, స్వభావము, లోనగునవిమాత్రమేగాని కారణములు కావనియుం, జనులు వారివారిపూర్వజన్మలలోఁ జేసికొనినకర్మకూడ (అనఁగా ధర్మములును, నధర్మములునుగూడ) కారణములేయనియుం, నందుచే నితరజన్మములును, బుణ్యపాపములును, ధర్మాధర్మములును గలవనియుఁ దేలినది.

## జన్మాంతరవిషయసారాంశము; ధర్మస్వరూపనిర్ణయము.

ఇంతవఱకు వ్రాసినదానివలన నితరజన్మములును, నితరలోకములును, గలవని నిశ్చయమైనది. ఈనిశ్చయమునకు మూలాధారము వేదశాస్త్రములు. వానియొక్కగొప్పతనమును నిదివఱకే వినిపించియేయున్నాము. అవి (వేదములు) పరమేశ్వరునిచే నీయఁబడినవని ఋజువుచేసియేయుంటిమి. ఆవిషయమున నవనాగరకులకుఁ గలసంశయములకు సమాధానములను జెప్పియేయుంటిమి. ఏయితరప్రమాణమైనను బరమేశ్వరునివాక్యమును మించినది కాఁజాలదు. జగత్తులన్నిఁటికిని గర్తయైనసర్వేశ్వరుని మించిన తెలివితేటలుగలవారుండఁబోరు. ఆయాజన్మములో బ్రాణులకుఁగల్గెడి సుఖదుఃఖములకును, నుత్తమాధమజన్మములకును, గారణము లాయాప్రాణులు తమపూర్వజన్మములలోఁ జేసికొనినకర్మములే (అనఁగా ధర్మములును నధర్మములునుమాత్రమే.) అట్టిధర్మములనుగాని యధర్మములనుగాని యాచరించుటచే నీలోకమునందు గలుగులాభనష్టములును, సుఖదుఃఖములును మాత్రమేగాక, యిప్పుడు మనయనుభవమునకురాక, ముందుముం దెప్పుడో యనుభవమునకువచ్చెడి సుఖదుఃఖరూపములగు మఱికొన్నిఫలములుగూడ యేర్పడుచుండును. అట్టిఫలములవిషయమున, నేపనిచేయుటచే మంచిఫలముగల్గునో, యేపనిచేయుటచేఁ జెడుఫలముగల్గునో యావిషయమును మనము చెప్పఁజాలము. ఎందువలననఁగా, నాఫలములు ముందెన్నఁడో యనుభవమునకురాఁబోవునవిగాని, యప్పటికప్పుడు మనయింద్రియములకు (అనఁగాఁ గన్నులకుఁగాని, ముక్కునకుఁగాని, చెవులకుఁగాని, నోటికిఁగాని, చర్మమునకుఁగాని,) తెలియవచ్చునవికావు. అందుచేతనే యవి యతీంద్రియవిషయములని చెప్పఁబడును. సర్వమును గుర్తెఱుఁగఁజాలినయీశ్వరుఁడే యట్టిఫలములను నిర్ణయించి మనకుఁదెలుపవలయునుగాని, యితరులెవ్వరికి నది సాధ్యము కాఁజాలదు. వేదమూలమునఁ బరమేశ్వరుఁ డట్లు తెలిపియేయున్నాఁడు. దానియందలిధర్మాధర్మములు జనులకు సులభముగఁదెలియుటకొఱకే కొందఱుమహర్షులు ధర్మశాస్త్రములనురచించియుందు వానిని దెలిపియున్నారు. ఇది మనధర్మశాస్త్రములనుగుఱించి మనప్రాచీనచరిత్రకారులైనమహర్షులు తమగ్రంథములలో వ్రాసినవిషయము. ఇఁక నీవిషయమున నవీనచరిత్రకారు లేమిచెప్పిరో విచారించిచూతము.

## స్మృతులనుగుఱించి నవీనచరిత్ర లేమిచెప్పును?

ప్రత్యేకముగ మనధర్మశాస్త్రములనుగుఱించి నవీనచరిత్రలు చెప్పెడివిషయ మెక్కువగలేదు. కాని, ధర్మశాస్త్రములకు మూలాధారమగు వేదమునుగుఱించియు, ధర్మశాస్త్రములనునిర్మించిన ఋషులనుగుఱించియు, వారునివసించు సంఘము నందుఁ గను

పించు కులభేదములనుగుఱించియు, నాయాకుల భేదములయొక్క నిర్మాణమునుగుఱించియు, (నవఁగా, నట్టికుల భేదము లేర్పడినవిధానమునుగుఱించియును) నవీనచరిత్రలు చేయువిపరీతపుబోధలవలననే, ధర్మశాస్త్రములవిషయమునఁగూడ నవనాగరకులలోఁ బెక్కుమందికి విపరీతములగునూహ లేర్పడియున్నవి. ధర్మశాస్త్రములనుగుఱించి నవీన చరిత్రలు చేయువిపరీతబోధలకు స్థాలీపులాకన్యాయమునసనుసరించి యొకచిన్నయుదాహరణము నీదిగువనిచ్చుచున్నాము; నవీనచరిత్రలందు ముఖ్యములగువానిలో నొకటిగా నెన్నఁదగినదని లోగడ మాచేఁ బేర్కొనఁబడిన హిందూదేశకథాసంగ్రహమునందలి 'హిందూమహాయుగము'లో నాల్గవప్రకరణమున ధర్మశాస్త్రములనుగుఱించి సంగ్రహముగ నీక్రిందిరీతిని జెప్పఁబడియున్నది:—

"............ఆపస్తంబఋషి ఆంధ్రదేశము మహావైభవములోనున్నప్పుడు అచ్చటజన్మించి ధర్మశాస్త్రగ్రంథము నిర్మించినవాఁడని విద్వాంసులయభిప్రాయమై యున్నది. పైనవర్ణించిన శ్రౌత, గృహ్య సూత్రములుగాక, మూఁడవతెగసూత్రములు గలవు. వీనికి ధర్మసూత్రములని పేరు. దాయభాగము, దత్తస్వీకారవిచారము, న్యాయవిచారణచేయువిధము మొదలగువ్యవహారధర్మములన్నియు నీసూత్రములం దుండును. ఇట్టిసూత్రములననుసరించియే తరువాతికాలములో మన్వాదిస్మృతులు వ్రాయఁబడినవి. పైనివర్ణింపఁబడిన శ్రౌత, గృహ్య, ధర్మసూత్రములుగలిసినఁ గల్పసూత్రములని పేరు."

(హిందూమహాయుగము, పుట ౬౦. వ.)

చూచితిరా! మనుస్మృతి మొదలగుస్మృతులకన్నిఁటికిని మూలాధారము వేదమే కాని యితరమేదియును గాదని, యీగ్రంథమున నీప్రకరణముననే "స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్రలందుఁ జెప్పఁబడినవిషయములకుఁ బ్రమాణములు" అనుశీర్షికక్రింద మనము సప్రమాణముగఁ దెలిసికొనియున్నవిషయములకు, నీ'హిందూమహాయుగ'మందలి పైవిషయ మెంతటివిరుద్ధముగనున్నదో పరికింపుఁడు! అంతయేల! ఏయాపస్తంబునివంటి సూత్రకారులసూత్రముల ననుసరించియే మన్వాదిస్మృతులు వ్రాయఁబడినవని పై 'హిందూమహాయుగము' మనకుబోధింపుచున్నదో, యాయాపస్తంబమహర్షి కూడ, తనవంటియు, మనువు మొదలగువారివంటియు ధర్మజ్ఞులందఱకిని ధర్మము నెఱుఁగుటకు మూలాధారము వేదమేయని కంఠోక్తిగాఁ జెప్పినవిషయము నీప్రకరణముననే పైనదెల్పిన శీర్షికక్రింద లోగడఁ గనుబఱచియే యున్నాముగదా!

ఇట్టివిపరీతబోధలనే కొంతవఱ కాధారముగఁగొని వానిసహాయమున నిరాధారములగు మఱికొన్నియూహాలనుగల్పించికొని నవనాగరకులు వారియిష్టమువచ్చినట్లెల్ల నూహించి ధర్మశాస్త్రములవిషయమున నీక్రిందివిధములగు దురూహాలకుఁ బాల్పడి

యున్నారు. ఎట్లన: ధర్మశాస్త్రములను వ్రాసినఋషులయొక్క కాలమునందలి పరిస్థితులను బట్టి వారిసంఘముయొక్క యభివృద్ధికొఱకై వారుపలువురొకచోటఁజేరి యాలోచించి కొని, యాకాలమున కనుకూలమగు కొన్నినియమములను (అనఁగాఁ గట్టుబాట్లను) నిర్మించికొనిరఁట. అట్లేర్పఱుపఁబడిననియమములే ధర్మములని చెప్పఁబడినవఁట. వానిని జేర్చి గ్రంథములుగవ్రాసిరఁట. ఆగ్రంథములకే ధర్మశాస్త్రములని పేరుఁబెట్టిరఁట. వాని లోనిధర్మములయందుఁ బామరులగుజనులకు భయమును, భక్తియు, విశ్వాసమును, శ్రద్ధయుఁ గుదురుటకై పుణ్యములును, పాపములును, స్వర్గము, నరకము లోనగునితరలోకములునునున్నట్లు కల్పించివ్రాసిరఁట. కాని, యవియన్నియు సత్యములు కావఁట. ఇట్లని నవనాగరకులనేకులు తలంచుచున్నారు. కొంద అట్లుమాతోవాదించియుఁగూడ నున్నారు. వీరు తమజీవితకాలములలోఁ జాలాభాగము నింగ్లీషువిద్య నేర్చికొనుటలోఁ గడపియున్నందునను, మనమతమునకుసంబంధించిన వేదములను, శాస్త్రములను, నంతగాఁ జదివియుండకపోవుటచేతను, వానివిషయమున యథార్థము వీరి కంతగాఁదెలియదు. పైవిధములగు దురూహలు నవనాగరకుల కేర్పడుటకుఁగారణ మీక్రిందఁదెలుపఁబోవునదై యున్నది.

## విదేశీయులు ధర్మముల నేర్పఱచుకొనువిధము.

మనధర్మశాస్త్రములనుగుఱించి నవనాగరకులు పైరీతిగఁదలంచుటకు ముఖ్యకారణ మేమనఁగా: విదేశీయులపాఠశాలలలో వీరుచదువుట కారంభించినది మొదలుకొని వీరికి వారితోడిసంపర్కము క్రమముగానెక్కువగుచువచ్చెను. అందుచే వారియాచారములందును వ్యవహారములందును వీరికి నభిరుచిపుట్టసాగెను. ఆవిదేశీయులు ధర్మములను నిర్మించుకొనువిధానమును వీరుగుర్తించిరి. ఆవిధాన మెట్టిదనఁగా: లోకమున జనులయొక్క సౌఖ్యముకొఱ కవసరములైనకట్టుబాట్లను గొన్నింటిని వారు నిర్మించుకొనెదరు. జనులలో నొకరివలన నింకొకరిప్రాణమునకును, సొత్తునకును, మానమునకును, హానికలుగకుండుటయును, జీవయాత్ర సాధ్యమైనంతసౌఖ్యముగ నడచుటయునుమాత్రమే వారేర్పఱచుకొనెడి కట్టుబాట్లయొక్క ముఖ్యమగుప్రయోజనము. అనఁగా వారేర్పఱచుకొనెడి కట్టుబాట్లయొక్క ప్రయోజనము కేవల మీలోకమునకుసంబంధించినదై, సాధ్యమైనంతవఱకు జనులు సౌఖ్యమును బొందుటమాత్రమే యైయున్నది. వారుపలువురుచేరి యేదైననొకకట్టుబా టేర్పఱచుకొనుటకుముందు, "దానివలన లాభముగలుగునా, కాక, నష్టముగలుగునా?" యని చర్చించుకొనెదరు. ఒకరొక్కరేలేచి, యట్టికట్టుబాటుచేఁ గలుగఁబోయెడిలాభములను నష్టములను దమకుఁదోచినంతవఱకు మిగిలినవారికి విని

పించెదరు. అందఱును వినిపించుటయైనతరువాత, నాకట్టుబాటేర్పఱచు టెందఱికిష్టమో, యెందఱికిష్టము లేదో, విచారించికనుఁగొనెదరు. ఎక్కువమంది కదియిష్టమైనయెడల దాని నొకచట్టముగాఁ జేయుదురు; కానియెడలఁ ద్రోఁచిపాఱవేయుదురు. ఇదియే ప్రస్తుతకాలమున మనదేశమందుఁగూడ బ్రిటీషుప్రభుత్వమువారి పరిపాలనమున నేర్పడిన శాసననిర్మాణసభలలోఁ జట్టములనునిర్మించు విధానమైయున్నది. జనులలో నెక్కువమందియొక్కయిష్టమునుబట్టి యొకచట్టమునునిర్మించునపుడు, దానివలనఁ గలుగఁబోవు లాభనష్టముల నూహించుటలో వారొకవేళఁ గొంచెముపొరపడి యాచట్టము నేర్పఱచికొనినప్పటికిని, దానివలన నిజముగాఁగల్గుకష్టసుఖములును, లాభనష్టములును గొలఁది కాలములోనే వారియనుభవమునకువచ్చును. తోడనే వారునలువురును జేరి యవసరమైనచో దానిని రద్దుచేయుటకుఁ దీర్మానించెదరు. అనఁగా నొకకట్టుబాటువలన నష్టములకంటె లాభములేయెక్కువగనుండుననుకొని జనులలో నెక్కువమంది పొరపడి దానినొకశాసనముగావించి రనుకొనుఁడు. ఇంకఁ గొన్నిదినములైనపిదప నప్పటిజనులలో నెక్కువమందికి దానివలనినష్టములును గష్టములునుబొడకట్టి యాశాసనము వారికి రుచింపదనుకొనుఁడు. అపుడాశాసనమును వారుత్రోసివేయవచ్చును. అనఁగా నప్పటివఱకును ధర్మమైనయాచట్ట మానాఁటినుంచియు నధర్మమగును. కాని, మఱికొంతకాలమైనపిదప నింకొకబుద్ధిమంతుఁ డెవఁడైనవచ్చి, యాశాసనముండుటవలననే యెక్కువప్రయోజనమున్నదనియు, నదిలేకపోవుటచే నెక్కువనష్టమున్నదనియుఁ గొంచెముబిగ్గఱగాఁ గొంతెత్తి వాదించెడిపక్షమున నెక్కువమంది యావాదము నేయంగీకరింతురు. అంతట నది మరలఁ జట్టము చేయఁబడును. అనఁగా నప్పటివఱకు నధర్మమైనయాచట్టము తిరిగి యానాఁటినుంచియును బరమధర్మమగును. ఈరీతిగ వారియొక్క ధర్మము లధర్మము లగుచుండును; అధర్మములు ధర్మములగుచుండును. వానికి నిలుకడయుండదు. విదేశీయుల ధర్మనిర్ణయవిధాన మిట్టిదైయున్నది.

ఇట్లు విదేశీయు లేర్పఱచుకొనెడిధర్మములకును నధర్మములకును ముఖ్యప్రయోజనము, లోకవ్యవహారమున జనులకుసాధ్యమైనంత సౌఖ్యముచేకురుటయే యైయున్నది. అట్లే మనవైదికమతధర్మములలోఁగూడ లోకవ్యవహారమునకు సంబంధించినధర్మములు కొన్నిగలవు.వానికి వ్యవహారధర్మములని పేరు. ధర్మశాస్త్రములలో నట్టిధర్మములనుబోధించు భాగములకు వ్యవహారకాండలని పేరు. పై వైదికమతవ్యవహారధర్మములయొక్క ప్రయోజనములలో, జనులకు లోకవ్యవహారసౌకర్యమేర్పడి యందుమూలమున సౌఖ్యముగల్గుట కూడ నొకటియైయున్నది. కాని, యదియొక్కటిమాత్రమే యాధర్మములయొక్క ముఖ్యప్రయోజనమై యందుకొఱకుమాత్రమే యాధర్మము లేర్పడియుండలేదు. అట్టి

లోకవ్యవహారమే పుణ్యపాపములకును నిహపరసౌఖ్యములకును నుత్తమాధమజన్మములకును గూడ హేతువై యుండుటచే, వైదికమతమునందలి యితరధర్మములకువలెనే వ్యవహార ధర్మములకుసహిత మతీంద్రియఫలములగు జన్మాంతరలోకాంతరములతోడను వాని యందుఁగల్గు సుఖదుఃఖములతోడను సంబంధముగలదు. అందువలన వైదికమతమున నితరధర్మములతోఁబాటు వ్యవహారధర్మములుసహిత మతీంద్రియఫలప్రదములగుటచే వానికిఁగూడ యితరధర్మములకువలె వేదమే మూలాధారముగాని, యవి విదేశీయులవ్యవ హారధర్మములవలె పురుషబుద్ధిననుసరించి నిర్మింపఁబడినవికావు. అంతయేల, వైదికమతమున లోకవ్యవహారమును, సంఘమర్యాదలును, నాత్మధర్మములునునన్నియును నొకదానితో నొకటి యవినాభావసంబంధముగలిగి, మోక్షమునకు సాధనములగుజన్మాంతర లోకాంతర సౌఖ్యములను, నుత్తమజన్మములను ప్రధానప్రయోజనముగను, నీలోకసౌఖ్యములను దరువాతిప్రయోజనముగనుగల్గి యన్నియునుగలిసి మతధర్మములను పేరఁ బరగుచున్నవి. కాని, మతముకంటెవేఱగుసంఘమును, సంఘముకంటె వేఱగులోకవ్యవహారమును వైదిక మతమునలేవు. మతమునకు వానియన్నిఁటితోడను సంబంధముగలదు. విదేశీయులం దిట్లుగాక మతధర్మములువేఱు; సంఘధర్మములువేఱు; వ్యవహారధర్మములువేఱు. ఒకదాని తోనొకదానికి సంబంధములేదు. ఇదియే వైదికమతధర్మములకును, వైదికమతముకంటె వేఱగునితరమతధర్మములకును గలముఖ్యభేదము. ఇట్టివ్యత్యాసమును లెస్సగ గ్రహించిన ప్రాజ్ఞుఁడగు 'బర్కు' (Burke)అను నొకవిదేశీయవిద్వాంసుఁ డీ క్రిందిరీతిగఁ జెప్పి యున్నాఁడు:—

"...................in Europe, sometimes, the laws of religion differ from the laws of the land; sometimes, the laws of the land differ from the laws of honour; our laws of honour are full of caprice, differing from those other laws, and sometimes differing from themselves; but there (in Hindus) the laws of religion, the laws of the land and the laws of the honour are all united and consolidated in one invariable system, and bind men by eternal and indissoluble bonds to the rules of what amongst them, is called his *Caste*."

—[The Vedic World, Vol. IV No. 3, 4, & 5, P. 39.]

దీనియర్థమేమనఁగా:—"........యూరపుఖండమున మతధర్మము లొక ప్పుడు దేశధర్మములకంటె భేదముగానుండును. దేశధర్మము లొకప్పుడు గౌరవధర్మముల కంటె (మర్యాదలకంటె) భిన్నములుగానుండును; మనమర్యాదాధర్మములన్ననో క్షణ

క్షణమునకును నిర్హేతుకముగ మార్పునొందుచు నితరధర్మములతో భేదించియుండును; ఒకప్పుడు వానిలోనే యొకదానికొకటి విరుద్ధముగాగూడనుండును. కాని, యచ్చట (ననఁగా వైదికమతసంఘమున) మతధర్మములును, దేశధర్మములును, మర్యాదాధర్మములును నన్నియును నొకటిగాఁజేర్పఁబడి మార్పునకవకాశములేక, యాద్యంతరహితములును, నభేద్యములునునై, వారియొక్కకులధర్మములని వ్యవహరింపఁబడుచుండును."

—("వేదిక్ వరల్డు" అనుపత్రిక, 4-వ సంపుటము, 3,4,5 సంచికలు, 39 వ పుట)

వైదికమతధర్మములకును, దదితరమతధర్మములకును గలయిట్టి తారతమ్యమును గ్రహింపఁజాలని మననవనాగరకు లగుభారతీయులు కొందఱును, వారికిగురువులగు విదేశీయవిద్వాంసులుమఱికొందఱును, విదేశీయులు ధర్మము లేర్పఱచికొనెడివిధముననే పూర్వము మనమహర్షులుగూడ వారికాలమందలి స్థితిగతులనుబట్టి యైహికసౌఖ్యములకుఁ దగినట్లుగఁ గట్టుబాట్లు కొన్నియేర్పఱచుకొని వానికే ధర్మములని పేరుపెట్టి, వానిని జేర్చి ధర్మశాస్త్రములనువ్రాసియుండిరని దురభిప్రాయపడుచున్నారు. ఇందులకుఁగూడ నొకచిన్న కారణముగలదు. ఏమనిన, వైదికమతధర్మములలోని వ్యవహారధర్మములయొక్క ప్రయోజనములలో, లోకవ్యవహారరూపమగు ప్రజాక్షేమముగూడ యొకటియైయుండుటచేఁ, గేవల మట్టిప్రయోజనముకొఱకుమాత్రమే నిర్మింపఁబడిన విదేశీయులధర్మములలోఁ బెక్కులు వైదికమతవ్యవహార ధర్మములందుసహితము గానవచ్చుచున్నవి. ఇందులకుదాహరణముగఁ బరులధనమపహరించుట యధర్మమనియు నట్లొనర్చినవారు శిక్షార్హులనియు విదేశీయుల ధర్మనిర్ణయమై యున్నది. ఇట్టిధర్మము వైదికమతవ్యవహార ధర్మములలోఁ గూడ కలదు. కాని, యట్టిధర్మము విదేశీయులలో నేర్పఱుపఁబడుట లోకవ్యవహారమునఁ గేవలప్రజాక్షేమముకొఱకే. అట్టిధర్మమును, దానికనుగుణ్యమగు రాజశాసనమును, లేనిచోఁ బ్రజలలోఁ బ్రతివాఁడును దనకంటెబలహీనుఁడగు ప్రతివాని యొక్కధనమును హరింపయత్నించుటయు నందుమూలముచేఁబ్రజాపీడన మేర్పడుటయు సంభవించును. అట్టిబాధ నరికట్టుటకే యొకధర్మనిర్ణయమును దానికనుగుణ్యమగు శాసననిర్మాణమును విదేశీయులలో నవసరములైనవి. అధర్మముయొక్కయు, దానినతిక్రమించినవారిని శిక్షించురాజశాసనముయొక్కయుఁ బ్రయోజన మంతవఱకుమాత్రమే. కాని వైదికమతవిషయమునఁ బైవ్యవహారధర్మముయొక్కప్రయోజన మంతమాత్రముతో సరిగాదు. అట్టినేరముచేఁ బ్రజాపీడమాత్రమేగాక యానేరస్థునియొక్క జన్మాంతర సౌఖ్యమునకును మోక్షసాధనమగు నుత్తమగతికినిగూడ భంగమువాటిల్లును. ఆనేరము యొక్కఫలితముగ వాఁడు మరణానంతరమున నరకలోకమున యమబాధ ననుభవించి

పిమ్మట నాపాపఫలానుగుణ్యమగు నధమజన్మము నెత్తవలసియుండును. ఇందులకుదాహరణముగ, నేనేమిదొంగిలించిన నెట్టియెట్టియధమజన్మములుగల్గునో యావివరములు స్కాందమహాపురాణాంతర్గత సూతసంహితయందలి జ్ఞానయోగఖండమునఁ 'బాపకర్మ విధి' (పాపకర్మఫలవిచారము) అనుతొమ్మిదవయధ్యాయమున నైదవశ్లోకము మొదలు తొమ్మిదిపశ్లోకమువఱకును సంగ్రహముగఁ జెప్పఁబడియున్నవి. అట్టి నేరస్థునిఁ బట్టిశిక్షించు రాజశాసనముయొక్క ప్రయోజన మందుమూలమున దొంగలచేఁగల్గుప్రజాపీడను దొలఁగించుటమాత్రమేగాక, యట్టి నేరస్థునికిఁ గల్గుయమదండనమును, నధోగతినిగూడఁ దొలఁగించి యానేరస్థుని నుద్ధరించుటగూడ నైయున్నది. ఇందులకుదాహరణముగ శ్రీ మహాభారతమునందలి యానుశాసనికపర్వమునఁ బంచమాశ్వాసములోని 'యుమామహేశ్వరసంవాదము'న, 'శివుఁడు పార్వతికి వర్ణకర్మపరిపాకంబుల తెఱంగెఱింగించుట' యనుకథలోని యీక్రిందిపద్యమును జూడనగును.

"సీ. జనపతుల్ .......................

.........గాదన్న, నాదేవి, "యపనీశదండితుఁడైననరున

తే. కథముువాయునో, పాయదో!" యనిన, నీశ్వ

రుండు, "నృపదండితుఁడు యమదండమునను

బడఁడు; లేనితప్పున నరుఁబఱిచినతనిఁ

బఱుపకున్నాతనిని యమబాధ వొందు." 113

అందుచే నట్టి నేరస్థులకు ధర్మశాస్త్ర మెట్టిదండనమునువిధించెనో యట్టిదండనము చేతనే యానేరస్థునిబట్టిశిక్షించుట రాజునకుఁ బరమధర్మము. అట్టిశిక్షచేఁ బ్రజాపీడన హేతువగు దొంగలబాధ తొలఁగుటయును, నట్టిదొంగ, యమదండనమునుండియు నధోగతినుండియు సంరక్షింపఁబడుటయునుమాత్రమేగాక, యట్లు ధర్మమార్గమతప్పక దోషులనుశిక్షించిన రాజునకుఁగూడ నందుచే నత్యుత్తమములగుసద్గతులు సంప్రాప్తించును. ఇట్టిదండనీతిప్రభావ మెఱుంగఁగోరువారు శ్రీమహాభారతమునందలి శాంతి పర్వములోని ప్రథమాశ్వాసమునఁ "బారాశర్యుండు సుద్యుమ్నుచరితంబు ధర్మజునకుఁ జెప్పుట" యనుకథారత్నమును జదివిచూడనగును. గ్రంథవిస్తరభీతిచే నాకథ నిచట నెత్తివ్రాయఁజాలక సంగ్రహముగవినిపించుచున్నాము. శంఖుఁడు, లిఖితుఁడు, నను నిరువురన్నదమ్ములగు బ్రాహ్మణులుఁ గలరు. శంఖుఁ డింటలేనియొకతరి లిఖితుఁ డాతని యాశ్రమముఁజొచ్చి యందలిచెట్లపండ్లను గోసికొనిలినఁగా నన్నయగుశంఖుఁడువచ్చి తమ్మునిఁజూచి యీపండ్లెచటివనియడుగఁ దమ్ముఁ డీయాశ్రమములోనివే యనిచెప్పెను "నా యనుమతిలేక నాయాశ్రమములోనిపండ్లుగోయుట దొంగతనము; అందుచే నా

పాపము నిన్నుఁ జెందినది; కావున, రాజగుసుద్యుమ్ను నికడకుఁబోయి, నీచేసిన నేరమెఱిం గించి తగినరాజదండనమునుబొంది పాపమునుబోఁగొట్టుకొనుమ”ని యన్న తమ్మున కుపదేశించెను. ధర్మైకతత్పరుఁడగు నాతమ్ముఁడును వల్లెయని రాజునుజేరి జరిగినసమాచార మెఱింగించి యతనిచే, నుచితరీతిని దండింపఁబడి చేతులునఱకఁబడినవాఁడై తిరిగివచ్చి యన్ననుసందర్శించి జరిగినసంగతి వినిపించెను. తమ్ముని ధర్మాభిమానమున కన్న మిక్కిలి మెచ్చి యాతనినెంతయుఁగొనియాడి యాతనివలన కులమున కనన్యసామాన్య గౌరవము గల్గెనని పొగడి, బాహుదానదియందుస్నానమాడి దేవర్షిపితృతర్పణములు గావించిరమ్మని తమ్మునిఁబంపెను. ఆనదికేగి తమ్ముఁ డందుస్నానమాడినంతనే యన్నయొక్కతపఃప్రభావ మునను దమ్ముని ధర్మతత్పరత్వమువలనను నతనికిఁ దిరిగియెప్పటియట్లు చేతులుపుట్టుకొని వచ్చెను. ఆరాజును నట్టిసుకృతవిశేషమునఁ దనపితృదేవతలతోఁగూడ నుత్తమగతిని జెందెను.

విదేశీయుల వ్యవహారధర్మములవలెఁగాక, వైదికమతవ్యవహారధర్మములవిశేష మిట్టిదైయున్నది. ఇట్లే సత్యముపలుకవలయుననుటయు, నసత్యమాడినవారిని దండింప వలయుననుటయుఁ, నొకరు మఱియొకరికిఁ బ్రాణహానిగావింపరాదనుటయు, నట్లుగావిం చినవారు దండనార్హులనుటయు, నొకరికొకరు మానహానినిగావింపరాదనుటయు, నట్లు మానభంగముగావించినవారిని బట్టిశిక్షింపవలయుననుటయు, నీమొదలగు విదేశీయుల వ్యవహారధర్మములుకొన్ని మనవైదికమత వ్యవహారధర్మములలోఁగూడ గానవచ్చు చున్నవి. అందుచేఁ గేవలైహికసుఖమే ముఖ్యప్రయోజనముగా గలవిదేశీయవ్యవహార ధర్మములకును, నాముష్మికసుఖమే ప్రధానప్రయోజనముగను నైహికసుఖము దానితరు వాతదిగను గల్గినవైదికమతవ్యవహారధర్మములకును గలతారతమ్యమును గ్రహింపఁజాలక, నవనాగరకులుకొందఱు, వైదికమతధర్మములన్నియుఁగూడఁ విదేశీయవ్యవహారధర్మముల వలెనే లోకమందలి ప్రజాసౌఖ్యమునే ప్రధానప్రయోజనముగాఁగల్గి పూర్వకాలమం దలి ప్రజలయిష్టానుసారము నిర్మింపఁబడినకట్టుబాట్లుమాత్రమే యనియు, వానియందు జనులకుభక్తిశ్రద్ధలును విశ్వాసమునుగుదురుటకై యట్టిధర్మాధర్మములచే బుణ్యపాపము లనుఫలములుగల్గునని ధర్మశాస్త్రములం దొకకల్పననుగావించి పూర్వులువ్రాసిరనియు, దురభిప్రాయపడుచున్నారు. కాని మనవైదికమతధర్మము లేర్పడినవిధాన మట్టిదెంత మాత్రమునుగానేకాదని యీప్రకరణముయొక్క మొదటిలోనే, “స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పు?” నను శీర్షికక్రిందను, “స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్ర లందుఁ జెప్పఁబడినవిషయములకుఁ బ్రమాణము” లనుశీర్షికక్రిందను, మనము బాగుగఁ దెలిసికొనియుంటిమిగదా!

మనధర్మములవిషయమునను, ధర్మశాస్త్రములవిషయమునను, నవనాగరకులు వైరిలిగ దురభిప్రాయపడుటకు మఱియొకకారణముగూడ గలదు. ఏమనఁగా: మన ధర్మశాస్త్రసంబంధ మగువిషయములను దెలుపునట్టి మనమతగ్రంథములను నవనాగరకులు చదివికొనియుండలేదు. పైగా, వానివిషయమై విపరీతపుసంగతులను విదేశీయులు వ్రాయఁగా వానినిమాత్రమే చిన్నతనమునఁజదివికొనిరి. అందువలన వారిలోఁగొందఱు పెద్దవారైనపిమ్మట మనమతగ్రంథములందలి విషయములను గొంచెము చదివిచూచినప్పటికిని వానిని నమ్మఁజాలకున్నారు. అంతేగాక, వానివిషయమున వారికిఁ బెక్కుసంశయములు గల్గుచున్నవి. అట్టిసంశయములకుఁ గారణమేమనఁగా నవీనచరిత్రలందలివిషయములు నేర్చికొనినపుడు వారికిఁ జిన్నతనమగుటచే నవిబాగుగ మనస్సులకుఁబట్టి పాదుకొనిపోయినవి; ఆప్రాయమున వారికి యోజనాశక్తి మిక్కిలితక్కువగానుండును. అందుచే, నాచరిత్రలనువ్రాసినవా రెవరనికాని, వారావిషయములను స్వయముగాఁ జూచిరా, లేదా, యనికాని, యైనచో వారావిషయముల నెట్టియాధారముచేఁ దెలిసికొనిరనికాని, బాల్యమున మననవనాగరకు లాలోచింపఁజాలియుండరు. ఆవయసున నుపాధ్యాయులుచెప్పెడివిషయములను జెప్పినట్లే నేర్చికొనియుందురు. అందుచే నావిషయములందు వారికేమియుఁ సంశయములుండవు. ఆదేరీతిగఁ బూర్వకాలమున మన పూర్వులకుఁగూడ బాల్యముననే మనమతగ్రంథములను నేర్చుచుండెడియాచార ముండెడిది. ఆయాచార మున్నంతకాలమును మనదేశీయులకు మనమతగ్రంథములవిషయమునను, శాస్త్రసంబంధములైన మనపూర్వులమతాచారములవిషయమునను నేవిధమైన సంశయముగాని, యవిశ్వాసముగాని యుండెడిది కాదు. ఇప్పటిమననవనాగరకుల కుటుంబములందుఁగూడ జీవించియున్నముసలివారగు పురుషులును స్త్రీలును మనమతాచారముల విషయమున మిక్కిలిభక్తిశ్రద్ధలతోఁ బెనగులాడుచుండుట మనలోఁగొందఱు చూచియేయుందురు. వారిలోమాత్రమే యిట్టిభక్తిశ్రద్ధలు గనుపడుటకును, మననవనాగరకులందుఁ గనఁబడకపోవుటకునుగారణము పైనవ్రాయఁబడినరీతిగ వారివారికి బాల్యములందు నేర్పఁబడినవేఱువేఱువిధములగు విద్యావిషయములేగాని యితరమేమియును గాదు. కాఁబట్టి మన దేశీయులందఱికిని మనమతాచారములవిషయమున సత్యమగుజ్ఞానమును, వానియందు విశ్వాసమును, భక్తిశ్రద్ధలునుగలిగి, తిరిగి మనమతము బాగుపడవలయునని మనము కోరెడిపక్షమున, నికమీఁదనైనను మనము మనబాలురకు నవీనచరిత్రలు నేర్పించుట మానివైచి, మనమతగ్రంథములను నేర్పింపవలయును. అట్లునేర్పించుటచే, వారికి మన పూర్వులవలెనే మతమునందు మంచియభిమానమును భక్తిశ్రద్ధలును గలుగుటమాత్రమే గాక, ప్రపంచముయొక్క చరిత్రసంబంధమగుజ్ఞానమును, భాషాజ్ఞానమునుగూడగల్గి యిహపరసాధన మేర్పడును.

ఇఁకఁ బైనఁ దెల్పిన కారణముచే మననవనాగరకులకు మనధర్మశాస్త్రముల విషయమున నేర్పడిన సంశయములనుగూర్చి విచారింతము.

## ధర్మశాస్త్రములపై నవనాగరకులకుఁగల సంశయములు; వానికి సమాధానములు.

### ధర్మశాస్త్రములను గాలానుసారముగ మార్చికొనరాదా ?

“ధర్మశాస్త్రములను ప్రస్తుతకాలమందలి పరిస్థితులనుబట్టి వానికిఁదగినట్లుగా మార్చికొనరాదా ?” యని మన నవనాగరకులలోఁ గొందఱు వాదించుచున్నారు. వీరిట్లు వాదింపవలసినయవసర మేలగల్గినదనఁగా:—నిదివఱలోఁ జెప్పినట్లు వీరికి విదేశీయులభాషతోడను, నాగరకతతోడను గల్గినసంపర్కముచేతను, మనమతాచారములందలి ప్రయోజనములు వీరికిఁ బ్రత్యక్షముగాఁగనుపడునవి కాకపోవుటచేతను వీరికి మనయాచారములం దసూయగల్గినది. కేవల మిహలోకసౌఖ్యమే ప్రధానముగానేర్పఱుపఁబడిన విదేశీయుల యాచారములందు వీరి కభిరుచియేర్పడినది. అందుచే వీరుక్రమముగా మనయాచారవ్యవహారములను మానివేసి విదేశీయాచారములను సాధ్యమైనంత వఱకు నలవాటుచేసికొనిరి. కాని మనమతాచారములందే యభిమానముతోను భక్తిశ్రద్ధలతోను నడచికొనెడి పూర్వాచారపరాయణు లగుపెద్దలు పైనవనాగరకుల బంధువులలోను గుటుంబములలోనుగూడఁ గొందఱుగలరు. అట్టివారితో మననవనాగరకులకుఁ గలసంబంధము వారు స్వేచ్ఛగా విదేశీయులవలె నడచుకొనుటకుఁ గొంత యాటంకముగ నుండెను. అందుచే వారు తమపెద్దలచేఁగూడ వారి పూర్వాచారములను మానిపింపవలయునని యత్నింపసాగిరి. ఇట్టియత్నము లెన్నివిధములుగఁ బయలువెడలినవో, వానిచే నెట్టియెట్టిఫలములుగల్గినవో యావిషయము లీగ్రంథమునందే, “నవీనచరిత్ర లెట్లుపరిణమించినవి?” యను నేడవప్రకరణమున విపులముగాఁదెలుపబడును. కాని, వీరికిఁ బూర్వాచారములం దెంతద్వేషముగలదో వీరిపెద్దలకు వానియం దంతటి యభిమానముండుటచే వారు తమయాచారములను వదలిపెట్టరైరి. అందుచే నాయాచారము లీకాలపుపరిస్థితులకు ననుకూలముగలేవనియుఁ, బూర్వకాలమున నప్పటివారి యుపయోగమునకై యాకాలపుపరిస్థితులననుసరించి యవి వారేర్పఱచుకొనినవగుటచే మనకీకాలమున వానితోఁబనిలేదనియు, నిప్పటికాలముననుసరించి మనవీలునుబట్టి మన మాయాచారములను మార్చుకొనవలయుననియు, నవనాగరకు లెన్నిరీతులనో వాదింప మొదలుపెట్టిరి. ఇదివఱలోఁ జెప్పినట్లు మనవేదశాస్త్రములవిషయమున వారికిఁగల యూహలుకూడ వారివాదమున కనుకూలపడుచుండెను. కాని, వానివిషయమునఁ

మనధర్మములవిషయమునను, ధర్మశాస్త్రములవిషయమునను, నవనాగరకులు వైరీతిగ దురభిప్రాయపడుటకు మఱియొక కారణముఁగూడ గలదు. ఏమనఁగా: మన ధర్మశాస్త్రసంబంధ మగువిషయములను దెలుపునట్టి మనమతగ్రంథములను నవనాగరకులు చదివికొనియుండలేదు. పైగా, వానివిషయమై విపరీతపుసంగతులను విదేశీయులు వ్రాయఁగా వానినిమాత్రమే చిన్నతనమునఁజదివికొనిరి. అందువలన వారిలోఁగొందఱు పెద్దవారైనపిమ్మట మనమతగ్రంథములందలి విషయములను గొంచెము చదివిచూచినప్పటికిని వానిని నమ్మఁజాలకున్నారు. అంతేగాక, వానివిషయమున వారికిఁ బెక్కుసంశయములు గల్గుచున్నవి. అట్టిసంశయములకుఁ గారణమేమనఁగా నవీనచరిత్రలందలివిషయములు నేర్చికొనినపుడు వారికిఁ జిన్నతనమగుటచే నవిబాగుగ మనస్సులకుఁబట్టి పాదుకొనిపోయినవి; ఆప్రాయమున వారికి యోజనాశక్తి మిక్కిలితక్కువగానుండును. అందుచే, నాచరిత్రలనువ్రాసినవా రెవరని కాని, వారావిషయములను స్వయముగాఁ జూచిరా, లేదా, యని కాని, యైనచో వారావిషయముల నెట్టియాధారముచేఁ దెలిసికొనిరని కాని, బాల్యమున మననవనాగరకు లాలోచింపఁజాలియుండరు. ఆవయసున నుపాధ్యాయులు చెప్పెడివిషయములను జెప్పినట్లే నేర్చికొనియుందురు. అందుచే నావిషయములందు వారికేమియుఁ సంశయములుండవు. ఆదేరీతిగఁ బూర్వకాలమున మన పూర్వులకుఁగూడ బాల్యమననే మనమతగ్రంథములను నేర్చుచుండెడియాచార ముండెడిది. ఆయాచార మున్నంతకాలము మనదేశీయులకు మనమతగ్రంథములవిషయమునను, శాస్త్రసంబంధములైన మనపూర్వులమతాచారములవిషయమునను నేవిధమైన సంశయము గాని, యవిశ్వాసము గాని, యుండెడిది కాదు. ఇప్పటిమననవనాగరకుల కుటుంబములందుఁగూడ జీవించియున్న ముసలివారగు పురుషులును స్త్రీలును మనమతాచారముల విషయమున మిక్కిలిభక్తిశ్రద్ధలతోఁ బెనగులాడుచుండుట మనలోఁగొందఱు చూచియేయుందురు. వారిలోమాత్రమే యిట్టిభక్తిశ్రద్ధలు గనుపడుటకును, మననవనాగరకులందుఁ గనఁబడకపోవుటకును గారణము పైనవ్రాయఁబడినరీతిగ వారివారికి బాల్యములందు నేర్పఁబడిన వేఱువేఱువిధములగు విద్యావిషయములేగాని యితరమేమియుండును గాదు. కాఁబట్టి మన దేశీయులందఱికిని మనమతాచారములవిషయమున సత్యమగుజ్ఞానమును, వానియందు విశ్వాసమును, భక్తిశ్రద్ధలునుగలిగి, తిరిగి మనమతము బాగుపడవలయునని మనము కోరెడిపక్షమున, నిఁకమీఁదనైనను మనము మనబాలురకు నవీనచరిత్రలు నేర్పించుట మానివైచి, మనమతగ్రంథములను నేర్పింపవలయును. అట్లునేర్పించుటచే, వారికి మన పూర్వులవలెనే మతమునందు మంచియభిమానమును భక్తిశ్రద్ధలును గలుగుటమాత్రమే గాక, ప్రపంచముయొక్క చరిత్రసంబంధమగుజ్ఞానమును, భాషాజ్ఞానమునుగూడగల్గి యిహపరసాధన మేర్పడును.

ఇఁకఁ బైన దెల్పిన కారణముచే మననవనాగరకులకు మనధర్మశాస్త్రముల విషయమున నేర్పడిన సంశయములను గూర్చి విచారింతము.

## ధర్మశాస్త్రములపై నవనాగరకులకుఁగల సంశయములు; వానికి సమాధానములు.

### ధర్మశాస్త్రములను గాలానుసారముగ మార్చికొనరాదా?

“ధర్మశాస్త్రములను బ్రస్తుతకాలమందలి పరిస్థితులనుబట్టి వానికిఁదగినట్లుగా మార్చికొనరాదా?” యని మన నవనాగరకులలోఁ గొందఱు వాదించుచున్నారు. వీరిట్లు వాదింపవలసినయవసర మేలగల్గినదనఁగా:—నిదివఱలోఁ జెప్పినట్లు వీరికి విదేశీయులభాషతోడను, నాగరకతతోడను గల్గినసంపర్కముచేతను, మనమతాచారములందలి ప్రయోజనములు వీరికిఁ బ్రత్యక్షముగాఁగనుపడునవి కాకపోవుటచేతను వీరికి మనయాచారములం దసూయగల్గినది. కేవల మిహలోకసౌఖ్యమే ప్రధానముగా నేర్పఱుపఁబడిన విదేశీయుల యాచారములందు వీరి కభిరుచియేర్పడినది. అందుచే వీరుక్రమముగా మనయాచారవ్యవహారములను మానివేసి విదేశీయాచారములను సాధ్యమైనంతవఱకు నలవాటుచేసికొనిరి. కాని మనమతాచారములందే యభిమానముతోను భక్తిశ్రద్ధలతోను నడచికొనెడి పూర్వాచారపరాయణు లగుపెద్దలు పైనవనాగరకుల బంధువులలోను గుటుంబములలోనుగూడఁ గొందఱుగలరు. అట్టివారితో మననవనాగరకులకుఁ గలసంబంధము వారు స్వేచ్ఛగా విదేశీయులవలె నడచుకొనుటకుఁ గొంత యాటంకముగ నుండెను. అందుచే వారు తమపెద్దలచేఁగూడ వారి పూర్వాచారములను మానిపింపవలయునని యత్నింపసాగిరి. ఇట్టియత్నము లెన్నివిధములుగఁ బయలువెడలినవో, వానిచే నెట్టియెట్టిఫలములుగల్గినవో యావిషయము లీగ్రంథమునందే, “నవీనచరిత్ర లెట్లుపరిణమించినవి?” యనునేడవప్రకరణమున విపులముగాఁదెలుపఁబడును. కాని, వీరికిఁ బూర్వాచారములం దెంతద్వేషముగలదో వీరిపెద్దలకు వానియం దంతటి యభిమానముండుటచే వారు తమయాచారములను వదలిపెట్టరైరి. అందుచే నాయాచారము లీకాలపుపరిస్థితులకు ననుకూలముగ లేవనియుఁ, బూర్వకాలమున నప్పటివారి యుపయోగమునకై యాకాలపుపరిస్థితులననుసరించి యవి వారేర్పఱచుకొనినవగుటచే మనకీకాలమున వానితోఁబనిలేదనియు, నిప్పటికాలముననుసరించి మనవీలునుబట్టి మన మాయాచారములను మార్చుకొనవలయుననియు, నవనాగరకు లెన్నిరీతులనో వాదింప మొదలుపెట్టిరి. ఇదివఱలోఁ జెప్పినట్లు మనవేదశాస్త్రములవిషయమున వారికిఁగల యూహలుకూడ వారివాదమున కనుకూలపడుచుండెను. కాని, వానివిషయమునఁ

బూర్వాచారపరాయణులకుఁ గలయభిప్రాయములు వేఱుగనుండుటచే వారు నవనాగరకులవాదమున క్లిష్టపడఁజాలకున్నారు. అందుచే నిరువురకును నొకరిపైనొకరికిఁ గల ప్రేమపోయి, ద్వేషములుపుట్టి యైకమత్యతకు భంగముగల్గుచున్నది. ఇందులకుమూలము విదేశీయులును స్వదేశీయులును వ్రాసిన నవీనచరిత్రలేగదా !

కాఁబట్టి ధర్మశాస్త్రములను మార్చికొనవలయుననుటకు ముందుగ నవియేర్పడిన విధానమును, వానియుద్దేశ్యమునుగుఱించి బాగుగఁదెలిసికొనుట యవసరము. అట్టి విషయ మిదివఱకే కొంత తెలిసికొనియున్నాము. కాఁబట్టి యిఁక ధర్మశాస్త్రములను మార్చికొనవలయుననుటకు నవనాగరకులుచెప్పెడి యాధారమునుగుఱించి తెలిసికొందము.

ధర్మశాస్త్రములనుగుఱించి మనశాస్త్రగ్రంథములలో:—

"శ్లో. కృతేతు మానవాః ప్రోక్తా, స్త్రేతాయాం గౌతమాస్మృతాః,
ద్వాపరే శంఖలిఖితాః, కలౌ పారాశరాస్మృతాః."

అని చెప్పఁబడియున్నది. దీనియర్థమేమనఁగా:—కొన్ని వేలయేండ్లకాలమునకు యుగమని పేరు. అట్టియుగములనుగూర్చి ముందుముందీగ్రంథమందు "సృష్టియెప్పుడు జరిగిన"దను నాల్గవప్రకరణమున విపులముగఁదెలుపఁబడును. ఆయుగములలో: కృతయుగమును, త్రేతాయుగము, ద్వాపరయుగమును, గలియుగము నని నాల్గువిధములు గలవు. అందులో మొదటిదగుకృతయుగకాలమున నుపయోగపడుటకుగాను మనువను మహర్షి యొకస్మృతినివ్రాసియుండెను. అట్లే త్రేతాయుగమందలి జనులయుపయోగము కొఱకు గౌతమమహర్షియును, ద్వాపరయుగమున నుపయోగించుటకు శంఖుఁడు, లిఖితుఁడు నను నిద్దఱుమహర్షులును, గలియుగమున నుపయోగపడుటకుఁ బరాశరమహర్షియును వేఱువేఱుగ ధర్మశాస్త్రములను వ్రాసియున్నారు.

యుగములు గడచిపోయినకొలఁదిని జనులయొక్క యాయువులును, శరీరబలములును, మనోబలములును గ్రమక్రమముగఁ దగ్గుచుండుట సహజమైయున్నది. ఇప్పటికి రెండుమూఁడుతరములక్రిందట మనపూర్వీకులకున్న శరీరదార్ఢ్యముతోడ మనశరీరదార్ఢ్యములను బోల్చిచూచినచో నెంతయో భేదము గన్పడుచుండును. ఇంతకొద్దికాలము గడచునరికే యిట్టిభేదము గనుపడుచుండఁగా ననేకవేలసంవత్సరములు గడచినవెంతభేదమేర్పడవచ్చునో యూహింపుఁడు. అందుచే నొకయుగమందలిజను లాచరింపఁగలధర్మములన్నియుం దానితరువాత వచ్చుయుగమునందలిజను లాచరింపఁజాలియుండరు. కాఁబట్టి యుగభేదమునుబట్టి ధర్మములభేదముగూడ యేర్పడును. తగినసామర్థ్యముండియును జేయఁదగినధర్మమును మానినయెడల దోషమువచ్చునుగాని, శక్తిచాలకమాని

నపుడు దోషమురాదు. అందుచేఁ గృతయుగమందలి శక్తిసామర్థ్యములు కలియుగమున జనులకు లేనపుడు వారాధర్మము లాచరింపకుండుట దోసముగాదు. కలియుగమందలి స్వల్పమగుపుణ్యకార్యములచేఁ గల్గెడిఫలము, కృతయుగము మొదలగువానియందుఁ జేయఁబడిన కష్టసాధ్యములగు గొప్పకార్యములచేఁగల్గు పుణ్యఫలములతో సమానమని యీక్రిందిరీతిగఁ జెప్పియున్నారు:—

"శ్లో. ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞై స్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్,

యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్."

అనఁగాఁ గృతయుగమున ధ్యానముచేయుటచేతను, త్రేతాయుగమునందు యజ్ఞయాగాదులుచేయుటచేతను, ద్వాపరమునఁ బూజాపునస్కారములు చేయుటచేతను నెట్టిఫలముగల్గునో యట్టిఫలము కలియుగమునఁ గేశవునిఁగీర్తించుటచేతనే గల్గునని యర్థము. కలియుగమున స్వల్పశ్రమవలననే యధికమగుఫలములు గల్గుననుసంగతియే శ్రీవిష్ణుపురాణమునఁగూడ వ్యాసమహర్షిచేఁ దక్కినఋషులకుఁ జెప్పఁబడిన "కలిస్సాధు, శూద్రస్సాధు, స్త్రీయస్సాధు," అనుసమాధానముతోఁ గూడినకథయందుఁ గూడఁ జెప్పఁబడియున్నది. ఈసంగతియే కలియుగమందలి గుణవిశేషణముగ నెన్నఁబడి కలిపురుషుని శాసించుసందర్భమునఁ బరీక్షిత్తనుమహారాజుచే భాగవతపురాణమున నీక్రిందిరీతిని వర్ణింపఁబడియున్నది:—

"క. శుభచరితుఁడు హరి యరిగినఁ, బ్రభవించి ధరిత్రినెల్లఁ బ్రబ్బియుఁ గలి దా

నభిమన్యుసుతునివేళను, బ్రభవింపకయడఁగియుండె భార్గవముఖ్యా! 440

వ. ఇవ్విధంబునఁ జతుస్సముద్రముద్రితాఖిల మహీమండలప్రాజ్యసామ్రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయుచు, నాయభిమన్యుసంభవుండు: 441

ఉ. "చేసినఁగాని పాపములు సెందవు చేయఁదలంచినంతటం;

జేసెదనన్నమాత్రమునఁ జెందుఁగదా! కలివేళఁబుణ్యముల్;

మోసములే"దటంచు నృపముఖ్యుఁడు గాచెఁ గలిన్, మరందము

ల్లాసముతోడఁ గ్రోలి విరులం దెగఁజూడని తేఁటికైవడిన్." 442

"వ. మఱియుం బ్రమత్తులై యధీరులగునరులయందు వృకంబుచందంబున నొదిఁగి లాఁచుకొనియుండి చేష్టించుంగాని ధీరులైనవారికిం గలివలని భయంబులే"దని కలి నంతంబునొందింపఁడయ్యె......" 443

(శ్రీమదాంధ్రభాగవతము, ప్రథమస్కంధము.)

కృతయుగము మొదలగువానియందు జనులకుఁగల మనస్స్థైర్యమును, దపశ్శక్తియును నీయుగమందలిజనులలో నుండఁజాలవు. అందుచేఁ గృతయుగమందలివా రాచ

రించినగొప్పకార్యములను గలియుగమందలిజను లాచరింపఁజాలరు. కావునఁ బైప్రమాణములవలన యుగభేదముననుసరించి ధర్మములందలి ఫలవిశేషముగూడ మారుచుండునని స్పష్టమగుచున్నది. అందుచేతనే యాయాయుగములందలి ప్రజలశక్తిసామర్థ్యముల కనుగుణ్యముగను, వేదధర్మములకు విరుద్ధముగాకయుండునట్లుగను దగినరీతిగ మనువు మొదలగుమహర్షులు ధర్మములను నిర్ణయించి వేఱువేఱుధర్మశాస్త్రములను వ్రాసియున్నారని మనశాస్త్రగ్రంథములందుఁ జెప్పఁబడియున్నది. ఈయవకాశము నాధారముచేసికొని నవనాగరకు లీకాలమునఁగూడ మనధర్మశాస్త్రములను గాలానుసారముగఁ దిరిగి మార్చి వ్రాయవలయునని వాదించుచున్నారు.

కాలభేదముననుసరించి ధర్మములు మారఁదగుననువిషయమునను, నిదివఱకుఁగూడ యుగభేదములననుసరించి ధర్మములు మారుచునేయున్నవనువిషయమునను, నవనాగరకులవాదము మన మంగీకరింపఁదగినదే. కాని, యవి యేవిధముగ మారఁదగుననువిషయమునను, దేని నాధారముగఁదీసికొని వానిని మనము మార్పవలయు నను విషయమునను మాత్రమే నవనాగరకులు దురభిప్రాయపడుచున్నారు. ప్రజలలో నధికసంఖ్యాకుల యొక్క (యెక్కువమందియొక్క) యభిరుచిననుసరించియే ధర్మములు మారఁదగునని వారితలంపు; ఏలనన, నిదివఱలోఁగూడ ధర్మము లెల్లపుడును నావిధముగనే యేర్పఱుపఁబడినవని వారు నవీనచరిత్రలవలన నూహించియుండిరి. విదేశీయులు ప్రభుత్వశాసనములను నిర్మించుకొనువిధానముగూడ యట్టిరీతిగనే యుండుటను మననవనాగరకులు స్వయముగాఁ జూచుచున్నారు. అందుచే నన్నివిధములను దమయూహ సరియైనదేయని వా రభిప్రాయపడుచున్నారు. కాని, సరిగా నాలోచింపఁగను, మన ప్రాచీనచరిత్రలను బట్టిచూడఁగను వారియూహ పట్టితప్పు. ఎట్లనఁగా:—ధర్మము లొకప్పుడునుగూడ పైరీతిగ నేర్పడినట్లు ప్రాచీనచరిత్రకారులగు పండితు లెవ్వరునుగూడ వ్రాసియుండలేదు. పైపెచ్చు వా రేమివ్రాసిరనఁగా, ధర్మాధర్మములనునవి కేవల మిహలోకమందలి ఫలములనుమాత్రమే యిచ్చునవిగాక, జీవితాంతమునఁ బరలోకమందలి ఫలమునుగూడ నిచ్చునవియై రాఁబోవుజన్మములందలి సుఖదుఃఖములకు హేతువు లగుచున్నవనియు, నందుచేఁ బరలోకములందును, రాఁబోవు జన్మములందును నెట్టిధర్మముచే నెట్టిసుఖము గల్గునో, యెట్టియధర్మముచే నెట్టిదుఃఖముగల్గునో యాసంగతి యూహించి తెలిసికొనుట కెంతటి తెలివిగలవానికిని గూడ సాధ్యముగాదు గావున ధర్మాధర్మము లతీంద్రియవిషయములనియు, నందుచే వానిని సర్వజ్ఞుఁడగు పరమేశ్వరుఁడుతప్ప యితరులగుప్రజలెవ్వరును నూహించి తెలిసికొనఁజాలరనియు, నట్టిపరమేశ్వరుఁడే యాధర్మములను నధర్మములను నన్నిఁటిని, దాను సృజించిన ప్రజలయొక్క యుపయోగముకొఱకై వేదము

ద్వారా తెలియపఱిచెననియుఁ, గావున వేదము నాధారముగఁగొనియే తాను తనధర్మ శాస్త్రమును వ్రాయుచుంటిననియుఁ, బ్రతి ధర్మశాస్త్రకర్తయును వ్రాసియున్నాఁడు. ఇందులకుఁ బ్రమాణముల నిదివఱకేఁ జూపియేయుంటిమిగదా! కాఁబట్టి యుగభేదము ననుసరించి వేఱువేఱుధర్మశాస్త్రములను మహర్షులు నిర్మించియున్నప్పటికిని, వారు వేదమును బాగుగ నెఱిఁగినవారై, దాని నాధారముగఁబెట్టుకొని, యాయాయుగములందుఁ బుట్టఁబోవు ప్రజలశక్తిసామర్థ్యములను దృష్టిలోనుంచుకొని, వానికనుగుణ్యముగను, వేదధర్మములకు విరుద్ధముగాకయుండునటులగను ధర్మశాస్త్రములను వేఱువేఱుకాలముల కొఱకు వేఱువేఱుగ నిర్మించియుండిరి. అట్లే, యీకలియుగమునకుఁ దగినట్లుకూడ యొకధర్మశాస్త్రమును బరాశరమహర్షి యిదివఱలో నిర్మించియేయున్నారు. అది విద్వన్మాన్యమై యలరారుచునేయున్నది. ఇఁక నిపుడు మనము వేఱుగ ధర్మములను నిర్మించుకొనవలసిన కర్మమేమివచ్చినది? ఏమియునులేదు! కావుననే నవనాగరకులు ధర్మశాస్త్రములను గాలానుసారముగ మార్పవలయునని వేగిరపడుచుండఁగా, నది యవసరములేదని పూర్వాచారపరాయణు లడ్డుచెప్పుచున్నారు.

పూర్వాచారపరాయణు లడ్డుచెప్పుటకు మఱియొకకారణ మేమనఁగా:— వారొకవేళఁ గాలానుసారముగ ధర్మములనుమార్చుట కంగీకరించినను, నవనాగరకులు వాని నేవిధముగ మార్చెదరు? వెనుకటిమహర్షులు మార్చినట్లే వేదముననుసరించి మార్చెదరా? అట్లు మార్చెడియెడల నది పనిలేనివానిపనియగును! ఏమనఁగాఁ గాలానుసారముగఁ బ్రజలయొక్క శక్తిసామర్థ్యములకుఁ దగియుండునట్లుగను, వేదమందలి ధర్మములకు విరుద్ధముగాకయుండునట్లుగను నిదివఱకే మహర్షులు మనకొఱకు ధర్మములను మార్చి పెట్టియుండఁగా, వీరు తిరిగి యావిధముగనే వానిని మార్పఁజూచుట యెందులకు? మహర్షు లిప్పటికి జాలాకాలముక్రిందట నెప్పుడో ధర్మశాస్త్రముల నేర్పఱచియుండుటచే నిప్పటికాలపుపరిస్థితుల నెఱుగుట యప్పటిమహర్షులకు సాధ్యముకాఁజాలియుండదనియుఁ, నందుచే వారురచించిన ధర్మశాస్త్రములలో నొకటియగు పరాశరస్మృతి కలియుగముకొఱ కేర్పడినదని చెప్పఁబడినను నది యిప్పటిపరిస్థితుల కనుకూలింపదనియుఁ నవనాగరకులు సమాధానము చెప్పవత్తురుకాఁబోలును. కాని, మహర్షులు త్రికాలజ్ఞానముకలవారనియుఁ, దానిసామర్థ్యముచే రాఁబోవుయుగములందలి సంగతులనుగూడ ముందుగనే గ్రహింపఁగలసామర్థ్యముగలవారనియు, నట్టిశక్తి వారికిఁ దపస్సుచేఁ గలిగినదనియుఁ నీ మొదలగుమహర్షులయొక్క శక్తిసామర్థ్యముల నీగ్రంథమునందలి మొదటిప్రకరణమునఁ "బ్రాచీనచరిత్రకారులు"ను, 'బ్రాచీనచరిత్రకారుల గుణసంపద యొడఁగల సంశయములు; వానికి సమాధానములు"ను నను శీర్షికలక్రింద వివిపించియే

యున్నాము. దానికిఁదోఁడుగ నపౌరుషేయమగు వేదమునందుసహితము ప్రపంచము నకు సంబంధించిన మూఁడుకాలములందలి (అనఁగాఁ జరిగిపోయినట్టియుఁ, జరుగుచు న్నట్టియు, జరుగఁబోవునట్టియు) ముఖ్యవిషయములు గలవనికూడ యీప్రకరణముననే, "వేదమునుగుఱించి ప్రాచీనచరిత్రలందలి సారాంశము"ను శీర్షికక్రింద వినిపించి యున్నాము. మఱియును మహర్షులకట్టి త్రికాలజ్ఞానము కలదనుటకు దృష్టాంత ముగ, వేదవ్యాసమహర్షి తనయొక్క 'యతీతానాగతవర్తమానజ్ఞాన' బలముచేతనే ద్వాపరయుగాంతమున (అనఁగా, నీకలియుగమందు) 'బురుషులు నిస్సత్త్వులు, ధైర్యశూన్యులు, మందప్రజ్ఞులు, నల్పాయువులు, దుర్బలురు, నయ్యెద'రని తన దివ్య దృష్టింజూచి,' యట్టి వారిమేలుకొఱకే యేకంబగు వేదంబును నాల్గుభాగములుగ విడ దీసిన వృత్తాంతమునుగూడ యీ గ్రంథమందలి మొదటిప్రకరణమున, "వేదమపౌరు షేయమని చెప్పిన ప్రామాణికులకుఁగల గౌరవాతిశయము"ను శీర్షికక్రింద వినిపించి యుంటిమి. అంతియగాక మనప్రాచీనచరిత్రలగు పురాణేతిహాసాదులందును ధర్మశాస్త్ర ములందును సందర్భానుసారముగ వర్ణింపఁబడియున్న భవిష్యత్కాలసంబంధములగు (అనఁగా నిప్పటికలియుగమునకుఁగూడ సంబంధించిన) కొన్నికొన్ని ముఖ్యవిషయము లను నెమ్మదిగ నిష్పక్షపాతబుద్ధితోఁ బరిశీలించినచో, లోకానుభవముగలవారికి యీ వర్ణనలందలి విషయములన్నియు సత్యములేయని స్ఫురింపకపోదు. కావున నెట్లాలో చించినను నిప్పటికాలఁపుజనులయొక్క శక్తిసామర్థ్యములను, నీకాలఁపుపరిస్థితులనుగూడ ముందుగనే తెలిసికొనుటలో మహర్షులకుఁగల త్రికాలజ్ఞానమున నావంతయైనఁ గొఱఁ తయున్నట్లూహింప నవకాశములేదు. అందుచే నట్టిమహర్షులలో నొకరగు పరాశర మహర్షియంతటి వేదశాస్త్రవిశారదుఁడు, వేదధర్మముల నొకవంకను, నీకలియుగ మందలి జనుల శక్తిసామర్థ్యముల నింకొకవంకను, దృష్టిలోనిడికొని, యొకదానికొకటి విరుద్ధము కాకుండునట్టిరీతిని వ్రాసినధర్మశాస్త్రము (పరాశరస్మృతి) యీకాలఁపుపరిస్థితుల కనుకూలింపదనితలంచుట యుక్తియుక్తము కాఁజాలదు.

ఐనచో నీక ధర్మశాస్త్రముల నిప్పటికాలమున కనుకూలముగ మార్చవలయు ననుటకు నవనాగరికులు చెప్పెడి హేతువేమన, మహర్షులు వేదముననుసరించి సరిగా మార్చఁజాలకపోయిరనియుఁ, గావునఁ దామాపనినిజేయఁ బూనుచుంటిమనియుఁ జెప్ప వత్తురు కాఁబోలును! అది పట్టికల్ల. అట్లు చెప్పువారు నవనాగరికులలో నంతగా నెవరును గానవచ్చుటలేదు. ఏలననఁగా, వేద మపౌరుషేయముగాదనియు, మహర్షులు వ్రాసినదే యనియుఁ నొకచెంప వారు వాదించుచు, దానిని వ్రాసినవారికే దానియర్థము తెలియదను టెట్లుపొసగును? అంతియగాక వేదమును గుఱించియు, శాస్త్రమును గుఱించియుఁ దమ

కేమియుఁ దెలియదనుసంగతిని గ్రహించినవారు నవనాగరకులలో ననేకులుగలరు. కాని, మహర్షులకు వేదశాస్త్రములయర్థము సరిగాఁదెలియనందున వారు వ్రాసినధర్మములు సరిగా లేవనియుఁ, గావునఁ దాము వానిని మార్పఁబోవుచుంటిమనియు, వాదముకొఱకు దురభిమానముచే వాదించువారుగూడ వారిలోఁగొందఱులేకపోలేదు. ఐనప్పటికిని, వేదశాస్త్రములయొక్కయర్థము మనమహర్షులకుఁ దెలిసినదానికంటె నెక్కువభాగుగ నితరులకుఁ దెలియుట కవకాశము కొంచెమైననుండఁజాలదు. అట్లుండునని తలంచుటకుఁ గారణము, మహర్షులకును, వేదశాస్త్రసాంప్రదాయమునకును గల యవినాభావసంబంధ మెఱుఁగఁజాలకపోవుటమాత్రమే! ఈవిషయము నీగ్రంథముయొక్క మొదటిప్రకరణమున, "వేదమునుగుఱించి ప్రాచీనచరిత్రలు చెప్పినవిషయములు సత్యమా? నవీనచరిత్రలు చెప్పువిషయములు సత్యమా?" యనుశీర్షిక క్రింద నిదివఱకే విపులముగ విశదపఱచియుంటిమి. అంతియగాక, వేదముతోఁబాటుగ వేదాంగములను వేదార్థమునుగూడ మహర్షులు సృష్టికర్తనుండియుం వంశపారంపర్యముగ నెఱుఁగుచు వచ్చియుండిరనిగూడ తెలిపియుంటిమి. అందుచే, వేదమునకు మహర్షులు చెప్పినయర్థమును ద్రోసిపారవైచి నవనాగరకులు చెప్పఁజూచునర్థము కేవలము వారికోరికల కనుకూలముగఁ జేయఁబడెడి యపార్థము మాత్రమే యగునుగాని సరియైనయర్థము కాఁజాలదు.

అంతియగాక, పై నవనాగరకులెల్లరును దమకిష్టమగురీతిని బ్రజలందఱును వారివారిమతాచారములను మార్చుకొననందులకు విచారించి, యట్లు మార్పించుటకు మాత్రమే తంటాలుపడుచుండిరి కాని, ప్రజలు వేదశాస్త్రమార్గముల ననుసరింపక వేఱురీతిగఁ బోవుచున్నందులకు వారు విచారపడుటలేదు. అది పట్టిమాట. ఏలనన, వారు చేయఁదలచికొన్నట్టియుఁ, జేయుచున్నట్టియుఁ, గార్యములన్నిఁటిని నేదో యొక ప్రత్యక్షమగు నైహికలాభమునుగోరియే చేయుచుండిరిగాని, వేదశాస్త్రములు విధించినవి కాఁబట్టి చేయుచుంటిమని చెప్పుటలేదు. అంతియగాక, యట్టి నైహికఫలము నిచ్చెడి విషయ మేదియైన నొకటి వేదశాస్త్రవిరుద్ధమగుట తటస్థించినను, వారు దానినిజేయ సాహసించుచుండిరేకాని, యేమాత్రమును వెనుకాడుటలేదు. పరలోకమున గొప్ప దుర్గతికిని, రాఁబోవుజన్మమున దుఃఖభూయిష్ఠమగు నీచజన్మమునకును, హేతువులగునని వేదశాస్త్రములందు గర్హింపఁబడినయధర్మము లనేకములు మన నవనాగరకులదృష్టిలోఁ బరమధర్మములుగఁ బరిగణింపఁబడుచున్నవి. వానినే సంఘసంస్కరణములను మారుపేరుతో వారు మనమతమునఁ బ్రవేశపెట్టుటకుఁ బ్రబలప్రయత్నములను జేయుచున్నారు. అందుచే వారు ధర్మశాస్త్రములను మార్పఁజూచుట తమకోరికల నెఱవేర్చుకొనుటకే గాని వేదశాస్త్రములందలి యభిమానముచేగాదు!

కావున నీక వాదముకొఱకు నవనాగరకులు ధర్మములనుమార్చుటకుఁ బూర్వాచారపరాయణు లంగీకరింతురనుకొన్నను, వారు వానిని వేదశాస్త్రములననుసరించి మార్పఁబోవుటలేదు. ఇఁకేమనిన, నిదివఱలోఁ జెప్పినట్లుగఁ దమవంటినవనాగరకులకు విదేశీయాచారములందుఁగల యభిరుచి ననుసరించియుఁ, దమలోని యధికసంఖ్యాకుల యభిప్రాయములను బట్టియు, ధర్మములను మార్చి పారవేయుదురు. అందుకే వారిపుడు భగీరథప్రయత్నమును జేయుచున్నారు, [ఆవివరములన్నియు నీగ్రంథముయొక్క యేడవప్రకరణమున, "నవీనచరిత్ర లెట్లుపరిణమించె?" నను సందర్భమున ముందు ముందు తెలిసికొనఁగలము.] అట్టి యత్నములచే ధర్మములస్థానమున నధర్మములు బలాత్కారముగ నాచరణకువచ్చుట పూర్వాచారపరాయణులకు నరిష్టదాయకమగుటచే వారందులకంగీకరింపక యడ్డుతగులుచున్నారు. అందుచే నిరుకక్షులవారికి నన్యోన్యద్వేషములు ప్రబలి యైకమత్యమునకు భంగముగల్గుచున్నది.

పైవిమర్శనమువలన మనము గ్రహింపఁగలిగిన దేమనఁగా:— కాలానుసారముగ ధర్మశాస్త్రములను మార్పవలయునని నవనాగరకులు చేయుయత్నమునకు మూలము ధర్మశాస్త్రములును, వానిలోని ధర్మాధర్మములును నెట్లేర్పడిన వనువిషయమున వారికిఁగల తప్పుటూహలే. వాని నీప్రకరణముననే "స్మృతులనుగుఱించి నవీనచరిత్రలేమి చెప్పు?" ననుశీర్షిక క్రిందఁ దెలిసికొనియుంటిమిగదా! కాలానుసారముగ నవసరమగు రీతిని ధర్మశాస్త్ర మిదివఱకే సంస్కరింపఁబడియుండుటచే దానిని గ్రహింపలేక, వారు దానిని వేఱురీతిగ మార్పఁజూచుట పనిలేనిపని. అట్టియత్న మన్యోన్యకలహములకుఁ గారణమై, దేశీయులయైకమత్యమును బాడుచేసి, వారికిఁగల మతస్వాతంత్ర్యము నితరుల యధీనముచేయునదియై యున్నది. అందుచేఁ దమకుస్వాతంత్ర్య మెట్లవసరమో యట్లే యెదుటివారికిని స్వాతంత్ర్యమవసరమేయని న్యాయముగ నిష్పక్షపాతబుద్ధితోఁ దలఁచు నుదారస్వభావులును, దేశక్షేమమును నిజముగాఁగోరు నిష్కపటహృదయులగు దేశాభిమానులును, దైప్రయత్నమునుండి విరమించుట మిక్కిలి యవసరము.

## ధర్మములను నధర్మములను గుర్తెఱుఁగుట కాధార మంతరాత్మ (Conscience) కాదా?

ధర్మాధర్మములను గుర్తెఱుఁగుట కాధార మంతరాత్మయేయనియును, నది భగవంతునిస్వరూపమై యందఱి శరీరములందునుండి ధర్మాధర్మములను మనస్సులకు స్ఫురింపఁజేయుచుండుననియును, గావున దానియాజ్ఞప్రకారము జనులు నడువవలయుననియును, నవనాగరకులలోని కొందఱు సామాన్యులుమాత్రమేగాక, శ్రీగాంధీగారి

వంటి ప్రముఖులుగూడ కొందఱీమధ్య తీవ్ర ప్రచారమును సాగించుచున్న సంగతి మనలోఁ బెక్కుమంది యెఱిఁగియేయుందురు. వీరివాదమును బట్టిచూడ, ధర్మశాస్త్రములు మొదలగుగ్రంథములు నిష్ప్రయోజనము లగుచున్నవి. అంతియగాక, యంతరాత్మబోధించిన ధర్మమునకు విరుద్ధముగ నేదియేనిధర్మము నవిబోధించినచో, నిష్ప్రయోజనములు మాత్రమే గాక, నింద్యములుకూడ నగుచున్నవి. ఏలయనిన, నట్టిసందర్భమున, గాంధీగారి వంటిధీరులు తమ యంతరాత్మయొక్కబోధనే ప్రధానముగ గ్రహించి ధర్మశాస్త్రముల బోధను దృణీకరింపఁ జాలినప్పటికిని, జనసామాన్యము కొందఱు పైరెంటిలో దేనిని గ్రహింపవలయునో, దేనిని ద్యజింపవలయునో, తెలిసికొననేరక సంశయగ్రస్తులు కావలసివచ్చును. ఒకపనిని జేసినచో దోషమనియు, నందుచే నట్లుచేయుట యధర్మమనియు ధర్మశాస్త్రము చెప్పుచుండఁగా, నందులకుఁ బరమవిరుద్ధముగ, నాపనిని జేసినచో దోషము లేదనియు, దానిని జేయుట ధర్మమే యగుననియు నంతరాత్మబోధించినచో, నప్పుడాపనిని జేయుట, ధర్మమా, కాక యధర్మమా? ధర్మాధర్మములు పరస్పరవిరుద్ధములగుటచే, నాపనిధర్మమును నధర్మమును రెండునుగూడనగునని చెప్పవీలులేదు. అట్లుచెప్పుటచే నాపని వలన దోషముకలుగుననియుఁ,గలుగదనియునుగూడ చెప్పుటయేయగును.అది యర్థములేని పిచ్చివానిప్రసంగమని బాలుఁడుగూడ గ్రహింపఁగల్గును. కావున నట్లుచేయుటవలన దోషముండియైన నుండవలయును; కానిచో దోషములేకయైన నుండవలయును. అప్పుడాదోషమును గుర్తెఱిఁగి చెప్పఁగలసామర్థ్యము ధర్మశాస్త్రములకైన నుండవలయును; కానిచో నంతరాత్మకైన నుండవలయును. లేకున్న, రెంటికినిగూడ లేకపోయియైననుండవచ్చును. కాని రెంటికినిగూడ కలదనుటమాత్రము యుక్తిశూన్యమును, హేతురహితమును, బిచ్చిప్రసంగమును గాకమానదు. అందుచే నట్టిసామర్థ్య మారెంటిలో దేనికిఁ గల్గుట కవకాశముకలదో మనమిపుడువిచారించి తెలిసికొనవలసియున్నది. ఆరెంటిలో ధర్మశాస్త్రములవిషయమునుగుఱించి యిదివఱలోఁ గొంత తెలిసికొనియేయుంటిమి. అనఁగా ధర్మశాస్త్రములకుమూలము, సర్వజ్ఞుఁడగు నీశ్వరునియాజ్ఞారూపమగు వేదమేయని మన మీప్రకరణముననే, లోగడఁ దెలిసికొనియుంటిమి. అందువిషయమున మన నవనాగరకులకుఁ గల సంశయములలో ముఖ్యములగువానినిఁ గొన్నిటి నిదివఱలో విచారించి వానికి సమాధానములనుకూడ దెలిసికొనియుంటిమి. అందుచే నట్టిసంశయములు నిరాధారములనియుఁ, గావున ధర్మశాస్త్రములయాజ్ఞ సర్వజ్ఞుఁడగు నీశ్వరునియాజ్ఞయే యనియును మనము తెలిసికొనవలసి వచ్చుచున్నది. కావున ధర్మాధర్మములను (అనఁగా నొకకార్యము వలన దోషముకలుగునా, లేదా, యను విషయమును) నిర్ణయించి చెప్పఁగలసామర్థ్యము ధర్మశాస్త్రములకు లేదనిచెప్పెడిచో, వానికి మూలమగు వేదమునకుగూడ నట్టిసామ

ర్థ్యము లేదనియే చెప్పవలసివచ్చును. అట్టి వేద మీశ్వరుని యాజ్ఞారూపమని మన మిదివఱకో సహేతుకముగను సప్రమాణముగను నీగ్రంథముయొక్క మొదటి ప్రకరణమునఁ దెలిసికొనియుండుటచే, నప్పు డాసామర్థ్య మీశ్వరునికిఁగూడ లేదనియే చెప్పకతప్పదు. ఈశ్వరునిరూపమేయని మన నవనాగరకులు చెప్పు నంతరాత్మకుమాత్ర మాసామర్థ్య మప్పు డెచటనుంచి రాఁగలదు? రాఁజాలదు! కావున నీశ్వరున కట్టిసామర్థ్యముగలదని యంగీకరించినచో నాయనయొక్క యాజ్ఞారూపములగు వేదశాస్త్రముల కాసామర్థ్యము కొఱవడియున్నదని తలంపవలసినయగత్యము కానరాదు. అందుచే ధర్మశాస్త్రముల కట్టిసామర్థ్యమున్నదనియే మన మంగీకరింపవలయును. కాఁబట్టి ధర్మశాస్త్రములే ధర్మాధర్మములను నిర్ణయించి చెప్పఁజాలినవనియు, వానికి విరుద్ధముగాఁగూడ నొకప్పు డంతరాత్మ బోధించుచుండుటచే దానికే యట్టిసామర్థ్యమః కొఱవడియున్నదనియు మనము నిర్ణయింపక తప్పదు.

ఐనచో, "నంతరాత్మమాత్ర మీశ్వరునియొక్క రూపముగాదా? అప్పు డదియేయు నిర్ణయమునకును, నీశ్వరుని యాజ్ఞారూపములగు వేదశాస్త్రముల నిర్ణయమునకును భేదముండుటకుఁ గారణమేమి?" యని సంశయము గలుగకమానదు. అందులకు సమాధానమేమనఁగా, మన వేదశాస్త్రములవిషయమున మన నవనాగరకు లెట్టివిపరీతభావనలకులోనై యుండిరో, యంతరాత్మకుసంబంధించిన విషయమునఁగూడ వా రట్టిభ్రమప్రమాదములకే లోనైయుండిరి. ఎట్లనిన, నంతరాత్మ యీశ్వరుని రూపమేయనియు, నీశ్వరుఁడే యారూపమున నందఱి శరీరములందును నుండెననియు, నట్టి యీశ్వరుఁ డొక్కఁడే యందఱియందును నిండియుండెను గావున, నందఱును సమానులేయనియుఁ నీమొదలగువిషయములను వారు మనవేదశాస్త్రములనుండియే తెలిసికొనియుండిరి. కాని వానిభావములను గ్రహించుటలోమాత్రము తప్పుత్రోవఁద్రొక్కియున్నారు. ఆవిషయములనెఱుఁగుటకు వారి కంతకంటె నితరమగునాధార మేమియును లేదు. ఏలననిన, నీకాలమున వారు నేర్చికొనెడి విదేశీయవిద్యలో నట్టివిషయములను బ్రత్యక్షముగ బుజువుచేసి చూపఁగల ప్రకృతిశాస్త్రసాధనములు (Scientific apparatus) ఏమియు నింతవఱకు బయలువెడలినట్లు కానరాదు. అంతయేల! అట్టి ప్రకృతిశాస్త్రజ్ఞానము వృద్ధియగుచున్నకొలఁదిని, నందుఁ గృషిచేయుశాస్త్రజ్ఞులకు, 'దేవుఁడనువాఁ డొకఁడుండె' ననుయూహకూడ యంతకంతకు దూరమగుచున్నది. ఇప్పటికాలమునఁ బై మన నవనాగరకులదృష్టిలో నగ్రగణ్యతవహించిన 'రష్యా' (Russia) దేశమే యిందులకునిదర్శనము. ప్రస్తుతకాలమున నాదేశమున నింకనుఁ గొందఱియుండినకులం 'దేవుఁడ'నియు, 'మత' మ'నియుఁ దలపోయుచా రున్నందులకుఁ జింతింపుచు, నట్టివారు లేకుండుటకును, నాదేశ

మందలియుంవకు లేకముందు 'దేవుఁడుగలఁడ'నెడి నమ్మకమను నపాయములోఁ జిక్కు-కొనకుండుటకును, నాస్తికులగు నాదేశవాసులు కొందఱిచేఁ బ్రచారార్థము "Godless One" (అనఁగా, "దేవుఁడు లేఁడు") అనుపత్త్రిక నడుపఁబడుచున్నదని, తెలుపుచు 'The Light' అను పత్త్రికలో వ్రాయఁబడిన విషయమునుదీసికొని, 1933 సం॥ ఫిబ్రవరి 11-వ తేదీ వెలువడిన "The Indian Mirror" అనుపత్త్రిక యీ క్రిందిరీతిగఁ బ్రకటించియున్నది:—

"GOD DANGER"

Here in India, we newspaper men complain of the Danger of Godlessness to wich our youth are exposed. Newspapers in Russia are alarmed at another danger to which Russian youth are exposed—the danger of God. So far, the outside world has been under the impression that the last nail has already been driven into the coffin of God and he has been given an unceremonious burial deep, deep down the soil of Moscow. It seems however the last has not been heard of him as yet, and he is still the danger to be counted with. The latest report from Moscow says:—

"A counter attack against anti-God movement is being developed among the youth in Soviet factories according to the "Godless One," the organ of the society of the Godless in Russia."

"......................................................................................"

The newspaper calls for greater vigilance in safeguarding the Soviet youth aginst religion.

"The number of religious, culturally & politically backward youth on the Collective Farms is extremely large." says "*Godless One*" in an editorial article. "It is necessary to conduct an earnest struggle to see that the youth which has grown up under Soviet conditions is not religious to any extent, we consider dangerous. It is true that our youths on the whole are Godless, but it would be sheer opportunism to shut our eyes to the existance of a portion of our youth which is still religious. For example, many of our readers born in 1912, 1913, & 1914 write that they became atheists only in 1928 or 1929. Inadequate anti - religious education in the schools, general, political & cultural backwardness of

certain portions of our youth & the influence of religious parents explains the existance of religious minded young people."

What a topsy - turvey state of things? Here in India we safeguard our youth against godlessness. The Bolshevist is anxious to safeguard his youth against God! Here we complain of inadequate religious education. There, they complain of inadequate irreligious education! What is however noteworthy is the fact that God-idea is after all not so easy to eradicate. If it still lingers even under the Soviet skies where nothing has been left undone to wipe it off, it must inded be planted deep into the nature of man. Man cannot possibly shake off the God-idea unless he is untrue to his own nature.—*The Light.*

[From: The Indian Mirror, page 8, dated, 11*th*-Feb., 1933]

పై వ్యాసమునకుఁ దెనుఁగు:—

"దేవుఁడనెడి యపాయము"

ఇక్కడ హిందూదేశమున మనయువకులు 'నాస్తికత' యనెడియపాయమునకు లోనైరని వార్తాపత్రికలుచదివెడి మనము విచారపడుదుము. రష్యాదేశమందలియువకులు పేలోకయపాయమునకుఁ బాల్పడుచుండిరని యాదేశపువార్తాపత్రికలు తల్లడిల్లుచున్నవి. అది 'యాస్తికత' (అనఁగా దేవుఁడుగలఁడు) అనునపాయము. శవములను బెట్టెడిపెట్టెలో దేవునిబెట్టివైచి, దానికి మేకులనుబిగించుటపూర్తిచేసి, యక్రమముగ రష్యాదేశమందలి 'మాస్కో'పట్టణమున భూమిలో మిక్కిలిలోతుగఁబూడ్చి పెట్టిరనియే నిప్పటివఱకును నితరప్రపంచకమంతయును దలంచుచున్నది. ఐనప్పటికిని నాయన యింకను బూర్తిగనంత మొందినట్లు తెలియవచ్చుటలేదు; ఆయనవలనిభయ మింకనుదీరలేదు. 'మాస్కో'పట్టణమునుండి యిటీవలివార్త యీక్రిందిరీతిగ వినవచ్చుచున్నది:—

"సోవియట్ కర్మాగారములందలి (అనఁగా, రష్యాదేశప్రజనసంఘములందలి)యువకులలోని నాస్తికప్రచారమునకు వ్యతిరేకముగ నొకప్రచార మభివృద్ధినొందుచున్నట్లు, రష్యాలోనినాస్తికులసంఘముచేఁ బ్రకటింపఁబడు 'గాడ్ లెస్-వన్' (అనఁగా, "దేవుఁడు లేఁడు") అనుపత్రికవలన దెలియవచ్చుచున్నది.

... ... ... ... ... ...

మతవిశ్వాసము పాలఁబడిపోకుండునట్లు 'సోవియట్'యువకులనురక్షింప నింకను నెక్కువమెలకువ కావలయునని యావార్తాపత్రిక గోరుచున్నది.

'గాడ్-లెస్-వన్' అను నాపత్రిక, యొకసంపాదకీయవ్యాసమున నింకను నీక్రిందిరీతిని జెప్పుచున్నది:—

"సోవియట్ పరిస్థితులలోఁ బెరిగినయువకులు,మన మపాయముగ భావించుచున్న మతవిశ్వాసముగలవారుగ నెంతమాత్రము నుండకుండునట్లుచూచుటకై, నిష్కపటమగు గట్టియత్నమునకు మనము శ్రమపడుట యవసరము. మనయువకులు మొత్తముమీఁద నాస్తికులగుటనిజమే; కాని, మనయువకులలోఁ గొంతభాగ మింకను మతవిశ్వాసముగలిగి యుండుటను మనము కన్నులుమూసికొని గమనించుటలేదనుట స్పష్టము. ఇందులకు నిద ర్శనముగ, 1912, 1913, 1914, సంవత్సరములలోఁబుట్టినవారగు మనపత్రికాపాఠకులు కొందఱు 1928, లేక, 1929 సంవత్సరములలోమాత్రమే తాము నాస్తికులైనట్లు వ్రాయుచున్నారు. బడులలో మతవిశ్వాసనిర్మూలనము చేయువిద్య తగినంతలేకపోవుట యును, మనయువకులలోఁగొందఱు సామాన్య, రాజకీయ, పారిశ్రామికవిషయములలో వెనుకఁబడియుండుటయును, మతవిశ్వాసముగల తల్లిదండ్రులయొక్క పలుకుబడియును, యువకులలో మతవిశ్వాసబుద్ధితో మెలఁగువారుకలరని చాటుచున్నవి."

[పైపత్రికావిషయములను వినిపించినపిమ్మట, 'లైట్' పత్రిక యీక్రిందిరీతిని వ్యాఖ్యానముచేయుచున్నది.]

"పరిస్థితు లెంతతలక్రిందుగానున్నవో చూడుఁడు! ఇచట భరతవర్షమున మనము మనయువకులను నాస్తికతనుండి కాపాడఁజాలకుము. 'బోల్షివిక్కులు' (రష్యాదేశపు ప్రజలు) తమయువకులను "ఆస్తికత" నుండి కాపాడుకొనుట కాతురతపడుచున్నారు! ఇక్కడ తగినంతమతవిద్యలేదని మనముగుందుచుందుము. అక్కడ వారు మతవిధ్వంసక విద్య తగినంతలేనందుకు విచారపడుచున్నారు! ఇంతకును గ్రహింపఁదగినసత్యమే మనఁగా, దేవునిగూర్చినతలంపునుదొలఁగించుట యంతసులభసాధ్యముగాదు. దానిని నిర్మూలించుటకొక్కప్రయత్నమునైననువిడువక విశ్వప్రయత్నములనుగావించిన సోవి యట్ భూములలోనే యదియింకను వ్రేలాడుచునేయున్నచో, నది మనుష్యస్వభావమున మిక్కిలిలోతుగఁ బాదుకొనియుండితీరవలయును! మనుష్యుఁడు గృత్రిమస్వభావములో నుండిననేతప్ప, వాఁడు దైవవిశ్వాసమును విదిలించి వైచికొనుట సాధ్యముకాదు."

—'లైట్' పత్రిక.

ఇట్టిపరిస్థితులలో, విదేశీయవిద్యాభ్యాసము 'దేవుఁడుకలఁడ' ను మొదలుగాగల పైవిషయములనుబోధించుట కెంతమాత్రమును సహాయపడఁజాలదని మనము గ్రహింపఁ గలము. అంతయేల! ఎవరికిఁగాని, యేవిషయమునుగాని బోధింపగలముఖ్యమగునాధార

ములు లోకమునరెండుమాత్రమే. అందు మొదటిది ప్రత్యక్షప్రమాణము; రెండవది యాప్తవాక్యరూపమగుశబ్దప్రమాణము. అనఁగా దేనినైనను నొకఁడు స్వయముగఁజూచి తెలిసికొనుట మొదటిది. దానినిస్వయముగఁజూచుట సాధ్యముగాకున్నను, దానినిగుఱించి చెప్పెడివారియందలి నమ్మకముచేతనే దానినిసత్యమనిగ్రహించుట రెండవది. ఇఁకమన నవనాగరకులు దేవునిగుఱించియుం, నంతరాత్మనుగుఱించియుం, నారెంటికినిగలసంబంధమునుగుఱించియుఁ గావించుప్రలాపములకు మొదటియాధార మావంతయైనను లేదు. వారు పైవిషయముల నేదేని నొకప్రత్యక్షాధారముచే గ్రహించినవారు కారు. అందుచే నట్టిప్రత్యక్షాధారము దేనిచేతనుగూడ వారావిషయములను నెదుటివారికి ఋజువుచేసి చూపనుజాలరు. అంతయేల! వాదమునకై యెవరైనను నవనాగరకులబోధలను బ్రతిఘటించి, దేవుఁడును నంతరాత్మయునొక్కటిగాదనియుం, నందఱిలోనుండు నంతరాత్మలును నొక్కటిగావనియుం, వేఱువేఱనియుం, నసలు దేవుఁడేలేఁడనియు, నిలిచివాదించినచో వీరేమి సమాధానమునుజెప్పి వారినొప్పింపఁగలరు? కావున నిఁక వీరియూహలకాధారము శబ్దప్రమాణములగు మనవేదశాస్త్రములే యనిచెప్పవలయును. ఆసంగతినిగూడ కొందఱునవనాగరకులు గ్రహింపలేనిస్థితిలోనున్నారు. తక్కినవారైనను నావిషయమున వేదశాస్త్రములయొక్కభావమును దిన్నఁగాగ్రహింపఁజాలని దుస్థితిలోనున్నారు. కావున నిఁక మనవేదశాస్త్రములావిషయమై యేమిచెప్పుచున్నవో విచారించిచూతము.

వేదశాస్త్రములు మనశరీరములోని యంతరాత్మయొక్కటియే దేవుఁడని చెప్పుట లేదు. చరాచరములతోఁగూడిన యీవిశ్వమంతయునుగూడ దేవునిస్వరూపమేయని చెప్పుచున్నవి. అట్టిదేవుఁడు నిజమునకొక్కఁడేయైయుండి, సచ్చిదానందస్వరూపుఁడును, నిర్గుణుఁడును, నిరాకారుఁడును, జననమరణాదులులేక, సర్వకాలసర్వావస్థలయందును నెట్టిమార్పునులేక, శాశ్వతుఁడుగనుండువాఁడును నైయున్నాఁడు. అట్టిదేవునకే పరబ్రహ్మమని పేరు. ఆపరబ్రహ్మముకంటె భిన్నముకాక, యనాదిగ నాయనతోఁబాటే యాయనయందిమిడియున్న యాయనయొక్కస్వశక్తికిఁ బ్రకృతియని పేరు. అట్టిప్రకృతి, మాయయనియు, నవిద్యయనియు, రెండుభాగములుగలదైయున్నది. ఆపరబ్రహ్మము నిజముగ నిరాకారుఁడును, నిర్గుణుఁడునైయుండియుఁ, బైనదెల్పిన యాయనసంబంధమగు మాయాశక్తివలన, నామరూపములును, సర్వజ్ఞత్వమును, సర్వశక్తిసామర్థ్యములును, స్వాతంత్ర్యమును, సర్వాంతర్యామియైయుండుటయును, మొదలగుగుణములుగల యీశ్వరుఁడుగ గన్పట్టుచున్నాఁడు. ఆయనకే సగుణబ్రహ్మమని పేరు. అట్టియీశ్వరుఁడే తనసర్వశక్తిసామర్థ్యములచే నీవిశ్వమునంతయు సృష్టించి, వృద్ధిపొందించి, తుదకు నాశనమొనర్చుచున్నట్లుగఁ గన్పట్టుచున్నాఁడు. ఇట్లంతయుఁగన్పట్టుచుండుట జీవులకే. ఇఁక

నీజీవు లెట్లేర్పడిగనిన, పైనఁదెల్పిన నిర్గుణపరబ్రహ్మయే తనయొక్కశక్తియగు ప్రకృతి యందలి రెండవభాగమగు నవిద్యయందుఁ బ్రతిబింబించి యామాయవిద్యచే నావరింపఁబడిన వాఁడై, జీవుఁడగుచున్నాఁడు. అట్టిజీవుఁడు తనసహజమగు సచ్చిదానందస్వరూపము మఱుగుపడుటచే దానిఁదెలియఁగనేరక, పైనఁదెల్పిన యీశ్వరునియొక్కసృష్టిలోఁదగులు కొని, యవిద్యావశమున గర్మనాచరింపుచు, నాకర్మయొక్కఫలమునుసరించిన సుఖదుఃఖ ములతోఁగూడినట్టి జననమరణరూపమగు నీసంసారచక్రమునఁ దిరుగుచున్నట్లు భ్రాంతిఁ జెందుచుండును. మనమందఱము నట్టిజీవులమే!

ఈపైనఁదెలిపినది, జీవులకును నీశ్వరునికినిగలసంబంధమునుగూర్చి వేదశాస్త్రములు చెప్పువిషయము. దీనినంతను నీగ్రంథముయొక్కరెండవభాగమున, (నన,గా, "వైదిక మతతత్త్వ" మనునెనిమిదవప్రకరణమున) ముందుముందు విపులముగఁజర్చింపవలసిన యవసరముండుటచే నిచట సంగ్రహింపవలసియున్నది. పైనఁదెల్పినట్లుగ సృష్టికర్తయగు నీశ్వరుఁడును, సృష్టింపబడినవాఁడగుజీవుఁడును, సృష్టికర్తచేసృష్టింపఁబడిన యీవిశ్వ మును, నున్నట్లుదోఁచుటకుఁగారణము ప్రకృతియొక్కమాయయును, నవిద్యయు ననుశక్తు లగుటచేతను, వానికాధారముప్రకృతియగుటచేతను, దానికిమూలము నిర్గుణపరబ్రహ్మ మగుటచేతను, నట్టినిర్గుణపరబ్రహ్మమొక్కటియే పైవానికన్నిఁటికినిమూలమనియు, నాయనయే యీసమస్తపదార్థములుగఁ గన్పట్టుచున్నందున, నాయనకంటె వ్యతిరిక్త మయినది వేఱేమియు లేదనియు, నందుచే నీవిశ్వమంతయు నాయనయొక్క రూపమే యనియు నీక్రిందిరీతిని మనవేదశాస్త్రములు చెప్పుచున్నవి:—

"........యచ్చ కిఞ్చి జ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య *నారాయణస్థితః!"
... ... ... ... ... ...

—తైత్తిరీయారణ్యక. ౧౦—౧౩.

పైశ్రుతియే యీక్రిందిరీతి ననువదింపఁబడియున్నది:—

శ్లో. "దృశ్యతే శ్రూయతేచాపి యచ్చకించి జ్జగ త్ప్రభో!
తత్సర్వం బహిరంతశ్చ వ్యాప్య *విష్ణు స్స్వయం స్థితః."

—శ్రీస్కాందపురాణే, సింహాచలక్షేత్రమాహాత్మ్యే, అధ్యా. ౨౧.

"క. *హరిమయము విశ్వమంతయు, హరివిశ్వమయుండు; సంశయము పనిలేదా

---

*త్రిమూర్తిస్వరూపుఁడగు నీశ్వరునికంటెవేఱగునామముగాని, రూపముగానిలేని వాఁడగుటచే, నిర్గుణపరబ్రహ్మముగూడ, త్రిమూర్తులయొక్కనామములతోఁడనే వ్యవ హరింపఁబడుననుసంగతి, యెనిమిదవప్రకరణమునఁ దెలుపఁబడును.

హరిమయముగానివస్తువు పరమాణువులేదు; వంశపావన! వింటే!"

శ్రీమదాంధ్రభాగవతము. స్కం ౨. పద్య. ౧౭.

పైరీతిని జెప్పిన వేదశాస్త్రములే, జీవుఁడుక్రమముగ నవిద్యావశమునుండి తొలఁగి తనస్వస్వరూపమును (సచ్చిదానందరూపమగు పరబ్రహ్మలక్షణమును) బొందువఱకును జననమరణసుఖదుఃఖరూపములతోఁగూడిన యీసంసారమునుండి తొలఁగఁజాలఁడని చెప్పుచున్నవి. మఱియు జీవుఁ డెట్టియెట్టికర్మలనాచరించుటచే క్రమక్రమముగ నట్టిస్వస్వరూపజ్ఞానమును సంపాదించుకొనగల్గునో వానినేధర్మములనియు, నెట్టికర్మలచే నట్టిజ్ఞానమును సంపాదించుకొనఁజాలకపోఁగాఁ, బైఁగాఁదనయొక్క యవిద్యాబంధమును మఱింత దృఢపఱచుకొని సంసారమునమఱింతచిక్కులపాలగునో వానినే యధర్మములనియుం, వేదశాస్త్రములుఁవర్ణించియున్నవి. అట్టిస్వస్వరూపజ్ఞానముగల్గినతరువాత జీవుఁ డీవిశ్వమునంతను మిథ్యగాఁదెలిసికొని, సంసారమునుండివెలువడి జీవించియున్నంతవఱకును దీనిని లక్ష్యముచేయకవర్తించుననియు, బిదపనిర్గుణపరబ్రహ్మలో నైక్యమగుననియుఁ గూడ చెప్పుచున్నవి. అంతియగాని, సగుణబ్రహ్మమగు నీశ్వరునికిఁగల సర్వజ్ఞత్వమును, సృష్టిస్థితిసంహారములు చేయఁగల సర్వశక్తిసామర్థ్యములును, జీవునకవిద్యావస్థలోఁగాని, స్వస్వరూపజ్ఞానముగల్గినపిమ్మటగాని, కలుగునని వేదశాస్త్రములు చెప్పుటఁగానము. ఇఁక నట్టిసామర్థ్యములు గలుగవలయునన్నచో నవి మంత్రజపములు మొదలగు తపోవిశేషములచేత, జన్మాంతరమునమాత్రమే (అనఁగా, నవిద్యాసంబంధమగు నుపాధిపోయి మాయాసంబంధమగు నుపాధిలభించినపుడుమాత్రమే) జీవునకుఁ గలుగునని యాశాస్త్రములు చెప్పుచున్నవి. అనఁగా నపుడు జీవుఁడు దివ్యశరీరముగల యీశ్వరుఁడై సృష్టిస్థితి సంహారములుచేయ సమర్థుఁడగును. బ్రహ్మ, విష్ణు, రుద్రాదిపదవు లిట్టితపోవిశేషముచేతనే గల్గునని శ్రీస్కాందమహాపురాణాంతర్గత సూతసంహితయందలి యజ్ఞవైభవఖండమున "షడక్షరవిచారము"ను నెనిమిదవయధ్యాయములో వర్ణింపఁబడియున్నది. చూడుఁడు, శ్లో. ౩౬౫ మొ. ౪౧ వఱకు.

కాఁబట్టి జీవుఁడు శరీరమునందుండి సర్వజ్ఞుఁడై యంతరాత్మరూపమున నతీంద్రియవిషయములగు ధర్మాధర్మములను మనస్సునకుస్ఫురింపఁజేయుచుండుననుకొనుట యట్టిభ్రాంతిమూలకమని పైవిమర్శవలనఁ దేలుచున్నది.

కాని, యిచటనొకసంశయముగలుగవచ్చును. ఏమనిన "తపోవిశేషములచేతనే బ్రహ్మవిష్ణు రుద్రాదిపదవులుగల్గునని చెప్పిన పైపురాణమే, యట్టితపస్సుచే జాతిస్మరణము (పూర్వజన్మజ్ఞానము) కూడ గలుగునని "గాయత్రీవిచార"మను నాఱవయధ్యాయమున నీక్రిందిరీతిని జెప్పుచున్నది:—

శ్లో. " ... ... ... ... ...
పంచగవ్యాశనో లక్షం జప్త్వా జాతిస్మరో భవేత్." ౫౦

అనఁగాఁ, బంచగవ్యమును మాత్రమే యాహారముగఁగొని గాయత్రీమంత్ర జపము లక్షమాఱులుచేసినవారికిఁ బూర్వజన్మజ్ఞానము గల్గునని యర్థము; అట్టి జ్ఞానమును సంపాదించినవారు తాము పూర్వజన్మములో నేయేకర్మములొనర్చుటచే నిపు డేయే ఫలము లనుభవించుచుండిరో తెలిసికొనఁగల్గుదురుగదా! అపుడు వారియంతరాత్మ యతీంద్రియవిషయములగు ధర్మాధర్మములను గుత్తెఱుఁగఁ జాలియుండుటలేదా? కావున నంతరాత్మ ధర్మాధర్మములనెఱుఁగ నాధారమనుటలోఁ దప్పేమి?" యని కొందఱడుగ వచ్చును.

సమాధానమేమనిన, నట్టి తపోధనులవిషయమున నైసంగతి సత్యమేకావచ్చును: తపశ్శక్తికి సాధ్యముగానిదేదియుఁ లేదని మొదటిప్రకరణమునఁ జెప్పియుంటిమిగదా! కాని, జనసామాన్య మందఱివిషయమునను నది వర్తించుననుట తప్పుగాదా? ఇఁకఁ, బైతపోధనులవిషయముననైనను, వారియనుభవము శాస్త్రనిర్ణయమున కనుగుణ్యముగనే యుండితీరవలయును. అనఁగా నెట్టి కర్మాచరణముచే నెట్టిఫలముగల్గునని శాస్త్రములు చెప్పునో, యట్టికర్మలనే వారాచరించి యట్టిఫలములనే యనుభవించినవారుగ నుండవలయును. ఏమనిన నతీంద్రియవిషయములగు ధర్మాధర్మములను నిర్ణయించిచెప్పఁగల సామర్థ్యము వేదశాస్త్రములకు కొఱవడియుండదనియుఁ మిాదుమిక్కిలి వానికేకలదనియుఁ నీవ్యాసముయొక్క ప్రారంభమున ఋజువుచేసియే యుంటిమిగదా! కావున నిఁక ధర్మాధర్మములవిషయమున వేదశాస్త్రములు నిర్ణయించినదానికిని, బూర్వజన్మజ్ఞానముగల తపోధనుల యనుభవమునకును భేద మేమాత్రము నుండఁజాలదని మనము గ్రహింపక తప్పదు. ఒకవేళ నెవరైననొకరు తమకుఁ బూర్వజన్మజ్ఞానముకలదనియుఁ, దమయనుభవజ్ఞానము వేదశాస్త్రనిర్ణయములకు విరుద్ధముగనున్నదనియుఁ జెప్పినచోఁ, బైనదెల్పిన హేతువులచే, నట్టివారికిఁగల పూర్వజన్మజ్ఞానము బూటకమనియు, లోకవంచకసాధనమనియుఁ బై కారణములచే మనము గ్రహించితీరవలయును. ఐనచో, నిఁక మననవనాగరకు లంతరాత్మయని తలంచునదేమనఁగా, నాయాజీవులయొక్క యంతఃకరణమునుండి వారివారి కర్మవాసనలననుసరించి బుద్ధిచేఁబ్రేరేపింపఁబడు నాలోచనలుమాత్రమేగాని వేఱేమియునుగాదు. ఇఁక నీబుద్ధులయొక్క ప్రేరేపణ లెట్లుండునో, యవి ధర్మాధర్మములనెఱుఁగ నెట్లుసాధ్యపడునో విచారించిచూతము.

జనులయొక్క బుద్ధులన్నియుఁ నొక్కతీరుగనుండవు. వారివారియొక్క పూర్వజన్మములందలి కర్మలనుబట్టియు, నీజన్మమందలి విద్యావిధానము మొదలగుసంస్కార

ములనుబట్టియు, వేఱువేఱురీతులగు నెచ్చుతగ్గులతోఁగూడిన జ్ఞానమును, దయయుఁ, జెలివితేటలును మొదలగు సుగుణములతోను, నజ్ఞానముఁ గామముఁ, గ్రోధము మొదలగు దుర్గుణములతోడను, వేఱువేఱువిధములుగనుండును. వానిననుసరించియే, యాలోచనలు గూడ వేఱువేఱువిధములుగ వారివారిబుద్ధులకు దోఁచుచుండును. చుఱుకుబుద్ధిగలవారికిఁ దోఁచినయాలోచనలు సామాన్యబుద్ధిగలవారికిని, మందబుద్ధిగలవారికినిదోఁపవు. వారూహింపఁగల యూహలను వీరూహింపలేరు.అట్టిబుద్ధిబలముయొక్క తారతమ్యమునుబట్టియే లోకమునఁ గొంద ఱధికులుగను, మఱికొంద ఱల్పులుగను, గొందఱు చెప్పివినిపింపఁగల నాయకులుగను,మఱికొందఱువిని యాజ్ఞ ప్రకారమునడచుకొనెడి యనుచరులుగను నుండుట తటస్థించుచున్నది. ఈలోకమననే యనుభవమునకు వచ్చెడివియు, నింద్రియములకుఁ గోచరించుచున్నవియు నగువిషయములను దిన్నఁగా నిర్ణయించుటలోనే తగినంతసామర్థ్యము బుద్ధికిలేదు. మిక్కిలి బుద్ధిమంతులగువా రూహించి నిశ్చయించినవ్యవహారములే యొకటితలఁచిన నింకొకటి యగుచుండుటను మనము లోకమునఁ జూచుటలేదా? ఇఁక నింద్రియముల కీలోకమునఁ దెలియరానిఫలములనిచ్చెడి ధర్మములను నధర్మములను బుద్ధి నిర్ణయింపఁగల్గునా? అది వట్టిభ్రమమాత్రమే. ఇట్టిబుద్ధికే "Conscience" కాన్‌షెన్స్ (అనఁగా, 'నంతరాత్మ') యనియు "Inner Voice" ఇన్నర్ వాయిస్, (అనఁగా "నాత్మసాక్షి") యనియు నేమేమోపేళ్లుపెట్టి, పూర్వజన్మలోఁ జేసికొనిన పుణ్యపాపముల ననుసరించియు నిప్పటి విద్యాభ్యాసము, సహవాసము, మొదలగు వానిని బట్టియు, నంతఃకరణమునుండి బయలువెడలెడి కర్మవాసనలనే, యంతరాత్మయగు భగవంతుఁడు ప్రేరేపించు ధర్మాధర్మములనిచెప్పుచు, నవనాగరకులు తమ స్వేచ్ఛాప్రవర్తనమున కనుకూలముగ నొక క్రొత్తవ్యవహారమును సృష్టిచేసియున్నారు. కాని యంతకంటె వేఱేమియులేదు. అంతమాత్రముచే వీరు వ్యవహరించు నంతరాత్మ మన వేదశాస్త్రములందుఁ జెప్పఁబడిన యంతరాత్మయేయని మనము పొరపడరాదు. ఏలననఁగా, నట్టి యంతరాత్మ సచ్చిదానందస్వరూపుఁడనియు, నిర్వికారుఁడనియు, నిర్గుణుఁడనియు, సంకల్పవికల్పాదిద్వంద్వరహితుఁడనియు, సర్వాంతర్యామియనియు, నశేషకర్తవ్యతాశూన్యుఁడనియు (ననఁగాఁ జేయవలసినదొకటియు లేనివాఁడనియు) మాత్రమే మనవేదశాస్త్రములు చెప్పుచున్నవిగాని, జనులలోపలనుండి ధర్మాధర్మములను బోధించుచుండునని చెప్పుటలేదు. అంతియగాక, జీవున కట్టియంతరాత్మసాక్షాత్కారము గలుగువఱకును (అనఁగా స్వస్వరూపజ్ఞానము గల్గువఱకును) జీవుఁడజ్ఞుఁడుగనే యుండుననియు, నట్టిది గల్గినపిదప నీవిశ్వమంతయు నాజీవునిదృష్టిలో మిథ్యయేయైపోవుటచే (ననఁగా, నున్నట్లుమాత్రము భ్రాంతిగల్గించునదియు, నిజముగ లేనిదియునైపోవుటచే) నీవిశ్వమునకు సంబంధించిన

నమస్తపదార్థములతోఁబాటుగ ధర్మాధర్మవివక్షత సహిత మందే లయమైపోవుననియుఁ గూడ, మనవేదశాస్త్రములు చెప్పుచున్నవి. ఇఁక నట్టియంతరాత్మకు, నిది ధర్మమనియుఁ, నిది యధర్మమనియుఁ,వివరించి తెలిసికొనవలసిన యగత్యముగాని, యవకాశముగాని లేనే లేవు. అప్పుడిఁక యంతరాత్మ ధర్మాధర్మములను బోధించు టెట్లుసంభవించును? కావున మన వేదశాస్త్రములందు వ్యవహరింపఁబడిన యంతరాత్మగాక, మననవనాగరకులచే వ్యవహరింపఁబడు నంతరాత్మవేఱు. ఆపేరుపెట్టి వ్యవహరించుచు, దానిచేఁ దాముభ్రమించుచు నితరులను భ్రమింపఁజేయుచునున్నది, మనశాస్త్రములందు బుద్ధియనిచెప్పఁబడు వీరి యొక్క యంతఃకరణమేగాని, వేఱేమియుఁగాదని మనము నిశ్చయింపవలయును.

ఇఁకబుద్ధిచేనూహించి నిశ్చయించెడివిషయము లీలోకమునమాత్రము ప్రయోజనమునుగల్గించినఁ గల్గించునేమో! ఒక్కొకప్పుడు దానినిగూడ గల్గింపనేరక యందులకుమారుగ హానిగల్గించుటయును, నందుచే జనులా నిర్ణయములను మార్చుకొనుచుండుటయునుగూడ చూచుచున్నాము. కావున నవి రాఁబోవుగతివిషయమున నధోగతిని గల్గించినఁ గల్గింపవచ్చునేమోకాని, యుత్తమగతిని గల్గించుననిచెప్పుట కావంతయైన నవకాశము గన్పట్టదు. ఇహలోకవిషయములను నిర్ణయించుకొనుటలోఁగూడ బుద్ధులన్నియుఁ నేకీభవించుటలేదు. ఒకరిబుద్ధికిరుచించిన దింకొకరిబుద్ధికి వికటించుచున్నది. "బుద్ధిః కర్మానుసారిణీ" యను నార్యోక్తిననుసరించి పూర్వజన్మములలో జనులుచేసికొనిన కర్మలననుసరించికూడ, వారికి బుద్ధులుపుట్టుచుండును. మంచికర్మలను జేసియున్న వారికి మంచిబుద్ధులును, చెడుకర్మలను జేసినవారికిఁ జెడుబుద్ధులును బుట్టుచుండును. అపు డెవరిబుద్ధినిబట్టి ధర్మమునిర్ణయింపవలయును? మంచిబుద్ధిగలవారికి ధర్మముగఁదోఁచి నది చెడుబుద్ధిగలవారి కధర్మముగఁదోఁచును. ఒకరుచెప్పినహేతువు లింకొకరికిరుచింపవు; అందులకుఁ గారణము, మొదటివారు చెప్పుహేతువులను రెండవవారిబుద్ధి గ్రహింపఁ జాలినంతటి పరిపక్వమైనదిగ లేకపోవుటయే. అంతయేల! బుద్ధులచేనూహించి ధర్మాధర్మములను నిర్ణయింపవలయు ననువాదములోఁగల దౌర్బల్యమునంతను నీప్రకరణముననే లోగడ, "యుక్తివాదము నమ్మదగినదగునా, కాదా!" యను శీర్షికక్రిందఁ బ్రదర్శించియే యుంటిమిగదా! అందువలననే యొకరిబుద్ధికి ధర్మముగఁదోఁచినదాని నింకొకరొప్పరు. ఇఁక నెవరిబుద్ధిని బ్రమాణముగఁ దీసికొనవలయును? ఎవరిబుద్ధి వారికేప్రమాణమని వదలవలయును. అప్పుడే యది యందఱికిని నిష్టమగును. అనఁగా నెవరికిఁ దోఁచి నట్లు వారుచేయవచ్చునని యూరకొనవలయును. అదియే నవనాగరకులలోఁ బలుపురు కోరుచున్న విషయము. ఎదుటివారిప్రాణమునకును, మానమునకును, ధనమునకును, బ్రత్యక్షముగ హానిలేనంతవఱకును మనుజుఁ డెట్టిపనులనైనఁ జేయవచ్చుననియే యిప్పటి నవ

నాగరకులతలంపు.—వారికి, వేషమున నియమముండరాదు; తినుటలో నియమముండ రాదు; ఆచారవ్యవహారములలో నియమముండరాదు; ఇష్టమువచ్చినట్లు వేషము మార్చికొనవచ్చును; ఇష్టమువచ్చిన పదార్థములనెల్ల, నిష్టమువచ్చినవారితోఁజేరి, యిష్టమువచ్చినకాలమున, నిష్టమువచ్చినచోట, నిష్టము వచ్చినరీతిగఁ దినవచ్చును; స్త్రీపురుషుల కిరువురకును నిష్టమైనయెడల, నిష్టమువచ్చినస్త్రీ, యిష్టమువచ్చి నపురుషునితో నిష్టమువచ్చినరీతిగ నిష్టమువచ్చినంతకాలము కాఁపురము చేయ వచ్చును; ఇష్టమువచ్చిన యాచారముప్రకారము ప్రవర్తింపవచ్చును; అదికూడు ననియుఁ, నిదికూడదనియుఁ, వారినెవ్వరును నభ్యంతరపెట్టరాదు; మత, సాంఘిక, విషయ ములలో నందఱును నెవరియిష్టముచొప్పున వారు ప్రవర్తింపవచ్చును.—ఇదియే నవ నాగరకులలో నిటీవలఁ గొంతకాలము క్రిందటివఱకును గలకోరిక. ఇట్టిస్వేచ్ఛాప్రవ ర్తనమునకుఁ దోడ్పడుటకే, "ధర్మాధర్మములనెఱుఁగుట కంతరాత్మప్రమాణ" మను దుర్వాదమును నవనాగరకులు లేవనెత్తియున్నారు.

[విషయ మింతటితోనిలిచినఁ గొంత బాగుండెడిదే; ఏమనిన, దానిచే నొకరి వలన నింకొకరికి బాధలేదు; అట్లుగాక, యుదారస్వభావరహితులగు కొందఱునవనాగ రకు లిటీవల బయలుదేరి తమయభిప్రాయములప్రకారమే తక్కినవారందఱును బ్రవ ర్తించునట్లు బలాత్కరించుచు, నట్లు ప్రవర్తింపనివారిని గఠినముగ శిక్షించుటకుఁ దగిన తీవ్రశాసనములను బ్రభుత్వమువారిచేఁ జేయించుచున్నారు. ఈవిషయమును దీనిచేఁ గల్గునష్టములను, నీగ్రంథముయొక్క యుపోద్ఘాతమున "ఇపుడీ మతచరిత్రవ్రాయుటకుఁ గారణ"మను శీర్షికక్రిందను, మొదటిప్రకరణమున, "నవీనచరిత్రలందలి విషయముల కును, బ్రాచీనచరిత్రలందలి విషయములకును గల భేదములచేఁ గలిగినకీడు" అను శీర్షిక క్రిందను వినిపించియే యున్నాముగదా !]

"ధర్మాధర్మములెఱుఁగుట కంతరాత్మప్రమాణ"మను వాదసందర్భమున నవ నాగరకులు మఱియొక వింతప్రసంగమును జేయుచున్నారు. ఏమనిన: "అంతరాత్మ పలువురకుఁ బలువిధములుగాఁ జెప్పదు; ఒక్కవిధముగనే చెప్పును; కాని, కొందఱు దాని ననుసరించుచున్నారు; మఱికొందఱు మీరినడచుచున్నారు."అని వారు వాదించు చున్నారు. ఇదియును వట్టిభ్రాంతియేగాని దీనికిని సరియైనయాధార మేమియును లేదు. ఏమనిన: నందఱియంతరాత్మలును నొక్కరీతిగనే చెప్పుననుసంగతి వీరికెట్లు తెలిసినది ? ఎవరియంతరాత్మ యేమిచెప్పునో యాసంగతి వారివారికే తెలియవలయునుగాని యొకరిసంగతి యింకొకరికెట్లు తెలియును? ఒరులయాత్మలోనిసంగతిని దెలిసికొను సాధ నము వీరికేమియున్నది ? ఏమియును గానరాదు. అది వట్టియూహామాత్రమే ! !

కాని, మన నవనాగరకు లంతటితోనిలువక, "అందఱిలోనున్న యంతరాత్మయు నొకటికాదా? అందుచే నది యొకరి కొకవిధముగను, నింకొకరి కింకొకవిధముగను నేలచెప్పును? అట్లెన్నఁడును జెప్పదు" అని వాదింపవత్తురు కాఁబోలును! కాని, "యందఱిలోనున్న యంతరాత్మయఁనొకటే"యను విషయమునుగూడ వీరెట్టి ప్రత్యక్షప్రమాణముచేతను ఋజువుచేయఁజాలరనియు, నట్టియూహ కాధారము మన వేదశాస్త్రములేయనియు, నంతకంటె వారికి వేఱగునాధార మేమియుఁగానరాదనియు నీవ్యాసముననే లోగడ ఋజువుపఱచియుంటిమి. అట్టి మనవేదశాస్త్రములు ధర్మాధర్మముల నెఱుఁగుట కంతరాత్మ యాధారమని యొచ్చటను జెప్పియుండుట గానరాదు. మీదుమిక్కిలి ధర్మాధర్మముల నెఱుఁగుట కాధారము శాస్త్రమేయనియు, దానిని మీఱి స్వేచ్ఛగా (వారివారి యిష్టము ప్రకారము) నడచెడివారు సద్గతి నొందఁజాలక, యందులకుమారుగ నిహపరసౌఖ్యములకు రెంటికిని దూరులై యధోగతిపాలుగాక తప్పదనియుఁ మనవేదశాస్త్రములు చెప్పుచున్నవి. ఇందులకు బ్రమాణము నీప్రకరణముననే లోగడ, "ఈజన్మలోని ఫలములకుఁ బూర్వజన్మలలోని కర్మలే కారణమైనచో, నేకర్మ కేఫలము గల్గుచున్నదో, యాసంబంధముగుజ్ఞానమును మనుష్యులకు దేవుఁడేల యీయలేదు?" అనుశీర్షిక క్రిందఁ జూపియేయున్నాము.

ఈసందర్భమునఁ దెలిసికొనవలసిన చిత్రమగుసంగతి యింకొకటి గలదు. ఏమనిన, "నంతరాత్మ పలువురకుఁ బలువిధములఁ జెప్పు"దనియు, "నందఱకును నొక్కటే రీతిగఁ జెప్పు"ననియు, "నందులోఁ గొందఱుమాత్ర మాయంతరాత్మయొక్క బోధను మీరినడచుచుందు"రనియుఁ మననవనాగరకులు చేయువాదము సత్యమేయని వాదము కొఱ కించుకసే పంగీకరించి చూతము. ఇట్టివారిలో నగ్రగణ్యులని లోగడ మేము దెల్పియుఁన్న శ్రీగాంధీగారితోఁ గొన్ని మతసాంఘికవిషయములం దేకీభవింపనివారు మాత్రమేగాక రాజకీయవిషయములందుగూడ యేకీభవింపఁజాలని ప్రముఖులు గొందఱు నవనాగరకశిఖామణులలోనే గలరు. ఇందుల కుదాహరణముగ కీ. శే. శ్రీ చిత్తరంజన దాసుగారికిని, శ్రీగాంధీగారికిని, రాజకీయవిషయములం దభిప్రాయభేదము గల్గినందున, దేశీయమహాజనసభాపక్షము (కాంగ్రెస్-పార్టీ)నుండి శ్రీదాసుగారు చీలిపోయి వెనుక స్వరాజ్యపక్షమును స్థాపించినసంగతి యీకాలపు చరిత్రజ్ఞానముగలవారంద ఱెఱిఁగినదే. అట్లే శ్రీహరవిలాసశారదాగారు ప్రతిపాదించిన 'బాలికావివాహ నిషేధశాసనము' సంఘశ్రేయమున కవసరమనితలఁచి దానికనుకూలముగ శ్రీగాంధీగారు దమసమ్మతిని బ్రభుత్వమువారి కిచ్చియున్నప్పటికిని, నట్టిశాసనము సంఘమున కరిష్టదాయకమే యని త్రికరణశుద్ధిగనమ్మి, యట్టియాచారముచే నితరఖండములు పాడగుచున్నట్లు

స్వానుభవముచే గ్రహించి, కీ॥ శే॥ శ్రీ లాలాలజపతిరాయిగారు తాము రచించిన 'Unhappy India' (అన్-హ్యాపీ-ఇండియా)యను గ్రంథమునవ్రాయించియున్నారు. ఇట్టి సందర్భమున ప్రముఖులగు నిరువురు నవనాగరకశిఖామణులమధ్య నభిప్రాయ భేదము గల్గినపు డాయిరువురిలో నెవరోయొకరు తమయంతరాత్మయొక్క బోధను మీరి నడచుచున్నారని మనము గ్రహింపకతప్పదు. ఏలనన, నిరువురియంతరాత్మలును (నాయిరువురి యంతరాత్మలుమాత్రమేగాక, లోకమున నందఱియంతరాత్మలును)గూడ నొక్కటేవిధమునఁ జెప్పునని మన మంగీకరింపదలఁచియున్నందున! ఇఁక నప్పుడా యిరువురిలో నంతరాత్మయొక్కబోధను మీరి నడచినవారెవరని మనము నిశ్చయింపవలయును! మొదటివారే యందుమా? ఎట్టి యాధారముచేత నిశ్చయింపవచ్చును? రెండవవారే యని యేలచెప్పఁగూడదు? రెండవవారేయందుమా? అదిమాత్ర మెట్లుచెప్పవచ్చును? మొదటివారేయని యేలచెప్పరాదు? కావున నిట్టివాదము పిచ్చిప్రసంగమనియు, వారి వారి కర్మవాసనలననుసరించి వారికి వేఱువేఱుబుద్ధులు పుట్టుచుండునేగాని, లోకమున నందఱియంతరాత్మలు నొక్కటేరీతిని బోధించుననుకొనుట పొరఁబాటనియు, మనము గ్రహింపనక్కరలేదా? గ్రహించియే తీరవలయును!

శ్రీగాంధీగారితో నభిప్రాయభేదముగల్గి కీర్తిశేషులైయున్న పైయిరువురి నవ నాగరక ప్రముఖులమాట యటుండనిండు. శ్రీగాంధీగారు బయలుదేరఁదీసిన ప్రస్తుతపు చండాలుర యస్పృశ్యతానివారణోద్యమమును బ్రభుత్వశాసనముగావించుటకు శ్రీ C. S. రంగయ్యర్‌గారనుసామ్రాజ్యశాసనసభాసభ్యులు శ్రీగాంధీగారిపక్షమున విశ్వ ప్రయత్నములను గావించుటయేగాక, వారియందు మిక్కిలి పూజ్యభావమును గౌరవాతిశయములనుగల్గి సభీపులైయున్నారు. అంతియగాక వీరును శ్రీగాంధీగారివలెనే "యంతరాత్మ...దేవుఁ"డనియు, "నెవరియంతరాత్మ వారికి మార్గదర్శక"మనియు నభిప్రాయపడువారు. వీరు చేయఁబూచు పైశాసనముల నాక్షేపించుచు 1933 సం॥ ఫిబ్రవరినెల 4-వ తేదీన పాలఘాటునుండి, శ్రీపూరీశంకరాచార్యస్వాములవారు (అనఁగా శ్రీ జగన్నాథమందలి గోవర్ధన మఠాధీశ్వరులగు జగద్గురు శ్రీభారతీ కృష్ణతీర్థస్వాములవారు) వీరికిఁబంపిన తంతివార్తపై వీరు తమప్రత్యుత్తరము నొసంగుసందర్భమున మేము పైన తెలిపిన వీరియభిప్రాయమును వీ రీక్రిందిరీతిగ వెలువరించియున్నారు.:—

[ఈవిషయములను శ్రీరంగయ్యర్‌గారే తామున్వయముగ లాహోరునుండి ప్రకటించుకొను 'డెయిలీ-హెరాల్డు'(Daily Herald) పత్రికలోఁ బ్రకటించుకొని యుండఁగా, 'ఇండియా ఫ్రీప్రెస్' (Free Press of India) అనుపత్రిక వానిని ముద్రించుకొనియున్నది. అసంబంధమగు నుత్తరప్రత్యుత్తర గ్రంథమునంతను బ్రోగు

చేసి, "యఖిలభారతవర్ష వర్ణాశ్రమస్వరాజ్యసంఘము" యొక్క యత్యవసరసభాసమావేశకార్యదర్శిగారగు శ్రీయుత డాక్టర్ K. A. శంకరనారాయణఅయ్యర్ గారు గ్రంథరూపమునఁ బ్రచురించియున్నారు.]

## శ్రీ C. S. రంగయ్యర్ గారి ప్రత్యుత్తరము.

"..................................................................

### Mahatma, The Nearest Approach to Buddha.

Today methinks the Mahatma with his creed of Ahimsa and his determination to annihilate caste hatred is the nearest approach to Buddha. *And I must be guided by my deepest convictions even though they meet with the strong and angry disapproval of Jagadguru and all those for whom His Holiness speaks..........................I would tell the Jagadguru that to every man his conscience is his God............conscience is but the pulse of reason............"*

పైదాని యర్థమేమనఁగా :

"..................................................................

### మహాత్ముఁడు అపరబుద్ధదేవుఁడు.

మహాత్ముఁడు (శ్రీగాంధీగారు) తన యహింసాసిద్ధాంతముచేతను, జాతివైషమ్య నిర్మూలన నిశ్చయముచేతను నీకాలమున బుద్ధుని మిక్కిలి యనుసరించుచున్నవారని నేను దలంచుచున్నాను. జగద్గురువులును, వారిపక్షపు ప్రజలును నాదృఢవిశ్వాసములపై ప్రబలమగుకోపము గల్గియున్నప్పటికిని, 'నేను వానిననుసరించియే (అనఁగా నేను దృఢముగ నమ్మియున్న విషయముల ప్రకారమే) నడచితీరవలయును.................. ప్రతిమనుష్యునకును వానియంతరాత్మయే దేవుఁడని నేను జగద్గురువులకు మనవిచేయుచున్నాను............హేతుత్వమున కంతరాత్మయే ప్రాణము...............'

దీనినిబట్టి చూడఁగా, శ్రీరంగయ్యర్ గారు సహిత మంతరాత్మయే దేవుఁడనియుఁ, నది చెప్పుప్రకారమే నడచుకొనవలయుననియుం, నమ్మియున్నవారిలోనివారేయని తేలుచున్నదిగదా! అంతియగాక, శ్రీగాంధీగారు కేవల బుద్ధదేవునివంటివారేయని శ్రీరంగయ్యర్ గారియంతరాత్మ వారికి బోధించుచున్నట్లుగూడ మనము పైవాక్యములచేఁ దెలిసికొనఁగలము. ఇఁకనీవిషయమై శ్రీగాంధీగారియంతరాత్మ వారి కేమిబోధించుచున్నదో, యానంగతెని, వారు శ్రీరంగయ్యర్ గారియొక్క పైవ్రాతపై గావించిన యీ క్రిందివ్యాఖ్యానమునుండి మనము తెలిసికొందము:—

[ఈ క్రిందివిషయమును శ్రీగాంధీగారు 7-2-1933 తేదీన 'అసోసియేటెడ్-ప్రెస్' వారికొసంగియుండఁగా, దానిని 8-2-1933 తేదీ "హిందూ"పత్రిక ప్రచురించియున్నది; దానినిగూడ యెత్తి పైనదెల్పినరీతిగ శ్రీశంకరనారాయణఅయ్యర్ గారు గ్రంథస్థము చేసియున్నారు.]

శ్రీ గాంధీగారి వ్యాఖ్యానము.

"..................................................................

Then, Mr. Ranga Iyer, in his enthusiasm and blind affection for me, has been betrayed into an unfortunate analogy. I do not consider myself in any way fit to be compared with the Buddha. I regard myself as a very common man—a poorman-worker, liable to all the errors mankind is prone to make. I am merely a humble truth-seeker. But the analogy is unfortunate for another reason also. Sanatanists would say that the Buddha was an atheist, and that he did not accept the authority of the Vedas and did not believe in their divinity—not that as a matter of fact, he was an atheist or did not believe in the Vedas. But, what he really was, is not pertinent to our point. Therefore, if I am also considered an atheist or non-believer in the divinity of the Vedas, I am certainly out of court, as a reformer asking Hindus to reject modern Uutouchability as being wholly against Hindu Shastras regarded as a whole."

ఇఁక దీనియర్థ మేమనఁగా:—

" ... ... ... ... ... ...

ఇఁక శ్రీరంగయ్యర్ గారు, వారియొక్క యుత్సాహోద్రేకముచేతను, నాయందుఁ దమకుఁగలమిక్కుటమగు గుడ్డిప్రేమచేతను, ననుచితమగు నొక మతవిశ్వాసరహితమైనపోలికకు నన్నుదింపియున్నారు. నేను బుద్ధునితో సరిపోలఁదగినవాఁడనని నామట్టుకు నేనుతలంపను. నేను నన్ను సామాన్యమనుష్యునిగనే దలంతును.—దీనుఁడను; మనుష్యజాతి యెన్నిప్రమాదములపాలగుట కవకాశముగలదో, యన్నిప్రమాదములకును లోనుగాఁదగినవాఁడను. సత్యమునుదెలిసికొనుటకు మాత్రమే తంటాలుపడువాఁడను. అంతియగాక మఱియొకహేతువుచేతగూడ (శ్రీరంగయ్యర్ గారు కావించిన) పైపోలిక యనుచితము గానున్నది. బుద్ధుఁడు నాస్తికుఁడనియుఁ, నతఁడు వేదములయొక్క ప్రామాణ్యత నంగీకరింపలేదనియుఁ, నవి యపౌరుషేయములని నమ్మలేదనియుఁ సనాతనులు చెప్పుదురు—నిజమున కాయన నాస్తికుఁడగుటయుఁ, వేదములను నమ్మకపోవుటయుఁ, సత్యముగాదు.

నిజమున కాయన యెట్టివాఁడైనను నిప్పుడది మనప్రస్తుతవిషయమునకు సందర్భించినదికాదు. కాఁబట్టి నన్నుగూడ నాస్తికునిగఁగాని, వేదముల యపౌరుషేయత్వమున నమ్మకములేనివానినిగఁగాని భావించినచో, నస్పృశ్యత హిందూశాస్త్రములన్నిఁటికిని బూర్తిగ విరుద్ధముగావున దానిని వదలివేయుఁడని హిందువులకు బోధించు సంఘసంస్కర్తవంటివాఁడనే కావలసివచ్చుటచే, నా కచ్చోట స్థానమే యుండఁజాలదు."

దీనినిబట్టిచూడఁగా, "నంతరాత్మ దేవు"డనియు "నది యుక్తాయుక్తములను బోధించు" ననియు నమ్మువారిలోనే, వారివారియంతరాత్మ లెట్లు వేఱువేఱురీతులుగ బోధించునదియుఁ దెలియవచ్చుచున్నది. అంతియగాక, యుక్తాయుక్తములను బోధింపఁజాలిన దేవునిస్వరూపమగు నంతరాత్మయొక్క సహాయసంపదగలవారయ్యును, శ్రీగాంధీగారు, మనుష్యజాతికి స్వభావసిద్ధములగు భ్రమప్రమాదములకన్నిఁటికిని దామగూడ లోనగువారమని చెప్పికొనుటలో నర్థమేమియో బోధపడుటలేదు ! ఐనచో నిఁక వీరి యంతరాత్మయొక్క ఘనత యేమున్నది? సామాన్యులకును వీరికిని యుక్తాయుక్తనిర్ణయ విషయమునఁ గలభేదముమాత్ర మేమి ?

దానికేమిగాని, యన్నిఁటిని మించినచిత్ర మింకొకటి మనమీసందర్భమున దెలిసికొనవలసిన బాకీయున్నది. ఏమందురా ? పై "యంతరాత్మవాదము"ను జేయువారిలో నొకరియంతరాత్మ బోధించినట్లు వేఱొకరియంతరాత్మ బోధింపకపోవుట యట్లుండఁగా, నొక్కరియంతరాత్మయే యొకసారి సత్యమనిబోధించినదాని నింకొకసారి యసత్యమనియు, నొకసారి ధర్మమని బోధించినదాని నింకొకసారి యధర్మమనియు, నొకసారి యుక్తమని బోధించినదాని నింకొకసారి యయుక్తమనియుఁగూడ బోధించుచున్నది ! అ ట్లెవరికి బోధించినదందురా! మన శ్రీగాంధీగారికే! ఎట్లనిన, నీనడుమ 'గురువాయూరు' దేవాలయమున నస్పృశ్యులకుఁ (జండాలురకుఁ) బ్రవేశము గల్గింపనిచోఁ దా ముపవాసదీక్ష పూని ప్రాణత్యాగము చేసికొందుమని శ్రీగాంధీగారు పట్టుపట్టినసందర్భమున, 'చిట్టగాంగు' పురవాస్తవ్యులగు శ్రీయుత కాశీశంకరచక్రవర్తిగా రనువారు, 5-12-1932 తేదీన శ్రీగాంధీగారికి వ్రాసినజాబులో నీక్రిందిరీతిని బ్రశ్నించియున్నారు:—

[ఈవిషయములు కలకత్తానుండివెలువడు "సనాతని"పత్రిక తే 26-3-1933 దీ సంచికలోఁ గలవు."

"......I revere you, I love you, & hope you remember how wholeheartedly and at what cost I had rushed out to help your movement in 1921, and afterwards devoted myself to the services of the lowest of the Antyajas (Dom, Hadi &c.) here.........

Now I beg most humbly to appeal to you to ponder over whether the line you have now taken to reform the Hindu society is not a wrong one...........

... ... ... ... ... ... ...

Mahatmaji, you may say that you do this at God's call. But may I be permitted to enquire whether you are a true seer and able to perceive His call ?..............

... ... ... ... ... ... ...

Kindly see if it is not a fall from truth to error:—

| TRUTH IN 1921. | ERROR IN 1932. |
|---|---|
| You said in 1920—21:— | You say in 1932:— |
| "It (to ask men to intermarry & interdine) is tantamount to asking Hindus to give up their religion." | "Restriction on intercaste dining and marriage is no part of the Hindu Religion. This reform is coming sooner than is expected." |
| "Prohibition against intermarriage and interdining is essential for a rapid evolution of the soul." | "Wherever touchables and untouchables, Hindus and non-Hindus are invited to join dinner parties, I welcome as a healthy sign." |
| "Interdrinking, interdining, intermarrying, I hold, are not essential for the promotion of the spirit of democracy." | "Dining and marriage restrictions stunt Hindu society." |
| "I believe that caste has saved Hinduism from disintegration." | "Caste is a social evil." |
| "I am inclined to think that the law of heredity is an internal law and any attempt to alter that law must lead, as it has before led, to utter confusion." | "Caste has got to go." |

—From "Sanatani" Vol. 1, No. 3, pp. 1.2.

దీనియర్థ మేమనఁగా:—

"......నేను మిమ్మును గౌరవింతును; నేను మిమ్మును ప్రేమింతును; 1921 సం॥ లో మీయుద్యమమునకుఁ దోడ్పడుటకు నేనెంతటి మనఃపూర్వకముగను, నెన్నివ్యయ ప్రయాసములను సహించియుఁ బరుగులెత్తితినో, యటుపిమ్మట నంత్యజులలోని మిక్కిలి నికృష్టజాతులయొక్క సేవకై యిచ్చట నెంతథారపోసితినో, యది మీకు జ్ఞాపకమున్న దని నమ్ముచున్నాను............

ఇఁక నిప్పుడు హిందూసంఘమును సంస్కరించుటకై మీ రవలంబించినమార్గము తప్పుమార్గముగాదా యనుసంగతిని మీరు బాగుగఁ బర్యాలోచింపఁగలందులకై నేనిపుడు మిక్కిలి వినయపూర్వకముగఁ దమకు మనవిచేసికొనుచున్నాను............

... ... ... ... ... ... ...

మహాత్మా! మీరు దీనిని దేవునియొక్కయాజ్ఞప్రకారము చేయుచుంటిమని చెప్పవచ్చును. కాని, నిజముగా మీరు సత్యమును జూడఁజాలిన దివ్యదృష్టిగలిగి యాయనయొక్క యాజ్ఞను గ్రహింపఁదగినసామర్థ్యమును గల్గియే యుంటిరా యను విషయమును నేను విచారించుటకు నా కనుజ్ఞనిచ్చెదరా?............

... ... ... ... ... ... ...

ఇది, సత్యమునుండి జారి తప్పుమార్గమునఁ బడుటకాదేమో యీక్రిందివిషయములను దయచేసి చిత్తగింపుఁడు:—

| 1921-వ సం॥ లోని సత్యము. | 1932-సం॥ లోని తప్పు. |
|---|---|
| మీరు 1920-21-వ సంవత్సరములలో నీక్రిందిరీతిగఁ జెప్పియుంటిరి:— | 1932 సం॥ లో మీరీక్రిందిరీతిగఁ జెప్పుచున్నారు:— |
| "మనుష్యులను, నంతర్జాతీయభోజనములను జేయుఁడనియు, నంతర్జాతీయవివాహములు చేసికొనుఁడనియుఁ జెప్పుట, హిందువులను వారిమతమును విడనాడుఁడని చెప్పుటతో సమానమే." | "అంతర్జాతీయ (వర్ణసంకర) భోజనములవిషయమునను, నట్టివివాహములవిషయమునను, గల నిషేధములు హిందూమతమునకు సంబంధించినవిగావు. ఈసంస్కరణ మనుకొనినప్పటికంటెఁ జాల త్వరలోనే వచ్చుచున్నది." |
| "వర్ణసంకరవివాహభోజనములకు సంబంధించిననిషేధములు, జీవుఁడు త్వరలో | "ఎక్కడనైనను స్పృశ్యులును, నస్పృశ్యులును, హిందువులును, నితరులును, కలిసి |

| 1921-వ సం॥ లోని సత్యము. | 1932 సం॥ లోని తప్పు. |
| --- | --- |
| మోక్షమునొందుటకు మిక్కిలి యావశ్యక ములు." | సహపంక్తిభోజనములుచేయుట. కావ్వ నింపఁబడినచో నేను దానిని శుభసూచక ముగ సంభావించుచున్నాను." |
| "వర్ణసంకరభోజనములును నంతర్జాతీయవివాహములును, బ్రజాప్రభుత్వోద్దేశ మభివృద్ధిచెందుట కావశ్యకములుగావని నా తలంపు." | "భోజన, వివాహ, సంబంధములగు నిషేధములు హిందూసంఘముయొక్క యభ్యుదయమును భంగపఱచును." |
| "వర్ణవ్యవస్థ, హిందూమతమును జీలిపోకుండ సంరక్షించినదని నానమ్మకము." | "వర్ణవ్యవస్థ, సంఘమున కరిష్టము." |
| "వంశపారంపర్యధర్మము మనదేశమునకుఁ జెందినదని నాకుఁ దోఁచుచుండును; దానిని మార్చుటకుఁజేయు నెట్టియత్నమైనను, నివివఱలోజరిగినట్లే శుద్ధధ్వంసమునకు మాత్రమే మార్గమగును." | "వర్ణవ్యవస్థ యంతరించితీరవలయును." |

... ...

—"సనాతని"పత్రిక, సంపు. I, సంచి. 3, పుటలు. 1-2.

ఇఁకఁ, బైజాబునకు శ్రీగాంధీగారిచ్చినప్రత్యుత్తర మెంతరమ్యముగానున్నదో తిలకింతము:—

## { శ్రీగాంధీగారు శ్రీయుత కాళీశంకరచక్రవర్తిగారికి వ్రాసిన ప్రత్యుత్తరము. }

"I have gone through your printed letter very carefully. You do not expect me to argue out my position. My argument is to be found in my writings. Therefore, to you I can only say I have been endeavouring to follow the light that God gives me, and whatever I have written at any time I have believed and have meant fully. Where you find contradictions in my writings, I find nothing but a due fulfilment or elaboration of a previous position. But I am not so much concerned with showing consistency in my writings as with stating that I have given to the readers the truth as I have known it at the time of writing. I, however, heartily endorse your fear that whatever I have said believing it

**to be true may after all be found to have been a vast error. But I take comfort (very poor, you may say) in the thought that it is a possibility common without exception to the whole of mankind. But you will perhaps agree that so long as I do not see the error of my ways myself, I would be cowardly and disloyal to the truth I worship if I fail to act up to my conviction."**

**—" Sanatani" Vol. I No. 3, pp. 3.**

దీని యర్థ మేమనఁగా:—

"మీరువ్రాసిన యచ్చుజాబును నేను మిక్కిలిజాగ్రత్తతోఁ జదివితిని. నా మతము నిపుడుతర్కింపుమని మీరుకోరవలదు. నావాదము నేనువ్రాసినవ్రాతలలోనే కనుపించును. కావున నేను మీకుఁ జెప్పఁజాలినదేమనఁగా, దేవుఁడు నాకిచ్చుజ్ఞానము ననుసరించి ప్రవర్తించుటకు నేను యత్నించుచున్నాను; నేనెప్పు డేదివ్రాసియుండినను దానిని బూర్ణభావముతోనే నమ్మియుంటిని. నావ్రాతలలో మీకుఁ బరస్పరవిరుద్ధములు గనిపించినపట్ల, మొదటవ్రాసినదానియొక్క భావమే పూర్ణముగను విపులముగను విస్తరింపఁబడుటమాత్రమేతప్ప, నాకు వేఱేమియుఁ గనుపించుటలేదు. నేనువ్రాయునప్పటికి నాకుఁ దెలిసియున్న సత్యమునే పాఠకులకుఁ దెలిపియుంటిననిచెప్పుటయే నాకుఁ గావలసినదిగాని, నావ్రాతలలోని సమన్వయమును గనుపఱచుటతో నాకంతఁగాఁ బనిలేదు. నేను సత్యమనినమ్మి బోధించిన దేదియైననుగూడ తుదకుఁ బెద్దతప్పుగాఁ గన్పట్టునున్న దని మీరు భయపడుచుండుటను నేను హృదయపూర్వకముగ గుర్తించియున్నాను. కాని, (యదిదైన్యమని మీరుచెప్పినఁ జెప్పుదురుగాక!) మనుష్యజాతిలోని ప్రతివానికిని నట్టి ప్రమాదము స్వభావసిద్ధమైయున్నదనియు, దానికిలోనుగానివాఁ డొక్కఁడుగూడ నుండఁడనియు నమ్మి నామనస్సును సమాధానపఱచుకొనెదను. నామార్గమందలితప్పు నాకే గనుపట్టువఱకును నానమ్మకముననుసరించి నేను బ్రవర్తింపకపోయినచో, నేను భిరికిపందనగుదుననియు, నేనుసేవించుసత్యమునకు ద్రోహముగావించినవాఁడ నగుదుననియు, మీరంగీకరింతురని తలంచెదను."

—"సనాతని" పత్రిక; సంపు. I, సంచి. 3, పుట 3.

ఇఁక నిందలితత్త్వమును సువ్యక్తపఱచుటకై మేముయత్నించుటకంటె, దానినిదివఱకేగావించియున్న శ్రీయుత వసంతకుమారచట్టోపాధ్యాయగారివ్యాఖ్యానము నీక్రిందవినిపించుట మంచిదని తోఁచినందున నట్లు చేయుచున్నాము:—

## FROM: SRIJUT BASANTA KUMAR CHATTOPADHYAYA.

"I have read the letter written by Sjt. Kali Shankar Chakravarti to Gandhiji on the 5th. December, 1932, and the reply by Gandhiji..................

Sjt. Chakravarti has done a great service to the public by prominently bringing out the contradictions between Gandhiji's views in 1921 & 1932 as regards the caste system. Any unprejudiced man on reading these contradictory statements of Gandhiji will be convinced that Gandhiji is absolutely unreliable as a guide in social and religious matters.

Gandhiji should have openly admitted in this reply that he now thinks that the views which he expressed in 1921 were wrong. He should have also given reasons why he thinks so. But he has not done so.

Gandhiji says "whatever I have said believing it to be true may after all be found to have been a vast error." If this were his conviction he would not have attempted to compel others to conform to his views on pain of being considered responsible for his death. He further states "I take comfort in the thought that it is a possibility common without exception to the whole of mankind." His statement reveals either that he is ignorant of the fundamental principles of Hindu Shastras, or he does not believe in them..................

... ... ... ... ... ... ..."

—"Sanatani," Vol. I, no. 3, pp. 3.

పైవ్యాఖ్యానమున కర్థ మేమనఁగా:—

"శ్రీయుత కాళీశంకరచక్రవర్తిగారు 1932-వ సం|| డిసెంబరు 5-వ తేదీన శ్రీ గాంధీగారికి వ్రాసినజాబును, గాంధీగారిచ్చిన ప్రత్యుత్తరమును నేను జదివియుంటిని...

వర్ణవ్యవస్థనుగుఱించి 1921-వ సంవత్సరమునను, 1932-వ సంవత్సరమునను గాంధీగారికిఁగల పరస్పర విరుద్ధభావములను సువ్యక్తముగ బహిరంగపఱచుటచే శ్రీయుత చక్రవర్తిగారు లోకమునకు గొప్పయుపకారమును గావించియున్నారు. గాంధీగారి యొక్క పరస్పరవిరుద్ధములగు పైప్రసంగములను జదివినపిమ్మట, మత, సాంఘిక, విషయములలో గాంధీగా రెంతమాత్రమును నాదర్శప్రాయులుగ నుండఁదగరని దురభిమానరహితుఁడగువాఁ డెవ్వఁడైనను గూడ నమ్మితీరును.

గాంధీగారు 1921-వ సంIIలో వెలువరించిన తమయూహలు తప్పులనితెలిసి కొంటిమని వైప్రత్యుత్తరమున స్పష్టముగ నంగీకరించియుండవలసినది. అట్లు తామిపుడు తలంచుటకు హేతువులనుగూడ వినిపించియుండవలసినది. కాని, వారట్లు చేయరైరి.

గాంధీగారు, తాము "సత్యమనినమ్మి బోధించిన దేదియైననుఁగూడ తుదకుఁ బెద్ద తప్పుగాఁ గనుపట్టుచున్నద"ని చెప్పిరి. ఇదియే వీరి నిజమైనవిశ్వాసమగునేని ('గురువాయూరు'లోని శ్రీకృష్ణదేవాలయమున నస్పృశ్యులు ప్రవేశించుటకు సనాతను లిష్ట పడనిచోఁ దా ముపవాసదీక్షపూని ప్రాణత్యాగము చేయుదుమని పట్టువట్టినసందర్భమునఁ) దమచావునకు నితరులు (సనాతనులు) కారణముగావలసివచ్చునను బాధచే వారందఱును గాంధీగారియొక్క యభిప్రాయములనే యనుసరించితీరవలయునని శ్రీగాంధీగారు నిర్బంధించియుండరాదు. అంతియగాక వారు, "మనుష్యజాతిలోని ప్రతివానికిని నట్టిప్రమాదము స్వభావసిద్ధమైయున్నదనియు, దానికిలోనుగానివాఁ డొక్కఁడుగూడ నుండఁడనియు, నమ్మి నామనస్సును సమాధానపఱచుకొనెద"నని చెప్పియుండిరి. వారి యీప్రసంగమువలన, హిందూశాస్త్రములయొక్క మూలసిద్ధాంతములు వారికిఁ దెలియవనిగాని, కానిచో, వానియందు వారికి నమ్మకములేదనిగాని, వెల్లడియగుచున్నది..."

—"సనాతని"పత్రిక; సంపు. I, సంచి. 3, పుట. 3.

కావునఁ బైవిమర్శనుబట్టిచూడఁగా, మేము లోగడచెప్పియున్నప్రకారము మన నవనాగరకు "లంతరాత్మయొక్క ప్రబోధము" లని భ్రమపడునవి జీవునియొక్క కర్మవాసనలననుసరించి యంతఃకరణమునుండి వెలువడు బుద్ధియొక్కప్రేరేపణలేగాని, ధర్మాధర్మములనుబోధించు దేవునియొక్క యాజ్ఞలుగావనియు, నవి యొక్కవ్యక్తియందే కర్మానుగుణ్యముగ వేఱువేఱుసమయములలో మారుచుండుటచే వానిని నమ్మి యాప్రకారము ప్రవర్తింపఁజూచుట యుపద్రవకరమనియు మనము నిశ్చయింపవచ్చునుగదా!

ఇఁక నీవిషయమునే శ్రీగాంధీగారిసందర్భమున ఋజువుచేయు మఱియొకచిన్న సంగతిని దెలిసికొందము. శ్రీగాంధీగారు తమయంతరాత్మయొక్కబోధ ననుసరించి, 'గురువాయూరు' నందలి శ్రీకృష్ణదేవాలయములోని కస్పృశ్యులను బ్రవేశింపనీయనిచోఁ దా ముపవాసదీక్షపూని ప్రాణత్యాగముచేసికొన నిశ్చయించియుంటిమని ప్రకటించినసమయమున, నట్టివాదమునే యాధారముగాఁగొని, యితరులుగూడ వర్ణసంకరభోజనములు, నంతర్జాతీయవివాహములు, మొదలగు వారివారిమనోరథముల నీడేర్చుకొనుటకుఁ దమరుగూడ తమ యంతరాత్మలయొక్క బోధలననుసరించి యుపవాసదీక్షలుపూని ప్రాణత్యాగములను జేసికొందుమని బయలుదేరుదురనియు, నందుచే సంఘ

మున కుపద్రవము సంభవించుననియు నొకవిలేఖరి శ్రీగాంధీగారికి వ్రాసియుండెను. వారు తమ 'హరిజన్'పత్రికయొక్క 18-3-1933 తేదీ సంచికలో "The Danger of Imitation." (అనఁగా "నొకరినిజూచి యొకరు నటింపఁజూచుటవలని యపాయము") అను శీర్షికక్రింద, దానికి జవాబువ్రాయించియుండిరి. అందులో, వారు తమ యంతరాత్మయొక్క ప్రబోధము 'Inner Voice' ను గుఱించి వ్రాసినవిషయములపైన, 16-4-1933 తేదీ "సనాతని"పత్రిక యీక్రిందిరీతిని వ్యాఖ్యానముగావించియున్నది. ఈవ్యాఖ్యానముచే, "నంతరాత్మవాదము"నందలి సత్యమగుతత్త్వము మఱింతబాగుగ విశదముకాఁగలదని తలఁచి దానినిటఁ బొందుపఱచుచున్నాము:—

### THE INNER VOICE.

" ... ... ... ... ... ...

Now about the "inner voice." Gandhiji in this article refers to two kinds of inner voice,—the genuine and the fraudulent. He has failed to notice a third kind—the most common form of the inner voice—*the mistaken inner voice!* The inner voice of Mahomed declared that it was a sin to worship an image. The inner voice of Gandhiji declares that image worship is good. One of them must be mistaken. No doubt the inner voice of Lenin declared that it was the right thing to seize by violence the property of the rich in order to help the poor. But Gandhiji's inner voice declares that it is absolutely wrong. Every person is cartainly at liberty to declare what he learns from the inner voice. Those who have faith in him, those who are convinced that his inner voice reveals the truth will follow his lead. But those who have doubt in the matter must be allowed the liberty of acting in a different manner. The trouble in connection with the Guruvayur affair was this. Though the Sanatanists doubted that the inner voice of Gandhiji revealed the truth regarding temple entry, yet they were being compelled to open the temple gates to the untouchables on pain of being considered responsible for Gandhiji's death.

*The fact is that the inner voice depends to a considerable extent upon a person's education and traditions.* Gandhiji imbibed to some extent the traditions of Vaishnava family. But the Englith education which he received in India and England was not congenial to those traditions. The writings of Christian writers like Ruskin and Tolstoy made a deep impression on his mind. At this stage he read the English translation to the Bhagavadgeeta. The

Geeta being a philosophical treatise laying down how one should perform his actions can for the most part be reconciled with the teachings of Christian writers. The Geeta did not lay down the detailed rules of conduct. Gandhiji's life in South Africa was an application in actual life of the principles of Ruskin and Tolstoy. Thus Gandhiji was by his education and early career eminently fitted for his life as an ideal Christian. This is why he was hailed as the greatest man of the world by earnest Christians all over the world. His ascetic habits and philanthropic activities made a profound impression upon the Hindus. This is why he was the idol of his countrymen in spite of his many unorthodox habits and views. The Hindus have an innate sense of catholicity and can to a large extent tolerate difference of views and habits. The trouble arose when Gandhiji attempted to force on Hindus some of the ideas which he imbibed from the west. The first notable instance was the agitation in connection with the Sarada Act. The culmination was reached in the Temple Entry agitation.

The Sanatanist believes that in these matters the truth has not revealed itself in the inner voice of Gandhiji. The Sanatanist applies a test to determine whether the inner voice is true or mistaken. The test is whether the inner voice agrees or not with the inner voice of acknowledged seers as recorded in the various Shastras, *viz.*, the Vedas, the Smritis, the Itihasas and the Puranas. If there is agreement then the seeker of truth may rest assured that he is proceeding on right lines. But if there is disagreement then some thing is wrong somewhere—probably one's mind and desire are peeping through the inner voice,—and the true Hindu will doubt the authenticity of his inner voice. He will not press forward in the direction in which he was proceeding. Far less will he attempt to compel others to follow his inner voice."
—"Sanatani," Vol. I, No. 6, pp. 5-6.

దీనియర్థ మేమనఁగా:—

అంతరాత్మయొక్కబోధ.

"... ... ... ... ..."

"ఇఁక నంతరాత్మయొక్కబోధసంగతి విచారింతము. గాంధీగారీవ్యాసమున నంతరాత్మయొక్క రెండువిధములగు బోధలనుగుఱించి ముచ్చటించిరి.—సద్బోధ,

దురోభ్చిధ. వారు మూఁడవవిధమగుబోధను గుర్తించియుండరైరి. అది మిక్కిలి సర్వసామాన్యముగనుండెడి విధమైనబోధ—అదియే పొరపాటుబోధ! (అనఁగా మంచిని జెడుగనియుఁ, జెడుగును మంచియనియు భ్రాంతిగల్గించెడిబోధ!) మహమ్మదుగారి యంతరాత్మ, విగ్రహారాధనము దోషమని ప్రకటించినది. గాంధీగారియంతరాత్మ, విగ్రహారాధనము మంచిదని బోధించుచున్నది. వానిలో నేదోయొకటి పొరపడియుండితీరవలయును. లెనిన్ (Lenin) (అను రష్యాదేశపు ప్రజానాయకుఁడు)గారి యంతరాత్మ, బీదలకు సహాయమొనర్చుటకై ధనవంతులయాస్తిని దౌర్జన్యముచే లాగికొనుటయే న్యాయమని బోధించినది. కాని, గాంధీగారియంతరాత్మ యది శుద్ధతప్పని బోధించుచున్నది. ప్రతివాఁడును దనయంతరాత్మనుండి గ్రహించినవిషయమును బహిరంగపఱచుటకు నిజముగ స్వాతంత్ర్యముగల్గియున్నాఁడు. వానియందు విశ్వాసముగలవారును, వాని యంతరాత్మ సత్యమునే వెల్లడించుచున్నదని నమ్మినవారును వానిమార్గము ననుసరించెదరు. కాని, యందువిషయమై సంశయముగలవారు వేఱురీతిగఁ బ్రవర్తించుటకు వారికి స్వాతంత్ర్య మొసఁగవలయును. గురువాయూరుసందర్భములో వచ్చిన చిక్కిదియే. దేవాలయప్రవేశవిషయమున గాంధీగారియంతరాత్మబోధ సత్యమును బ్రకటించుననుటలో సనాతనులు సందేహముగల్గియున్నప్పటికిని గాంధీగారిచావునకుఁ దాము కారకులగుదురనుబాధచే, దేవాలయద్వారముల నస్పృశ్యులకొఱకు దెఱచుటకై నిర్బంధింపఁబడుచుండిరి.

నిజమేమనఁగా, నంతరాత్మబోధ, యొకమనుష్యునియొక్క విద్యపైనను, వంశాచారముపైనను నాధారపడియుండును. గాంధీగారు కొంతవఱకు వైష్ణవకుటుంబసాంప్రదాయములను గ్రోలియుండిరి. కాని, వారు హిందూదేశమునను, నింగ్లాండుదేశమునను నభ్యసించిన యింగ్లీషువిద్య యాసాంప్రదాయముల కనుగుణ్యముగలేదు. రస్కిన్ (Ruskin,) టాల్‌స్టాయ్ (Tolstoy) మొదలగు క్రైస్తవగ్రంథకర్తలయొక్కబోధలు వారిమనస్సులో గాటముగ నాటుకొనినవి. ఇట్టిస్థితిలో వారు భగవద్గీతయొక్క యింగ్లీషు తర్జుమాను (భాషాంతరీకరణమును) జదివిరి. గీతాశాస్త్రము, మనుష్యుఁడు తనవిధుల నెట్లు నిర్వర్తింపవలసినదియుఁ దెలిపెడి వేదాంతగ్రంథమగుటచే, చాలభాగము క్రైస్తవమత గ్రంథకర్తలయొక్కబోధల కనుగుణ్యముగ దానిని సమన్వయింపవచ్చును. ఆచారధర్మములయొక్క వివరములను గీతాశాస్త్రము బోధించియుండలేదు. దక్షిణఆఫ్రికాలోని గాంధీగారిజీవితము, రస్కిన్, టాల్‌స్టాయ్‌గారల బోధలను బ్రత్యక్షముగ నాచరణలో బెట్టుటయే. ఆవిధముగ గాంధీగారు తమవిద్యావిధానముచేతను, దొల్లింటి ప్రవర్తనముచేతను దమజీవితమున నాదర్శప్రాయుఁడగు క్రైస్తవుఁడని సర్వవిధములఁ జెప్పఁదగి

యున్నారు. లోకమందంతటనుగల నిజమగుక్రైస్తవులు వీరిని లోకములోనికెల్లను మిక్కిలి గొప్పవారినిగ సంభావించియుండుట కిదియే కారణము. వీరి సత్ప్రవర్తనమును, వీరు మనుష్యజాతియొక్క మేలునకై పడుశ్రమయును హిందువులకు వీరిపై గట్టి విశ్వాసమును గల్గించినవి. వీరి యాచారములలోను, నభిప్రాయములలోను బూర్వాచార విరుద్ధములగునవి పెక్కులున్నను, వీరి దేశజనులకు వీరాదర్శప్రాయులగుట కిదియే కారణము. హిందువులు స్వాభావికముగఁ బరమతసహనముగలవారగుటచే నాచారభేదములను, నభిప్రాయభేదములను జాలవఱకు సహించియుండజాలుదురు. గాంధీగారు తాము గ్రోలిన పాశ్చాత్యసాంప్రదాయములను హిందువులలో బలాత్కారముగఁ బ్రవేశపెట్టుటకు యత్నించినపుడే చిక్కులు బయలుదేరినది. అట్టివానిలో ముఖ్యముగ మొట్టమొదటిది శారదాగారు తెచ్చిన వివాహశాసనసందర్భమున గాంధీగారుగావించిన యాందోళనమే. దేవాలయప్రవేశాందోళనమున నట్టిచిక్కు మిన్నుముట్టినది.

ఈవిషయములలో, గాంధీగారి యంతరాత్మయొక్క బోధలనుంచి సత్యము సరిగా వెలువడలేదని సనాతనులనమ్మకము. అంతరాత్మయొక్క బోధ సరిగానున్నదో, కాక పొరపడినదో, యాసంగతిని నిర్ణయించుటకు సనాతనుఁడు పరీక్షించిచూచును. వాఁడుచేయు పరీక్షయేమనిన, సుప్రసిద్ధులగు త్రికాలజ్ఞులచే వేదములు, స్మృతులుఁ, బురాణములు, నితిహాసములు మొదలగువివిధశాస్త్రములలోఁ దెలుపఁబడిన వారియంతరాత్మలయొక్క బోధలతోఁ దనయంతరాత్మయొక్క బోధ యేకీభవించునా యనునదియే. ఏకీభవించినచో, సత్యాన్వేషణపరుఁడగువాఁడు తాను సరియగుమార్గమునే యనుసరించుచుంటినని గట్టిగా నమ్మవచ్చును. కాని, యేకీభవింపక భేదించినచో, నెచ్చటనో యేదో లోపమున్నట్లే—బహుశః మనస్సులోనికోరికలే యంతరాత్మయొక్క బోధలోనుండి తలవెళ్లఁబెట్టుచున్నవని తెలిసికొనవలయును;—అప్పుడు నిజమగుహిందువుఁడు తనయంతరాత్మబోధ నిష్కళంకమైనదిగాదని శంకించును. తా నంశకుముం దనుసరించుచున్నమార్గమున నింకఁ దానే ముందునకు నడుగుపెట్టఁడు. తనయంతరాత్మయొక్క బోధ ననుసరింపుఁడని యితరుల నంతకంటెను నిర్బంధింపఁడు."

—"సనాతని" పత్రిక, సంపు. I., సంచి. 6, పుటలు. 5-6.

ఈ పైవిమర్శనమువలనఁగూడ, లోగడ మేము తెల్పియున్నట్లే, నవనాగరకు లంతరాత్మయొక్క బోధయనియు, నది దేవునియాజ్ఞయనియు భ్రమపడుచుండునది, జీవునియొక్క కర్మవాసనననుసరించి బయలువెడలు చిత్తవికారమేగాని వేఱుగాదనియు, నది యొకరియందున్నట్లింకొకరియం దుండకపోవుటయేగాక, యొక్కరియందే యొకక్షణ

మననున్న ట్లింకొకక్షణమున నుండవలసినపనిలేదనియు, నందుచే నది ధర్మాధర్మముల నెఱుఁగుటకుఁ దోడ్పడఁజాలదనియుఁ దేలుటలేదా ?

ఇఁక నొక్కవిషయమును జర్చించి యీవిషయమును ముగింతము. అంతరాత్మ భగవత్స్వరూపమగుటచే నది ధర్మాధర్మములను దెలుపఁజాలుననెడియెడల, నాభగవంతుఁడు సర్వజ్ఞుఁడగుటచే నాయనకు ధర్మాధర్మములుమాత్రమేగాక, వానితోఁబాటు లోకమున నన్నివిషయములును దెలిసియేయుండును గావున, నంతరాత్మకుఁగూడ సర్వవిషయములును దెలిసియేయుండవలయునుగదా ! అట్లు తెలిసియేయున్నవనితలంప వీలగునా ! పై "యంతరాత్మవాదము" చేయువారిలో నెవరినైననొకరిని, వారికిఁ దెలియనిశాస్త్రముల సంబంధమగువిషయమును దేనినైనను నడిగినయెడల వారియంతరాత్మతో నాలోచించి యావిషయమునకు సమాధానముఁ జెప్పఁజాలుదురా ? అనఁగా, గణితశాస్త్రవిషయమునఁగాని, జ్యోతిశ్శాస్త్రవిషయమునఁగాని, రసాయనశాస్త్రము, వైద్యశాస్త్రము మొదలగు నితరశాస్త్రవిషయములలోఁగాని యేదియైనను విషయ మెఱుఁగవలసివచ్చినచో నాయాశాస్త్రములను జదివికొన్నవారినడిగి వారివలననే యావిషయములను దెలిసికొనఁజాలుచున్నాము. కాని, యితరులవలన నది దెలిసికొనుట సాధ్యమగుటలేదు. అట్లుగాక, ప్రతివానికిని నంతరాత్మయే దైవస్వరూపమగుటచే నన్నివిషయములను జెప్పఁజాలినపక్షమున, లోకమున నిఁక నట్టిశాస్త్రములతోడను, శాస్త్రజ్ఞులతోడను వేఱుఁగఁ బని లేకయేపోయెడిది. అట్టిశాస్త్రములను జదివికొనినవారి యంతరాత్మమాత్రమే యట్టివిషయములను జెప్పఁజాలుటకును, నితరులయొక్కయంతరాత్మలు చెప్పఁజాలకపోవుటకును మననవనాగరకసోదరు లేమి సమాధానముచెప్పఁగలరు ? శాస్త్రములమాట యటుండనిండు. ఏట్టిశాస్త్రమునకును సంబంధించని యొకసామాన్యమగు లౌకికవిషయమునే యొకరు మనస్సులో నూహించియుండఁగా, రెండవవారు తమయంతరాత్మయొక్కసహాయముచే నావిషయమును దెలిసికొని చెప్పఁగలరా ? బాహ్యేంద్రియములకు గోచరింపని మనస్సులోనిమాట దెలిసికొనిచెప్పుట కష్టమే; దానిసంగతి యట్లుంచుఁడు. ఇంద్రియములకు గోచరించువిషయములైనను, గోచరింపవలసిన యింద్రియములకన్నిఁటికిని గోచరింపక యందులోఁ గొన్నిఁటికిమాత్రమే గోచరించినపుడుకూడ యావిషయమును నంతరాత్మయొక్కసహాయముచేఁ దిన్నఁగా దెలిసికొనుట సాధ్యముగాకున్నది. ఎట్లనఁగా: నొకనికిఁ గట్టిగాఁ గన్నులుమూసి, పిదప నెచటినుండియో మనయిష్టమువచ్చిన యొకవస్త్రమును దెచ్చి వానిచేతికిచ్చి, యది తెల్లనిదో, నల్లనిదో, యెఱ్ఱనిదో, పచ్చనిదో చెప్పుమనినఁ జెప్పఁగలఁడా ? వానియంతరాత్మ భగవత్స్వరూపుఁ డనుకొనినచో నాయంతరాత్మ నడిగి తెలిసికొని చెప్పవచ్చునుగదా ! అట్లు చెప్పఁగలమనుకొనువారు మననవనాగరక

లలో నెందఱుగలరో, యేదీ ముందునకురమ్మనుఁడు చూతము! ఈసందర్భమున లోపించినది నేత్రేంద్రియ మొక్కటేగాని తక్కినజ్ఞానేంద్రియము లేవియు లోపింపలేదు. త్రాకిచూచుటకుఁ జేతులపై చర్మమున్నది; వినుటకుఁ జెవులున్నవి; రుచిచూచుటకు నాలుకయున్నది; వాసనచూచుటకు ముక్కున్నది. మూయఁబడినవి కన్నులొక్కటి మాత్రమే! పోనిండు. దీనిమాటకూడ విడిచిపెట్టుఁడు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములలో నేదియు లోపింపక యన్నియుఁ బనిచేయుచున్నప్పుడుగూడ, వానియొక్క ప్రయోజనములేకయే కొన్నివిషయముల నెఱుఁగుటకుఁ గేవల మితరులయొక్కజ్ఞానముపైనను, మాటలపైనను (ననఁగా నాప్తవాక్యముపైన) నాధారపడవలసివచ్చుచున్నది. ఎట్లనినఁ, గొన్నియావులను, వానికేపుట్టి బాగుగనెదిగి పాలువదలినదూడలను నన్నిఁటి నొక్కచో గట్టిపైచి, యంతకుముందు వానినిజూచియెఱుఁగని మననవనాగరకసోదరు నొకని నచటికి దీసికొనిపోయి, యే యావునకుఁబుట్టినదూడ యేదియో చెప్పుమనినచోఁ జెప్పఁజాలునా? ఏల చెప్పరాదు? త్రాకి తెలిసికొనఁ గాలుసేతులున్నవి; పాఱఁజూచుటకుఁ గన్నులున్నవి; వినుటకుఁ జెవులున్నవి; రుచిఁజూడ నాలుకయున్నది; వాసనఁగొనుటకు ముక్కున్నది. ఇవియన్నియు నుపయోగింపకపోయినను, నడిగి తెలిసికొనుటకు చైవస్వరూపమగునంతరాత్మ లోపలనున్నదిగదా! అంతయేల? ఎవ్వనిమట్టుకు వానికి దనకంటె ముందుపుట్టియున్న తనసంబంధులగు నన్నలు నక్కలు, మొదలగు నాప్తబంధువులును, దుదకుఁ దల్లిదండ్రులునుగూడ ఫలానివారనుసంగతి వారివలననైనను, నితరులవలననైననుమాత్రమే తెలిసికొన వీలగుచున్నదిగాని, స్వయముగ నెవనియంతటవానికిఁ దెలిసికొనవీలగుచున్నదా? ఆవిషయమున నితరులమాటలపై (యనఁగా, నాప్తవాక్యముపై యాధారపడక తప్పుచున్నదా? వానియింద్రియములును, నంతరాత్మయు నేమి యుపయోగపడఁజాలియున్నవి? ప్రత్యక్షముగ నొకవిషయమును గ్రహించి తెలిసికొనుటకు సాధనములైనవి యింద్రియములు. వానియొక్కసహాయముతో గూడియున్నప్పుడుగూడ యంతరాత్మ కొన్నివిషయములను దెలిసికొనఁజాలక యాప్తవాక్యమువంటి యితరసాధనములపైఁ బైన దెల్పినరీతిగ నాధారపడవలసివచ్చుచున్నది. ఇట్టియంతరాత్మ, యిఁక నింద్రియములకు గోచరింపక, యీలోకమునను, నీజన్మమునను బ్రత్యక్షముగ దెలియరాక యుండెడిఫలములనిచ్చు ధర్మాధర్మములను బోధింపఁజాలుననితలంచుట కేవలము యుక్తిబాహ్యమును, హేతురహితమును, భ్రాంతిమూలకమును, జ్ఞానశూన్యమును నగు వట్టిబాల్యచేష్టితము (absolute childishness)మాత్రమేయనియుఁ, గానిచో లోకవంచనమునకై స్వార్థపరులుచేయు దుర్వాదమనియుఁ బైవిమర్శనమువలన రూఢియగుచుండలేదా?

కాని, తిరిగి యిచట మననవనాగరకు లొకయడ్డు చెప్పవచ్చును. ఏమనిన : "లోఁగడ నీప్రకరణముననే, 'యెట్టియెట్టిధర్మాధర్మములచే నెట్టియెట్టి సుఖదుఃఖములు గల్గునో యావిషయమును శాస్త్రముచెప్పెనా ?' యనుశీర్షిక క్రింద నాల్గవవిషయమగు నాయుర్వేదమునుగుఱించి ప్రసంగించునపుడు 'తొల్లిఁటికవులును మొదలగువా రిప్పటి నవనాగరకకవులవలెఁగాక వేదశాస్త్రమతాచారబద్ధులును, వానియందుఁ బరమవిశ్వాసము గలవారును' నని వ్రాసియుంటిరిగదా ! అట్టి పూర్వకవులలో నగ్రగణ్యుఁడగు కాళిదాస మహాకవిని బ్రామాణికునిగఁగూడ తీసికొని యాయనరచించిన రఘువంశమునుండి యొక ప్రమాణము నెత్తి యీప్రకరణముననే, 'స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్రలందుఁ జెప్పఁ బడినవిషయములకుఁ బ్రమాణము'లను శీర్షిక క్రింద చూపిగూడయుంటిరిగదా ! ఆ కాళి దాసమహాకవియే తనశకుంతలానాటకమున నీక్రిందిశ్లోకములో, నంతరాత్మయొక్క బోధయే సందేహములనుదీర్ప సాధనమని చెప్పియున్నాఁడు:—

శ్లో. "సతాం హి సందేహపదేషు వస్తుషు,
ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః."

అనఁగా, సత్పురుషులకు సంశయముగల్గినచోట్ల మనస్సుయొక్క బోధయే ప్రమాణ మని యర్థముగాదా ? దీనినిబట్టి ధర్మాధర్మము లెఱుఁగుటకు నంతరాత్మయే యాధారమని తేలుటలేదా ?" యని సంశయముగలుగవచ్చును. కాని, యానాటకమందలిసందర్భ మాలోచించినయెడల మనస్సు ప్రమాణమని చెప్పినసంగతి ధర్మాధర్మముల నెఱుఁగుటలోఁ గల్గుసందేహమునకు సంబంధించినదిగాదు. ఏమనిన, శకుంతలనుజూచినపు డామెను బెండ్లి యాడవలయునని దుష్యంతునకుఁ గోరికకల్గెను. కాని, యామె బ్రహ్మర్షియగు కణ్వుని యాశ్రమమం దుండుటచే బ్రాహ్మణకన్యయేమోయని సందేహముకల్గెను. తాను క్షత్రియుఁడగుటచే బ్రాహ్మణకన్యనుగోరుట ధర్మముగాదు. ఆసంగతి యాయన యెఱుఁ గనిదియుఁగాదు. ఆవిషయమై యాయనకు సందేహమునులేదు! సందేహమున్నచో నది ధర్మశాస్త్రములమూలముననో, వానినెఱిఁగిన మహనీయులసహాయముననో తీరవలసినదే గాని, వేఱువిధముగఁ దీరఁజాలదు ! ఇఁక నాయనకుఁగల్గిన సందేహ మేమనఁగా, "శకుం తల బ్రాహ్మణకన్య యగునా, కాదా?" యనియే. ఆవిషయము ధర్మశాస్త్రములలో నుండదు! లోకమునఁబుట్టువారందఱు నెవ్వరెవ్వ రేయేకులమునఁ బుట్టిరో తెలుపుటకై ధర్మశాస్త్రము లేర్పడియుండలేదు! అట్లు తెల్పుట యేగ్రంథమునకును సాధ్యముగాదు. అట్టివిషయమున దుష్యంతునకు సందేహముగల్గెను.ఐనను సామాన్యముగఁ దనమన స్సెన్నఁ డును నధర్మమార్గమునఁ బోవునది కాకపోవుటచే, శకుంతల బ్రాహ్మణకన్యయే యైన

యెడలఁ దనమన స్సామెను గోరియుండదనియుఁ, గావున నామె బ్రాహ్మణకన్యయై యుండదనియు నాతఁడు నిశ్చయించుకొనెను. ఐనను దనమనస్సుయొక్క పవిత్రతను బాగుగ నెఱిఁగినవాఁడగుటచేత నాతఁడు దాని నాధారముగఁ గొనెను. అట్లే యాయన మనస్సుయొక్క బోధ తుదకు సత్యముగూడ నైనది. అందుచేతనే యాయనవంటి పవిత్రహృదయులకుమాత్రమే సందేహవిషయములలో మనస్సు ప్రమాణమనియు, సామాన్యు లందఱివిషయమునను నట్లు గాఁజాలదనియుఁ జెప్పుటకే "సతాం హి..." యని వాడియున్నాఁడు. (అనఁగా సత్పురుషులకుమాత్రమే యని యర్థము.) కావున జనసామాన్య మందఱివిషయమునను గూడ యట్లే కానేరదు. సత్పురుషులకైనను బైన చెప్పియున్నరీతిగ, ధర్మములను, నధర్మములను గుర్తెఱుఁగుసందర్భమునఁగాదు; ధర్మశాస్త్రములు మొదలైనవానివలన నెఱుఁగుటకు వీలులేనివిషయములందుమాత్రమే. అపుడైనను నంతకంటె మంచియాధారము వేఱొకటి లేనికారణముననేగాని, ధర్మశాస్త్రములవంటియాధారము లున్నసందర్భమునఁగాదు. కావున దీనినిఁబట్టిచూచినను గూడ, ధర్మాధర్మములనెఱుఁగుట కంతరాత్మ యాధారము గాఁజాలదని రూఢియగుచున్నది.

### ధర్మములను నిర్ణయింపవలసినది, యెక్కువమందియొక్క యభిప్రాయమును (Majority of Votes) బట్టి కాదా ?

పైసందర్భమున నవనాగరకు లొకసమాధానమును జెప్పవచ్చును; ఏమనఁగా:— "ఎవరిబుద్ధికిదోఁచినట్లు వారు ప్రవర్తింపవచ్చునని మేము చెప్పుటలేదు; ఎక్కువమంది యేది నిర్ణయించుకొనెదరో దానినే ధర్మముగఁబెట్టుకొని తక్కినవారందఱునుగూడ నడచుకొనవలయునని మాయభిప్రాయ"మని నవనాగరకులు చెప్పవత్తురు. వీరి కిట్టియభిప్రాయ మేర్పడుటకు ముఖ్యకారణములు రెండు. అందు మొదటిది, మన వైదికమతధర్మములును, వాని కాధారములగు ధర్మశాస్త్రములును నేర్పడినవిధానము వీరికిఁ దిన్నఁగాఁ దెలియకపోవుట. రెండవది, యందులకుదూరుగ, విదేశీయు లధికసంఖ్యాకులయొక్క యభిప్రాయములనుబట్టి వారి వ్యవహారధర్మముల నేర్పఱచుకొనెడివిధముననే, మనపూర్వులుగూడ వెనుక ధర్మములను, ధర్మశాస్త్రములను నిర్మించికొనియుండిరని వీరు పొరపడుచుండుట. కాని, యీవిషయముల నిదివఱకే యీప్రకరణమున, "విదేశీయులు ధర్మముల నేర్పఱచుకొనువిధ"మను శీర్షికక్రింద విపులముగఁ జర్చించి, మననవనాగరకులయొక్క పైయభిప్రాయములు తప్పని ఋజువుచేసియుంటిమిగదా ! అంతియగాక, ధర్మాధర్మములవలన గల్గుఫలములు కేవల మీలోకమునను, నీజన్మమునను మాత్రమేగాక,

రాఁబోవు జన్మములందును, నితరలోకములందునుగూడ జను లనుభవింపవలసియుండుట చేతను, నెట్టియెట్టి ధర్మాధర్మములచే నితరజన్మములందును, నితరలోకములందును జనుల కెట్టియెట్టి సుఖదుఃఖములుఁగల్గునో యావిషయమును గేవలము వేదశాస్త్రములసహాయమునదప్ప వేఱువిధముగఁ దెలిసికొనుటకు నెట్టిసాధనమునుగూడ లోకమున లేకపోవుట చేతను, ధర్మాధర్మము లతీంద్రియవిషయము లనుసంగతినిసహితము మన మీప్రకరణము ననే లోగడ, "ధర్మమనఁగా నెట్టిది?" యనుశీర్షిక క్రింద విస్తరించి తెలిసికొనియే యుంటిమి. ఇందువిషయమున నవనాగరకులకుఁగల సంశయములను గ్రమముగా విమర్శించి, వారిసందేహములకు సమాధానములనుగూడ జెప్పియుంటిమి. అందుచే ధర్మాధర్మములయొక్క ఫలములు, కేవల మీశ్వరునియాజ్ఞారూపములగు వేదశాస్త్రముల మూలమునఁదప్ప వేఱురీతిగఁ దెలిసికొన సాధ్యములు కాఁజాలని యతీంద్రియవిషయములని బోధపడుచున్నది. ఇదియే ధర్మాధర్మములయొక్క తత్త్వము. దీనిని సరిగా గ్రహింపఁజాలకపోవుటచేతనే నవనాగరకులు ధర్మాధర్మముల నెఱుఁగుటకు సరియైన సాధనములను గుర్తింపఁజాలక, యంతరాత్మయే సాధనమని కొందఱును, నధికసంఖ్యాకులయభిప్రాయమే సాధనమని మఱికొందఱును నిట్లే పలువురు పలువిధముల నెవరియిష్టమువచ్చినట్లు వా రూహించుకొనుచున్నారు.

మనుష్యులలోని వ్యక్తులయొక్క యభిప్రాయమునుబట్టిగాని, యధికసంఖ్యాకులయొక్క యభిప్రాయములనుబట్టిగాని నిర్ణయించుకొనెడివిషయములు కేవల మీలోకమందుఁ గల్గెడి ఫలములను నిర్ణయించుటకుమాత్రమే యుపయోగపడును. ఏలననఁగా, నట్టివిషయములవలన నెట్టిఫలములు గల్గునని వా రూహించెదరో యాఫలములు గల్గుటయు, గలుగకపోవుటయు నీజన్మముననే, యీలోకముననే దెలియవచ్చుచుండును. అంతియగాని, మనుష్యులలో నెంత తెలివిగలవారికైనను, నతీంద్రియవిషయముల నూహించి తెలిసికొనుట కెంతమాత్రమును సాధ్యముగాదు. ఇట్టియిట్టి ధర్మాధర్మములచే రాఁబోవుజన్మమునను, నితరలోకములలోను నిట్టియిట్టి సుఖదుఃఖములుఁగల్గునని యెంత తెలివిగలవారైనను వేదశాస్త్రముల యాధారముచేఁదప్ప వేఱుగ నెట్టియాధారముచేతను గూడ ఋజువుచేసి చూపఁజాలరు. ఈవిషయమునుగూడ నిదివఱకే యీప్రకరణమున, "ధర్మాధర్మము లతీంద్రియవిషయములనుటకుఁ బ్రమాణ"మను శీర్షిక క్రింద విపులముగఁ జర్చించియున్నాము. కావున, నిట్టి ధర్మాధర్మములను నిర్ణయించుట మనుష్యులలో నధికసంఖ్యాకులబుద్ధికిఁగాని, యల్పసంఖ్యాకులబుద్ధికిఁగాని మాత్రమేగాక, సర్వసంఖ్యాకులబుద్ధికిసహితము సాధ్యముగాజాలదనుట నిర్వివాదాంశము.

ఈలోకమునను, నీజన్మమునను మనుష్యులయింద్రియములకును ననుభవమునకును గోచరించెడిఫలముల నిచ్చునట్టి యిహలోకసంబంధమగువిషయములను నిర్ణయించుకొనుటకుమాత్రమే మనుష్యులలోని యధికసంఖ్యాకులయొక్క యభిప్రాయములుగాని, తెలివిగలవారియభిప్రాయములుగాని యుపయోగపడును. విదేశీయులు వారిదేశమున ధర్మాధర్మముల నేర్పఱచుకొనుటలోను, మనదేశమునఁగూడ ప్రస్తుతము వారిప్రభుత్వమున నేర్పడిన శాసననిర్మాణసభలను (Legislative Councils) పురపాలకసంఘములను (Municipal Councils) మొదలగువానియందుఁ జట్టముల నేర్పఱచుటలోను, నిర్ణయింపఁబడెడివిషయము లధికసంఖ్యాకులయభిప్రాయములనుబట్టి నిర్ణయింపఁబడినవిగనే యున్నవి. అట్టివిషయములుగూడ మొదటనిర్ణయింపఁబడినప్పు డధికసంఖ్యాకు లూహించినఫలముల నిచ్చుటకుమారుగఁ దరువాత వేఱువిధములగు-చిక్కులనుగూడ తెచ్చిపెట్టుచుండుట నొకప్పుడు చూచుచున్నాముగదా! అపుడు జనులు తిరిగి వానిని మార్చికొనుచుఁ, గొన్నిటిని సవరించుచుఁ, గొన్నిటిని రద్దుచేయుచు నేమేమో తిప్పలు పడుచున్నారు. ఇట్లు మనుష్యబుద్ధిపై యాధారపడి నిర్ణయింపఁబడినప్రభుత్వశాఖల (Government Departments) యొక్క నిబంధనగ్రంథముల (Codes) విషయమునఁ బ్రతిగ్రంథమునకును, బ్రతిసంవత్సరమును, బెక్కుచేర్పులును, మార్పులును, సవరణలును, దిద్దుబాట్లును, (Addenda, Corrigenda, Errata, Amendments, Correction-slips) మొదలగునవి వెలువడుచుండుట, యాయాశాఖలందలి యుద్యోగస్థులందఱికిని దెలిసియేయున్నది. అందులకుఁ గారణము, మనుష్యబుద్ధికి, నిహలోకసంబంధములగు విషయములలోనైనను, లోకానుభవము చేకూరుకొలఁది, నెప్పటికప్పుడు క్రొత్తవిషయములను గ్రహించుచుఁ, బాతయూహలను మార్చికొనుచుండుట దానికి స్వభావమైయున్నది. అంతియగాని, యావిషయములలోఁగూడ దానికిఁ బూర్ణత్వము (Perfection) కలదని చెప్పుటకు వీలులేదు.

అంతయేల! ఊహలమాటయటుంచి, కేవల ప్రత్యక్షనిదర్శనముల (Direct observations) పై యాధారపడియున్న ప్రకృతిశాస్త్రవిషయములను నిర్ధారణచేయుటలోగూడ, యొకప్పు డధికసంఖ్యాకులగు ప్రకృతిశాస్త్రవేత్తలుచేరి చేసికొనినసిద్ధాంతములుసహితము, మఱియొకప్పు డపసిద్ధాంతములుగఁ బరిణమించుచున్నవి. ఇందులకు నిదర్శనముగఁ బ్రకృతిశాస్త్రవేత్తలందఱును నీరు, విడదీయుటకు వీలుపడని యేకపదార్థమే (Element) యనియును విభజ్యపదార్థము (అనఁగా విడదీయఁదగినవస్తువు—(Compound) కాదనియు మొదటఁగొంతకాలమువఱకును దలఁచుచువచ్చినసంగతియు, నటుపై 'వాల్టామీటర్' (Voltameter) అనుయంత్రసహాయమున 'ఆక్సిజెన్'

(Oxygen)అనియుం, 'హైడ్రోజెన్' (Hydrojen)అనియుం జెప్పఁబడు రెండువాయు పదార్థముల(Gases) క్రింద,నీటిని విడఁదీయవచ్చుననుసంగతిని వారు గ్రహించియున్న సంగతియుఁ బైశాస్త్రములను జదివికొన్నవారిలోఁ బెక్కుమంది వినియేయుందురు. అందుచే,నీరెల్లప్పుడును విభజ్యపదార్థముగనే యుండుచువచ్చెననియు, నధికసంఖ్యాకులు మాత్రమేగాక సర్వసంఖ్యాకులైనప్పటికినిగూడ యాశాస్త్రజ్ఞులు కొంతకాలమువఱకు నాసత్యమును దెలిసికొనఁజాలకపోయిరనియు మాత్రమే మనము తలంపవలయునా? కాక, యధికసంఖ్యాకులగు ప్రకృతిశాస్త్రజ్ఞులు తలంచుచుండిరనుహేతువుచేత నీరు మొదటఁ గొంతకాలమువఱకును విభజ్యపదార్థముగ నుండుటమానివేసి యవిభజ్యపదార్థముగనే యుండుచువచ్చెననియుఁ, బిమ్మట వారు తమయూహను మార్చికొనిననాఁటి నుండియు నవిభజ్యపదార్థముగ నుండుటనుమానివేసి నీరు తిరిగి విభజ్యపదార్థముగ మారిపోయెననియుం మనము తలంపవలయునా? రెండవవిధముగనే తలంపవలయునందురా? ఐనచోఁ దమయభిప్రాయమననుసరించి దానికనుకూలముగనే నీ రవిభజ్యపదార్థమై పడియుండఁగా, నింతలోనే యది విభజ్యపదార్థమను క్రొత్తయూహను దెచ్చిపెట్టికొని తమ పాతయూహను బ్రకృతిశాస్త్రజ్ఞు లేల త్రోసివేయవలసివచ్చినది? తా మంతకుముందుఁ బడుచున్నయభిప్రాయము తప్పని వారు తెలిసికొనుటచేతనేగదా! అందుచే నధిక సంఖ్యాకులుమాత్రమేగాక సర్వసంఖ్యాకులైనప్పటికిని, నీలోకమునకు సంబంధించిన ప్రత్యక్షవిషయములలోఁగూడ, ప్రకృతిశాస్త్రజ్ఞులవంటి విద్యావంతులుసహితము తప్పుటభిప్రాయములను బడుచుండుట కవకాశము లెస్సగఁగలదని మనము గ్రహింపవచ్చును గదా!

అందుచేతనే, యధికసంఖ్యాకులయభిప్రాయమైనప్పటికిని బ్రమాదములపాలగుట కవకాశము లేకపోలేదనియుం, నందుచే దానిననుసరించియే నడునవలయుననుట యుక్తము కాదనియుం, గ్రహించినవారు నవనాగరకులలోఁగూడ కొందఱు లేకపోలేదు. ఇందుల కుదాహరణముగఁ బ్రస్తుతము సర్వవిధముల నవనాగరకశిఖామణులని చెప్పఁదగిన శ్రీ గాంధీగారుసహితము తాము రచించియుండిన "Hindu Swaraj" or "Indian Home Rule "(హిందు-స్వరాజ్' లేక, 'ఇండియన్-హోమ్-రూల్') అనుగ్రంథమున నీక్రిందిరీతిని వ్రాసియున్నారు. (చూడుఁడు, G. A. నటేశన్ అండ్ కంపెనీవారి కూర్పు):—

" It is a superstition and an ungodly thing to belive that an act of a Majority binds a minority. Many examples can be given in which acts of majorities will be found to have been wrong and those of minorities to have been right. All reforms owr their

**origin in the initiation of minorities in opposition to majorities. If among a band of robbers, a knowledge of robbing is obligatory, is a pious man to accept the obligation?"**

**—"Hind Swaraj" or "Indian Home Rule," Chap. XVII, pp. 80-81**
**(G. A. Natesan & Co.'s edition.)**

దీనియర్థ మేమనఁగా:—

“అధికసంఖ్యాకులు చేసినరీతిగనే యల్పసంఖ్యాకులుగూడ చేసియే తీరవలయు నని తలంచుట, నాస్తికులకు సంబంధించిన మూఢవిశ్వాసము. అధికసంఖ్యాకులు చేసిన పనులు తప్పులనియు నల్పసంఖ్యాకులు చేసినపనులే యొప్పులనియు గనఁబఱచుటకుఁ బెక్కునిదర్శనముల నీయవచ్చును. అధికసంఖ్యాకులను బ్రతిఘటించినిలిచిన యల్ప సంఖ్యాకులనుండియే యన్నిసంస్కరణములును బయలువెడలియున్నవి. ఒకదొంగల గుంపులోని (యధికసంఖ్యాకుల) యభిప్రాయమునుబట్టి దొంగతనము చేయఁదగినదే యైనచో, బుద్ధిమంతుఁడగువాఁడుసహిత మట్లేచేయుట కంగీకరింపవలయునా?”

పైవాక్యములలోఁ జాలవఱకు సత్యములేకపోలేదు. ఏమనిన, నిజమునకు లోక మున యోగ్యులయొక్కయు, యోగ్యవస్తువులయొక్కయు సంఖ్యకంటె నయోగ్యుల యొక్కయు, నయోగ్యపదార్థములయొక్కయు సంఖ్యయే యధికముగనుండుట సహ జము. అందుచే సంఖ్యాబలమునుబట్టియే యోగ్యతాఽయోగ్యతలను నిర్ణయింపఁదలంచిన చో, నిజమున కిప్పుడు లోకమున యోగ్యపదార్థములుగఁ బరిగణింపఁబడునవియెల్లను నయో గ్యములనియు, నయోగ్యములెల్లను యోగ్యములనియు మనము తలంపవలసివచ్చును. ఇందుల కుదాహరణముగ లోకమున రత్నములసంఖ్యకంటె ఱాళ్లసంఖ్యయే యెక్కువయనుమాట మన మెఱిఁగినదే. కాని, రత్నముల నెక్కువగ గౌరవించుచుంటిమా, కాక ఱాళ్ల కెక్కువ విలువ నిచ్చుచుంటిమా? అట్లే లోకమున మనము సామాన్యముగఁ జూచు నినుపసామగ్రుల సంఖ్యయెక్కువయుండునా, కాక, బంగారుసామగ్రులసంఖ్య యెక్కువయుండునా? అట్లే, యమూల్యములగు చందనవృక్షములు దేశమున నేమూలనో, యేకొలదిసంఖ్యయో గలిగియుండునుగాని, తక్కినచెట్లవలె నెచటఁబట్టిన నచటఁ గానరావు. ఆరీతిగనే రాజ హంసలును, నేమానససరోవరముననో, యెపరిమితసంఖ్యయో (Limitted numbers) గలిగియుండునుగాని, తక్కినకాకులును గ్రద్దలునువలె నూరూరను గానరావు. ఆదేవిధ ముగ మేధావంతులును, యోజనాశక్తిసంపన్నులును, యుక్తాయుక్తవివేకజ్ఞానముకల వారును నగుగుణగణ్యులుకూడ యేకొలఁదిగనో యేమూలనో యుందురుగాని, తక్కిన జనసామాన్యమువలె నధికసంఖ్యాకలవారుగ నుండరు. అట్టి సంఖ్యాపరిమితియే పైవారికిని,

బైవస్తువులకును గౌరవమేర్పడుటకు ముఖ్యకారణము. అంతియగాని, యట్లుగాక యీ వస్తువులసంఖ్యకూడ యితరవస్తువులసంఖ్యతో సమానమేయైనచో, నప్పు డావస్తువులవిలువ గూడ తక్కినవానివిలువతోఁబాటే సమానమైపోయి, వానియాధిక్యత నశించును. ఇందులకుఁ దార్కాణముగఁ బూర్వకాలమున సర్వసుగుణసంపన్నులగు శ్రీరామచంద్రుని వంటిమహనీయు లెందఱుండిరని మనము వినఁజాలియున్నాము? అట్టివారు మిక్కిలి తక్కువయని వాల్మీకి యడిగినప్రశ్నకు నారదమహర్షి యిచ్చిన

శ్లో. "బహవో దుర్లభాశ్చైవ యే త్వయాకీర్తితాగుణాః,
మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్త శ్శ్రూయతాంనరః"

యనుసమాధానమే చెప్పుటలేదా? పూర్వకాలముమాట యటుంచుఁడు. ప్రస్తుత కాలమునసైనను సర్వవిషయములలోఁ గాకున్నను నొక్కొక్కవిషయమునందైనను నపారప్రజ్ఞగలవారు లోకమున నెందఱెందఱు గలరు? శరీరదార్ఢ్యమునఁ బ్రస్తుతకాలమున జగత్ప్రసిద్ధిగాంచి యసమానప్రదర్శనము లొనర్చుచున్న కోడి రామమూర్తి నాయుఁడుగారివంటివారి నెంతమందిని మన మెఱుఁగఁజాలియున్నాము? గణితశాస్త్ర విషయమున ననన్యసామాన్యమేధాశక్తిని బ్రదర్శించి విదేశీయవిద్వాంసులనుసహితము తలయూపునట్లుచేసి యిటీవలఁ గొంతకాలముక్రిందఁ గీర్తిశేషులైన మద్రాసురాష్ట్ర వాస్తవ్యులగు రామానుజముగారివంటివారి నెంతమందినిగుఱించి వినఁజాలియున్నాము? ప్రకృతిశాస్త్రపరిశోధనలలో నూతనమార్గములనుద్రొక్కి యందలివిచిత్రప్రదర్శనములచే విదేశీయవిద్వాంసులకుసహిత మచ్చెరువుఁబుట్టించుచున్న జగదీశచంద్రబోసుగారివంటి వారి నెందఱిని జూడఁజాలియున్నాము? అదేరీతిగఁ గవిత్వమున మనదేశమునఁ బూర్వ కాలములోఁ గాళిదాసువంటిమహనీయులను నీకాలమున రవీంద్రనాథఠాకూర్ గారివంటి వారిని, విదేశీయులలోఁ బూర్వము షేక్స్పియర్ వంటివారిని నెందఱిని దెలిసికొనఁజాలి యున్నాము? అట్లే పలుకుఁబడినిసంపాదించియుఁ బరాక్రమాదులచేతను, బ్రజానాయకత్వమువహించిన ఘనులలోఁ, బ్రస్తుతము మనదేశమున శ్రీగాంధీగారివంటివారిని బూర్వము విదేశములందు 'నెపోలియన్' వంటివారి నెంతమందిని దెలిసికొనఁగల్గి యున్నాము? గుణగణ్యులసంఖ్య గుణహీనులసంఖ్యకంటెఁ జాలతక్కువగనుండుననుటకీ నిదర్శనములు చాలవా? కాఁబట్టి విషయముయొక్క యుక్తాయుక్తములనుబట్టియుఁ, జర్చించువారిగుణావగుణములను యోగ్యతాఽయోగ్యతలనుబట్టియు విషయనిర్ణయము చేయఁదగునుగాని, సంఖ్యాబలమునుబట్టి చేయఁజూచుట ప్రమాదము, నవివేకము, నపాయకరమును గాకమానదు.

పైనగనఁబఱచియున్నరీతిగ, నీలోకమునఁ బ్రత్యక్షముగఁ గనఁబడుఫలముల నిచ్చెడివిషయములను నిర్ణయించుకొనుటలోనే, ప్రకృతిశాస్త్రవేత్తలవంటి విద్యావంతులయొక్కబుద్ధులుగూడ ప్రమాదములపాలగుచుండుట కవకాశముండుటచేతను, నట్టివిషయములందుసహితము మనుష్యబుద్ధికిఁ బూర్ణమగునైపుణ్యము (Perfection) లేకపోవుటచేతను, నిఁక నతీంద్రియవిషయము లగుధర్మాధర్మములను నిర్ణయించుటలో, (ననఁగా నెట్టి యెట్టిధర్మాధర్మముల నాచరించుటచే వానికనుగుణ్యముఁగ లోకాంతరములందును, జన్మాంతరములందును, నెట్టియెట్టి సుఖదుఃఖములుగల్గునో యావిషయముల నూహించి తెలిసికొనుటలో) మనుష్యబుద్ధు లల్పసంఖ్యాకములైనను, నధికసంఖ్యాకములైనను, గాక సర్వసంఖ్యాకములైనప్పటికినిగూడ, నెంతమాత్రమును సమర్థములు కాఁజాలవనునంగతి వేఱుగఁ జెప్పనక్కరలేదు. కావున నట్టిసామర్థ్యమును, యోగ్యతయుఁగలవాఁడు సర్వసృష్టికర్తయును, సర్వజ్ఞుఁడును, సర్వసమర్థుఁడు నగునీశ్వరుఁ డొక్కఁడే. అట్టియీశ్వరునిబుద్ధిమాత్రమే తక్కినమనుష్యబుద్ధులవలె నెట్టిప్రమాదములకును పాలుగాకయుండుటచేత నాయనయొక్కయాజ్ఞారూపమును, నపౌరుషేయమును నగువేదమునకు ముఖ్యప్రామాణ్యముగల్గినది. ఈవిషయమునే వేదవ్యాఖ్యాతలు తమవేదభాష్యమున (నైతరేయబ్రాహ్మణవ్యాఖ్యలో) నీక్రిందిరీతిని విశదపఱచియున్నారు:—

"......... తత్ప్రామాణ్యంతు బోధకత్వా త్స్వతఏవ సిద్ధమ్; పౌరుషేయ వాక్యంతు బోధకమపి సద్భ్రాన్తి మూలత్వసంభావనయా తత్పరిహారాయ మూలప్రమాణ మపేక్ష్యైవ ప్రమాణమ్. నతు వేదో మూలప్రమాణమపేక్షతే, తస్య నిత్యత్వేన కర్తృదోషశంకాయా అనుదయాత్. ఏతదేవ జైమినినా సూత్రితమ్—'తత్ప్రమాణం బాదరాయణ స్యానపేక్షత్వాత్'—ఇతి............"

దీనియర్థమేమన:—"...వేదము (యుక్తాయుక్తములను—అనఁగా ధర్మాధర్మములను) బోధించునదియగుటచే దానికిఁ బ్రామాణ్యము స్వయముగనే కలిగినది; మనుష్యులు వ్రాసినగ్రంథములుకూడ యుక్తాయుక్తములను బోధించునవే యైనప్పటికిని, నందు భ్రమప్రమాదములు (పొరబాట్లు) గలుగుట కవకాశముండుటచే నవి యొకమూలప్రమాణముపైన నాధారపడిననే ప్రమాణములు కాఁదగియున్నవి. కాని వేదము నిత్యమగుటచేతను దానికొకకర్త లేకపోవుటచేతను, నట్టికర్త పొరపడియుండవచ్చుననుసంశయమునకే యవకాశములేనందున వేదమున కెట్టిమూలప్రమాణముతోడను బనిలేదు. ఇదియే జైమినిమహర్షి కూడ తనసూత్రములలో "తత్ప్రమాణంబాదరాయణస్య..." అనుసూత్రమునఁ జెప్పియుండెను. అట్టివేదముమూలమున ధర్మాధర్మముల నీశ్వరుఁడు వ్యక్తపఱచియేయున్నాఁడు. ఈవిషయమును మన మీగ్రంథముననేమొదటిప్రకరణమున, "వేద

మునుగుఱించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పు?" ననుశీర్షికమొదలుకొని, "వేదమునుగుఱించి ప్రాచీనచరిత్రలందలి సారాంశ" మనుశీర్షికవఱకును జర్చించి తెలిసికొనియుంటిమి. అందువిషయమున నవనాగరకులకుఁగలసంశయముల కచటనే సమాధానములను జెప్పి గూడయుంటిమి. అట్టి వేదమందలియర్థము జనసామాన్యమునకు సులభముగఁ దెలియ వచ్చునదిగాకపోవుటచే, నందలిధర్మములు జనులకు సులభముగఁ దెలియుటకై వేదము ననుసరించి మనువు, గౌతముఁడు, పరాశరుఁడు మున్నగుమహర్షులు వేఱువేఱుధర్మశాస్త్ర గ్రంథములను వ్రాసియున్నారు; కాని, మననవనాగరకులు భ్రమపడుచుండిన ట్లధిక సంఖ్యాకులయభిప్రాయములనుబట్టిగాని, తనుస్వీయాభిప్రాయములనుబట్టిగాని వైధర్మ శాస్త్రకర్తలు ధర్మనిర్ణయమును జేసియుండలేదు. ఈవిషయముల నీప్రకరణముననే, "స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పు?" ననుశీర్షికక్రిందను, "స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్రలందుఁ జెప్పఁబడినవిషయములకుఁ బ్రమాణము" లనుశీర్షికక్రిందను, నిది వఱలోఁ దెలిసికొనియుంటిమి. ఇందువిషయమున నవనాగరకులకుఁ గలసంశయముల కీప్రకరణముననే సమాధానములు చెప్పుచుంటిమి. అందువలననే ధర్మాధర్మముల నెఱుఁగు టకు వేదశాస్త్రములే ప్రమాణమనియు, వానిని మీరి స్వేచ్ఛగా (స్వబుద్ధిననుసరించి) నడ చెడివాఁ డిహపరసౌఖ్యములకు రెంటికిని జెడి, యధోగతిపాలుకాక మానఁడనియుఁ, శ్రీకృష్ణభగవానులుసహితము భగవద్గీతాశాస్త్రమునఁ జెప్పినప్రమాణవాక్యముల నీ ప్రకరణముననే, "ఈజన్మలోనిఫలములకుఁ బూర్వజన్మలలోనికర్మలే కారణమైనచో, నేకర్మ కేఫలము గల్గుచున్నదో, యాసంబంధమగుజ్ఞానమును మనుష్యులకు దేవుఁడేల యీయలే" దనుశీర్షికక్రింద లోఁగడఁగనబఱచియేయుంటిమి. కావున నధికసంఖ్యాకుల యభిప్రాయమైననుగూడ ధర్మాధర్మములను నిర్ణయింపఁజాలదని నిశ్చయమగుచున్నది.

## ధర్మాధర్మములు ప్రకృతిధర్మముల (Laws of Nature) వంటివా?

వేయేల! అంతరాత్మననుసరించి ధర్మాధర్మములను నిర్ణయింపవలయుననికాని, యధికసంఖ్యాకులయభిప్రాయము ననుసరించి ధర్మనిర్ణయము చేయవలయుననికాని, కాలముననుసరించి ధర్మనిర్ణయములను, ధర్మశాస్త్రములను, మార్పవలయుననికాని, యీ మొదలగుతలంపులను నవనాగరకులు గలిగియుండుటకు ముఖ్యకారణము లోఁగడఁబై వ్యాసముయొక్కప్రారంభమునఁదెల్పియున్నరీతిగ నతీంద్రియవిషయములగు ధర్మాధర్మముల యొక్క తత్త్వమును, స్వభావమును, వారు తిన్నఁగాఁ దెలిసికొనఁజాలకపోవుటయే. ప్రత్యక్షఫలముల నిచ్చెడిప్రకృతిధర్మములు (Laws of Nature) వానికిదగినఫలముల నిచ్చుటయెట్లు స్వాభావికమైయున్నదో, యట్లే యతీంద్రియవిషయములగు ధర్మాధర్మ

ములను వానివానికిఁ దగినఫలములను జన్మాంతరములయందును, లోకాంతరములందును నిచ్చుట వానికిఁగూడ స్వాభావికమైయున్నది.

ఐనచో, "ధర్మాధర్మములవలనిఫలములు లోకాంతరములందును జన్మాంతరములందునుమాత్రమేగాని యీలోకమునఁ బ్రత్యక్షముగ నేమియుఁ దెలియరావా?" యని సంశయముగలుగవచ్చును. ప్రత్యక్షఫలములనిచ్చునవికూడ ధర్మాధర్మములలోఁగొన్నికలవు. కాని, యంతమాత్రముచే నట్టిప్రత్యక్షఫలములుమాత్రమే వానివలని ప్రయోజనములని మనము తలంపరాదు. అట్టిఫలములకుఁదోడుగ జన్మాంతరమందును లోకాంతరములందును గూడ దెలియవచ్చెడి వేఱుఫలములుసహిత మాధర్మాధర్మములచే గలుగును. కాని యీసంగతినిగ్రహింపనేరనివా రాధర్మాధర్మములయొక్క ప్రయోజనము ప్రత్యక్షముగఁ గన్పడు నట్టి ఫలములుమాత్రమేయనియు, నట్లు ప్రత్యక్షఫలములను గనఁబఱచఁజాలని కొన్ని ధర్మాధర్మములు వ్యర్థములును, నిరర్థకములుననియుఁ బొరపడుచుందురు. ఇందులకుదాహరణముగ, గంగానదీస్నానము పాపహరమగుటచే ధర్మము. అట్టిస్నానముచేయకముం దున్న పాపములుగాని, స్నానముచేసినపిదప నాపాపములు నశించుటగాని ప్రత్యక్షముగ నెవ్వరికిని సామాన్యముగఁ గానరాదు. జన్మాంతరములందును లోకాంతరములందును ననుభవింపవలసినపాపములను తగ్గించుటయే దానికిఁ బరమావధి. అట్టిప్రయోజనము మనవేదశాస్త్రములమూలముననమాత్రమే తెలియనగును. అదియట్లుండ, నట్టిగంగాస్నానముచే శరీరమాలిన్యము (ఒంటిమురికి) నశించుట ప్రత్యక్షప్రయోజనము. ఇది గంగాజలస్నానము వలనమాత్రమేగాక, యేయితరశుభ్రజలముచేతనైననుగూడ సాధ్యపడునదియే. గంగాస్నానముతోఁ బనిలేకయే నిత్యమును నెవరియింటిలో వారు స్నానముచేసి యొంటిమురికిని బోగొట్టుకొనువారిని మనమెందఱిని జూచుటలేదు! ఇహపరఫలములను రెంటినిగూడ నిచ్చుధర్మముల కీపైనదెల్పిన గంగాస్నాన మొకయుదాహరణము. బ్రాహ్మణులు మొదలగుజాతులవారికి, స్వజాతివిహితమగుస్నానము, సంధ్యావందనము మొదలగునిత్యకర్మలను నియమముతో ననుష్ఠించుట ధర్మము. అట్లనుష్ఠింపకపోవుట యధర్మము. అట్లనుష్ఠించుటవలన గల్గుప్రయోజనముగాని, యనుష్ఠింపకమానుటవలన గల్గునష్టముగాని, యీజన్మమునఁ బ్రత్యక్షముగ నెంతమాత్రమును దెలియరాదు. ఏలనన, నట్టికర్మానుష్ఠానమును వేడుకుఁ దగిలించుకొని దానితోఁ బ్రొద్దుగ్రుంకులును నవస్థపడువారికంటె, దానిని బూర్తిగ వదలిపెట్టి యిష్టమువచ్చినప్పు డిష్టమువచ్చినచోట నిష్టమువచ్చినవారితో నిష్టమువచ్చిన దాని నిష్టమువచ్చినరీతిగఁ దిని, యిష్టమువచ్చినట్లు తిరుగుచు, నెక్కువసుఖపడ మరగిన మహానుభావుల నిప్పుడు మన మెందఱిని జూచుటలేదు? వీరికేమిసుఖములు తక్కువయైనవి? ఏమియును లేదు! కాని, వైదికకర్మానుష్ఠానమనుధర్మముచే గల్గుప్రయోజనముగాని,

యట్టికర్మ నుమానుట యనునధర్మముచే గల్గుకీడుగాని, మనవేదశాస్త్రములందు వర్ణింపఁ
బడినరీతిగ జన్మాంతరములందును లోకాంతరములందును ననుభవమునకువచ్చుననుసంగతి
యాశాస్త్రములవలననే మనము దెలిసికొనవలసియున్నది. కేవలము జన్మాంతరలోకాంత
రములందుమాత్రమే ఫలములనిచ్చుధర్మాధర్మముల కీపైనదెల్పిన స్వజాతి విహితకర్మాను
ష్ఠానమును, నాకర్మత్యాగమును నుదాహరణములు.

ప్రకృతిధర్మములు వానివానిఫలములను బ్రత్యక్షముగ నిచ్చుట నెట్లు మానవో
యట్లే ధర్మాధర్మములును వానివానిఫలములను జన్మాంతరములందును లోకాంతరము
లందును గనఁబఱచకమానవు. ఇఁకఁ బ్రకృతిధర్మములకును, ధర్మాధర్మములకును గలభేద
మేమనినఁ, బ్రకృతిధర్మములయొక్కఫలములు ప్రత్యక్షముగ నీజన్మముననే యీలోక
ముననే గానవచ్చును. ధర్మాధర్మములయొక్కఫలములలోఁ గొన్ని, యట్లుకాక, సామా
న్యముగ జన్మాంతరములందును లోకాంతరములందునుమాత్రమే గానవచ్చును. మితిమీరిన
వాని కీలోకముననునీజన్మముననే ఫలముకానవచ్చుటయును వినుచుందుము. ప్రకృతిధర్మ
ములను వానిఫలముల నీయకుండఁ దప్పించుట కెట్లు సాధ్యముగాదో, యట్లే ధర్మాధర్మ
ములనుసహితము వానిఫలముల నీయకుండఁ దప్పించుట కెవ్వరికిని సాధ్యముగాదు. ఎట్ల
నఁగా: నిప్పులో వ్రేలుపెట్టినచోఁ గాలుట ప్రకృతిధర్మము. జనులలో నొకనియంతరాత్మ
"నిప్పులో వ్రేలుపెట్టినచోఁ గాల"దనిచెప్పినందున వ్రేలు పెట్టెననుకొనుఁడు;అపుడు నిప్పు
కాల్చుటమానునా? కాక,యధికసంఖ్యాకులగుసభ్యులొకసభలోఁజేరి,"వెనుకటికాలములో
నిప్పులో వ్రేలుపెట్టినచోఁ గాలుచుండినఁ గాలుచుండునుగాక; యీకాలమున మనలోని
యధికసంఖ్యాకులయొక్క బిడ్డలుచెప్పినమాటవినక నిప్పులో వ్రేలుపెట్టుచుండుట యెచట
జూచినను నెక్కువ సామాన్యముగనున్నది;కాఁబట్టి యీకాలమున కాప్రకృతిధర్మ మను
గుణ్యముగ లేదు;కావున నికపై నిప్పులో వ్రేలుపెట్టినప్పటికిని కాలఁగూడదని యీసభవా
రేకగ్రీవముగతీర్మానించడమైనది, దీనియొక్కనకలును వైస్రాయిగారికిఁ బంపడమైనది;
యీతీర్మానము రాఁబోవునెల మొదటితేదీనుండి యమలులోనికిరావలయు"ననితీర్మానించు
కొనఁగా,నాతీర్మానముప్రకారము రాఁబోవునెల రెండవతేదీన నెవఁడో యొకఁడు నిప్పులో
వ్రేలుపెట్టె ననుకొనుఁడు; అంతమాత్రముచే బైయిరువురిలో నెవరికిఁగాని, వ్రేలుకాలక
మానునా? మానదు? ఎందుచేత? ప్రకృతిధర్మములు (Laws of Nature) మిక్కిలి
కఠినములును (rigid) ననివార్యములును నగుటచేత! అట్లే ధర్మాధర్మములనుగూడ జనులు
వారియొక్కయంతరాత్మలననుసరించిగాని, యధికసంఖ్యాకులయొక్క యభిప్రాయముల
ననుసరించిగాని తమకాలముననురించిగాని మార్చివేయవలయునని చూచినప్పటికిని, నవి
వానికి సహజములగుఫలముల నీయకమానవని మనము తెలిసికొనవలసియున్నది. అందుచే

ధర్మాధర్మములుసహితము ఫలములనిచ్చుటలో, బ్రకృతిధర్మములవలెనే మిక్కిలి కఠినము లనియు, (rigid) ననివార్యములనియు గ్రహింపఁదగియున్నది.

అంతియఁగాదు! ధర్మాధర్మములు ప్రకృతిధర్మములకంటెనుగూడ యెక్కువ కఠినములని (More rigid) చెప్పవలసియున్నది. ఏలననఁగా, నొకప్పుడు కొందఱు మహనీయులు తమతపోవిశేషముచేతను, మఱికొందఱు సాధ్వీమణులు తమపాతివ్రత్య మహిమాతిశయముచేతను బ్రకృతిధర్మములనుసహితము మార్చి పారవేసి, యవి వాని స్వాభావికఫలముల నీయకుండచేసినట్లు తెలియవచ్చుచున్నది; కాని ధర్మాధర్మములు వాని యొక్కఫలముల నీయకుండునట్లు మార్చివేయఁజాలినవారి నెవరిని వినియుండము. ఎట్లనఁగా: పెద్దనిప్పులమంట మధ్యఁబడినవారు కాలి చచ్చిపోవుట ప్రకృతిధర్మము. అట్లే సముద్రమధ్యమున దుమికినవారు నీటిలో మునిఁగి చనిపోవుటయును, గొండపైనుండి క్రిందపడినవారికి దెబ్బలుతగిలి గాయములగుటయుఁ బ్రకృతిధర్మములు. కాని, వసిష్ఠ మహాముని తననూఱుగురుకొడుకులును నొకరాక్షసునిచేఁ జంపఁబడుటచే నాదుఃఖము పట్టఁజాలక ప్రాణత్యాగముఁజేసికొనఁగోరి పైనదెలిపినప్రకృతిధర్మములను దనయందుఁ బ్రయోగించుకొనినప్పటికిని, నాయనయొక్క తపోమహిమచే నట్టి ప్రకృతిధర్మము లన్నియుఁ వానిస్వాభావికఫలముల నీయఁజాలక వ్యర్థములైపోయినట్లు శ్రీమహాభారత మందలి యాదిపర్వ మీక్రిందిరీతిని జెప్పుచున్నది:—

[చూడుడు, శ్రీమదాంధ్రమహాభారతము, ఆదిపర్వము. ఆశ్వా. ౭.]

"..................................................

గీ. సుతుల రాక్షసనిహతులఁ జూచి పరమ, యోగధరుఁడయ్యుఁ బుత్త్రవియోగశోక
భరముఁ దాల్చె వసిష్ఠుం డపారభూరి, ధరణిభర మురగేంద్రుండు దాల్చునట్లు. 118

చ. అమితవివృద్ధశోకవివశాత్మకుఁడై మది నాత్మఘాతదో
షమును దలంప కెంతయు విషాదమునన్ బలవద్దవాగ్నిమ
ధ్యమున వడిఁ జొచ్చినన్ బృహదుదగ్రశిఖానల మాక్షణంబ యు
ష్ణము సెడి శీతమయ్యె మునినాథున కుగ్రతపంబు పెంపునన్. 119

ఉ. పంబిన శోకభారమునఁ బ్రాణవియోగముఁ గోరి కంఠదే
శంబున ఱాయి గట్టికొని సన్మునినాథుఁడు నిశ్చితాత్ముఁడై
యంబుధిఁ జొచ్చినం గడుభయంపడి వార్ధి చలత్తరంగహ
స్తంబుల నెత్తిపట్టె నుచితస్థితిఁ దీరముఁ జేర నమ్మునిన్. 120

చ. సుతశతవర్జితాశ్రమము సూడగనోపక మేరుపర్వతో
న్నత పృథుశృంగ మెక్కి పడినన్ మునివల్లభు దేహబంధ మ

క్షతమయి తూలసంచయనికాశత నొప్పె ననంతసంతత
వ్రతనియమప్రభావులగువారలఁ బొందునె? దేహదుఃఖముల్! 121

మధ్యాక్కర. పదలకమరణార్థి యగుచు మునినాథవరుఁడు దానొక్క
నది నుదగ్రగ్రాహవతిఁ బ్రవేశించినను మునినంట
నది యోడి శతవిధంబులఁ బరిద్రుతయయి స్థలంబయిన
నది యాదిగాఁగ శతద్రునామమై యన్నది యొప్పె. 122

మధ్యా. ఘనపాశములఁజేసి యెల్లయంగముల్ గలయబంధించు
కొని యొక్కనదిఁ జొచ్చి మునిఁగినను వంతఁగూరి యన్నదియుఁ
దనదివ్యశక్తి నప్పాశములవిడిచి తన్మునినాథుఁ
బనిగొనఁ దీరంబుసేరఁబెట్టి విపాశనాఁ బరఁగె. 123

వ. ఇట్లు పెక్కువిధంబుల శరీరపరిత్యాగంబునందుఁ గృతనిశ్చయుండయ్యును నప్రాప్త మరణుండయి వసిష్ఠుండు నిజాశ్రమంబునకువచ్చువాఁడు..............." 124

అట్లే, సామాన్యముగఁ జచ్చినవారు తిరిగి బ్రదుకకుండుటయును బ్రకృతిధర్మమే. అట్టిప్రకృతిధర్మమును సావిత్రి యనుపతివ్రతాతిలకము తనభర్తవిషయమున మార్చివేసి, చనిపోయిన తనభర్తప్రాణములను యమునివలనఁ దిరిగి గొనివచ్చి తనపాతివ్రత్యమహిమాతిశయముచే భర్తను బునర్జీవితునిగఁ జేసినకథనుగూడ శ్రీమహాభారతమే యారణ్యపర్వమున నీక్రిందిరీతిని జెప్పుచున్నది:—

"వ.......................సావిత్రి మామ కిట్లనియె.

సీ. "ఈరాజపుత్రున కీదినంబున మరణంబని మునుచెప్పె నారదుండు;
మునినాథువచనం బమోఘంబు గావున నేమఱ కేను నేఁ డితనితోడ
నడవికి నేగితి; నచట నీతఁడు సుప్తుఁడైయున్నయెడ వచ్చె నంతకుండు;
వచ్చి యివ్విభుని జీవముఁ గొనిపోవంగ వెనుకన చని యేను వివిధభంగి

గీ. సత్యధర్మఫణితి సంస్తుతించుటయుఁ గృపార్ద్రచిత్తుఁ డగుచు నజ్జముండు
నాకు నెమ్మి నొసఁగె నాలుగువరము లం దొకట నితఁడు జీవయుక్తుఁడయ్యె. 271

... ... ... ... ... ..." .

... ... ... ... ... ... ...

క. తనమగని, నత్తమామల, జననీజనకులను దన్ను సకలకులంబుల్
ఘనముగ సముద్ధరించెను, జనవర! సావిత్రిపుణ్యచరితము వింటే! ... 278

... ... ... ... ... ... ..."

(శ్రీమదాంధ్రమహాభారతము, అరణ్యపర్వ. అశ్వాస. ౭.)

వైపతివ్రత తనపాతివ్రత్యమహిమచేఁ దనభర్తను దానే బ్రదికించుకొన్నది. అట్లుగాక, యనసూయ యను మఱియొకపతివ్రత తనపాతివ్రత్యప్రభావముచే మఱియొకసతీమణియొక్కభర్తను జనిపోయినవానిని బ్రదికించినట్లు మార్కండేయపురాణమందలి యీ క్రిందికథవలనఁ దెలియుచున్నది:

ప్రతిష్ఠానపురమునఁ గౌశికుఁ డనుబ్రాహ్మణుఁడు కుష్ఠరోగముచే పీడింపఁబడుచు మిక్కిలి దుర్భరమగు దుర్వాసనతోడను, నెడతెగక కారుచుండు చీముర క్తములతోడను గూడిన శరీరము గలిగియుండెను. వానిభార్య మిక్కిలి పతిభక్తిగలిగి భర్తకు సర్వోపచారములను జేయుచు సర్వకష్టనిష్ఠురములను సహించి భర్తయొక్కశరీరమును సర్వవిధములఁ బోషించుచుండెను. ఒకనాఁ డాబ్రాహ్మణుఁ డాయూరిలోని యొకభోగముసానిని జూచి మోహించి యారాత్రి తనను దానియింటికిఁ దీసికొనిపొమ్మని భార్య కాజ్ఞాపించెను. ఆపెయు భర్తయాజ్ఞప్రకార మాతనిఁ దనమూఁపుపై నెక్కించుకొని క్రిక్కిఱిసిన చిమ్మచీఁకటిలో దానియింటికి బయలువెడలెను. మార్గమధ్యమున, మాండవ్యుఁ డను మహామునిని దొంగయని తలంచి కొనివచ్చి, రాజభటులు కొఱుతవేసియుండఁగాఁ, జీఁకటిలో వేవేగముగఁబోవుచున్న యాపతివ్రతమూఁపుపైనున్న భర్తయొక్కశరీరము కొఱుఁతవేయఁబడియున్న మాండవ్యునిశరీరమునకుఁ దాఁకినందున, నాయనకు బాధకొంచె మెక్కువయగుటచే, "నన్నిట్లు బాధపెట్టిన నరుఁడు సూర్యోదయమగుసరికి మరణించునుగాక" మని శపించెను. ఆశాపము విని యాపతివ్రతామణి, "సూర్యోదయమగుటతో నాభర్త చనిపోవునేని, నేను పతివ్రతనే యైనచో సూర్యోదయమే కాకుండునుగాక"మని బదులుపలికెను. ఆపతివ్రతయొక్కపాతివ్రత్యమహిమకు భయపడి సూర్యుఁ డుదయింపకపోయెను. నిత్యమును సూర్యోదయమగుచుండుట ప్రకృతిధర్మమేగదా! అట్టిప్రకృతిధర్మముసహితము పాతివ్రత్యమహిమకు వెఱచి వెనుకంజవేయవలసివచ్చెను. ప్రకృతిధర్మములు సహితశ మొకప్పుడు నిష్ఫలములగుచుండుననుట కిది మఱియొక తార్కాణము.

అంతట సర్వకర్మలును నిలిచిపోయి లోకములెల్లను సంక్షోభింపఁగా దేవతలందఱును బ్రహ్మదేవునొద్దకువెళ్లి సూర్యోదయమగుట కుపాయ మడుగఁగా, నత్రిమహర్షియొక్కభార్య యగునసూయయొద్దకు వెళ్లియాచింపుఁడనియుఁ, బతివ్రత చేసినకార్యమునకుఁ బ్రతీకారము మఱియొకపతివ్రతయేగాని యితరులు చేయఁజాలరనియు నాయన చెప్పెను. వారట్లుచేయఁగా, నాయమ (యనసూయ) యాపతివ్రతం జేరి,

"తే. ఇనుఁడు నీయాజ్ఞ నుదయింపకునికి నిపుడు, సృష్టిఁ జీఁకటి గవియంటఁ జేసి తలఁకి
నిన్నుఁ బ్రార్థించుమని సుర ల్నన్ను వేఁడి, కొనిన వచ్చితి నీకడ కనఘచరిత!"

యని తెలుపఁగా, నాపతివ్రత

"క. మాండవ్యుఁడు మద్వల్లభుఁ, "జండాంశుఁడు వొడమునటయును జాఁగలఁ"డని తాఁ
జండతరశాప మిచ్చుటఁ, జండాంశుని పొడుపు నా కసమ్మత మతివా!"

యని ప్రత్యుత్తరమిచ్చెను. అందుల కనసూయ, "నీభర్త మృతుఁడైనచో నా పాతివ్రత్యమహిమచే నే నాతనిని దిరిగి బ్రదికించి దీర్ఘాయుష్మంతుని జేయుదు"నని వాగ్దానముచేయఁగా నపు డాపతివ్రత సూర్యు నుద్దేశించి:

తే. "............................
ఓదివాకర! నిత్యసత్ప్రోజ్జ్వలాత్మ!
దినమణీ! వేగ నుదయింపు"మనియె; ననిన,

సీ. ... ... ... ... ... ... ...

తే. తనసముజ్జ్వలదీప్తివితాన మడరి
యఖిలజనులకు ననురాగ మావహింప
నెలమి ననసూయ మహితార్ఘ్య మెత్తి మ్రొక్క
నుదయగిరిశిఖరంబున నొప్పె నినుఁడు.

అట్లు సూర్యోదయమగుటతోడనే, బ్రాహ్మణశాపముసహితము పతివ్రతయొక్క వాక్యమువలెనే యమోఘమగుటచే నాకౌశికుఁడు మరణించెను. అంతట ననసూయ,

"తే. మనముఁ, బలుకును, జెయ్యు, సమత్వమొందఁ
బతికి శుశ్రూష సతతంబు భక్తిఁ జేయుం
దాన నేనైతినేని యీధరణిసురుఁడు
ప్రాణయుతుఁడు గావుత" మని పల్కుటయును.

వెంటనే యాబ్రాహ్మణుఁడు బ్రదికి లేచి, మొనకనున్నరోగములన్నియు నశింపఁగా నవయౌవనముతోఁగూడిన సుందరమగుశరీరము గలవాఁడాయెను.

ఇదేవిధముగ, శ్రీరామచంద్రునిపట్టమహిషియగు సీతాదేవి, రావణవధమైన పిమ్మటఁ దననిష్కళంకపాతివ్రత్యము లోకమునకు విశదమగుటకై భర్తయొక్క యాజ్ఞననుసరించి లంకలో నగ్నిప్రవేశముఁ జేసియున్నప్పు డామెయొక్క పాతివ్రత్య మహిమాతిశయముచే నగ్నివలన నామె కెట్టిబాధయునుగలుగక,

"చ. పవడపురాశిలోని నవభర్మశలాకయుఁ బోలెఁ జారు ప
ల్లవములకుప్పలో నిడిన లాలితచంపకదామమట్లు ర

క్తవనజ రాజిహంసి యనఁగా నరుణాభ్రములోన నున్న యా
నవశశిరేఖఁబోలె దహనస్థితయయ్యె విదేహకన్య దాన్."

అనుసంగతి పాఠకులు సామాన్యముగ వినియేయుందురు. ప్రకృతిధర్మములుసహిత మొకప్పుడువానివానిస్వాభావికఫలముల నీయఁజాలకపోయియుండుట కీపైన దెల్పినవన్నియు నుదాహరణములు. శ్రీరాముఁడు లంకకు సముద్రముపై సేతువుగట్టునపుడు నలుఁడను వానరుఁడు కొండలను సముద్రములోవేయఁగా నవి మునిఁగిపోక తేలుటయు నిట్టిదే.

ఇట్టి ప్రకృతిధర్మములనుఁ గొన్నిసందర్భములలో మార్చి పారవేసినవారిని గూర్చియే యచ్చటచ్చట వినియుందుముగాని, ధర్మాధర్మములు వానిసహజఫలములను జన్మాంతరలోకాంతరములం దీయకుండఁ జేయగల్గినవారి నెచటను సామాన్యముగ వినియుండము. పైప్రకృతిధర్మములను మార్పఁజాలియున్నవారు సహితము తమ మహిమాతిశయముచే నేదో యొకసందర్భమున నెచటనో యొకచోట నెప్పుడో యొకప్పుడు మాత్రమే యట్లు చేయఁజాలియుండిరిగాని, యదిమొదలుకొని యాప్రకృతిధర్మము మారిపోయి లోకమున నందఱికిని నన్నివేళలలో వర్తించునట్టి సామాన్యధర్మముగఁ జేయఁజాలియుండలేదు. అనఁగా, పైనదెల్పిన సీత మొదలగువారు తమపాతివ్రత్యప్రభావముచే నగ్నిలోదుమికినను గాలి పోకయుండఁజాలిరిగాని, యటుపై నిఁక నెవ రగ్నిలో దూకినను గాలిపోకుండునట్లుగఁ జేయఁజాలియుండలేదు. అందుచేఁ బ్రకృతిధర్మములు కొన్ని ప్రత్యేకసందర్భములలో కొందఱు మహనీయులయెడ వర్తింపఁజాలకపోయినవనియే మనము చెప్పికొనవలయునుగాని, యవి యప్పటినుంచి మారిపోయినవని చెప్పరాదు. అట్లే, యొకవేళ ధర్మాధర్మములు వానిసహజఫలముల నీయకుండునట్లు చేయఁజాలిన మహిమాఢ్యులుగూడ కొంద ఱెప్పుడైన నేమూలనైన నున్నప్పటికిని, వారిమహిమాతిశయముచేఁ గొన్నికొన్ని ప్రత్యేకసందర్భములలో ధర్మాధర్మములు వాని స్వాభావికఫలముల నీయఁజాలకుండునట్లు చేయఁగల్గిరనిమాత్రమే మనము చెప్పఁదగునుగాని, యంతమాత్రమే ధర్మాధర్మములు మారిపోయినవని యెప్పుడును జెప్పఁగూడదు.

అట్లనుటతోడనే మన నవనాగరకులు మనల నొకప్రశ్నయడుగక మానరు. ఏమనిన: "లోగడ నీప్రకరణముననే "ధర్మశాస్త్రములను గాలానుసారము మార్చికొనరాదా?" యనుశీర్షికక్రింద "...యుగభేదమునుబట్టి ధర్మములభేదముగూడ యేర్పడును. తగినసామర్థ్యముండియును జేయఁదగినధర్మమును మానినయెడల దోషమువచ్చును గాని, శక్తిచాలక మానినపుడు దోషమురాదు. అందుచేఁ గృతయుగమందలి శక్తిసామర్థ్యములు కలియుగమున జనులకు లేనపుడు వారాధర్మము లాచరింపకుండుట దోసము గాదు.......కావునఁ బైప్రమాణములవలన యుగభేదమునసుసరించి ధర్మములందలి

ఫలవిశేషముగూడ మారుచుండునని స్పష్టమగుచున్నది......" యని స్పష్టముగ మీరు వ్రాసియుంటిరే! తిరిగి యిపుడువచ్చి, "......మహిమాధిక్యులుకొందఱు......వారి మహిమాతిశయముచేఁ గొన్నికొన్ని ప్రత్యేకసందర్భములలో ధర్మాధర్మములు వానిస్వాభావికఫలముల నీయఁజాలకుండునట్లు చేయఁగల్గిరనిమాత్రమే మనము చెప్పఁదగునుగాని, యంతమాత్రముచే ధర్మాధర్మములు మారిపోయినవని యెప్పుడును జెప్పఁగూడ"దని తెగఁ బెట్టి యెట్లు వ్రాసితిరి? ఇది పరస్పరవిరుద్ధముగాదా?" యని వా రడుగకపోరు.

సమాధానమేమనఁగా: ధర్మాధర్మములు వానియంత నవియే యొకకాలమున నొక విధమగు ఫలమునిచ్చుటయుఁ మఱియొకకాలమున మఱియొకవిధమగుఫలము నిచ్చుటయు వానియందలి మార్పనిచెప్పుటకంటె వానియొక్కస్వభావమని చెప్పుట యెక్కువయుక్తము. ఏలననిన నట్టిమార్పు స్వాభావికముగనే వానియందుఁ గల్గుచున్నదిగాని, యితరులు కోరుటచే వారికోర్కెననుసరించి కలుగుటలేదు. అందుచే నది స్వాభావికమేయని చెప్పఁదగునుగాని మార్పని చెప్పఁదగదు. స్వభావవిరుద్ధముగ నట్టిది జరిగినపుడే మార్పని చెప్పఁదగును. ఈవిషయ మీక్రిందియుదాహరణముచేఁ దెల్లముకాఁగలదు. వైశాఖ జ్యేష్ఠమాసములలో నెండలు తీవ్రముగనుండుటయుఁ జలి లేకపోవుటయుఁ బ్రకృతి ధర్మము. క్రమముగా మార్గశిర పుష్యమాసములు వచ్చుసరి కట్టి ప్రకృతిధర్మము స్వాభావికముగ మారిపోయి యెండ పలుచఁబడుటయుఁ జలిబాధజాస్తియై మంచుగురియుటయుఁగూడ ప్రకృతిధర్మమే. అపుడు ప్రకృతిధర్మములు మారునవియని చెప్పవలయునా, కాక మారవని చెప్పవలయునా? మారునవియేయందుమా, యపుడు పైప్రకృతి ధర్మముమారినట్లే నిప్పులో వ్రేలుపెట్టినచోఁ గాలుటయనెడి ప్రకృతిధర్మముగూడ యెప్పుడైననుమారి కాలకుండపోవునా? పోదు! ఎందుచేత? ఎప్పుడువ్రేలుపెట్టినను కాలుటయే దానికిస్వభావమగుటచేత! ఐనచో, దానివలెనే యెప్పుడు నొక్కటేతీరుననుండక పైనదెలిపిన యెండయును, జలియును, మంచును మొదలగునవిమారుటకుఁ గారణమేమి? కాలముననుసరించి యట్లుమారుచుండుటయే వానికి స్వభావమగుటచేత! కావున నట్టి స్వభావసిద్ధమగుమార్పు మార్పని చెప్పఁదగదు. స్వభావమేయని చెప్పవలయును. ఐనచో నికమార్పనఁగా నెట్టిదియందురా? స్వాభావికముగ నెప్పుడువ్రేలుపెట్టినను గాలుచుండు నిప్పు స్వభావవిరుద్ధముగఁ గొంతకాల మెప్పుడైనను నట్లుకాలుట మానివేసిననే మార్పని చెప్పఁదగును. అదేరీతిగ, "స్వభావసిద్ధముగ వైశాఖ జ్యేష్ఠమాసములలో మెండుగఁగాయు నెండ లాకాలమున నికఁ గాయరాదు; మార్గశిరపుష్యమాసములలో మెండుగవీచు చలి, యాకాలమున నికపై వీవరాదు; మరియుఁ మంచును నికపై నట్లు కురియరాదు; వైశాఖజ్యేష్ఠమాసములందుమాత్రమే మంచు దట్టముగఁగురిసి చలిగాలి మెండుగవీవ

వలయును; మార్గశిరపుష్యమాసములందుమాత్రమే యెండలు తీవ్రముగఁ గాసితీరవలయు" నని మన నవనాగరకసోదరు లధికసంఖ్యాకు లొకచోటఁజేరి సభచేసి యేకగ్రీవముగఁ దీర్మానించుకొని, యాతీర్మాన మమలులోనికివచ్చునట్లు చేసినపుడుమాత్రమే ప్రకృతిధర్మములు మారిపోయినవని మన మంగీకరింపఁవలసియుండును. అదేరీతిగ ధర్మాధర్మములు యుగభేదమునను సరించి మారునని చెప్పుటలో నట్టిమార్పు వానికి స్వభావసిద్ధమేయని యభిప్రాయముగాని, ప్రజలయొక్క కోర్కెననుసరించి యవియట్లు మారినవనిగాని, యందుచే మన నవనాగరుకుల యభిరుచిననుసరించిగూడ యవిమారుటకు వీలున్నదనిగాని యభిప్రాయముగాదు. కావునఁ బైనగనఁబఱచిన మావ్రాసినవిషయములందు బరస్పరవిరోధములేదు. అందుచే ధర్మాధర్మములుగూడ వానికి స్వభావసిద్ధమగుమార్పు చెందుచుండినను నవి స్వభావవిరుద్ధముగ మనకోర్కెలననుసరించి యెన్నఁడును మారఁజాలవు. కాఁబట్టి ధర్మాధర్మముల నంతరాత్మనుండి తెలిసికొనవలయునని చెప్పుటగాని, వానిని గాలానుసారముగ మార్చవచ్చునని తలంచుటగాని, యధికసంఖ్యాకుల యభిప్రాయమునుబట్టి ధర్మాధర్మనిర్ణయమును జేయవలయునని యనుకొనుటగాని, పట్టి తెలివిమాలినవిషయమని పై విమర్శవలన మనము చక్కగా గ్రహింపవచ్చునుగదా!

## ధర్మశాస్త్రములన్నియు ధర్మాధర్మముల నొక్కరీతిగనే నిర్ణయింపుచున్నవా? వానిలో నభిప్రాయభేదమున్నపట్ల నేమిచేయవలయును?

వేదమందలి యర్థమునుగ్రహించుటలో ధర్మశాస్త్రములను వ్రాసినమహర్షులకుఁ గొన్నికొన్నిపట్ల (నచ్చటచ్చట) వేఱువేఱగు నభిప్రాయములుగల్గియుండుట కనఁబడుచున్నది. అట్టి భేదాభిప్రాయములేవియో కొన్ని స్వల్పవిషయములందుమాత్రమే గన్పట్టుచున్నవిగాని, ముఖ్యములగు మతవిషయములం దెట్టి భేదాభిప్రాయములును లేకయే, మహర్షులందఱు నేకీభావముతో వైదికమతముయొక్క మేలుకొఱకై తమతమధర్మశాస్త్రములను బ్రకటించియున్నారు. అట్లుగాక, వర్ణాశ్రమధర్మములు మొదలగు ముఖ్యమైన శాస్త్రవిషయములందే వారి కన్యోన్యవిరుద్ధములగు భేదాభిప్రాయము లేర్పడియున్నపక్షమున వాని నంతటితో విడువక, తర్కశాస్త్రసహాయముచే వేదము నామూలాగ్రముగ జర్చించి సత్యమును దేల్చికొనియుండెడివారే! అట్లుచేయక యుపేక్షించుటకుఁగారణ మావిషయము లంతముఖ్యమైనవిగాకపోవుటయును, వానివిషయమున ధర్మశాస్త్రకర్తలకు గల్గిన భేదాభిప్రాయములలో నేయభిప్రాయముప్రకారము ప్రజలునడచినను దానివలన నెట్టిహానియును లేకపోవుటయునుమాత్రమే. అంతియగాక, యట్టిభేదాభిప్రాయములు

ధర్మములకు మూలమగువేదమునందే కొన్నిగలవనియు, వానిసందర్భమున నట్టియభిప్రాయములలో దేనిననుసరించినడచినను దొందరలేదనియు, లోగడనీప్రకరణముయొక్క మొదట "స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్రలందుఁ జెప్పఁబడినవిషయములకుఁ బ్రమాణము"లను శీర్షికక్రింద, స్వాయంభువమనువుయొక్క వాక్యములసందర్భమున, 'నాత్మతుష్టి' యను విషయమునుగుఱించి చర్చించునపుడు తెలిసికొనియేయుంటిమి. కాఁబట్టి వేదమందలి యట్టిభేదాభిప్రాయములే, ధర్మశాస్త్రములందు భేదాభిప్రాయము లేర్పడుటకుఁగూడ కొంతవఱకు కారణముగావచ్చును. కావున ధర్మశాస్త్రములం దన్యోన్య భేదాభిప్రాయములున్నప్పటికిని వానివలన నెట్టియుపద్రవమును గలుగనేరదు.

ఈవిషయము నెఱుఁగఁజాలనికొందఱు నవనాగరకులు, ధర్మశాస్త్రములందలి పై భేదాభిప్రాయముల నాధారముచేసికొని, యాశాస్త్రకర్త లెవరియిష్టమువచ్చినట్లు వారు వేఱువేఱురీతుల వ్రాసియుండిరనియుఁ, గావున నందేమియు విశేషములేదనియుఁ, నందుచే నాశాస్త్రములప్రకారమే నడువ నవసరములేదనియుఁ, దమ యిష్టమువచ్చిన చొప్పునఁ దాము నడచికొనవచ్చుననియు వాదించుచున్నారు. కాని కొంచెముబాగుగ నాలోచింపఁగా వీరివాదము తప్పనియు, ధర్మశాస్త్రములలో భేదాభిప్రాయము లున్నప్పటికిని నట్టియభిప్రాయములలో నేదియో మనయిచ్చవచ్చినదానినిగైకొని దానిప్రకారము మనము నడచికొనవలసినదేగాని, యట్లుగైకొనక యాయభిప్రాయములనన్నిఁటిని ద్రోసిపారవైచి మనయిష్టమువచ్చిన క్రొత్తమార్గము నొకటివెదకికొని దానిప్రకారము నడువఁజూచుట యపాయకరమనియు నీక్రిందియుదాహరణముచే జక్కఁగా విశదము కాఁగలదు:—

వైద్యశాస్త్రమెఱిఁగిన యిద్దఱువైద్యు లొకరోగినిబరీక్షించి యతనికిఁ బథ్యమును నిర్ణయించుటలోఁగాని, మందును నిర్ణయించుటలోఁగాని, యనుపానమును నిర్ణయించుటలోఁగాని, వారికిఁ గొంచెముభేదాభిప్రాయము గల్గినదనుకొందము. ఒకవైద్యుఁడు మిరియములరసముతో మందుతినవలసినదనియు, వరిబియ్యపుగంజి (జావ) త్రాగవలసినదనియు నిర్ణయించెననుకొందము. రెండవవాఁ డల్లపురసముతో మందుతినవలసినదనియు, గోధుమనూకగంజి త్రాగవలసినదనియు నిర్ణయించెననుకొందము. అపుడు రోగియేమి చేయవలయును? మొదటివైద్యుఁడుచెప్పినట్లు చేయవలయునా? లేక, రెండవవైద్యుఁడు చెప్పినట్లు చేయవలయునా! కాక, వారిద్దఱును వేఱువేఱుగఁ జెప్పిరిగావున నిద్దఱిలో నెవరిమాటయును విననక్కఱలేదనియుఁ దనయిష్టమువచ్చినమందును వేఱుగ దేనినైనను, దనయిష్టమువచ్చిన వేఱొకయనుపానముతో దేనితోనైనను దిని, తనయిష్టమువచ్చిన పదార్థములను భుజింపవచ్చునా? ఎట్లుచేయుట మంచిది?

తనయిష్టమువచ్చినట్లు వేఱురీతిగఁ జేయుట మంచిదిగాదు. ఏలననఁగా రోగికి వైద్యశాస్త్రము తెలియనందున నేవస్తువును దినినయెడలఁ దనరోగమునకు సరిపడునో, యే వస్తువును దినినయెడల రోగమెక్కువయగునో యాసంగతి వానికిఁ దెలియదు; ఏమి తినిన నేమిచేయునో తెలియదు. వైద్యశాస్త్రమెఱిఁగి యావిద్యయం దనుభవమును సంపాదించిన వైద్యులకుమాత్రమే యది తెలియును. కాఁబట్టి యాయిద్దఱు వైద్యులలో నెవరి ప్రజ్ఞయందు రోగి కెక్కువనమ్మకమును నభిమానమునుగలదో, వారుచెప్పినట్లు చేయుటయేమంచిది. కాక యిరువురియెడలను సమానాభిప్రాయమేయున్నచో నారెండు వైద్యములలో దనయిష్టమువచ్చినదానిని దేనినైనను జేసికొనుటమంచిది.ఎందుచేతననఁగా వారిద్దఱును వైద్యశాస్త్ర మెఱిఁగినవారేయగుటచే వారుచెప్పిన రెండుమార్గములలోను గొంచెము భేదమున్నప్పటికిని, నందేదియును హానిగల్గించునదిగానుండదు. అంతియగాక వైద్యశాస్త్రమునం దొక్కరోగమునకే వేఱువేఱుచికిత్సలును, వేఱువే ఱనుపానములును, వేఱువేఱు పథ్యములునుగూడ నిర్ణయింపఁబడియుండుటయుఁ గలదు. ఒకప్రత్యేకౌషధమును, దానికిఁదగిన యనుపానమును, బథ్యమును గొన్నిసందర్భములలో నొకవేళ లభ్యపడకపోయినను, నంతమాత్రముచే రోగబాధచే రోగి చావవలసిన యవసరములేకయే, వేఱొకచికిత్సావిధానముచేనైనను నట్టిరోగమును లొంగఁదీసి, రోగిని రక్షించుటయే యట్టిచికిత్సాభేదములయొక్క పరమప్రయోజనము. దానిని గ్రహింపఁజాలక భేదాభిప్రాయములుండుట శాస్త్రజ్ఞానమున లోపమని భ్రమపడి యాశాస్త్రజ్ఞాన మసలేలేనివారు స్వేచ్ఛగాఁ బ్రవర్తింపఁజూచుట మఱింత తెలివితక్కువయేయని చెప్పవలయును. అట్టి భేదాభిప్రాయములను గారణముగాఁగొని, పైనఁదెలిపినరోగి "నేను మొదటివైద్యుఁడు చెప్పినమందు మిరియాలరసముతోనుదినను, బియ్యపుగంజియుఁద్రాగను; రెండవవైద్యుఁడు చెప్పినమందు నల్లపురసముతోడనుదినను, గోధుమగంజినిద్రాగను; వారివారి యిష్టము వచ్చినట్లు వారుచెప్పినపుడు వారిమాట నేనేలవినవలయును? నాయిష్టమువచ్చినట్లు నేనేల చేయరాదు? నాకు నిమ్మపండ్లరసమునందును, గేదెపెరుగువేసికొని యన్నముతినుట యందును నెక్కువయిష్టము; కాఁబట్టి నాయిష్టమువచ్చినమందును గొనితెచ్చి నిమ్మపండ్లరసముతోఁదిని, పెరుగునన్నముమెక్కి హాయిగనిద్రపోయెదను; అపుడీవైద్యులును వైద్యశాస్త్రమును నన్నేమిచేయఁగలవో చూచెద"నని చెప్పి యాప్రకారమే చేసినచో నది యెట్టివివేకమనిపించుకొనునో, యాపైనేమిజరుగునో పాఠకులే యూహించుకొనవచ్చును! ఏమనిన, వైద్యశాస్త్రమే యెఱుఁగని యారోగితినినపదార్థము లొకవేళ నతని రోగమున కపథ్యమేయైనచో, వానిదోషముచే నెన్నిదుర్గుణములైనను బుట్టి, యెంతటి యపాయమైననుగల్గి, తుదకు రోగి చనిపోవుటకుఁగూడ పూర్ణమగు నవకాశముగలదు.

కావున వైద్యులుచెప్పిన రెండుమార్గములనుగాక, తాను వేఱొకక్రొత్తమార్గమునఁబోవఁ జూచుట మిక్కిలియపాయకరము.

అదేరీతిగ ధర్మములను నధర్మములను గుర్తెఱిఁగి ధర్మశాస్త్రకర్తలువ్రాసిన రెండు మార్గములనువిడిచి, తనయిష్టమువచ్చినట్లు మూఁడవమార్గమునఁ జేయఁదలఁచుటకూడ మిక్కిలి యపాయకరమును నవివేకమునని చెప్పకతప్పదు. ధర్మశాస్త్రములందును, ధర్మ నిర్ణయమునందును భేదాభిప్రాయములుండుటకు హేతువు, వానికిమూలమగు వేదము నందుఁగూడ యిట్టిభేదాభిప్రాయము లుండుటయేకావచ్చునని లోగడఁ దెలిపియే యుంటిమి. అట్టి భేదాభిప్రాయములయొక్క ప్రయోజనముగూడ పైనదెలిపియున్న రీతిగ వైద్యశాస్త్రమునందలి చికిత్సాభేదముల ప్రయోజనమువంటిదేయని తెలిసికోనఁ దగును. ఒకప్పుడొకధర్మము నొకప్రత్యేకవిధమున నాచరించుట కేదియైనను గారణముచే వీలుపడకపోయినయెడల నట్టి ధర్మలోపముచేఁ బ్రత్యవాయము (దోషము) రాకుండు నట్టి వేఱొకమార్గమేదియైననున్నచో, మొదటిదానిస్థానమున రెండవదానిని ధర్మశాస్త్ర కర్తలు వేదమననుసరించి నిర్ణయించియుండవచ్చును. పైనఁదెల్పిన రోగియొక్క పథ్య ములవిషయమున, నిరువురువైద్యులును జెప్పిన రెండు భేదమార్గములలో నేది తనశరీర మునకు మేలుచేయునని నమ్మకముగలదో దానినే చేసికొనదగినరీతిగనే, ధర్మశాస్త్రము లొకధర్మమును రెండువిధములుగఁ జెప్పినచోట్ల, నా రెండువిధములలోఁ దనయిష్టము వచ్చినవిధముననే చేయవచ్చును. రెంటిలో నేదిచేసినను హానిలేనపుడు మొదటిదైన నేమి, రెండవదైననేమి? కాని స్వతంత్రమగు మూఁడవవిధమునమాత్ర మెన్నఁడును జేయరాదు.

పైయర్థమునే మనువు తనస్మృతియందు దీక్రిందిరీతిని దెలిపియుండెను:—

శ్లో. "శ్రుతిద్వైధంతు యత్రస్యా త్తత్ర ధర్మా వుభౌస్మృతౌ,
ఉభావపి హితౌ ధర్మౌ సమ్య గుక్తౌ మనీషిభిః."

అనఁగా: "వేదమున రెండువిధములున్నపట్ల, నారెండువిధములనుగూడ ధర్మ ములేయనియు, నవిరెండును శ్రేయోదాయకములేయనియుఁ బండితులచేఁ జెప్పఁబడిన" దని యర్థము.

కాని, యిట నొకసంశయముగలుగవచ్చును. ఏమనిన, "రెండువిధములున్నచో నవిరెండును ధర్మములేయైనఁ గావచ్చును; కాని, యందొకదానికొకటి విరుద్ధముగ నున్నప్పు డందేది ధర్మమనితలంపవలయును? అందేది ధర్మమైనప్పటికిని రెండవది యధర్మమగుటలేదా? ఏలనన, ధర్మమునకు విరుద్ధముగనుండుటచేత. అప్పుడట్టి యధర్మ మునుగూడ ధర్మముతోఁబాటుగ వేదమేల చెప్పినది? దానిప్రయోజనమేమి?" యని

కొందఱు నవనాగరకు లడుగవచ్చును. సమాధానమేమనిన, రెండువిధములుగ వేదమునం జెప్పఁబడియున్నచోట్లలో నందు దేనినో యొకదానిని గ్రహించి రెండవది విడిచినప్పటి కిని దోషములేనివిధముననే, యొకపని చేయవచ్చుననియుం జేయవలదనియుంగూడ యన్యోన్యవిరుద్ధముగ వేదముచెప్పఁగుయున్నచో, రెండును నొక్కవేదముచేఁ జెప్పఁబడి నవేయగుటచే, నా రెండును సమానమగు బలముగలవియైనందున నాపనిని జేసినను ధర్మమే యనియుం జేయకున్నను ధర్మమేయనియుం, జేసినను, కాక మానిననుగూడ దోషము లే దనియు మనము తెలిసికొనవలయును. ఏలననిన, రెండును ధర్మములేయని వేదముచేఁ జెప్పఁబడినందున రెండును ధర్మములేయగును గాని యొకటి ధర్మమును రెండవది యధర్మమును గాఁజాలదు. ఈయభిప్రాయమునే గౌతమమహర్షి యీక్రిందిరీతిగఁ దెలిపి యుండెను:—

"తుల్యబలవిరోధే వికల్పః."

అనఁగా, "సరిసమానమగు బలముగల రెండుప్రమాణము లొకదానికొకటి విరుద్ధముగనున్నచో, నందు దేనినైనను గ్రహింపవచ్చు"నని యర్థము.

ఇట మఱియొకసంశయము గలుగఁగలదు. ఏమనిన, శాస్త్రగ్రంథములలో బలము విషయమున నెచ్చుతగ్గు లెట్లు తెలిసికొనవచ్చును? అన్నియు సమానగ్రంథములేగదా!" యని యడుగవచ్చును.

సమాధానమేమన: లోగడ, "స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్రలందుఁ జెప్పఁ బడినవిషయములకుఁ బ్రమాణము" లనుశీర్షికక్రింద నీప్రకరణముననే, మనువు, నాప స్తంబుఁడు, గౌతముఁడు, యాజ్ఞవల్క్యుఁడు మొదలగువారుచెప్పిన కొన్నివాక్యము లను గనఁబఱచియుంటిమి. వానినిబట్టి, నిఖలధర్మములకును మూలము వేదమనియు, దానినుండియే ధర్మములనుగైకొని ధర్మశాస్త్రగ్రంథములు వ్రాసియుండిరనియుం దేలినది. అందుచే ధర్మశాస్త్రములకంటె వానికి మూలమగువేదము బలవత్తరమగు (ననఁగా నెక్కువబలముగల) ప్రమాణమగుచున్నది. అట్టివేదమును, ధర్మశాస్త్రములను, ననుస రించి బయలువెడలినదేయగుటచే శిష్టాచారము (సదాచారము) వానికంటెఁ గొంచెము తక్కువబలముగల ప్రమాణమగుచున్నది. అవియన్నియుంజేరి ధర్మము నెఱుఁగ సాధనము లగుచున్నవి. కావున వానిలో నేవిషయముననైనను ద్వైధములు (అనఁగా రెండువిధ ములఁ జెప్పఁబడిన విషయములు)గాని, యొకదానికొకటి విరుద్ధముగనున్న విషయములు గాని, కనఁబడినప్పు డెక్కువబలముగల ప్రమాణముచెప్పిన విషయమునుగ్రహించి రెండవ దానిని విడువవలయును. రెండువిధములును సమానబలముగల ప్రమాణముచేతనే చెప్పఁ బడినయెడల, (ననఁగా, రెండువిధములును వేదముచేతనేగాని, కాక, రెండువిధములును

స్మృతులచేతనేగాని చెప్పఁబడినయెడలను, లేక, యొక్కశిష్టాచారమునందే రెండువిధము లగు భేదములుగాని విరోధములుగాని కనుపించినపుడును,) వానిలోని యేయొక్కవిధాన మునకైనను బలవత్తరమగు పైప్రమాణము గనఁబడినచో, దానినిమాత్రమే గ్రహించి రెండవదానిని విడువవలయును. అట్టి బలవత్తరప్రమాణము కనఁబడక రెండును సమాన బలముగలవిగనేయున్నచో, "తుల్యబలవిరోధే వికల్పః" యని పైన గౌతమమహర్షి చెప్పినరీతిగ నారెంటిలో నిష్టమువచ్చినదానినిగ్రహించి రెండవది విడువవచ్చును. అనఁగా నొక్కశిష్టాచారముననే యేదోయొకవిషయమునఁ బరస్పరవిరుద్ధములగు రెండువిధము లైన యాచారభేదము గనఁబడినదనుకొనుఁడు. అందొకదాని కనుకూలమగుశాస్త్రప్రమా ణము స్మృతులలోఁగాని, శ్రుతులలోఁగాని కనఁబడినదనుకొనుఁడు. రెండవదాని కట్టి ప్రమాణము కనఁబడలేదనుకొనుఁడు. అప్పుడు మొదటిదాని కెక్కువబలముగల యాధారము చిక్కుటచే దానినేగ్రహించి రెండవదానిని విడిచిపెట్టవలయును. రెండవ దానికిఁగూడ యట్టిసమానబలముగల యాధారమే దొఱకినచో, నపుడు రెండును గ్రహింపఁదగినవేయగుటచే నేదిగ్రహించినను ధర్మమేయగును. అట్లుగాక మొదటి దానికి ననుకూలమగుశాస్త్రాధారము స్మృతులయందును, రెండవదాని కనుగుణ్యమగు శాస్త్రాధారము వేదమునందును గనఁబడెననుకొనుఁడు. స్మృతికంటె వేదము పైనచెల్పిన రీతిగ బలవత్తరప్రమాణమైనందున, నట్టివేద మాధారముగఁగల రెండవయాచారమునే గ్రహించి మొదటియాచారమును విడువవలయును. ఈయభిప్రాయములనే జైమిని మహర్షి యీక్రిందిరీతిని జెప్పియుండెను:—

"అపివా కర్తృసామాన్యా త్ప్రమాణ మనుమానంస్యాత్."

"విరోధే త్వనపేక్ష్యంస్యా దసతి హ్యనుమానమ్."

అనఁగా, పౌరుషేయగ్రంథములగుస్మృతులు వేదముకంటెఁ దక్కువయాధా రము (పరతఃప్రమాణము)లనియుఁ, నందుచే శ్రుతికిని స్మృతికిని విరోధముగనుపించిన చోట శ్రుతియే ప్రమాణముగ గ్రహింపఁదగినదనియు నర్థము.

ఈవిషయమునే జాబాలమహర్షికూడ యీక్రిందిరీతిని జెప్పియున్నారు:—

"శ్రుతిస్మృత్యో ర్విరోధేతు శ్రుతిరేవ గరీయసీ."

అనఁగా శ్రుతిస్మృతులకు భేదాభిప్రాయముగల్గినచోట శ్రుతికే యెక్కువబలము గావున దానినే గ్రహింపవలయునని తాత్పర్యము.

భవిష్యత్పురాణముసహిత మీవిషయమునే యీక్రిందిరీతిగఁ జెప్పియున్నది:—

"శ్రుత్యాసహ విరోధేతు బాధ్యతే విషయంవినా."

పైనఁ దెల్పియున్న రీతిగ, స్మృతులలోనే యభిప్రాయభేదముగల్గినయెడల, వానిలో దేనికైన నొకదానికి బలవత్తరమగు శ్రుతియొక్కయాధారము లభించినచో, నప్పు డట్టిశ్రుతిననుసరించు స్మృతివచనమే బలముగలదగుచున్నదనియు, రెండవస్మృతి వచనము విడువఁదగుననియుఁ బాదరాయణమహర్షి యీ క్రిందిరీతిని జెప్పుచున్నారు:—

"స్మృత్యనవకాశదోషప్రసంగ .ఇతిచే న్నాన్యస్మృత్యనవకాశదోషప్రసంగాత్."

మఱియును, శ్రుతిస్మృతిసదాచారములు మొదలగు ధర్మసాధనములయొక్క బలాబలములవిషయమును బైన దెల్పియున్న రీతినే, వేదవ్యాసమహర్షి కూడ యీ క్రింది విధమునఁ జెప్పియున్నారు:—

శ్లో. "శ్రుతిస్మృతిపురాణానాం విరోధో యత్ర దృశ్యతే,
తత్ర శ్రౌతం ప్రమాణం స్యా త్తయోర్ద్వైధే స్మృతిర్వరే."

కాని, యిచట నవనాగరకుల కొకసంశయము గలుగవచ్చును. ఏమన: "బలవత్తరమగుప్రమాణము దొఱకినదే ధర్మమనియు, దానిని గ్రహించి రెండవదానిని విడువవలయుననియుఁ జెప్పితిరే. శిష్టాచారమున నొకవిషయమున నాచారభేదము గనుపించిన దనుకొనుఁడు. అందొకయాచారమునకు ననుకూలమగు స్మృతివచనము కనఁబడినదనుకొనుఁడు; రెండవదాని కెట్టియాధారమును గనఁబడలేదనుకొనుఁడు. అందుచే మీరు చెప్పినరీతిగ మొదటిది గ్రహించి రెండవది విడచిపెట్టితిమనుకొనుఁడు. కొంతకాలము జరిగినపిమ్మట రెండవదాని కేదో యొకశ్రుతివాక్య మాధారముదొఱకినదనుకొనుఁడు. అపుడు రెండవది బలవత్తరప్రమాణమగుటచే దానిని గ్రహించి మొదటియాచారమును విడిచిపెట్టవలదా? అప్పటివఱకును ధర్మమైన యా మొదటియాచార మది మొదలుకొని యధర్మమగుటలేదా? అట్లే యంతవఱకును నధర్మమైన రెండవయాచార మది మొదలుకొని ధర్మమగుటలేదా? ధర్మాధర్మములుగూడ ప్రకృతిధర్మములవలెనే యతికఠినములనియు, మార్ప శక్యముగానివనియు, వానిఫలముల నవియీయకమానవనియు లోగడ నీప్రకరణముననే, "ధర్మాధర్మములు ప్రకృతిధర్మముల (Laws of Nature) వంటివా?" యనుశీర్షిక క్రిందఁ దెలిపియుంటిరిగదా! అందుచే నప్పటివఱకు నాచరించిన యధర్మముయొక్కఫల మనుభవింపకతప్పదుగదా! కావున వైదికమతధర్మములుగూడ తక్కిన విదేశీయుల వ్యవహారధర్మములవలె నిలుకడలేక మారుచుండుటలేదా? మనుష్యబుద్ధిపైనను, యుక్తివాదహేతువాదములపైనను నాధారపడువిషయములు "నిలుకడలేక సత్యమనుకొనిన దసత్యమనియు, మరల నసత్యమనుకొనినది సత్యమనియు భ్రమించుచుఁ దుదకు సత్యమేదియో యసత్యమేదియో యాయథార్థమును నిశ్చయించుకొనఁజాలని

దుస్థితికి జనులు పాల్పడవలసివచ్చు”నని లోఁగడ నీప్రకరణముననే “యుక్తివాదము నమ్మఁదగినదగునా, కాదా?” యనుశీర్షికక్రిందఁ జెప్పియుంటిరిగదా! అట్లే విదేశీయుల వ్యవహారధర్మములనుగూర్చి ప్రాయుసందర్భమునఁగూడ లోఁగడ నీప్రకరణముననే “విదేశీయులు ధర్మముల నేర్పఱచుకొనువిధ” మనుశీర్షికక్రింద, “నప్పటివఱకు నధర్మమైన యాచట్టము తిరిగి యానాఁటినుంచియును బరమధర్మమగును. ఈరీతిగ వారియొక్క ధర్మము లధర్మములగుచుండును; అధర్మములు ధర్మములగుచుండును. వానికి నిలుకడ యుండదు. విదేశీయుల ధర్మనిర్ణయవిధాన మిట్టిదైయున్నది.” యనిచెప్పి వారిధర్మముల పైన దెబ్బతీసియుంటిరే! ఇప్పుడు పైనగనఁబఱచిన కారణములచే, వైదికమతధర్మములుగూడ నిలుకడలేక మారవలసివచ్చుచుండుట తప్పుచున్నదా? ఇఁక విదేశీయుల ధర్మములకంటె వైదికమతధర్మములయొక్కవిశేషముమాత్ర మేమి వెలుఁగుచున్నది?” యని మననవనాగరకసోదరు లడుగకమానుదురా?

సమాధానమేమనిన: లోఁగడ నీవ్యాసముననే పైన దెలిపియున్నరీతిగ శ్రుతిస్మృతుల యందు ద్వైధములుగను, పరస్పరవిరోధములుగను గనఁబడువిషయములు సామాన్యముగ నంతముఖ్యవిషయములు గావనుసంగతియు, నంతియగాక, యట్టివిషయములం దెట్లు ప్రవర్తించినను దోషములేదనుసంగతియు, నందుచేతనే యట్టివిషయములసందర్భమున లోతుగఁ జర్చింపక స్మృతికర్తలు విడిచిపుచ్చిరనియు,నట్టివిషయములకుఁగూడ యనంతము లగువేదములందు మూలప్రమాణవచనము లుండవచ్చుననియు జ్ఞాపక ముంచుకొనవల యును. మఱియును, సమానబలముగల పరస్పరవిరుద్ధవిషయములలోను, ద్వైధములలోను నిష్టమువచ్చినదేదోయొకటి గ్రహింపఁదగినదైనప్పు డంతమాత్రముచే రెండవది యధర్మము గాక యదియును ధర్మమేయైయున్నవిధముగనే, యొకదానికంటె బలవత్తరప్రమాణము గల మఱియొకధర్మము గానవచ్చినప్పు డది యెక్కువయుత్తమమని దానిని గ్రహింపవలసి నదేగాని యంతమాత్రముచే మొదటియాచారమధర్మమనియుఁ బ్రాయశ్చిత్తావహమనియు నర్థముగాదు. యుక్తపదార్థములలోఁగూడ నెక్కువయుత్తమపదార్థములులభించినపుడు మొదటిపదార్థమును విడుచుటలో దోషమేమున్నది? ఎక్కువమంచివస్తువు దొఱకనంత వఱకును మధ్యరకమువస్తువును వాడుకొనకతప్పునా? అప్పటివఱకును వాడుకొనలేదా యను కారణముచే నంతకటె మంచివస్తువు లభించినపుడుగూడ యదే వాడుకొనవల సిన యగత్యమేమి? “విదేశీయులును వారిధర్మముల విషయమున నట్లేచేయుచుండిరిగదా” యనెదరా!అట్లుగాదు! వైదికమతధర్మములవిషయమున ద్వైధములందును,బరస్పరవిరోధ విషయములందును, మొదటను బిమ్మట బలవత్తరప్రమాణములు లభించినపుడునుగూడ, మనుష్యబుద్ధి కలీతమగు శాస్త్రమే యాధారమగుచున్నదిగాని, మనుష్యబుద్ధియు హేతు

వాద యుక్తివాదములును నెప్పుడును నాధారములుగ గ్రహింపఁబడుటయేలేదు. అట్టి వాదములకు వైదికమతధర్మము లెంతమాత్రము నందునవి కానేకావని లోఁగడ నీప్రకరణముననే, "ధర్మమనఁగా నెట్టిది?" యను శీర్షికక్రిందను, "ధర్మాధర్మము లతీంద్రియవిషయములనుటకుఁ బ్రమాణ"మను శీర్షికక్రిందను విపులముగఁ జర్చించియుంటిమిగదా! ఇఁక విదేశీయధర్మవిషయము లట్లుగాక యెల్లపుడును మనుష్యబుద్ధిపైనను హేతువాద యుక్తివాదములపైనను మాత్రమే యాధారపడవలసియున్నవి. వానికంతకంటె వేఱగు నాధారమేమియును లేనేలేదు. అట్టియాధారముయొక్క బలాబలములను లోఁగడ "యుక్తివాదము నమ్మదగినదగునా, కాదా?" యనుశీర్షికక్రింద వినిపించియేయున్నాము. అందుచే వైదికమతధర్మము లెప్పుడో యొకప్పు డేవో కొన్నిసందర్భములలో నేవియో కొన్ని యముఖ్యవిషయములలో మార్పుచెందవలసివచ్చినను నంతకంటె యుత్తమమార్గమును ద్రొక్కుటకే మారుచున్నవిగాని, విదేశీయధర్మములవలె ముఖ్యవిషయములందుఁ గూడ ద్రొక్కినమార్గమునే మరల మరల వెనుకకును ముందునకును ద్రొక్కవలసివచ్చుట లేదు. ఇదియే వైదికమతధర్మములకును దదితరధర్మములకును గల ముఖ్యభేదము.

## ధర్మాధర్మములకు మూలము ప్రకృతిశాస్త్రహేతువులు (Scientific Reasons) కావా?

ఇప్పటి నవనాగరకులలోఁ గొందఱు మన వైదికమతాచారములలోఁ గొన్నిఁటి యందుఁ (బూర్వపుణ్యవశమునఁ) గొంచె మభిమానముగలవారుకూడ గలరు. వారు పూర్వాచారముల నన్నిఁటినిగాకున్నను నేవియో తమయిష్టమువచ్చినవానిని గొన్నిఁటినిమాత్రము శ్రద్ధతో నాచరించుచు, (నదిచూచి యితరనవనాగరకులు నవ్విపోవుదురనుభయముచేతఁ గాఁబోలును!) దామాచరించు ధర్మములు నిష్ప్రయోజనములు గావనియు, మనపూర్వులగు మహర్షు లనేకశాస్త్రములను గుర్తెఱిఁగినవారగుటచే వారేర్పఱచిన యాచారములేవియో కొన్ని ప్రకృతిశాస్త్రసిద్ధాంతములపై యాధారపడి ప్రయోజనకరములుగ నున్నందునఁ దాము వానినాచరించుచుంటిమనియు సమాధానములు చెప్పుచున్నారు! తమకు బుద్ధిపుట్టి తామాచరించుచున్న ధర్మములను సమర్థించుకొనుటకై వానికేవియో ప్రకృతిశాస్త్రహేతువులను జూపుటకుమాత్రమే వీరు పెనఁగులాడుచున్నారుగాని, మనమహర్షు లనేకశాస్త్రముల నెఱిఁగినవారనియు నందుచే వారేర్పఱచినధర్మములు ప్రకృతిశాస్త్రసిద్ధాంతములపై యాధారపడియుండి ప్రయోజనకరములుగా నుండుననియు వీరుత్రికరణశుద్ధిగా నమ్మియే యున్నయెడల, నట్టి యాచారధర్మములను సాధ్యమైనంతవఱ కన్నిఁటిని నాచరించుటకు వీరు తంటాలుపడవలదా? అట్లు చేయఁజాలకున్నమానె! నట్లాచరించువారినిజూచి సంతసింపనైన వచ్చును

గదా! సంతసింపకపోయినను దొందరలేదు; వారినిజూచి యూరకయైన నుండ వచ్చునుగదా! కాని, యట్లూరకోనకపోఁగాఁ దమకిష్టములేని యాచారధర్మములను మూఢవిశ్వాసములనియుఁ, మూర్ఖాచారములనియుఁ నిరసించుచు వానినాచరించు వారిని జూచి వెక్కిరించుటయుఁ వానిని మాన్పింపయత్నించుటయుఁ నెట్లు ఘటస్థించును? కావున నట్టినవనాగరకులు తమ పూర్వజన్మకర్మవాసనల ననుసరించి తమకు బుద్ధిపుట్టి చేయుచున్నపనులు మంచివని సమర్థించుకొనుటకై ప్రకృతిశాస్త్రహేతువులను వెదకి కొనుటకుఁ దంటాలుపడువారేగాని, నిజముగవారు మన యాచారధర్మములందును, వాని నేర్పఱచిన మహర్షులయొక్క ప్రకృతిశాస్త్రజ్ఞానములందును విశ్వాసముగలవారు కారని మనము తెలిసికొనవలసియున్నది.

వైదికమతాచారముల నాచరించుటయందు శ్రద్ధతొలఁగి యిష్టమువచ్చినట్లు తిని తిరుగుచుండియుఁ, నింటిలోని ముసలివాండ్ర బాధపడఁజాలక, కొన్నియాచారము లను విడిచినను, మఱికొన్నిఁటినైనను విడువవీలులేక విధిలేక యాచరింపవలసివచ్చు చున్న నవనాగరకులు మఱికొందఱు గలరు. వీరు పైనవనాగరకులవాదము నాధారము చేసికొని, దానికొక తోఁకనుజేర్చి, మనపూర్వుల యాచారములన్నియుఁ బ్రయోజన కరములగు ప్రకృతిశాస్త్రహేతువులపై యాధారపడియున్నవిగాని వట్టిసిద్ధాంతములు గావనియుఁ, గావున నట్టిప్రకృతిశాస్త్రహేతువులు గానరాని యాచారధర్మములు వట్టి నిరర్థకములనియుఁ, గావున నాచరింపఁదగినవి కావనియుఁజెప్పి, వానినాచరించుట మాని స్వేచ్ఛగాఁదిని తిరుగ మరగియున్నారు. అంతియేగాక, పైహేతువులనుజెప్పి,తమ తమధర్మములను జక్కఁగాఁ జరుపుకొనుచున్న యితరవైదికమతస్థులచే వానిని మాన్పిం చుటకు దుర్బోధనుగూడ చేయుచున్నారు.

ఇందులకుఁగూడఁ గారణము మేము లోగడవ్యాసములలోఁ దెలిపియున్నరీతిగ ధర్మాధర్మములయొక్క స్వరూపస్వభావములను, వానితత్త్వమును, నవనాగరకు తెలుఁగఁ జాలి యుండకపోవుటయే. ఏమనఁగా: మన ప్రాచీనచరిత్రకారులగు మహర్షులందఱును, ధర్మాధర్మము లతీంద్రియవిషయములగుటచే నవి పరమేశ్వరుని యాజ్ఞారూపమగు వేదముయొక్క సహాయముచేఁ దప్ప వేఱురీతిగఁ దెలిసికొనుట కెంతటివానికిని నేవిధ ముగనుగూడ సాధ్యముగాఁజాలదనియుఁ, దామందఱు నట్లే వేదమూలమున ధర్మా ధర్మములను దెలిసికొని ధర్మశాస్త్రములందు వ్రాసియుంటిమనియుఁ, దమగ్రంథము లందుఁ దెలిపియుండిరి. వారిధర్మశాస్త్రగ్రంథము లన్నిఁటికిని మూలము వేదమే యనుటకుఁ బ్రమాణముల నీప్రకరణముయొక్క మొదటనే, "స్మృతులను గుఱించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పు?" నను శీర్షికక్రిందను, "స్మృతులనుదుఱించి ప్రాచీనచరిత్ర

లందుఁ జెప్పఁబడినవిషయములకుఁ బ్రమాణము" లను శీర్షికక్రిందను వినిపించియే యుంటిమి. కాని, వారిలో నొక్కరైనసుగూడ తమప్రకృతిశాస్త్రజ్ఞానము(Scientific Knowledge) నాధారముగఁగొని తాము తమధర్మశాస్త్రమును నిర్మించియుంటిమని వ్రాసికొనియుండలేదు. వారట్లు నిర్మించియుండిరనువిషయ మిఁక మన నవనాగరకసోద రుల కెట్లు తెలిసినది? అది వట్టియూహయేకాని వేఱుకాదు. అంతియగాక ప్రకృతి శాస్త్రజ్ఞానము గలగొప్పవిద్వాంసులు సహితము తమసిద్ధాంతములందు భ్రమప్రమాద ములపాలగుటకు లెస్సగ నవకాశముగలదనియు, నట్టిపొరబాట్లు మనుష్యబుద్ధికి స్వాభా వికములనియు, నందుచేతనే మనుష్యబుద్ధిపై యాధారపడినది గాకపోవుటవలన వేదము నకు సర్వోత్కృష్టమగు ప్రామాణ్యత గలిగినదనియు, నీప్రకరణముననే లోఁగడ "ధర్మా ధర్మములను నిర్ణయింపవలసినది, యెక్కువమందియొక్క యభిప్రాయమును (Majority of Votes) బట్టి కాదా?" యను శీర్షికక్రింద వినిపించియుంటిమి. మనుష్యజన్మ మెత్తిన వారిలోఁ బొరబాటులేనివాఁడే యుండఁడని నవనాగరకాగ్రగణ్యులగు శ్రీగాంధీగారు సహిత మంగీకరించియున్నవిషయమును వారు శ్రీకాశీశంకరచక్రవర్తిగారికి వ్రాసిన ప్రత్యుత్తరసందర్భమున, "ధర్మములను నధర్మములను గుర్తెఱుఁగుటకాధార మంతరాత్మ (Conscience) కాదా?" యను శీర్షికక్రింద, లోఁగడ నీప్రకరణముననే తెలిసికొని యుంటిమి. మనుష్యబుద్ధిపై యాధారపడియున్న ప్రకృతిశాస్త్రజ్ఞానమైనను మఱి యే జ్ఞానమైననుగూడ భ్రమప్రమాదములకుఁ బాలుగాకతప్పదు కావుననే, యతీంద్రియ విషయములగు ధర్మాధర్మములపట్ల నట్టిమనుష్యజ్ఞానము ననుసరించిచేయు నెట్టిహేతువాద మైనను నింద్యమేయగునని మనువు తనధర్మశాస్త్రమున నీక్రిందిరీతిని దెలిపియుండెను:—

శ్లో. "యోఽవమన్యేత తేమూలే హేతుశాస్త్రాశ్రయా ద్ద్విజః,
ససాధుభి ర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః."

మనుస్మృ. అధ్యా. ౨. శ్లో. ౧౧

అనఁగా: హేతువాదము నాధారముచేసికొని, ధర్మములను బ్రతిపాదించెడి శ్రుతి స్మృతులనురెంటిని నిందించువాడు నాస్తికుఁడును, వేదనిందకుఁడును, నందుచే సత్పురు షులవలన బహిష్కరింపఁబడఁదగినవాఁడును ననియర్థము. కావున దీనినిబట్టిచూడఁగా మన నవనాగరకులు పొరపడుచుండురీతిని ధర్మాధర్మములు ప్రకృతిశాస్త్రజ్ఞానము ననుస రించిగాని, వికృతిశాస్త్రజ్ఞానము ననుసరించిగాని నిర్మింపఁబడినవి కావని మఱింత బుజు వగుచుండుటలేదా?

అంతియగాక, లోఁగడ నీప్రకరణముననే "యుక్తివాదము నమ్మఁదగినదగునా, కాదా?" యను శీర్షికక్రిందఁ దెలిపియున్నరీతిగ, యుక్తివాదమువలెనే హేతువాదము

కూడ వాదించువారి తెలివితేటలనుబట్టి క్రిందు మీఁదగుచు మీఁదు క్రిందగుచు
నుండును. అందుచే మొదట పరిగ్రహించినధర్మమును గొంత కాలమునకు విడువవలసి
వచ్చుటయుఁ, నటుపై మఱికొంత కాలమునకు దానినే తిరిగి కన్నుల కద్దికొనవలసివచ్చు
టయుఁ దటస్థించును. అందుచే ధర్మమేదియో, యధర్మమేదియో యెఱుఁగ వీలులేక
తిప్పలు పడవలసివచ్చును. కావుననే యట్టిహేతువాదమును మనువు వైరీతిని గర్హించి
యున్నాఁడు. కావున మనవైదికమతధర్మములు ప్రకృతిశాస్త్రహేతువుల ననుసరించి
మనఋషులచే నిర్మింపఁబడియున్న వనుకొనుట నిరాధారమగు వట్టి భ్రాంతియేగాని
వేఱుగాదు.

"ఐనచో ధర్మముల నాచరించుటచేతను, నధర్మములను మానుటచేతను బ్రకృతి
శాస్త్రసంబంధమగు ప్రయోజనమేమియు నుండనేయుండదా?" యని సంశయము గలుఁగ
వచ్చును. అట్టిప్రయోజన ముండనేయుండదని మనము చెప్పఁదగదు. ఏమనిన, నల్పజ్ఞు
లగు మనుష్యులే తాముచేయుకార్యములనుఁ బ్రకృతిశాస్త్రఫలముల నుద్దేశించి చేయు
చుండఁగా, సర్వజ్ఞుఁడగు పరమేశ్వరుఁడు తానేర్పఱచిన ధర్మములను నిష్ఫలములఁగ
నేర్పఱచునా? అట్లెన్నఁడును జరుగదు. కాని, యిఁక మనము తెలిసికొనవలసిన దేమనినఁ,
బరమేశ్వరుఁ డుద్దేశించినఫలములను నల్పమతులమగుమన మూహించి తెలిసికొన
సాధ్యముగాదు. ఇట్టిధర్మముచే నిట్టిఫలము గలుగుననియు నిట్టియధర్మముచే నిట్టిహాని
గలుగుననియుఁ భగవంతుని యాజ్ఞారూపములగు మనవేదశాస్త్రములందుఁ జెప్పఁబడి
యున్న సందర్భములందేతప్ప, యితరవిషయములం దట్టిఫలముల నూహించి తెలిసికొనుట
కెంత తెలివిగలవానికినిగూడ సాధ్యముగాఁజాలదు. ధర్మములకు వేదశాస్త్రములందుఁ
జెప్పఁబడని కొన్నివిశేషఫలములను, నట్లే యధర్మములకు హానివిశేషములను బ్రకృతి
శాస్త్రహేతువులచేఁ గనిపెట్టి యెవరైనను మనకుఁదెలిపినచోఁ దాత్కాలికముగ మన
మందులకుసంతసించి యూరకొనవలసినదేగాని, యట్టి ప్రకృతిశాస్త్రహేతువుల ననుస
రించియే యాధర్మాధర్మము లారీతిని నియమింపఁబడినవని మనమెన్నఁడును భ్రాంతిఁజెంద
రాదు. ఏలననిన, "యుక్తివాదముయొక్క బలాబలము లాయావ్యక్తులయొక్క తెలివి
తేటలనుబట్టి మారుచుండు"ననియుఁ, "దానిచే సత్యమునునిర్ణయింప నెక్కువ యవకాశ
ముండ"దనియుఁ లోఁగడ నీప్రకరణముననే, "యుక్తివాదము నమ్మఁదగినదగునా,
కాదా?" యను శీర్షికక్రింద మనము తెలిసికొనియున్నవిధముగనే, ప్రకృతిశాస్త్ర
హేతువాదముగూడ, వాదించువ్యక్తులయొక్క ప్రకృతిశాస్త్రజ్ఞానపరిమితిపైనను, వారి
బుద్ధిబలముపైనను నాధారపడియుండును. అందుచే నొకప్రకృతిశాస్త్రజ్ఞునకు యుక్త
ముగఁదోఁచినవిషయ మంతకంటె నెక్కువశాస్త్రజ్ఞానముగల మఱియొకనికి నయుక్త

ముగఁ దోఁపవచ్చును. మఱికొంతకాలమునకు వానికంటె నెక్కువప్రకృతిశాస్త్రజ్ఞాన
మును సంపాదించిన మూఁడవవాని కావిషయము తిరిగి యుక్తముగ నేతోఁపవచ్చును.
ఇట్లు ప్రకృతిశాస్త్రజ్ఞానమునకును బుద్ధిబలములకును మితిలేకపోవుటచే యుక్తాయుక్తము
లను (ధర్మాధర్మములయొక్క ఫలములను) నిర్ణయించుటలోఁ బ్రకృతిశాస్త్రజ్ఞానము
ప్రయోజనకారియని చెప్పుటకు వీలులేదు. ఎట్లనిన, సామాన్యముగఁ బ్రకృతిశాస్త్రజ్ఞులు
(Scientists) పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics,( రసాయనశాస్త్రము (Chemis-
try,) శారీరశాస్త్రము (Physiology,) వృక్షశాస్త్రము (Botany,) వైద్యశాస్త్రము
(Medicine,) మొదలగు శాస్త్రములలో నొక్కొక్క రొక్కొక్కదానియందుఁ
గొంతకొంతమాత్రమే యెఱిఁగినవారైయున్నారు ఒక్కశాస్త్రమునైన నామూలాగ్ర
ముగ నెఱిఁగినవారు మిక్కిలియరుదు; ఎక్కడనైనఁ గోటికొక్కరుండురేమో యని
యును సంశయమే! ఇఁకఁ దక్కినవారిలో నొకశాస్త్రమును గొంతయెఱిఁగినవారు
కొందఱు; రెండుశాస్త్రములలోఁ గొంతకొంత తెలిసినవారు కొందఱు; మూఁడుశాస్త్రము
లందుఁ గొంచెముకొంచెము పాండిత్యముగలవారు మఱికొందఱు; నాల్గుశాస్త్రములందు
వ్రేలుపెట్టినవారిఁకఁ గొందఱు; ఐదుశాస్త్రముల నించుకచవిచూచినవారు వేఱొకకొం
దఱు; ఇట్లే వేఱువేఱుశాస్త్రములందు వేఱువేఱుపరిమితులతోఁ గూడినజ్ఞానభేదముల
గలవారుగనున్నారు. ఇఁక నట్టిప్రకృతిశాస్త్రములన్నన్నో, యసంఖ్యాకములుగనున్నవి.
కావున లోకమందలి యన్నిశాస్త్రములలోను బ్రతిదానియందును సంపూర్ణపాండిత్యము
గలమానవుఁ డొక్కఁడెవ్వఁడును నెచటనునుండఁడని ఱాయిగ్రుద్ది చెప్పవచ్చునుగదా!
పరిమితసంఖ్యగల రేమూఁడునాల్గుశాస్త్రములనోతప్ప యంతకంటె నెక్కువయెఱుఁగ
నట్టియు, నెఱిఁగినవానిలోఁగూడ నొకదానియందైనఁ బరిపూర్ణమగు పాండిత్యములేన
ట్టియు, మన నవనాగరకసోదరులయొక్క ప్రకృతిశాస్త్రజ్ఞానము నసంఖ్యాకములగు
శాస్త్రములలోని యపారజ్ఞానములతోఁ బోల్చిచూచినచో, దీనికిని వానికిని నెంతభేద
ముండునో యూహింపసాధ్యమగునా? అంతయేల; ఒక్కశాస్త్రమునైన వీ రామూలాగ్ర
ముగ నెఱుఁగఁజాలనపు డాయొక్కశాస్త్రముననే వీరెఱుఁగనిరహస్యము లెన్నివే లుండ
వచ్చును? ఇఁక లోకమున వీరు పేరైనను వినియెఱుఁగని శాస్త్రములనన్నిఁటిని జేర్చి
యాలోచించితిమేని, వీరికిఁ దెలియని రహస్యములను, వీరికర్థముగాని సిద్ధాంతములను,
వీరికిబోధపడని హేతువులును, వీరికిఁదలకెక్కని సత్యములును వానియం దెన్నికో
ట్లుండవచ్చునో చెప్పశక్యమగునా? అట్టి వీరిప్రకృతిశాస్త్రజ్ఞానదృష్టి కందని హేతువు
లిక లోకమున నేశాస్త్రమునందును నుండనేకూడదా? వీరికిఁ దెలియనంతమాత్రమున
నది లేనేలేవని యెట్లుచెప్పవచ్చును? అందుచేతనే వీరిలోని సుప్రసిద్ధులగు ప్రకృతిశాస్త్ర

వేత్త (Scientists) లందుఁగూడ కొంత అసత్యములనియుఁ నపసిద్ధాంతములనియుఁ దలఁచినవిషయములను మఱికొందఱు సత్యములుగను, సుసిద్ధాంతములుగను భావించుచున్నారు. ఈవిషయ మీక్రిందియుదాహరణముచే బోధపడఁగలదు.

ప్రస్తుతము మనదేశమందలి ప్రకృతిశాస్త్రవేత్తల (Scientists) లో సుప్రసిద్ధులగు డాక్టర్, సర్. C. V. రామన్‌గారిటీవల మన వైదికమతసిద్ధాంతములను గుఱించి వెలువఱచిన యభిప్రాయములపై 3-4-1934 తేదీ "ధర్మరాజ్య" పత్రిక యీక్రిందివిధముగ వ్యాఖ్యానము గావించుచున్నది:—

... ... ... ... ... ... ...

"We are even more surprised at Dr. Sir C. V. Raman's openions which were recently expressed at the Ramakrishna Jayanthi celebration at Bangalore on 19th. February 1934. Let us see what this prophet says, "There is no Heaven, no Swarga, no Hell, no rebirth, no reincarnation and no immortality. The only thing that is true is that a man is born, he lives and he dies."....................

... ... ... ... ... ... ...

How is Sir Raman sure that there is no God or soul or future birth or haven or hell? Probably bacause the telescope or the microscope cannot show the same, or because the latest theories of physics have not penetrated beyond the electrons on the protons? "There are more things in Heaven and Earth than are dreamt of in Raman's philosophy !"

... ... ... ... ... ... ...

Sir C. V. Raman then proceeded to say that he gave expression to his religious faith "as a true man of science." We wood rather say that he gave expression to his religious unfaith as a professor of arrogant science. Nowadays western science strikes a more humble note, a more humanitarian note. But Sir Raman's science is evidently of a different make.

Sir C. V. Raman did not stop there. He was sure that "This belief in the existance of the next world was the greatest force against the true religious life." What is this true religious life as

he understands it? It means no God, no heaven or hell, no soul, no immortality, no reincarnation ! A wonderful religious life indeed !

... ... ... ... ... ... ...

*Sir. C. V. Raman* then said that "*the great mark of modernism was to have little or no religion at all.*" *But Sir S. Radhakrishnan* teaches as the *Reign of Religion in Contemporary Philosophy.* Let the two knights have a tournament as between themselves. How is Sir C. V. Raman better than our contemptible little army of self-respectors?

—"Dharmarajya," Vol. 1, No. 7, p.p. 5.

దీని యర్థ మేమనఁగా:—"బెంగళూరులో 1934 సం॥ ఫిబ్రవరి 19-వ తేదీన రామకృష్ణజయంతి జరుగుసందర్భమున డాక్టర్, సర్ C. V. రామన్‌గారు వెలువఱిచిన యభిప్రాయములను జూడఁజాలినందులకు మేము మఱింతయాశ్చర్యపడుచున్నాము. ఈభవిష్యద్‌జ్ఞుఁ డేమిచెప్పనో చూతము; "స్వర్గములేదు; నరకములేదు; పునర్జన్మము లేదు; మరణరాహిత్యమునులేదు. నిజముగనున్న దేమనఁగా, మనుష్యుఁడు పుట్టును, పెరుగును, జచ్చును."...............

... ... ... ... ... ... ...

దేవుఁడుగాని, యాత్మగాని, పునర్జన్మముగాని, స్వర్గముగాని, నరకముగాని, లేవని సర్: రామన్‌గారికి రూఢిగ నెట్లు తెలియును? దూరదర్శనియంత్రము (టెల్లీస్కోప్) గాని, సూక్ష్మదర్శనీయంత్రము (మైక్రాస్కోప్) గాని వానినిఁ జూపఁజాలనందుననా, కాక, యిప్పటివఱకును జరిగిన 'పదార్థవిజ్ఞానశాస్త్ర' పరిశోధనసిద్ధాంతము లంతదూరము వఱ కింకను వ్యాపించియుండనందుననా? రామన్‌గారి వేదాంతమునం దూహింపఁబడు విషయములకంటె నెక్కువవిషయములే, స్వర్గలోకమునను భూలోకమునను గూడ గలవు.

... ... ... ... ... ... ...

అటుపై సర్ : C. V. రామన్‌గారు, "తమసత్యమగు ప్రకృతిశాస్త్రజ్ఞానము" ననుసరించి తమ మతవిశ్వాసమును వెల్లడించితిమని చెప్పిరి. వారు గర్వింపఁదగిన ప్రకృతిశాస్త్రవిద్వాంసులగుటచే వారికిఁగల మతమందలి యవిశ్వాసమును వెల్లడించిరని మా తలంపు. ప్రస్తుతకాలమునఁ బాశ్చాత్యప్రకృతిశాస్త్ర మింకకంటె నెక్కువ సద్విషయములను గనిపెట్టుచున్నది. కాని సర్ : రామన్‌గారి ప్రకృతిశాస్త్రము వేఱుమాదిరిదనుట స్పష్టము.

సర్ : C. V. రామన్‌గారంతటితో నిలువలేదు. "ఇతరలోకము లున్నవని నమ్ముట సత్యమగు మతజీవనమునకుఁ బరమవిరుద్ధ" మని వారిదృఢవిశ్వాసము. వారి దృష్టిలోని "సత్యమగు మతజీవన" మనఁగానెట్టిది? దానియుద్దేశ్యము ననుసరించి దేవుఁడులేఁడు; స్వర్గముగాని నరకముగానిలేవు; ఆత్మలేదు; మరణరాహిత్యములేదు; పునర్జన్మమునులేదు! నిజముగ విచిత్రమగు మతజీవనమే!

... ... ... ... ... ... ...

అటుపై సర్ : C. V. రామన్‌గారు, "మతమును మిక్కిలి కొలదిగఁగల్గియుండుటగాని, కాక మతమే లేకయుండుటగాని, నవనాగరకతకు గొప్పలక్షణ"మని చెప్పియున్నారు. కాని సర్ : S. రాధాకృష్ణన్‌గారు (వీరు మఱియొక సుప్రసిద్ధ ప్రకృతిశాస్త్రవేత్తలు) "వేదాంతశాస్త్రమున మతముయొక్క పరిపాలనము (ప్రభుత్వము) గల"దని బోధించుచున్నారు. ఈమేటిశాస్త్రజ్ఞు లిరువురును వారిలోవారు పంచె మాడికొనెదరుగాక! నింద్యమగు మన స్వాభిమానదూషితుల సంఘముకంటె సర్: C. V. రామన్‌గా రేవిధముగ నయము?"

"ధర్మరాజ్య," సంపు. 1, సంచి. 7, పుట 5.

ఇట్లే, ప్రకృతి శాస్త్రాభివృద్ధి (Scientific Advancement)లోఁ ముందంగ వేయుచున్న 'సోవియట్-రష్యా' దేశము (Soviet Russia) మతవిషయమునను దేవునివిషయమునను నెట్టి దురభిప్రాయములు గల్గియున్నదియు, నెట్టి దుష్ప్రియత్నములు చేయుచున్నదియు, లోగడ నీప్రకరణమున నే, "ధర్మములను నధర్మములను గుర్తెఱుఁగుట కాధార మంతరాత్మ (Conscience) కాదా?" యను శీర్షికక్రిందఁ జదివియుంటిమిగదా! ఇఁక నట్టిపాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞులే కొందఱు కొన్ని క్రొత్త పరిశోధనలసహాయమునఁ మన వైదికమతశాస్త్రాచారములం దమూల్యములును బ్రయోజనకరములును నగు గొప్పప్రకృతి శాస్త్రరహస్యము లిమిడియున్నవని కనుఁగొని వానిని బ్రదర్శించి యుండిరి. ఆవిషయములను మనదేశమందలి ప్రస్తుతకాలపు సుప్రసిద్ధ ప్రకృతిశాస్త్రజ్ఞులలో నగ్రగణ్యులని చెప్పఁదగిన శ్రీజగద్గురు శ్రీపూరీ శంకరాచార్య స్వాములవారు (అనఁగా, శ్రీజగన్నాథక్షేత్రమందలి గోవర్ధనపీఠాధిపతులగు శ్రీభారతీకృష్ణతీర్థస్వామివారు) తామిపుడు దేశమందంతటను జేయుచున్న ప్రచారమునఁ బెక్కుతావులం దుపన్యసించుచున్నారు. వారు 1933 సం॥ రమున మద్రాసు (చెన్నపట్టణము) నకు వచ్చియున్నపుడు వారియుపన్యాసములను వినుభాగ్యము మాకు లభించినందున, నావిషయముల నిచట మాయోపిసరీతిని మాపాఠకులకు వినిపించెదము. అందులకుముం

దుగ, నీవిషయమున శ్రీస్వాములవారియొక్క కొన్నివాక్యములను, వారిటీవల మద్రాసులోఁ బ్రకటించుచున్న "ధర్మరాజ్య" పత్రికనుండియెత్తి యీక్రింద వినిపింపఁదలఁచియున్నాము:—

Benedictory Foreward
by
His Holiness Sri Jagadguru Shankaracharya
of Puri.
THE GOAL AND THE PATH.

... ... ... ... ... ... ...

"We have no quarral with '*Science*' or with Democracy. On the other hand, we verily belive Sanathana Dharma teaches us the highest Truths of '*Science*' and is in full accord with True Democracy ;....................

... ... ... ... ... ... ...

"........The latest developements of '*Modern Science*' are throwing wonderful new light on and proving the ancient truths taught by our scriptures..............."

"Dharmarajya," Vol. I, No. 1, p.p. 2.

దీని యర్థము:—

ఆశీర్వాదకపూర్వకమగు సుపోద్ఘాతము.
శ్రీజగద్గురు శ్రీపూరీశంకరాచార్యస్వామివారు.
గమ్యస్థానము; మార్గము.

... ... ... ... ... ... ...

"ప్రకృతిశాస్త్రముతోఁగాని, ప్రజాప్రభుత్వముతోఁగాని, మాకు వివాదము లేదు. అంతులకుమారుగ, సనాతనధర్మము (అనఁగా మన వైదికమతధర్మములు) ప్రకృతిశాస్త్రసంబంధములగు పరమసత్యములను మాకు బోధించుననియు, నిజమగు ప్రజాప్రభుత్వమున కన్నివిధముల ననుగుణ్యామేయనియుం మేము నిశ్చయముగా నమ్మెదము ;......

... ... ... ... ... ... ...

"...........ప్రస్తుతకాలపు ప్రకృతిశాస్త్రాభివృద్ధి రానురాను మాశాస్త్రగ్రంథములు బోధించిన సత్యములను బ్రకాశింపఁజేసి వానిని ఋజువుచేయుచున్నది............."

"ధర్మరాజ్య," సంపు. ౧. సంచి. ౧. పుట ౨.

## THE SECRET OF INDIA'S GREATNEESS

By His Holiness Jagadguru Shri Shankaracharya Swami Shri Bharathi Krishna Theerthaji Maharaj of Shri Govardhana Peetha, Puri.

[Being the substance of a Lecture delivered by His Holiness on 14 th February 1933 at the Vasantha Mandapa Hall of Shri Skandaswami Temple, Park Town, Madras.]

... ... ... ... ... ... ...

## RELIGION, PHILOSOPHY AND SCIENCE.

"If we now take up our study of Religion from this stand point of the internal Harmony that must naturally and necessarily subsist between the results of our various investigations on different lines and in different directions, we are astonished and gratified to find that, from this point of view too, our Sanatana Dharma is the only one that can stand this test and come through absolutely unscathed!

... ... ... ... ... ... ...

And, on the other side, the discoveries recently made by eminent scientists in different branches of the "*Positive*" *sciences* are throwing new light on and confirming and proving the ancient Truths of the Sanatana Vaidika Dharma, from a most unexpected, nay, undreamt of direction!"

—"Dharmarajya" Vol. 1, No. 4, PP. 8.

... ... ... ... ... ... ...

"But our Sanatana Vaidika Dharma includes, within its all comprehending jurisdiction, all departments of knowledge (including all branches of what, in modern terminology, we speak of as the *Positive Sciences*.!) It is therefore in the fitness of things that our Sanatana Dharma, which has not merely existed from the time of Creation but has to and does cater for all kinds of Adhikaris (as we have already shown,) has therefore naturally made all the necessary provision for all the different activities of life by going into detailed disquisitions on all the varied requirements thereof and setting forth on all embracing and thoroughgoing system of injunctions and prohibitions, correct and faithful adhesion whereto is not only intensely and extremely useful but also positively and absolutely necessary for the attainment by us of all-round Health, Strength, Peace, Happiness and Joy (of Body, Mind and spirit !)

## SANATANA DHARMA AND THE POSITIVE SCIENCES.

Undoubtedly it is this very fact that is responsible for the intensely wonderful and immensely gratifying confirmation which the precepts of our Sanatana Dharma have been systamatically receiving of late—on the intrinsic merits—from *Modern science in all its multifarious branches* (as we shall have occasion to show—with enormous wealth of detail—in the course of our further discourses in general, and of the special discourse, a few days hence on Sanatana Dharma and Science in particular.) It is clear therefore, that the Sanatani Vaidika system was based not merely in its general plan and outlook, but also in every one of its details, on a thorough-going and *thoroughly scientific* basis of the most unexceptionable and far-reaching character, which took into account, all the various phases and aspects of life, (physical, material, mental, intellectual, moral, political, industrial, economic, psychic, spiritual and so forth!)

## THEIR HISTORIC RELATIONSHIP.

And, on the Historical side too, this fact is splendidly confirmed by the researches carried on by Professor Demorgan and other intellectual stalwarts in Mathematics, Medicine, Chemistry, Acoustics and other departments of "Positive" Science, whereby it has been established beyond all possibility of doubt, that all the various branches of Mathematics, Physics, Chemistry, Medical Science and other *Exact* Sciences (which we moderns pride ourselves on as our great speciality) really went out of India to Arabia, Egypt, Greece, Rome, and other parts of the Western world, and that, even now, there are huge lots of not merely advanced but even *elementry* material in these Sciences, as described in our Ancient scientific literature, even the *fringe* whereof the most advanced researches and discoveries of Modern Science have not yet reached, and are yet to negotiate."

—" Dharmarajya," Vol. 1 No. 13 pp. 8.

## SWARAS.

" Into details hereof, we need not and cannot enter here, because each one of the different sub-subjects of each such subject alone requires and deserves separate treatment by itself; and we shall in due course in the course of one or more special ids-

courses thereon, give them as much of such separate treatment as time may permit. Just now however, we shall just refer to the differentiations of '*Swaras*' or Vedic accents (*Udatta*, *Anudatta* and *Swarita*) on account of which the words in our Vedas are said to have not merely their '*Artha Shakti*' (the value or force coming from their *meaning*) but also their '*Shabda Shakti*' (the *Psychic* and *Spiritual* effect and force of their very sounds themselves and their accents!) ... ... ... ...

... ... ... ... ... ... ...

For a long time people of the ultra-rationalistic modern type of mind have been laughing at such things as futile flights of foolish fancy, idle imagination and so on! But the recent researches and discoveries of Madame Fenelon, Principal Wood and other great Scientists of the Western world in the department of Acoustics in Physical Science, have gone to prove indubitably that the Vedic *Mantras* (Hymns) have *Shabda Shakti* as well as *Artha Shakti*, that the *Swaras* in the Vedas have their own tremendous Psychic effect in enabling the Spiritual Aspirant to VISUALISE the particular form of the particular Diety that he ismeditating upon and that the Vedic Mantras are thus *literally* veritable powerhouses andstore-houses for the generation, development, concentration and storing up of enormous Psychic Energy calculated to carry us further and further onwards on our Path of Evolution towards our desired Goal of Oneness with God!"

... ... ... ... ... ... ...

"—Dharmarajya," Vol. 1, No. 14, pp. 7.

పైదానికిఁ దెనుఁగు:—

భారతవర్షముయొక్క ఘనతలో నిరహస్యము.

శ్రీగోవర్ధన పీఠాధిపతులగు శ్రీపూరీ శంకరాచార్య

శ్రీభారతీకృష్ణతీర్థస్వాములవారు.

[మద్రాసు 'పార్కు-టౌన్' లోని శ్రీస్కందస్వామివారి వసంతమంటపభవనమున 1933 సం॥ ఫిబ్రవరినెల 14-వ తేదీన శ్రీస్వాములవారిచ్చిన యుపన్యాసము యొక్క సారము.]

...  ...

## మతము, వేదాంతము, ప్రకృతిశాస్త్రములు.

"మనము వేఱువేఱుమార్గములందు వేఱువేఱురీతులుగఁ గావించు పలువిధములగు పరిశోధనలయొక్క ఫలితములయందు స్వాభావికముగ నుండితీరవలసిన సమన్వయమును దృష్టిలో నిడికొని మనము మతమును బరీక్షింపఁబూనితిమేని, నీవిషయమునందుఁగూడ నిట్టిపరీక్షకు నిరపాయముగ నిలువఁజాలినది మనసనాతనధర్మ (వైదికమత) మొక్కటి మాత్రమేయని కనుఁగొనుటకు మనమాశ్చర్యమును నానందమును బొందుదుము!......

ఇఁక నిటుప్రక్క, ప్రత్యక్షసిద్ధములగు ప్రకృతిశాస్త్రములయొక్క వివిధశాఖలందుఁ, బ్రసిద్ధులగు ప్రకృతిశాస్త్రజ్ఞులచే నిటీవలఁ గనుఁగొనఁబడినవిషయములు, మన మెన్నఁడును గలలోనైనఁ దలంచియుండనివిధమునవచ్చి, సనాతనవైదికధర్మము (అనఁగా మనవైదికమతము) యొక్క ప్రాచీనసత్యములపై గ్రొత్తతేజస్సును బఱపి, వానిని బుజువు చేసి, సుస్థిరములను గావించుచున్నవి!" —"ధర్మరాజ్య," సంపు. 1, సంచి. 4, పుట 8.

... ... ... ... ...

"కాని, మనమిాకాలమునఁ "బ్రత్యక్ష ప్రకృతిశాస్త్రము" లని వ్యవహరించు వానిలోని యన్ని యుపశాఖలతోడను గూడచేరిన విజ్ఞానశాఖలెల్లను, సర్వవిషయముల కును నునికిపట్టగు మనసనాతన వైదికధర్మమునందుఁ జేరియేయున్నవి! అందుచేతనే మన సనాతనధర్మము సృష్ట్యాదినుండియు నుండుటయేగాక, మేములోగడ నిదివఱకే చూపి యున్నరీతిగ, సర్వవిధములగు నధికారిభేదములకును దగునట్లు, సర్వవిధములగు జీవనములకును గావలసిన సర్వవిధములగు నేర్పాట్లవివరములను బరిశీలించి వానిని గావించియే తీరినది. వానికన్నిఁటికిని జేరి యుపయోగించునట్టి విధినిషేధములతోఁగూడిన యుక్తమగు పద్ధతిని నిర్మించియున్నది. అట్టి పద్ధతిననుసరించి విశ్వాసముతో సక్రమముగఁ బ్రవర్తించుట యత్యంతము నుపయోగకరమగుటయేగాక, మనమందఱమును, నాధ్యాత్మిక, శారీరక, మానసిక సంబంధములగు సర్వవిధములైన యారోగ్యము, బలము, కాంతి, సౌఖ్యము, సంతోషము, మున్నగువానిని బొందుటకు రూఢిగ నత్యంతావశ్యకమై యున్నది."

## సనాతనధర్మము; ప్రత్యక్షప్రకృతిశాస్త్రములు.

"ప్రస్తుతకాలపు ప్రకృతిశాస్త్రముయొక్క యనేకములగు శాఖలు బయలు వెడలి, మనసనాతన ధర్మవిధులయొక్క సుగుణముల నత్యంతాశ్చర్యకరముగను, నపరిమితాహ్లాదకరముగను ధ్రువపఱచుచుండుటకు నిస్సంశయముగ నీపైన దెల్పినవిషయమే కారణమైయున్నది. అవివరములనన్నిఁటిని మేమిటుపై గావింపఁబోవు నుపన్యాసము

లందు సామాన్యముగను, "సనాతనధర్మము; ప్రకృతిశాస్త్రము" లనుగుఱించి యిఁకమీఁదఁ గొన్ని దినములకుఁ గావింపఁబోవు *ప్రత్యేకోపన్యాసమునందు విశేషముగను వినిపింపఁబోవుచున్నాను. కావున, సనాతన వైదికమతపద్ధతి సామాన్యవిషయముల పైనమాత్రమే యాధారపడియుండలేదనియు, ప్రతివిషయమునను శుద్ధ ప్రకృతిశాస్త్రాధారములపైనను శుద్ధ సక్రమమార్గముపైనను నాధారపడియున్నదనియు, నట్టియాధారము లనన్యసామాన్యములును, నత్యున్నతాశయములు గలవిగను నున్నవనియు, నవి, జీవనవిధానమునకు సంబంధించిన (శారీరక, మానసిక, వైజ్ఞానిక, నైతిక, రాజకీయ, పారిశ్రామిక, ఆర్థిక, ఆధ్యాత్మికాది) సర్వవిషయములను బరిగణించియే యున్నవనియు స్పష్టమగుచున్నది.

### వానియొక్క చారిత్రవిషయికసంబంధము

చారిత్రవిషయమునఁగూడ, 'డెమర్గన్' పండితుఁడును, (Professor Demorgan,) మఱియును గణితశాస్త్ర, వైద్యశాస్త్ర, రసాయనశాస్త్ర, శబ్దశాస్త్రము (Acoustics,) లందును, ప్రత్యేక ప్రకృతిశాస్త్రముయొక్క యితరశాఖలందును, ప్రసిద్ధులగు నితరవిద్వాంసులును గావించిన పరిశోధనలు పైసంగతి సత్యమేయని యొప్పుకొనఁదగినదిగనున్నది. అందుచే, (మనము ప్రస్తుతకాలమున నేప్రకృతిశాస్త్రములయొక్క ఘనతకై గర్వించుచుంటిమో,) యట్టి ప్రకృతిశాస్త్రముయొక్క శాఖలగు గణితశాస్త్రమును, బదార్థవిజ్ఞానశాస్త్రమును, రసాయనశాస్త్రమును, వైద్యశాస్త్రమును, నదితరశాస్త్రము లన్నియునుగూడ సత్యముగ భరతవర్షమునుండియే యరేబియా, యీజిప్తు, గ్రీసు, రోము, మొదలగు పశ్చిమఖండమందలి యితరభాగము లన్నిఁటికిని వెళ్లియున్నవనియు, నాశాస్త్రములలో విశేషవిషయములేగాక, మనప్రాచీనకాలపు ప్రకృతిశాస్త్రములలో వర్ణింపఁబడిన సామాన్యవిషయములుగూడ నేఁటివఱకు [illegible]నవనియుఁ, బ్రస్తుతకాలపు ప్రకృతిశాస్త్ర పరిశోధనలలోని విశేషపరిశోధనలకుఁగూడ యివి యందరానివై యున్నవనియు, వానిలకై యింకను బరిశ్రమ చేయవలసియున్నదనియు, సర్వవిధముల నిష్పంకముగ నిర్ధారింపఁబడినది!" —"ధర్మరాజ్య," సంపు. ౧, సంచి. ౧౩, పుట ౮.

### స్థానములు.

వానియొక్కనిదానముల నిచట మనము చర్చింప నవసరములేదు: అట్లు చేయను [illegible] [illegible] సృష్టివిషయములందలి ప్రతివానిలోని [illegible]విషయములను

* ఈ ప్రత్యేకోపన్యాసములుగూడ [illegible] [illegible] [illegible] [illegible]

ప్రత్యేకముగ నొక్కొక్కటియే విడివిడిగఁ జర్చింపఁదగినవిగను జర్చింపవలసినవిగను నున్నవి; అందువిషయమై మేము ప్రత్యేకోపన్యాసములం దొక్కదానియందో, పెక్కిటియందో మాకుఁగల కాలవ్యవధిననుసరించి యెంతయవకాశముండిన నంతవిపులముగఁ జర్చించెదము. ఐనను వేదమునందలి స్వరభేదములను (ఉదాత్తము, అనుదాత్తము, స్వరితములను) గుఱించి యిపుడించుక ముచ్చటించెదము. వీనిననుసరించి మనవేదములందలి శబ్దములకు వానియొక్క యర్థశక్తి (యనఁగా వానియందలియర్థమును, భావమును, బట్టి గలిగెడిసామర్థ్యమును, మహిమయును) మాత్రమేగాక, శబ్దశక్తి (యనఁగా వానియందలి స్వరభేదములనుబట్టి కలిగెడి యాత్మశక్తియొక్కయు నాధ్యాత్మికశక్తియొక్కయుఁ బ్రభావము) సహితముకలదని తెలియవచ్చుచున్నది! ... ...

... ... ... ... ... ...

వీనినిగుఱించి, తీవ్రహేతువాదపరతంత్రబుద్ధిగల యిప్పటిజనులు చాలకాలము పఱకును, మూర్ఖాలోచనలనియును, మూఢవిశ్వాసములనియును, సోమరితలంపులనియును నీరీతిగ నింక నేమేమియోచెప్పి పరిహసించుచుండెడివారు! కాని, 'ఫెనెలాంగ్' దొరసానిగారి (Madame Fenelon) యొక్కయు,'ప్రిన్సిపాల్-వుడ్' (Principal wood) దొరగారియొక్కయు, నింకను బాశ్చాత్యఖండమునఁ బ్రకృతిశాస్త్రముయొక్క 'శబ్దశాస్త్ర' (Acoustics) శాఖయందలి యితరగొప్పశాస్త్రజ్ఞులయొక్కయు నిటీవలి పరిశోధనలును వానిఫలితములును, వేదమంత్రముల కర్థశక్తిమాత్రమేగాక శబ్దశక్తిసహితముకలదని నిస్సందేహముగ ఋజువుపఱచివైచినవి; మఱియును వేదములందలి స్వరములు, (ఆయావేదమంత్రములచే) ధ్యానముచేయఁబడు ప్రత్యేకదేవతయొక్క ప్రత్యేకస్వరూపమును ధ్యానముచేయువానికిఁ బ్రత్యక్షమగునట్లుచేయుటలో నద్భుతమగు నాత్మశక్తిగలిగియున్నవనికూడ ఋజువుపఱచినవి;* అందుచే వేదమంత్రములు, మనకు గమ్యస్థానమగు భగవంతునితోడి సాయుజ్యమును బొందుటకై మనమోక్షమార్గమున మనలను గొనిపోవఁజాలినయాత్మశక్తి నపరిమితముగఁ బుట్టించి, పెంపొందించి, ప్రోగుచేసి, సంరక్షింపఁజాలిన సత్యమగు యంత్రాగారములని యక్షరాల ఋజువుపఱచియున్నవి!"

... ... ... ... ... ...

"ధర్మరాజ్య" సంపు. ౧. సంచి. ౧౪. పుట. ౭.

శ్రీ స్వాములవారు పైయుపన్యాసమధ్యమునఁ బేర్కొనిన ప్రత్యేకోపన్యాసము, పైయుపన్యాసము జరిగినపిమ్మటఁ గొలదిదినములకే మద్రాసు (చెన్నపట్టణము)న పైలా

---

* ఈవిషయముయొక్క వివరములుకూడ యీవ్యాసమున నేయిఁకముందు తెలుపఁబడును.

పూరునందలి సంస్కృతకళాశాల (Mylapore Sanskrit College) యందు జరిగినది. ఆయుపన్యాసమున శ్రీస్వాములవారివలన మేమువినియుండిన యమూల్యవిషయముల నీక్రింద వినిపించుచున్నాము.

## వైదికమతధర్మములు ప్రకృతిశాస్త్రహేతువులకుఁ దీసిపోవునా?

[శ్రీపూరీ శంకరాచార్య శ్రీభారతీకృష్ణతీర్థస్వాములవారు మద్రాసు మైలాపూరు సంస్కృతకళాశాలలో క్రీ. శ. 1933 సం॥లో నొసఁగియున్న "సనాతనధర్మము; ప్రస్తుతకాలపు ప్రకృతిశాస్త్రములు." అను నుపన్యాససారాంశము.]

౧. వర్ణవిభాగము; మనుష్యరక్తమందలి భేదములు:—మనుష్యజాతియొక్క సృష్టి, మొట్టమొదటఁ బరమేశ్వరునిచే నాల్గుభేదములతో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులనుపేర వేఱువేఱుగఁ జేయఁబడినదనియు, నాజాతులలోనికొందఱు తమ స్వీయజాతికంటె భిన్నమగు నితరజాతులతోఁజేరి కనినసంతానములే మనదేశమందలి యనులోమ, విలోమ, సంకరజాతులైయున్నవనియు, మనప్రాచీనచరిత్రలగు వేదములును, ధర్మశాస్త్రములును, బురాణములును, నితిహాసములును మొదలగుగ్రంథములందుఁ బెక్కుప్రమాణములు గన్పట్టుచున్నవి. (వీనిని సందర్భానుసారముగ మనమీ గ్రంథముయొక్క యాఱవప్రకరణమున, "సృష్టి యెట్లుజరిగె?" అను సందర్భమునఁ దెలిసికొనఁబోవుచున్నాము.) అట్టిప్రమాణములకు విరుద్ధముగ, "మనుష్యజాతియంతయుఁ దొలుత నొక్కటియే," యనియు, "స్వార్థపరులగు కొందఱు తమతెలివితేటల నుపయోగించి యితరులను దమకు సేవకులనుగఁజేసికొనుటకై యిట్టివర్ణవిభాగము నొకదాని నన్యాయముగఁదెచ్చిపెట్టి, తాము బ్రాహ్మణులమనియు, నందఱికంటె నగ్రజాతులమనియు, నందుచే నితరులందఱును దమరినిబూజించి తమరికిసేవకులై తాముచెప్పినట్లు చేయవలయుననియు, నట్లుచేయనివారికిఁ బాపమును నరకమును సంభవించుననియు, గ్రంథములనువ్రాసి యమాయకులగు నితరులను వంచించియుండి"రనియు మన నవనాగరకులు పెక్కుమంది వాదించుచుండుటను మనలోఁగొందఱు సామాన్యముగ వినియేయుండవచ్చును.

[వర్ణవిభాగమునుగుఱించియు, నట్టివేయగు మతవిషయములనుగుఱించియుఁ బైవిధమగుయూహలఁగల నవనాగరకాగ్రగణ్యులలోఁ బ్రథములనిచెప్పఁదగిన కొవ్వూరువాస్తవ్యులగు శ్రీవల్లూరి సూర్యనారాయణరావు B. A., B. L., L. T., గారు 1932 సం॥ అక్టోబరు 24-వ తేదీ "త్రిలిఙ్గ"పత్రిక (13-వ సంపుటము, 43-వ సంచిక) యందుఁ బ్రకటించియున్న "మతములు; ప్రకృతిశాస్త్రములు" అనువ్యాసమును మనము చదివినచో నిప్పటి పాశ్చాత్యప్రకృతిశాస్త్రజ్ఞులలోఁ గొందఱును, మననవనాగరకులు గొందఱును మన మతగ్రంథములందలి "వర్ణవిభాగము," "మనుష్యసృష్టి," మొదలగు

విషయములకు బరమవిరుద్ధముగ నెట్టివిపరీతపుటూహలు గల్గియున్నవియు విశదముకాఁ గలదు. కావున వారివ్యాసమందలి యంశములను (extracts) గొన్నింటి నిచటఁ బొందుపఱచుచున్నాను:—

"మతములు:—ప్రకృతిశాస్త్రములు"

శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారు, బి. ఏ., బి. ఎల్, ఎల్. టి.

"ఈరెంటికిని సమన్వయ మెన్నఁటికినికుదురదు. 'సర్: ఆలివరులాడ్జి' మొదలగు భౌతికశాస్త్రజ్ఞులుకొందఱు ఆస్తికులుగనుండినను, ముక్కు-చెవులుగల దేవుఁడొకఁడున్నాఁడనిగాని, ఆయన సర్వశక్తికలవాఁడనిగాని నమ్మరు. వీరు 'హెక్కెల్' వంటి జడాద్వైతులు కాకపోయినను, వివిధమతములలో ప్రతిపాదింపఁబడిన అభూతకల్పనలను, అమానుషక్రియలను నిరసింతురు. ఇవియన్నియు ప్రకృతిపరిశోధనలకు వ్యతిరేకములు. అసంభవములు. 'ఆలివరులాడ్జి'గారు, తనయాధ్యాత్మికదృష్టితో భగవంతుఁడు, ఆత్మలు, వేఱుగానుండవచ్చునని విశ్వసించుచు, 'హెక్కెలు'గారి జడాద్వైతమును ఖండించుటకు ప్రయత్నించగా యాయనవిమర్శనలను 1906-వ సంవత్సరములో 'సైకికల్ - రిసెర్చి-సొసైటీ'లో ఆయనతోపాటు మెంబరుగనున్న 'సర్: కె. లంకాస్టరు' అను గొప్ప భౌతికశాస్త్రజ్ఞుఁడు తీవ్రముగ ఖండించియున్నాఁడు. ఇట్టి భేదాభిప్రాయములు కొద్ది అపురూపవిషయములలో భౌతికశాస్త్రజ్ఞులలోనున్నను, వీరందఱు యిప్పటి మతవిశ్వాసములను యేకగ్రీవముగ త్రోసివేసిరి. వీనిని భౌతికశాస్త్రపరిశోధనలతో సమన్వయము చేయుట వదలుకొనిరి............(కొందఱు) పైనచెప్పిన భౌతికశాస్త్రజ్ఞులు చేయఁజాలనిపనిని తాము చేయుదమని సమన్వయమునకు పూనుకొందురు. ఇట్టివారిని ఆంగ్లేయ భాషలో "Apologetics" అని పిలచెదరు. వీరిని *ఒక్క ప్రశ్న వేయవచ్చును. పూర్వము మనపురాణములలో వ్రాసిన అమానుషక్రియలు నేడేల జరుగుచుండుటలేదు? వానిలో వ్రాసిన యేఒక్క విషయము పొరబాటని వీరు ఒప్పుకొన్నను, మన ప్రస్తుతానుభవమునకు విరుద్ధముగానున్నవన్నియు అబద్ధములేయనియు, పురాణములు మొదలగు మతగ్రంథములు, మానవకల్పితములనియు మనము నమ్మకతప్పదు. నేను వానిలో సృష్ట్యు

---

*ఈయొక్క ప్రశ్నయేగాక యిట్టివేయగు నాల్గుప్రశ్నలతో వీరు 1932-వ సంవత్సరము సెప్టెంబరు 19-వ తేదీ త్రిలింగపత్త్రిక (౧3-వ సంపుటము ౩౮-వ సంచిక) యందు "మతవిమర్శనవిధాన"మను శీర్షిక క్రిందఁ బూర్వాచారపరాయణులను 'సవాలు' చేసియుండఁగా, వారిసవాలునకు సమాధానములను సదరుపత్త్రికయొక్క 1933-వ సం॥ జనవరి నెల 2-వ తేదీ ౧౪-వ సంపుటము ౧౦-వ సంచికయొక్క అనుబంధములోని 5, 6,

త్పత్తిపరిణామములను (సృష్ట్యుత్పత్తిపరిణామములని భావముకాఁబోలును!) ఒక ముఖ్య విషయమునుతీసికొని, అది భౌతికశాస్త్రపరిశోధనలకు వ్యతిరేకమని ఋజువుచేయుచున్నాను. భౌతికశాస్త్రజ్ఞులలో కొద్దిభేదాభిప్రాయము లున్నవనియు వీరిభౌతికవిషయజ్ఞానము యింకను పరిపూర్ణతవహించలేదనియు, కాబట్టి పురాణములలోచెప్పినది పూర్వఋషుల ప్రత్యక్షప్రమాణముమీఁదనే వ్రాయఁబడినదను నమ్మకమును కలుగఁజేయఁటకు చాలరు.

భౌతికశాస్త్రములన్నియు మనము ఒక్కొకరుచదువుకొని వానిలో పండితులము కాకపోయినను వానిలోనివిషయములను పరిశోధనలను నేటివఱకు క్రోడీకరించి సులభశైలిని ప్రజాసామాన్యమునకు బోధపడునట్లు ఆంగ్లేయభాషలో వ్రాయఁబడుచున్నవి. వానిని ఆంధ్రములోని కనువదించినయెడల మనపురాణములలోని పుక్కిటిగాథలు, మూఢవిశ్వాసములు, అభూతకల్పనలు, అసత్యములని జనసామాన్యమునకు బోధపడి వానినిత్యజించి, ఆగ్రంథములలోఁజెప్పఁబడిన చరిత్రవిషయములు, నీతిధర్మములు మాత్రమే గైకొనెదరు...................డార్విన్, వాలెసు, స్పెన్సర్, హక్లీ, హెకెల్, మొదలగు భౌతికశాస్త్రజ్ఞులందరు సృష్టిపరిణామమును యించుమించుగా అందరు యేకగ్రీవముగ నొప్పుకొనిరి...................

మానవుడు, ప్రకృతిలో వేరుగా భగవంతునిచేత సృజించఁబడినవాఁడు కాఁడనియు, అతను ప్రకృతిపరిణామములో క్రిందిజంతువులనుండి దానిక్రమవికాసముచేత యుద్భవించినాఁడనియు, భౌతికశాస్త్రపఠనమువలన తేలుచున్నది. ఇది నిశ్చయమని

పుటలలో మేము ప్రకటించియుంటిమి. అందలిసమాధానములను సహేతుకముగ ఖండింపఁజాలకయుండు, గాని తమవాదమును వదలుకొనుట కిష్టములేకయుండు, వారుతిరిగి యాపత్రికయొక్క 1933-వ సం॥ జనవరినెల 16-వ తేదీ ౧౮-వ సంపు. 3-వ సంచికయందు "పురాణవిమర్శన"మను శీర్షికక్రింద నిస్సారమగు నొకచప్పిడి ప్రత్యుత్తరమును బ్రకటించియుంఁడిరి. అందలివిషయములను మేముతిరిగి 1933-వ సం॥ మేనెల 15, 22, 29 తేదీలలో వెలువడిన యాపత్రికయొక్క ౧౮-వ సంపుటములోని ౨౦, ౨౧, ౨౨ సంచికలయందు వరుసఁగా, "మతవిమర్శన పురాణవిమర్శనము" లనుశీర్షికతో విపులముగవిమర్శించి, వారివాదమందలి నిస్సారతను సువ్యక్తముగ బహిరంగపఱచియేయుంటిమి. కావున, వారియావ్యాసమును మేముతిరిగి యిచట విమర్శింపఁబూను టనవసరము. అందుల కీగ్రంథమున నవకాశమునుజాలదు. సత్యమెఱుఁగఁగోరుపాఠకు లాపత్రికసంచికలందలి మాయిరువురివ్యాసములనుజదివి తెలిసికొనఁబ్రార్థితులు. మాకడపటివిమర్శనమునకు, వారిప్పటికినిగూడ జవాబొసంగియేయుండలేదు.

అంగీకరించఁగానే, మతగ్రంథములన్నియు మూలపడవలసినదే. మనవారు బహుపవిత్రము లనియు, సత్యములనియు, మోక్షదాయకములనియు నమ్మి చదువుకొనుచున్న పురాణాదులలోని విషయము లనేకములు అభూతకల్పనలని త్రోసివేసితీరెదరు. ఈ కారణము చేతనే నేను సృష్టియుత్పత్తి పరిణామమునుగురించి మన పురాణములలో వ్రాసినదానిని, ఆధునిక భౌతికశాస్త్రపరిశోధనలతోపోల్చి చూపుచున్నాను... ..

'డార్విన్'గారి "మానవోత్పత్తి" యనుగ్రంథములోని ముఖ్యవిషయములన్నియు అనేక నూతనభౌతికశాస్త్రశాఖలలోని పరిశోధనలవలన బలపడుచున్నవి. ప్రాచీనయుగములలో జీవించి మృతిజెందిన జంతువులయెముకల పరిశోధనశాస్త్రము, భూగర్భశాస్త్రము, జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము, వివిధజంతువుల యస్థిపంజరములను పోల్చుశాస్త్రము, శారీరశాస్త్రము, రోగలక్షణశాస్త్రము, పిండోత్పత్తివృద్ధులను గుఱించిన శాస్త్రము మొదలగు వానిని కొద్దిగానైనను చదువుకొన్నయెడల మనుష్యజన్మయెట్లు కలుగుచున్నదీ స్పష్టముగ తెలియనగును. వీనిని నేను చదువుచునే యిట్లు విమర్శనలోనికి దిగితిని. కాబట్టి బూకరింపుల కిక్కడతావులేదు. గుడ్డినమ్మకమున కంతకంటె లేదు."

—"త్రిలిఙ్గ"పత్రిక, సంపు. ౧౩, సంచిక ౪౩.

లోగడఁ గనఁబఱచియున్నరీతిగ మన స్వదేశీయులలోని ప్రకృతిశాస్త్రవేత్తలగు సర్: C. V. రామన్‌గారివలెనే, విదేశీయులగు ప్రకృతిశాస్త్రవేత్తలుగూడ, మన మతవిషయములం దెట్టివిపరీతపుటూహలు కలిగియున్నదియుఁ బైవ్యాసముచే విశదమగుచున్నది.]

కాని, పైన దెలిపిన ప్రకృతిశాస్త్రవేత్తలవంటివారే (Scientists) మఱికొందఱు విదేశీయప్రకృతిశాస్త్రవేత్తలు, మనుష్యరక్తము సృష్టిలోనే స్వాభావికముగ నాల్గు విధములగు భేదములను గల్గియున్నదనియుఁ, నట్టి వేఱువేఱుతరగతుల రక్తముగలజాతుల వా రెవరిజాతిలో వారే వివాహసంబంధమును జేసికొనక యితరజాతితోడ సంబంధమును గల్గించుకొన్నచో భిన్నరక్తముల సమ్మేళనమున హానికరములగు సంకరజాతులు పుట్టుననియుఁ, నందుచే నట్టి వర్ణసంకరవివాహముల కెడమీయక కుల, మత, సాంఘికములగు కట్టుబాట్లతో నలరారుచున్న మన వైదికమతసంఘమందలి వివాహనియమము మిక్కిలి శ్రేయోదాయకమనియుఁ, దమ ప్రకృతిశాస్త్రపరిశోధనసాధనముల (Scientific Apparatus and Researches) చేఁ గనిపెట్టియున్నవిధానమును, శ్రీస్వాములవారు పైన దెలిపియున్న మైలాపూరు సంస్కృతకళాశాలయందలి యుపన్యాసమున విపులముగ విస్తరించి వర్ణించియున్నారు. అవిషయములనే శ్రీవారు తమయధ్యక్షతక్రింద 1932 సం॥ నవంబరు 16-వ తేదీన శ్రీకాశీపట్టణమున జరిగిన "సంయుక్తప్రాంతీయ వర్ణాశ్రమస్వరాజ్యసంఘ మహాధివేశనము"నందుఁ దమ యధ్యక్షోపన్యాసమధ్యమున

వర్ణించియుండఁగా నందలి సారాంశమును సంగ్రహించి, "ఆయుర్వేదమార్తాండ, భిషగా చార్య, పండిత H. సుబ్బరాయశాస్త్రిగారు, (కవిరత్న, F. R. H. S.)" త్రిలిఙ్గ పత్రికయొక్క 1932 సం॥ డిసెంబరు 19-వ తేదీ ౧౩ సంపు ౫౧-వ సంచికయం దీక్రిందిరీతిని బ్రకటించియున్నారు:—

సంయుక్తప్రాంతీయ వర్ణాశ్రమస్వరాజ్యసంఘ
మహాధినివేశనము, శ్రీ కాశీ.

... ... ... ... ... ...

శ్రీ శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు గోవర్ధనపీఠ
శంకరాచార్యులు, శ్రీ భారతీకృష్ణతీర్థ స్వాములవారి మహాధినివేశన
అధ్యక్షోపన్యాసముయొక్క సారాంశము.

నేడు మనదేశములో కఠినసమస్య ఉత్పన్నమైనది. అనివార్యప్రభావకారణములచే పరిస్థితులు విషమించినవి. రెండుపక్షములు మాయెదుటనున్నవి. ఈపక్షములవారు వారివారిఆక్షేపణసమాధానములు మాయెదుట పెట్టినప్పుడు ప్రవాహము యేవైపునడుచుచున్నదో ఆవైపుతీర్పుచెప్పుట మాధర్మముకానేరదు. పాశ్చాత్యవిజ్ఞానము మనధర్మముపై ధ్వజమెత్తినది. అజ్ఞానవశాత్తుగా మనవారు దానినే నిజమనినమ్మి దాని అప్రతిహతవేగములో కొట్టుకొనిపోవుచున్నారు. కాని అజ్ఞానముచే బాలుడు అగ్నిలోచేయిపెట్టిన వ్రేలుకాలిపోకుండునా ? అటులనే అజ్ఞానముతో చేసిన పాపముకూడా భోగింపవలెను.

ఈసాయీసిద్ధాంతములతో మనసిద్ధాంతములు కలువవు. కనుకనే "స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయావహః" అని శ్రీకృష్ణభగవానులు చెప్పియున్నారు. వివాహాది విషయములో మనదేశీయులుకొందఱు ఈసాయీ మతస్థుల ననుకరించుచుండుట చాలా విచారకరమేను. విజ్ఞానశాస్త్రపండితులగు 'ప్రొఫసర్-నిష్‌బెట్', 'విల్సన్', 'ప్రొఫసర్-అర్నస్టువీబ్రహామ్సు' మున్నగువారు వారివివాహధర్మములఖండించి ఆర్యమతధర్మములనే పొగడియున్నారు. ఇంతేగాక, ఇటీవలకొందఱు మనలీరుగానే వివాహాదులు జరుపుకొన యత్నించుచున్నారు. 'ప్రొఫసర్-అర్నస్టు-వీబ్రహామ్సు' అనువారు వారి 'సైన్స్-ఆఫ్-యూజినిక్స్'అను గ్రంథములో అనులోమ, విలోమ వివాహాదుల ఫలాఫలితములు 'ఆసిలోఫాన్', 'ఆసిలోగ్రాఫ్', మున్నగు యంత్రములద్వారా దంపతులరక్తము పరీక్షించి ప్రకటించియున్నారు. వారుకూడా తక్కువజాతిపురుషులు ఎక్కువజాతిస్త్రీలతో కలియుటవలన కలిగినసంతతి విసర్జింపఁదగినదని ప్రకటించియున్నారు. ఇట్టిజాతులనే ప్రతిలోమజాతియని మనశాస్త్రములు వర్ణించుచున్నవి. చండాలశబ్దము వీనికే అన్వయించును.................."

శ్రీ శ్రీ గోవర్ధనపీఠస్వాములవారు మదరాసు ప్రాంతీయమువారు. పూర్వాశ్రమములో బి. ఏ., ప్యాసై సంస్కృతాంగ్లభాషలలో గొప్పపాండిత్యముసంపాదించి సన్యసించి, పూరీజగన్నాథక్షేత్రములోనున్న గోవర్ధనపీఠాధికారియైయున్నారు. మహాధివేశనము మూడుదినములున్నూ ప్రతిరోజు రెండుమూడుగంటలకాలము హిందీభాషలోను, యింగ్లీషులోను నెమ్మదిగా, జనరంజకముగా సహజోత్సాహవాగ్ధోరణితో యుపన్యసించిరి. వీరు ధర్మావలంబకులున్నూ, దేశభక్తులున్నూ అయియున్నారు. వీరి ఉపన్యాసము అతివుగా వెడలినది. అతివేగముగా నడచుటచే ఎవరికిని సంపూర్ణోపన్యాసము వ్రాసుకొనవీలుకాలేదు. సాధ్యమైనవఱకు ప్రయాసపడి త్రిలిఙ్గపత్రికకొఱకే యీరిపోర్టు పంపినాను.

ఇట్లు,

ఆయుర్వేదమార్తాండ, భిషగాచార్య, పండిత

హెచ్. సుబ్బరాయశాస్త్రిగారు, కవిరత్న, F. R. H. S.

శ్రీదత్తాత్రేయమఠము, నారదఘాట్, శ్రీకాశీ.

—"త్రిలిఙ్గ" సంపు. ౧౩. సంచి. ౫౧. పుట. ౨.

పై శ్రీస్వాములవారి యుపన్యాసమందలి విషయముల నెవరో కొంద ఱెచ్చటనో యాక్షేపించియుండఁగా, వారియాక్షేపణములను ఖండించుచు, 1934 సం॥రం మార్చి నెల 14వ తేదీ "ధర్మరాజ్య" పత్రిక (సంపు ౧. సంచిక ౧౦) యీ క్రిందిరీతిని విమర్శించి శ్రీస్వాములవారి యుపన్యాసమందలి విషయములను సమర్థించియున్నది.

## UNTOUCHABILITY AND RACIAL POISON.

"Much fierce criticism has been levelled against His Holiness Jagadguru Shri Shankaracharya Swamigal of Puri for his observations on blood poison. We do not wish to say anything on the manner and tone of the comments. We are sure that blazing head-lines and slashing expressions do not prove the soundness or otherwise of an argument. *If the critics have been following the scientific investigations and discoveries of the West in recent times, they would have noticed the developments that have taken place in the classification of blood, according to their nature and composition.* Even in cases of transfusion of blood from one individual to another, certain types of blood when transfused to mix with certain other types, produce fatal consequences.

Owing to difference in the composition of tho blood between the members of the different races or communities, any association between the two is likely to be attended with fatal consequences. *Modern theories on the causation and spread of epidemic diseases have further established the need for the protection of the people from such diseases by segregation of those who, though themselves immune, might yet be potential carriers of infection to other and more susceptible members of the society.* But the critics have all of them this amiable attribute in common—that they cannot or will not understand the opponent's point of view. We yield to none in the desire to see that the so called depressed classes lead a better and more ordered life, in cleanliness and health. And we definitely repudiate the assumption of the protagonists of Anti-Untouchability that they have a monopoly of the virtues of justice and humanity or that their activities are the best calculated to improve the lot of those classes.

*Even in the West where distinctions of class are so little, wide differences in the compositian and quality of the blood of different individuals have been shown to exist. It must be very much more so in the case of communities in India which have been living for ages past in water-tight compartments and which would therefore exhibit more pronounced differences in blood as between one community and another.* Hence, the reason for keeping such social organisms separate from each other is all the greater. *It is contended that it is for the Sanatanists to prove that such segregation is "Scientific." The evidence so far available in scientific investigations show the sure foundations on which the practice rests.* The Sanatanists believe that all their '*acharas*' and *customs* have been organised by their ancient sages and seers who perceived with intuition what centuries of laborious scientific investigations have but imperfectly revealed to men of science and others and therefore there is no need for the sanatanists to try to convince our modern Voltaires and Marxes that the ancient customs are sound. It is for those who seek to change the timehonoured customs, under inspiration from western political and social theories, to prove the customs to be wrong, not from the point of view of socio-political doctrinaires, but from the scientific point of view.

But it is too much to expect that our fiery and superficial critics will ever appreciate the Sanatanist point of view. For, their

**minds are closed by preconceived prejudice and ignorance to all reason and arguments and they live in their own sphere of arrogant self-sufficieney. It has been well said by an eminent poet of India that "a fool can be satisfied easily, a wise man much more easily, but even Brahma cannot satisfy the self-conceited man of half knowledge."**

**"Dharmarajya" Vol. 1. No. 10. pp. 3.**

పైదానియర్థ మేమనఁగా:—

అస్పృశ్యత,—జాతిసంబంధమగు (రక్తమందలి) విషము.

రక్తమందలి విషమునుగుఱించి చెప్పినందులకై జగద్గురు శ్రీ పూరీశంకరాచార్య స్వాములవారిపై మిక్కిలి భయంకరములగు విమర్శనలుసాగినవి. ఆవిమర్శనలయొక్క ధోరణిని, వానివిధానమునుగుఱించి మేమిపుడేమియుఁ జెప్పఁదలఁచియుండలేదు. పెద్దపెద్ద శీర్షికలును, తీవ్రమగు ప్రలాపములును, వాదముయొక్క బలాబలములను ఋజువు చేయఁజాలవని మాగట్టినమ్మకము. పాశ్చాత్యదేశములందలి యిటీవలి ప్రకృతిశాస్త్ర పరిశోధనలను, వానిఫలితములను పై విమర్శకులు గుర్తించుచున్నచో, రక్తమందలి వస్తుభేదము ననుసరించియు, దానియొక్క స్వభావమననుసరించియు దానియందేర్పడిన తరగతిభేదములయభివృద్ధిని వారు గమనించియుండెడివారే. ఒకరి (శరీరము) నుండి వేఱొకరి శరీరమునకు రక్తమును మార్చునపుడుగూడ (అనఁగా మనుష్యులలో నెవరికైనను శరీరమున నేకారణముచేతనైనను తగినంతరక్తములేక బాధపడుచున్న సందర్భమున సమృద్ధిగ రక్తముగల మఱియొకమనుష్యుని శరీరమునుండి 'పిచిగారి'వంటి సాధనముచేఁ గొంతరక్తమును బయటికిఁదీసి, దానిని దక్కువరక్తముగల మనుష్యుని శరీరములోని కెక్కించెదరు. అట్టి సందర్భములందుగూడ) కొన్ని ప్రత్యేకతరగతుల రక్తము మఱికొన్ని యితరతరగతులతోఁ గలుపఁబడినప్పు డపాయకరములగు ఫలితములనిచ్చును. వేఱువేఱు జాతులయొక్కయుఁ సంఘములయొక్కయుఁ రక్తములందుఁగల వస్తుభేదము వలన వానియొక్క యెట్టిసమ్మేళనమైనను నుపద్రవకరములగు ఫలితములు గల్గుటకు సామాన్యముగ నవకాశ మొసఁగుచున్నది. కొందఱు తమరియం దిమిడియున్న యంటువ్యాధిహేతువులచే నెట్టియపాయమును బొందనంతటి దృఢశరీరులుగనున్నను, వారియందలి యంటురోగసంబంధమగు పదార్థములు జనసంఘమందలి యితరులలోఁ గొందఱికి సులభముగ వ్యాపింపజాలినంతటి బలముగానుండును; అట్టివారిని దక్కిన జనసామాన్యముతోఁ జేరనీయక ప్రత్యేకముగ నుంచుట యత్యవసరమని యట్టివ్యాధుల పుట్టుకను, వ్యాపకమును గుఱించిన నవీనసిద్ధాంతములు నిశ్చయించుచున్నవి. కాని పైవిమర్శకులందఱును బ్రతివాదియొక్క యభిప్రాయము దెలిసికొనఁజాలకుసిరో తెలియుట

లేదనియో చెప్పుచున్నారు. అణఁగఁద్రొక్కఁబడిన జాతులని వీరనుకొనుచున్న జాతులు పరిశుభ్రతలోను, నారోగ్యవిషయమునను నిప్పటికంటె నెక్కువ మంచిమార్గమున జీవనము గడుపవలయునని కోరువారి కెవరికిని మేమట్టికోరికలోఁ దీసిపోము. కాని, మానవత్వమునకు సంబంధించిన సద్గుణములును న్యాయబుద్ధియు నన్నియుఁ దమరికి మాత్రమే గలవనియుఁ, బైజాతులయొక్క స్థితి బాగుచేయుటకుఁ దాము చేయుచున్నచర్యలే మిక్కిలి యుత్తమమైనవనియు, నస్పృశ్యతానివారణకై పాటుపడువారియొక్క యూహాలనుమాత్రము మేము స్పష్టముగ నిరాకరించెదము.

జాతిభేదము లతిస్వల్పముగఁ బాటింపఁబడు పాశ్చాత్యదేశములలోఁగూడ ప్రత్యేకవ్యక్తులయొక్క రక్తములందలి పదార్థములలోను, రకములలోను మిక్కిలి గొప్ప భేదములుగలవని ఋజువుచేయఁబడి యున్నది. ఇక నొకకులముతో వేఱొకకులము కలియుటకు వీలులేని మిక్కిలి గొప్ప కట్టుదిట్టములుగల్గి బహుపురాతన కాలమునుంచి జీవించుచున్న భరతవర్షమునందలి జనసంఘములలో నట్టిరక్తభేదము మఱింతగా నుండి తీరవలయును; (ప్రపంచకమందలి వేఱువేఱు దేశములలో) నొకదేశమందలి జనులకును వేఱొకదేశమందలి జనులకును గల భేదమువలె మిక్కిలి ప్రాముఖ్యముగఁ దెలియవచ్చునంతటిభేదము వారి రక్తములందుఁ గానవచ్చును. అట్టిసాంఘికసంస్థల నొకదానితో నొకటి కలిసిపోనీయక వేఱువేఱుగ నుంచుటకు ముఖ్యకారణ మిదియే.' అట్లు వేఱుగ నుంచుట ప్రకృతిశాస్త్రసమ్మతమని ఋజువుచేయవలసిన భారము సనాతనులదేయని (నవనాగరకులు) తృప్తిఁజెందుచుండిరి. పైయాచారము దృఢమగు ఋవాదులపైనిలిచియున్నదని ప్రకృతిశాస్త్రపరిశోధనలవలన నిప్పటివఱకును లభించిన సాక్ష్యము గనఁబఱచుచున్నది. ప్రకృతిశాస్త్రవేత్తలు పెక్కుశతాబ్దముల కాలము పలుకష్టములుపడి ప్రకృతిశాస్త్రపరిశోధనలు గావించియు నసంపూర్ణముగ మాత్రమే కనుఁగొనఁజాలిన విషయములను దివ్యదృష్టిచే (నామూలాగ్రముగ)ఁ గనుఁగొనఁజాలిన తమ పూర్వులగు ఋషులచేఁ దమ యాచారములును నభ్యాసములును నిర్మింపఁబడినవని సనాతనుల నమ్మకము; అందుచే దమ పూర్వాచారములు మంచివని మననవనాగరకులను నమ్మించుటకు యత్నింపవలసిన యగత్యము సనాతనులకులేదు. అనాదికాలముగ నాదరింపబడుచున్న యాచారములను, పాశ్చాత్యరాజకీయసాంఘిక సిద్ధాంతముల ప్రభావమునకులోనై మార్పఁజూచువారే యట్టి యాచారములు తప్పులని, సాంఘికరాజకీయదృష్టిలోఁగాక, ప్రకృతిశాస్త్రదృష్టిలో ఋజువుచేయవలసినభారము కలిగియున్నారు.

కాని, యావేశపరవశులును, నల్పజ్ఞులు నగు మనవిమర్శకు లెప్పుడైనను గూడ సనాతనుల యభిప్రాయము నభినందింతురని యనుకొనుట గొప్పయతిశయోక్తి. ఏమనిన

వారిబుద్ధులు, హేతువును వాదమును జోఱనీయనివిధమున దురభిమానముచేతను, నజ్ఞానముచేతను నావరింపఁబడియున్నవి. గర్వపూరితమగు వారిజ్ఞానములో వారేతృప్తిఁజెంది యుండెదరు.

"క. తెలియని మనుజుని సుఖముగఁ, దెలుపందగు; సుఖతరముగఁ దెలుపఁగవచ్చుం
దెలిసినవానిని; దెలిసియుఁ, దెలియనినరుఁ దెల్పబ్రహ్మదేవుని వశమే?!"

యని యొక సుప్రసిద్ధభారతీయకవి చెప్పినవిషయము సరిగానున్నది.

"ధర్మరాజ్య"పత్రిక. సంపు ౧. సంచి ౧౦. పుట. 3.

పైనదెలిపియున్న రక్తభేదముల కారణముననుసరించి వారివారికి సరిసమానములగు జాతుల (కుటుంబముల) తోడ మాత్రమే సంబంధబాంధవ్యములు చేసికొనక, పాశ్చాత్యదేశీయు లుచ్చనీచ కులభేదములు లేనివారై, కేవల కామబంధమునకు లోనై, స్త్రీపురుషులలో నెవరిని ప్రేమించినవారు వారిని వివాహము చేసికొనుచుండుటయే, వారిలో నంగవిహీనులును, దుర్బలురును, మందబుద్ధులును, జడులును, జెవిటివారును మొదలగు నింద్యసంతానములు గలుగుటకుఁ గారణమగుచున్నదని మద్రాసునకు సమీపముననున్న సైదాపేటలోని యుపాధ్యాయులకళాశాల (Teachers, College) యందున్న యొక పాశ్చాత్యస్త్రీ (దొరసాని) వ్రాసినవ్యాసమునుగూడ శ్రీస్వాములవారు పైనదెల్పిన మైలాపూరు సంస్కృతకళాశాలయందలి వారియుపన్యాసమధ్యమునఁ జదివియున్నారు. ఆవ్యాసము 1933 సం||రం జనవరినెల 19 వ లేదీ "హిందూ" పత్రికయొక్క 'విద్యావిషయికానుబంధము' (Education Supplement) లోఁ బ్రకటింపఁబడినదని యాయుపన్యాసమధ్యమున శ్రీస్వాములవారు చెప్పియున్నట్లు మాకు జ్ఞాపకము. కాని, యాపత్రిక మాకులభింపనందున నందలివిషయముల నట్లే యెత్తి మా పాఠకులకుఁ గనఁబఱచఁజాలనందులకును, నందలి విషయముల సారాంశమును సంగ్రహముగ మాత్రమే వినిపింపవలసి వచ్చినందులకును జింతించుచున్నాము.

ఈసందర్భమున శ్రీస్వాములవారిచేఁ బైనఁదెల్పఁబడిన 'ఆసిలోఫాన్', 'ఆసిలోగ్రాఫ్' యంత్రములసహాయమునఁ గావింపఁబడిన యితరపరిశోధనలు (Experiments)ను, సుత్తమాధమ జాతులకుఁజెందిన ప్రత్యేక స్త్రీపురుషజాతుల రక్తబిందువులను మచ్చునకు (Specimens of Blood) నా యంత్రములందుంచి పరీక్షించునపుడు వానియందు గల్గు విచిత్ర సంచలనములును, వానివలనఁ బరిశోధకులు గ్రహించిన నిర్ణయములును (Inferences) మొదలుగాఁగల శ్రీస్వాములవారిచే నుపన్యసింపబడిన పెక్కు విషయములు వర్ణనాతీతములు. ఆపరిశోధనలసహాయముచేఁ దల్లులయొక్కయుఁ, దండ్రులయొక్కయుఁ, బిడ్డలయొక్కయు రక్తములనుబరీక్షించి, యాయాబిడ్డ లాయాతల్లులకును,

దండ్రులకుఁ బుట్టినవారైనదియుఁ గానిదియు నిర్ణయించి, స్త్రీపురుషుల స్వేచ్ఛావిహార ములచేఁ బాశ్చాత్యదేశములందు బయలువెడలుచున్న భరణమునకు (Maintenance) సంబంధించిన తగాదాలను న్యాయాధిపతులు పరిష్కరించుచుండిరని శ్రీస్వాములవా రుదాహరణపూర్వకముగఁ జెప్పిరి. ఆపరిశోధనలన్నిటియొక్క సారాంశముగఁ దేలిన దేమనఁగా, వివాహసంబంధబాంధవ్యముల విషయమున, మనవైదికమతసంఘమందలిశాస్త్రీ యములగు సదాచారములును, వావివరుసలును, సర్వవిధముల సత్యుత్తమములును శ్రేయో దాయకములును ననియుఁను, నట్టి శిష్టాచారవిరుద్ధములగు వర్ణసంకరవివాహములును, విధవా వివాహములును, బాశ్చాత్యదేశములం దీకాలమున నంటువ్యాధివలె వ్యాపించుచున్న వివాహవిచ్ఛేద, స్త్రీ పునర్వివాహములును, మహమ్మదీయుల యాచారమగు పెదతండ్రి పినతండ్రి కూతులను బురుషులు వివాహమాడుటయును మొదలగు మన వేదశాస్త్రదూరము లైన యాచారములన్నియుఁ సర్వవిధముల ననర్థహేతువులనియుఁను, మందప్రజ్ఞులు, నల్పా యుష్మంతులు, దుర్బలులు, రోగిష్ఠులు మొదలగు దుస్సంతానములు గల్గుటకుఁ గారణము లనియుఁను నిశ్చయింపఁబడినది. ఈయొక్కవిషయమునందే శ్రీస్వాములవారు వర్ణించిన విశేషములు బహుసంఖ్యాకములగుటచేతను, వారుచెప్పిన యితర విషయములుగూడ యీసందర్భమున నిచట వినిపింపవలసినవి యింకను జెక్కులుండుటచేతను, గ్రంథవిస్తర భీతిచే నావిశేషములన్నియుఁ నిచట నేకరువుపెట్ట సాధ్యముగానందున వానిసారాంశ మునుమాత్రము సంగ్రహముగఁ బైన వినిపించియుంటిమి.

(౨) స్త్రీల బహిష్ఠవిషయము:—స్త్రీలు బహిష్ఠయైనది మొదలుకొని మూఁడుదిన ములవఱకును నింటిలోని యితరులకు దూరముగనుండి యటుపై నాల్గవదిన ముదయ మున స్నానమాడి శుచులై యింటిలోనికి వచ్చుటయు, నంతలోపల నాస్త్రీలకు సమీప ముగ వెళ్లినవారుగాని, యాస్త్రీల నంటికొనినవారుగాని యశుచులై (యనఁగా మైల పడినవారై) శుచులగుటకు సచేలస్నానము చేయవలసియుండుటయుఁను, మనవైదికమత స్థులలో ననాదికాలమునుండియు సర్వసామాన్యమగు నాచారముగ ననుష్ఠింపఁబడు చుండుట నెఱుఁగనివారు మనలో సాధారణముగ నెవ్వరునుండరు! అట్టియాచారము నితరమతస్థులు లక్ష్యముచేయక యథేచ్ఛగనే వర్తించుచుందురు. ఇటీవల నొకవిదేశీయ ప్రకృతిశాస్త్రపరిశోధకుఁ డాయాచారమునందలి సత్యమగు ఘనతను విచిత్రముగఁ గనుఁ గొనినకథను శ్రీస్వాములవా రీక్రిందిరీతిని వినిపించియుండిరి.

[ఆప్రకృతిశాస్త్ర పరిశోధకుని యూరుపేరులును, దేశముపేరు మొదలగు వివర ములును శ్రీస్వాములవారు ససాకల్యముగనే వినిపించియుండిరి గాని, యంతకుముందు వినియుండని విదేశీయపదములగుటచేతను, నాకథను మేము విని యిప్పటికి సుమా రొక

టిన్నరసంవత్సరముల కాలము గడచిపోయినందునను, జ్ఞాపకములేనందున వాని నిచటఁ దెలుపఁజాలనందుకుఁ జింతించుచున్నాము. అవకాశము దొఱకినచో నీగ్రంథము యొక్క యనుబంధమున ముందుముందు వినిపింప యత్నించెదము.]

ఒక విదేశీయప్రకృతిశాస్త్రపరిశోధకుఁడు(**Scientific Research Scholar**) తనమేడయొక్క పైయంతస్థుపై నిలిచియుండి, యామేడక్రిందుగ దానికిఁజేరియున్న యొకపూలతోటలో నొకరమ్యమగు పుష్పమునుజూచి, యచటనున్న యొకపరిచారిక (**Servant-maid**) ను జేరఁబిలిచి దాని కాపుష్పమును గుర్తుచూపి దానిని దీసికొని రమ్మనిపంపెను. ఆపరిచారిక యాపుష్పమును గోసితెచ్చి యీయఁగా, యాయన మొదటఁ దాను చూచినప్పటియంతటియంద మాపుష్పమునఁ గానరాక కొంచెము వాడియున్నందున నాపరిచారిక పొరపడి యొకటితెచ్చుటకుమారుగ నింకొకటితెచ్చినదేమోయని సంశయించి, మొదట తాను నిలిచినయెడకే వెళ్లిచూడఁగాఁ, దాను గుఱుతుచెప్పిపంపిన పుష్ప మాతావున గానరాకపోయెను. అందుచేఁ దానుచెప్పినపుష్పమునే పరిచారిక తెచ్చినదని నమ్మవలసివచ్చినను, దానియందు మొదటఁగనుపించినవికాసము పిదపఁ గనఁబడనందున, మొదటఁజూచినపుడు కన్నుచెదిరి, లేనివికాస మున్నట్లు తానే భ్రమఁజెందియుండవచ్చునని యాయన నిశ్చయించుకొని, యచటనే నిలిచి యాపరిచారికను మరలఁ జేరఁబిలిచి, చక్కఁగ వికసించిన మఱియొకపుష్పమును గుఱుతుచూపి తెమ్మని పంపెను. వెనుకటియట్లే యామె యాపూవును గొనిరాఁగా, మరల నదియును మొదటి పువ్వువలెనె చెలువుదప్పి కందినట్లు కనుపింపఁగా, యాయన యప్పుడుగూడ మొదటి సారివలెనే సంశయించి, తోటప్రక్కకుఁజూచి, తిరిగి తానే పొరపడియుండునని నిశ్చయించుకొని, మూఁడవసారి మరల వేఱొకపూవును గొనితేరఁబనిచెను. ఆయన తన నిట్లు క్రిందికిని పైకిని మరలమరలఁ ద్రిప్పుచుండుటకుఁ గారణము తెలిసికొనఁగోరి యాపరిచారిక యాయనను బ్రశ్నింపఁగాఁ, దనకు మంచిపువ్వు కావలసియున్నదనియుఁ, నాపె వాడిపోయినపూవులను దెచ్చుచుండుటచేఁ దానట్లు త్రిప్పవలసివచ్చుచున్నదనియుఁ నాయన బదులుచెప్పెను. అందుల కాపరిచారిక తానుదెచ్చు పువ్వేదియైనను నట్లే వాడియుండుననియుఁ, నందుచేఁ దన నట్లెన్నిమారులుద్రిప్పినను బ్రయోజనముండదనియుఁ దెలిపెను. ఆట్లగుచుండుటకుఃగారణమేమని యాయన యడిగెను. అందుల కామె తాను బహిష్ఠయైయుంటిననియుఁ, నట్లు బహిష్ఠలోనున్నపుడేపూవును దాకినను నది చెలువుదప్పిపోవుట తన కనుభవసిద్ధమేయనియును నాపె ప్రత్యుత్తరమిచ్చెను. ఆయన యంతకుముం దెన్నఁడు నట్టివిషయమును వినియుండనందున నాశ్చర్యపడి, "యట్లుజరుగుట నీయొక్కవిషయమునమాత్రమేనా, కాక స్త్రీలందఱివిషయమునను గూడ సామాన్యముగ నట్లే జరుగునా?" యని యామెను బ్రశ్నింపఁగా, నందఱివిష

యమునను నర్లోజరుగునని యామె చెలిపెను. అందుచే ఋతుకాలమున స్త్రీలశరీరము లలో నేదో యొకవిధమగు విచిత్రమైనమార్పేర్పడుచుండవలయునని యాయన యూహించి, యట్టిమార్పును బరీక్షించి దానిలక్షణములను దెలిసికొన నిశ్చయించుకొని, యందుకొఱకై బహిష్ఠస్త్రీలను వెదకితెచ్చుటకు బయలువెడలెను! అట్లు వెదకితెచ్చి వారివారిరక్తములను బరిశోధనగావించి, బహిష్ఠకాని స్త్రీలయొక్కరక్తములతోఁ బోల్చి చూచి, తుట్టఁతుదకుఁ దేల్చినసారాంశ మేమనఁగా:—బహిష్ఠకాలమున స్త్రీలరక్తము నందు బహిష్ఠసంబంధమగు నొకవిధమైనవిషము (Menstrual Poison) వ్యాపించి యుండుననియు, నాకాలమున వారితోడి సంసర్గముగల్గిన యితరులకుగూడ నావిషము వ్యాపించుట కవకాశమున్నదనియు, నట్టివిషము మనుష్యజాతిలోని యితరులకు హానికర మనియుఁ, గావున బహిష్ఠలోనున్న స్త్రీలను సాధ్యమైనంతదూరమగనుంచుట యవసర మనియుఁ దేల్చియుండెను.

[ఇట్టి బహిష్ఠస్త్రీలవిషయమున దూరముగనుండవలసిన విధమును, నట్టిస్త్రీలు దూరముగనుండక యిండ్లలోఁజేరి యాబహిష్ఠదోషము నింటిలోఁగలిపినచో నాపాపఫల ముచే వారికిఁగల్గు దురవస్థలును, దుర్వ్యాధులును మనవేదశాస్త్రములం దీ క్రిందిరీతిని వర్ణింపఁబడినవి:—

"శ్లో. యుగం యుగద్వయంచైవ, త్రియుగంచ చతుర్యుగమ్,

చండాలసూతికోదక్యా, పతితానా మధఃక్రమాత్." పరాశరస్మృతి.

అనఁగాఁ, బతితునకు నొకకాఁడి (బారెడు)దూరమునను, బహిష్ఠయైనస్త్రీకి రెండు కాళ్ల(బారల)దూరమునను, బ్రసవించియున్నస్త్రీకి మూఁడుకాళ్లదూరమునను, జండాలు నకు నాల్గుకాళ్లదూరమునను నుండవలయునని యంటరానివారిదూరవిషయమునుగుఱించి చెప్పుసందర్భమునఁ బరాశరస్మృతిలో వర్ణింపఁబడియున్నది.

మఱియును, బహిష్ఠస్త్రీలవిషయమై శ్రీకృష్ణభగవానులు యుధిష్ఠిరునకుఁ జెప్పిన కథ శ్రీభవిష్యోత్తరపురాణమున నీక్రిందిరీతిని వర్ణింపఁబడియున్నది:—

... ... ... ...

శ్రీకృష్ణఉవాచ:—

"శ్లో. ... ... ... ...

వైదర్భేచ ద్విజవర ఉదంకో నామ నామతః.

తస్యభార్యా సుశీలేతి పతివ్రతపరాయణా,

తస్యా అపత్యయుగళం పుత్రోహి సువిభీషణః.

అధీతవా న్సుత స్తస్య వేదా న్సాంగ పదక్రమాన్,

సమానేన కులీనేన సుతాచాపి వివాహితా.

సహోఢాత్వే౽పి సా దైవా ద్వైధవ్యం ప్రాపసత్తమా,
సతీత్వం పాలయంతీ సా ఆస్తే నిజపితుర్గృహే.
తస్యాదుఃఖేన సంతప్తస్సుతం సంస్థాప్యవేశ్మని,
గంగాతీరవనంప్రాప్తః కదాచిత్తు తయాసహ.
సత త్రాధ్యాపయామాస శిష్యాన్వేదం ద్విజోత్తమః,
సుతాచ కురుతే తస్య పితు శ్శుశ్రూషణం పరమ్.
పితు శ్శుశ్రూషణం కృత్వా పరిశ్రాంతా కదాచన,
నిశీథే కిలసుప్తాయాం క్రిమిరాశి రజాయత.
శిష్యా స్తథా విధాం దృష్ట్వా వివస్త్రా ప్రస్తరేస్థితామ్,
గత్వా నివేదయామాసు స్తన్మాతుః కరుణాం గతాః.
... ... ... ...
సాశ్రాంతమానసా శీఘ్రం తత్సమీప ముపాగమత్.
సుతాం తథావిధాం దృష్ట్వా విలలాప సుదుఃఖితా,
ఉరశ్చతాడయామాస సుతరాం మోహామాప చ.
క్షణేన ప్రాప్య చైతన్య ముత్థాప్య పరిమృజ్యచ,
సమాలింగ్యచ బాహుభ్యాం నిన్యే తత్పితురంతికమ్."

సుశీలా:—

"స్వామిన్ కథయమేసాధ్వీ కేన దుష్కృతకర్మణా,
నిశీథేచ ప్రసుప్తేయం జాయతే క్రిమిసంకులా.
ఏవం శ్రుత్వా తతోవాక్య మృషిర్ధ్యానపరాయణః,
జ్ఞాత్వా నివేదయామాస తస్యాః ప్రాగ్జన్మచేష్టితమ్."

ఋషిరువాచ:—

"ప్రాగియం సప్తమే౽తీతే జన్మని బ్రాహ్మణీహ్యభూత్,
రజస్వలాచ సంజాతా భాండాదీ నస్పృశత్తదా;
అస్యాస్తు పాప్మనాతేన జాయతే క్రిమివద్వపుః,
రజస్వలాయాం పాపేన యుక్తా భవతి సా౽నఘే!
... ... ... ...
ఏతత్తే కథితం సర్వం కారణం దుష్కృతస్యచ."
... ... ... ...

శ్రీకృష్ణః:—

"అజ్ఞానా ద్జ్ఞానతోవా౽పి యాస్త్రీ జాతా రజస్వలా,

దృష్ట్వా స్పృశతిభాండాని గృహకర్మణిసంస్థితా,
ప్రాప్నోతి సా మహాపాపం సర్వా నార్యో రజస్వలాః,
శృణు తత్కారణం యస్మా ద్వర్జనీయా రజస్వలా.
ప్రోత్సార్యా గృహాతోదూరం చాతుర్వర్ణ్యేనభారత !
బ్రహ్మహత్యాం పురా శక్రో వృత్రం హత్వా హ్యవాపచ
తయా వై రాజశార్దూల ! పీడితో వృత్రసూదనః,
బ్రహ్మాణం సముపాగచ్ఛ దాత్మన శ్శుద్ధికారణాత్.
శుద్ధిం శక్రస్య రాజేంద్ర ! ప్రహృష్టేనాంతరాత్మనా,
విభజ్య బ్రహ్మహత్యాంతు చతుర్ధాఽపి చతుర్ముఖః.
ప్రాక్షిప ద్రాజశార్దూల ! చతుస్థ్సానేషు వై తదా,
వహ్నేః ప్రథమజిహ్వాసు నదీనాం ప్రథమోదకే.
గిరివృక్షాది భూమౌచ నారీరజసిపార్థివ!
తతో రజస్వలానారీ ప్రోత్సార్యాచ ప్రయత్నతః.
బ్రహ్మణ శ్శాసనాత్పార్థ! చాతుర్వర్ణ్యేన సర్వదా,
ప్రథమేఽహని చండాలీ ద్వితీయే బ్రహ్మఘాతకీ.
తృతీయే రజకీప్రోక్తా చతుర్థేఽహనిశుద్ధ్యతి,
అజ్ఞానా ద్జ్ఞానతోవాఽపి జాతం సంపర్కపాతకమ్.

... ... ... ...

అత్రార్థే యత్పురావృత్తం ప్రవక్ష్యామి కథాత్మకమ్.
పురా కృతయుగే రాజా విదర్భాణాం బభూవహ,
సేనజిన్నామ రాజర్షి శ్చాతుర్వర్ణ్యానుపాలకః.
తస్యదేశేఽవస ద్విప్రో వేదవేదాంగపారగః,
సుమిత్రోనామ రాజేంద్ర ! సర్వభూతహితేరతః.

... ... ... ...

తస్య భార్యా సుసాధ్వీచ పతిశుశ్రూషణేరతా,
జయశ్రీ ర్నామ విఖ్యాతా బహుభృత్యసుహృజ్జనా.

... ... ... ...

ఏకదా సాఽత్మనః ప్రాప్త మృతుకాలం వ్యలోకయత్,
రజస్వలాఽపి సా రాజన్ ! గృహకర్మచకారహ.
భాండాదీ న్యస్పృశద్రాజన్ ! ప్రాప్తర్తురపిభామినీ,
కాలేన బహునాసాధ్వీ పంచత్వ మగమ త్తదా.

తస్యా భర్తాఽపి విప్రోఽసౌ కాలధర్మ ముపేయివాన్,
ఏవం తౌ దంపతీ రాజన్ స్వకర్మవశగౌ తదా.
భార్యా తస్య జయశ్రీస్సా ఋతుసంపర్కదోషతః,
శునీయోనిసముత్పన్నా శునీ చాఽభూన్నరేశ్వర!
తస్యాస్సంపర్కదోషేణ బలీవర్దో బభూవ సః,
ఏవం తౌ దంపతీ రాజన్! స్వకర్మవశగౌ తదా.
ఋతుసంపర్కదోషేణ తిర్యగ్యోని ముపాగతౌ,
స్వధర్మాచరణా జ్జాతావుభౌ జాతిస్మరౌ తథా.
సుతస్యైవ గృహే రాజన్! స్మరంతౌ పూర్వపాతకమ్,
సుమిత్రస్య చ పుత్రోఽభూ ద్గురుశుశ్రూషణే రతః.
సుమతిర్నామ ధర్మజ్ఞో దేవతాఽతిథిపూజకః,

... ... ... ... ...

తయోస్సంవదతో రేవం మాతాపిత్రోశ్చ భారత!
శ్రుత్వా పుత్రస్తదావాక్యం యదుక్తం చ తదోభయోః.

... ... ... ... ...

తదాఽసౌ దుఃఖితః పుత్రో జ్ఞాత్వాఽవస్థాం తదా తయోః.
మాతాపిత్రోస్తు రాజేంద్ర! దుఃఖితః ప్రస్థితో వనమ్,
"జ్ఞాతుమిచ్ఛామి కష్టం వై మాతాపిత్రోశ్చ" భారత!
తత్ర గత్వా జ్ఞానవృద్ధా నృషీన్సప్త వనాశ్రితాన్,
ప్రణిపత్యాబ్రవీద్వాక్యం హితం చైవ తదా తయోః.

సుమతిః:—

"కథయధ్వం విప్రవర్యాః! ప్రశ్నమేకం సమాహితాః,
కేన కర్మవిపాకేన పితరౌ మే తపోధనాః!
ఇమామవస్థాం సంప్రాప్తౌ? ముచ్యేతే పాతకాత్కథమ్?"

శ్రీకృష్ణః:—

"తదాకర్ణ్య వచస్తస్య సుమతేర్దుఃఖితస్య చ,
ఋషి 'స్సర్వతపో'నామ సర్వజ్ఞః కరుణాన్వితః.
సుమతిం ప్రత్యువాచేదం తత్పిత్రోర్ముక్తయే తదా."

ఋషిరువాచ:—

తవ మాతా పురా విప్ర! స్వగృహం బాలభావతః,

ఋతుం ప్రాప్తం విదిత్వా తు సంపర్కమకరోద్ద్విజ!
తేన కర్మవిపాకేన శునీయోనిముపాగతా;
పితాఽపి స్పర్శదోషేణ బలీవర్దో బభూవ హ!

... ... ... ... ...

శ్రీభవిష్యోత్తరపురాణము.

దీని తాత్పర్య మేమనఁగా:—

శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పెను:—"......, విదర్భదేశమున సుదంకుఁడను బ్రాహ్మణోత్తముఁ డుండెను. ఆయనకుఁ బతివ్రతయగు సుశీలయను భార్యగలదు. ఆమె కిరువురు బిడ్డలుండిరి. కొడుకుపేరు సువిభీషణుఁడు. అతఁడు వేదవేదాంగములను సమగ్రముగఁ జదివికొనెను కూతురునుగూడ సత్కులమునఁబుట్టినవాని కిచ్చి పెండ్లిచేసిరి. ఆబిడ్డకు దైవయోగమున వైధవ్యము ప్రాప్తించెను. ఆమె సతీత్వమును బాలించుచుఁ దండ్రి యింటనుండెను. ఆమెకుఁగల్గిన దుఃఖమునకుఁ దండ్రి పరితపించి, కొడుకునకు గృహభార మప్పగించి, యామెను వెంటఁబెట్టికొని, గంగానది యొడ్డుననున్న యడవికి వెళ్లెను. ఆయన యక్కడ శిష్యులకు వేదము నేర్పుచుండెను. కూతురుగూడ తండ్రికిఁ జక్కఁగ నుపచారముచేయుచుండెను. ఒకప్పుడు తండ్రి కుపచారముచేసి యలసి నిద్రించుచున్న యామెయొక్క శరీర మర్ధరాత్రమునఁ బురుగులువడెను. అందుచే నామెగుడ్డ తొలఁగి పడియుండఁగా శిష్యులదిచూచి జాలిపడివెళ్లి యామెయొక్క తల్లికిఁ దెలిపిరి........ ఆమె విచారముతో వెంటనే కూతురున్న యెడకు వెళ్లెను. ఆవిధముగనున్న కూతును జూచి మిక్కిలి దుఃఖించి విలపించి బొమ్మబాదుకొని మూర్ఛవోయి, క్షణములోఁ దెలివినొంది, కూతును జేతులతో లేవనెత్తి యొడలునిమిరి కౌఁగలించుకొని తండ్రి యున్న యెడకుఁ దెచ్చెను. అపుడు సుశీలభర్తతో, "స్వామీ, నిద్రపోవుచున్న యీ సాధ్వికి నర్ధరాత్రమున నెట్టి పాపకర్మముచే శరీరము పురుగులువడెనో నాకుఁ జెప్పుఁ" డని యనెను. ఆఋషి యామాటవిని ధ్యానముచేసి, యామెయొక్క పూర్వజన్మకర్మను దెలిసికొని యిట్లాలోచించెను: "ఇప్పటి కేడుజన్మములకు ముందలిజన్మమున నీమె బ్రాహ్మణస్త్రీగ నుండెను; బహిష్ఠయై (యింటిలోని) కుండలు మొదలగువాని నంటికొనెను; ఆపాపముచేత నీమెకు శరీరము పురుగులువడెను.........ఈపాపమునకుఁ గారణముసంతను నిదియే యెఱింగించితిని"........ఇట్లని యెఱింగించి శ్రీకృష్ణుఁ డింకను నిట్లు చెప్పఁదొడంగెను: "తెలిసిగాని, తెలియకగాని, యేస్త్రీయైనను బహిష్ఠయై యింటిలోని పనులనుజేయుచుఁ గుండలు మొదలగువాని నంటికొనుచు నున్నచో నామె మహాపాపమును బొందును. స్త్రీలందఱును బహిష్ఠయగుదురు. నాల్గుజాతుల వారలలోను

బహిష్ఠయైనయట్టిస్త్రీ యింటికి దూరముగనుండి ముట్టరానిదగుటకుఁ గారణముఁ వినుము. పూర్వ మింద్రుఁడు వృత్రుఁడను రాక్షసుని సంహరించుటచే బ్రహ్మహత్యయను పాపమును బొందెను. ఆబ్రహ్మహత్యచే నింద్రుఁడు పీడింపఁబడెను. అతఁడు బ్రహ్మదేవుని కడకేగి యాబ్రహ్మహత్యనుండి విడివడి శుద్ధుఁడగుటకు మార్గ మెఱిఁగింపఁ గోరెను. ఆయన యందులకు సంతసించి యాబ్రహ్మహత్యను నాల్గుభాగములుచేసి, యగ్నియొక్క తొలి మంటలయందును, నదులలోని క్రొత్తనీటి (నురుగు) లోను, కొండలు, చెట్లు, భూమి, యనువానియందును, స్త్రీలయొక్క రజస్సునందును నిట్లు నాల్గుస్థానములందుఁ బడవైచెను. అందుచే బ్రహ్మదేవునియొక్క యాజ్ఞ ననుసరించి నాల్గువర్ణములవారును బహిష్ఠయైనస్త్రీని దూరముగ నుంచవలయును. బహిష్ఠయైనస్త్రీ మొదటిదినము మాలదానితోను, రెండవనాఁడు బ్రహ్మహత్యచేసిన దానితోడను, మూఁడవనాఁడు చాకలిదానితోడను సమానమని చెప్పుదురు. నాల్గవనాఁడు (స్నానమాడి) శుద్ధినొందును. జ్ఞానముచేఁగాని, యజ్ఞానముచేతఁగాని (అనఁగాఁ దెలిసియైనను దెలియకయైననుగూడ) బహిష్ఠ స్త్రీయొక్కసంపర్కము సోకినయెడలఁ బాపము సంభవించును............ ఈవిషయమునఁ బూర్వముజరిగిన యొకసమాచారమును గథారూపమున వినిపించెదను. తొల్లి కృతయుగమున విదర్భదేశమున 'సేనజి' త్తనురాజు నాల్గువర్ణముల జనులను జక్కఁగఁ బాలించుచుండెను. ఆయనదేశమున వేదములను వేదాంగములను నేర్చిన సుమిత్రుఁడను బ్రాహ్మణుఁ డుండెను.........ఆయనభార్య 'జయశ్రీ' యనునామె మంచిసాధ్వియై భర్త కుపచారముచేయుచు పెక్కురు పరిచారికలను జెలికత్తెలను గల్గియుండెను......ఒకప్పు డామె తాను బహిష్ఠయగుటను జూచికొనెను. ఆమె బహిష్ఠయైయుండియు నింటిపనులను జేసెను; (ఇంటిలోని) కుండలు, పాత్రలు మొదలగువాని నంటికొనెను. తుదకుఁ గాలవశమునఁ జనిపోయెను. ఆమెయొక్క భర్తయగు నాబ్రాహ్మణుఁడును గాలధర్మము నొందెను. ఈవిధముగ నాదంపతు లిరువురును వారికర్మఫలమునకు లోనైరి. భార్యయగు నా'జయశ్రీ' బహిష్ఠయొక్క సంపర్కమును గలిపిన దోషము (పాపము)చేత నొక యాఁడుకుక్కకడుపునఁబుట్టి యాఁడుకుక్క యాయెను. ఆమెయొక్క సంపర్కమునుబొందిన దోషముచేత నాయన (భర్త) యెద్దై పుట్టెను. ఈరీతి నాదంపతులు బహిష్ఠసంపర్కదోషమువలన జంతువులై పుట్టిరి. కాని, (పూర్వజన్మమందలి) వారి స్వధర్మానుష్ఠానమువలనఁ బూర్వజన్మజ్ఞానమును గలిగియుండి, తమ పూర్వజన్మమునందలి పాపమును దలఁచికొనుచుఁ దమకొమారుని యింటియందే పడియుండిరి. ఆసుమిత్రుని (బ్రాహ్మణుని) కొడుకు 'సుమతి' యనువాఁడు ధర్మమెఱిఁగినవాఁడును, గురువున కుపచారముచేయుటయం దాసక్తి గలవాఁడును, దేవతలను

నతిథులను బూజించువాఁడును, నైయుండెను......ఒకనాఁడు వాఁడా రెండుజంతువులయొక్కయు సంభాషణమునువినుట తటస్థించెను. ఆరెండుజంతువులును ననుకొనుచున్న మాటలనువిని, కొడుకు.........వారలకు సంభవించిన దుర్దశను దెలిసికొని యందులకు దుఃఖించెను. "తల్లిదండ్రులకుఁగల్గిన యీకష్టమునుగుఱించి తెలిసికొనఁదలంచెద" నని నిశ్చయించుకొని యడవికి వెళ్లెను. అచటికివెళ్లి వనవాసులును, జ్ఞానులును, వృద్ధులునునగు నేడ్గురు ఋషులకు నమస్కారముచేసి, తనతలిదండ్రుల విషయమై వారితో నిట్లనెను:—"ఓ బ్రాహ్మణోత్తములారా! నాకొక ప్రశ్నఁజెప్పుడు. ఎట్టి పాపకర్మఫలముచే నాతలిదండ్రుల కీయవస్థ సంభవించినది? ఈ పాపమునుండి వీరెట్లు వెలువడెదరు?" దుఃఖించుచున్న యీసుమతియొక్క యీమాటలనువిని, దయామయుఁడును, సర్వజ్ఞుఁడునునగు 'సత్యతప' స్సను పేరుగల యొకఋషి, వానినిజూచి వానితల్లిదండ్రులకు మోక్షము గల్గుమార్గమును వానితో నిట్లు చెప్పఁదొడంగెను:— "ఓ బ్రాహ్మణుఁడా! పూర్వము మీతల్లి తాను బహిష్ఠయగు టెఱిఁగియుండియును, జిన్నపిల్లవలెఁ దనయింటియందు బహిష్ఠసంపర్కమును గలిపెను. ఆపాపఫలమువలన నాఁడుకుక్కకడుపునఁ బుట్టెను. తండ్రికూడ యీమెతోడి సంపర్కదోషమున నెద్దాయెను........................"

ఈ పైవిషయములను బట్టిచూడఁగా, మన నవనాగరకులదృష్టిలో నాగరకతయందగ్రగణ్యతవహించిన పాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞులకు నిటీవలఁ గొంతకాలము క్రిందటివఱకును నసలే తెలియక యిప్పుడిప్పుడు కొంచెము కొంచెముగఁ దెలియవచ్చిన బహిష్ఠస్త్రీల స్పర్శదోషవిషయము, మన వైదికమతగ్రంథములగు వేదశాస్త్రములలో నిదివఱకే తెలుపఁబడి యనాదికాలమునుంచియు మన వైదికమతస్థులలో సర్వసామాన్యముగ నందఱకును దెలిసిన శిష్టాచారమై యలరారుచున్నదని మనము గ్రహింపఁగలము. అంతియగాక, యట్టిదోషమువలని యనర్థములను నిహలోకసంబంధములగు వానినే పాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞు లింకను బూర్తిగఁ గనుఁగొనఁజాలని స్థితిలో నుండఁగా, మనవేదశాస్త్రము లాదోషముచే నిహలోకమునఁ గల్గు ననర్థములనుమాత్రమే గాక, పరలోకమునను, జన్మాంతరములందునుగల్గు ననర్థములనుగూడ, పైకథయందుఁ జెప్పినరీతిగ నేకరువుపెట్టియున్నవి.

ఇందుచే, లోగడ నీవ్యాసమున "Untouchability and Racial Poison" (అనఁగా "నస్పృశ్యత;—జాతిసంబంధమగు (రక్తమందలి) విషము") అను శీర్షికక్రింద 'ధర్మరాజ్య' పత్రికనుండి మేమెత్తిచూపిన యీక్రిందివాక్యము సర్వవిధముల సత్యమనఁదగియున్నదని మనము గ్రహింపఁగలము:

"......The Sanatanists believe that all their *acharas* and *customs* have been organised by their *ancient Sages and Seers who perceived with intuition what centuries of laborious scientific investigations have but imperfectly revealed to men of science and others......*"

(అనఁగాః—"ప్రకృతిశాస్త్రవేత్తలు పెక్కుశతాబ్దముల కాలము పలుకష్ట ములుపడి ప్రకృతిశాస్త్రపరిశోధనలుగావించియు నసంపూర్ణముగ మాత్రమే కనుఁగొనఁ జాలినవిషయములను, దివ్యదృష్టిచేఁ (సామూలాగ్రముగఁ) గనుఁగొనఁజాలిన తమపూర్వు లగు ఋషులచేఁ దమ యాచారములును నభ్యాసములును నిర్మింపఁబడినవని సనాతనుల నమ్మకము.")

మనపూర్వులగు ఋషులచేనిర్మింపఁబడిన మన వైదికమతాచారములకును ధర్మా ధర్మములకును మూలము వేదమేయని యీప్రకరణము మొదటినుండియు ఋజువు చేయుచునేయున్నాముగదా! అట్టివేదము మనుష్యబుద్ధిచే నిర్మింపఁబడినదిగాక, యపౌరు షేయమును సర్వజ్ఞుఁడగునీశ్వరునియాజ్ఞారూపమునేయని యీగ్రంథముయొక్క మొదటి ప్రకరణమున విశదపఱిచి ఋజువుచేసియుంటిమి. అందుచే మన వైదికమతధర్మములును నాచారవ్యవహారములునుగూడ, సర్వజ్ఞుఁడగు నీశ్వరునియొక్క యాజ్ఞారూపములే యని యేర్పడుచున్నది. ఆకారణముననే, యనేకశతాబ్దములకాలము పెక్కుకష్టములు పడి ప్రకృతిశాస్త్రపరిశోధనలుగావించియును, బాశ్చాత్యప్రకృతిశాస్త్రవేత్తలు పూర్ణ ముగఁ గనుఁగొనఁజాలని ప్రకృతిశాస్త్రరహస్యములు మనవేదశాస్త్రములందు ధర్మాధర్మ రూపమున నిర్ణయింపఁబడి మన వైదికమతసంఘమునం దాచారములుగ నభ్యసింపఁబడుట తటస్థించుచున్నది. దీనినిబట్టిచూడఁగా, నీవ్యాసముననే లోఁగడమేముచూపియున్నరీతిని శ్రీభారతీకృష్ణతీర్థస్వామివారు (శ్రీపూరీశంకరాచార్యులవారు) చెప్పియున్న యీక్రింది వాక్యము సర్వవిధముల శ్లాఘనీయమని తేలుచున్నది.

"We have no quarrel with '*Science*'......On the other hand, we verily believe *Sanatana Dharma teaches us the highest Truths of Science......*"

(అనఁగాః—"ప్రకృతిశాస్త్రముతోడ మాకు వివాదములేదు......అందులకు మాఱుగ, సనాతనధర్మము (అనఁగా మన వైదికమతధర్మములు) ప్రకృతిశాస్త్రసంబంధ ములగు పరమరహస్యములను మాకుబోధించునని........మేము నిశ్చయముగా నమ్మె దము;.........")]

(౩) తాంబూలవిషయము:—శ్రీస్వాములవారికిఁ బరిచితులగు పాశ్చాత్యప్రకృతిశాస్త్రవేత్తలొకరు [శ్రీస్వాములవారి విద్యార్థిదశలో వారి యుపాధ్యాయగణమునకుఁ జెందిన ప్రకృతిశాస్త్రవిద్వాంసులని (Science Professor) మాకు విన్నజ్ఞాపకము] వారి దేశమునకు వెళ్లినపిదపఁ గొన్ని పరిశోధనలుగావించుచుఁ, దమలపాకునందుఁ గొన్ని విశేషములనుగనిపెట్టి, యవి మన వైదికమతసంఘమున కెంతవఱకుఁ దెలియునో పరీక్షింపఁగోరి, తమలపాకు నుపయోగించువిషయమున మనదేశమునందలి యాచారవిశేషము లేమైననున్నచో వెంటనే తెలుపవలసినదని శ్రీస్వాములవారికి జాబువ్రాసియుండిరఁట. తమలపాకుల నుపయోగించు నాచారము స్వయముగ తమకభ్యాసము లేదనియు నైనను నీదేశమునందలి హీనజాతులలోఁగూడ సర్వసామాన్యమగువాడుక ననుసరించి తమలపాకుయొక్క తొడిమనుగిల్లివైచి, చివరనుద్రుంచివైచి, యీనెలనుదీసివైచి మిగిలినభాగమును మాత్రము నమలెదరనియు శ్రీస్వాములవారు ప్రత్యుత్తరమునువ్రాసియుండిరఁట. కాని వారు జవాబువ్రాయుటలోఁ గొంతయాలస్యమైనందున నాప్రకృతిశాస్త్రజ్ఞుఁడు కొన్నిదినములువేచియుండి, జవాబురానందున నింకఁ బ్రయోజనము లేదనుకొని, తన పరిశోధనఫలితముల వివరమును దానేవ్రాసి శ్రీస్వాములవారికిఁబంపెనఁట. అంతకుముందు కొద్దిదినములక్రిందటనే శ్రీస్వాములవారు జవాబువ్రాసియున్నందున నారెండుజాబులును మార్గమధ్యమున 'మధ్యధరాసముద్రమున' (Mediterranean Sea) లో నెదురుపడియుండునఁట! అట్లు తామువ్రాసిన ప్రత్యుత్తరముచేరకముందే వ్రాయఁబడిన పరిశోధనఫలితము లాశ్చర్యకరముగనుండెనఁట. ఏమనిన, నాప్రకృతిశాస్త్ర పరిశోధకుఁ డీక్రిందివిధమున వ్రాసియుండెనఁట:—

"తమలపాకు నుపయోగించువిషయమై మీదేశమునమేమైన నాచారవిశేషములున్నచోఁ దెలుపవలసినదని నేను మీకుజాబువ్రాసియుంటినిగాని, యెంతకాలము నిరీక్షించినను మీయొద్దనుండి ప్రత్యుత్తరము రానందున, నేనుగావించిన పరిశోధనఫలితముల నీక్రిందిరీతిని దెలుపుచున్నాను: ౧. తమలపాకుతొడిమలో (నొకవిధమగు) * విషమున్నది. ౨. దానిచివరలో (వేఱొకవిధమగు) * విషమున్నది. ౩. దాని యీనెలలో (మఱియొకవిధమగు) * విషమున్నది. ౪. ఆయాకునందలి మిగిలినభాగములో మనుష్యునకు జెఱుపుచేయు నైవిధములగు విషములవంటి పదార్థముగాక, సంభోగముచే క్షీణిం

* ఈవిషములయొక్కయుఁ, బదార్థములయొక్కయుఁ బేర్లను వేఱువేఱుగ శ్రీస్వాములవారు తమగుంపన్యాసమునఁ బేర్కొనియుండిరిగాని, యవి మాకంతకుముం దెన్నఁడును బరిచయములేని వైద్యశాస్త్రమునకును, రసాయనశాస్త్రమునకును

చినశక్తినిదిరిగి యొడఁగూర్చుసామర్థ్యముగల (యొకవిధపగు) * మంచిపదార్థమున్నది. ఇవి నాగావించిన పరిశోధనఫలితములు."

ఈ పైవిషయమునుబట్టి చూచినను, సాధారణముగ వేదశాస్త్రప్రామాణ్యములచేఁ దెలియవచ్చు నాచారములుమాత్రమేగాక, వైదికమతసంఘమున సర్వసామాన్యముగ జనులలో నాచరణయందున్న స్వల్పములగు నాచారములుఁగూడ, యెట్టి గొప్పప్రయోజనముల నొడఁగూర్చునవియో యోజింపుఁడు! ఇట్టి యాచారములు మన వైదికమతసంఘముఁనందుండుటకుఁ గారణము సహితము, పైన మేము తెల్పియున్నరీతిగ మనయాచారములు విదేశీయుల యాచారములవలె ప్రమాదముల కాస్పదమగు మనుష్యబుద్ధిననుసరించియు, లోకానుభవమునుమాత్రమే యనుసరించియు నిర్మింపఁబడినవిగాక, సర్వజ్ఞుఁడగు నీశ్వరునియాజ్ఞారూపములగు వేదశాస్త్రములపై యాధారపడియుండుటయే. మన వేదశాస్త్రము లిట్టివనుట కాధారముల నీగ్రంథముయొక్క మొదటి రెండుప్రకరణములలోఁజూపుచు, నందుపై నవనాగరకులకుఁగల సంశయములకు సమాధానములనుగూడ చెప్పుచునేయున్నాముగదా!

(౪) గ్రహణవిషయము:—

సూర్యచంద్రగ్రహణములు సంభవించినపుడు వైదికమతస్థులు వారవేదశాస్త్రముల ననుసరించి, భోజనముచేయకుండుటయుఁ, బుణ్యతీర్థములు, సముద్రము, మొదలగువానికిఁ బోయి స్నానములుచేసి జపతపాదులఁసల్పుటయును, శాస్త్రీయమైన శిష్టాచారముగ నల రారుచున్నసంగతి సామాన్యముగ మనమందఱెఱిఁగినవిషయమే. అట్లొనర్చుటకుఁగల ప్రకృతిశాస్త్రరహస్యముల నెఱుఁగఁజాలనప్పటికిని, బూర్వాచారపరాయణులు తమవేద శాస్త్రములయెడఁ దమకుఁగల పూజ్యభావమును, భక్తివిశ్వాసములను ననుసరించి యాప్రకారముచేసి యనాదికాలమునుండియు నట్టికార్యములచేఁగలుగఁగల ప్రయోజనముల నందుచునేయున్నారు. కాని, వేదశాస్త్రములందలి భక్తివిశ్వాసములను విదేశీయవిద్యా వ్యామోహమువలనను, విదేశీయనాగరకతాసంపర్కముచేతను గోల్పోయినట్టియు, నాదేశసంబంధమగు ప్రకృతిశాస్త్రజ్ఞానమైనను బరిపూర్ణముగ నలవడనట్టియు నవనాగరకులు పైకార్యములనొనర్చి వానివలని ప్రయోజనముల నందఁజాలకపోఁగా, యట్లు చేయుపూర్వాచారపరాయణులను దమ యజ్ఞానముచేనాక్షేపించి, వారివి గ్రుడ్డినమ్మకములనియుఁ, మూఢవిశ్వాసములనియు వెక్కిరించుచున్నారు. ఇందులకుదాహరణముగఁ,

(Chemistry) కి సంబంధించిన పారిభాషికపదములు (Technical Terms) ఆగుటచే జ్ఞాపకములేనందున, నిచటఁ దెలుపఁజాలనందులకుఁ జింతించుచున్నాము.

పాశ్చాత్యవిద్యకొంతనేర్చి యందుచేగల్గిన ప్రకృతిశాస్త్రములసంబంధమగు మిడిమిడి జ్ఞానమునూతగాఁగొని తాముపూర్వాచారములను విడిచియుండఁగాఁ, దమవలెనే విదేశీయవిద్య నేర్చియుం నింకనుపూర్వాచారములనువిడువని పూర్వాచారపరాయణులను 'లోకవంచకు'లని నిందింపుచు శ్రీవల్లూరిసూర్యనారాయణరావు B. A., B. L., L. T., గారు వ్రాసినవ్యాసమును విమర్శింపుచు బ్రహ్మశ్రీకాశీభట్టబ్రహ్మయ్యశాస్త్రిగారు 1933సం॥ సెప్టెంబరు 25-వ తేది సోమవారము వెలువడినత్రిలిఙ్గపత్రిక ౧౪-వసంపుటము, ౩౯-వసంచికలో బ్రకటించిన యీక్రిందియంశములను జూడఁదగును:—

... ... ... ... ... ...

## గ్రహణస్నానాదికము.

"పాఠశాలోపాధ్యాయులు ప్రకృతిశాస్త్రములు చదువుకొనియుండినవారైనను, గ్రహణాదికములంగూర్చి ప్రకృతిశాస్త్రములేమిచెప్పుచున్నవో యెఱిఁగియుండినవారయ్యును, గ్రహణకాలమున స్నానమొనరించుట మున్నగుకృత్యము లొనరించుచున్నారనియుం, నయ్యదిలోకవంచకమనియు మనరావుగారువ్రాసిరి. గ్రహణములంగూర్చి ప్రకృతిశాస్త్రములేమి చెప్పుచున్నవో దానినే మనశాస్త్రములును తెల్పుచున్నవి. దేవీభాగవతాదికములను జూచికొనిన ఈవిషయము తేలగలదు. అయినను గ్రహణస్నానములకుఁగారణములువేఱుగనున్నవి. అవియాస్తికులకుఁగారణములుగఁ గాన్పించునుగాని, సమస్తమునకు జడపదార్థములంగూర్చి ముచ్చటించుభౌతికశాస్త్రములనే పరమప్రమాణముగనెంచుకొను మనరావుగారివంటివారికిమాత్రము కారణములుగాఁ గాన్పింపవు...."

—త్రిలిఙ్గ, సంపు. ౧౪, సంచి, ౩౯, పుట ౧౪.

కాని, గ్రహణకాలములందు మనుష్యశరీరములయొక్క జీర్ణకోశములలో నొకవిధమగు రసము స్రవించి శరీరమున వ్యాపించుచుండుననియుం, నట్టిసమయమున జీర్ణకోశమున నిలిచియున్న యెట్టి యాహారపదార్థమైనను నారసముయొక్క సంపర్కముచే విషతుల్యముగ మారి మనుష్యుల యారోగ్యమునకు భంగమొనరించుననియుం, నట్టిసమయమునకు ముందే కొన్నిజాములనుండి యుపవసించి జీర్ణకోశమున నెట్టిభోజనపదార్థమును నిలిచియుండనీయక, యాకాలమునకు స్నానమొనరించుటచే నారసముయొక్క యుద్రేకముపశమించి (యనఁగా నడఁగిపోయి) మనుష్యుల కారోగ్యముచేకురుననియుఁ, బాశ్చాత్యప్రకృతిశాస్త్రజ్ఞులు కొందఱు తాముగావించిన ప్రకృతిశాస్త్రపరిశోధనలచేఁ గనిపెట్టియున్నవిషయమును శ్రీస్వాములవారు తమయుపన్యాసమున వినిపించియుండిరి. ఇందుచేఁగూడ మనవైదికమతమునకు సంబంధించిన శాస్త్రీయములగు శిష్టాచారములయుత్కృష్టత వెల్లడియగుచున్నది.

అదియట్లుండఁగా, మన నవనాగరకులుతలంచునట్లు గ్రహణములు గల్గుటకుఁ గారణము భూమియొక్కనీడ చంద్రునకడ్డువచ్చుటయో, చంద్రునియొక్కనీడ సూర్యున కడ్డువచ్చుటయో మాత్రమేయనియుఁ, బూర్వాచారపరాయణులు తలంచునట్లు రాహువుగాని, కేతువుగాని, సూర్యచంద్రులను మ్రింగుటకాదనియుం వాదముకొఱకు కించుక సేపు మనమంగీకరించిచూతము. అట్లయినచో నట్టివిశేషము లాకాశమున జరుగునప్పుడు వానికి నెంతయోదూరమున నెచటనో భూమిమీఁదనున్న మనకును నాకాశములోనున్న వానికిని నేమిసంబంధమనియుం, మనమిచటఁజేయు స్నానములచేతను దానములచేతను నేమి ప్రయోజనముకలుగఁగలదనియుం మాత్రమేగదా మననవనాగరకులవాదము! ఐనచో నాకాశముననున్న సూర్యచంద్రాదిగ్రహములకును భూమిపైనున్న మనుష్యజాతికిని నేమియుం సంబంధములేదని మననవనాగరకులు నమ్మెదరా? అట్లునమ్మినయెడలఁ బ్రత్యక్షసాధనములగు ప్రకృతిశాస్త్రములుగూడ కొన్ని మననవనాగరకులకుఁ దిన్నగాఁదెలియవనియే మనము నిశ్చయించుకొనవలయును. ఏమనినఁ, బ్రత్యక్షసాధనములలో నొకటియగు జ్యోతిషశాస్త్రమందలి జాతకభాగమును బాగుగగుర్తెఱిగి, యాశాస్త్రమందలిదేయగు సిద్ధాంతభాగమునుగూడ బాగుగనేర్చియున్నచో, నట్టిసిద్ధాంతభాగముయొక్క సహాయమున నేదైననొక్కసమయమునకు నాకాశమున నేయేగ్రహ మేయేరాశిలో నేయేనక్షత్రములో నేయేపాదమున నేయేయంశలోనున్నదో సరిగా గుణించితెలిసికొని, యాసమయమునఁబుట్టిన మనుష్యునినెవ్వనినైననుగూడ చూడకయే, జాతకభాగముయొక్కసహాయమున నట్టిమనుష్యునియొక్క శరీరముయొక్కరంగు, శరీరసౌష్ఠవము (లావు, సన్నదనము, మొదలగునవి,) వాని యారోగ్యము, వానిదేహతత్త్వము (వాత, పిత్త, శ్లేష్మ, మేహ, భేదములు,) మొదలగువర్తమాన (జరుగుచున్న) విషయములు మాత్రమేగాక, ముందుజరుగఁబోవు వానిభోగభాగ్యములును, వానియాయుర్దాయమును, గళత్రసౌఖ్యమును, బుత్రపౌత్రభాగ్యమును, విద్యాసంపదయుం మాతాపితృసౌఖ్యములును, సోదరసోదరీభావములును మొదలగు ద్వాదశభావములతోఁగూడిన వానిజీవితరహస్యమునంతను నామూలాగ్రముగఁ జెప్పవచ్చును. అట్టిసిద్ధాంత, జాతకభాగములందుఁ దగినంతకృషిసలుపకయే, యంగడిలోఁ జవుకగదొఱకు నేతప్పులపంచాంగమునో గొనివచ్చి దానిపైనఁ దమయసంపూర్ణజ్ఞానమును బ్రయోగించుటయుంత తప్పుపోకుండునట్లు నూటికిఁ దొంబదిపాళ్లు సత్యమును వెల్లడింపఁగల దైవజ్ఞశిరోమణు లిప్పటికిని మనదేశమునను విదేశములందును నెందఱోగలరనుసంగతి, వార్తాపత్రికలను విరివిగాఁజదువుచుండు మన నవనాగరకులలోఁ గొందఱికిఁ దెలిసియేయుండును. అట్టి జ్యోతిషశాస్త్రవేత్తలు, పైనదెల్పిన సిద్ధాంతజాతకభాగములందుఁ దగినంతకృషిసల్పి, యేతప్పులుపంచాంగముల

పైనను సాధారపడక, స్వయముగఁ గాలమానమునుగుణించి లగ్నస్ఫుటగ్రహస్ఫుటములను గావించికొని, జననకాలములను సరిగాగుర్తించు నేర్పాట్లుగావించుకొని, జాతకఫలితములను దెలుప మొదలుపెట్టినచో, వారు నూటికినూరుపాళ్లు సత్యమును దెలుపఁజాలి, జ్యోతిశ్శాస్త్రము ప్రత్యక్షబోధకమగు ప్రకృతిశాస్త్రమే (Positive Science) యని నవనాగరకుల నొప్పింపఁజాలుటయేగాక, యింక నప్పటికి వారికి దానియందేర్పడు దృఢవిశ్వాసముచే, నాశాస్త్రముచేఁ దెలియవచ్చు నిహలోకసంబంధములగు ప్రత్యక్షవిషయములు మాత్రమేగాక,యాశాస్త్రమునఁ దెలుపఁబడిన జన్మాంతరలోకాంతరసంబంధములగు సుకృతదుష్కృతవిషయములును, జాతకునియొక్కయు, వానిజన్మకుఁగారణమైన స్త్రీపురుషులయొక్కయు కులభేదరహస్యములునుగూడ తప్పక సత్యములేయని నవనాగరకులను నమ్మింపఁజాలఁగల్గుదురనుట యతిశయోక్తికానేరదని కొంచె మాలోచనశక్తిగల ప్రాజ్ఞు లూహించి తెలిసికొనఁగలరు. అట్టిమర్మములన్నియు జ్యోతిష్కులకుఁ దెలియవచ్చుటకుఁగారణ మాయాజాతకుల జననకాలసమయమున కాయాగ్రహము లాకాశమున నాయాస్థానములందుండుటయేగాక, వేఱొకకారణమును మన నవనాగరకులును, వారిగురువులగు విదేశీయప్రకృతిశాస్త్రవేత్తలును 'దెలుపఁజాలియున్నారా ? ఇందుచే, నాకాశముననున్న గ్రహములకును, బుడమిపైనున్న మానవులకును సంబంధముగలదని తేలుటలేదా ? అంతమాత్రమేగాదు. ఆకాశమందలి యట్టిగ్రహములయొక్క ప్రభావమొక్క మానవులపైనమాత్రమేగాక, పశువులును, బక్షులును, మృగములును మొదలగు చరములపైనను, పైరులును, బంటలును మొదలగు నచరములపైనను, లోహములు మొదలగు నచేతనములపైననుగూడ వ్యాపింపఁగా నందుచే నొక్కొక్కసంవత్సరము కొన్ని జంతువులును, గొన్నిపైరులును వృద్ధినొందుటయును, గొన్నిలోహములును నీరసపదార్థములును ధరలుగల్గియుండుటయును, మఱియొకసంవత్సరము కొన్నిపైరుపంటలు క్షీణించుటయును, గొన్నిజంతుజాలములు నశించుటయును, గొన్నివస్తువులు ధరలుతగ్గిపోయియుండుటయును, నొకప్పుడు భయంకరములగు యుద్ధములును నతివృష్టి యనావృష్టిదోషములును, క్షామములును, మొదలగు దేశారిష్టములు సంభవించుటయును, నీవిధముగ విశ్వమంతయునుగూడ తారుమారగుచుండుటను మనము పంచాంగములవలనఁ బ్రతిసంవత్సరమును దెలిసికొనుచునేయున్నాము. అంతియగాక, యమావాస్యనాఁడు (సూర్యచంద్రులిరువురును నేకస్థానమున నున్నదినమున) నఱికినచెట్లెంతనాణ్యమైనపైననుగూడ పుచ్చిపోవునని యనుభవజ్ఞులగు వడ్రంగులలో వైదికమతస్థులుగాని యితరులుగూడ చెప్పఁగా వినుచున్నాము. అమావాస్యనాఁటి సూర్యరశ్మియే యందులకుఁ గారణమైయుండును. దానికిఁదోడుగ, నోషధుల కధిదేవతయగు చంద్రునిలోనికళలను గృష్ణ

పక్షమునఁ బితృదేవతలు దినమునకొకకళచొప్పునఁ బానము చేయఁగా నమవసనాఁటికిఁ జంద్రుఁడువచ్చి యోషధులందు డాగియుండుననియుఁ, నందుచే నాదినమున నేచెట్టును గాని, యోషధినిగాని, కొనగోటనైనను గిల్లరాదనియుఁ, నట్లుచేసినచో బ్రహ్మహత్య తోడ సమానమగుపాపము సంభవించుననియు, మనవేదశాస్త్రములు చెప్పుచున్నవి. అందుకుఁదోఁడుగ, నమవసనాఁటియెండలో నారఁబోసినధాన్యములు మొదలగునవి పుచ్చిపోవకయుండునని, యనుభవజ్ఞులగు వృద్ధులుచెప్పఁగా వినుచుందుము. వీనినన్నిఁటిని నటుంచిచూచినను, నీకాలమున, వేఱువేఱురంగుల గాజుపాత్రలలోనీరువోసి వానిపై సూర్యరశ్మిపారనిచ్చి, యానీటిని రోగులచేఁద్రావించి, సూర్యరశ్మిచే నాపాత్రలలోని జలములోఁగల్గిన మార్పుయొక్క సహాయమున వివిధరోగములనుమాన్పుచున్న వైద్యశిఖామణులుపలువురు బయలుదేరియుండుటను మన నవనాగరకులలోఁగూడ కొందఱెఱిఁగియేయుండవచ్చును. ఎక్కువకాలము సూర్యరశ్మిలేనిచోట నుంపఁబడుచెట్లు మొదలగు నవిపాలిపోయి చనిపోవుటయును, చెట్లక్రింద బాగుగ సూర్యరశ్మితగులనిచోట నుండు మొక్కలు మొదలగునవి బాగుగ నెదిగిరాకయుండుటయును, మొదలగువిషయములు వృక్షశాస్త్రజ్ఞానముతోఁ బనిలేకయే, సామాన్యమగు లోకజ్ఞానముగలవారందఱికిని దెలిసినవిషయములే!

వీనినన్నిఁటినిబట్టి యాలోచింపఁగా సూర్యచంద్రాదిగ్రహము లాకాశమున నెంతయో దూరముననున్నప్పటికిని, వానికిని, భూమిమీఁదనున్న స్థావరజంగమములకును గొప్ప సంబంధముగలదనువిషయము నిర్వివాదాంశమని బాలురుగూడ గ్రహింపఁగల్గుదురు. ఇట్టి స్థితిలోఁ, గొంత స్వదేశవిద్యాభ్యాసమును, గొంత విదేశవిద్యాభ్యాసమునుగూడ చేసియున్న శ్రీవల్లూరి సూర్యనారాయణరావు, బి. ఏ., బి. యల్., యల్. టీ., గారి వంటి మన నవనాగరకసోదరులుకొందఱు పైనదెల్పియున్నరీతిగ, గ్రహణకాలములందు స్నానము మొదలగునవిచేయుట యసంబద్ధమనియుఁ, నిష్ప్రయోజనమనియుఁ, నాకాశమున జరుగువిషయములకును భూమిపైనున్న మనకును సంబంధముండదనియుఁ వాదించుట యెట్టివివేకమో ప్రాజ్ఞులే యూహించుకొనఁగలరు. ఏమనిన వేదశాస్త్రములమాట యటుండఁ,బైన మేము గనఁబఱచినవిషయములన్నియుఁ లోకానుభవసిద్ధములగు ప్రత్యక్ష విషయములు. అంతియగాక, గర్భిణీస్త్రీలు గ్రహణకాలములలోఁ గదలక మెదలక యుండవలయుననియుఁ, నట్లుకదలినచో వారికి నవయవలోపములుగల (కుంటి, గూని, వంకరయవయవములుగల) బిడ్డలు పుట్టెదరనియుఁ, సర్వసామాన్యముగ లోకు లనుకొను విషయమును గొందఱు గుర్తింపఁజాలకున్నను, నది సత్యమేయని స్వానుభవముచేఁ దెలిసికొనియున్న తల్లులను మనలోఁగొందఱ మెఱిఁగియేయున్నాము. అట్టివిషయములు మన

నవనాగరకసోదరులలోఁ గొందఱియనుభవమున లేనంతమాత్రమున, నట్టివి లోకమున నుండనేయుండవని వారు వాదింపవచ్చెడిచో, వా రతీంద్రియవిషయములగు వేదశాస్త్ర సిద్ధాంతములనుమాత్రమేగాక, లోకానుభవసిద్ధములగు ప్రత్యక్షవిషయములనుగూడ నమ్మ జాలనంతటి జ్ఞానవైభవమునుసంపాదించి, యందు నోలలాడుచుండిరనియు, నందుచే వారికి లోకానుభవముమాత్రమేగాక దానితోఁబాటుగ వివేకముగూడ లోపించియున్న దనియు, లోకమునకు వెల్లడికాదా ? అందుచే, గ్రహణకాలములందు మానవదేహము లపైఁ గల్గుమార్పునుగుఱించి విదేశీయప్రకృతిశాస్త్రజ్ఞులు గనిపెట్టినవని శ్రీస్వాముల వారిచే దెలుపఁబడిన పైవిషయములు సత్యములగుట కవకాశము లేకపోలేదనియు, నందు వలన, వేదశాస్త్రానుసారముగ నాకాలమందుఁ గావింపఁబడుస్నానములు, దానములు మొదలగునవి నిష్ప్రయోజనములు కావలసిన యగత్యము లేదనియుఁ దెల్లమగుచున్నది.

ఈసందర్భమున, సూర్యకిరణములలో సూర్యబింబముయొక్క యంచునుండి వెడలుకిరణములు (Circumferencial rays) మంచివిగావనియు, మనుష్యుల నేత్ర ములకు జబ్బుచేయునవనియు, బింబమధ్యమునుండి వెడలుకిరణములు (Central rays) మిక్కిలి మంచివనియు, మనుష్యదృష్టిని బెంపొందించునవనియు, నవీనపరిశోధనలచే విదేశీయప్రకృతిశాస్త్రవేత్తలు గనుఁగొనిరని శ్రీస్వాములవారు తెలిపి, యీవిషయము మన మాధ్యాహ్నికసంధ్యావందనమందలి సూర్యోపస్థానమునఁ బ్రదర్శింపఁబడు "యమ ముద్ర"చే సూర్యబింబమును జూచువిధానమును జక్కఁగా సమర్థింపుచున్నదని సెలవిచ్చి యుండిరి.

(౫.) "జన్మాంతర"సిద్ధాంతవిషయము:—పాశ్చాత్య ప్రకృతిశాస్త్రవిద్వాంసుల పరిశోధనలచే మన వేదశాస్త్రసిద్ధాంతములును, వైదికమతాచారములును బైన దెలిపిన రీతిగ సమర్థింపఁబడుటయేగాక, కొన్ని ప్రత్యక్షవిచిత్రవిషయములసందర్భమున వానికిఁ దగినప్రకృతిశాస్త్రహేతువు లెంతటికొమ్ములుదిరిగిన ప్రకృతిశాస్త్రవేత్తలకునుగూడ గోచ రింపనందున, నట్టిశాస్త్రజ్ఞులెల్లరును నాలోచించి యాలోచించి వేఱుమార్గము గానరా నందునఁ దుదకు విధిలేక మన వైదికమతసిద్ధాంతములగు కొన్ని యతీంద్రియవిషయము లను నమ్మవలసినవారగుచున్నారు. ఇందుల కుదాహరణముగ, శ్రీస్వాములవా రుపన్య సించిన యొకకథ నీదిగువ వినుపించుచున్నాము:—

పాశ్చాత్యదేశములలో నొకదానియందు * నొకగ్రామమున నొకపాఠశాల

* 'జర్మనీ' (Germany) దేశమునని మాకు విన్నజ్ఞాపకము. ఈకథలోని పాత్రములయొక్కయుఁ బ్రదేశములయొక్కయుఁ బేళ్లనుగూడ శ్రీస్వాములవారు ససాకల్యముగఁ బేర్కొనియేయుండిరిగాని, మాకవి పూర్వపరిచితములుగానందున జ్ఞాప కములేక వినిపింపనేరనందుకుఁ జింతించుచున్నాము.

యుండెనఁట. ఆపాఠశాలలోనియుపాధ్యాయుఁడు దానియందలిబాలురను నేదోయొక యడవికి వినోదార్థముగ విహారమునకు (Excursion) దీసికొనిపోవనెంచి తాను దన గుఱ్ఱముపైపయనమై వెడలెనఁట. వా రట్లా ప్రదేశమును జేరి విహారముపూర్తియైనపిదప నొకచోటవిడిసి విశ్రాంతిగైకొనుచుండిరఁట. ఇట్టి వినోదవిహారములమధ్య విద్యార్థులు చదువును మఱచిపోవుదురేమో యనుభయముచే మధ్యమధ్య విశ్రాంతిసమయములలో వారిచే విద్యాభ్యాసముచేయించుచుండుట మంచిదనియెంచి దానికివలయు పరికరములను గూడ వెంటఁగొనిపోయియున్నందున నాయుపాధ్యాయుఁడచట వ్రాతబల్లను (Black-board) నిలువఁబెట్టి తాను దానిపై లెక్కలనువ్రాయుచు వానిని బాలురచే గుణింపఁ జేయుచు, వారికి నంకగణితము (Arithmetic) బోధించుచుండెనఁట. ఇట్లుచేయుచుం డఁగా మధ్యలో, నచటి కనతిదూరమున నెదురుగ నొకచెట్టునకుఁ గట్టివేయఁబడియున్న యాయుపాధ్యాయునియొక్కగుఱ్ఱ మెందువలననో గిలగిల తన్నుకొనుచుండెనఁట. అది చూచి యాయుపాధ్యాయుఁ డాతురతఁజెంది దాని కేమియాపదవచ్చెనో కనుఁగొనఁ దలఁచి యదియున్నయెడకు బఱువెత్తి చూడఁగా నాగుఱ్ఱ మింతలో గంతులువైచుట మాని స్వస్థతఁజెంది నిలిచియుండెనఁట. అట్లు జరుగుటకుఁగారణ మరయఁగోరి యాయన యచట నన్నియెడలనుబరికించి యెచటను నేమియువిశేషము గానరానందున నిందూ ఘాలోచించియు, నేమియుఁ దెలియరాకపోవుటచే, నెట్టైననేమి గుఱ్ఱము స్వస్థతఁ జెందెనుగదాయని సంతసించి వెడలివచ్చెనఁట. వచ్చి, బాలురకు మరల గణితమును బోధించుచుండఁగా మధ్యలో, నాగుఱ్ఱము తిరిగి మునుపటివలెనే చిందులుద్రొక్క మొదలుపెట్టెనఁట. అదిచూచి, యాయన మరల నేమిమూడెనోయని గుఱ్ఱమున్నయెడకు బరువెత్తి చూచునంతలో నది మునుపటివలెనే స్వస్థతఁజెంది నిలువఁబడెనఁట. అందులకుఁ గారణము మరలఁ బరికించియు, నేమియుఁదెలియరానందున నతఁడు తిరిగి వెళ్లవలసిన వాఁడాయెనఁట. అట్లువెళ్లి తిరిగి బాలురకు గణితమును వ్రాతబల్లపైవ్రాసి బోధించుచుం డఁగా గుఱ్ఱము మునుపటివలెనే మరల మూఁడవసారి తన్నుకొననారంభించెనఁట. అది చూచి యాయన యచ్చెరువడి మరల నదియున్నయెడకుఁ బరువిడిచూడ, నంతలో నది మునుపటివలెనే స్వస్థతఁజెందియుండెనఁట. అందుచే నాయుపాధ్యాయుఁ డందుల కేదియో గట్టికారణముండవలయునని నిశ్చయించికొని, మునుపటికంటె మఱింత పట్టుదలతో దానిని దెలిసికొన బ్రయత్నించికూడ, యెంతపాఁటుఁబూచినను నేమియుఁ గానరానందునను, నెంతయాలోచించినను నేమియుఁ దెలియరానందునను, విసివి, దానికి బాహ్యసంబంధమగు (ననఁగా వెలుపలికిఁ దెలియవచ్చెడి) కారణమేమియుంలేదనియు, లోపలిబాధ (కడుపునొప్పి, కాలునొప్పి, మొదలగునది) యేదియో యుండవచ్చుననియు,

నందుచే నాగుఱ్ఱ మావిధముగ మధ్యమధ్య యస్వస్థతఁ జెందుచు బాధపడుచున్నదనియు నిశ్చయించుకొని, దానికిఁ జికిత్సచేయువిధ మేమియోయని యాలోచింపుచు నట్లే కొంతతడవు నిలిచియుండెను. కాని, యాతఁ డట్లెంతతడవు నిలిచియున్నను గుఱ్ఱము తిరిగి తన్నుకొనక యట్లే స్వస్థతగా నిలువఁబడియుండెను. అట్లు మఱికొంత సేపు పరికించి కూడ, గుఱ్ఱము తన్నుకొనులక్షణము లేమియుఁ గానరానందున, దానికివచ్చినబాధ యేదియో యామూఁడవసారితోఁ దొలఁగిపోయినదనియు, నందుచేత నే యెంత సేపు చూచినను గుఱ్ఱము తిరిగి తన్నుకొనుట మానివేసినదనియు నతఁడు గట్టిగా నిశ్చయించుకొనెను. కావునఁ దానికిఁ జింతింపబనిలేదనినమ్మి యతఁడువెళ్లి, కొంత సేపటికి బాలురకుఁ దిరిగి మునుపటివలెనే గణితమును బోధించుటకై వ్రాతబల్లపై లెక్కలనువ్రాసెను. తోడనే గుఱ్ఱము తిరిగి మునుపటివలెనే చిందులుద్రొక్క మొదలుపెట్టెను. ఆయుపాధ్యాయు డదిచూచి నివ్వెరపోయి, యాగుఱ్ఱ మట్లు తన్నుకొనుటకుఁగారణము తానిదివఱ కూహించినదేదియుఁ గాదనియుఁ, దాను వ్రాతబల్లపై వ్రాసినపుడెల్లను గుఱ్ఱము తన్నుకొనుచున్నట్లగపడుచున్నందునఁ దానట్లు వ్రాయుటకును, గుఱ్ఱ మారీతిని దన్నుకొనుటకును నేదియో సంబంధ ముండవచ్చుననియు నూహించి, యైనను దనయూహ యెంతవఱకుసత్యమో పరీక్షింపఁగోరి, మధ్యమధ్య వ్రాతబల్లపైఁ గొంత సేపువ్రాయుచుఁ, గొంత సేపుమానుచు, నీవిధముగఁ బరీక్షింపఁదొడఁగెను. మొత్తముమీఁదఁ, దానట్లు వ్రాసినపుడెల్లను నాగుఱ్ఱ మట్లు తన్నుకొనుటయుఁ, దాను వ్రాయమానినపుడెల్లను నది నిశ్చలముగ నిలిచియుండుటయు లెస్సగ గ్రహించి, దాను బల్లపైవ్రాయుచుండుటయే గుఱ్ఱముతన్నుకొనుటకుఁ గారణమనియు నారెంటికిని నేదియో మిక్కిలి గట్టిసంబంధ ముండితీరవలయుననియు నాతఁ డెట్టకేలకు గట్టితీర్మానమును గావించుకొనెను.

అట్లు నిశ్చయించికొని యంతటితోనిలువక, యాసంబంధమెట్టిదో యెఱుఁగఁ గోరి యందులకుఁ వలయుబరీక్షలు ప్రారంభించెను. బల్లపై యొకలెక్కనువ్రాసి గుఱ్ఱము వైపుచూడఁగా, నది తొలుతఁ గొన్నిసారులు ముందరికాళ్లపై నెగిరిపడుటయుఁ బిదప మఱికొన్నిసారులు వెనుకకాళ్లపై నెగిరిపడుటయుఁ గానిపించెనఁట. మఱియొకసారి బల్లపై వేఱొకలెక్కవ్రాసి పరీక్షింపఁగా, గుఱ్ఱము మొదట ముందరికాళ్లపై వేఱొక కొన్నిసా ర్లెగురుటయుఁ, బిదప వెనుకకాళ్లపై మఱికొన్నిసార్లు లేచిపడుటయుఁ గానవచ్చెనఁట. మరల వేఱొకలెక్కను వ్రాసిచూడఁగా, నట్లే కొన్నిసారులు ముందరికాళ్లపైనను, గొన్నిసారులు వెనుకకాళ్లపైనను, లేచుచు వేఱువేఱులెక్కలువ్రాసినపుడు, వేఱువేఱుసారులు గంతులువైచుట కాన్పించెనఁట. అందుచే, గుఱ్ఱ మెప్పుడును నొక్కటే తీరున దుముకుటలేదనియు, వేఱువేఱులెక్కలు వ్రాసినపుడు వేఱువేఱుసారులు వేఱు

వేఱుకాళ్లపై నెగిరిపడుచున్నందునఁ దానువ్రాయులెక్కలకును గుఱ్ఱమువైచు గంతులకును నేదియో యవినాభావసంబంధమున్నదనియుఁ నిశ్చయించుకొని యాయుపాధ్యాయుఁడు తానువ్రాయులెక్కలను గుఱ్ఱము పెట్టుగంతులను మిక్కిలిజాగ్రత్తతో గుర్తించుచు, నా రెంటికిని సంబంధమూహింప మొదలుపెట్టి వ్రాతబల్లపై 3 అను నంకెనువ్రాసి, యటుపై గుణకారచిహ్నమును (×-mark) వ్రాసి, యటుపై 9-యను నంకెనువ్రాసి గుఱ్ఱము వైపుచూడఁగా నది తొలుత ముందరికాళ్లపై రెండుమారులు లేచిదుమికి యటుపై వెనుక కాళ్లమీఁద నేడుసారులుదూకి నిలిచిపోయెనఁట. అప్పు డాయుపాధ్యాయుఁ డాగుఱ్ఱము వైచినగంతులను లెక్కించి జ్ఞాపకముంచుకొని, యటుపై యావ్రాతబల్లమీఁదనున్న లెక్క వైపుపాఱఁజూచి పర్యాలోచించి, 3-ను 9-చే గుణింపఁగా 27 వచ్చుననియు, నందు లోని మొదటియంకెయగు రెండును దెలుపుటకై గుఱ్ఱము తనముందరికాలిపై రెండు సారులు లేచిదుమికి, యవతలియంకెయగు 7-ను దెలుపుటకై తరువాత వెనుకకాలిపై నేడుసారులు దుమికియుండవలయుననియుఁ దలంచెనఁట. ఐనను దనయూహ యెంత సత్యమో యెఱుఁగఁగోరి, బల్లపై యాలెక్కను దుడిచివైచి, "8×4" అను లెక్కను వ్రాసి గుఱ్ఱమువైపుచూడఁగా, నది ముందుగా మూఁడుసారులు ముందరికాలిపైయెగిరి దుమికి, యటుపై వెనుకకాలిపై రెండుమారులు దుమికి నిలిచిపోయెనఁట. 8-ని 4-చే గుణింపఁగా 32 వచ్చునుగావున నందలి యంకెలను దెలుపుటకై గుఱ్ఱము దుమికినదుముకులు సరిపోవుట నుపాధ్యాయుఁడుగుర్తించి, తన నిశ్చయమును దృఢపఱచుకొనుటకై గుఱ్ఱముచే మఱికొన్నిలెక్కలను జేయించి పరీక్షించి సంతసించెనఁట.

అంతటితోనిలువక దానితెలివితేటల నింకను దెలిసికొనఁగోరి, యింతవఱకును రెండంకెలజవాబు (2-digits-answers) గల లెక్కలనే వ్రాయుచుండుటచే ముందరి కాళ్లతోడను వెనుకకాళ్లతోడను గుఱ్ఱము ప్రత్యుత్తరమిచ్చుచున్నదనియు, దాని కా రెండువిధములగు కాళ్లునుదప్ప వేఱుగ మూఁడవవిధమగు కాళ్ళులేనందున, మూఁడంకెల ప్రత్యుత్తరముగల లెక్కలనువ్రాసినచో గుఱ్ఱ మెట్లు తెలుపునో చూతమనియు నతఁడు తలంచి, యట్టిలెక్కలనుగూడ వ్రాతబల్లపైవ్రాసి, (ఉదాహరణము: 12×9=144 అగు టచే నిందలి ప్రత్యుత్తరమున మూఁడంకెలున్నందున "12×9" అని బల్లపైవ్రాసి) గుఱ్ఱమువైపుచూడఁగా నది ముందరికాలిపై యొకసారి లేచిదుమికి, పిదప వెనుకకాలిపై నాల్గుసార్లుదుమికి, తిరిగి మరల ముందరికాలిపై నాల్గుసారులుదుమికి సరియగుప్రత్యుత్తరమిచ్చుటచే నాయుపాధ్యాయుఁ డబ్బురపడెనఁట. అతఁ డంతటికిని దనివిఁజెందక, యంకెలను దెలుపు ప్రత్యుత్తరములుగల లెక్కలనువ్రాయుటచే గుఱ్ఱము ముందరికాళ్ల తోడను, వెనుకకాళ్లతోడను, దిరిగి ముందరికాళ్లతోడను, మరల వెనుకకాళ్లతోడను,

నిట్లెన్ని యంకెలుగల ప్రత్యుత్తరములనైనను నంకెలను నొకదానితోనొకటి గలిసిపోనీ యక వేఱుపఱచి తెలుపఁజాలియున్నదనియు, నంకెలకుమారుగ 'సున్న' (0) వచ్చెడి ప్రత్యుత్తరములుగల లెక్కలనువ్రాసినచో గుఱ్ఱ మేమిచేయునో చూతమనియు నాలోచించి, ప్రత్యుత్తరములో 'సున్న' వచ్చెడిలెక్క నొకదానిని (ఉదాహరణము: "13×8" =104 అగుటచే నిందలి ప్రత్యుత్తరములో 'సున్న' యున్నదిగదా!) బల్లపై వ్రాయఁగా నాగుఱ్ఱ మాలెక్కయొక్క ప్రత్యుత్తరమందలి యంకెలను దెల్పుపవలసిన చోట మునుపటివలెనే కాళ్లపైనెగిరి దుమికి తెలుపుచు, 'సున్న'ను దెలుపవలసిన స్థానమున నట్లుదుముకక, కాలినిబైకెత్తి శబ్దముకాకుండునట్లు మెల్లఁగాదింపివైచి, యాస్థానమున నేమియు లేదనుభావమును (ననఁగా, 'సున్న' యున్నదనునభిప్రాయమును) సువ్యక్తపఱచెనఁట!

ఇట్లు తనగుఱ్ఱము నన్నివిధములఁబరీక్షించి, దానిచేఁ దగినన్నిగుణకారములును, భాగహారములును, గూడికలును, దీసివేతలును మొదలగు పెక్కువిధములగు లెక్కలను జేయించిచూచి, తనగుఱ్ఱ మెట్టిలెక్కలనైనను దనవిద్యార్థులకంటెనుగూడ ముందుగఁ జేసివైచి ప్రత్యుత్తర మీయఁజాలియున్నదని బాగుగ గ్రహించి, నిశ్చయించుకొని, యటనుండి బయలువెడలి స్వగ్రామముచేరి, తనకు లెక్కలనుజేయ నేర్చిన గుఱ్ఱమున్నదనియుఁ, జూడఁగోరువారు తానువిధించినసుంకమును (Ticket rate) చెల్లించి చూడవచ్చుననియుఁ బ్రకటించుకొని, తనయుపాధ్యాయపదవికి 'రాజీనామా' (Resignation) నిచ్చి, తనగుఱ్ఱమును వెంటఁబెట్టికొని యూరూరను దిరుగుచు, నావిధముగఁ దగినంతధనమునుసంపాదింప మొదలుపెట్టెనఁట. ఆవార్త దేశమంతటనువ్యాపించి, ప్రజలనేకులుచూడరాఁగా, వారివలన ధనముదీసికొని, యాగుఱ్ఱముయొక్క యభిప్రాయముల నెఱుఁగుట కవసరమగు సాంకేతికములను (అనఁగా నది ముందరికాళ్లపైనను, వెనుకకాళ్లపైనను వేఱువేఱుగదుముకుట మొదలగుసుఱుతులను) ముందుగ వారికిఁ దెలియఁజెప్పి, యటుపై వారియిచ్చవచ్చినరీతిని బరీక్షింపనిచ్చి, యన్నిపరీక్షలకును గుఱ్ఱము సరిగా నిలువఁజాలియుండుచురాఁగా, నాయుపాధ్యాయుఁ డావిధముగఁ గాలముగడపుచుండెను. ఆగుఱ్ఱమున కాయుపాధ్యాయునియూరిపేరే పెట్టి, ఫలానియూరిగుఱ్ఱమని యందఱును వ్యవహరించుచురాఁగా, నావార్త యాదేశమందుమాత్రమేగాక యాఖండమందలి చుట్టుప్రక్కల దేశములందంతటను గ్రమక్రమముగ వ్యాపించుచువచ్చెను.

అంతట నాదేశములయందలి ప్రకృతిశాస్త్రవేత్తలును, బ్రకృతి శాస్త్రపరిశోధకులును, శిష్యులును మొదలగు వారికందఱికిని నావార్త చెవినిసోకినందున, వారందఱును జేరి యాలోచించుకొని, యాగుఱ్ఱమున కెట్టిశక్తిగల్గుట కేదిహేతువో తగినప్రకృతిశాస్త్ర

హేతువొకటి గట్టిగానుండితీరవలయుననియుఁ గావునఁ దాము దానినిబరీక్షించి యా హేతువును గనిపెట్టవలయుననియు నిర్ణయించుకొని, యదియున్న యెడకేగి, చేయఁ దగిన కఠినపరీక్షలన్నియుఁ జేసిచూచి, ప్రకృతిశాస్త్రసంబంధమగు గారణమేమియుఁ గానరానందునఁ, దుట్టతుద కందఱును జేరి యాలోచించుకొని, యాగుఱ్ఱము పూర్వజన్మమున నొకగొప్ప గణితశాస్త్రవిద్వాంసుఁడు (Mathamatics Professor)గ నుండి తీర వలయుననియును, గాని, యనివార్యమును బలవత్తరమునునగు నేదియో యొకప్రారబ్ధ కర్మకులోనై యాతఁ డీజన్మమున నీరీతిగ గుఱ్ఱమై పుట్టవలసివచ్చినదనియు, నైనప్పటి కిని, గతజన్మమందలి విద్యాసంస్కారమూరకపోక యాగుఱ్ఱమం దిపుడీరీతిని నిలిచి యున్నదనియుఁ, గాని నోరులేనిజంతువగుటచేఁ దన గణితశాస్త్రజ్ఞానమును వేఱురీతిగ వెల్లడింపనేరక, తన తెలివి నుపయోగించి యీరీతిని బ్రకటించుచున్నదనియు నేకగ్రీవ ముగ నిశ్చయించుకొని యందుమూలమున జన్మాంతరసిద్ధాంతము నంగీకరింపవలసినవారైరఁట !!

దీనినిబట్టిచూడఁగా, నీప్రకరణముననే లోగడ, "నితరజన్మముకలదనుటకు వేద శాస్త్రప్రమాణము" లను శీర్షికక్రిందఁ, బరమశివుఁడు శ్రీమహావిష్ణువుతోఁ జెప్పెనని మేము గనఁబఱచియున్న

శ్లో. యేషామస్తి పరిజ్ఞానం వినైవ జ్ఞానసాధనమ్,
కల్ప్యం తత్సాధనం తేషాం పూర్వజన్మసు సూరిభిః.

యను సూతసంహితావాక్యము చక్కగ సరిపోవుటలేదా? [అనఁగా, "నీజన్మ మున నెట్టికృషియుం సలుపకయే జ్ఞానమునొందియున్నవారి కాజ్ఞానమునొందుటకు వలయుసాధనములు వారివారి పూర్వజన్మములందే లభ్యపడియుండు" నని యర్థము.

౬. ఆత్మయొక్క సర్వజ్ఞత్వవిషయము:—పాశ్చాత్యదేశములలో *నొకదాని యందు నొకబాలికకుఁ దీవ్రమగుజబ్బుచేసి చచ్చి బ్రదికినంతపనియై యెట్లో కష్టము మీఁద నెమ్మదించినదఁట. ఆజబ్బుపడి లేచినప్పటినుండియు నాబాలిక, యంతకుముందు తానెన్నఁడును గనివినియెఱుఁగని యితరదేశభాషలనుఁ బెక్కింటి ననర్గళముగ మాట్లాడ గలసామర్థ్యమును బొందెనఁట. అవి నిజమగుభాషలో, కాక, యాజబ్బుచేఁగల్గిన పిచ్చి ధోరణియో యని శంకించి యాబాలికయొక్కబంధువు లాయాభాషల నెఱిఁగినవారిని బిలిపించి వారిచే నాబాలికను బరీక్షచేయించి, యది పిచ్చిధోరణికాదనియు, నాబాలిక యాయాభాషలను సువ్యక్తముగ మాట్లాడఁజాలియున్నదనియు, వారు తెలిసికొని

*ఫ్రాన్స్ (France) దేశమున నని విన్న జ్ఞాపకము.

యచ్చెరువొందిరట. ఆవార్త ప్రకృతిశాస్త్ర పరిశోధకులగు కొందఱివఱకును వ్యాపింపఁగా వారువచ్చి యన్నిపరీక్షలును జేసిచూచి, యందులకుఁదగిన ప్రకృతిశాస్త్రసంబంధమగు హేతువేమియుఁ గానరానందున, నన్నిశరీరములందలి జీవుఁడును స్వాభావికముగ నాత్మస్వరూపుఁడగు సర్వజ్ఞుఁడును, సర్వాంతర్యామియునై యుండుననియుఁ బ్రకృతి (యవిద్యా) సంబంధమగు నావరణముచే గప్పఁబడినవాఁడై, తన సర్వజ్ఞత్వమును సర్వాంతర్యామిత్వమును మఱుగుపడఁగా నల్పజ్ఞుఁడగు సామాన్యజీవుఁడై యుండుననియు, నాబాలికపడిన గొప్పజబ్బుచే శరీరమున నేర్పడినమార్పువలన నవిద్యాసంబంధమగునావరణము కొంతతొలఁగి చనియుండుననియు, నందుచేఁ గొంత క్రొత్తజ్ఞానము తనయంతటనే బయలువడి యుండవచ్చుననియుఁ సిద్ధాంతము గావించిరఁట!§

## (౭) వేదస్వరములు: శబ్దశక్తి

## (VEDIC ACCENTS AND THEIR PSYCHIC EFFECT)

వీనినిగుఱించి శ్రీస్వాములవారు, మద్రాసు 'పార్క్-టౌన్'లోని శ్రీస్కంద స్వామివారి వసంతమంటపభవనమందలి యుపన్యాసమునఁజెప్పిన సామాన్యవిషయములను, వానినిగుఱించినవిశేషములను వీలుననుసరించి సాధ్యమైనంతవిపులముగ వేఱొక యుపన్యాసమున వినిపించెదమని చెప్పినవిషయమును, "ధర్మరాజ్య" పత్రికనుండియెత్తి, లోగడ "ధర్మాధర్మములకు మూలము ప్రకృతిశాస్త్రహేతువులు (Scientifin Reasons)కావా?" యనుశీర్షికక్రిందఁ గనఁబఱచియేయుంటిమి. ఇఁక వారు మైలాపూరు సంస్కృతకళాశాలయందుఁ గావించినయుపన్యాసమున వీనినిగుఱించి తెలిపిన విశేషముల నిచట వినిపించెదము.

'ఫ్రాన్సు' (France) దేశమునఁ బ్రకృతిశాస్త్రపరిశోధకురాలగు నొకస్త్రీ* తన 'పరిశోధన కార్యాలయము' (Research Laboratory) లో నేవియో కొన్ని పరిశోధనలు చేయనెంచి యందులకుఁ గావలయుపరికరములను (Apparatus) సమకూర్చి, తనకు సహాయముజేయుమఱియొకరు వచ్చుట యాలస్యమైనందున వారికై

§ సర్వజ్ఞత్వము మాయాసంబంధముమాత్రమేయనియు నాత్మసంబంధముగాని, యవిద్యాసంబంధముగాని కాదనియు, మొదలగువిషయముల నీగ్రంథమున 166, 167, 168, 169 పుటలలోఁ జూడుఁడు.

* శ్రీస్వాములవారు, పైనదెలిపిన "వసంతమంటపోపన్యాసమున" 'స్వరము'లను గుఱించి ముచ్చటించుసందర్భమునఁ బేర్కొనిన 'ఫెనెలాంగ్-దొరసాని' (Madam Fenelon) యే యీస్త్రీయొక్క పేరైయుండునని మాకు విన్నజ్ఞాపకము:

నిరీక్షించుచు నింతలో నాభవనమున నే మఱియొక ప్రక్కనున్న పడకకుర్చీలోఁబండు కొని, వినోదముగ నేదియో సంగీతముపాడుకొనుచుఁ గొంతసేపు గడపి, తానువేచి యున్నమనుష్యుఁ డెంతతడవునకును రానందున నతఁడు వచ్చుచుండెనో లేదో చూడఁ గోరి మేడదిగుటకై మెట్లవైపుపోఁబోయెనఁట. ఇంతలో నచట ప్రకృతిశాస్త్రపరిశోధన యంత్రముచెంత నమర్చియున్న యొకవ్రాతబల్ల' (Black board) పై కొన్ని యర్థము లేని పిచ్చిగీతలు కనఁబడెనఁట. ఆగీత లెవరుగీచిరని యామెకు సందేహముగల్గి, తాను గీచినట్లు జ్ఞాపకములేకపోయినను నపు డచట వేఱెవరునులేనందున నంతకుముందే యా గీత లెవరైనను గీచియుందురనియుఁ గాని తానే యొకవేళ వానినిగుర్తింపక మఱచి పోయి యుండవచ్చుననియుఁదలఁచి, యావ్రాతబల్ల వేఱొకకార్యమునకై, యుద్దే శింపఁబడియున్నందునఁ దానపు డాపిచ్చిగీతలను దుడిచిపాఱవైచి, మేడక్రిందికిఁ బోయిచూచి యామనుష్యుఁడు గానరానందునఁ దలుపు గడియవైచి తిరిగి పైకివచ్చి, మునుపు కూర్చొనినకుర్చీలోనే పండుకొని మరల కొంచెము సేపు వేడుకగా సంగీతము పాడఁ దొడఁగెనఁట. అప్పటికిని నామనుష్యుఁడు రానందున, నైన నీయొక్కసారియుఁ క్రిందికిఁబోయి చూచివచ్చి యతఁడు వచ్చుజాడ కానరానిచో నిరాశచేసికొని తనపని తానే జరుపుకొననిశ్చయించి, కుర్చీలోనుండిలేచి పోఁబోవుచుండ, నావ్రాతబల్లపై వెనుకటివలెనె పిచ్చిగీతలు కానవచ్చెనఁట. క్రిందటిసారివలెఁగాక, యంతకుముందు తానాబల్లను దుడిచివచ్చినసంగతి యీసారి బాగుగ జ్ఞాపకమున్నందునను, మేడపై తానుదప్ప వేఱెవరును లేరనుసంగతి తనకు లెస్సగఁ దెలిసియున్నందునను, నీసారి యాగీతలనుజూచినతోడనే యామె దిగ్భ్రాంతిఁజెంది యచటనే నిలిచిపోయి యా గీతలు గీచినవారెవరని యాలోచింపఁ దొడంగెనఁట. తాను నిరీక్షించుచున్నమనుష్యుఁడే యొకవేళ వచ్చియుండి వేడుకకుఁ దననాడించుటకై యాగీతలను గీచిపోయి పైననో క్రిందనో యేమూలనైనను డాగియుండెనేమోయని యామెకు సంశయము గల్గెనఁట. అందుచే నచట నాల్గుమూలలును వెదకి యెవరును గానరానందునఁ క్రిందికి దిగిపోవ నెంచునంతలోఁ, దాను మేడక్రిందితలుపు గడియవైచినసంగతి జ్ఞప్తికివచ్చెనఁట, కావున నిఁక నామనుష్యుఁ డెట్లు రాఁజాలుననియు, నతనికై వెదకుట యనవసరమనియుఁ దలంచెనఁట. కాని యొకవేళ తాను క్రిందితలుపు గడియవేయకయే, గడియవైచితినని యనుకొని పొరపడియుండవచ్చుననియు, నందుచే నామనుష్యుఁడు వచ్చియుండి క్రింద నేమూలనైనను దాగియుండవచ్చుననియుఁ, గావున వెదకుదమనియుఁ దోఁచి నందున మేడక్రిందికి దిగిపోయి యచటఁ దలుపు గడియవైచియే యుండుటనుజూచి, యచట నలుప్రక్కలనువెదకి యెవ్వరును గానరానందున నాలోచించుచుండునంతలో

దయ్యములుండుననియు, నవి యెవ్వరికిని గానరాకయే పెక్కుచిత్రములను జేయుచుండుననియు జను లనుకొనుసంగతి జ్ఞప్తికివచ్చుటచే నామెకు భయముచేఁ గాళ్లు వడఁక దొడంగెనఁట. కాని, యాసిద్ధాంతమునం దంతకుముం దెట్టివిశ్వాసమును లేనిదగుటచే నంతలో ధైర్యము తెచ్చుకొని, మెల్లగా పైకివచ్చెనఁట. అపు డించుకసేపాలోచించి, తానూరక యనవసరముగ లేనిపోనిభయములను ననుమానములను దెచ్చిపెట్టుకొనుచుంటిననియుఁ గ్రిందటిసారి తాను గీతలనుదుడిచివైచినపు డేదేని పరధ్యానముచేఁ బూర్తిగాఁ (బాగుగాఁ) దుడిచివైచి యుండకపోవచ్చుననియు, నందు మిగిలిన గీతలే యిపుడు బల్లపై గానవచ్చుచుండుననియు, మేఁడపైన దానుకప్ప వేఱెవ్వరును లేనిమాట వాస్తవమనియు, దయ్యములుండుననుమాటయు, నవి గీతలు గీయుననుమాటయు నసలే యబద్ధములనియుఁ దలపోసికొని, గుండె నిబ్బరముచేసికొని యెట్టకేలకు నాగీతలను బాగుగ దుడిచి పారవైచి, యీసారి మొదటఁగూర్చొనిన కుర్చీలోఁగాక యావ్రాతబల్లకుఁ జేరువనేయున్న వేఱొకకుర్చీలోఁజేరి కొంతతడ వేమేమియో తలపోయుచు నట్లేకూరుచొని యాబల్లవైపు చూచుచుండెను. ఇట్లు కొంతసేపు గడచిన పిదప వెనుకటిసంగతులు క్రమముగ మఱపునకువచ్చుటచే నంతలో నామె మరలఁ గొంచెముసేపు వేడుకగ సంగీతము ప్రారంభించెను. అట్లు పాడుచుండఁగా, నావ్రాతబల్లచెంత నమర్చియున్న 'విద్యుచ్ఛక్తి' తీఁగెలకుఁజేరియున్న సీమసున్నపుముక్కలు (Pieces of chalk) కదల నారంభించి యావ్రాతబల్లపై పిచ్చిగీతలుగీయ నారంభించెనఁట. వేఱొకపరిశోధనకై యమర్పఁబడియున్న యాపరికరములు తలవనితలంపుగ నారీతిని జేయుటనుజూచి యామె నివ్వెరపడి, వెఱగుపడి, తటాలున సంగీతమును నిలిపివేయఁగా, నాతీఁగెలుకూడ, కదలుటయు గీట్లుగీయుటయు మానివైచి నిలిచిపోయెనఁట. అదిగని యామె యాలోచనప్రారంభించి, తాను పాడినసంగీతమునకును నాతీఁగెలట్లుకదలుచు గీట్లుగీయుటకును నేదియో సంబంధముండవలయుననియు, నిదివఱకు రెండుసారులును వ్రాతబల్లపై గీట్లుగీయఁబడియుండుటకుఁగూడ తానిదివఱలోఁ బాడిన సంగీతమును, నాతీఁగెలునే కారణమైయుండుననియు నూహించి, యైనను దనయూహ యెంతవఱకుసత్యమో పరీక్షింపఁదలఁచి, తిరిగి మెల్లఁగా సంగీతమదియ నారంభించెనఁట. తోడనే యాతీఁగెలుగూడ మెల్లఁగాఁ గదలుటకును గీట్లుగీయుటకును మొదలిడెనఁట. అటుపై యామె సంగీతముయొక్క వేగమును, గొంతును, గొంచె మెచ్చించెనఁట. అంత నాతీఁగెలుగూడ కొంచెము వేగముగను స్ఫుటముగను గీతలుగీయ నారంభించెనఁట. అంతపై యామె సంగీతమునుడింపఁగా నాతీఁగెలవేగమును దగ్గి సంగీతము పూర్తిగ నిలిచినతోడనే తీఁగెలచలనముగూడ పూర్తిగ నాగిపోయెనఁట. కాఁబట్టి తానుపాడు సంగీతధ్వనిచే గాలిలోఁగల్గిన సూక్ష్మసంచలన మాతీఁగెలకుసోకి వాని నట్లు కదలించుచుండెననియుఁ, గావున శబ్దముచే గాలిలోఁగల్గుచలనముచే నట్టిగీతలేర్పడు ననియు నామె నిశ్చయించెనఁట.

హిందువుల (అనఁగా మన వైదికమతస్థుల) లోని బ్రాహ్మణులు తమ మతగ్రంథ మగు వేదమును బలువిధములగు స్వరభేదములతోఁజేర్చి చదివెదరని యంతకుమునుపెన్నఁడో యామె తనగ్రంథాలయము (Library) లోని సర్వశాస్త్రగ్రంథము (Encyclopædia) లోనో, మఱి యేగ్రంథముననో చదివియుండెనఁట. ఆసంగతి యీపట్టున నామెకు జ్ఞాపకమువచ్చి, హిందువులవేదములోని స్వరభేదమున నేదైనను విశేష ముండవచ్చుననియుఁ గావున నట్టివేదమును దనపరిశోధనయంత్రముచెంతఁ జదివించి యందుచే వ్రాతబల్లపై యెట్టిగీత లేర్పడునో చూడవలయుననియుఁ నామెకుఁ గోరికగల్గెనఁట. అందుచే వేదమునేర్చిన బ్రాహ్మణునికొఱకు శామె వెదుక మొదలు పెట్టెనఁట. ఆమెయొక్క పరిశోధనకార్యాలయమునకుఁ జేరియున్న ప్రకృతిశాస్త్ర పాఠశాలలో వంగదేశీయ (Bengal) బ్రాహ్మణ విద్యార్థి యొకఁడుండుట నామె తెలిసికొని వానికడకువెళ్లి 'నీకు వేదమువచ్చునా?' యని వానిని బ్రశ్నించెనఁట. తమరిది 'సామవేద' మనియుఁ, దనతండ్రియును దాతలును వేదాధ్యయనసంపన్నులే యనియును గాని, తానుమాత్ర మీపాశ్చాత్య విద్యలోఁ బ్రవేశించినందున వేదము నేర్చికొనలేదనియుఁ నతఁడు చెప్పెనఁట. 'నీకు వేదమంతయును రాకున్నమానె, నందులోఁ గొంతయైనను రాదా? కాకున్న, దానియం దొక మంత్రమైనను రాదా?' యని యామె మరలఁ బ్రశ్నించెనఁట. తనకుఁ గొంచెముకూడ వేదము రాద నియుఁ, దానికి సంబంధించినమంత్రము లేవియోకొన్ని తనకు 'సంధ్యావందనము'నఁ జిన్ననాఁడు నేర్పిరనియుఁ గాని, తాను సంధ్యావందనమును జేయుట చాలకాలము నుంచియుం మానివేసినందున నామంత్రములుగూడ మఱచిపోతిననియుం నతఁడు చెప్పె నఁట. అటుపై యామె, "మంత్రములన్నియుం జ్ఞాపకము లేకున్నమానె, నందొకటి యైననుగాని, కాకున్న నందొక పాదమైననుగాని, జ్ఞాపకము లేదా?" యని మరల నడిగెనఁట. అందొక యక్షరముగూడ జ్ఞాపకములేదని యతఁడు చెప్పెనఁట. "పోనిమ్ము; ఆమంత్రములు రాకున్నమానె, తుదకు మీమతసంబంధమగు శ్లోకములు మొదలైన వేమియునుగూడ రావా?" యని యామె యడిగెనఁట. చిన్ననాఁడు చదివికొన్న స్తోత్రమేదియో కొంచెము కొంచె మచ్చటచ్చటఁ దుంపులు తుంపులుగా జ్ఞాపకమున్నదనియుం, నదియైనను వరుసగా నంతయుఁ రాదనియుం నతఁడు ప్రత్యుత్తర మిచ్చెనఁట. ఐనను జాలును లెమ్మని యామె యతనిని దనయంత్రముకడకుఁ దీసి కొనిపోయి, యాస్తోత్రము నెట్లో వచ్చినట్లే జదువుమనెనఁట. అంతట నాతఁడు "కాశికాపురాధినాథకాలభైరవం భజే" యనుమకుటము (పల్లవి) గల్గి, శ్రీశంకరా చార్య విరచితమగు 'కాలభైరవాష్టకము' లోని శ్లోకములనుజదువ మొదలు పెట్టఁగాఁ,

బైన దెల్పిన తీఁగెలు చలింప మొదలుపెట్టి వ్రాతబల్లపై గీతలు గీయఁదొడంగెనఁట. ఆస్తోత్రమైనను నతనికి సరిగా రానందున, వెనుకశ్లోకములను ముందును ముందటి శ్లోకములను వెనుకను, గొన్నిఁటిని మఱచిపోయినందున నడుమనడుమ విడచివైచియు, నెట్లెట్లో స్తోత్రమును గష్టముమీఁదఁ బూర్తిచేయఁ గల్గెనఁట. అది పూర్తియగుసరికి వ్రాతబల్లమీఁదఁ జూడఁగా, నెత్తిపై జటాభరణమును, గంగయుఁ, జంద్రుఁడును, మెడలోఁ గపాలమాలయు నాగాభరణమును, జేతులలోఁ ద్రిశూలము మొదలగు నాయుధములును, నీమొదలగు చిహ్నములతోఁగూడిన శివస్వరూపము చిత్రింపఁబడియుండెనఁట. అదిచూచి యామె యబ్బురపడి యంతటితోఁ దనివినందక, యింక నేమైనను స్తోత్రములువచ్చినఁ జదువుమని వానిని వేధించి, యేదియో వానిచేతనైనట్లు తప్పులో యొప్పులో వానిచే వాగించి, యందుమూలమున నాబల్లపై యేర్పడిన శ్రీ రాధాకృష్ణరూపమును, గోవులతోఁగూడిన గోపాలరూపమును మొదలైన వివిధములగు దేవతామూర్తులనుజూచి యానందించి, యిట్టి తప్పులతడకగఁ జదివిన మనుష్యరచితములగు స్తోత్రములచేతనే యింతటి దివ్యమూర్తు లేర్పడినచో, శుద్ధముగను సక్రమముగను జదువు స్తోత్రములచే నింక నెట్టియద్భుతమూర్తు లేర్పడునో యనియు, నిఁక వైదికమతస్థు లపౌరుషేయమగు వేదమును సస్వరముగను సుస్వరముగను నధ్యయనము చేసినచో దానియొక్క ప్రభావ మూహింపనే సాధ్యముగానంతటియధికమై యుండితీరవలయు ననియు నిశ్చయించి, యామె యీవృత్తాంతము నంతయుఁ దనపరిశోధనఫలితముగ లోకమునకుఁ బ్రకటించి యుండెనఁట!

దీనిచే సంస్కృతభాషాపదములకు స్వాభావికముగఁగల శబ్దశక్తి వెల్లడియగుచున్నది. ఆట్టి సంస్కృతమునుండిపుట్టిన మన దేశభాషలుగాక, మ్లేచ్ఛభాషలని మన వేదశాస్త్రములందుఁ జెప్పఁబడిన యితరదేశభాషల కట్టిస్వాభావికశబ్దశక్తి లోపించి యుండుటకుఁ బైన దెలుపఁబడిన 'ఫ్రెంచి' దొరసానిగారి 'ఫ్రెంచి'భాషాసంగీతముచే వ్రాతబల్లపై నేర్పడిన పిచ్చిగీతలే సాక్ష్యము.

[చాతుర్వర్ణ్య విభాగము (అనఁగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను కులభేదము) లేని యితరదేశములవారికి 'దస్యు' లని పేరనియు, వారిభాషలలోఁ గొన్నిఁటికి 'మ్లేచ్ఛభాష' లనియుఁ గొన్నిఁటి 'శార్యభాష' లనియుఁ బేరనియు, భారతవర్షమునకు వెలుపలనున్న భూము లట్టిదస్యులు నివసించు మ్లేచ్ఛభూములనియు, మనువు తనధర్మశాస్త్రమున నీక్రిందిరీతిని జెప్పియున్నాఁడు:—

"శ్లో. కృష్ణసారస్తు చరతి, మృగో యత్ర స్వభావతః,
సజ్ఞేయో యజ్ఞియోదేశో, మ్లేచ్ఛదేశ స్త్వతః పరః."

—మనుస్మృతిః అధ్యా. ౨. శ్లో. ౨౩.

"శ్లో. ముఖబాహూరుపజ్జానాం యా లోకే జాతయో బహిః,
మ్లేచ్ఛవాచ శ్చార్యవాచ, స్సర్వే తే దస్యవ స్మృతాః."
—మనుస్మృతిః అధ్యా. ౧౦. శ్లో. ౪౫.

అనఁగాఁ: 'కృష్ణసార' మనఁబడు నల్లయిఱ్ఱి స్వాభావికముగ సంచరించు దేశము (భారతవర్షము) యజ్ఞభూమి. ఇతరదేశములు మ్లేచ్ఛదేశములు. పరమేశ్వరుని ముఖము నుండియు, బాహువులనుండియుఁ, దొడలనుండియుఁ బాదములనుండియుఁ బుట్టిన (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర) జాతులకంటె నితరములగు జాతులు లోకమున నేవేవిగలవో, యవి మ్లేచ్ఛభాష మాట్లాడునవియనియు, నార్యభాష మాట్లాడునవి యనియు రెండువిధములు; ఆరెండు తెగలవారును 'దస్యు' లని చెప్పఁబడుదురు.]

అంతియగాక, పైసందర్భమున దెలిసికొనఁదగిన నేటిలోకవిషయ మేమనఁగా: వైదిక మతాచార్యములందు శ్రద్ధతొలఁగిచనిన నవనాగరకులు కొంద ఱాయాచారముల ననుష్ఠించు పూర్వాచారపరాయణులగు సామాన్యులను గొందఱినిజూచి, వారికి వేద మున కర్థము తెలియదనియు, సంస్కృతము రాదనియు, నందుచే నర్థమెఱుఁగక చిలుకపలుకులవలె నారుచ్చరించుమంత్రములు నిరర్థకములును నిష్ప్రయోజనములు ననియును, గావున నర్థము తెలియకయే యట్టికర్మల ననుష్ఠించు నాపూర్వాచారపరా యణులకంటె, నర్థము తెలియనందున వానిని విడిచివైచిన తామే శ్రేష్ఠులమనియు, బుద్ధికిఁ దోఁచినట్లెల్ల సూటిగా మాట్లాడుచుందురు. అట్టివారి వాదము గ్రుడ్డివాదమని పై పరిశోధనఫలితము చాటుచున్నది. ఏలనన, నట్టి యర్థజ్ఞానములేనంతమాత్రమున నాయా మంత్రములప్రభావ మారకపోక, వాని శబ్దశక్తిచేఁ దగిన ప్రయోజనము కలుఁగుచునే యున్నది.

ఇఁక నీ పైవ్యాసములవలన మనము తెలిసికొనవలసిన సారాంశ మేమనఁగా, లోగడఁ గనబఱచియున్నరీతిగ, మన స్వదేశీయ ప్రకృతిశాస్త్రవేత్తలలో నగ్రగణ్యు లగు *సర్. సి. వి. రామన్‌గారును, విదేశీయ ప్రకృతి శాస్త్రవేత్తలగు సర్. ఆలివర్-లాడ్జి, హెక్కెల్, సర్. కే. లంకాస్టర్, డార్విన్, వాలెస్, స్పెన్సర్, హక్సిలీ, మొదలగు విదేశీయ ప్రకృతిశాస్త్రజ్ఞులును, దమప్రకృతి శాస్త్రజ్ఞానముచే వైదిక మత

* వీరు కలకత్తా 'విశ్వవిద్యాలయము' (University)నఁ గొంతకాల ముద్యోగమునుండి, పిమ్మట 'భారతవర్ష ప్రకృతిశాస్త్రసంస్థ' (Indian Institute of Science-ఇండియన్-ఇన్‌స్టిట్యూట్-ఆఫ్-సైయెన్స్)కు నధ్యక్షులు (Director-డైరెక్టర్) గానున్న గొప్ప ప్రకృతిశాస్త్ర విద్వాంసులు.

శాస్త్రాచారములును ధర్మాధర్మములును బ్రకృతిశాస్త్రవిరుద్ధము లనియు నసత్యము లనియు, నిరర్థకములనియు, నిష్ఫలములనియుం దలంచుచుండఁగా, దానికివిరుద్ధముగ నట్టి స్వదేశీయ ప్రకృతిశాస్త్రజ్ఞులలో నగ్రగణ్యులగు *సర్. యస్. రాధాకృష్ణన్ గారును, విదేశీయ ప్రకృతిశాస్త్రవేత్తలగు ప్రొఫెసర్-నిష్‌బెట్-విల్సన్, ప్రొఫెసర్-అర్నస్టు-ఏబ్రహామ్స్, ప్రొఫెసర్-డెమార్గన్, మేడమ్-ఫెనెలాంగ్, ప్రిన్సిపాల్-వుడ్ మొదలగు విదేశీయ ప్రకృతిశాస్త్రవిద్వాంసులును, దమ ప్రకృతిశాస్త్రపరిశోధనజ్ఞానముచే, మన వైదికమతసిద్ధాంతములందును ధర్మాధర్మరూపములగు మన యాచారవ్యవహారములందును నత్యద్భుతములగు ప్రకృతిశాస్త్రరహస్యము లంతర్భూతమై యున్నవనియు నవి శ్లాఘనీయములును, నాచరణయోగ్యములును సత్యములును ననియును బ్రకటించుచున్నారు. కావున మన మెఱుఁగవలసిన దేమన, లోగడ, "ధర్మాధర్మములకు మూలము ప్రకృతిశాస్త్రహేతువులు (Scientific Reasons) కావా?" యను శీర్షికక్రింద మేమిదివఱకే తెలిపియున్నరీతిగఁ, బ్రకృతిశాస్త్ర హేతువాదము, వాదించువారి ప్రకృతి శాస్త్రజ్ఞానముయొక్క పరిమితిపైనను, వారి బుద్ధిబలముపైనను నాధారపడియుండును. అట్టి ప్రకృతిశాస్త్రజ్ఞానములకును బుద్ధిబలములకును లోకమున నొక మితి (Limit) లేకపోవుటచే నొకరికి సత్యముగదోఁచిన దింకొకరి కసత్యముగను, నొకరి కసత్యముగఁదోఁచిన దింకొకరికి సత్యముగను దోఁచుచుండును. అందుచే నతీంద్రియములగు ధర్మాధర్మముల విషయమున సత్యమేదియో యసత్యమేదియో ప్రకృతిశాస్త్రహేతువులచే నిర్ణయింప సాధ్యముగాదు. ధర్మాధర్మములకు మూలాధారము సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరుని యాజ్ఞారూపములైన వేదశాస్త్రములగుటచే నట్టి ధర్మాధర్మములు ప్రకృతిశాస్త్రవిరుద్ధములగుటగాని నిష్ప్రయోజనములగుటగాని, యనర్థకము లగుటగాని, యెన్నఁటికిని సంభవింపనేరదు! ధర్మాధర్మములకు మూలమగు వేదశాస్త్రము లట్టివని యెఱుంగక మనుష్యజ్ఞానముచే నిర్మితములగు విదేశీయుల ధర్మశాస్త్రములవంటివే యని మన నవనాగరకులు భ్రాంతిచెందుటచే వారు ప్రకృతిశాస్త్రహేతువులకై దేవులాడుచుండవలసి వచ్చినది. నవనాగరకుల కేర్పడిన యట్టి పైభ్రాంతిని దొలఁగించుటకే మేమీగ్రంథమును, నందు ముఖ్యముగ నీప్రకరణమును బ్రకటించుచు వారిసంశయముల కన్నిఁటికి నిందు సమాధానములను జెప్పుచునే యున్నాముగదా!

---

* వీరును రామన్‌గారివలెనె గొప్ప ప్రకృతిశాస్త్రవేత్తలును, Kt., I. E. S., అను బిరుదములు బొందినవారును, బ్రస్తుత మాంధ్ర విశ్వవిద్యాలయమునకు నుపాధ్యక్షులు(Vice-Chanceller-వైస్-ఛాన్సెల్లర్)నై యున్నారు.

మన వైదికమతధర్మముల కనుకూలములని పైన గనఁబఱిచిన ప్రకృతి శాస్త్ర సిద్ధాంతములుగూడ మనుష్యబుద్ధిపై యాధారపడియున్నవగుటచే నవి యెన్నఁటికైన నొకవేళ నపసిద్ధాంతములని ఋజువైనను గావచ్చును. కాని, యంతమాత్రముచే మన వైదికమతధర్మములుగూడ నపసిద్ధాంతములై పోవునని మనము భ్రాంతిచెందరాదు. ఏలనన మన ధర్మాధర్మము లట్టిమనుష్యజ్ఞానమునకు సంబంధించిన ప్రకృతి శాస్త్రసిద్ధాంతములపైనమాత్రమే యాధారపడియుండక సర్వజ్ఞుఁడగు నీశ్వరుని జ్ఞానముపై యాధారపడియున్నవి. ఆయనయొక్క జ్ఞాన మెన్నఁటికిని నట్టిభ్రమప్రమాదములకు లోనుగాఁ జాలదనుసంగతి, యన్నిమతములయొక్క సిద్ధాంతములకును ననుకూలమేయని చెప్పవచ్చును.

## ప్రకృతిశాస్త్రహేతువు లెఱుఁగకయే చేసిన ధర్మాధర్మములు నిష్ప్రయోజనములు కావా?

మన నవనాగరకులు కొందఱు వైదికమతశాస్త్రాచారములందుఁ గొన్నిఁటికిఁ బ్రకృతిశాస్త్రహేతువులును బ్రయోజనములును దమకుఁ దెలియరానందునఁ దామ వానినాచరించుటచేఁ బ్రయోజనములేదనియు, నందుచేఁ దామా యాచారములను బరిత్యజించితిమనియుఁ, దమవలెనె ప్రకృతి శాస్త్రహేతువులెఱుఁగని యితరులుగూడ వానినాచరింపక మానుటయే మంచిదిగాని యాచరించుట నిష్ప్రయోజనమేయనియు వాదించుచు, నితరులకట్లు బోధించుచున్నారు. అందుచే నమాయకులగు కొందఱు తామిదివఱ కాచరించుధర్మములను విడనాడుచున్నారు. మఱికొందఱు పైబోధచే సంశయగ్రస్తులై వానిని కేవలము విడనాడకున్నను వానియందలి శ్రద్ధను గోల్పోయి నందున లోకమునకు వెఱచి యేదోరీతిని వానినెట్లో యాచరించుచు మాత్రమున్నారు. కావున బైవాదమందలి సత్యాసత్యములను గొంతవిచారించి తెలిసికొందము.

తొలుఁదొల్త మననవనాగరకులు, "వైదికమతాచారములలోఁ గొన్నిఁటికిఁ బ్రకృతిశాస్త్రహేతువులును బ్రయోజనములును దెలియరానందున వానినాచరించుటచేఁ బ్రయోజనములే"దని తలంచుటకుఁ గారణమేమి? వైదికమతాచారములలోఁ గొన్నిఁటికిఁ బ్రత్యక్షప్రయోజనములు గానవచ్చుటయును గొన్నిఁటికిఁ గానరాకపోవుటయును నొకకారణము. ఎట్లనిన, నొకబ్రాహ్మణుఁడు వైదికమతశాస్త్రముల ననుసరించి యాచరింపవలసిన కార్యములలో స్నానమును, సంధ్యావందనము మొదలగు ననుష్ఠానమును, నటుపై భోజనమునుగలవు. వీనిలో స్నానమువలన నొడలి మురికి పోయి శరీరము శుభ్రమగుటయును, భోజనమువలన నాకలితీరి దేహమునకుఁ బుష్టి గలుగుటయును బ్రత్యక్షముగఁ గానవచ్చు ప్రయోజనములు. వానిలో స్నానము

నాచరింపక పోయినచో శరీరమాలిన్యమువలనఁ జర్మవ్యాధులును, దుర్వాసనయుం మొదలగునవి బుట్టుటయును, భోజనము చేయకపోయినచో నాకలిబాధయుం శరీరమున నీరసముచే బాధయుం బయలుదేరి మనుష్యుఁడు కదలను మెదలనులేక యవస్థపడుటయును, నారెండుధర్మములను నాచరింపవలసియుండుటకుఁ గల ప్రకృతిశాస్త్ర కారణములు. కాని, వానినడుమనున్న సంధ్యావందనము మొదలగు ననుష్ఠానముచే, బ్రత్యక్షముగఁ గానవచ్చు ప్రయోజనముగాని, దానిని మానుటచేఁ గల్గుబాధగాని, యాబాధ తొలఁగించుకొనుటకై దానినాచరింపక తప్పనికారణముగాని యేమిగలవు? అట్టియనుష్ఠానముతోడఁ బనిలేని యితరమతస్థులును, నితరకులములవారును, బ్రాహ్మణకులముననే యట్టియనుష్ఠానమును విడనాడినవారును నెందఱులేరు? వారికేమి సౌఖ్యములు లోపమైనవి? ఏమియునులేదు! కావున నట్టియనుష్ఠానముచేఁ బ్రత్యక్షముగఁ దెలియవచ్చెడి ప్రయోజనముగాని, కారణముగాని యేమియునులేదు. అందుచే స్నానమును, భోజనమును నాచరణీయములైనప్పటికిని, వానిరెంటికిని నడుమనున్న యనుష్ఠానము నవనాగరకులదృష్టిలో నిష్ప్రయోజనమగుటచే, వారికి దానినాచరింపవలసిన పనిలేదు.

ఇఁక రెండవకారణ మేమనఁగా: విదేశీయులు వారికిఁ బ్రయోజనకరములగు లౌకికధర్మములను, వారి ప్రకృతిశాస్త్రజ్ఞానమునుబట్టియుం లోకానుభవమును బట్టియుం నిర్మించికొనురీతిగనే, వైదికమతధర్మములనుగూడ మనపూర్వులు వారి లోకానుభవమును బట్టియుం వారికిఁగల కొద్దిప్రకృతిశాస్త్రజ్ఞానమును బట్టియుం బుద్ధినైపుణ్యమును బట్టియుం నిర్మించిరనియుం, వారిప్రకృతిశాస్త్రజ్ఞానమును, లోకజ్ఞానమును, నిప్పటి మనలోకాజ్ఞానమంతటి యభివృద్ధిని జెందియుండనందున, బైవిధములగు కొన్ని నిష్ప్రయోజనములును నిరర్థకములును నగుధర్మములను మన యాచారములమధ్యఁ జొనిపియుండిరనియుం మననవనాగరకులు భ్రాంతిఁ జెందియున్నారు. అట్టిభ్రాంతి కేవల నిరాధారమనియుం, దానికిఁ గారణములగు నవీనచరిత్రలు నూటికిఁ దొంబదితొమ్మిది పాళ్లు పట్టితప్పుటూహలపై నాధారపడియున్నవనియుం నీగ్రంథమున మొదటి ప్రకరణముననుు, రెండవప్రకరణమున నింతవఱకును ఋజువు చేసికొనుచునే వచ్చుచుంటిమి. అందుకుమారుగ, మనవైదికమతమునఁ గానవచ్చు బైవిధమగు ధర్మాధర్మము లతీంద్రియ విషయములనియుం (ననఁగా, వానివలని బ్రయోజనములలో నీజన్మమునఁ బ్రత్యక్షముగ గానవచ్చునవి మాత్రమేగాక, యిచటఁ దెలియరాక, యితరజన్మములందును నితరలోకములందును ననుభవమునకువచ్చు ప్రయోజనములును బాధలును బెక్కుగలవనియుం,) నట్టి యతీంద్రియవిషయములను దెలిసికొనుట యెట్టిసామాన్య మనుష్యుని

బుద్ధికిని శక్యముగాని దగుటచే, నాధర్మాధర్మములు మనుష్యు లేర్పఱచినవిగాక, సర్వజ్ఞుఁడగు నీశ్వరుని యాజ్ఞారూపమైన వేదముపై యాధారపడియున్నవనియుఁగూడ మాయీగ్రంథమున బుజువుపఱచికొని వచ్చుచుంటిమి. అందువిషయమున నవనాగరకులు చేయుఁవాదములనుగూడ విమర్శింపుచు వారికిఁగల సంశయములకెల్లను సమాధానములను జెప్పికొనుచునే వచ్చుచుంటిమి. దానిని బట్టిచూడఁగా, వైదికమతధర్మములలోఁ గొన్నిఁటికిఁ గారణములును, బ్రయోజనములును బ్రత్యక్షముగఁ దెలియరానందున నంతమాత్రముచే నాధర్మములు నిష్ప్రయోజనములని నవనాగరకు లనుకొనుట మిక్కిలి యవివేకమని స్పష్టమగుచు. (ప్రత్యక్షముగఁ దెలియవచ్చెడి కారణములును బ్రయోజనములునుగల ధర్మములయొక్క సంఖ్యకంటె నట్లు తెలియరాని యతీంద్రియములగు ధర్మాధర్మములయొక్క సంఖ్యయే వైదికమతమున నిజమున కెక్కుడుగ నున్నది.)

అది యట్లుంచి, "ప్రకృతిశాస్త్రహేతువుల నెఱుఁగకయే యేపనినిగాని చేసినచో దానివలనఁ బ్రయోజనముగలుగ"దను మననవనాగరకుల వాదము సరియైనదే యని వాదముకొఱ కించుకసేపు మనమంగీకరించి, యట్టి తమవాదము ననుసరించి వారు స్వవిషయమున లోకవ్యవహారమునం దెంతవఱకు నిజముగ నడచుకొనుచుండిరో విచారించిచూతము.

వీరిలో నెప్పుడైన నేదేని రోగముచే బాధపడువారు కొందఱైన నుందురను టకు సందియములేదు. అట్టివారు రోగమువచ్చినపు డేమిచేయుదురు? వైద్యులయొద్దకుఁ బోయి వారిచ్చినమందును దీసికొని వారు చెప్పినప్రకారము పథ్యపానములుచేసి రోగములను మాన్పుకొనుచుందురు. ఏయేయౌషధ మేయేరోగములను మాన్పునో, యేయేయౌషధ మేయేవిధముగఁ దినినచో నది శరీరములోని యేయే కోశములలోఁ జేరి యేయేమార్పుల నేయేతీరున గలిగించి యేయేరోగములపై యేయేరీతుల నడచునో, యేయే పథ్యపదార్థము రోగనివారణ కేయేవిధమునఁ దోడుపడునో, యేయే యపథ్య వస్తు వేయేరోగవిషయమున శరీరములోఁజేరినచో నది యేయే కోశములపై యేయే మాదిరిగ వర్తించి యెట్టియెట్టిదోషములను బుట్టించునో, యీమొదలగు సంగతు లన్నియుం వీరికి స్వయముగఁ దెలియుటచేత నే యట్టి యౌషధసేవ చేయుచుండిరా? లేదు! ఏమనిన, నట్టి వైద్యశాస్త్రజ్ఞానమంతయును వీరికున్నచో నిఁక వీరు వైద్యుని యొద్దకుఁ బోవలసినపని యేమున్నది? కాఁబట్టి వీరి కావిషయములన్నియు స్వయముగఁ దెలియవనియే చెప్పవచ్చును. కాని, యట్లు తెలియకపోయినప్పటికిని నంతమాత్రముచే, వైద్యుఁడుచెప్పిన మందుతిని పథ్యముచేసినవారికి రోగములు కుదురకపోవు

చున్నవా? లేదు! ఏల? తెలిసి తినినను దెలియక తినినను నాయారోగములను మాన్పుట యాయామందులకును నాయాపథ్యములకును స్వాభావిక మగుటచేత! దీనినిబట్టి చూడఁగా, మనము చేయుం పనులవలనఁగల్గు ఫలములకును, నట్టిఫలములు గల్గుటకు హేతువులు మనకుఁ దెలిసిగాని, దెలియకగాని యుండుటకును నెంతమాత్రమును సంబంధములేదని తేలుటలేదా? తేలుచునే యున్నది!! కావున నట్టిపనులవలని ఫలములను మనముపొందుటకుఁ గావలసినది, యాపనులను సరిగా నెరవేర్పవలసిన విధము తెలిసికొని యట్లు నెరవేర్చుటయేగాని, యట్టిపను లేయేవిధముగ నెట్టియెట్టిహేతువుల ననుసరించి యావిధమగుప్రయోజనమును గల్గించుచున్నవో, యాగొడవతో మనకుఁ బనియేలేదు.

అట్లుగాక, యట్టిహేతువులను తాము స్వయముగఁ దెలిసికొనునంతవఱకును దామాపనుల నాచరించుటచేఁ బ్రయోజనములేదనియుఁ, గావునఁ దాము వాని నాచరింపరాదనియుం మననవనాగరకులు వాదించెడిచోఁ, బైనదెల్పిన రోగవిషయముననే వారివివేకమును వారిస్థితియుం నెట్లు పరిణమించునో యించుక విచారించి చూతముః వారిలో నెవనికైనను రోగమువచ్చినపుడు, వైద్యుఁడు నిర్ణయించిన యౌషధమును భక్ష్యపానములును దనశరీరములోని యేయేకోశములలోఁ జేరి యేయేమార్పులను బుట్టించి యేయేవిధములగు ఫలములనుగల్గించి రోగము నేయేవిధముగ మాన్పునో యావిషయము తనకుఁ దెలియదు గావున దానిని దెలిసికొనువఱకును దానా యౌషధమును దినరాదని పట్టుపట్టినచో, వానిపని యేమగును? ఒకవేళఁ దనకట్టి హేతువులను దెలిసికొనఁ గోరికయున్నచో నప్పుడా వైద్యునిమాట నమ్మి యాయౌషధమును దిని యారోగమును గుదుర్చుకొని జీవించినపిమ్మటగదా యావిద్య నభ్యసించి యాజ్ఞానమును బొందుటకు వీలగును! అట్లుగాక రోగముచేఁ బ్రాణావశిష్టమైయున్న తరుణమునఁ, దానా విద్యనేర్చి యాహేతువులను దెలిసికొనువఱకును దానా యౌషధమును దిననే తినననని చెప్పినచోఁ గలుగుఫలము ప్రాణాపాయమేగాని వేఱేమైనను బ్రయోజనముండునా? ఉండదు! అదేరీతిగ, వైదికమతధర్మములవలనఁ గల్గు ప్రయోజనములకు మూలములగు ప్రకృతిశాస్త్రహేతువులను దెలిసికొన నభిలాష నవనాగరకుల కున్నచోఁ దామాధర్మములను విడువక యాచరింపుచు, వానివలని ప్రయోజనములను బొందుచుఁ, గ్రమక్రమముగ నటుపై యట్టిజ్ఞానమును సంపాదించుటకు యత్నింపవచ్చునేగాని, హేతువు తెలియువఱకును నాచరింపరాదని వాదించెడిచో వారి వివేకముగూడఁ, బైరోగియొక్క వివేకమువంటిదేయని యనిపించుకోనక మానదు.

అంతియగాక, ప్రకృతిశాస్త్రహేతువు తెలియకయే యాచరించినపని నిష్ప్ర
యోజనమని వాదించు నవనాగరకు లాసిద్ధాంతమును ధర్మముల నాచరించు సందర్భమున
మాత్రమే పాటించుచుఁ దమకిష్టమువచ్చిన యితర కార్యముల నాచరించుటలో దాని
నావంతయైనను బాటింపకున్నారు. ఎట్లనినః బ్రతిమానవుఁడును—మానవుఁడుమాత్రమే
గాక లోకమందలి ప్రతిప్రాణియును—బ్రాణసంరక్షణకొఱకును, నాకలిబాధయడఁగి
శరీరదార్ఢ్యము కల్గుటకొఱకును నాహారమును దినుచున్న సంగతి యందఱు నెఱిఁగినదే.
నవనాగరకులును నట్లు తినుచున్నవారే. కాని, యాయాహార మేయేవిధముల గర్భకోశ
మందలి యేయేభాగములనుజొచ్చి వానియందు స్రవించు నేయేరసములతోఁజేరి యేయే
రీతిగఁ బరిణమించి జీర్ణమై యేతీరున రక్తరూపముగ మారుచున్నదో యావివరము
లన్నియు లోకమందలి యన్నిప్రాణులును నెఱిఁగియేయున్నవా? అంతయేల? అట్టివివర
ముల నెఱుఁగనే యెఱుఁగనివారు మన నవనాగరకులలోనే యెంతమంది లేరు? వాని
నెఱిఁగినవారు నూటికొక్కరో యిద్దఱో యుందురేమో! మానవులమాటయే యిట్లుండ
నిఁక నితరజంతువులలో నట్టిజ్ఞానముగలవి యుండనే యుండవని వేఱుగఁజెప్ప నవ
సరము లేదు. అంతమాత్రముచే నాహారమువలనఁ గలుగవలసిన శరీరపుష్టి కలుగుటయు,
నాకలిబాధ తొలఁగుటయుఁ బ్రాణులన్నిఁటికిని గలుగక మానుచున్నవా? మానుటలేదు;
కలుగుచునేయున్నవి! అట్టిప్రాణులవలెనే పైవివరములను హేతువులను నెఱుఁగని నవ
నాగరకులుగూడ నాహారమును దిని దానివలని ప్రయోజనమును బొందుచునే
యున్నారు గాని తమ కాహేతువులును వివరములును దెలియవుగావునఁ దా మాహార
మును దినరాదని చెప్పి తినుటను మానివేసిరా? లేదు. వారి వాదముప్రకారము మాని
వేయవలసినదేగదా! ఏల మానివేయలేదు? మానివేసినచోఁ బ్రాణోపద్రవముగలుగు
నను భీతిచేతను, మానివేయక తినుచుండుటచేఁ దమ కావివరముల సంబంధమగు హేతు
వులు తెలియకున్నప్పటికిని దానివలనఁ గలుగవలసిన ప్రయోజనము కలుగుచునే
యుండుటచేతను మానివేయవలసిన యగత్యము లేకపోయినది. ఆతీరుననే ప్రస్తుతకాల
మున మనదేశమున వ్యాపించియున్న యయోమార్గశకటములు (Railway trains)ను
విద్యుచ్ఛక్తి దీపములు మొదలగు యంత్రములు (Electric Lights and Machi-
nery) ను, గడియారములును, తుపాకులును మొదలగు యంత్రములయందలి వేఱు
వేఱు భాగములనుగుఱించియు, నవి చేయు వేఱువేఱు విధములగు పనులను (Various
parts and their respective functions) గుఱించియుఁ గొంచెమైనను నెఱుఁ
గని వేలకొలఁది జనసామాన్య మాయాయంత్రముల నుపయోగించి వానివలని ప్రయో
జనములను బూర్ణముగఁ బడయుటలేదా? అనఁగా నయోమార్గశకటములలో (Railway

**Trains** లో:) ప్రయాణముచేయు జనులందఱునుగూడ యాబండి యేవిధముగఁ బరు గెత్తఁజాలుచున్నదో యావివరములను హేతువులను విశదముగఁ జెప్పగలరా? అట్లు చెప్పఁజాలకున్నను వా రాబండిలో ప్రయాణముచేసి దానివలని ఫలమును బొందఁజాలి యుండుటలేదా? అట్లే గడియారములను వాడుకొనువారందఱును వానినడకకుఁ గార ణములగు నందలి యంత్రములయొక్క వివరములను, వాని భాగములయొక్క వేఱు వేఱువిధములగు చలనములకు హేతువులను జెప్పఁజాలినవారేనా? కాని, వారందఱును గూడ వానియొక్క ప్రయోజనమును బొందుటలేదా? హేతువు తెలియనంతమాత్ర మునఁ బ్రయోజనమున కేమిలోపము గల్గుచున్నది? ఏమియునులేదు!!

ఐనచో వైదికమతధర్మములకుఁగూడఁ బ్రకృతిశాస్త్రహేతువులు తెలియక పోయినప్పటికిని వానినిగూడఁ బైనదెల్పిన పనులవలెనే యాచరింపక, యట్లాచరించు టచేఁ బ్రయోజనముండదని నవనాగరకులుం వాదించుటకు హేతువేమి? ఈ వ్యాసము యొక్క మొదటఁ దెల్పియున్నరీతిగ, విదేశీయులు వారి లోకజ్ఞానము ననుసరించి ప్రత్యక్షఫలముల నిచ్చునట్టివారి లౌకికధర్మములను సధర్మములను నిర్మించుకొనుతీరుననే మనపూర్వులుగూడ వారిలోకజ్ఞానమును ననుసరించి మనవైదికమత ధర్మములను నిర్మించి యుండిరను భ్రాంతికి మననవనాగరకులు లోనై యున్నారు. అట్టి వైదికమతధర్మము లందుఁ గొన్ని ప్రత్యక్షఫలములనీయక వానినాచరింపవలసిన కారణములు గానరాక జన్మాంతర లోకాంతరములందు సుఖదుఃఖములను గల్గించునవిగ మాత్రమే యున్నవి. ప్రత్యక్షఫలములనీయని ధర్మాధర్మములయొక్క ప్రయోజనమును మన నవనాగరకులు గ్రహింపనేరక యవి నిరర్థకములనియు వానిని నిర్మించిన మనపూర్వులకు లోకజ్ఞాన మును బ్రకృతిశాస్త్రజ్ఞానమును లోపించియుండుటచే నట్టివి నిర్మించియుండిరనియు భ్రాంతిఁజెందుచున్నారు. అందుచే వారికి మన మతధర్మములందు శ్రద్ధయు, విశ్వాస మును నశించినవి. వారు పైరీతిని వాదించుటకు నిదియే ముఖ్యకారణము. కాని, వారికిఁ గల్గిన భ్రాంతి కేవల నిరాధారమనియు, వారు తలంచునది వట్టి యబద్ధమనియు, వారి యొక్క పైవాదము మిక్కిలి దుర్బలమనియు నీవ్యాసముననే విశదపఱచియుంటిమి.

## ప్రత్యక్షఫలమీయని వైదికమతధర్మాధర్మములు ప్రయోజనకరములా?

పైవ్యాసమునఁ గనఁబఱచిన వైద్యవిషయము, నాహారవిషయము, యంత్రాదుల విషయములనుగుఱించి నవనాగరకులిచట నొక యాక్షేపణమును జెప్పవచ్చును. ఏమనినఁ: "పైవిషయములందు హేతువులు తెలియకపోయినను వాని నాచరించుచున్న

వారికి వానివలనఁ బ్రయోజనములు గల్గుచున్నమాట సత్యమే; అట్టి ప్రయోజనములు ప్రత్యక్షముగఁ గానవచ్చుచుండుటచే జనులు వాని నాచరింపవలసివచ్చుచున్నది; కాని, వైదికమతధర్మములలోఁ గొన్నిఁటివలన నారీతిగఁ బ్రయోజనములు బ్రత్యక్షముగఁ గానవచ్చుటలేదు. అట్టిప్రయోజనము లున్నవనుటకుఁ బ్రకృతి శాస్త్రహేతువులును దెలియవచ్చుటలేదు; కావున నిఁక వానివలనఁ బ్రయోజనమేమి?" యని మన నవనాగరకు లడుగవచ్చును.

సమాధానమేమనిన, లోకమున దేనినైనను సత్యమును దెలిసికొనుటకుఁ సామాన్యముగఁ బ్రత్యక్షముగూడ యొక సాధనమేమైనను, నదియొక్కఁటిమాత్రమే సాధనము గాదు; అట్టిసాధనము లింకను గొన్నిగలవు. అందుచే నేవిషయమైనను బ్రత్యక్షముగఁ గానరానంతమాత్రమున నది యబద్ధమని చెప్పఁదగదు. ఈవిషయ మిాక్రింది యుదాహరణముచే విశదము కాఁగలదు; వీనియందలి సత్యమును గ్రహింపఁ బ్రత్యక్షము తోడ్పడఁజాలియుండదు.

ఒకయింటిలో నిప్పుగులఁబెట్టి వంటలు మొదలగునవి చేసికొనుచుండఁగా నా యింటికప్పులోనుండియుఁ గిటికీలును, వాకిళులును మొదలగుద్వారములనుండియుఁ బొగ వచ్చుచు వీధివెంటఁబోవువారి కాపొగ గానవచ్చుచుండుటను మనలోఁ గొందఱు సామాన్యముగ నెఱిఁగియే యుండవచ్చును. కాని యా యింటిలోపలనుండు నిప్పు మాత్రము వీధిలోనివారికిఁ బ్రత్యక్షముగఁ గానరాదు. అట్లు కానరాకపోయినను, సామాన్యముగఁ బొగవచ్చుటకు నిప్పు కారణమగుటచేతను, నిప్పులేనిదే పొగపుట్టనేరదు గావునను, నాయింటిలో నిప్పుగలదను సంగతిని సామాన్యముగ మనము గ్రహింపఁజాలి యుందుము. కాని, ప్రత్యక్షముగఁ గానరాని విషయములు నమ్మరానివని వాదించు మన నవనాగరక సోదరుఁడొకఁడువచ్చి వీధిలోనిలిచి, "యాయింటిలోని నిప్పు నాకుఁ బ్రత్యక్షముగఁ గానవచ్చుటలేదు; పొగమాత్రమే ప్రత్యక్షముగఁ గానవచ్చుచున్నది; కాఁబట్టి యాయింటిలోఁ బొగయున్నదని మాత్రమే నమ్మవచ్చును గాని నిప్పున్నదని యెంతమాత్రమును నమ్మరా"దని వాదించినచో మనము దానిని వివేకమని యందుమా?

అట్లే యొకమనుష్యుఁ డింటిలోపలనిలిచి కిటికీలోనుంచి తల వెలుపలనుఁబెట్టి తొంగిచూచుచున్నచో వెలుపలనున్న మనకు నాతని తలమాత్రమే కానవచ్చును గాని మిగిలిన దేహము కానరాదు. అంతమాత్రముచే మనకుఁ బ్రత్యక్షముగఁ గానవచ్చు నాతని తలమాత్రమేయున్నదనియుఁ, నామనుష్యునకు మిగిలిన శరీరమంతయుఁ లేదనియు మనము తలంపవచ్చునా?

ఆరీతిగనే, యొకదినము సూర్యోదయమునకుముందే ముసురుపట్టి, నాఁటిరాత్రి వఱకును మేఘములు తెరిపియీయాయనందున, నెంత యత్నించినను నాఁడు సూర్యబింబము కనఁబడకపోవుట లోకానుభవసిద్ధమేగదా ! ప్రత్యక్షముగ సూర్యుఁ డగుపడకపోయినను వెలుతురు వచ్చినంతనే తెల్లవారినదని ప్రతివారును నిద్రనుండిలేచి, పగటివేళ నాచరింపఁదగిన కార్యము లాచరించుచున్నారు; నాఁడుగూడ సూర్యోదయ సూర్యాస్తమయములు జరిగినట్లే భావించి, వారములు, తేదులు, (తారీఖులు) మొదలగు వానిని లెక్కించుటలో నాఁటినిగూడ యొకదినముగనే పరిగణించుచున్నారు. కాని, మన నవనాగరకసోదరుఁడొకఁడు బయలుదేరి, నాఁడు సూర్యోదయము ప్రత్యక్షముగఁ గనఁబడనందున నట్లు కనఁబడువఱకును తెల్లవారినదని తాను భావింపననియు, నందుచే నిద్రనుండి లేవననియు, దినకృత్యములను నెరవేర్పననియు, నాఁటి నొకదినముగ లెక్కింపననియు వాదింపవచ్చినచో మనము వానికి మతియున్నదని తలంపవచ్చునా ? అంతయేల ! కేవల ప్రత్యక్షమునుమాత్రమే నమ్మవలయుననియు నితరమును నమ్మరాదనియుఁ దలంచెడిచో నెప్పటికప్పుడు మనకండ్లయెదుటనున్న వస్తువులుమాత్రమే యున్నవనియుఁ గొంచెమవతలను నివతలను మనకుఁ గానరాకయున్న వస్తువులును బ్రజలను మొదలగు ప్రపంచమంతయు లేనేలేదనియు, నవి కనఁబడినతోడనే యున్నవనియుఁ దిరిగి మరుగైనతోడనే మరల లేవనియు నీరీతిగఁ బ్రపంచకమున కంతకును క్షణములో విలయమును క్షణములోఁ బుట్టుకను, నభివృద్ధిని, గలిగించినవార మగుచుందుము. అట్లేవస్తువుగాని క్షణములోఁ బుట్టుటయుఁ బుట్టుకలోనే యభివృద్ధి చెందియుండుటయు, క్షణములోనే నశించుటయుఁ దిరిగి యట్లే క్షణములో మరలఁ బుట్టుటయు, లోకానుభవ విరుద్ధమను సంగతి వేఱుగఁ జెప్పనవసరము లేనందునఁ గేవల ప్రత్యక్షమును తప్ప యితరమును దేనిని సత్యమని నమ్మరాదను వాదము నిస్సారమని బుజువగుచున్నది.

అంతియగాదు ! ప్రత్యక్షమొకప్పుడు సత్యమును సాధించుటకు మారుగ నసత్యమును గన్పఱచుచుండుటయుఁ గలదు ! ఎట్లనఁగా ! వేసఁగికాలమున నెండమావులలో నీరున్నట్లు దూరముగ నున్నవారికిఁ బ్రత్యక్షముగఁ గోచరించును. దప్పికచేఁ బరితపించు పశువులు మొదలగు జంతువులు యుక్తాయుక్తజ్ఞానము లేనందున నట్లు ప్రత్యక్షముగఁ గనఁబడునవి సత్యముగ నీటిమడుగులే యని భ్రమపడి యా యెండమావులవైపు పరుగిడును. కాని, యెంతదడవునకును నిజముగ నీటిపట్టును గనఁజాలవు. అట్టి ప్రత్యక్షమునే సత్యమని భ్రమించి యా యెండమావులవైపున కొక మనుష్యుఁడుగూడ పరుగెత్తునేని వానికిని బై పశ్వాదులకును గొంచెమైనను భేదముండునా ? కావునఁ గేవలము ప్రత్యక్షమునే తప్ప యితరమును నమ్మమనెడి వారి స్థితిగూడ యీరీతిగనే యుండును.

ఇదేవిధముగ నొకమైదానమున నిలిచి నలుప్రక్కల దృష్టి పారినంతవఱకుఁ జూచితిమేని నీలవర్ణమగు నాకాశము మననెత్తిపైమాత్రమే మిక్కిలి యెత్తుగనుండి, చుట్టుప్రక్కల నన్నివైపులకును గ్రమముగ వ్రాలుచువచ్చి, కట్టకడపటఁ జూపుమేర దూరమున భూమిపై వ్రాలి బోర్లించిన యొకమూకుడువలె నున్నట్లు ప్రత్యక్షముగ మన కగపడును. అంతమాత్రముచే నదిసత్యమేయని తలంచి మనమటువైపె యెంతదూరము పరుగెత్తినను నట్లాకాశము భూమిపై వ్రాలియున్నచోటును జేరఁగలమా? మనమెంత దూర మెటుపరుగెత్తిచూచినను మనము పోయినచోట నాకాశము మరల నెత్తిపై యెత్తుగఁ గానవచ్చుచునేయుండును గాని భూమిపైవ్రాలియున్నచోటు దొఱకనే దొఱకదు! ఇది కొంచెము లోకజ్ఞానముకల ప్రతిమానవునకును దెలిసినవిషయమే!

అట్లే సమమైన వెడల్పు (Uniform width) గల మిక్కిలి నిడుపగు నొక వీథిమధ్య నిలిచి దాని కొనప్రక్కకుఁ జూచితిమేని, నావైపు పోనుబోను దానివెడల్పు క్రమముగఁ దగ్గుచుఁ బోయిపోయి కడపట నది మిక్కిలి సన్నగిలిపోయి యున్నట్లు కనఁబడును. కాని, యావీథివెంట నట్లే యాప్రక్కకుఁ బోవఁ బయలుదేరితిమేనిఁ, గొనవఱకును, వీథి యెచ్చటను సన్నగిలక యంతటను నొక్కటేవెడలుపు గలిగియుండు టనుజూడఁ గలుగుదుము. అంతట మనము వెనుకకుఁదిరిగి మొదట నిలిచివచ్చిన ప్రక్కకుఁజూచితిమేని, మనము ప్రస్తుతము నిలిచియున్న కొనదగ్గఱనే వీథి నిండు వెడల్పు గలిగియుండి మొదటనిల్చిన ప్రక్కనే సన్నగిలిపోయినట్లు కనుపించును. ఇది యంతయుఁ బ్రత్యక్షమునందలి మోసముగాదా?

ఆ రీతిగనే, మనమొక యూరినుండి వేఱొక యూరికి ధూమశకటము (**Railway Train**—రైలుబండి)లోఁ బ్రయాణముచేయుచు, బండిలో మధ్యభాగ మునఁ గూరుచొని కిటికీలోనుంచి బయటికిఁ జూచితిమేని, నాకాశమందలి సూర్యుఁడును, జంద్రుఁడును, నక్షత్రములును మొదలగునవి మనముపోవు నూరివైపునకే మన బండివెంట మనతోఁగూడ పరుగెత్తి వచ్చుచున్నట్లును, మార్గము ప్రక్కనున్న తంతి స్తంభములు (**Telegraph-Posts**)ను, జెట్లు మొదలగునవియు వెనుకకుఁ (మనము విడచివచ్చుచున్న యూరివైపునకుఁ) బరుగెత్తిపోవుచున్నట్లును బ్రత్యక్షముగఁ గాన వచ్చుచునే యుండును. కాని, యంతమాత్రముచే నవి సత్యమేయనినమ్మి, చంద్రుఁడు, సూర్యుఁడు, నక్షత్రములు మొదలగునవి మనవెంటఁ బరుగెత్తివచ్చుటచే మనము పోయి చేరిన యూరిలో నవి మనకుఁ గానవచ్చుచున్నవనియు, నందుచే మనము విడిచివచ్చిన యూరిలో నవి యుండవనియు, నందుచే నాయూరివారి కవి యికఁ గానరావనియు, మనము వెళ్లినచోటునకెల్ల నవి మనవెంటమాత్రమే వచ్చుచుండుననియు, మనలో నెవఁ

డైన నొకఁడు వాదింపవచ్చినచో, వాని కేమాత్రమైనను జ్ఞానమున్నదని మనము తలంప వచ్చునా? అట్లే మిక్కిలిదూరముగనున్న కొండలును, గొండలపై మిక్కిలి యెత్తున నున్న చెట్లును, పశువులు, జనులు మొదలగునవియును మిక్కిలి చిన్నవిగఁ గనుపించినను, నిజముగ నట్లేయుండునా?

ఈ పైయుదాహరణములచే, ప్రత్యక్షము సత్యమును సాధించుట కొకప్పుడు సాధనము గాఁజాలకపోవుటయేగాక, యందులకుమారుగ మఱియొకప్పు డసత్యమును సత్యముగ భ్రమింపఁజేయుటకుఁగూడ కారణమగుచున్నదని మనము లెస్సగఁ దెలిసికొన వచ్చునుగదా! అందుచేఁ బ్రత్యక్షమునకుఁ గోచరింపనంతమాత్రమున వైదికమతధర్మా ధర్మములు నిష్ప్రయోజనములని తలంప నగత్యముగాని, యవకాశముగాని లేవు!

"ఐనచో, నిఁక వైదికమతధర్మాధర్మములు ప్రయోజనకరములని యెట్లు చెప్ప వచ్చు?"నని మన నవనాగరక సోదరులు ప్రశ్నింపకమానరు! సమాధానమేమియనిన:- లోకమున జను లీజన్మమునఁ జేయు కార్యములలోఁ గొన్నిఁటికి నీజన్మలోనే ఫలములు కలుగుచుండుట లేదనుసంగతి నీగ్రంథమున నీప్రకరణముననే లోగడ, "ఈజన్మలోఁ జేసిన కర్మలన్నిఁటికిని నీజన్మలోనే ఫలము కలుగుచున్నదా?" యను శీర్షికక్రింద ఋజువుచేసియుంటిమి. అట్లే, జను లీజన్మమున ననుభవించు ఫలములలోఁ గొన్ని, వా రీజన్మమునఁ జేసిన కర్మల కెంతమాత్రమును ననుగుణ్యముగ (నంఁగా సంబంధించినవిగ) లేవను విషయమునుగూడ యీ ప్రకరణముననే లోగడ, "ఈ జన్మలోనిఫలము లీ జన్మలోఁజేసిన కర్మకుఁ దగినట్లే జరుగుచున్నవా?"యను శీర్షికక్రిందఁ దెలిపియుంటిమి. ఇందుచే, నీజన్మలోఁజేసిన కర్మలయొక్క ఫలములను నీజన్మమున జను లనుభవింపని వాని ననుభవించుటకును, నీజన్మలోఁజేసిన కర్మలకు సంబంధములేకయే యీజన్మలో వారనుభవించుచున్న ఫలములకుఁ గారణములైన కర్మల నీజన్మమునకుఁ బూర్వమే వారు చేసియుండుటకును, నితరజన్మములును నితరలోకములును నుండి తీరవలయునని తేలు చున్నది! ఈవిషయమును, నిందుపై నవనాగరకులకుఁ గల సంశయములనుగూడ యీ ప్రకరణముననే లోగడ, "ఇతర జన్మములు; ఇతరలోకములు"నను శీర్షిక మొదలుకొని "జన్మాంతరవిషయ సారాంశము; ధర్మస్వరూపనిర్ణయము"నను శీర్షికవఱకును విపులముగఁ జర్చించి, యీ విషయము సత్యమని తేల్చియుంటిమి. కాఁబట్టి, యీజన్మమునఁ జేయు నెట్టి యెట్టి కర్మకు నితరజన్మములందును నితరలోకములందును నెట్టి యెట్టి ఫలము గల్గునో యీ విషయమును సర్వజ్ఞుఁడును సర్వమును సృష్టించినవాఁడును నగు సర్వే శ్వరుఁడుతప్ప యెంత తెలివిగల మనుష్యుఁడును నెట్టి సాధనముచేతను తర్కించి తెలిసి కొనఁజాలఁడనియుఁ, గావున నట్టి సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరుఁడే యీవిషయములను దాను

సృజించిన జనులయొక్క ప్రయోజనముకొఱకై తానే తన యాజ్ఞారూపమగు వేదముల ద్వారా జనులకు బోధించియుండెననియు, నీగ్రంథముయొక్క మొదటి ప్రకరణమున, "వేదము"అను శీర్షిక మొదలుకొని, వేదమును గుఱించి ప్రాచీనచరిత్రలందలి "సారాంశ"మను శీర్షికవఱకును గల వ్యాసములందు విపులముగ వినిపించియుంటిమి; అందువిషయమున నవనాగరకులకుఁ గల సామాన్యసంశయములను మా యెఱిఁగినవాని నన్నిఁటిని, నాప్రకరణమునందే, "వేదమునుగుఱించి నవనాగరకులకుఁగల కొన్నిసంశయములు; వానికి సమాధానములు"నను శీర్షికమొదలుకొని యాప్రకరణము చివరవఱకును విమర్శించి యందే సమాధానములను జెప్పియుంటిమి. అట్లు వేదముద్వారా పరమేశ్వరునిచే జనులకు బోధింపఁబడి, యీజన్మమునఁ జేయు నెట్టి యెట్టి కర్మకు జన్మాంతరములందును లోకాంతరములందును నెట్టియెట్టి సుఖదుఃఖరూపములగు ఫలములు గల్గునో యావివరములను బోధించువిషయములకే ధర్మాధర్మము లనిపేరు. ఈసంగతి నీప్రకరణముననే ప్రారంభమున, "ధర్మమనఁగా నెట్టిది?"యను శీర్షికక్రిందఁ దెలిపియుంటిమి. అట్లీశ్వరునిచే నొసఁగఁబడిన వేదమునందలి ధర్మాధర్మములు జనులకు సులభముగ బోధపడుటకై మన పూర్వులగు మహర్షుల కొందఱు వేదమునుండి యాధర్మములనెత్తి "స్మృతు"లను (అనఁగా ధర్మశాస్త్రములను) గ్రంథములుగ వ్రాసియుండిరి. ఆవిషయమీప్రకరణముయొక్క మొట్టమొదటనే, "స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్ర లేమి చెప్పు?"నను శీర్షికక్రిందను, "స్మృతులనుగుఱించి ప్రాచీనచరిత్రలందుఁ జెప్పఁబడిన విషయములకుఁ బ్రమాణము"లను శీర్షికక్రిందను దెలుపఁబడియున్నది.

అట్టి వైదికమతధర్మములయొక్క ప్రధానప్రయోజనము, జనులకు లోకాంతరములందును రాఁబోవు జన్మములందును శ్రేయమును జేకూర్చి యందుమూలమున మోక్షమును బొందించుటకుఁ దోడ్పడుటయు వారి నధోగతిపాలుగానీయక కాపాడుటయునే యను విషయమునుగూడ "ధర్మమనఁగా నెట్టిది?"యను శీర్షికక్రిందనే వినిపించియుంటిమి. అట్టి ప్రధానప్రయోజనమునకుఁ దోడుగ, నీజన్మముననే యిహలోకసంబంధములగు సౌఖ్యములను జేకూర్చుటకూడ, వైదికమతధర్మములలోఁ గొన్నింటికి రెండవప్రయోజనముగా నున్నదను విషయము నీప్రకరణమందే "ధర్మాధర్మములు ప్రకృతిధర్మముల (Laws of Nature) వలెఁ గఠినములా?"యను శీర్షికక్రింది వ్యాసముయొక్క ప్రారంభమున వినిపించియుంటిమి. అట్టి రెండవ ప్రయోజనములను గనుఁగొని యవియే ప్రధానప్రయోజనములని మననవనాగరకులు భ్రమపడిరి. అందుచే నిహలోకసౌఖ్యములనిమిత్తమై విదేశీయులు వారి ప్రకృతిశాస్త్రజ్ఞానమును, లోకానుభవమును, నానాకాలములందలి యధిక సంఖ్యాకుల యభిప్రాయమునుబట్టి

మనుష్యబుద్ధిపై యాధారపడినిర్మించుకొను సాంఘిక, వ్యావహారిక, రాజకీయ నిబంధనల వలెనే, మనపూర్వులచే వారికాలమున నేర్పఱుపఁబడిన కట్టుబాట్లే మన వైదికమత ధర్మములని నవనాగరకులు తలంచి పొరపడియున్న సంగతిని "విదేశీయులు ధర్మముల నేర్పఱచుకొనువిధ" మను శీర్షికక్రింద నీప్రకరణముననే వినిపించియున్నాము. ఇంకను నందువిషయమై నవనాగరకులు చేయు నాక్షేపణములను వారికిఁ గల సంశయములను, "ధర్మశాస్త్రములపై నవనాగరకులకుఁ గల సంశయములు; వానికి సమాధానములు" నను శీర్షికమొదలుకొని యీ వ్యాసమువలనను విమర్శింపుచు సమాధానములను జెప్పికొనుచు వచ్చుచున్నాము.

ఈ పైగ్రంథమునంతను బట్టిచూడఁగా, వైదికమతధర్మములలోఁ గొన్నిఁటి వలనఁ బ్రత్యక్షమగు ప్రయోజనములు కనఁబడకపోయినను, జనులకు జన్మాంతరములందును, లోకాంతరములందును, దుఃఖములను, గష్టములను గలుగనీయక, వారి నధోగతిపాలుగానీయక కాపాడి, సౌఖ్యముల నొడఁగూర్చి, క్రమక్రమముగ మోక్షమును సమీపింపజేయుటయే వానియొక్క ముఖ్యప్రయోజనమని తేలఁగలదు. అట్టి జన్మాంతర లోకాంతర విషయములు మనయింద్రియములకు గోచరింపఁజాలని వగుటచే, నట్టి యతీంద్రియ విషయములను మనకుఁ దెలుపుటయే వైదికమత ధర్మములయొక్కయు వానికిమూలమగు వేదముయొక్కయు విశేషప్రయోజనమును, వానిఘనతకుఁ గారణమునునైయున్నదని, "ధర్మాధర్మము లతీంద్రియవిషయము లనుటకుఁ బ్రమాణము" లను శీర్షికక్రింద నీప్రకరణారంభమున వినిపించియుంటిమి. కావునఁ బ్రత్యక్షఫలములనీయని వైదికమతధర్మాధర్మములయొక్క ప్రయోజనము దీనిచే బోధపడఁగలదు !

## ధర్మశాస్త్రములందుఁ బ్రక్షిప్తములు (Interpolations) లేవా ?

నవనాగరకులలోఁ గొందఱు తమకిష్టముగాని వైదికమతధర్మములను బ్రజలచే మానిపించుటకై, యాధర్మములను బోధించెడి ధర్మశాస్త్రప్రమాణవచనములు ప్రక్షిప్తములని (అనఁగా నాశాస్త్రములందు మొదట నున్నవి కావనియు, వాని నెవరోకల్పించి వానియందు మధ్యకాలమునఁ జేర్చియుండిరనియు) వాదించుట యచ్చటచ్చటఁ గనఁబడుచున్నది. కాని, వీరు తమ వాదమునకు బలమగు నాధారమేమియుఁ జూపక, వట్టి యూహల సహాయముననే దానిని సాధింప యత్నించుచున్నారు. వీరు చెప్పెడి ధర్మశాస్త్రభాగములు నిజముగఁ బ్రక్షిప్తములే యైయున్నచో (అనఁగాఁ గల్పించి వ్రాయఁబడినవేయైనచో,) మన దేశమందలి యన్ని భాగములలోని గ్రంథములందును నట్టి ప్రమాణవాక్యము లొక్కరీతిగనే యున్నట్టుండ సంభవింపనేరదు.

కారణమేమనఁగా: వైదికమతధర్మములును, వానికిమూలములగు వేదశాస్త్రగ్రంథములును భరతవర్షమున నొక్కభాగమునను, నొక్కభాషలోని లిపియందునుమాత్రమే గాక, తెనుఁగు, అరవము, మలయాళముఁ, గన్నడము, మహారాష్ట్రము, నోఢ్రము, హిందీ, వంగము, గుజరాతీ మొదలగు పెక్కుదేశభాషలలోఁగూడిన వేఱువేఱుభాగములందలి ప్రజలయందుఁ బ్రచారమునుగని యనాదికాలమునుండియు వాడుకలోనున్నవి. అంతియగాక, యిటీవల ముద్రాయంత్రములును, నచ్చుపుస్తకములును బయలుదేరియున్నవిగాని, యంతకుఁబూర్వము మనదేశమందలి ప్రాచీనగ్రంథములన్నియుఁ దాటియాకులపై వ్రాయఁబడినవిగనే యున్నవనుసంగతి సర్వసామాన్యముగ నందఱునెఱిఁగినదే. అందుచే నిప్పటి యచ్చుగ్రంథములయొక్క ప్రతులు వేలకువేలు బయలువెడలి దేశమందు సులభముగ వ్యాపకముఁగాంచుట కవకాశమున్నట్లు పూర్వమందలి తాటియాకుగ్రంథముల కవకాశములేదు. ఒకగ్రంథమున కొక్క ప్రతిని గలిగింపవలసియున్నచో నాకాలమున మిక్కిలిశ్రమపడి చాలకాలము వ్రాయవలసియుండెడిది. అందుచే నట్టిగ్రంథములందు మిక్కిలి మక్కువగలబుద్ధిమంతు లెవరైనను వారిస్వోపయోగమున కొక్కొక్కప్రతినిమాత్రము వ్రాసికొనఁగలిగియుండెడివారు. అందుచే దేశమున నేమూలనైన, నెవరైనను నేదైనను స్వప్రయోజనమునుగోరిగాని, తాము వైదికమతాచారములందుఁ గావింపఁదలఁచిన మార్పునందలి తీవ్రమగు పట్టుదలచేఁగాని, యొకధర్మమును మార్చి వ్రాయఁదలఁచినచో, వారిస్వాధీనములోనున్న యాగ్రంథముయొక్క వారిసొంత ప్రతి (Private Copy) లోమాత్రమే యట్లుమార్చి వ్రాసికొన సాధ్యము కాఁజాలును గాని, దేశమందలి యన్నిమూలలను బెక్కుభాషలలోఁ బలువురిస్వాధీనములలోనున్న పెక్కుప్రతులయం దారీతిగమార్చివ్రాయుట సాధ్యము కాఁజాలదనుసంగతి సులభముగ గ్రహింపవచ్చును.

అంతేగాక, యీకాలమున మనదేశమున నొకమూల బయలుదేరినవిషయమును దక్కిన యన్నిమూలలకును దెలుపుటకును బ్రచారముచేయుటకును దగినసాధనములగు వార్తాపత్రికలు (News Papers)ను, దపాలాకచ్చేరులు (Post Offices)ను, నయోమార్గములును, ధూమశకటములు (Railways)ను, దంతివార్తలు (Telephones & Telegrams) ను, దంతిరహితవార్తలు (Wireless Telegrams)ను, దూరశ్రవణయంత్రములు (Broadcasting Machinery)ను మొదలగునవకాశములు పెక్కులు గలవు. ఇట్టియవకాశములు గలకాలముననే, వైదికమతధర్మములను స్వేచ్ఛానుసారముగ మార్చి పారవేయవలయునని బయలుదేరిన 'బ్రహ్మసమాజము' మొదలగునుద్యమములు బహుకాలముగఁ బ్రయత్నించియుఁ, గొన్నికోట్లసంఖ్యగల వైదికమతస్థులలోఁ గొన్ని

వందల సంఖ్యగలవారినిమాత్రమే యామతమునుండి భ్రష్టులనుగావించి, తాము చేయఁ దలఁచినమార్పును వారితో సరిపుచ్చుకొనవలసినదై యున్నవి. ఆయుద్యమమువలెనే పైన జెల్పినయవకాశముల నాధారముగఁగొని, వైదికమతముపై యొకదానివెనుక నొకటిగ దాడివెడలిన యార్యసమాజము, దివ్యజ్ఞానసమాజము (Theosophical Society) మొదలగునవిగూడ లోకమునంతను నొక్కమతముక్రిందికిఁ దీసికొనిరావలయునను నుద్దేశ్యముతో బయలువెడలినను, నట్లుచేయఁజాలక యందులకుమారుగ దేనివలన కదియే వేఱొక క్రొత్తమతముగఁబరిణమించి యందుమూలమున, లోకమున నిదివఱకున్నమతముల సంఖ్యను వృద్ధిగావించినవాయెను! అట్లు కావలసివచ్చుటకుఁ గారణము, వైదికమతధర్మములును ధర్మశాస్త్రములును సులభముగఁ జెనకరానివగుటయే. అంతియగాక, యాసమాజములలో ముందు బయలువెడలినవానిలోలేని యొక్కొక వైదికమతధర్మవిశేషమును, వెనుక బయలువెడలినసమాజము లొక్కటొక్కటిగఁ గలిగియుండుటయే, వానిలో నవి యొకదానితోనొకటి యేకీభవింపక వేఱువేఱుగ నుండవలసివచ్చుటకుఁ గారణమైనది. ఎట్లనిన: మొదటబయలుదేరిన బ్రహ్మసమాజము, వైదికమతగ్రంథములందలి యుపనిషత్తులనుమాత్రమే ప్రమాణముగ నంగీకరించునదియై, యాయుపనిషత్తులకుఁ దానుతలంచు నర్థమునుసరించి వేదములును, స్మృతులును, బురాణేతిహాసములును లేవనియుఁ, గావున నవి ప్రామాణ్యములుగావనియు, నందుచే వానిననుసరించు వర్ణవ్యవస్థ మొదలగు వైదికమతాచారములనుదోలఁగించి యామతమును దానుతలంచురీతిని నేకజాతిగ సంస్కరింపవలయుననియు నెంచి యందులకుఁ బూనియుండెను. ఆటుపైవెడలిన యార్యసమాజ మట్లుగాక, యుపనిషత్తులతోఁబాటు వేదములుగూడ ప్రామాణ్యములేయని యంగీకరించెను. ఇదియే యీరెండుసమాజములకును భేదము. కాని, యార్యసమాజ మంతటితోనిలువక, యుపనిషత్తులును వేదములునుమాత్రమే ప్రామాణ్యములనియుఁ, గాని, వానియొక్క యర్థము తానుచెప్పువిధముగనే యుండవలయుననియు, స్మృతులును బురాణేతిహాసములును జెప్పునర్థములు తప్పనియుఁ, గావున వానిననుసరించు వైదికమతాచారములు తాను వేదమునకుఁ జెప్పునర్థమునుసరించి సంస్కరింపఁబడవలయుననియు వాదించుచు, నందులకుఁ బూనుకొనెను. పిమ్మటబయలుదేరిన దివ్యజ్ఞానసమాజ ముపనిషత్తులును, వేదములును, స్మృతులును, బురాణేతిహాసములును, నన్నియుఁ బ్రమాణములేయనియుఁ, గాని, వాని యర్థము వైదికమతసంఘము సరిగాఁదెలిసికొని వర్తించుటలేదనియుఁ, గాబట్టి 'జన్మను బట్టి జాతివిభాగమేర్పఱచుట' మొదలగు నాచారములనుమార్చి, తానుదలంచు నర్థము ప్రకారము 'గుణకర్మలననుసరించి జాతివ్యవస్థ' మొదలగునవి యేర్పఱుపవలయుననియు నెంచి యందులకుఁ బూనికొనియెను. ఇట్లన్నిసమాజములును వాని ప్రచారములను నెల

కొల్పుకొనుటకుఁ బైనదెల్పిన వార్తాపత్రికలు మొదలగుసౌకర్యములన్నియుఁ నుండినప్పటి కిని వైదికమతాచారములను, వానికాధారమగు ధర్మశాస్త్రములను జెనకుట దుర్ఘటమైనం దున, నవి యొకటివెనుకనొకటిగ రానురాను వైదికమతమార్గమునకే రావలసివచ్చు చున్నది.

ఇఁకఁ బూర్వకాలమున మనదేశమునఁ బైఁదెల్పిన యవకాశములన్నియుం లేక పోవుటయేగాక, దేశమందలి యొకభాగమునుండి వేఱొకభాగమునకుఁ బ్రయాణము చేయుటకుఁ బ్రతిబంధకములైన పెక్కువాగులును, నదులును, నడవులును, బర్వతము లును మొదలగువానిచే దేశము నిండియుండెడిది. మార్గములు మిక్కిలి దుర్గమములై యుండెడివి. ముఖ్యపట్టణము లొకదానికొకటి మిక్కిలి దూరముగనుండెడివి. అందుచే వేఱువేఱు దేశములవారంద ఱొక్కచోట సమావేశమగుటకుఁగాని, యిప్పటివలె మితి మీరినసభలను, సంఘములును, సమాజములును నేర్పడుటకుఁగాని, పూర్వకాలమున మన దేశమున నవకాశము మిక్కిలి తక్కువగనుండెడిని. ఇట్టిస్థితిలోఁ బైనదెల్పిన యన్ని యవకాశములునున్న యీకాలముననే బయలుదేరిన బ్రహ్మసమాజము మొదలగుసంస్క రణోద్యమములు వైరీతిని విఫలములుగావలసివచ్చుచుండఁగా, నీక నట్టియవకాశములు లేకపోఁగా నందులకుమాఱుగఁ బైరీతి ప్రతిబాధకములుగల పూర్వకాలమున, వైదిక మతమునందుఁగాని, దేశమునఁ బెక్కుమూలలనున్న యామతగ్రంథములందుఁగాని మార్పుఁగలిగింపఁజూచు నెట్టియుద్యమమైనను గొనసాగియుండుట కేవల మసంభవమని వేఱుగఁ జెప్పనక్కరలేదు.

మఱియును సామాన్యముగ నట్టి మతగ్రంథములన్నియుం బూర్వకాలమునఁ బండితులగు బ్రాహ్మణులస్వాధీనమందుమాత్రమే యెక్కువగనుండెడివి. "బ్రాహ్మణానా మనేకత్వమ్" అను లోకోక్తిననుసరించి సామాన్యముగ బ్రాహ్మణులందును, నందు ముఖ్య ముగఁ బండితులందును, నితరులయందుఁగంటె నైకమత్యము మిక్కిలి తక్కువగనుం డును. అందుచే బూర్వులువ్రాసిన మతగ్రంథములలోనివిషయముల నెవరైనఁగొందఱు మార్పఁజూచినచో, దానిని బ్రతిఘటించుపండితులు పెక్కుమంది తప్పక బయలుదేరి తీరుదురు. కావున నట్టియుద్యమము తలయెత్తనేరదు.

అంతియగాక, యప్పటిప్రభువులు తీవ్రమగు వైదికమతాభిమానముగలవారై యామతధర్మసంరక్షణమే తమజన్మసాఫల్యహేతువని నమ్మియుండువారగుటచేతను, నిప్పటి ప్రభుత్వవర్గమువలె విమతస్థులుగాని, మతతాటస్థ్యముగలవారుగాని కాకపోవుటచేతను, మతధర్మములందు సందేహములుఁగల్గినపుడు పండితపరిషత్తులనుజరిపించి తమసమ్ముఖముననే శాస్త్రానుసారముగ ధర్మనిర్ణయములను గావించుచుండెడివారు. అందుచే, వైదికమతధర్మ

ములకు విముఖులగువా రామతమునుండి చల్లఁగఁదొలఁగిపోయి తమయిష్టమువచ్చిన యితరమతమునఁజేరుటకో, యట్టిమతములను నెలకొల్పుకొనుటకోమాత్రమే యవకాశ ముండెడిదిగాని, తమయిచ్చవచ్చినట్లు శాస్త్రవిరుద్ధముగ వైదికమతధర్మములనుగాని, ధర్మశాస్త్రములనుగాని మార్పఁజూచినచో వారు రాజశాసనమునకు గుఱిగావలసి వచ్చెడిది.

ఈపైనదెల్పిన కారణములన్నిఁటిని బట్టిచూడఁగా, నొకవేళఁ బూర్వకాలమున మనదేశమందలి యేభాగముననైనను గొందఱుబయలుదేరి వైదికమతశాస్త్రములందుఁ గొన్నిమార్పులనుగలిగింప సమకట్టినచో, నది వారివారియిండ్లలోమాత్రమేగాని, కాక యిరుగుపొరుగిండ్లలోమాత్రమేగాని, కానిచో నాయూరిలోమాత్రమేగాని, యంతకును మించినచో దానిచుట్టుప్రక్కల గ్రామములలోమాత్రమేగాని, ప్రచారమునుగని యంత టితో నంతరింపవలసినదేగాని, యాయుద్యమము కొనసాగి దేశమందలి యన్నిభాగము లలోనున్న ధర్మశాస్త్రగ్రంథములకును బ్రాకియుండనేరదు. అందువలన, నిప్పటి నవ నాగరకులుకొందఱు తలంచునట్లు ధర్మశాస్త్రములందుఁ బ్రక్షిప్తములేయున్నయెడల, నవి కొన్నిప్రతులలో నున్నప్పటికిని, నట్టిప్రక్షిప్తములులేని పరిశుద్ధప్రతులు కొన్నిగాకున్నఁ గొన్నియైనను, దేశమున నన్నిభాగములందునుగాకున్నఁ గొన్నిభాగములలోనైనను, వారికి లభించియుండవలసినదే.

ఇటీవల ముద్రాయంత్రములు బయలుదేరి యచ్చుప్రతులు వెలువడునప్పుడు ప్రక టనకర్తలు మిక్కిలిజాగ్రత్తతోఁ బెక్కువ్రాతప్రతులను సంపాదించి, యన్నిఁటిని బరిశో ధించి, వానియందు స్వల్పములగు పాఠభేదములున్నను వానినిగూడఁబోనీయక గ్రంథము లందుఁ బ్రకటించుచునేవచ్చుచుండిరి. అట్టిసందర్భమున, నేవైనను బ్రక్షిప్తములు కొన్ని ప్రతులందున్నచో నవిలేనిప్రతులుగూడ కొన్ని ప్రకటనకర్తలకుఁ గండ్లఁబడియుండవలసి నదే. అట్టివానినిగూడ వారు తప్పక ప్రకటించియేయుండెడివారు. అట్టిప్రతులేమియు నున్నట్లింతవఱకు మన నవనాగరకసోదరులెవ్వరును గన్పఱచియుండుట కానరాదు. ఒకవేళ వారట్లు గనుపఱచఁజాలినను, దామగనపఱచుప్రతులే శుద్ధములైనవనియు, నందులకు వ్యతిరేకముగనున్నప్రతులే ప్రక్షిప్తములతోఁ గూడినవనియు, వానియందలి పలానివిషయములు ప్రక్షిప్తములనియు, వేదములు మొదలగు తగిన గట్టియాధారముల సహాయమున ఋజువుపఱచుకొనవలసినభారము తిరిగి మన నవనాగరకులపైననేయుండు ను. అట్టివిషయమునుగూడ దేనిని మననవనాగరకు లింతవఱకు ఋజువుపఱచఁజాలియు న్నట్లు వినియుండము.

అట్టిదేదియును లేకయే, వారు తమకు సమ్మతముగాని ధర్మముల నెట్లైననుదొలఁగించుటకై యవిప్రక్షిప్తములని ఋజువుచేయుటకే పెనఁగులాడుచుండిరి గాని, వేదశాస్త్రములందలియు, వానిలోని ధర్మములందలియు నభిమానముచేతఁగాని, యందలి సత్యమగుధర్మములను దెలిసికొని యసత్యమగువానిని బరిత్యజింపవలయునను పట్టుదలచేతఁ గాని, వానియందలి ప్రక్షిప్తములను గనుఁగొనుటకై ప్రయత్నించుచున్నవారుగారు. తమకు సమ్మతములుగాని ధర్మశాస్త్రప్రమాణవాక్యములు ప్రక్షిప్తములైయుండునని యూరక యూహించి వాదింపఁజూచుట నిరాధారమగుటచే, నది సత్యదూరమును నిష్ప్రయోజనమును నగుటయేగాక సంఘమునకును మతమునకును మిక్కిలి హానికరముగూడఁ గాఁగలదు. ఈసంగతి యీక్రింది చిన్నకథచేఁ దేటపడఁగలదు.

పూర్వ మొకయూర నొకమనుష్యున కిరువురు భార్యలుండిరఁట. కొంతకాలమున కతని తలవెండ్రుకలలోఁ గొన్ని క్రమక్రమముగ నెఱయుట కారంభించెనఁట. అతనిభార్యలలో రెండవది కొంచెము పడుచువనమునఁ నుండుటచేఁ దనమగని తలలోఁ దెల్లవెంట్రుకలు గన్పట్టినచోఁ దనవుగఁడు ముసలివాఁడని తనను జూచినవారు నవ్వెదరనుభయముచే, నవకాశము దొరికినపుడెల్లను నతనితలలోని తెల్లవెండ్రుకలను బెఱికివేయుచుండెనఁట. కాని, పెద్దభార్య మగనివలెనే గొంచెము వయసుచెల్లినదగుటచే నాపెయొక్కజుట్టప్పటికే నెఱసియుండెనఁట. అందుచేఁ, దనభర్తయొక్కతలలో నల్లవెంట్రుకలు గనుపించినచోఁ దనభర్త పడుచువాఁడనియుఁ దాను ముసలిదైయుండి పడుచుమగనిని బెండ్లాడినదనియుఁ దనునుజూచినవారు నవ్వెదరని భయపడి, యాతని తలలోని నల్లవెంట్రుకలను సందుదొరికినపుడెల్ల నొక్కటొక్కటిగఁ బీకి పారవేయ మొదలుపెట్టెనఁట. ఇట్లు నల్లవెండ్రుకలన్నియుఁ ముసలిపెండ్లమును, దెల్లనివన్నియుఁ బడుచుపెండ్లమును బీకివేయుటచేఁ గొలఁది కాలమునకే పాపమామగఁడు బోడితలవాఁడు కావలసివచ్చెనఁట!

అట్లే మన నవనాగరకులలోఁ గొందఱు తమకిష్టములేని ప్రమాణవాక్యములకుఁ బ్రక్షిప్తములని పేరుపెట్టి వానిని మనధర్మశాస్త్రములనుండి తీసివేయఁజూచినచో, నట్టి యవకాశమునే యాధారముచేసికొని తక్కినవారుగూడ యెవరికిష్టములేని విషయములకు వారు ప్రక్షిప్తములని పేరుపెట్టి వానిని ధర్మశాస్త్రములనుండి తీసివేసితీరెదరు. అపుడింక ధర్మశాస్త్రములందు మిగిలియుండున దేముండును? కొట్టివ్రేతలతో నిండిన తాటియాకులుమాత్రమే! ఇఁక నాగ్రంథములచేఁ గాఁదగిన ప్రయోజనమేమి? లోకమున యుక్తాయుక్తములను ధర్మాధర్మములను నిర్ణయించుట కిఁక నాధారమేమి? అధికసంఖ్యాకుల యభిప్రాయములుగాని, యంతరాత్మలయొక్క బోధలు మొదలగున

వేవియుంగాని, ధర్మాధర్మములను నిర్ణయింప సమర్థములు కాఁజాలవని యీప్రకరణమునసే లోగడ బుజువుచేసియుంటిమి. కావున నిఁక నవనాగరకులయొక్క పైవాదముచే సంభవించునవి మిక్కిలి విషమపరిస్థితియే ! ! ఇట్టి దుర్వాదమును నవనాగరకులలోని సామాన్యులుమాత్రమే గాక, వారిలోనగ్రగణ్యులని చెప్పఁదగిన శ్రీగాంధీగారుకూడఁ గావించియుండఁగా, దానిపై "ధర్మరాజ్య"పత్రిక యీాక్రిందిరీతిని వ్యాఖ్యానముఁ జేసియున్నది:—

"Mr. Gandhi holds "Manusmrithi" to be part of our Sastras but would not swear by every word of Manu. Some of the provisions are apparently not to his liking. Left to himself he would frame a "Gandhi Smrithi", eschewing the rules he dislikes. One aspect of this attitude needs consideration. Claiming, as he does, the right to decide what portions of the Shastra are to be accepted and what rejected, Mr. Gandhi, as the apostle of equality, cannot deny that right to others. And then this curious position will arise, *viz.*, the portions acceptable to him might be rejected by others and *vice versa*. When this mutually destructive process has been fully gone through, there will not be a single provision of the Smrithi left which has not escaped condemnation. In that case, are we to be guided by Mr. Gandhi's notions of what is right and wrong or allow the whole Smrithi to be destroyed because each individual takes the liberty to veto one provision or other of the Smrithi ? There is a third alternative. A referendum may be arranged, for deciding the question by majority votes ! Mr. Gandhi's allegiance to the Smrithis as Shastras would appear to be of a very nominal character. He won't hesitate to change it to suit his own fancies.

(Notes and Comments), "Dharmarajya" Vol. 1. No. 15. pp. 5.

దీనియర్థ మేమనఁగా:—"గాంధీగారు 'మనుస్మృతి'ని మనశాస్త్రములలో నొకటిగా నంగీకరించెదరు; కాని మనువుయొక్క ప్రతివాక్యమును బ్రమాణముగ నంగీకరించుటకును దానికి బద్ధులగుటకును నొల్లరు. అందలి ధర్మములు కొన్ని వారి కిష్టము లేనట్లు కనఁబడుచున్నది. వారి యిష్టముచొప్పునఁ జేయనిచ్చినచో వారి కిష్టములేని ధర్మములను దొలఁగించి "గాంధీస్మృతి" నొకదానిని నిర్మింపఁగలరు. ఇంకొకవిషయము విచారింపఁదగియున్నది. శాస్త్రమందలి యేయేభాగముల నంగీకరింపవలయునో, వేనిని ద్రోసివేయవలయునో యావిషయమును నిర్ణయించుటకు నధికారమును గాంధీగారు కోరువిధముగనే యితరులుగూడఁ గోరినచో, గాంధీగారు సర్వజనసమత్వ సిద్ధాంత

మును బోధించువారు గావున నట్టి వైయధికారము నితరులకుఁ దిరస్కరింపఁజాలరు. అపు డీక్రింది విచిత్రపరిస్థితి యేర్పడఁగలదు; ఏమనిన: వారికి (గాంధీగారికి) సమ్మతము లగు భాగముల నితరులు తిరస్కరింపవచ్చును; ఇతరు లంగీకరించినవానిని గాంధీగారు తిరస్కరింపవచ్చును. ఇట్లు రెండుపక్షములకును ధ్వంసహేతువగు పద్ధతి యవలంబింపఁ బడి పూర్తియగుసరికి, ఖండింపఁబడని ధర్మ మొక్కటియైనను గూడ స్మృతిలో మిగిలి యుండఁబోదు! అస్థితిలో, గాంధీగారు తప్పనియు నొప్పనియుఁ దలంచు తలంపుల ననుసరించియే మనము నడువవలయునా, కాక, ప్రతివారును స్మృతిలోని యేదో యొక ధర్మమును నిరసించుటచే స్మృతియంతయును ధ్వంసమగుటకు విడవివేయవల యునా? మూఁడవమార్గ మొకటియున్నది. ఈసమస్యను బరిష్కరించుటకుఁ బ్రజాభి ప్రాయమును గనుఁగొను నేర్పాటుచేసి, యధికసంఖ్యాకుల సమ్మతిని బడయవచ్చును! గాంధీగారికి స్మృతులయందుఁగల శాస్త్రవిశ్వాసము కేవల నామమాత్రమే (యనఁగా నట్టిపేరునకుమాత్రమే)యని తోఁచుచున్నది. వారు తమ యిష్టముననుసరించి దానిని మార్చుటకు వెనుకాడరు.”

(వ్యాఖ్యలు) “ధర్మరాజ్య”పత్రిక. సంపు. 1. సంచి. 15. పుట. 5.

కాని, గాంధీగారియందుఁ దీవ్రమగు నభిమానముగల యీనాఁటి మనవనాగ రకసోదరులు కొంద ఱీసందర్భమున నొక యాక్షేపణమును జెప్పవచ్చును. ఏమన: “గాంధీగారిపై ద్వేషముగలవారు వారిపై వృథానిందలను మోపుటకై, వారు ధర్మ శాస్త్రములలోఁ దమకిష్టములేని ధర్మములను బ్రక్షిప్తములని చెప్పినట్లు వ్రాసియుండ వచ్చును; కాని, నిజముగ గాంధీగా రట్లెక్కడఁ జెప్పియుండె?” రని వారు ప్రశ్నింప వచ్చును. ఈక్రిందివిషయమును జదివినచో గాంధీగా రట్లుచెప్పియున్నమాట సత్యమే యని తేలఁగలదు.

గాంధీగారు తాము హిందూమతశాస్త్రముల నన్నిఁటిని జదివియుంటిమనియుఁ, “జండాలురయస్పృశ్యత” వానిలో నెచటను జెప్పఁబడియుండలేదనియుఁ, గావున నది హిందూమతశాస్త్రములకు విరుద్ధమనియు బోధించుచుఁ బ్రచారముచేయుచున్న కాలమునఁ, దిరునల్వేలినుండి R. కృష్ణస్వామిఅయ్యర్‌గారు తే 7—10—1921 దీ “హిందూ” (The Hindu) పత్రికయందు ధర్మశాస్త్రములనుండి ప్రమాణవాక్యముల నెత్తిచూపి గాంధీగారిబోధను ఖండించియుండిరి. అవిధముగనే, బెజవాడనుండి “శ్రుతి ధర్మసంజీవనీ” పత్రికాధిపతులగు (కీర్తిశేషులైన) బ్రహ్మశ్రీ శివపురపు వీరభద్రపాక యాజిగారుకూడ వేలువేలుధర్మశాస్త్రములనుండి (యనఁగా: మనుస్మృతి, యాజ్ఞ వల్క్యస్మృతి మొదలగువానినుండి) కొన్నిప్రమాణవాక్యములను గనఁబఱచుచు,

నందుమూలమున జండాలుర యస్పృశ్యత శాస్త్రసిద్ధమై యున్నదని తెలిపి, యందులకు విరుద్ధముగ గాంధీగారు గావించుచున్నబోధకు శాస్త్రాధారములను గనఁబఱచవలసినదని గాంధీగారిని గోరుచు 16—3—1921-వ తేదీన వారికొక లేఖవ్రాసి రిజస్టర్డు-పోస్టు (Registered Post)లోఁ బంపియుండిరి. అందులకు గాంధీగారి కుమారులగు దేవదాసుగాంధీగారు *ప్రత్యుత్తరము వ్రాయుచు, నం దీక్రిందిరీతిని వ్రాసియున్నారు.

Godhra, 18—4—1921.

"Dear Sir,

My father has received your letter. He asks me to..............
As regards the Shastraic authorities you quote, my father believes that anything sanctioning such inhuman treatment could not emanate from Rishis.

Yours truly,
DEVDOS GANDHI"

వైశాఖునకుఁ దెనుఁగు:—

"అయ్యా, మీయుత్తరము మానాయనగారి కందినది. వారు (మీకీక్రిందివిషయములను దెలుపుమని) నన్ను గోరినారు.......................................
మీరు కనుపఱచిన శాస్త్రప్రమాణవిషయములలో, నట్టిక్రూరమైన యభిప్రాయమున కనుమతించున దేదియైనను, ఋషులనుండి పుట్టదని మానాయనగారు నమ్ముచున్నారు.

గోధ్ర, 18—4—21 — ఇట్లు, దేవదాసు గాంధీ.

(శాస్త్రములనుండి యెత్తిచూపిన ప్రమాణవాక్యములను విమర్శించుటకును నవి ప్రామాణ్యములగునో కావో యావిషయమును నిర్ణయించుటకును, గాంధీగారి కాధారము వారిమనస్సును, వారినమ్మకమును మాత్రమే యని పైప్రత్యుత్తరమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈసంగతియే యీక్రిందఁజూపఁబోవు మఱియొక విషయమువలన మఱింత సుస్పష్టము కాఁగలదు.)

పైప్రత్యుత్తరముపై తిరిగి యీక్రిందిరీతిని శ్రీ పాకయాజిగారు గాంధీగారికి వ్రాయించియున్నారు:—

* ఈయుత్తర ప్రత్యుత్తర గ్రంథమంతయును, శ్రీ వీరభద్రపాకయాజిగారు తమ "శ్రుతిధర్మసంజీవనీ"పత్రిక, 1-వ సంపుటము. 21, 22 సంఖ్యగల (1921-వ సంవత్సరము మార్చినెల 1—15 తేదీల) సంచికలయందుఁ బ్రకటించియేయున్నారు. గ్రంథవిస్తరభీతిచే మేము దానినంతను నిచటఁబ్రకటింపవీలులేక, సారాంశములనుమాత్రమెత్తి చూపుచున్నాము.

To

Mr. M. K. GANDHI,

Editor, "Young India," Ahmedabad.

Sir,

(1) We are in receipt of your post card dated 18—4—21 written by your son, Devdoss Gandhi, in reply to our Registered letter of the 16th Ultimo.

(2) ... ... ... ... ... ...

(3) ... ... ... ... ... ...

(4) We had quoted various texts from the Codes of Manu, Yajnyavalkya, & others regarding the excommunication of Chandalas. *But you say that the Sastras could not emanate from those Holy Rishis if they sanctioned such inhuman treatment and you evidently infer that those laws of excommunication contained in the Sastras, are all fictitious.*

We cannot but say that this is a most inconsiderate and rash conclusion, as it goes against your own professed belief in the Sastras.

(5) Following, however, your theory that the laws of excommunication are all fictitious, we shall be glad to have your answer to the following points:—

(a) A Brahmin woman begets children in company with a Sudra.

(b) A Dwija abstains from going through the course of Upanayanam.

(c) A Bharateeya marries a girl of his own Gotra.

Supposing these incidents take place to-day, do you maintain that the above persons should be excommunicated or not?

If you say they should, then it is inconsistent with your present speeches, (viz., "that any thing sanctioning such inhuman treatment could not emanate from Rishis.") If they should not, it follows that you tolerate adultery, waiving of Upanayanam, marrying girls of one's own Gotra and the like crimes. Do you admit this and preach that the Bharateeyas should turn immoral and outcastes from the Vedic religion? Can you say that it does not retard the progress and prosperity of the Hindu nation by following this preaching of yours?

We shall be glad to have either your detailed reply to this or to hear that you henceforth reserve this preaching of yours on the subject.

Bezwada. }
27-4-1921. }

Yours truly,
S. V. PAKAYAJI,
Editor, Sruti Dharma Sanjivani.

[N. B. Portion in brackets is added by us from the above correspondence, to make the idea more clear.]

పైజాబునకుఁ దెనుగు:—

"అయ్యా,

తే 16-3-21 దీని మేమిచ్చిన రెజిష్టర్డుత్తరమునకుఁ దాము 18-4-21 తేదీని మీకుమారుని పేర నిప్పించిన ప్రత్యుత్తరము నేఁడు మాకందినది.................. చండాలాదుల గ్రామబహిష్కారాదులను బోధించెడి మన్వాదిశాస్త్రవచనములనుజూపఁగ దాము "మానవులలోఁ గొందఱిని గ్రామబహిష్కృతులనుగా విధించెడి యమానుషపు బోధ మహర్షులవలనఁ బుట్టదని నమ్ముచున్నా"మని వ్రాసినారు. దీనింబట్టి చండాలాదుల గ్రామబహిష్కారాదులనుగూర్చి చెప్పెడి శాస్త్రవచనములనెల్లఁ గల్పితములనుగాఁ దాము నిశ్చయించినట్లు తెలియవచ్చినది. ఇది సాహసమనక తీరదు.

వాదమునిమిత్తము తమ యభిప్రాయానుసారముగఁ జండాలాదుల గ్రామబహిష్కారమునుబోధించు శాస్త్రవచనములు కల్పితములనియొప్పుకొని, కొన్ని ప్రశ్నలడుగుచున్నవారము. ఇపుడొకబ్రాహ్మణస్త్రీ శూద్రునిగలిసి సంతానమును గాంచును. ఇంకొక ద్విజుఁ డుపనయనము మానుకొనును. వేఱొకఁడు సగోత్ర కన్యాపరిణయము గావించుకొనును. వారిని దాము గ్రామబహిష్కృతులను గావింపవలయునందురా? వలదందురా? బహిష్కారము గావింపవలయునందురేని, వెనుకటిబహిష్కారమును దీసివేయవలయుననుట యంక్తమెట్లగును? వలదందురా, తాము వ్యభిచారమును, నుపనయనత్యాగమును, సగోత్రకన్యాపరిణయమును నంగీకరించినవారగుదురు. మీరా యధర్మములనంగీకరించి భారతీయులనుగూడ నీతిబాహ్యులు, వేదబాహ్యులు కావలయునని బోధించెదరా? ఈ మీబోధవినినభారతీయులు బాగుపడెదరా? ఇందులకు సరియగు సమాధానములనిచ్చెదరా? లేక, మీయీ బోధనువిరమించి, విరమించితిమని వెంటనే ప్రకటించెదరా? తెలుపఁగోరెదను."

ఇట్లు
ఎస్. వి. పాకయాజి,
శ్రుతిధర్మసంజీవనీ పత్రికాధిపతి.

బెజవాడ, }
27-4-21. }

ఈజాబునకు గాంధీగారు నేఁటివఱకును ప్రత్యుత్తరమిచ్చి యుండలేదనియే చెప్ప వచ్చును.దీనినిబట్టి గాంధీగారికిష్టములేని ధర్మశాస్త్రవిషయములపట్ల వారి యాశయమెట్టి దో విశదమగుచున్నది. ఇట్టిదే మఱియొకవిషయముగలదు. ఏమనఁగా: గాంధీగారు తమ 'యంగ్-ఇండియా' (Young India) పత్రికయొక్క 1921 సం॥ అక్టోబరు నెల 12-వ తేదీ సంచికయందు "హిందూమత"మను వ్యాసమున వ్రాసికొనిన విషయములను గొన్నిఁటిని, నవంబరు నెల 2-వ తేదీ "హిందూ" (The Hindu) పత్రికయందు "మహాత్మాగాంధీ,—హిందూమతము," అను శీర్షికక్రింద, నయోధ్యలోని సనాతనధర్మ మండలి కార్యదర్శియగు శ్రీయుత 'అవధబిహారివల్లీలు' గారు 'మీరట్'ను విమర్శించి ప్రకటించియుండిరి. అందలి సారాంశములనుగ్రహించి 'గార్త్స్న్నమదశర్మ'గా రనువారు "శ్రుతిధర్మసంజీవనీ"పత్రిక 2-వ సంపు. 11, 12, సంచికలలో నీక్రిందిరీతిని బ్రకటించి యున్నారు:—

"మహాత్మాగాంధీగారు, .. ... ... ... ...

'శాస్త్రములకు విద్వాంసులిచ్చునర్థము యుక్తికిని, నైతికబుద్ధికిని, సరిగాకున్న నేవిశ్వ సించ ననుచున్నారు.........శాస్త్రార్థము లెవరియుక్తికిని, నైతికబుద్ధికిని సరిపోవల యును? ఇవి యందఱకు నొకవిధముననుండవని గాంధీగారికిఁ దెలియదా? గాంధీగారికి మిగులవిశ్వాసార్హమైన భగవద్గీతయందుఁ బదునారవయధ్యాయమున 23, 24 శ్లోకముల యందుఁ, "కర్తవ్యాకర్తవ్యములందు శాస్త్రమే ప్రమాణముగాని, శాస్త్రవిధులనతిక్ర మించి తనయిచ్చవచ్చినట్లు సంచరించువాఁ డర్థసిద్ధుఁడుకాఁ"డనియుఁ, "సుఖమునుగాని పరమగతినిగాని పొందఁ"డనియుఁ జెప్పఁబడియున్నది. ఇట్లుండ, హిందూశాస్త్రములను బూర్తిగఁజదువని * గాంధీగారు తన యవికసితబుద్ధిని శాస్త్రార్థనిర్ణయమున నెట్లుపయో గింపఁగలరని తలఁచి యీ యసందర్భప్రలాపమును జేయుచున్నారో తెలియుట లేదు.

"హిందూశాస్త్రార్థములను శంకరాచార్యులవారలుగాని,శాస్త్రులవారలుగానిసరిగాఁ జెప్పలేరని నేను విస్పష్టముగాఁ జెప్పఁగలను." అని (గాంధీగారు) అనుచున్నారు. మఱి యెవరుచెప్పగలరని గాంధీగారితాత్పర్యము? హిందూశాస్త్రార్థములు వారిలోనిపండితులకుఁ దెలియక మఱియెవరికిఁ దెలియఁగలవు?...............ప్రతిహైందవుఁడు నీక

---

* గాంధీగారు భగవద్గీతయుఁ, దులసీదాసకృత రామాయణమునుమాత్రమే తప్ప హిందూమతమునుగుఱించిన గ్రంథములలో వేఁటేమియును జదివియుండలేదని వారే స్వయముగఁ బై'యంగ్-ఇండియా' పత్రికలో వ్రాసికొనినవిషయముగూడ, పైవ్యాసము యొక్క ప్రారంభమునఁ దెలుపఁబడియేయున్నది. కాని, గ్రంథవిస్తరభీతిచే మేమే దాని నిటఁ గనుపఱచ మానితిమి.

గాంధీగారినా, తనధర్మమునకు గురువుగ నెంచుకొనవలసినది ? ........చోద్యము ! ప్రాణముకంటె నెక్కుడుగఁజూచుకొను ధర్మముపట్ల గాంధీగారి ననుసరించునంత దుర్బల స్థితి కింకను హైందవులురాలేదని నమ్ముదురుగాక. ఇకనైనను గాంధీగారు హిందూమత ప్రవర్తకుఁడనని చెప్పికొనకుండవలయునని కోరుచున్నాఁడను. ఆయన చెప్పినయంశము లలో ననేకములు మాధర్మములకు విరోధములగుటచే నిర్భయులై మోమోటములేక విమర్శించుఁడని ప్రతిహైందవుని నేవేఁడెదను.

... ... ... ... ... ... ...

"ఎవరి యిచ్ఛవచ్చినట్లు వారు భగవంతుని నారాధింపవచ్చునని హిందూశాస్త్రములు చెప్పుచున్నవి. కాని, కొంద అస్పృశ్యులనుట నాకు యుక్తియుక్తముగ లేదు." అని (గాంధీగారు) చెప్పుచున్నారు. ఇందు మొదటియంశము శాస్త్రీయమే. రెండవయంశమునుగూర్చి స్మృతికర్తలంద ఱేకాభిప్రాయులైయున్నారు......"

"శ్రుతిధర్మసంజీవనీ" పత్త్రిక, సంపు. 2, సంచి. 11, 12.

పైవ్యాసములోని యంశమునుబట్టిచూడఁగా, గాంధీగారు తమ మనస్సునకునచ్చని ధర్మము లెంతటి ధర్మశాస్త్రబద్ధములైనను వానిని నిరాకరించుటలో వెనుకాఁడువ రు కారని స్పష్టముగఁ దెలియవచ్చుటలేదా ?

ఈవిధముగనే నవనాగరకులలోఁ బెక్కుమంది తమతమమనస్సులకు రుచింపని ధర్మములనెల్ల ధర్మశాస్త్రములందలి ప్రక్షిప్తములని తమ యిచ్ఛవచ్చినట్లూహించి లోకమునకు బోధింపఁగడఁగియున్నారు. ఇందులకునిదర్శనముగ, బాల్యవివాహములు మన దేశమం దాదికాలమునసుండెడివి గావనియుఁ, ప్రౌఢావివాహములే (యనఁగా రజస్వలానంతరవివాహములే) యాకాలమునసుండెడివనియుఁ గాని, మధ్యకాలమున మహమ్మదీయులు మనదేశముపై దాడివెడలివచ్చి క్రూరముగ మనదేశమందలి పెండ్లికానిపడుచులను జెఱఁబట్టుచుండుటచే నాబాధతొలఁగించుకొనుటకై బాలికలకుఁ జిన్నతనముననే పెండ్లిండ్లుచేయుటకు మనదేశస్థులు మొదలుపెట్టిరనియు, నట్టిపని కనుగుణ్యముగనుండుటకై రజస్వలలుకాని బాలికలకే పెండ్లిండ్లుచేయవలయునను నర్థముగల శ్లోకములను, "శ్లో. అష్టవర్షా భవేద్గౌరీ, నవవర్షాతు రోహిణీ" మొదలగువానిని గొన్నిఁటిని గల్పించి వ్రాసి ధర్మశాస్త్రములలోని కెక్కించియుండిరనియు, నందుచేనట్టి శాస్త్రవచనములు ప్రక్షిప్తములనియు, బాల్యవివాహములనుద్వేషించు నవనాగరకులలోఁ గొందఱూహించి వాదించుచుందురు.

మదరాసునగరము (చెన్నపట్టణము)నఁ గొంతకాలముక్రింద వెలువడిన 'విజ్ఞాన చంద్రికాగ్రంథమాల'వారిచేఁ బ్రకటింపఁబడిన "రాణీసంయుక్త" యనునవలలోఁ, గథానాయికయగు 'సంయుక్త'చేఁ బైపాఠమునే యాపెచెలికత్తెకుఁ జెప్పించియున్నారు. కాని; పైవాదమును జేయువారుగాని, దానిని గ్రంథములోని కెక్కించుకొన్నవారుగాని; యాగ్రంథమును బ్రచురించినవారుగాని, యావాదమునకట్టి గట్టియాధారము కలదనియుఁ, నట్టియాధార మేవిధముగ విశ్వసింపఁదగినదనియుఁ, గొంచెమైనను యీ

జించినట్లు కానరాదు. ఏమనిన, నీవ్యాసముయొక్క ప్రారంభమున నేమువినిపించియున్న పరిస్థితులనుబట్టి యాలోచించినచో, సెట్టి ప్రక్షిప్తము లైనను బూర్వకాలమున మనదేశ మందలి యన్నిమూలలలో బెక్కు వేఱు వేఱువ్యక్తుల స్వాధీనములలోనున్న గ్రంథప్రతు లలోనికి వ్యాపింపఁజాలుట పట్టియసంభవమని తెలియకపోదు. అందులకుఁదోడుగఁ, బైవాదము పట్టియబద్ధమని నూగ్రంథిమాలవారిచేతనే ప్రకటింపఁబడిన'హిందూదేశకథా సంగ్రహము'లోని ప్రథమభాగమగు 'హిందూమహాయుగ' మనుగ్రంథ మీక్రిందిరీతిని జాటుచున్నది:—

## ఉపసంహారము.

## హిందూదేశపారతంత్ర్యమునకుఁ గారణములు.

... ... ... ... ...

### ౮. ఈదేశస్థుల శరీరసామర్థ్యముతగ్గుట.

"హూణశకవంశజులగు పరదేశీయుల నీదేశమునుండి వెడలఁగొట్టిననాఁడు గల శరీరసామర్థ్యమును శౌర్యమును ఈదేశమునఁ గ్రమక్రమముగాతగ్గి తురుష్కులకాలము వఱకు మిక్కిలి తక్కువయైనట్లు గానవచ్చుచున్నది. అట్లుగాకున్నఁ దమకంటె మిక్కిలి తక్కువసంఖ్యగల తురుష్కసైన్యములకు వా రనేకయుద్ధములలోనోడుట ఘటస్థింపదు. ఇట్లు వీరు బలహీనులగుటకు ముఖ్యకారణ మతిబాల్యవివాహప్రచారమేయని చెప్ప వచ్చును. ఆడుపిల్లల కెంతశీఘ్రముగా వివాహముచేసిన నంతమంచిదియనినమ్మిక పెరిగి నందునఁ బదుమూఁడు పదునాల్గుసంవత్సరముల కుమారికలు పిల్లలఁగనుట సంభవించెను. ఇట్టి పసికూనలకుఁబుట్టినవారికిఁ బచ్చితురకలతోఁ బోరుననిల్చి యెదిరించునట్టిబల మెట్లు కలుగును?............"

—"హిందూమహాయుగము," (అయిదవకూర్పు) పుట, ౨౮౨.

దీనినిబట్టిచూడఁగా మనదేశమున నతిబాల్యవివాహములచేఁ బదుమూఁడు పదు నాల్గేండ్లబాలకలకుఁ బుట్టినదుర్బలురు తురుష్కుల నెదిరింపవలసివచ్చినట్లును, దురు ష్కులకాలమునాఁటికే మనదేశీయుల శరీరసామర్థ్యములు తగ్గియున్నట్లును స్పష్టమగు చున్నవి. అందుచేఁ దురుష్కులకాలమునకుఁబూర్వమే మనదేశమున బాల్యవివాహములు ప్రచారముననున్నవని వేఱుగఁ జెప్పనక్కఱలేకయే తెలియుచున్నది. ఇకఁ దురుష్కుల బాధచే మనదేశీయులు బాల్యవివాహములనుసాగించి దానికనుగుణ్యముగ ధర్మశాస్త్రము లను మార్చివ్రాసిరనియు, నందుచే వానియందలి యాసంబంధమగు ప్రమాణవాక్యములు ప్రక్షిప్తములనియువాదించుట యవివేకముగాదా?

(ఈసందర్భమునఁ బైనవనాగరకులవాదమందలి దౌర్బల్యమును గనఁబఱచుటకే 'హిందూమహాయుగ'మందలి పైవాక్యములనెత్తి చూపియుంటిమి. కాని, యంతమాత్ర ముచే నావాక్యములందలి బాల్యవివాహనిరసనమును మే మంగీకరించితిమని పాఠకులు తలంపరాదు.)

ఇంతవఱకును నీప్రకరణమున జరిగినవిమర్శచేఁ దెలియవచ్చిన సారాంశమేమనగా: లోకమున జనులొనరించు ప్రతికార్యమునకును నీజన్మమునందుఁ బ్రత్యక్షముగఁ గనఁబడు ఫలములుమాత్రమేగాక, రాఁబోవుజన్మములందును నితరలోకములందును గల్గుఫలములుగూడఁ గొన్నికలవనియుఁ,వానినీజన్మమునవెట్టి యితరసాధనముచేతను దెలిసికొనవీలు గానందున,నట్టియతీంద్రియవిషయములను సర్వజ్ఞుఁడగునీశ్వరునియాజ్ఞారూపమైన వేదముమాత్రమే చెప్పఁజాలియున్నదనియుఁ, నట్టివేదముయొక్కయర్థము సులభముగ జనులకు దెలియఁగరానిదగుటచే దానిని దెలియపఱచుటకే యావేదమందలి ధర్మములనెత్తి ధర్మశాస్త్రకర్తలు తమస్మృతులందువ్రాసియుండిరనియుఁ,మనప్రాచీనచరిత్రలు స్మృతులనుగుఱించిచెప్పెడివిషయములేసత్యమని మనముగ్రహింపఁగల్గితిమి.విదేశీయులు లౌకికప్రయోజనమునకై వారియొక్క లోకానుభవమునుబట్టియుఁ, బ్రకృతి శాస్త్రజ్ఞానమునుబట్టియు, నాలోచించి యధికసంఖ్యాకుల యభిప్రాయానుసారముగ నిర్మించుకొను సాంఘిక, రాజకీయ నిబంధనలవలెనే, మనపూర్వులుఁగూడ వారిలోకానుభవమును, బ్రకృతిశాస్త్రజ్ఞానమును, బుద్ధివైభవమును, నధికసంఖ్యాకుల యభిప్రాయమునుబట్టి మనధర్మముల నేర్పఱచి ధర్మశాస్త్రములలో వ్రాసియుండిరని మననవనాగరకులుతలంచుట కేవల నిరాధారమగు నట్టిభ్రాంతియేయనిగూడ మనము తెలిసికొనఁగల్గితిమి. అట్టిభ్రాంతికి లోనగుటచేతనే వారికి మనధర్మశాస్త్రములందును, వానియందలి ధర్మములందును, దురూహలును, నవిశ్వాసములును, నెక్కుసందేహములును నేర్పడి యాధర్మముల నాచరించుటయం దశ్రద్ధయేర్పడియున్నదని తెలిసికొంటిమి. అకారణముచేతనే వారు మనధర్మశాస్త్రములను గాలానుసారముగ వారియిష్టముననుసరించి మార్చివ్రాయవలయుననియుఁ, మనయాచారములను ధర్మములను వారియిష్టమువచ్చినట్లు సంస్కరింపవలయుననియుం యత్నించుచుండిరని గ్రహించితిమి. వారియిష్టమువచ్చినట్లు వారు మనధర్మములనుమార్చి గ్రంథములవ్రాసికొని 'కాలానుసారముగ ధర్మములను మార్చివేసితి'మని వారిలోవారు సంతసించుకొనవచ్చునేగాని, యంతమాత్రముచే యాగయాగధర్మాధర్మములు ప్రకృతిధర్మముల వలె వానివానిస్వాభావికఫలముల (జన్మాంతరములందును లోకాంతరములందును) నీయకమానవనియు, నవి మార్పవీలులేని ప్రకృతిధర్మములకంటెనుగూడ కఠినమైనవనియు నేర్చికొంటిమి. అందుచే సంఘసంస్కరణమునకై మన నవనాగరకులుచేయు ప్రయత్నములు నిష్ప్రయోజనములనియుఁ, మిక్కిలి యనుచితములనియు, నవివేక విలసితములనియు, హానికరములనియుఁగూడ దెలియఁగల్గితిమి. మఱియును, మననవనాగరకులకు మనధర్మములపట్లను ధర్మశాస్త్రములపట్లను గలసంశయములను ససాకల్యముగవిమర్శించి యందులకుఁ దగినసమాధానములను వినిపించియుంటిమి. ఇందుచే మన వైదికమతచరిత్రను మతధర్మములనునెఱుగుట కాధారమగు వేదమువలెనే స్మృతులుగూడ నిర్దుష్టములగు ప్రమాణములని ఋఢియగుచున్నది. కావున నిఁక స్మృతుల తరువాతవియగు పురాణేతిహాసములనుగుఱించి విచారింతము.

రెండవప్రకరణము సమాప్తము.

# వైదికమతచరిత్రము

## మూఁడవ ప్రకరణము.

### పురాణములు, నితిహాసములు.

#### పురాణములు.

వైదికమతచరిత్ర నెఱుఁగుట కాధారములగు మన ప్రాచీనచరిత్రలలో మొదటి దైన వేదమునుగుఱించి యీగ్రంథమున మొదటిప్రకరణములోఁ దెలిసికొంటిమి. వేదము తరువాతవియగు స్మృతులనుగుఱించి రెండవప్రకరణమునఁ దెలిసికొంటిమి కాఁబట్టి స్మృతులకుఁ దరువాతవియగు పురాణములనుగుఱించి యీమూఁడవప్రకరణమునఁ దెలిసి కొందము. అట్లు తెలిసికొనుటకు మనకుఁగలయాధారము లిదివఱకు గడచినప్రకరణము లలోఁ జెప్పినరీతిగఁ, బ్రాచీనచరిత్రలును, నవీనచరిత్రలునుమాత్రమే యైయున్నవి. కావునఁ బురాణములనుగుఱించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పునో, నవీనచరిత్ర లేమిచెప్పునో, యందేదిసత్యమో, వరుసగావిచారించి తెలిసికొందము.

#### పురాణములనుగుఱించి ప్రాచీనచరిత్ర లేమి చెప్పును?

వేదములందలి 'ఛాందోగ్య'మను నుపనిషత్తు, పురాణములను, నితిహాసములను గుఱించి యీక్రిందివిధముగఁ జెప్పుచున్నది:—

"ఇతిహాసపురాణః పంచమో వేదానాం వేదః."

—ఛాందోగ్యోపనిషత్, అధ్యా. ౭.

అనఁగా, నితిహాసములును బురాణములును జేరి, వేదములలో నైదవవేదమని యర్థము. దీనిచే, నాల్గువేదములును నెట్లుప్రమాణములో యట్లే యితిహాసపురాణములు గూడఁ బ్రమాణములేయనియుఁ నందువలననే యవి నాల్గువేదములతోఁబాటుగ నైదవ వేదమని లెక్కింపఁబడుచున్నవనియుఁ మనకుఁ వేదమువలనఁ దెలియవచ్చుచున్నది.

మఱియును బురాణేతిహాసములనుగుఱించి 'వసిష్ఠస్మృతి' యనుధర్మశాస్త్ర మీ క్రిందిరీతిగఁ జెప్పుచున్నది:—

"శ్లో. ఇతిహాస పురాణాభ్యాం వేదార్థ ముపబృంహయేత్,
బిభే త్యల్పశ్రుతా ద్వేదో మామయం ప్రహరిష్యతి." —వసిష్ఠస్మృతిః.

అనఁగా, నితిహాసములును బురాణములును వేదమునందలియర్థమును వ్రిస్పి చెప్పును. (అట్టి పురాణేతిహాసములను దిన్నఁగాఁజదివి యెఱుఁగని) యల్పజ్ఞానముగల వాఁడు వేదమునకు సరియైనసర్థము నెఱుఁగలేక, యపార్థమును జేసి తననుబాధించునని వేదము వానినిజూచిభయపడునని తాత్పర్యము! దీని చే, వేదములందలియర్థము నే పురాణ ములుగూడఁ జెప్పుననియు, (నందుచేఁ బురాణేతిహాసములందలి యంశములుగూడ వేద వాక్యములవలెనే ప్రమాణములనియు) నేర్పడుచున్నది.

మఱియును స్కాందపురాణమందలి సూతసంహితయనుభాగమున, శివమాహాత్మ్య ఖండములోని ప్రథమాధ్యాయమునఁ బురాణములనుగూర్చి యీక్రిందిరీతిని జెప్పఁబడి యున్నది:—

"శ్లో. .........సమస్తానాం వేదానా మర్థ ఆస్తికాః!
ఏవం చతుర్విధైః ఖండైః సంహితా వేదసమ్మితా. ౩౨
అస్యామేవ స్థిత స్సాక్షా త్సంహితాయా మసంశయః. ౩౨౪
సర్గశ్చ, ప్రతిసర్గశ్చ, వంశ, మన్వంతరాణి చ,
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్. ౩౩౪
య శ్చతుర్వేదవి ద్విప్రః పురాణంవేత్తి నార్థతః,
తం దృష్ట్వా భయ మాప్నోతి వేదో 'మాం ప్రతరిష్యతి.' ౩౮౪
ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్,
బిభే త్యల్పశ్రుతా ద్వేదో 'మా మయం విప్లవిష్యతి.' ౩౫౪
వేదాః ప్రమాణం ప్రథమం స్మృతయేవ; తతఃపరమ్,
స్మృతయశ్చ పురాణాని భారతం మునిపుంగవాః! ౩౬౪
అన్యాన్యపి మునిశ్రేష్ఠా! శాస్త్రాణి సుబహూనిచ,
సర్వం వేదావిరోధేన ప్రమాణం; నాన్యవర్త్మనా ౩౭౪
... ... ... ... ..."

(—సూతసంహిత, శివమాహాత్మ్యఖండము, అధ్యా ౧. శ్లో. ౩౨-౩౭౪.)

శ్రీ మాధవాచార్యులవారు పైశ్లోకముల కీక్రిందిరీతిగ వ్యాఖ్యనువ్రాసియున్నారు.:-

"........సకలశ్రుత్యర్థసంగ్రహాత్మకత్వాత్ అస్యాం సంహితాయా మవశ్య మాదరో విధేయ ఇత్యాహ: 'సమస్తానా' మితిశ్లోకశేషేణ. ౩౧, ౩౨, ౩౨౫. నానా విధోపాఖ్యానప్రతిపాదనపర్యవసితపురాణే కః ప్రసంగో వేదార్థస్యేతి తత్రాహ: 'సర్గశ్చే' త్యేకన. బ్రహ్మణ స్తటస్థలక్షణత్వేన సృష్టిస్థితిప్రళయాఏవ వేదప్రధానం ప్రమేయమ్. శ్రుతిః: 'ఆత్మావా ఇదమేక మగ్రఆసీత్'—స ఐక్షతేతి మహాసర్గః; 'నేహనానాస్తీ'తి ప్రళయః; అన్యత్సర్వం స్థిత్యవస్థావిలాసః. ఇత్థమేవ పురాణేపి వంశ, మన్వంతర, వంశాను చరితాని స్థిత్యవస్థైవేతి. ౩౩౫. వేదార్థఏవచేత్ పురాణే, స వేదేనైవ సిద్ధః; కింపురాణే నేతితత్రాహ: 'యశ్చతుర్వేదవిద్విప్ర' ఇతిసార్ధశ్లోకేన. తత్రస్థితస్యాప్యర్థస్య తావతైవదుర ధిగమత్వా త్తదుపబృంహణాయ పురాణమిత్యర్థః; అనుపబృంహణే బాధకమాహ: 'తం దృష్ట్వే'తి. విప్లవస్య దుష్పరిహరత్వం దర్శయితుం వేదే తదారోపః. ప్రతరిష్యతి=విప్లవిష్య తీతి బిభేతి. అత స్తముపబృంహయే దిత్యన్వయః. ౩౪౫. ౩౫౫. సర్వదా పురాణాదిక మపేక్షితంచేత్, తేనైవపర్యాప్తం; కింవేదైరితిచేన్న; వేదానాం స్వతఃప్రామాణ్యా త్తన్మూ లతయైవ పురాణాదే స్స్వరూపలాభా దిత్యాహ: 'వేదాః ప్రమాణంప్రథమ' మిత్యాది శ్లోకద్వయేన. ౩౬౫. 'అన్యాన్య'ప్యార్షస్మృతిపురాణమూలాని తదర్థసంగ్రహశాస్త్రాణీ. త్యర్థః. 'వేదావిరోధే'నేతి: 'వేదవిరోధేత్వనుపేక్షం స్యాదసతి హ్యనుమాన'మితిజైమి నీయం సూత్రమ్. మూలభూతవేదానుమానేన స్మృత్యాదేః ప్రామాణ్యమ్; తద్విరోధే త్వనుమాన మేవ నోదేతి—మూలాభావా దుపేక్షణీయం. అథవా యావన్మూలోపలంభం, ప్రత్యక్షశ్రుతివిరుద్ధ స్మృత్యాద్యర్థో నానుష్ఠేయ ఇతిసూత్రార్థః. ౩౭౫......"

దీనియర్థమేమనఁగా:—

"......అన్నివేదములలోనియర్థమును నీసంహిత(అనఁగా 'సూతసంహిత') సం గ్రహముగాఁ గల్గియున్నదగుటచే, దీనియందుఁ దప్పక యాదర ముంచఁదగినదని "సమ స్తానాం వేదానా మర్థ ఆస్తికాః!" యనుశ్లోకములోని మిగిలినభాగముచేఁజెప్పఁబడినది. (అశ్లోకము మొదలు ౩౨౫-వ శ్లోకమువఱకునుగల శ్లోకములయొక్క తాత్పర్యమేమనఁగా: "ఓయాస్తికులారా! వేదములన్నిటియొక్క యర్థమును సాక్షాత్తుగనీసంహితయందే నిస్సం శయముగఁగలదు. వేదసమ్మతమగు నీసంహిత యిట్లునాల్గుఖండములచే నొప్పుచున్నది." యనితాత్పర్యము.) 'నానావిధములగుకథలను దెల్పుటయే పర్యవసానముగాఁగల పురాణ మునందు వేదార్థముయొక్క ప్రసంగమేమికల?' దనుప్రశ్నకు సమాధానమును 'సర్గశ్చ, ప్రతిసర్గశ్చ...' యనునొక్కశ్లోకమునఁజెప్పియున్నాఁడు. (దానితాత్పర్యమేమనఁగా: "సర్గమును, ప్రతిసర్గమును, వంశమును, మన్వంతరములును, వంశానుచరితమును, నను

నైదులక్షణములనుగలది పురాణము."—సర్గమును, బ్రతిసర్గమును, మొదలగునవి యనఁగా నేమో యీగ్రంథముననే ముందుముందు వివరముగఁ దెలుపఁబడును.) బ్రహ్మముయొక్క లక్షణము తటస్థ (నిర్గుణత్వ) మగుటచే సృష్టిస్థితిప్రళయములే వేదమునందలి ప్రధానవిషయములు. "ఆత్మావాఇద..." మను వేదవాక్య 'మాత్మస్వరూపమగు బ్రహ్మమే యీవిశ్వముగా నయ్యె'నని చెప్పుచున్నది. అదిమహాసర్గము. 'నేహనానాస్తి' యనునది ప్రళయముఁ మిగిలినదంతయుఁ నాబ్రహ్మముయొక్క విలాసరూపమగుస్థిత్యవస్థ. ఈవిధముగనే పురాణమునందును వంశ, మన్వంతర, వంశానుచరితములు స్థిత్యవస్థయే. ౩౩౹. 'పురాణమునందలిది వేదముయొక్కయర్థమేయగునెడల, నది వేదముచేతనే తెలియనగునుగదా; యిఁకఁబురాణముతోనేమిపని?' యనుప్రశ్నకు "యశ్చతుర్వేదవిద్విప్రః" యనునొకటిన్నరశ్లోకములచే సమాధానముఁజెప్పుచున్నాఁడు. అచట (వేదమునందే) దానియర్థమున్నప్పటికిని, దానివలననే(యనఁగా వేదమువలననే)యాయర్థమును దెలిసికొనుట మిక్కిలికష్టసాధ్యమగుటచే, దానిని (వేదార్థమును) ద్రిప్పిచెప్పుటకొఱకుఁ బురాణమనియర్థము; అట్లు త్రిప్పిచెప్పకపోవుటచేఁ గల్గుబాధను, 'తంద్రుష్ట్వా...' యనుశ్లోకపాదముచేఁ జెప్పుచున్నాఁడు. అట్టి ముప్పుయొక్కదోషమును జూపుటకు దానిని వేదమునం దారోపించి ('వేదముభయపడు' నని చెప్పి)యున్నాఁడు. 'ప్రతరిష్యతి' యనుశబ్దమునకు, 'విప్లవమును (ముప్పును) గల్గించు' నని భయపడునని యర్థము. అందువలన దానిని (వేదముయొక్కయర్థమును బురాణము) ద్రిప్పిచెప్పునని యన్వయము. ౩౪౹, ౩౫౹. (ఆశ్లోకములయొక్కతాత్పర్యమేమనఁగా: "నాల్గువేదములను నెఱిఁగిన యేబ్రాహ్మణుఁడు పురాణమునర్థముతోఁగూడఁ దెలిసికొనఁడో, యల్పజ్ఞుఁడగునట్టివానినిఁజూచి వేదము, 'వీఁడునాకుముప్పును దెచ్చిపెట్టు'నని భయపడు" నని తాత్పర్యము. అందుచే, వేదములను లెస్సఁగాఁజదివిన యెంతటిపండితునకైనను బురాణములయొక్కసహాయములేనిచో వేదములయొక్కయర్థముసరిగాఁ దెలియనేరదనియు, నందుచేఁ బురాణములందలియర్థమునకు విరుద్ధముగ వేదమునకెవరుచెప్పునర్థమైనను నదియపార్థమే కాకతప్పదనియును, వేదవిభాగనిర్ణేతయగు వేదవ్యాసమహర్షియే తనస్కాందపురాణమున స్వయముగఁజెప్పికొనియుండెనని మనముగ్రహించవలసియున్నది. దీనినిబట్టిచూడఁగా, నీకాలమందలి 'యార్యసమాజికులు'ను, 'బ్రహ్మసమాజికులు'ను, దివ్యజ్ఞానసమాజికులు'ను మొదలగువారు స్మృతి, పురాణ, సాంప్రదాయములకు విరుద్ధముగఁ దమకుదోఁచినయర్థమును వేదములకుఁజెప్పుచు నదియే సరియగునర్థమనియు, స్మృతులును బురాణములును జెప్పునర్థముతప్పనియుఁ వాదించుచుఁ, దమవాదమననుసరించి వైదికమతమును సంస్కరింపఁ జూచుట వట్టియవివేకమనియుఁ, వారికిఁబ్రమాణములగు వేదములను వారికి బ్రసాదించిన వేదవ్యాసమహర్షికిఁగూడ [illegible] దగుచున్నదిగదా!)

'ఎప్పుడును గావలసినది పురాణమేయైనయెడల దానితోనేసరి (యనఁగా నదిమాత్రమే చాలును)గదా; యిఁక వేదములతోనేమిపని?' యనునెడల, నట్లు కాఁజాలదు; వేదములు స్వతఃప్రమాణములగుటచే (ననఁగా, వానియంతట నవియేస్వయముగాఁ బ్రమాణములగుటచే) వానిమూలముననే పురాణములు మొదలగువానికిఁ బ్రామాణ్యతకల్గినదని, "వేదాః ప్రమాణం ప్రథమ" మనుశ్లోకము మొదలు, రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు. ౩౬౫. (స్వతఃప్రమాణమనఁగానేమో, యీప్రకరణమందే "ధర్మాధర్మములను నిర్ణయింపవలసినది యెక్కువమందియొక్క యభిప్రాయమును (Majority of Votes) బట్టికాదా?" యను శీర్షికక్రింద, వేదభాష్యమునుండిగనపఱచిన ప్రమాణసందర్భమున వివరించియున్నాము.) 'అన్యాని' యనఁగా, ఋషులచేవ్రాయఁబడినస్మృతులను,బురాణములను, మూలముగాఁగల్గి వానియొక్కయర్థమునే సంక్షేపముగఁదెల్పు నితరశాస్త్రగ్రంథములనియర్థము. 'వేదావిరోధేన' యనుదానికర్థమేమనఁగా: 'వేదవిరోధేత్వనుపేక్షం...' అనుసూత్రమును జైమినిమహర్షి వ్రాసియుండెను. మూలప్రమాణమైనవేదముననుసరించుటచేత స్మృతులు మొదలగువానికి ననుమానప్రామాణ్యతగల్గినది; (అనఁగా, నవి వేదమువలె స్వతఃప్రమాణములు కాకున్నను బరతఃప్రమాణములైనవి;) వేదమునకు విరోధముగనున్నచో నవి యనుమానప్రమాణములుకూడఁగాఁజాలవు.—మూలప్రమాణమే లేనివగుటచే నుపేక్షింపఁదగినవి (యనఁగావిడిచివేయఁదగినవి.) అట్లు పూర్తిగ విడిచివేయఁదగినది కాకున్నను, బ్రత్యక్షముగ వేదమునకువిరుద్ధమగు స్మృతులయర్థము, మూలప్రామాణ్యము (అనఁగా వేదప్రామాణ్యము) దొరకువఱకును నాచరింపదగినదికాదని సూత్రము యొక్కయర్థము. ౩౭౫. (ఆశ్లోకములతాత్పర్యమేమనఁగా:—"ఓమునిపుంగవులారా! స్వతఃప్రమాణములగు వేదములు మొదటిప్రమాణము; అటుతరువాత ప్రమాణములు స్మృతులును, బురాణములును, మహాభారతమును; మునిశ్రేష్ఠులారా! ఇతరములగుశాస్త్రములును బెక్కులుగలవు; అవియన్నియుఁను వేదవిరుద్ధములు కాకుండుటచేతనే ప్రమాణములు కాఁజాలునుగాని వేఱువిధముగఁగాదు."...

అష్టాదశమహాపురాణములకును నుపపురాణములకును వేదములకునుగల సంబంధమును 'సూతసంహిత' యింకను నీక్రిందిరీతిని వినిపించుచున్నది:—

... ... ... ... ...

"శ్లో. అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః,
కామికాదిప్రభేదస్య యథా దేవో మహేశ్వరః. ౧౧౫
అష్టాదశపురాణాని శ్రుత్వా సత్యవతీసుతా,
దన్యా న్యుపపురాణాని మునిభిః కీర్తితానితు. ౧౨౫

... ... ...

బ్రహ్మాణం మునయః! పూర్వం సృష్ట్వా తస్మైమహేశ్వరః ౪౦౫
దత్తవా నఖిలా న్వేదా నాత్మన్యేవ స్థితా నిమాన్. ౪౧
బ్రహ్మా సర్వజగత్కర్తా శివస్య పరమాత్మనః
ప్రసాదాదేవ రుద్రస్య స్మృతీ స్సస్మార సువ్రతాః! ౪౧౫
విష్ణు ర్విశ్వజగన్నాథో విశ్వేశస్య శివస్య చ,
ఆజ్ఞయా పరయా యుక్తో వ్యాసో జజ్ఞే గురు ర్మమ. ౪౨౫
స పున ర్దేవదేవస్య ప్రసాదా దంబికాపతే
స్సంక్షిప్య సకలా న్వేదా౯ చతుర్ధాకృతవా న్ద్విజాః! ౪౩౫

... ... ... ... ... ...

—సూతసంహిత, శివమాహాత్మ్యఖండము, అధ్యా. ౧.

పైశ్లోకములకు శ్రీమాధవాచార్యులవారీక్రిందిరీతిని వ్యాఖ్యవ్రాసియున్నారు:-

"........వివక్షితాయా అస్యా స్సంహితాయా వ్యాసముఖా దాగతత్వేన ప్రామాణ్యం ఖ్యాపయితుం నానామునిప్రణీతసకలోపపురాణమూలభూతానామష్టాదశానాం పురాణానాం, వేదశాఖావిభాగస్య చ ప్రణయనేన వ్యాసస్య సర్వజ్ఞత్వం,అతఏవ తస్య పరమపురుషావతారత్వంచప్రతిపాదయితుమష్టాదశపురాణానాంనామాన్యనుక్రామతి: 'బ్రాహ్మ'మిత్యాదినా......౧౦౫.కామికాదీనామాగమసంహితానాం శివేనైవ ప్రణయనాత్ప్రామాణ్యేయథావిస్రంభః,ఏవం నారాయణావతారేణ వ్యాసేనప్రణయనాత్పురాణేష్వప్యవిశేష ఇత్యాహ: 'అష్టాదశపురాణానా'మితి వ్యాఖ్యాతప్రాయోఽయమ్.౧౧౫. నానామునిప్రణీతానా ముపపురాణానామ ప్యేతన్మూలత్వా దేతేషాం ప్రణేతు ర్వ్యాసస్య సర్వజ్ఞత్వం కింవక్తవ్య మిత్యాహ: 'అష్టాదశపురాణాని శ్రుత్వే'తి......౧౨౫. ..............................స్వయమేవ లీలయా సకలవేదగ్రహణసమర్థం బ్రహ్మాణం నిర్మాయస్వాత్మని నిత్యమవస్థితాఏవవేదా స్తస్మైదత్తా ఇత్యర్థః...౪౦౫. స్మృతిపురాణాదీనామపి శివేనైవప్రాపణంచే, ద్వేదసామ్యం; నచే దప్రామాణ్యం; తత్రాహ: 'బ్రహ్మాసర్వజగత్క.'త్తేతి. వేదేహి ద్వౌ భాగౌ: కర్మభాగో, జ్ఞానభాగశ్చేతి. ఆద్య స్యార్థస్మృతిముఖేనైవ బ్రహ్మణా శివాజ్ఞయైవవ్యాఖ్యాతః; ద్వితీయస్యతు విష్ణునా వ్యాసరూపేణావతీర్యపురాణముఖేనేతి, స్మృతిపురాణానాంవేదమూలతా; నస్వాతంత్ర్యమిత్యర్థః. యద్యపి స్మృతిష్వపి విద్యానిరూపణమస్తి; తత్ప్రాసంగికద్రవ్యశుద్ధిప్రసంగేనహి కథితం: 'క్షేత్రజ్ఞస్యాత్మవిజ్ఞానా ద్విశుద్ధిః పరమామతే'తి; చతుర్థాశ్రమధర్మప్రసంగేన చ ఔపనిషదస్య నిరూపణం కృతమితి.

పురాణానాంతు విద్యాప్రాధాన్యం; ప్రాసంగికం కర్మనిరూపణమ్.పురాణేషు హి జగదుత్పత్తిస్థితిలయకారణత్వం శివస్యాభిప్రేత్య ఉత్పత్తికారణత్వం సర్గేణోక్తం; లయ కారణత్వం, ప్రతిసర్గేణ; స్థితికారణత్వంచ, వంశ,మన్వంతర, వంశానుచరిత నిరూపణేన. తత్ప్రసంగా ద్దాశ్రమధర్మా ఆగతా ఇతి. అతఏవ ధర్మవిషయే స్మృతిపురాణవిప్రతి పత్తౌ స్మృతీనాం ప్రాబల్యమ్, తత్ర తాసాం తాత్పర్యతఇతి. జ్ఞానవిషయే పురాణానాం ప్రాబల్యమితి వివేకః......౮౧,౮౧౫. వ్యాసేన పురాణానాం ప్రణయనం ప్రాగుక్తం; తస్యతు విష్ణో రవతారత్వ మిదానీ మాహ: 'విష్ణు.' ఇతి. ౮౨౫. నకేవలం వేదోపబృంహ ణాయ పురాణప్రణయనం; మహతో వేదస్య అల్పబుద్ధిభి ర్దురవగాహత్వా త్తత్తచ్ఛా ఖావిభాగం కృత్వా సంప్రదాయప్రవర్తనమపి తేనైవకృత మిత్యాహ: 'స పున ర్దేవ దేవస్యే'తి. ౮౩౫ ............”

పైవ్యాఖ్యానమున కర్థమేమనఁగా:—

“.........(ఇపుడు) చెప్పుచున్న యీసూతసంహిత వ్యాసునిముఖమునుండి వెలువడినదగుటచే దానికిఁ బ్రామాణ్యమును జెప్పుటకుఁగాను, దక్కినయితరమునులచే వ్రాయఁబడిన యుపపురాణములన్నిఁటికిని మూలమైన యష్టాదశమహాపురాణములను, వేదశాఖలయొక్క విభాగమునుగూడ, వ్యాసుఁడు చేసియుండుటచే, నాయనయొక్క సర్వజ్ఞత్వమును, నందువలననే యాయన పరమేశ్వరుని యవతారమైయుండుటయుఁను నిరూపించుటకు, నాయనచే వ్రాయఁబడిన పదునెనిమిది మహాపురాణములయొక్క యుఁ బేళ్లను, 'బ్రాహ్మం పురాణం ప్రథమం...' అనునది మొదలుగాగల శ్లోకములచే నేకరువు పెట్టుచున్నాఁడు...౧౦౫. కామికాదులైన యాగమసంహితలకు శివుఁడే కర్తయగుటచే వానియొక్క ప్రామాణ్యమునం దేవిధముగ నమ్మకముండఁదగునో, యట్లే నారాయణుని యవతారమగు వ్యాసునిచే వ్రాయఁబడినందువలనఁ బురాణములందును నట్టివిశేషమేకలదని 'అష్టాదశపురాణానా' మను శ్లోకమున వ్యాఖ్యారూపముగాఁ జెప్పి యున్నాఁడు. ౧౧౫.(ఆశ్లోకముయొక్క యర్థమేమనఁగాఁ: “కామికాదులైన యాగమ శాస్త్రములకు మహేశ్వరుఁ డేవిధముగఁ గర్తయైయున్నాఁడో, యావిధముగనే పదు నెనిమిది మహాపురాణములకును సత్యవతియొక్కకుమారుఁడగు కృష్ణద్వైపాయనుఁడు (వేదవ్యాసమహర్షి) కర్తయైయున్నాఁ”డని యర్థము.) ఇతరమునులందఱును వ్రాసిన యుపపురాణములకుఁగూడ (బైబదునెనిమిది మహాపురాణములే) మూలమగుటచే వానికిఁ గర్తయగువ్యాసునియొక్క సర్వజ్ఞత్వమునుగుఱించి వేఱుగఁ జెప్పవలసిన దేమున్నదనని, 'అష్టాదశ పురాణాని శ్రుత్వా...' యనుశ్లోకముచేఁ జెప్పుచున్నాఁడు. ౧౨౫. (ఆశ్లోకతాత్పర్యమేమనఁగా: వేదవ్యాసునివలనఁ బదునెనిమిది మహాపురాణము

లను మునులువిని, యితరములగు నుపపురాణములను వ్రాసియుండిరి"యని యర్థము.)... అన్ని వేదములను గ్రహించుసామర్థ్యముగల బ్రహ్మదేవునిఁ దానే వేడుకగా (పరమేశ్వరుఁడు) నిర్మించి, తనయందు నిత్యములుగానున్న వేదముల నాయనకిచ్చెనని ('బ్రహ్మాణం మునయః! పూర్వః...' అనుశ్లోకముయొక్క) యర్థము...౪౦౫. స్మృతులును బురాణములును మొదలగునవికూడఁ బరమేశ్వరునివలననే లభించినవైనచో వేదముతో సమానములగును; కానిచోఁ బ్రామాణ్యములు కాఁజాలవు. ఆసంగతి, 'బ్రహ్మా సర్వజగత్కర్తా...' యను శ్లోకముచేఁ జెప్పుచున్నాఁడు. వేదమునందు రెండుభాగములుగలవు. అవి, కర్మభాగమును, జ్ఞానభాగమును ననునవి. మొదటిదానియర్థమునకుఁ బరమేశ్వరుని యాజ్ఞచేతనే బ్రహ్మదేవుఁడు స్మృతులరూపమున వ్యాఖ్యగావించియుండెను; రెండవదానికి, విష్ణుఁడు వ్యాసరూపమున నవతరించి పురాణములద్వారా వ్యాఖ్యగావించియుండెను; ఇట్లు స్మృతులకును బురాణములకును మూలము వేదమేయనియు, నవి స్వాతంత్ర్యము గలవికావనియు నర్థము. ఐనప్పటికిని స్మృతులయందుఁగూడ జ్ఞానవిషయము నిరూపింపఁబడియున్నది; అది ద్రవ్యశుద్ధి ప్రసంగవశమున, 'క్షేత్రజ్ఞ స్యాత్మవిజ్ఞానాత్...' అను శ్లోకమునఁ జెప్పఁబడియున్నది; సన్న్యాసాశ్రమధర్మముల ప్రసంగమున నుపనిషదర్థము చెప్పఁబడినది. పురాణములందుమాత్రము జ్ఞానవిషయమే ప్రధానము; కర్మవిషయము ప్రసంగవశమున సంభవించునది. ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములకు, (అనఁగాఁ బుట్టుకకును, నునికికిని, నాశనమునకును) గారణత్వము పరమేశ్వరునుద్దేశించి, యుత్పత్తికారణత్వము 'సర్గము'నందును, లయకారణత్వము 'ప్రతిసర్గము'నందును, స్థితికారణత్వము, 'వంశము', 'మన్వంతరము', 'వంశానుచరితము' ననువానియందును, బురాణములలో వర్ణింపఁబడియున్నది. అందులోఁ బ్రసంగవశమున 'నాశ్రమధర్మములు' వచ్చియున్నవి. అందువలననే, ధర్మమువిషయమున స్మృతికిని బురాణమునకును నభిప్రాయభేదము తటస్థించినచో, స్మృతివాక్యములకే యెక్కువ బలము. (ఈవిషయమును మనమీప్రకరణమందే, "ధర్మశాస్త్రములన్నియు ధర్మాధర్మముల నొక్కరీతిగనే నిర్ణయింపుచున్నవా? వానిలో నభిప్రాయభేదమున్నపట్ల నేమి చేయవలయు?" నను శీర్షికక్రింద లోగడఁ "శ్రుతిస్మృతి పురాణానాం..." అను శ్లోకవిషయమున దెలిసికొనియేయున్నాము.) అట్లే జ్ఞానవిషయమున నభిప్రాయభేదము గల్గినచో స్మృతివాక్యములకంటెఁ బురాణవాక్యములకే యెక్కువబలము.........

౪౧,౪౧౫. (ఆశ్లోకముల యర్థమేమనఁగా: సర్వలోకములను సృష్టించిన బ్రహ్మదేవుఁడు పరమేశ్వరునాజ్ఞప్రకారము వేదములందలి కర్మభాగములోని ధర్మములన్నిఁటిని స్మృతులరూపముగ వ్రాసియుండెను.) వ్యాసుఁడు పురాణములను వ్రాసినసంగతి

యింతకుముందే చెప్పఁబడియున్నది; అయన విష్ణుని యవతారమనువిషయము నిప్పుడు 'విష్ణు ర్విశ్వజగన్నాథః' యను శ్లోకములోఁ జెప్పుచున్నాఁడు. ౪౨౫. (ఆశ్లోకమున కర్థ మేమనఁగా: "సర్వలోకములకును బ్రభువగువిష్ణువు, పరమేశ్వరునియాజ్ఞ ననుసరించి నాగురువగు వ్యాసుఁడుగ నవతరించె" నని యర్థము. వేదమందలి యర్థమును ద్రిప్పిచెప్పు టకుఁ బురాణములను వ్రాయుటమాత్రమేగాదు; మిక్కిలి పెద్దదగువేద మల్పజ్ఞులగు వారికిఁ దెలియసాధ్యముగానిదగుటచే, నాయాశాఖలను వేఱువేఱుగ విడదీసి యాయన (వేదవ్యాసమహర్షి)యే, వానికి సాంప్రదాయములనుగూడ నేర్పఱచియుండెనని, 'స పున ర్దేవదేవస్య...' యనుశ్లోకముచేఁ జెప్పుచున్నాఁడు. ౪౩౫...(దానితాత్పర్య మేమనఁగ: "నో బ్రాహ్మణులారా! యాయన (వేదవ్యాసమహర్షి) తిరిగి పరమేశ్వరు నాజ్ఞచే నన్నివేదములను సంక్షేపించి నాల్గుగా విభజించె" నని తాత్పర్యము.)"

పైవ్యాఖ్యయందు ౪౧, ౪౧౫, శ్లోకములవిషయమున వేదములకును, స్మృతుల కును బురాణములకును గలసంబంధమునుగుఱించి శ్రీమాధవాచార్యులవారు తెల్పినయర్థ మునే, శ్రీమద్రామాయణమునకు వ్యాఖ్యానము వ్రాసినవారిలో సుప్రసిద్ధులగు శ్రీధరా చార్యులవారుగూడ నీక్రిందిరీతిని బ్రశంసించియున్నారు:—

"శ్లో. ప్రాయేణ పూర్వభాగోఽర్థో ధర్మశాస్త్రేణ కథ్యతే;
ఇతిహాసపురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశతే."

—శ్రీధరకృత రామాయణవ్యాఖ్య.

అనఁగా: వేదమందలి పూర్వమీమాంసకు (ననఁగాఁ గర్మకాండకు) సంబం ధించిన విషయమును ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి; ఉత్తరమీమాంసకు (ననఁగా జ్ఞాన కాండకు) సంబంధించినవిషయములను బురాణములును నితిహాసములును బ్రకాశింపఁ జేయుచున్నవి.

పురాణములనుగుఱించి 'యమరకోశ' మను సంస్కృతనిఘంటు వీక్రిందిరీతిగఁ జెప్పుచున్నది:—

"శ్లో. ..................పురాణం పఞ్చలక్షణమ్.
(సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశ మన్వంతరాణి చ,
వంశానుచరితం చేతి లక్షణానాం తు పఞ్చకమ్.)"

దీనికి, 'లింగాభట్టీయ' మనువ్యాఖ్య యీక్రిందిరీతిగఁ గలదు:—

"........సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితరూపాణి పంచ లక్షణా న్యస్యేతి పంచలక్షణమ్."

అనఁగా, "సర్గమును, బ్రతిసర్గమును, వంశమును, మన్వంతరమును, వంశాను చరితము, ననెడు నీయైదు లక్షణములుగలది పురాణ" మని యర్థము.

పై యైదులక్షణములకును మఱియైదు విశేషలక్షణములనుగూడఁజేర్చి శ్రీ భాగవతపురాణముయొక్క లక్షణము లాపురాణమునం దీక్రిందిరీతిగఁ జెప్పఁబడి యున్నవి:—

"శ్లో. సర్గోప్యస్య విసర్గశ్చ వృత్తి రక్షాంతరాణి చ,
వంశో వంశానుచరితం సంస్థా హేతు రపాశ్రయః;
దశభిర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదోవిదుః."

—శ్రీమద్భాగవతము.

పై శ్లోకార్థమును శ్రీమదాంధ్రభాగవత మీక్రిందిరీతిగఁ దెలుపుచున్నది:—
(శ్రీశుకుఁడు పరీక్షిత్తునకు భాగవతమునుగూర్చి చెప్పుట.)

"..................................

వ. అదియునుం గాక, 'యిపుడు విరాట్పురుషునివలన నీజగము లేపడువునం బొడమె?' నను నివి మొదలైన ప్రశ్నంబులుకొన్ని నన్నడిగితి; వేను నన్నింటికి నుత్తరం బగునట్లుగా నిమ్మహాభాగవతం బుపన్యసించెద నాకర్ణింపు; మమ్మహాపురాణంబు చతుశ్లోకరూపంబును దశలక్షణంబునునై సంకుచితమార్గంబున నొప్పు; నందు దశలక్షణంబు లెవ్వియనిన: సర్గంబును, విసర్గంబును, స్థానంబును, పోషణంబును, నూతులును, మన్వంతరంబులును, నీశాను చరితంబులును, నిరోధంబును, ముక్తియు, నాశ్రయంబును ననంబది తెలుంగులయ్యె; దశమాశ్రయ విశుద్ధ్యర్థంబు దక్కిన తొమ్మిదిలక్షణంబులుఁ జెప్పంబడె; నవి యెట్టివనిన : 259

తే. మహదహంకార పంచతన్మాత్ర గగన,పవన శిఖితోయ భూ భూతపంచ కేంద్రి
యప్రపంచంబు భగవంతునందుఁ గనుట, 'సర్గ' మందురు దీనిని జనవరేణ్య! 260

క. సరసిజగర్భుండు విరా,ట్పురుషునివలనన్ జనించి భూరితరచరా
చరభూతసృష్టిఁజేయుట, పరుసడిని 'విసర్గ' మండ్రు; భరతకులేశా! 261

క. లోకద్రోహినరేంద్రా,నీకముఁ బరిమార్చిజగము నెఱెనిల్పినయా
వైకుంఠనాథువిజయం, బాకల్ప 'స్థాన'మయ్యె నవనీనాథా! 262

క. హరి సర్వేశుఁ డనంతుఁడు, నిరుపమశుభమూర్తి సేయు నిజభక్తజనో
ద్ధరణము 'పోషణ' మవనీ,వర! 'నూతు' లనంగఁ గర్మవాసన లరయన్. 263

తే. జలజనాభదయాకటాక్షప్రసాద, లబ్ధి నఖిలైకలోకపాలకవిభూతి
మహిమఁ బొందినవారి ధర్మములు విస్తరమునఁ బలుకుట 'మన్వంతరములు' భూప!

క. వనజోదరు నవతారక,థనముఁ దదీయానువృత్తిఁ దచ్చారిత్రం
బును విస్తరించి పలుకం, జనునవి 'యీశానుకథలు' సౌజన్యనిధీ! 265

సీ. వసుమతీనాథ! సర్వస్వామియైన గోవిందుండు చిదచిదానందమూర్తి
సలలితస్వోపాధిశక్తిసమేతుఁడై తనరారు నాత్మీయధామమందు
ఫణిరాజమృదులతల్పంబుపై సుఖలీల యోగనిద్రారతి నున్నవేళ
నఖిలజీవులు నిజవ్యాపారశూన్యులై యున్నతతేజంబు లురలుకొనఁగ

తే. జరగు నయ్యవస్థావిశేషంబులెల్ల, విదితమగునట్లు వలుకుట యది 'నిరోధ'
మన నిది 'యవాంతరప్రళయం' బనంగఁబరగు; నిఁక 'ముక్తి' గతి విను పార్థివేంద్ర!

సీ. జీవుండు భగవత్కృపావశంబునఁజేసి దేహధర్మంబులై ధృతి ననేక
జన్మానుచరితదృశ్యములైన యజ్జరామరణంబు లాత్మధర్మంబులైన
ఘనపుణ్యపాపనికాయనిర్మోచనస్థితి నొప్పి, పూర్వసంచితములైన
యపహతపాప్మవత్త్వాదృష్టతద్గుణవంతుఁడై తగ భగవచ్ఛరీర

తే. భూతుఁడై పారతంత్ర్యాత్మబుద్ధి నొప్పి, దివ్యమాల్యానులేపనభవ్యగంధ
కలితమంగళదివ్యవిగ్రహవిశిష్టుఁ, డగుచు హరిరూప మొందుటే యనఘ! 'ముక్తి.'

వ. మఱియు, నుత్పత్తి, స్థితి, లయంబు లెందగుచుఁ బ్రకాశింపంబడు నది 'యాశ్రయం' బనంబడు; నదియ పరమాత్మ; 'బ్రహ్మ'శబ్దవాచ్యంబు............268

శ్రీమదాంధ్రభాగవతము, ద్వితీయస్కంధము.

దీనితాత్పర్య మేమనఁగా:—

"'సర్గ'మనఁగాఁ బ్రపంచసృష్టికి సాధనములగు మహత్తత్త్వము, నహంకారతత్త్వము, భూమియుఁ, జలము, నగ్నియు, వాయువు, నాకాశము నను పంచమహాభూతములును మొదలగునవి పుట్టినవిధానము. 'విసర్గ' మనఁగా, విరాట్పురుషునివలన బ్రహ్మదేవుఁడు పుట్టి, చరాచరరూపకమగు నీప్రపంచకమును సృష్టించినవిధానము. 'స్థాన' మనఁగా శ్రీమహావిష్ణువు లోకద్రోహులగు రాజులను, దుష్టులను సంహరించి లోకసంరక్షణమును గావించినవిధము. 'పోషణ' మనఁగా, భగవంతుఁడు భక్తులనుద్ధరించుట. 'ఊతు' లనఁగా జీవులయొక్క కర్మవాసనలు. 'మన్వంతరము' లనఁగా భగవంతుని యనుగ్రహముచే స్వాయంభువుఁడు మొదలగు పదునలుగురు మనువులును లోకములను వేఱువేఱుకాలములలోఁ బరిపాలించువిధానము. (ఈమన్వంతరములను గుఱించిన వివరముల నీగ్రంథమున నాల్గవప్రకరణమున, "సృష్టి యెప్పుడుజరిగె"ననుసందర్భమున దెలిసికొందుము.) 'ఈశానుచరిత' మనఁగా నీశ్వరుని యవతారకథలవివరములు. 'నిరోధ' మనఁగా నవాంతరప్రళయము; అనఁగా: శ్రీవిష్ణువు యోగనిద్రావస్థలోనుండఁగా, జీవు

లన్నియుఁ నానివాని వ్యాపారములుమాని నిశ్చలముగా నుండువిషయము. 'ముక్తి' యనఁగా శ్రీవిష్ణువుయొక్క రూపమును జీవుఁడు పొందుట.'ఆశ్రయ' మనఁగా, నీప్రపంచము దేనినుండిపుట్టి వృద్ధియై కడపట నాశనమై తిరిగి దేనియందు కలిసిపోవునో యట్టి పరమాత్మ; అదియే 'బ్రహ్మ' మనికూడఁ జెప్పఁబడును. శ్రీమద్భాగవతపురాణ మీపైన తెల్పిన పదివిషయములను వివరించిచెప్పును. ప్రపంచకమును, దానియందలి చరాచర రూపములగు వస్తుజాలమును నేవిధముగఁ బుట్టినవనియుఁ, నింకను నిట్టివే మఱికొన్ని ప్రశ్నలను బరీక్షిన్మహారాజు శ్రీశుకయోగి నడిగియుండఁగా, నట్టిప్రశ్నలన్నిఁటికిని సమాధానములు శ్రీమద్భాగవతమునం దుండుటచే, నాయనయొక్క ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరముగా నాపురాణమునే యాయనకు శ్రీశుకయోగి వినిపించియుండెను."

ఇచట నొకసంశయము గలుగవచ్చును. ఏమనఁగా: "నమరకోశమును, (స్కాంద పురాణములోని) సూతసంహితయుఁ బురాణముల కైదులక్షణములనుమాత్రమే చెప్పియుండఁగా, భాగవతపురాణము పదిలక్షణములను జెప్పియున్నదే! ఇది పరస్పరవిరుద్ధము గాదా?" యని కొందఱు సంశయింపవచ్చును. కాని, పురాణముల కుండవలసిన యైదు లక్షణములును భాగవతపురాణమునకుండి, వానికిఁదోఁడుగ మఱియైదు విశేషలక్షణములు గూడ దానికిఁగలవనియే మనము గ్రహింపవలయును. అంతియగాక, పురాణములకుఁ బైన దెల్పిన యైదులక్షణములు నుండవలయునని పైగ్రంథముల యభిప్రాయమేగాని, వానికిఁదోఁడుగ నితరలక్షణము లెవ్వియుఁ నుండరాదని యభిప్రాయముగాదు. అందుచేఁ బైవిశేషలక్షణము లితరపురాణములలో నుండవలసిన నిర్బంధములేదు! కావున నిందుఁ బరస్పరవిరోధ మేమియుంలేదు!! అంతియగాక, బాగుగఁ బర్యాలోచించి చూచినచోఁ, భాగవతమందుఁగల యైదువిశేషలక్షణములును, ముఖ్యలక్షణములలోని యంతర్భాగములేగాని వేఱుగాదు.

మఱియును బురాణములనుగుఱించి పంచరత్నవ్యాఖ్య యీక్రిందిరీతిగఁ జెప్పుచున్నది:—

శ్లో. "వేదోపబృంహణార్థత్వాత్ పురాణం వేదఏవహి,
వేదోపాంగవిధిత్వేన పురాణం వేదఏవహి!"

పంచరత్నవ్యాఖ్యా.

అనఁగా: బురాణము వేదమందలియర్థమును విప్పిచెప్పుచుండుటవలనను, వేదమున కుపాంగముగఁ జెప్పఁబడుటచేతను, నది వేదమేయని యర్థము.

"సాహిత్యరత్నాకర" మనుగ్రంథము పురాణములనుగుఱించి యేమి చెప్పుననఁగా:

"పురాణ భారతవచనానాం వేదరూపత్వేన ప్రామాణ్యం నిర్వివాదమ్, 'పురాణం పంచమో వేదః'; 'భారతం పంచమో వేదః'; ఇతి తయోర్వేదత్వోక్తేః."

సాహిత్యరత్నాకరము.

అనఁగాఁ: 'బురాణ మైదవవేద' మనియుఁ, 'భారత మయిదవవేద' మనియుఁ జెప్పబడియుండుటచేఁ, బురాణములును, భారతమును, వేదముయొక్క రూపములేయై, వేదమువలెనె ప్రమాణము లగుచున్నవని తాత్పర్యము.

"ప్రతాపరుద్రీయ" మనుగ్రంథము పురాణములనుగుఱించి యీక్రిందిరీతిని బల్కుచున్నది:—

శ్లో. "యద్వేదా త్ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానా చ్చిరం
యచ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్,
కాంతా సమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే."

ప్రతాపరుద్రీయము.

అనఁగాఁ: ప్రభువువలె వేదము ధర్మమును శాసించుననియును, స్నేహితునివలెఁ బురాణము నీతినిబోధించుననియును, భార్యవలెఁ గావ్యము హితముచెప్పుననియును దాత్పర్యము.

## పురాణోపపురాణముల వివరము.

పైన దెల్పియున్నరీతిగ శ్రీమన్నారాయణుని యవతారమగు శ్రీవేదవ్యాసమహర్షిచే వ్రాయఁబడి యితరులగు పండితప్రకాండులచేఁ బైవిధములఁ బొగడఁబడియున్న పదునెనిమిది మహాపురాణములయొక్క వివరమును, వానిని వేదవ్యాసమహర్షి వలన వివియటుపై యితరమునులు వ్రాసిన యుపపురాణముల వివరమును, స్కాందమహాపురాణమందలి సూతసంహితలో నీక్రిందివిధముగఁ దెలుపఁబడియున్నది:—

"..................................

శ్రీసూతః:—

శ్లో. "బ్రాహ్మం పురాణం ప్రథమం, ద్వితీయం పాద్మముచ్యతే,
తృతీయం వైష్ణవం ప్రోక్తం, చతుర్థం శైవ ముచ్యతే.

తతో భాగవతం ప్రోక్తం, భవిష్యాఖ్యం తతఃపరం,
సప్తమం నారదీయం చ మార్కండేయం తతఃపరమ్. ౮
ఆగ్నేయం నవమం పశ్చా ద్బ్రహ్మవైవర్తమేవ చ,
తతో లైంగం చ వారాహం, తత స్స్కాంద మనుత్తమమ్. ౯
వామనాఖ్యం, తతః కౌర్మం, మాత్స్యం తత్పర ముచ్యతే,
గారుడాఖ్యం తతః ప్రోక్తం బ్రహ్మాండం తత్పరం విదుః. ౧౦

... ... ... ... ... ...

అష్టాదశపురాణాని శ్రుత్వా సత్యవతీసుతాత్,
అన్యా న్యుపపురాణాని మునిభిః కీర్తితాని తు. ౧౨½
ఆద్యం సనత్కుమారేణ ప్రోక్తం వేదవిదాంవరాః!
ద్వితీయం నారసింహాఖ్యం, తృతీయం నాందికేశ్వరమ్. ౧౩½
చతుర్థం శివధర్మాఖ్యం, దౌర్వాసం పంచమం విదుః,
షష్ఠంతు నారదీయాఖ్యం, కాపిలం సప్తమం విదుః. ౧౪½
అష్టమం మానవం ప్రోక్తం తత శ్శోశనసేరితం,
తతో బ్రహ్మాండసంజ్ఞంతు, వారుణాఖ్యం తతఃపరమ్. ౧౫½
తతః కాళీపురాణాఖ్యం విశిష్టం మునిపుంగవాః!
తతో వాసిష్ఠలైంగాఖ్యం సాక్షా న్మాహేశ్వరం పరమ్. ౧౬½
తత స్సాంబపురాణాఖ్యం, తత స్సౌర మనుత్తమం,
పారాశర్యం తతః ప్రోక్తం మారీచాఖ్యం తతః పరమ్. ౧౭½
*గాంగాఖ్యం చ తతః ప్రోక్తం సర్వధర్మార్థసాధనమ్."

అనఁగా, మహాపురాణముల పేళ్లు:—

౧ బ్రహ్మపురాణము. ౨ పద్మపురాణము. ౩ విష్ణుపురాణము. ౪ శివపురాణము ౫ భాగవతపురాణము. ౬ భవిష్యపురాణము. ౭ నారదపురాణము. ౮ మార్కండేయ పురాణము. ౯ ఆగ్నేయపురాణము. ౧౦ బ్రహ్మవైవర్తపురాణము. ౧౧ లింగపురాణము. ౧౨ వరాహపురాణము. ౧౩ స్కాందపురాణము. ౧౪ వామనపురాణము. ౧౫ కూర్మపురాణము. ౧౬ మత్స్యపురాణము. ౧౭ గరుడపురాణము. ౧౮ బ్రహ్మాండ పురాణము.

---

*'భార్గవాఖ్యం తతః ప్రోక్తం' అని పాఠాంతరము.

## ఉపపురాణముల పేళ్లు.

౧ సనత్కుమారపురాణము. ౨ నృసింహపురాణము. ౩ నందికేశ్వరపురాణము. ౪ శివధర్మపురాణము. ౫ దూర్వాసపురాణము. ౬ నారదపురాణము. ౭ కపిలపురాణము. ౮ మానవపురాణము. ౯ ఉశనసపురాణము. ౧౦ బ్రహ్మాండపురాణము. ౧౧ వారుణపురాణము. ౧౨ కాళీపురాణము. ౧౩ వాసిష్ఠలింగపురాణము. ౧౪ మాహేశ్వరపురాణము. ౧౫ సాంబపురాణము. ౧౬ సౌరపురాణము. ౧౭ పారాశరపురాణము. ౧౮ మారీచపురాణము ౧౯ *గాంగపురాణము, (కాక, భార్గవపురాణము.)

## పురాణములనుగుఱించి ప్రాచీనచరిత్రలందలి సారాంశము.

లోఁగడఁగనపఱచిన ప్రమాణములనుబట్టి తేలువిషయ మేమనిన: వేదమునందలి యర్థము నెఱుఁగుట మిక్కిలి కష్టసాధ్యమైనందున, నందలి కర్మకాండకు సంబంధించిన విషయములనన్నిఁటిని బరమేశ్వరునియాజ్ఞ ననుసరించి బ్రహ్మదేవుఁడు స్మృతులరూపమున స్మరించియున్నాఁడు; ఆరీతిగనే, వేదమందలి జ్ఞానకాండకు సంబంధించిన విషయముల నన్నిఁటిని, బరమేశ్వరునాజ్ఞననుసరించి శ్రీమహావిష్ణువే వ్యాసుఁడుగ నవతరించి పదునెనిమిదిపురాణములద్వారా లోకమునకుఁ దెలిపియున్నాఁడు. ఆయనవలన నాపురాణములను విని యితరమహర్షులుఁగొందఱు మఱికొన్ని యుపపురాణములను వ్రాసియున్నారు. ఆపురాణములన్నియు వేదమందలి జ్ఞానకాండకు సంబంధించినవిషయముతోఁబాటుగ, నీప్రపంచక మేవిధముగ నెవరిచే నెప్పుడు సృజింపఁబడినదియు, నిందలి చరాచరరూపములగు భూతములెల్లను నెట్లేర్పడినదియు, నీవిశ్వ మింతవఱకెట్లువర్ధిల్లుచువచ్చినదియు, నింకముందెట్లు వర్ధిల్లఁబోవునదియు, నెంతకాలముండునదియుఁ, దుదకేమగునదియు, నీమొదలగు ప్రపంచచరిత్రకు సంబంధించిన పెక్కువిషయములను వివరముగ వర్ణించియున్నవి. అందుచేఁ బురాణములు కేవలము వేదమందలి వేదాంతమునుమాత్రమే గాక ప్రపంచకచరిత్రనంతనుగూడ బోధించునవైయున్నవి. అంతియగాక, యట్లు ప్రపంచకచరిత్రను, వేదాంతార్థమును,వర్ణించుటలో సందర్భానుసారముగ వేదములోని కర్మకాండకు సంబంధించిన వర్ణాశ్రమధర్మములు మొదలగు విషయములుగూడఁ బురాణములం దచ్చటచ్చటఁ బ్రసంగవశమున వచ్చియున్నవి. అట్టిప్రపంచక చరిత్రను వర్ణించు సందర్భమున నాప్రపంచకములోని యొకభాగమేయగు మనదేశము (భరతవర్షము) యొక్క చరిత్రగూడఁ బురాణములలో వచ్చియున్నది. అందుచే మనదేశమును బాలించిన రాజశిఖామణులును, వారివంశములును, నాయావంశములు సృష్టికర్తనుండి యెట్లుప్రారంభమైవచ్చినవో యావివరములునుగూడ మనపురాణములలోఁ దెలుపఁ

బడినవి. అట్టివంశములందు భగవంతుఁ డప్పుడప్పుడవతరించి, లోకమునుబాధించు దుష్టులను సంహరించి, లోకములనురక్షించి, ధర్మములను నెలకొల్పిన భగవత్కథా విషయములు గూడ సందర్భానుసారముగ మనదేశచరిత్రలగు మనపురాణములందు వర్ణింపఁబడి యున్నవి. ఇట్లు వేదములందలి జ్ఞానకాండ (యనఁగా వేదాంత) విషయమును, ప్రపంచకచరిత్రవిషయమును, ప్రధానముగను (ననఁగా ముఖ్యముగను,) గర్మకాండకు సంబంధించిన ధర్మాధర్మవిషయములను సందర్భానుసారముగను, బురాణములు వర్ణించి యుండుటచే నవికూడ వేదమేయనియుం, నాల్గువేదములతోఁజేర్చి వాని నైదవవేదముగఁ బరిగణింపవలయుననియుం, వేదములోనిభాగమేయగు 'ఛాందోగ్యోపనిషత్తు' చెప్పియున్న ప్రమాణవాక్యమును బైనఁ గనుఁగొనియేయుంటిమి. ఇందుచే, మనపురాణములు మనదేశచరిత్రనుమాత్రమేగాక ప్రపంచకచరిత్రనంతనుగూడఁ జెప్పునట్టిచరిత్ర గ్రంథములనియుం, వానిని దిన్నఁగాఁజదివి యందలి సత్యములను గ్రహింపనేరక మననవనాగరకులును విదేశీయులును జేరి, "మనపూర్వులు దేశచరిత్ర వ్రాయనెఱుఁగ" రనియుం "నందుచే మనకుఁ బూర్వకాలమున దేశచరిత్రలు లే"వనియుం వాదించుట వట్టియవివేకమనియుం బుజువగుచున్నది. వేదాంతవిషయమును బ్రధానముగఁ జెప్పునవి పురాణములే యగుటచే, నావిషయమును స్వల్పముగను సందర్భానుసారముగను జెప్పు ధర్మశాస్త్రములకును బురాణములకును వేదాంతవిషయమున నభిప్రాయభేదమువచ్చినచోఁ, బురాణములుచెప్పువిషయముననే యెక్కువబలముండుననియుం, నందుచే స్మృతులుచెప్పువిషయ మప్రామాణ్యమనియుఁ బురాణములు చెప్పునదే ప్రామాణ్యమనియుం, శ్రీమాధవాచార్యులవారు సూతసంహితకు వ్రాసిన వ్యాఖ్యలోఁ జెప్పియున్నవిషయమునుగూడఁ గనపఱచియేయుంటిమి. మఱియును, నెంతటిపెద్దపాండిత్యముగలవాఁడైనను బురాణములను జక్కఁగఁజదువక, వానియర్థమును దెలిసికొనక, వానిసహాయములేకయే, వేదమున కర్థముఁ జెప్పఁ బూనినచో, వాఁ డపార్థముపాలుగాక తప్పదనియుం, నందుచే నట్టివానినిజూచి వానివలనఁ దనకు నపాయమువాటిల్లునని వేదము భయపడుననియుం, వేదములను విభాగముగావించి యందుచే వేదవిద్వాంసుల కగ్రగణ్యుఁడైన వేదవ్యాసమహర్షియే స్వయముగఁ జెప్పుటయును (వేదములను బ్రహ్మదేవునినుండి స్వయముగ నేర్చికొనిన బ్రహ్మమానసపుత్త్రుఁడగు వసిష్ఠమహర్షి గూడ నట్లే చెప్పియున్న విషయములను) బైనఁగనుఁగొనియేయుంటిమి. ఈపైన దెల్పిన మహనీయులకు వేదములతోడను, వేదవిద్యాసాంప్రదాయముతోడను గలసంబంధము నిదివఱకే మొదటిప్రకరణమున, "వేద మపౌరుషేయమనిచెప్పిన ప్రామాణికులకుఁగల గౌరవాతిశయ"మను శీర్షికక్రిందఁ దెలిసికొనియుంటిమి. అట్టివారు మనపురాణములనుగుఱించి, మనప్రాచీనచరిత్రలలో వ్రాసినయభిప్రాయములను బైనదెలిసి

కొనియున్నాము. ఇఁక మనప్రాచీనచరిత్రలం దణుమాత్రమైన విశ్వాసములేనివారును, మన వేదశాస్త్రసాంప్రదాయములతోడను, వానిపై యాధారపడియున్న మనవైదికమతము తోడను గొంచెమైనను సంబంధము లేనివారును, మనపురాణములు వ్రాయఁబడునాఁటికి మనదేశ మేదిక్కుననున్న సంగతియుఁగూడ నెఱుఁగనివారునగు విదేశీయవిద్వాంసులు వ్రాసిన నవీనచరిత్రలును, వానినాధారముగఁగొని స్వదేశీయచరిత్రకారులు వ్రాసిన నవీనచరిత్రలును మనపురాణములనుగుఱించి యేమిచెప్పుచున్నవో యించుకఁ దెలిసి కొందము.

## పురాణములనుగుఱించి, విదేశీయులు వ్రాసిన నవీనచరిత్ర లేమి చెప్పును.

పైనదెల్పినరీతిగ మనపురాణములు మనమతసంబంధమగు వేదాంతమును, వేద ధర్మములనుమాత్రమే బోధించునవిగాక, సృష్ట్యాదినుండియు జరిగిన మనదేశచరిత్రమును, మనదేశమును బరిపాలించిన రాజవంశముల చరిత్రలను, మనదేశమున నవతరించిన మహనీయుల చరిత్రములనుగూడ బోధించుచుండఁగా, వానినిజూచియో, చూడకయో, చూచి యు నందలిసంగతు లర్థముగాకయో, యర్థమయ్యును నవినమ్మదగినవిగఁ దోఁచనందుననో, కొందఱు విదేశీయవిద్వాంసులు మనవాఙ్మయపరిశోధనను గావించికూడఁ బూర్వకాలమున మనకు దేశచరిత్రలులేవని దురభిప్రాయపడియున్నారు. అట్టివారిలో 'ఎల్ఫిన్‌స్టన్' (Mr. Elphinstone) దొరవారొకరు. అలెగ్జాండరుచక్రవర్తి (Alexander the Great) క్రీస్తుపూర్వము 327-వ సంవత్సరప్రాంతమున మనభరతవర్షముపై దండయాత్రవచ్చువఱకును మనదేశమున జరిగిన యేముఖ్యవిషయమునకునుగూడఁ గాలనిర్ణయమును జేయుటకాధారమగు దేశచరిత్ర మనదేశమునలేదనియు, నట్లే మనదేశముపై మహమ్మదీయులు దండెత్తివచ్చువఱకును మనజాతీయవిషయములను నిర్ధారణ చేయఁదగు వీలులేదనియు నీదొరగారియభిప్రాయము! ఆరీతిగనే, యితరజాతులు భారతీయులతోఁ జేరవచ్చినపిమ్మటమాత్రమే, మనదేశచరిత్రసంబంధమగు నెట్టివివరముల నైనను నిర్ణయింపవీలుగల్గుచున్నదని 'ప్రొఫసర్-కోవెల్' (Prof. Cowell) దొరగారు కూడ నభిప్రాయపడుచున్నారు! వీరు ప్రకటించిన "ఎల్ఫిన్‌స్టన్‌దొరగారి హిందూదేశచరిత్ర" (Elphinstone's History of India) యొక్క తొమ్మిదవకూర్పునందలి 11-వ పుటనుజూచినచో నీవిషయము బోధపడఁగలదు. ఈసిద్ధాంతమున కెట్టియాధారమును లేకపోయినను దీనినేయంగీకరించుచు, భారతీయులు వేదాంతవిషయమగ్నులగుటచేతనే, దేశచరిత్రనిర్మాణవిషయమున నుపేక్షించియుండిరని జాతికిఁ జెందినవారగుటచేఁ దేశచరిత్రనిర్మాణవిషయమున నుపేక్షించియుందురని

'ప్రొఫెసర్-మాక్సు-మల్లర్ (Prof. Max Muller) దొరవారభిప్రాయపడుచున్నారు. వారు రచించిన 'సంస్కృతవాఙ్మయచరిత్ర" (A History of Sanskrit Literature) గ్రంథములోని 9-వ పుటనుజూచినచో నీవిషయము విశదము కాఁగలదు.

ఇట్లే, 'డాక్టర్: ఎ. ఎ. మెక్‌డొనెల్' (Dr. A. A. Macdonell) దొరగారు కూడ మనదేశచరిత్ర నిర్మాణమునుగుఱించి యాక్రిందిరీతిగ నభిప్రాయపడియున్నారు:-

"History is the one weak spot in Indian literature. It is in fact non-existent. The total lack of the historical sense is so characteristic, that the whole course of Sanskrit literature is darkened by the shadow of this defect, suffering as it does from an entire absence of exact chronology. Two causes seem to have combined to bring about this remarkable result. In the first place early India wrote no history, because it never made any. The ancient Indians never went through a struggle for life like Greeks in the Persian and the Romans in the Punic Wars, such as would have welded their tribes into a nation and developed political greatness. Secondly, the Brahmins, whose task it would naturally have been to record great deeds, had early embraced the doctrine that all action and existence are a positive evil, and could therefore have felt but little inclination to chronicle historical events."

దీనియర్థమేమనఁగా:—

"భారతీయవాఙ్మయమున దేశచరిత్ర యొకలోపమగనున్నది. నిజమున కది లేనేలేదు. దేశచరిత్రసంబంధమగు నభిలాష పూర్తిగ లోపించియున్నందున, నందుచే సరియైన కాలనిర్ణయపద్ధతిలేకపోయి, యది సంస్కృతవాఙ్మయమునంతను కళంకభూయిష్టముగావించునంతటి ప్రాముఖ్యతగాంచియున్నది. ఇట్టివిచిత్రస్థితినిగల్గించుటకు రెండుకారణము లేకమైనట్లు కనఁబడుచున్నది. మొట్టమొదటఁ, బ్రాచీనభరతవర్షము దేశచరిత్రను రచించియుండలేదు; ఏలనన, నందెప్పుడును నది జరిగియుండలేదు. గ్రీసు దేశస్థులు 'పారశీక'యుద్ధములందును, 'రోమ్'దేశీయులు 'ప్యూనిక్'యుద్ధములందును, జీవితమునకై పెనగులాడి, యందుమూలమున వారిసైన్యము లొకజాతిగానేర్పడి రాజకీయప్రాముఖ్యత నభివృద్ధినొందించినవిధముగఁ, బ్రాచీనభారతీయు లెన్నఁడును బెనగులాడియుండలేదు. రెండవకారణమేమనఁ, నాకాలమున గొప్పకార్యములను గ్రంథస్థము చేయుటయే స్వాభావికమగు పనిగాఁగల బ్రాహ్మణులచిరకాలముననే, ప్రాపంచికసంబంధమగునన్నికర్మలును, విషయములును, నరిష్టము లను(వేదాంత)సిద్ధాంతము నవలంబించిరి; కావునఁ గాలనిర్ణయ, చారిత్రకవిషయములం దాసక్తి గల్గియుండఁజాలరైరి."

కాని, పైవిదేశీయవిద్వాంసులు పైరీతిని సవిచారపూర్వకముగ వ్రాసియున్నప్పటికిని, వారివలెఁ దొందరపడక విషయములను గొంచెము పారఁజూచి వ్రాసినవారుగూడ వారిలోఁగొందఱు లేకపోలేదు. 'ఎమ్. ఏ. స్టీన్'దొరవారు (Mr M. A. Stien) మొదలగువారు "దేశచరిత్రరచనావిధానము భారతీయులకుఁ దెలియనివిషయము కా"దని స్పష్టముగఁ గనఁబఱచియుండఁగా, 'విల్సన్'విద్వాంసుఁడును, (Professor Wilson) 'కాలెనల్-టాడ్' (Col. Tod) దొరవారును, 'విన్‌సెంటు-స్మిత్' (V. A. Smith)దొరగారు (వారువ్రాసిన 'హిందూదేశప్రాచీనచరిత్ర' [Early History of India—'అర్లీ-హిస్టరీ-ఆఫ్-ఇండియా'] యనుగ్రంథమున 11-వ పుటలో)ను, గలకత్తా యున్నత న్యాయస్థానమునందలి న్యాయాధిపతి పదవినుండి విశ్రాంతిగైకొనిన వారును, బ్రాచీనహిందూదేశచరిత్రపరిశోధనవిద్వాంసులును (Retired Judge of the Calcutta High Court and Research Scholar of the History of the Ancient India) నగు జస్టిన్. యఫ్. ఈ. పార్జిటర్' (Justice F. E. Pargiter) అనువారును, మనదేశచరిత్రను, రాజవంశములచరిత్రను మొదలగువానిని దెలుపు నుత్కృష్టచరిత్రగ్రంథములు మనపురాణములేయని విస్పష్టముగ వ్రాసియున్నారు. కావున నాయావిషయములను వరుసగ నీదిగువఁ బరిశీలింతము.

'ఎం. ఏ. స్టీన్' (Mr. M. A. Stien) దొరగారు తాముప్రకటించిన 'కల్హాణ' పండితుని 'రాజతరంగిణి' యనుగ్రంథమునకుఁ దామువ్రాయు నుపోద్ఘాతమునం దీక్రింది రీతిని వ్రాసియున్నారు:—

"It has often been said of the India of the Hindus that it possessed no history. The remark is true if we apply it to history as a science and art, such as classical culture in its noblest prose works has bequeathed it to us. But it is manifestly wrong if by history is meant either historical development or the materials for studying it. India has never known amongst its *Sastras*, the study of history such as Greece & Rome cultivated or as modern Europe understands it. Yet the materials for such study are equally at our disposal in India. They are contained not only in such original sources of information as Inscriptions, coins, and antiquarian remains generally; advancing research has also proved that written records of events or of traditions concerning them have by no means been wanting in Ancient India."

Mr. M. A. Stien's 'Raja-Tarangini', Vol. I, (Introduction, P. 3.)

దీనియర్థ మేమనఁగా:

"హిందువులయొక్క భారతవర్షమున దేశచరిత్ర లేదని తఱచుగాఁ జెప్పుచుందురు. మధ్యకాలమున జరిగినకృషివలన మనకు వచనగ్రంథములుగ లభించిన కళయును, శాస్త్రమును రూపముగాఁగల చరిత్రకే వైయర్థమును వర్తింపఁజేసినయెడల నది సత్యమగును. కాని, చరిత్రయనఁగాఁ, జారిత్రవిషయికాభివృద్ధియనిగాని, దానిని దెలిసికొనుటకు వలయుం సాధనములనిగాని, యర్థమగునెడలఁ, బైయభిప్రాయముతప్పని విస్పష్టముగఁ గనఁబడును. 'గ్రీసు' దేశమును, 'రోము' దేశమును గృషిచేసియున్నటువంటి చరిత్రనుగాని, ప్రస్తుతకాలమందలి 'యూరప్' ఖండము గ్రహించునట్టి చరిత్రనుగాని, భరతవర్షము తనశాస్త్రములలో నెన్నఁడును నభ్యసించియెఱుఁగదు. ఐనప్పటికిని, నట్లభ్యసించుటకు వలయుసాధనములు భారతవర్షమునఁగూడ సమానముగ మన యందికలో నున్నవి. అవి సామాన్యముగ స్వతస్సాధనములైన శాసనములయొక్కయు, నాణెములయొక్కయుఁ, బూర్వకాలపు శిథిలవస్తువులయొక్కయుం రూపమునమాత్రమే యుండలేదు; చరిత్రవిషయములకు సంబంధించిన వ్రాతమూలకములును, బ్రతీతిమూలకములును నగు సాధనములు ప్రాచీనభరతవర్షమున నేవిధముగను గోలుపడియుండలేదనికూడ నభివృద్ధిజెందిన పరిశోధన ఋజువుచేయుచున్నది."

—'స్టీన్' దొరగారి 'రాజతరంగిణి,' మొదటిసంపుటము; (ఉపోద్ఘాతము, 3-వ పుట.)

ఇఁక 'విల్సన్' విద్వాంసుఁడు (Prof. Wilson) 'విష్ణుపురాణము' యొక్క భాషాంతరీకరణమునకుఁ దానువ్రాసిన యుపోద్ఘాతమున నీక్రిందివిధముగ వ్రాసియుండెను:—

"The Fourth Book contains all that the Hindus have of their Ancient History. It is tolerably comprehensive list of Dynasties and individuals. It is a barren record of events. It can scarcely be doubted, however, that much of it is a genuine chronicle of persons if not of occurances. That it is discredited by palpable absurdities in regard to the longevity of the princes of their earlier Dynasties must be granted, and the particulars preserved in some of them, are trivial and fabulous. Still there is an artifical simplicity and consistency in the succession of

persons, and a possibility and probability in some of the transactions, which give to these traditions the semblance of authenticity and render it likely, that these are not altogether without foundation. At any rate, in the absence of other sources of information, the record, as it is, deserves not to be altogether set aside..................it is sufficient......to be satisfied with the general impression, that in the Dynasties of kings detailed in the Puranas, we have record, which although it cannot fail to have suffered detriment from age, and may have been injured by careless or injurious compilation, preserves an account not wholly undeserving of confidence, of the establishment and succession of regular monarchies amongst the Hindus, from as early an Era, and for as continuous a duration, as any in the credible annals of mankind.

... ... ... ... ... ...

"After Great War, the Vishnu Purana, in common with other Puranas which contain similar lists, specifies Kings and Dynasties with greater precision and offers political and chronological particulars to which, on the score of probability, there is nothing to object. In truth, their general accuracy has been incontrovertibly established."

Professor Wilson's 'Vishnu Purana' Introduction.

దీనియర్థమేమనఁగా:—

హిందువులయొక్క ప్రాచీనచరిత్రయంతయును, (పురాణములలోని) నాలుగవ
గ్రంథమున (ననఁగా 'విష్ణుపురాణము'న)ఁ గలదు. అది, రాజవంశములయొక్కయు,
వ్యక్తులయొక్కయు సమగ్రమగుపట్టిక. అది పట్టిచారిత్రవిషయములకు నెలవు. ఐనను,
నది చారిత్రవిషయములను దెలుపునది గాకపోయినప్పటికిని నందలి చాలభాగము ప్రసిద్ధ
పురుషులయొక్క నిష్కలంకమగు చరిత్రగ్రంథమనుటకు సంశయింపఁ బనిలేదు. హిందు
వుల ప్రాచీనరాజవంశములందలి రాజులయొక్క (మిక్కిలిదీర్ఘములగు) జీవితకాలములు
స్పష్టముగ నసంభవములైనందున వానిచే బైగ్రంథ మవిశ్వాసనీయమైన దనువిషయ

మంగీకరింపక తప్పదు*; వానిలోఁ గొన్నిఁటియందలి యంశము లముఖ్యములగు స్వల్పవిషయములును, కల్పితములును నైయున్నవి. ఐనప్పటికినిగూడ నందలి బురుషాంత రము లొకటివెనుకనొకటి గడచుటలో స్వాభావికతయును సందర్భతయును, నందలి చర్యలలోని గొన్నిఁటియం దట్టివిజరుగుట కవకాశతయునుగలవు; అందువలన నందలి ప్రతీతులు సత్యములుకాఁజాలుట కవకాశముగల్గి, యవి కేవలనిరాధారములు కావని యేర్పడుచున్నది. ఏమైననుగూడ,నితరాధారములు లేనంతవఱకును,బైగ్రంథ మెంతమాత్ర మును ద్రోసివేయఁదగినది కాదు..............పురాణములందు వర్ణింపఁబడిన రాజ వంశములలోని చరిత్రాంశము దీర్ఘకాలము గడచినందున శిథిలత్వమునకు గుఱిగాకతప్పక పోయినప్పటికిని, గ్రంథసంరక్షకుల యజాగ్రత్తతవలనను నవివేకమువలననుఁ జెఱుపు చెందియున్నప్పటికిని, గణుతింపఁదగిన మనుష్యజాతిచరిత్రలలో దేనికంటెనైననుగూడ నెక్కువ పురాతనకాలమునుండియుం హిందువులలోని రాజ్యములయొక్క నిర్మాణమును, వరుసను దెలుపుచుఁ, గేవల మవిశ్వాసనీయముగాక యలరారుచున్నదని......సామాన్య ముగ సంతసింపఁదగియున్నది.

... ... ... ... ... ...

మహా(భారత) యుద్ధానంతరమున, విష్ణుపురాణ మితరపురాణములవలెనె రాజు లను, రాజవంశములను నెక్కువజాగ్రత్తతో వర్ణించుచు, రాజకీయ, కాలనిర్ణయ సం బంధములగు చారిత్రకవిషయముల నొసఁగుచున్నది; సందర్భత విషయముననుసరించి యాక్షేపింపఁదగిన దం దొక్కటియునులేదు. నిజమున కవి సరియైనవనుసంగతి నిర్వివాద ముగ నిర్ణయింపఁబడినది."

—('విల్సన్' విద్వాంసుని 'విష్ణుపురాణోపోద్ఘాతము.)

ఇట్లే, 'కాలెనల్-టాడ్' (Col. Tod) దొరవారు తామువ్రాసిన 'రాజస్థాన చరిత్ర' (Annals & Antiquities of Rajasthan) యనుగ్రంథమున, భారతీ యుల 'చరిత్రనిర్మాణము'ను గుఱించియుఁ, 'బురాణము' లను గుఱించియుం, నీక్రింది విధమునఁ దెలిపియున్నారు:—

---

* కాని, పైవిధములగు నతిదీర్ఘజీవితకాలము లసంభవమనుట కీవిద్వాంసునకు వట్టి యూహాతప్ప వేఱేమియుం నాధారము గనఁబడదు. అందుచే నీయనవాద మీవిషయ మున నమ్మఁదగినది కాఁజాలదు. అంతియగాక, యట్టిదీర్ఘజీవితకాలములు పూర్వపుభార తీయులవిషయమున నసంభవములుకావని పీరివంటి విదేశీయవిద్వాంసులే కొందఱంగీక రించియున్నవిషయముల నీగ్రంథమున నే "సృష్టియెప్పుడుజరిగిన?" దను నాల్గవప్రకర ణమున, "ప్రాచీనచరిత్రలందలి కాలసంఖ్యలు కల్పితములుకానిచో నంత పెద్దవిగ నెట్లున్నవి?" యను శీర్షిక క్రింద ముందుముందు మనము తెలిసికొనఁబోవుచున్నాము.

"If we consider the political changes and convulsions which have happened in Hindustan since Mohamed's invasion, and the intolerant bigotry of many of his successors, we shall be able to account for the paucity of its national works on history, without being driven to the improbable conclusion that the Hindus were ignorant of an art which has been cultivated in other countries from almost the earliest ages. Is it to be imagined that a nation so highly civilised as the Hindus, amongst whom the exact sciences flourished in perfection, by whom the fine Arts, Architecture, Sculpture, Poetry, Music, were not only cultivated, but taught and defined by the nicest and most elaborate rules, were totally unacquainted with the simple art of recording the events of their History, the characters of their Princes and the acts of their reigns ? Where such traces of mind exist, we can hardly believe that there was a want of competent recorders of events which synchronical authorities tell us were worthy of commemoration."

"After 8 centuries of galling subjection to conquerors totally ignorant of the classical language of the Hindus ; after almost every capital city had been repeatedly stormed and sacked by barborous, bigotted, and exasperated foes; it is too much to expect that the literature of the country should not have sustained, in common with the other important interests, irretrievable losses."

"Those who expect from a people like the Hindus a species of composition of precisely the same character as the historical works of Greece and Rome, commit the very engregious error of over looking the peculiarities which distinguish the natives of India from all other races, and which strongly discriminate their intellectual productions of every kind from those of the West; their Philosophy, their Poetry, their Agriculture, are marked with traits of originality; and in some may be expected to pervade their history, which, like the arts enumerated, took a character from its intimate association with the religion of the people. It must be recollected moreover, that until a more correct taste wss imparted to the literature of England and France, by the study of classical models, the chronicles of both these countries, and indeed of all polished nations of Europe, were at a much more recent date, as crude, as wild, and as barren as those of the early Rajaputs."

"In the absence of the regular and legitimate historical records, there are, however, other native works, (they may, indeed, be said to bound,) which in the hands of a skilful and patient investigator, would afford no despicable materials of the history of India. *The first of these are the Puranas* and genealogical legends of the Princes which observed as they are by the mythological details, allegory, and improbable circumstances, contain many facts that serve as beacons to direct the research of the historian".

దీనియర్థ మేమనః—

" 'హిందూస్థానము'న మహమ్మదుయొక్క దండయాత్ర నాఁటినుండియును జరిగిన రాజకీయపరిస్థితులలోనిమార్పులను, మహోపద్రవములను, నతనితరువాత రాజ్యమునకు వచ్చిన యతనియనుచరులలోని పెక్కుమందియొక్క దుర్భరములగు దుండగములను, మనమాలోచించినచో, "నితరదేశములలో నించుమించుగ నత్యంతప్రాచీనకాలముల నుండియుఁ గృషిచేయఁబడుచున్న 'చరిత్రరచన'యనుకళను హిందువులెఱుఁగర"ను నయుక్తమగు తీర్మానమునకులోనుగాక, యాజాతికిసంబంధించిన చరిత్రవిషయములగు గ్రంథములయొక్క సంఖ్య యాదేశమునఁ గొఱవడియుండుటకుఁ గలకారణములను మనము గనఁబఱచఁగలుగుదుము. ఎవరియందు సరియైనశాస్త్రములు పరిపూర్ణాభివృద్ధినొంది యలరారినవో, యెవరిచేత వాస్తుశాస్త్రము, శిల్పముఁ, గపిత్వము, సంగీతశాస్త్రము మొదలైనచక్కనికళ లభ్యసింపఁబడుటయేగాక, బోధింపఁబడి యత్యంతరమ్యములును నత్యంత విపులములును నగు నియమములచే నిర్వచింపఁబడినవో, యట్టిహిందువులవంటి యత్యంత నాగరకతఁజెందినజాతివారు, వారిదేశచరిత్రవిషయములను, వారిరాజులయొక్క గుణగణములను, వారిమతశాస్త్రవిషయములను వ్రాసియుంచుకొనుట యనుస్వల్పకళనెఱుఁగనే యెఱుఁగరని యూహింపవలయునా? అట్టిబుద్ధివైభవచిహ్నములున్నచోట, సమకాలికులగుగ్రంథకర్తలు మఱువరానివనిచెప్పెడి చారిత్రకవిషయములను గ్రంథస్థముచేయఁగల సమర్థులు లోపించియుందురని మనము నమ్మఁజాలము."

"హిందువులయొక్క భాషాప్రాశస్త్యము నెఱుఁగనిరాజులయొక్క తీవ్రమగు దాడులకు నెనిమిదిశతాబ్దముల కాలము పాల్పడిన వెనుక; మోటువారును, దుష్టులును, గోపిష్ఠులునునగుశత్రువు లించుమించుగఁ బ్రతిముఖ్యపట్టణమును మరల మరల దోచికొని ధ్వంసముచేసినపిమ్మట; దేశమందలి వాఙ్మయము తక్కినముఖ్యవిషయములతోఁబాటుగఁ దిరిగి కోలుకొనఁజాలని నష్టములకుఁ బాల్పడియుండరాదని తలంచుట యతిశయోక్తి."

" 'గ్రీస్' దేశమందలియు, 'రోమ్' దేశమందలియు చరిత్రగ్రంథములవంటిరచనయే హిందువులవంటి జనులలో నుండవలసినదని కోరువారు, భారతవర్ష నివాసులను దక్కిన యితర జాతులనుండి వేఱుచేయు విశేషవిషయములను గమనింపని గొప్పతప్పును జేయుచున్నారు; అట్టివిశేషవిషయములు, వారియొక్క (అనఁగా, భారతీయుల) బుద్ధివైభవమునకు సంబంధించిన ప్రతిశాస్త్రమునకును, పాశ్చాత్యశాస్త్రములకును, గలభేదమును బ్రబలముగఁ జాటుచున్నవి; వారియొక్క వేదాంతశాస్త్రము, వారిఛందశ్శాస్త్రము, వారివ్యవసాయశాస్త్రమును, స్వీయబుద్ధివైభవలక్షణములతో నలరారుచున్నవి; వానిలోఁ గొన్నిఁటియందు వారి 'దేశచరిత్ర' గూడ వ్యాపించియున్నదని తలంపనగును; అదిగూడఁ, బైనఁ బేర్కొనిన కళలవలెనే యాజనులయొక్క మతముతో నత్యంతసన్నిహితసంబంధమును వహించి ప్రత్యేకలక్షణములను గలిగియున్నది. అంతియగాక, యున్నతవిద్యలనభ్యసించుటచే 'ఇంగ్లండ్' (England) దేశముయొక్కయు, 'ఫ్రాన్స్' (France) దేశముయొక్కయు వాఙ్మయమునకు మిక్కిలియిటీవల నెక్కువసరియగు నభిరుచి లభ్యపడువఱకును, నీరెండుదేశములయొక్క చరిత్రలును, నిజమునకు 'యూరప్' (Europe) ఖండమందు విరాజిల్లు నన్నిజాతులయొక్క చరిత్రలునుగూడఁ, బ్రాచీనకాలపు 'రాజపుత్ర జాతి' వారియొక్క చరిత్రలయంతటి మోటుగను, నంతటియనాగరకముగను, నంతటి నిస్సారముగను నుండెననుసంగతి జ్ఞాపకముదెచ్చికొనవలయును."

"కేవలము దేశచరిత్రకుమాత్రమే సంబంధించినగ్రంథములు లేకపోయినప్పటికిని, వానిస్థానమున నితరములగు జాతీయగ్రంథము లున్నవి; (అట్టివి యుండియేతీరినవనిగూడఁ జెప్పఁదగును;) ఆగ్రంథములు నేర్పరియు, నోపికగలవాఁడును నగు పరిశోధకునిచేతఁ జిక్కినచో నవి తెలుపఁజాలిన భారతవర్షచరిత్రసంబంధవిషయములు స్వల్పములుగావు. అట్టి గ్రంథములలోఁ బ్రప్రథనుములు పురాణములును, రాజులవంశచరిత్రములును; అవి కల్పితకథలుగను, (నతిశయోక్తులు మొదలగు) నర్థాలంకారములుగను (నర్థవాదములుగను) నసంగతప్రసంగములుగను గనఁబడినప్పటికిని, సముద్రమున నౌకలను నడపించుటకు దీపగృహములవలె జరిత్రకారుని పరిశోధనను నడపించుటకుపకరించుసత్యములను బెక్కింటిని గల్గియున్నవి."

లోఁగడఁ దెలిపియున్న **F.E. Pargiter** అనువారుగూడఁ బురాణములనుగుఱించి యీక్రిందిరీతిని దెలిపియున్నారు:—

**"Thess old genealogies, with their incidental stories, are not te be looked upon as legends or fables, devoid of basis or substance but contain genuine historical tradition, and may well be conside. red and dealt with from a common sense point of view."**

**—Journal of Royal Asiatic Society, 1910.**

దీనిభావ మేమనిన:—

"ప్రసంగవశమునవచ్చిన కథలతోఁగూడిన యీవంశచరిత్రగ్రంథము లాధార శూన్యములును, విషయశూన్యములును నగుకల్పితకథలనిగాని, పుక్కిటిపురాణములనిగాని తలంపరాదు; నిర్దుష్టమగు చరిత్రసంబంధమైనప్రతీతి వానియందుఁగలదు; లోకజ్ఞాన దృష్టిలోఁజూచినచో బాగుగనాలోచించి యుపయోగింపఁదగినవిగానున్నవి."

రాయల్-ఏషియాటిక్-సొసైటీ, 1910 సం॥రము.

మనపురాణములనుగుఱించి, విదేశీయులగు నవీనచరిత్రకారులలోని 'ఎల్ఫిన్ స్టన్' దొరవారును, 'ప్రొఫెసర్-లోవెల్' దొరవారును, 'ప్రొఫెసర్-మాక్స్-ముల్లర్' దొరవారును, 'డాక్టర్: మెక్ డొనెల్'దొరవారును మొదలగుకొందఱు విద్వాంసు లెట్లు దురభిప్రాయపడియున్నను, 'ఎమ్. ఏ స్టీన్' దొరవారును, 'ప్రొఫెసర్-విల్సన్' దొర వారును, 'కాలెనల్-టాడ్'దొరవారును, 'విన్సెంట్-ఏ-స్మిత్'దొరవారును మొదలగు మఱికొందఱు విద్వాంసు లెట్టిసదభిప్రాయములను గల్గియున్నదియును పైవిమర్శచే విశద మగుచున్నది. కావున నిఁక స్వదేశీయులగు నవీనచరిత్రకారులువ్రాసిన నవీనచరిత్రలు మనపురాణములనుగుఱించి యేమిచెప్పుచున్నవో యించుకవిచారించి తెలిసికొందము.

## పురాణములనుగుఱించి స్వదేశీయులువ్రాసిన నవీనచరిత్ర లేమిచెప్పును.

నవీనచరిత్రలలో నొకటియగు 'హిందూదేశకథాసంగ్రహ'మందలి 'హిందూమహో యుగ'మను భాగము, 'పురాణరచన'యను శీర్షికక్రిందఁ బురాణములనుగుఱించి యీ క్రిందిరీతిని వ్రాసియున్నది:—

"ఈకాలమందుఁ (పౌరాణికయుగమునందుఁ) గ్రమక్రమముగాఁ బురాణములు రచింపఁబడియె.పురాణములుపదునెనిమిదియని యందఱకుఁ దెలిసినవిషయమే. ఇవన్నియు నొక్కసారివ్రాయఁబడలేదు. కాని, యందు ముఖ్యమైనవి యీకాలమందు వ్రాయఁ బడెననిచెప్పవచ్చును. వేదములో రూపకాలంకారముగ వర్ణింపఁబడిన సృష్టిలోని దృశ్య ములను నిజమైనకథలుగ బురాణకారులువ్రాసిరి. ఇందుల కొకయుదాహరణము. సూర్యుని వలనఁగలిగినయుషస్సు మొదటగాన్పించుటయుఁ, బిదప సూర్యుం డుదయించుటయుఁ జూచి సూర్యుఁడు తనబిడ్డవెంటఁ దగిలెనని వైదికఋషులు రూపకముచెప్పిరి. పురాణ కారులు దానిని నిజమైనచరిత్రగాఁగైకొని బ్రహ్మదేవుఁడు తనబిడ్డవెనుకఁ దగులఁగా శివుఁడు వానిశిరస్సునుద్రుంచెనని యొకపౌరాణికకథను గల్పించిరి. ఇట్లు గాథలు పెరిగి పెరిగి పురాణములయ్యెను. జను లీపురాణములలోని గాథలు నిజమైనవియని నమ్మఁజొచ్చిరి.

ఇంద్రుఁడు, వరుణుఁడు, రుద్రుఁడు మొదలైనవైదిక దేవతలు మూలఁబడి, శివుఁడు, విష్ణువు, గణపతి మొదలగుపౌరాణిక దేవతలమాహాత్మ్య మెక్కుడయ్యెను. ఈపౌరాణిక దేవతలగౌరవ మెక్కువయైనకొలఁది జనులుకొంద ఱొకదేవతపక్షమువారయి, యితర దేవతలను నిందించుచు శైవ, వైష్ణవ, గాణపత్యాదిసాంప్రదాయములఁ బుట్టించిరి. పురాణకారులు కొందఱు శివపక్షపాతులు; కొందఱు విష్ణుపక్షపాతులు. ఇట్లు ఈయాధునికసాంప్రదాయములు పెరిగెను.

పారాశరాది కొన్నిస్మృతులుగూడ నీకాలంబుననే రచియింపఁబడియెనని యూహింపఁబడుచున్నది."

హిందూదేశకథాసంగ్రహము (హిందూమహాయుగము,) ఆఱవప్రకరణము, పుట ౧౭౩.

పురాణములందలి విషయములనుగుఱించియుం, వానివలన లోకమునకుఁగల్గు ప్రయోజనములనుగుఱించియుఁ బ్రాచీనచరిత్రకారులు గ్రహించినసంగతులను లోగడ నీప్రకరణముననే తెలిసికొనియుంటిమి. నవీనచరిత్రకారులు గ్రహించినసంగతుల నిపుడీపైన దెలిపియుంటిమి. ఈరెంటికిని నెంతభేదముగలదో యించుక యాలోచించినచోఁ దెలియఁగలదు. పురాణములు ముఖ్యముగ వేదమునందలి యుపనిషత్తులలోని వేదాంతార్థమును, బ్రపంచకముయొక్కసృష్టి, స్థితి, ప్రళయములకు సంబంధించిన చారిత్రకవిషయములవివరములను, సృష్ట్యాదినుండియు మనదేశమును బరిపాలించుచు వచ్చిన మహనీయులగు రాజన్యమూర్ధన్యులవంశచరిత్రములను, నాయాకాలములందు భగవంతుఁడు భూమిపై యవతరించి దుష్టశిక్షణమును,శిష్టరక్షణమును గావించి ధర్మమును, లోకమును, సంరక్షించినభగవత్కథలను, దెలుపునవి యనియుం, వానితోఁబాటుగ సందర్భము ననుసరించి వేదమునందలి వర్ణాశ్రమధర్మములు మొదలగువానినిగూడఁ దెలుపునవియనియుం, నాల్గువేదములను వేదాంగములను సమగ్రముగఁ జదివిన వేదవ్యాసమహర్షియుం, శ్రీమాధవాచార్యులవారును, శ్రీధరాచార్యులవారును మొదలగు వేదవిద్వాంసులెల్లరును వ్రాసియుండగను, నందువలననే పురాణములు వేదములయర్థమునే తెలుపుననియుఁ బురాణములయర్థ మెఱుఁగనివానికి నపార్థమేకప్ప వేదముయొక్క సరియైనయర్థము తెలియనే తెలియఁజాలదనియుఁ వసిష్ఠమహర్షియును వేదవ్యాసమహర్షియును జెప్పియుండగను, బురాణములుగూడ వేదమే యనియుం, నాల్గువేదములకుఁ దోఁడుగ నవి యైదవవేదమనియుఁ వేదములోని ఛాందోగ్య శ్రుతియే (యనఁగా వేదమే)

యంగీకరించియుండఁగను*, మననవీనచరిత్రకారులు వానినన్నిఁటిని జూచియో చూడకయో, "పురాణకారులు వేదమందలి రూపకాలంకారములను నిజమగుచరిత్రలుగా భ్రమపడి వేఱుకథలనుగల్పించివ్రాసి" రనియు, "నట్టికల్పితకథలే పెరిగి పెరిగి పురాణములయ్యె" ననియుం, "జను లీపురాణములను నిజమని నమ్మఁజొచ్చి" రనియుం, "నాపురాణములమూలముననే, దేశమున నొకరినొకరు నిందించుకొను వేఱువేఱుసాంప్రదాయము లేర్పడె" ననియుం వ్రాసియున్నారు. ఇందలి కడపటివాక్యముచే మనదేశీయులయందలి యైకమత్యమును భంగపఱచుటకుఁగూడఁ బురాణములే కారణములైనవని లెస్సఁగ ధ్వనించుచున్నది. నవీనచరిత్రకారు లిట్లొక్కొకలముపోటుతోఁ బురాణములయొక్క ఖ్యాతిని నిర్మూలింప సాహసించియున్నారు! కావున నిం దెంతసత్యమున్నదో, యాక్రింద నించుక విచారించి తెలిసికొనుట మిక్కిలి యవసరము.

## పురాణములనుగుఱించి ప్రాచీనచరిత్రలు చెప్పిన విషయములు సత్యమా? నవీనచరిత్రలు చెప్పువిషయములు సత్యమా?

వేదములందు రూపకాలంకారముగ వర్ణింపఁబడిన సృష్టిలోనిదృశ్యములను నిజమైనకథలుగాఁ బురాణకారులు వ్రాసిరని నవీనచరిత్రవలన మనము పైనదెలిసికొనియుంటిమి. కాని, యెట్టిప్రయోజనమునుగోరి పురాణకారు లట్లువ్రాసిరి? అసంగతిని మనహిందూదేశకథాసంగ్రహగ్రంథకర్త లేవిధముగఁ దెలిసికొనఁగల్గిరి? ఆవివరములను వీరు తమగ్రంథమునఁ దెలిపియుండిరా? లేదు! ఏల తెలుపఁగూడదు? "ప్రయోజనమనుద్దిశ్య నమందోఽపి ప్రవర్తతే" యనుశాస్త్రోక్తి ననుసరించి, యేదియో ప్రయోజనమునుగోరకయే పిచ్చివాఁడుగూడ నెట్టిపనియును జేయఁడుగదా! అట్టిసందర్భమునఁ బురాణకారులు వేదములందు రూపకాలంకారముగ వర్ణింపఁబడిన సృష్టిలోనిదృశ్యములను నిష్కారణముగనే నిజమైనకథలుగా వర్ణించిరని మనము తలంపవలయునా? అట్టి వ్యర్థములగువర్ణనములను జేయుటకే తాము పురాణములను వ్రాసితిమని యేపురాణ

* "పురాణములు వేదములతరువాతఁ బుట్టినవని యాగ్రంథమువలనఁగూడఁ దేలుచునేయున్నదిగదా! వెనుకఁబుట్టిన పురాణములసంగతి ముందుఁబుట్టిన వేదములో నెట్లురాఁగలదు? అందుచేఁ బైఛందోగ్యశ్రుతివాక్యము ప్రక్షిప్తమై యుండనక్కఱ లేదా?" యని సంశయము గలుగవచ్చును. కాని, జరిగినవిషయములతోఁబాటుగ జరుగఁబోవువిషయములుగూడ వేదమందుండుననియుం, వేదము నిత్యము, నపౌరుషేయము ననియుం, మొదటిరెండుప్రకరణములలో నీగ్రంథమునం దిదివఱలోఁ దెలుపఁబడియే యున్నది. ఆటఁ జూడనగును.

కారుఁడైనను దనగ్రంథమునఁ జెప్పికొనియుండఁగా దానిని వీరు చూచియుండిరా? అట్టివిషయమున్నచో దమగ్రంథమున వీరేల కనఁబఱచికొనియుండలేదు? అందులకు వ్యతిరేకముగ, వేదములందలి వేదాంతవిషయమును, సృష్టిస్థితిప్రళయములకు సంబంధించిన ప్రపంచకచరిత్రవిషయమును, బ్రసిద్ధిగాంచిన రాజవంశములకు సంబంధించిన మనదేశచరిత్రవిషయమును, బ్రధానములుగఁ దెలుపుటకును, వేదములందలి వర్ణాశ్రమధర్మములకు సంబంధించిన ధర్మాధర్మవిషయములను సందర్భానుసారముగఁ దెలుపుటకును మాత్రమే పురాణములు వ్రాయఁబడినవని, మనవేదశాస్త్రములను సమగ్రముగఁ జదివిన ప్రముఖులగు మనప్రాచీనచరిత్రకారులు వ్రాసినవిషయములను లోగడ సప్రమాణముగఁ గనఁబఱచిరే యంటిమిగదా! అట్టివిషయములను మననవీనచరిత్రకారులు చూచిరా? ఐనచో వానిప్రశంసను దమగ్రంథమున నేల యెత్తలేదు? తమయూహకు విరుద్ధముగనున్న యావిషయములను జర్చించి, యవి నిస్సారములని ఋజువుచేసి, యటుపైగదా తమయూహను దమగ్రంథమున సిద్ధాంతము చేసికొనవలయును! వీ రట్లేల చేయలేదు? ఈపైవిమర్శచే 'హిందూదేశకథాసంగ్రహ'కర్తలు వ్రాసిన పైవిషయములు నిరాధారములగు వట్టియూహలుమాత్రమేగాని యంతకంటె నింకేమియును గాదని ఋజువగుచున్నది!

కాని, పైనవీనచరిత్రకారులయొక్క పైయూహ నిజమైనదే యని వాదముకొఱకించుకసే పంగీకరించి, వారియూహ కేవిధమైన యాధారమయినను గలదేమో యించుక విచారించిచూతము. పురాణకారులు నిష్ప్రయోజనముగనే కాని, వేదముయొక్క యర్థము వారికి సరిగాఁ దెలియనందునఁగాని, లోకమును వంచించి పేరుప్రతిష్ఠలు సంపాదించుకొనఁదలంచికాని, యట్టిదృశ్యములను నిజమైనకథలుగా వర్ణించి వ్రాసిరని నవీనచరిత్రకారులయభిప్రాయమా? ఐనచో దానిని దాపనేల? స్పష్టముగనే వ్రాయవచ్చునుగదా! ఏల వ్రాయలేదు? అంతియగాక పురాణకారులగుమహర్షులు నిష్ప్రయోజనముగనే యట్టి వ్యర్థములగువర్ణనలను వ్రాయుదురనుట యుక్తిబాహ్యమగువిషయము. అట్టిపనిని బిచ్చివాఁడుగూడఁ జేయఁజాలఁడనినచో నిఁక వివేకనిధులగుమహర్షులు దానిని జేయుదురని తలంపఁదగునా? ఇఁక వేదార్థము వారికి సరిగాఁ దెలియరానందున వారట్లు చేసియుందురనుకొనవలయునా? ఐనచో నంతకంటె నసత్యముండదు! ఏమనిన, వేదవిద్యాసాంప్రదాయమునకును మనమహర్షులకును గలసంబంధమును, వేదార్థమును దెలిసికొనుటలో మనమహర్షులనుమించిన యితరులు లోకమున నుండుట యసంభవమను విషయమును, నట్టివా రుందురనుకొనుట వట్టి భ్రాంతిమూలకమనియు, నీగ్రంథముయొక్క మొదటిప్రకరణమున, "వేదమునుగుఱించి ప్రాచీనచరిత్రలు చెప్పినవిషయములు సత్యమా? నవీనచరిత్రలు చెప్పువిషయములు సత్యమా?" యనుశీర్షిక క్రింద విశదపఱచియే

యున్నాము. అట్టితరిని, వేదార్థము సరిగాఁ దెలియరానందున సృష్టిలోనిదృశ్యములను బురాణకారులు కథలుగా వ్రాసియుందురని యూహించుట మిక్కిలి సాహసమగును! ఐనచో నీకఁ బేరుప్రతిష్ఠలు రాఁగోరి యట్లు వ్రాసియుందురని నవీనచరిత్రకారుల యభిప్రాయమా? అట్లయిన నదియును సరిగాఁజాలదు! ఏమనినఁ, బేరుప్రతిష్ఠలు రాఁగోరినచో, వేదమున రూపకాలంకారముగ వర్ణింపఁబడినవిషయమును వివేకియగు వాఁడు తానును బురాణమునందు రూపకాలంకారముగనే, యున్నదియున్నట్లు వర్ణింపవల యునేగాని,యదిమాని కథగా వర్ణించినచో, వానికిని, వానిపాండిత్యమునకును గలుగునది పేరుప్రతిష్ఠలకుమారుగ నప్రతిష్ఠమాత్రమే! కావున మహర్షు లట్లువ్రాయుటకుఁ గార ణము పేరుప్రతిష్ఠలమీఁదికోరిక యనుటగూడ యుక్తియుక్తముగాదు! అంతియగాక, యరిషడ్వర్గములను జయించి జితేంద్రియులై, సర్వసంగపరిత్యాగులై, తపోధను లయ్యును లోకహితమునే కాంక్షించుమహర్షులకుఁ బేరుప్రతిష్ఠలతోఁ గావలసినదేమి? కాని, "మహర్షు లట్టివారుకాకపోవచ్చునని పై నవీనచరిత్రకారులయభిప్రాయమై యుండఁగూడదా?" యని కొందఱు సంశయింపవచ్చును. ఆవాదము దుర్బలమనియుఁ, నిస్సారమనియుం నీగ్రంథముయొక్క మొదటిప్రకరణముననే, "ప్రాచీనచరిత్రకారుల గుణసంపదయెడఁ గలసంశయములు; వానికి సమాధానములు," ననుశీర్షికక్రింద నిది వఱకే విశదపఱచియుంటిమి. కావునఁ బైరీతి నాలోచించిచూడఁగా మహర్షులా కారణ ముచే నట్లు వ్రాసియుందురనుట పొరపాటని బుజువగుచున్నది!

కాని, "మహర్షు లాతీరుగ వ్రాసినవ్రాతకు నుదాహరణమునుగూడ 'హిందూదేశ కథాసంగ్రహ'కర్తలు వారిగ్రంథమునఁ గనబఱచి పైయంశమునందే చూపియుండ లేదా?" యని కొంద ఱడుగవచ్చును. చూపియున్నమాట వాస్తవమే! కాని, యది యెంతయుక్తియుక్తముగానున్నదో యించుక పరిశీలింతము.

"సూర్యునివలనఁగలిగిన యుషస్సు మొదటఁ గాన్పించుటయుఁ బిదప సూర్యుఁ డుదయించుటయుఁ జూచి సూర్యుఁడు తనబిడ్డవెంటఁ దగిలెనని వైదికఋషులు రూప కముచెప్పి"రఁట; అది వేదములో రూపకాలంకారముగ వర్ణింపఁబడినసృష్టిలోని దృశ్య ముల కుదాహరణమట! వేదములను గొందఱు వైదికఋషులు వ్రాసియుండిరని దీనిచే సువ్యక్తమగుచుండుటచే నీనవీనచరిత్రకారులదృష్టిలో వేదములు కేవలపౌరుషేయములే గాని యపౌరుషేయములుగావని స్పష్టమగుచున్నది. కాని, వేదము లపౌరుషేయ ములను వాదముగూడ లోకమున నొకటియున్నట్లు వీరెఱుఁగకపోలేదు. ఏమనిన, వీరు వేదమునుగుఱించి వ్రాయుసందర్భమున, "ఋగ్వేదములోనిమంత్రముల రచించిన వారు ఋషులు. అట్టివా రనేకులుండిరి.

వేదము లపౌరుషేయము లనెడివారు వీరిని మంత్రకర్తలనక, మంత్రద్రష్టలని యెద”రని వ్రాసియున్నవిషయము నీగ్రంథముయొక్క మొదటిప్రకరణమున, “వేదమునుగుఱించి నవీనచరిత్రలు చెప్పువిషయముల కుదాహరణ”మను శీర్షిక క్రిందఁ దెలిసికొనియే యున్నాముగదా ! దీనినిబట్టిచూడఁగా వేదము లపౌరుషేయములనెడివారు గూడఁ గొందఱుగలరనుసంగతి మన ‘హిందూదేశకథాసంగ్రహ’కర్తలకు లెస్సగఁ దెలియునని స్పష్టమగుచున్నది. ఐననుగూడ మనదేశచరిత్రను వ్రాయఁబూనిన వీరు కేవలము తమనమ్మకముననుసరించి తమయభిప్రాయమును వ్రాయుచు నెదుటిపక్షమువారివాదమును సూచించిమాత్రము విడిచిరేగాని, యిరువురివాదములకునుగల వేఱువేఱాధారములను బట్టుచర్చించుటకును, నం దెవరివాద మెట్టిహేతువులచే సత్యమగునో రెండవవారి దేల సత్యముకాదో తేల్చిచెప్పుటకును యత్నించియుండలేరి. ఆపనిని మేమీగ్రంథమున మొదటిప్రకరణమునఁ గావించి, ‘వేదము పౌరుషేయ’మను నవీనచరిత్రకారులవాదము కేవలనిరాధారమని, “వేదమునుగుఱించి ప్రాచీనచరిత్రలు చెప్పినవిషయములు సత్యమా? నవీనచరిత్రలు చెప్పువిషయములు సత్యమా?” యనుశీర్షిక క్రింద ఋజువుపఱచియుంటిమి. అందుచే, “వేదమునందలిరూపకములు వైదికఋషులుచెప్పి”రను వీరివాదము సత్యము కాదని మొదట ఋజువగుచున్నది!

అదియట్లుండి, “పురాణకారులు దానిని (పైరూపకమును) నిజమైనచరిత్రగాఁ గైకొని........యొకపౌరాణికకథను గల్పించి”రనువిషయ మాలోచింతము. వేదమందలి రూపకాలంకారమును రూపకాలంకారముగనే గ్రహింపక, పురాణకారులు నిజమైన చరిత్రగా నేలగైకొనిరి? అది రూపకముమాత్రమే యనియు, నిజమైనచరిత్రగాదనియు మననవీనచరిత్రకారులు గ్రహింపఁజాలినమాత్రమైనను గ్రహించుటకు వీరికిఁగల యర్థజ్ఞానము మాత్రమైనను వారికి లేకపోవుటచేతనా ! అట్లదెన్నఁడును గాఁజాలదని యీవ్యాసముననే పైన ఋజువుచేసియుంటిమి. అంతియగాక, యట్టిరూపకము నాధారము చేసికొనియే యాకథను వ్రాసియుంటిమని పురాణకారు లెచ్చటఁగాని చెప్పికొన్నవిషయమును మననవీనచరిత్రకారు లెత్తిచూపియుండలేదు. ఇఁక నాసంగతి తామెట్లు గ్రహింపఁగల్గిరో వీరు తమగ్రంథమునఁ జెప్పియుండలేదు. అందుచేఁగూడ వీరివాదము నిరాధారమగు నూహామాత్రమే యని విశదమగుచున్నది.

“ఊహామైన నేమి? అంతమాత్రముచే నది యబద్ధము కావలసియున్నదా? లోకమున నూహాలలో నన్నియు నసత్యములే యగుచున్నవా ? వానిలోమాత్రము కొన్ని నిజమగుటలేదా?” యని కొందఱడుగవచ్చును. ఊహాలలోఁ గొన్నినిజమైనచోఁ గావచ్చును. కాని, యున్నంటినినిమించినచరిత్ర మీపైయూహాలో నింకొకటి గన్పట్టుచున్నది!

ఏమనిన: "సూర్యుఁడు తనబిడ్డవెంటఁ దగిలె" ననురూపకమును రూపకమే యని తెలిసి కొనలేక నిజమైనచరిత్రవిషయమే యని మనపురాణకారులు భ్రమపడియుండిరని వాదముకొఱకు కించుకసేపు మనమంగీకరించినను, నట్టిభ్రమచే వారు దానిని బురాణములలో రూపకముగ వర్ణింపనేరక నిజమగుచరిత్ర విషయమనియే వ్రాసియుండవలయును. అనఁగా, సూర్యుఁ డొకఁడుండెననియు, వాని కొకబిడ్డయుండెననియు, నతఁ డాబిడ్డవెంటఁ దగిలెననియుమాత్రమే వారొకకథను వ్రాసియుండవలయును. కాని, యందులకుమారుగ, "బ్రహ్మదేవుఁడు తనబిడ్డవెనుకఁ దగులఁగా శివుఁడు వానిశిరస్సును ద్రుంచె"నని వేఱొకయబద్ధపుకథను గల్పించి వ్రాయవలసిన యవసరమేమి? పై రూపకమందలికథకును గ్రిందిపురాణమందలికథకును నావంతయైనను సంబంధముగలదా? ఒకవేళ సూర్యునకుమారుగ బ్రహ్మదేవుని, నుషస్సునకుమారుగ బ్రహ్మదేవునియొక్కబిడ్డ యగుసరస్వతిని దీసికొని పురాణకారులు కథగ వ్రాసియుండవచ్చునని యనుకొందమా? అట్లు వ్రాసిరని యెట్లు నిర్ధారణచేయఁగలము? అంతియగాక, యట్లు వ్రాయవలసినయగత్యమును నందుచేఁగాఁగల ప్రయోజనము నెట్టిది? వారట్లే వ్రాసియుండిరని మనమొకవేళ వాదముకొఱ కంగీకరించినను, బురాణకథలోనిశివునకు సంబంధించినవిషయము పైరూపకమున నేమున్నది? ఇఁక నారూపకమునుండియే యీపురాణగాథ పుట్టియున్నదనుట కేమి యాధారమున్నది? అంతియగాక పురాణములో వర్ణింపఁబడినగాథ నిజముగ జరిగియున్నదిగాదనియుఁ గల్పింపఁబడినదేయనియు మన 'హిందూదేశకథాసంగ్రహ'కర్తగారి కెట్లు తెలిసినది? ఆవివరములను వారేల తమగ్రంథమున వ్రాసికొనియుండలేదు? దీనినిబట్టి చూడఁగా వీరివాదము కేవలనిరాధారమగు వట్టిపచ్చియూహయేగాక మిక్కిలి యసంబద్ధమనియుఁ, గావున నం దావంతయైనను సారములేదనియు బాయిగ్రుద్ది చెప్పవచ్చును గదా!

అంతియగాక "యిట్లు గాథలు పెరిగిపెరిగి పురాణములయ్యె"ననియుఁ "జనులీపురాణములలోనిగాథలు నిజమైనవియని నమ్మఁజొచ్చిరి" యనియుఁగూడఁ, బై 'హిందూదేశకథాసంగ్రహ'కర్తగారు వ్రాసియున్నారు. దీనిచేఁ, బురాణములందలి కథలన్నియుఁగూడ నిట్టివ్యర్థములు నబద్ధములునగు కల్పితకథలేయని వీరియభిప్రాయమైనట్లు విశదమగుచున్నది! కాని, తగినయాధారమును దేనినిగాని కనఁబఱచి తమయభిప్రాయమును దానిచే సమర్థించుకొనకయుఁ, బరవాదముఁజర్చింపకయు నూరక చేతికివచ్చినట్లు వీరు వ్రాసియుండినందున, నిజమెఱుఁగఁగోరువారికి వీరియభిప్రాయ మేవిధముగను దోడ్పడఁజాలదు.

మఱియును బురాణములవలన, "నింద్రుఁడు, వరుణుఁడు, రుద్రుఁడు మొదలైన వైదికదేవతలు మూలఁబడి, శివుఁడు, విష్ణువు, గణపతి, మొదలగు పౌరాణికదేవతల

మాహాత్మ్యమే మెక్కుడయ్యె" ననిగూడ వీరు వ్రాసియున్నారు. ఇందుచే వైదిక దేవతలు వేఱనియుఁ బౌరాణిక దేవతలు వేఱనియు వీరియభిప్రాయమని తెలియుచున్నది. కాని, ఏ రీతివిభాగ మెట్లుగని పెట్టియుండిరో తమగ్రంథమున వ్రాసికొనియున్న వారుగారు. వేదములందుఁ జేర్కొనబడిన దేవతలే వైదిక దేవతలనియుఁ, బురాణములందుఁ జేర్కొనఁబడిన వారు పౌరాణిక దేవతలనియు నే వీరియభిప్రాయమైనయెడల, నది యసంగతముగఁ గన్పట్టకమానదు. ఏమనినఁ, బురాణములు వేదము ననుకరించునవియే యనుసంగతి వీరు గుర్తించియుండలేదేమోగాని, యంతమాత్రముచే వీరు వైదిక దేవతలనితలంచిన యింద్రుఁడు, వరుణుఁడు, రుద్రుఁడు మొదలగువారి ప్రశంస పురాణములలోను, పౌరాణిక దేవతలనియెంచిన శివుఁడు, విష్ణువు, గణపతి మొదలగువారి ప్రశంస వేదములందును లేకపోలేదు. ఇందులకు స్థాలీపులాకన్యాయముగ నీక్రిందియుదాహరణములే సాక్ష్యము:—

౧. వైదిక దేవతలగు నింద్రుఁడు, వరుణుఁడు, రుద్రుఁడును బురాణములలోఁగలరనుట కుదాహరణము:

"శ్లో॥ ... ... ... ... ...
ముముక్షు రతిసంతుష్ట "స్సిధ్యత్యేవ గతి ర్మమ,"
ఇతి నిశ్చయబుద్ధిస్తు ప్రతిబంధనివృత్తయే ౨
దేవతా స్సకలా నిత్యం ప్రార్థయే న్మతిమత్తమః
"శన్నో మిత్ర శ్శం వరుణ శ్శన్నో భవతు చార్యమా, ౩
శన్న ఇంద్రశ్చ వాగీశ శ్శన్నో విష్ణు రురుక్రమః.
... ... ... ..."
రుద్రాక్షధారణం కుర్యాత్ రుద్రో రుద్రాక్షధారణాత్."
... ... ... ...

స్కాందపురాణే, సూతసంహితా, యజ్ఞవైభవఖం. అధ్యా. ౧౬

పైన వైదిక దేవతలని చెప్పఁబడిన యింద్ర, వరుణ, రుద్రులు ముగ్గురునుగూడ నీపైనఁజూపిన స్కాందపురాణశ్లోకములందుఁ జేర్కొనఁబడియేయున్నారు. ఇట్టివింకను బెక్కులు చూపవచ్చును.

౨. పౌరాణిక దేవతలగు శివుఁడు, విష్ణువు, గణపతియును, వేదములందు గలరనుట కుదాహరణము:

"...సబ్రహ్మ స శివ స్సహరి స్సేన్ద్రి స్సోఽక్షరః పరమ స్స్వరాట్."

తైత్తిరీయారణ్యకమ్. ౧౦-౧౩

"అతో దేవా అవన్తునో యతో విష్ణు ర్విచక్రమే......"

ఋగ్వేదసంహితా. ౧-౨౨-౧౬

"ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదం......"

తైత్తిరీయసంహితా. ౧-౨. ౧౭.

"గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవ స్తమమ్......"

తైత్తిరీయసంహిత. ౨-౩. ౧౪. ౩

పౌరాణిక దేవత లనఁబడిన శివ, విష్ణు, గణపతులు ముప్వురును బై వేదమంత్రము లందుఁ గానఁబడుచు నేయున్నారు. ఇట్టివింక ననేకములు చూపవచ్చును.

ఇందుచేఁ 'పౌరాణిక దేవతలును వైదిక దేవతలు'నను విభాగము నిరాధారమనియు, మనపురాణగ్రంథములకును మన దేవతలకును నన్నిటికిని వేదమే మూలమగు నాధార మగుటచే నన్నియు వైదికములేయనియుఁ దేటపడుచున్నది. కావున మన నవీనచరిత్ర కారులు గావించినవిభాగము విపరీతమైనది. అందుచేఁ, పౌరాణిక దేవతలు వేఱును, వైదిక దేవతలు వేఱునుగానందునఁ, "పౌరాణిక దేవతలగౌరవ మెక్కువయైనకాలఁది జనులు కొంద ఱొక దేవతపక్షమువారయి యితరదేవతలను నిందించుచు. శైవ, వైష్ణవ, గాణపత్యాది సాంప్రదాయములఁబుట్టించి"రని వీరు వ్రాసినవ్రాత యసంబద్ధమగుచున్నది. ఆసాంప్రదాయములన్నియు వేదసమ్మతములేయనియును, గావున వైదికమతమందలి యంతర్భాగములేయనియుఁ, బైనగనఁబఱచిన వేదవాక్యప్రమాణములవలన విశదము కాఁగలదు. అందుచే నొకసాంప్రదాయమువా రింకొకసాంప్రదాయమువారిని నిందించ వలసినపనిలేదు. అట్లునిందించువా రెవరైననున్నచో నందులకుమూల మాయావ్యక్తుల యొక్కయజ్ఞానమే కావలసియుండునుగాని పురాణములు కాఁజాలవు. వేఱువేఱుపురా ణములందు వేఱువేఱు దేవతలయాధిక్యత వర్ణింపఁబడియుండుటయుఁ దక్కిన దేవతల కంటె వర్ణింపబడిన దేవతయే యెక్కువయని తెల్పఁబడుటయు నిజమేయైనను, నందులకుఁ గల కారణములనన్నిఁటిని నీగ్రంథముయొక్క రెండవభాగమున "వైదికమతతత్త్వ" మను నెనిమిదవప్రకరణమునఁ, "త్రిమూర్తులలోనెవ్వ రధికు?"లను శీర్షిక క్రిందవిపులముగ విమర్శించి సమాధానములు చెప్పవలసినయవసర మచట నెక్కువగనున్నందున గ్రంథ విస్తరభీతిచే నావిషయములనన్నిఁటిని దిరిగి యిచట వ్రాయవీలుగాక విడచితిమి,

పురాణములు వేఱువేఱుచోట్ల వేఱువేఱు దేవతలే యధికులని వర్ణించినప్పటికిని, నట్టిదేవతలందఱికిని మూలకారణ మొక్కఁడేయనియుఁ, నాయనయే వేఱువేఱురూపములనుధరించి వేఱువేఱుకార్యములను నిర్వహించుననియుఁ దెల్పి, యని సాంప్రదాయభేదములనుగూర్చి మాత్రమేగాక మతభేదములనుగూర్చికూడ యెట్లు సామరస్యమును బోధించుచున్నవో, స్థాలీపులాకన్యాయముగ నీక్రింద నొకటిరెండుదాహరణములను గనఁబఱచుచున్నాము:—

శ్లో. "సత్త్వం రజ స్తమ ఇతి ప్రకృతే ర్గుణా; స్తై
ర్యుక్తః పరః పురుష ఏక ఇహాస్యధత్తే
స్థిత్యాదయే హరి, విరిఞ్చి, హ రేతిసంజ్ఞా;
శ్శ్రేయాంసి తత్ర ఖలు సత్త్వతనో ర్నృణాం స్యుః."

శ్రీమద్భాగవతపురాణమ్. స్కం. ౧. అ. ౨. శ్లో. ౨౪

పైశ్లోకమునకు శ్రీమదాంధ్రభాగవతముయొక్క యనువాదము:

"తరలము:—

పరమపూరుషుఁ డొక్కఁడాఢ్యుఁడు పాలనోద్భవనాశముల్
సొరిదిఁజేయ ముకుంద, పద్మజ, శూలిసంజ్ఞలఁ బ్రాకృత
స్ఫురితసత్త్వరజస్తమంబులఁ బొందు; నందు శుభస్థితిన్
హరి చరాచరకోటి కిచ్చు ననంతసత్త్వనిరూఢుఁడై."

ఆంధ్రభాగవతము, స్కం. ౧. ప. ౫౦.

భాగవతపురాణమునందలి పైప్రమాణములను బట్టిచూడ, జగత్కారణహేతుభూతుఁడగు నీశ్వరుఁడొక్కఁడే ప్రకృతియొక్క మూఁడుగుణముల నాశ్రయించి, సృష్టిస్థితిసంహారములు చేయుటకొఱకై బ్రహ్మ, విష్ణు, శివులను మూఁడుమూర్తులను (అనఁగా రూపములను) ధరించెనని తెలియుచున్నది.

మఱియు నీయర్థమునే శ్రీస్కాందపురాణములోని సూతసంహిత యీక్రింది రీతిని వినిపించుచున్నది:—

"ఈశ్వరః. శ్లో... ... ... ... ...

ఏకఏవ శివస్సాక్షా త్త్రిస్రోమూర్తీ ర్దధౌ పునః. ౪
రజోగుణం సమాస్థాయ బ్రహ్మా స్యా త్సృష్టికారణమ్;
సత్త్వ మాస్థాయ విష్ణు స్స్యా త్పాలనార్థం బృహస్పతే! ౫
తమసా కాలరుద్రాఖ్య స్సర్వసంహారకారణమ్."

... ... ... ... ... ...

సూతసంహిత, జ్ఞానయోగఖండము. అధ్యా. ౨.

దీనికిని పైనఁజెప్పినదే తాత్పర్యము.

ఈప్రైరీతిగనే, యష్టాదశమహాపురాణనిర్మాతయగు శ్రీవేదవ్యాసమహర్షి శైవ, వైష్ణవ, మతసాంప్రదాయములకుఁ బద్మపురాణమం దీక్రిందివిధమున సామరస్యమును బోధించియున్నారు:—

శ్లో. శైవంచ వైష్ణవం రూప మేకరూపం సరోత్తమ!
ద్వయోశ్చై వాంతరం నాస్తి; ఏకరూపమహాత్మనోః.
శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే,
శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః.
ఏకమూర్తి స్త్రయోదేవాః బ్రహ్మవిష్ణుమహేశ్వరాః.

పద్మపురాణము, భూమిఖండ. అధ్యా. ౭౧.

అనఁగా:—

"శైవ, వైష్ణవ, మతములకు రూపమొక్కటియే. వానికి నెచ్చుతగ్గులులేవు. విష్ణుస్వరూపుఁడైన శివునకును, శివస్వరూపమేయగు విష్ణువునకును భేదములేదు. శివుని యొక్కహృదయము విష్ణువు; విష్ణునియొక్కహృదయము శివుఁడు. ఒక్కమూర్తియే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను ముగ్గురుదేవతలైయున్నది." యని తాత్పర్యము.

ఇట్లు వైదికమతమందలి యంతర్భాగములగు వేఱువేఱుసాంప్రదాయములకు సామరస్యముచెప్పుటయేగాక, వైదికమతముకంటె భిన్నములగు నితరమతములన్నిఁటికిఁ గూడఁ బురాణము లీక్రిందిరీతిని సామరస్యమునుగల్పించి లోకమునకు బోధించియున్నవి; (చూడుఁడు, స్కాందపురాణమందలి సూతసంహిత):—

ఓమ్. శ్రీసూతఉవాచ:—

శ్లో. అ థాత స్సంప్రవక్ష్యామి మార్గప్రామాణ్యనిర్ణయమ్,
శ్రద్ధయా సహితా యూయం శృణుధ్వం మునిపుంగవాః! ౧
వేదాంశ్చ, ధర్మశాస్త్రాణి, పురాణం భారతం తథా,
వేదాంగా, న్యుపవేదాంశ్చ, కామికాద్యాగమా నపి, ౨
కాపాలం, లాకుళంచైవ, తయోర్భేదా న్ద్విజర్షభాః!
తథా పాశుపతం, సోమం, భైరవప్రముఖాగమాన్, ౩
తేషాం మే వోపభేదాంశ్చ శతశోఽథసహస్రశః,
విష్ణ్వాగమాం, స్తథా బ్రాహ్మా, న్బుద్ధార్హాద్యాగమా నపి, ౪
లోకాయతం, తర్కశాస్త్రం బహువిస్తారసంయుతమ్,
మీమాంసా మతిగంభీరాం సాంఖ్యయోగౌ తథైవచ, ౫

అనేకభేదభిన్నాని తథా శాస్త్రాంతరాణి చ,
నిర్మమే శంకర స్సాక్షా త్సర్వజ్ఞ స్సంగ్రహేణతు. ౬
ప్రసాదాదేవ రుద్రస్య బ్రహ్మవిష్ణ్వాదయ స్సురాః,
సిద్ధా, విద్యాధరా, యక్షా, రాక్షసాద్యా స్తథైవచ, ౭
మునయశ్చ, మనుష్యాశ్చ, యథాభాగం ద్విజోత్తమాః!
తాన్యేవ విస్తరేణైవ సంగ్రహేణైవవా పునః ౮
కుర్వంతి. తాని మానాని కథితాని మనీషిభిః
అధికారివిభేదేన నైకస్యైవ సదా ద్విజాః! ౯
తర్కై[illegible] రేతేహి మార్గాస్తు నహంతవ్యా మనీషిభిః.
యథా తోయప్రవాహాణాం సముద్రః పరమావధిః. ౧౦
తథైవ సర్వమార్గాణాం సాక్షాన్నిష్ఠా మహేశ్వరః.
యేనయేన ప్రకారేణ జనైరేభి రుపాసితః, ౧౧
తత్తన్మార్గానుగుణ్యేన సాధకత్వం హ్యుపైతి సః.
తత్ప్రసాదా త్క్రమా న్మార్గా న్విశిష్టా నేతి మానవః. ౧౨
తత్ర తత్రస్థితో దేవః ప్రసాదం కురుతేఽస్యతు;
సోపానక్రమతో హ్యేతే వేదమార్గస్య హేతవః. ౧౩

... ... ... ... ... ...

అతోఽధికారిభేదేన మార్గమానం నసంశయః. ౨౨
ఈశ్వరస్య స్వరూపేచ, బంధహేతౌ తథైవ చ,
జగతః కారణే, ముక్తౌ, జ్ఞానాదౌ చ తథైవ చ, ౨౩
మార్గాణాం యే విరుద్ధాంశా వేదాంతేచ విచక్షణాః!
తేచ మందమతీనాంచ, మహామోహావృతాత్మనామ్, ౨౪
వాంఛామాత్రానుగుణ్యేన ప్రవృత్త్యా; న యథార్థతః.
దర్శయిత్వా తృణం మర్త్యో ధావంతీం గాం యథా గ్రహీత్ ౨౫
దర్శయిత్వా తథా క్షుద్ర మిష్టం పూర్వం మహేశ్వరః
పశ్చా త్పాకానుగుణ్యేన దదాతి జ్ఞానముత్తమమ్. ౨౬
తస్మా దుక్తేన మార్గేణ శివేన కథితా అమీ;
మార్గామానం నచామాన; మృషావాదీ కథం శివః? ౨౭
మహాకారుణికో దేవ స్సర్వజ్ఞో నిర్మలః ఖలు!"

... ... ... ... ... ...

సూతసంహిత, యజ్ఞవైభవఖండము, అధ్యా. ౨౨.

పైశ్లోకములభావమును శ్రీమాధవాచార్యులవారు తమవ్యాఖ్యానమున నీక్రింది రీతిని సువ్యక్తముగావించియున్నారు:—

"నను బౌద్ధార్హతా ద్యాగమానాం వేదవిరుద్ధార్థప్రతిపాదకానాం వేదైకసమధి గమ్యే బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానే రుచిజనకత్వం నోపపద్యతే; అతో వైదికమార్గవ్యతిరిక్తానాం సర్వేషా మప్రామాణ్య మేవే త్యాశంక్య, తత్ప్రామాణ్యం సమర్థయితు మారభతే: 'ఆథాత' ఇతి. ౧. శ్రుతిస్మృత్యాదిభిః, శైవ, పాశుపత, బుద్ధాద్యాగమైః, సమయే నానావిధా మార్గాః ప్రతిపాదితాః; స్తేషా మధికారిభేదేన ప్రామాణ్యనిర్ణయః క్రియత ఇత్యర్థః. ౨, ౩. 'ఉపవేదాం'శ్చేతి: ఆయుర్వేద, ధనుర్వేదాదయ ఉపవేదాః. ౪, ౫. 'నిర్మమే శంకర' ఇతి: శ్రుతి స్మృతీతిహాసపురాణాదీని వైదికాని శాస్త్రాణి, తదనుసారి శైవ, పాశుపతాద్యాగమా, న్బుద్ధార్హతాది బహుభేదభిన్నా న్వేదవిరుద్ధాంశ్చ, సర్వజ్ఞ శ్శివఏవ నిర్మితవా నిత్యర్థః. అత స్సర్వజ్ఞేన శివేనైవ ప్రణీతత్వా దేషాంమధ్యే కస్యచిద ప్యప్రామాణ్యం నయుక్త మితిభావః. ౬. నను బ్రాహ్మ, వైష్ణవా ద్యాగమేషు బ్రహ్మ, విష్ణ్వాది తత్తదాగమప్రణేతారః, సాంఖ్య, తర్కాదిశాస్త్రేషు కపిల, కణాద, జైమినిప్రభృతయో నిర్మాతారః, ప్రసిద్ధాః;అత శ్శివస్యైవ నిర్మాణ మనుపపన్నమి త్యత ఆహ: 'ప్రసాదాదే'వేతి. పరమేశ్వరానుగ్రహాదేవ బ్రహ్మవిష్ణ్వాదయ స్తన్నిర్మితా నగమాన్ స్వవ్యవహారసిద్ధయే పున స్సంగ్రహవిస్తారాభ్యాం కుర్వంతి. కపిల, కణభు, జైమినిప్రభృతయో మునయశ్చ స్వస్యశిష్యబుద్ధిగుణానుసారేణ పరమేశ్వరనిర్మితాన్యేవ శాస్త్రాణి తత్ప్రసాదాదేవ పునస్సంగ్రహవిస్తారాభ్యాం కుర్వంతీ త్యవిరోధః. ౭, ౮. యద్యప్యేవం ఈశ్వరనిర్మితత్వా త్సర్వేషాం ప్రామాణ్యం, తథాపి పరస్పరవిరుద్ధార్థ ప్రతిపాదకత్వా దప్రామాణ్యమపి స్యా ది త్యత ఆహ: 'అధికా'రీతి. యథా 'ఉదితే జుహో'; 'త్యనుదితే జుహో'తీత్యాది విరుద్ధార్థప్రతిపాదకానాం వాక్యానా మధికారి భేదా ద్విరోధాభావేన ప్రామాణ్యం, ఏవ మత్రాపీ త్యర్థః. ౯.ఏవ మేతేమార్గా శ్శుష్క తర్కబలా న్నబాధ్యా ఇత్యర్థః. ౧౦. 'సాక్షాన్నిష్ఠే'తి: సర్వేష్వపి మార్గే 'ష్వస్తి కశ్చి ద్దేవ' ఇతిసమ్మతత్వా, త్తస్యచ పరమేశ్వరవ్యతిరిక్త స్యాభావా త్తత్తదాగమోక్తగుణవై శిష్ట్యేన శివః ప్రతిపాద్యఇతి భవతి తస్మిన్ సర్వేషాం మార్గాణాం పర్యవసాన మిత్యర్థః. 'యేనయేనేతి': నానావిధాగమోక్తేన యేనయేనోపాధినా పరమేశ్వర ఉపా స్యతే, తత్తదాగమానుసారేణ తత్తదుపాధియుక్తః పరమేశ్వరో భవతీ త్యర్థః. ౧౧. 'తత్ప్రసాదా' దితి: తత్తదాగమప్రతిపాద్యతయావస్థితస్య శివస్య ప్రసాదాద్రే వోత్తరోత్తర [illegible] ఇత్యర్థః. ౧౨. 'సోపానక్రమత'

ఇతి: తన్త్రాగమేషు తత్తద్దేవతారూపో దేవః సోపానక్రమేణ వేదమార్గప్రాప్తౌ కార ణమ్. స ఏవ వేదమార్గప్రతిపాదితసన్ముక్తిహేతు ర్భవతీ త్యర్థః..................
'అతోఽధికా'రితి: వేదమార్గా దధికృతాన్ బౌద్ధార్హతా ద్యధికారివిశేషాన్ప్రతి తత్త న్మార్గప్రామాణ్య మస్త్యేవే త్యర్థః. ౨౨. న త్వేషాం మార్గాణాం పరస్పర విరుద్ధార్థప్రతి పాదకానాం ప్రామాణ్యం నోపపద్యతే, ప్రబలతరశ్రుతిప్రమాణవిరుద్ధార్థప్రతి పాదకత్వా ది త్యత ఆహ: 'ఈశ్వర' స్యేత్యాదినా. తత్రేశ్వరరూపాదౌ మార్గాణాం విప్రతిపత్తిరస్తి. తథాహి: తత్ర 'ఈశ్వర ఏవనా'స్తీతి సాంఖ్యాః, బౌద్ధ మీమాంస కాశ్చ; 'అస్తి కశ్చిత్సతు, క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష' ఇతి పాతం జలాః; 'నిత్యజ్ఞానాధార' ఇతి తార్కికాః. తథా, 'ప్రకృతిపురుషయో రవివేకాత్ క్షేత్రజ్ఞస్య సంసార' ఇతి సాంఖ్యాదయః; 'తస్య స్వార్జిత పుణ్యపాపవశా ద్బంధ' ఇతి తార్కికాదయః. తథా, 'జగత్కారణం ప్రకృతి' రితి సాంఖ్యాదయః; 'పరమాణవ' ఇతి వైశేషికాదయః. తథా, 'క్షేత్రజ్ఞస్య ప్రకృతి పురుషవివేకజ్ఞానేన చిన్మాత్ర రూపే ణావస్థానం ముక్తి' రితి సాంఖ్యాదయః; 'బుద్ధి సుఖదుఃఖాది నవగుణానా మాత్యంతికోచ్ఛేదో మోక్ష' ఇతి వైశేషికాదయః. తథా, 'సత్వపురుషాన్యథాఖ్యాతి రూపం జ్ఞానం ముక్తిసాధన'మితి సాంఖ్యాః; 'నిత్యజ్ఞానాధారస్య తటస్థేశ్వరస్య జ్ఞానం ముక్తిసాధన'మితి తార్కికాదయః. ఏవమన్యేషామపి వాదినాం మతే ఏతేషు విషయేషు భూయస్యో విప్రతిపత్తయః. ఏవమాద్యా వేదాంతవిరుద్ధా అన్యమార్గేషు దృశ్యంతే. తత్సర్వ మర్థజాత మనాదిమాయయా మోహితానా మతఏ వాల్పబుద్ధీనాం వేదానధి కృతానాం బౌద్ధాదీనాం ప్రథమతఏ వాత్యంతసూక్ష్మపరశివస్వరూపగ్రహణసామ ర్థ్యాభావా ద్వేదవిరుద్ధమపి ప్రతిబంధక పాపక్షయార్థం తత్తల్లోకప్రాప్తి రూపఫల ప్రదానేన వశీకరణార్థంచ ప్రథమ మీశ్వరే ణోపదిష్టం; న పరమార్థత ఇత్యర్థః. ౨౩, ౨౪ తత్ర దృష్టాంతం దర్శయతి: 'దర్శయి'త్వేతి; యథా గాం జిఘృక్షన్ పురుషః ప్రథమం తృణాదికం దర్శయిత్వా తాం గృహ్ణాతి, ఏవం పరమేశ్వరోఽపి తత్తన్మార్గానురూప మిష్టం ప్రాపయిత్వా వశీకృత్య, తత్తన్మార్గోక్తజ్ఞానేన ప్రతిబంధకపాపక్షయే సతి, తేషాం చిత్తపరిపాకానుసారేణ నిశ్శ్రేయససాధనం జ్ఞానమపి క్రమేణ ప్రయచ్ఛ తీత్యర్థః. ౨౫, ౨౬. మార్గాంతరాణామపి ప్రతిపాదితం ప్రామాణ్య ముపసంహరతి: 'తస్మా' దితి. యస్మా దుక్తప్రకారేణ శివేనై వోపదిష్టా స్సర్వేమార్గా, స్తస్మా త్తత్సర్వం ప్రమాణమేవ; అన్యథా మృషావాదిత్వప్రసంగా దిత్యర్థః. ౨౭, ౨౮, ౨౯......."

శ్రీమాధవాచార్యవిరచిత సూతసంహితా తాత్పర్యదీపికా.

పైశ్లోక, వ్యాఖ్యానములయొక్క తాత్పర్యమేమనఁగా: "బ్రహ్మమును, జీవుఁడు

నొక్కటేయని వేదముచేఁ బ్రతిపాదింపఁబడెడి బ్రహ్మజ్ఞానమునందు వేదమునకు విరుద్ధమైనయర్థమును బోధించెడి 'బౌద్ధార్హత' మొదలగు నాగమములు రుచిని బుట్టింపనేరవు; అందువలన, వైదికమతవిరుద్ధములగునవి యన్నియుఁ బ్రమాణములు కానేకావని తలంచెదరేమోయని సంశయించి, యవికూడఁ బ్రమాణములే యగుననిచెప్పుటకు, 'అథాతస్సం ప్రవక్ష్యామి' యను మొదటిశ్లోకమును సూతుఁడు ప్రారంభించి 'యోమునిపుంగవులారా! మార్గప్రామాణ్యనిర్ణయమును (అనఁగా వివిధమతగ్రంథములయొక్క ప్రామాణ్యతను) గుఱించి యిఁకఁ జెప్పెదను: మీరు శ్రద్ధతోఁగూడినవారై వినుఁడని చెప్పుచున్నాఁడు. ౧. వేదశాస్త్రముల చేతను, శైవము, పాశుపతము, బుద్ధాగమము మొదలగు నాగమముల చేతను నాచారములందుఁ బెక్కువిధములగుమార్గము లుపదేశింపఁబడినవి; అధికారి భేదముననుసరించి (యనఁగా జనులలో నానావిధగతులకుఁగల వేలువేలువిధములగు చిత్తశుద్ధి, జ్ఞానపరిమితి, శక్తిసామర్థ్యములు మొదలగు యోగ్యతల ననుసరించి) వారివారికి దగినగ్రంథములు వారివారికిఁ బ్రమాణములుగ నేర్పఱుపఁబడినవి. ఆయభిప్రాయమునే సూతుఁడు రెండవశ్లోకముతోఁ బ్రారంభించి యిట్లు చెప్పుచున్నాఁడు; 'వేదములు, ధర్మశాస్త్రములుఁ, బురాణములు, భారతము మొదలగు నితిహాసములు, నావిధముగనే వేదాంగములు, నుపవేదములు (అనఁగా నాయుర్వేదము, ధనుర్వేదము మొదలగునవియు,) గామికాద్యులైన యాగమశాస్త్రములుఁ, గాపాలము, లాకులము, వానిలోని భేదమార్గములు, నావిధముగనే పాశుపతము, సోమము, భైరవము మొదలైనయాగమములు, వానిలోని వందలు, వేలు, సంఖ్యగల యవాంతరభేదములు, వేదశాస్త్రసమ్మతములగు వైష్ణవాగమములు, బ్రాహ్మాగమములు, వేదవిరుద్ధములైన బుద్ధార్హాదులగునాగమములు, లోకాయతము, మిక్కిలి పెద్దదగు తర్కశాస్త్రము, నింకను బెద్దదగు మీమాంసాశాస్త్రము, సాంఖ్యము, యోగము, నట్టే పెక్కు భేదములు గల వేలువిధములగు నితరశాస్త్రములును, వీనినన్నిఁటినిగూడ సర్వజ్ఞుఁడగు సాక్షాత్పరమేశ్వరుఁడే నిర్మించెను. అట్లు సర్వజ్ఞుఁడగు నీశ్వరునిచేతనే యేర్పఱుపఁబడినవగుటచే వానిలో నొక్కటిగూడ నప్రామాణ్యము కాఁజాలదని యభిప్రాయము. ౨. ౩. ౪. ౫. ౬. కాని, బ్రాహ్మాగమములు, వైష్ణవాగమములు మొదలగు నాగమశాస్త్రములకు, నానాయాగమములను వ్రాసిన బ్రహ్మయు, విష్ణువును మొదలగు గ్రంథకర్తలును, సాంఖ్యము, తర్కము, మొదలైనశాస్త్రములకు వానినినిర్మించిన కపిలుఁడు, గణాదుఁడు, జైమినియు మొదలగు గ్రంథకర్తలును గలరనుసంగతి బాగుఁగ దెలిసినదే; అందువలనఁ బరమేశ్వరుఁడే యన్నిగ్రంథములను, శాస్త్రములనుగూడ వ్రాసెనని చెప్పుట యసంగతముకాదా? యను సంశయమునకు సమాధానమును 'ప్రసాదాదేవ రుద్రస్య' యనుశ్లోకమున సూతుఁ

డీక్రిందిరీతిగఁ జెప్పుచున్నాఁడు; 'బ్రహ్మయును, విష్ణువును మొదలగు దేవతలును, సిద్ధులును, విద్యాధరులును, యక్షులును, రాక్షసులును, సాధ్యులును, బరమేశ్వరునిచే నిర్మింపఁబడిన యాగమశాస్త్రములు మొదలగువానిని వ్యవహారసౌకర్యముకొఱకై తిరిగి సంగ్రహముచేసియో (యనఁగాఁ దగ్గించియో), విస్తారముచేసియో (యనఁగాఁ, పెంచియో) పరమేశ్వరుని యనుగ్రహమువలననే వ్రాసియున్నారు. అట్లే కపిలుఁడును, గణాదుఁడును, జైమినియు మొదలైనమునులును, మనుష్యులునుగూడఁ బరమేశ్వరునిచేఁ నిర్మింపఁబడినశాస్త్రములనే యాయనయొక్క యనుగ్రహముచేతనే తిరిగి సంగ్రహరూపముగనో, విస్తారరూపముగనో (యనఁగాఁ దగ్గించియో, పెంచియో) వ్రాసియున్నారు. అందుచే నాయాగ్రంథములకును, శాస్త్రములకును, వేఱ్వేఱుగ్రంథకర్తలున్నప్పటికిని, సర్వజ్ఞుఁడగు పరమేశ్వరుఁడే వానినన్నిఁటిని నిర్మించెనని చెప్పుటలో విరుద్ధమేమియుం లేదు. ౭. ౮. ఇటుల నీశ్వరునిచే నిర్మింపఁబడినవగుటచే నన్నియును బ్రామాణ్యములే యైనప్పటికిని, నవి యొకదానికొకటి విరుద్ధములగు నభిప్రాయములను బోధించుటచే నప్రామాణ్యములుగూడ నగుననువాదము రావచ్చునని, దానికీక్రిందిరీతిని' 'అధికారి విభేదేన' యను శ్లోకముచే సమాధానము చెప్పుచున్నాఁడు: 'ఉదితేజుహోతి', 'అనుదితేజుహోతి' యనుశాస్త్రవాక్యములు పరస్పరవిరుద్ధములైనప్పటికిని, వేఱువేఱధికారులకొఱకు (ననఁగా వేఱువేఱుయోగ్యతలుగలవారికొఱకు) బోధింపఁబడినవగుటచేఁ నెట్లు ప్రామాణ్యములగుచున్నవో, యావిధముగానే పైనదెలిపిన వేదసమ్మతములును, వేదవిరుద్ధములునునగు వేఱువేఱు శాస్త్రములన్నియుఁగూడ వేఱువేఱుయోగ్యతలు గలవారికొఱకుమాత్రమే చెప్పఁబడినవగుటచేతను, నన్నియుం నొక్కతరగతివారికొఱకే చెప్పఁబడినవి కాకపోవుటచేతను, నవి పరస్పరవిరుద్ధములగు నభిప్రాయములను బోధించునప్పటికిని బ్రామాణ్యములే యగుచున్నవి. ౯. అందుచే, శుష్కవాదముల నాధారము చేసికొని యందుమూలమున వేఱువేఱుమతములను నిరసింపరాదు. అన్నిమతములును 'దేవుఁడొకఁడుకలఁ'డని సమ్మతించుటచేతను, నట్టిదేవునికంటె వేఱైనదేమియు లేనందునను, నీటిప్రవాహములన్నియుఁ గట్టకడపట సముద్రమునందే చేరునట్లుగ, నానాయాగమశాస్త్రములచేఁ జెప్పఁబడిన వేఱువేఱు విశేషవిధానములచే దేవుఁడు బోధింపఁబడుటయే యామతములన్నిఁటికిని బర్యవసానము.౧౦౪ పలువిధములైనయాగమములలో దేనిదేనిచేఁ జెప్పఁబడిన యెట్టియెట్టిరూపముతోఁ బరమేశ్వరుఁ డుపాసింపఁబడునో యాయాయాగమముల ననుసరించి యాయన యట్టియట్టిరూపముకలవాఁడే యగుచున్నాఁడని యర్థము. ౧౧౪ .అట్లాయాయాగమములచేఁ బ్రతిపాదింపఁబడిన పరమేశ్వరుని యొక్క యనుగ్రహమువలననే యాయననుపాసించువాఁడు క్రమక్రమముగ నంత

కంతకు మంచిమార్గములను బొందుసని యర్థము. ౧౨. ఆయాయాగమములందు నాయా దేవతలరూపముతో నున్న దేవుఁడు తననుపాసించువాని నొక్కొక్క మెట్టే యెక్కించి వేదమతమునందుఁ బ్రవేశపెట్టుటకుఁ గారకుఁడగును. వేదమతముచే నుపదేశింపఁబడిన మోక్షమునుబొందుట కా దేవుఁడే హేతువగునని యర్థము. ౧౩......... వేదమార్గమ నుమీరిన శౌద్ధార్హత మొదలైనయాగమము లధికారిభేదమునుబట్టి యాయామతములకుఁ బ్రామాణ్యము లగుచు నేయున్నవనియుఁ, సంశయింపఁ బనిలేదనియుం నర్థము. ౨౨. కాని, తక్కినమతములన్నియుం నొకదానికొకటి విరుద్ధముగ నుండుట మాత్రమేగాక, మిక్కిలి బలముగల వేదప్రామాణ్యమునకుఁగూడ విరుద్ధముగ బోధించుటచే నవి ప్రామాణ్యములు కాఁజాలవను వాదమునకు, 'ఈశ్వరస్య స్వరూపేచ' యను శ్లోకముచే సమాధానమును జెప్పుచున్నాఁడు: ఈశ్వరునియొక్క రూపమునుగుఱించియు, సంసారబంధమునకు హేతువులనుగుఱించియు, జగత్తుయొక్క పుట్టుకకుఁ గలకారణమును గుఱించియు, మోక్షమునుగుఱించియు, జ్ఞానమునుగుఱించియు, వేదవిరుద్ధములైన భేదాభిప్రాయములు తక్కినమతములలోఁ గలవు. ఎట్లనిన; 'ఈశ్వరుఁడే లేఁ'డని సాంఖ్యులును, శౌద్ధమీమాంసకులును వాదించెదరు; 'దుఃఖమునకును గర్మఫలానుభవమునకును లోనుగాని విశేషపురుషుఁడొకఁడు గలఁ'డని పాతంజలమతస్థుల యభిప్రాయము; 'నిత్యజ్ఞానమున కాధారభూతుఁడే యీశ్వరుఁ'డని తార్కికులమతము. ఇట్లే, 'ప్రకృతికిని బురుషునకును సంబంధించినజ్ఞానము లేకపోవుటచేతనే జీవునకు సంసారబంధమేర్పడిన'దని సాంఖ్యులు మొదలగువారివాదము; 'జీవుఁడు స్వయముగ జేసికొనిన పుణ్యములయొక్కయుఁ బాపములయొక్కయుం మూలమున వానికి సంసారబంధమేర్పడిన'దని తార్కికులు మొదలగువారివాదము. అట్లే, 'జగత్తుయొక్కపుట్టుకకుఁ గారణము ప్రకృతి'యని సాంఖ్యులు మొదలగువారివాదము; 'పరమాణువులే(Atoms, Electrons, Protons) యందులకుఁ గారణ'మని వైశేషికులు మొదలగు వారివాదము. అట్లే, 'క్షేత్రజ్ఞుఁడు (జీవుఁడు) ప్రకృతికిని బురుషునకును సంబంధించిన జ్ఞానమునుబొంది, జ్ఞానస్వరూపములో మాత్రముండుట మోక్ష'మని సాంఖ్యులు మొదలగువారిమతము; 'బుద్ధి, సుఖము, దుఃఖము మొదలైన నవగుణములయొక్కయు నిర్మూలనమే మోక్ష'మని వైశేషికులు మున్నగువారిమతము. అరీతిగనే, 'సత్త్వపురుషాన్యథాఖ్యాతి రూపముగుజ్ఞానము మోక్షమునకు సాధన'మని సాంఖ్యులవాదము; 'నిత్యజ్ఞానమున కాధారభూతుఁడును దటస్థుఁడునగు నీశ్వరునిసంబంధమైనజ్ఞానము మోక్షసాధన'మని తార్కికులు లోనగువారివాదము. ఇట్లే యితరవాదులయొక్కమతములం దీపైనదెల్పిన విషయములలో విస్తారములగు నభిప్రాయభేదములు గలవు. వేదాంతవిరుద్ధములైన యీ మొదలగునవి యితరమతము

లందుఁ గనఁబడుచున్నవి. అనాదియగుమాయచే నావరింపఁబడి యందువలననే బుద్ధిబలము కొద్దిగమాత్రముకలవారును, వేదవిద్య నేర్చికొనఁదగిన యధికారము (యోగ్యత) లేనివారును నగు బౌద్ధమతస్థులు మొదలగువారికి, మిక్కిలిసూక్ష్మమైన పరబ్రహ్మస్వరూపమును దెలిసికొనుటకుఁ గావలసినసామర్థ్యము మొట్టమొదటనే యుండదుగావున, వారికిఁగల యభిరుచి ననుసరించి, పైమార్గములు వేదవిరుద్ధములైనప్పటికిని వారికొఱ కేర్పడినవి. వానిసహాయమున మోక్షమునకుఁ బ్రతిబంధకమైన వారియొక్క పాపములను నశింపఁజేయుటకును నందులకు ఫలమగు నాయాలోకములకు వారినిఁజేర్చి యావిధముగ వారిని వశపఱచుకొనుటకును, మొదట నీశ్వరునిచే నాయామార్గములు (మతములు) వారికొఱకుపదేశింపఁబడినవి; కాని, యవియేసాక్షాత్తుగ మోక్షస్వరూపములును బరమావధియు నగుటచేఁ గాదని యర్థము. ౨౩. ౨౪. అందులకు దృష్టాంతమును, 'దర్శయిత్వాతృణంమర్త్యో' యను శ్లోకమునఁ జూపుచున్నాఁడు: పరుగెత్తుచున్న యావును బట్టికొనుటకు మొదట గడ్డిని జూపించి మనుష్యుఁడు దానినెట్లుపట్టుకొనుచున్నాఁడో, యావిధముగనే పరమేశ్వరుఁడు గూడ నాయామతములరూపమున, హీనములగు వారివారి యిష్టములనొడగూర్చి, వారిని స్వాధీనపఱచుకొని, మోక్షమునకుఁ బ్రతిబంధకమైనవారివారిపాపము లాయామతములందుపదేశింపఁబడిన జ్ఞానముచేత నశింపఁగా, వారికిఁగల్గినచిత్తశుద్ధిననుసరించి మోక్షసాధనమైన జ్ఞానమునుగూడఁ గ్రమముగా వారికిచ్చుచున్నాఁడనియర్థము. ౨౫. ౨౬. ఇతరమతములచే నుపదేశింపఁబడినవిషయములుగూడ (నాయామతములవారికిఁ) బ్రామాణ్యమే యగుననువిషయమును, 'తస్మాదుక్తేనమార్గేణ' యనుశ్లోకముచే ముగించుచున్నాఁడు: పైన దెల్పినవిధముగ నన్నిమతములును బరమేశ్వరునిచేతనే యుపదేశింపబడినవగుటచే (నాయామతస్థులకు) నవియన్నియును బ్రామాణ్యములే (యనఁగా, నమ్మి యనుసరింపఁదగినవే) యగుచున్నవి; కానిచో, వానినుపదేశించిన పరమేశ్వరుఁ డసత్యమాడినవాఁడు కావలసివచ్చును. ఆయన యట్టివాఁ డెట్లగును? (కాఁజాలఁడు; కావున నన్నిమతములును నాయామతస్థులకుఁ బ్రామాణ్యమేయని సారాంశము!) "౨౭. ౨౮. ౨౯."

... ... ... ... ... ... ...

'—శ్రీమాధవాచార్యులవారువ్రాసిన 'సూతసంహితాతాత్పర్యదీపిక.'

ఇట్లు సర్వమతసామరస్యమును బోధించినవి పురాణములే! ఇట్టిసామరస్యమును సామాన్యముగ లోకమందలి యేమతము కూడ బోధింపకపోఁగా, బైగా వానివాని ఘనతను మాత్రమే యనిపొగడికొనుచు, నితరమతములను నిరసించుచుఁ దుదకన్యమతములవారును నెప్పటికైనను దమమతములోనికివచ్చి చేరినయెడల మాత్రమే మోక్షమునుబొందుదు రనియు, లేనిచో వారికి మోక్షము లేదనియు బోధించుచు, నందుమూలముగ నితరమత

స్థులను దమమతములోనికిమార్చి పాఱవేయుచు, నా హేతువుచే నితరమతస్థులయసంతుష్టి కిని గలహమునకును గారణములగుచున్నవి. అట్టికలహముల కెడమీయకపోవుటయే గాక వైరీతిగ నన్నిమతములయొక్క యావశ్యకతనుబోధించెడి వైదికమతపురాణము లీక నామతములోనివేయగు భిన్నసాంప్రదాయములవారిని గలహించుకొనుడనిబోధించునా? అట్లుబోధింపకపోఁగా నవి వేఱువేఱు దేవతలయొక్కయు, వానివానికిసంబంధించిన వేఱు వేఱు సాంప్రదాయములయొక్కయు వేఱువేఱావశ్యకతలను, వేఱువేఱుప్రయోజనము లను గుఱించి విశదముగ వినిపించియున్నవి. అంతియేఁగాక, బుద్ధిమంతుఁడగువాఁడు తానొకయిష్టదైవమును గలిగియున్నను, నితరదైవములను నిందింపరాదని పురాణములే యీక్రిందిరీతిని లోకమునకుబుద్ధిగఱపియున్నవి! చూడుఁడు, శ్రీమదాంధ్రభాగవతము, ప్రథమస్కంధము:—

సూతుండు నారాయణకథా ప్రశంససేయుట

"... ... ... ... ... ...

వ. మఱియు నొక్కవిశేషంబుగలదు. కాష్ఠంబుకంటె ధూమంబు, ధూమంబు కంటెఁద్రయీమయం బయినవహ్నియు నెట్లువిశేషంబగు,నట్లు తమోగుణంబుకంటె రజో గుణంబు, రజోగుణంబుకంటె బ్రహ్మప్రకాశకంబగు సత్త్వగుణంబు, విశిష్టంబగుఁ; దొల్లిము నులు సత్త్వమయుండని భగవంతు హరి నధోక్షజుం గొలిచిరి. కొందఱు సంసారమందలి మేలుకొఱకు నన్యుల సేవింతురు. మోక్షార్థులైనవారలు ఘోరరూపులయిన భూతపతులవిడిచి దేవతాంతరనిందసేయక శాంతులయి నారాయణకథలయందుఁ బ్రవర్తింతురు. కొందఱు రాజసతామసులయి సిరియు నైశ్వర్యంబును, బ్రజలనుంగోరి పితృ, భూత, ప్రజేశాదుల నారాధింతురు. మోక్షమిచ్చుటం జేసి నారాయణుండు సేవ్యుండు. ............"61

పైవచనము సులభశైలినుండుటచే వేఱుగఁ దాత్పర్యమును జెప్పఁబని లేదు. వేఱు వేఱుసాంప్రదాయములకుఁజెందిన యితరదైవములను గొందఱుకొలుచుటకుఁ గారణము సంసారమందలి మేలుకొఱకని పైన శ్రీభాగవతపురాణముచెప్పినయర్థమునే విపులము చేసి, యెట్టియెట్టిమేలుకొఱ కేయేదైవమును గొలువవలయునో యావివరములను శ్రీ స్కాందపురాణ మీక్రిందిరీతిని బోధించుచున్నది:—

"శ్లో. ... ... ... ... ...

బ్రహ్మవర్చసకామస్తు బ్రహ్మాణం పూజయే న్నరః;
ఆరోగ్యకామ ఆదిత్యం, బలకామ స్సమీరణమ్. 33
కీర్తికామోఽనలం తద్వ, న్మేధాకామ స్సరస్వతీమ్;
జ్ఞానకామో మహాదేవం, సిద్ధికామో వినాయకమ్, 34

భోగకామస్తు శశినం, క్షమాకామస్తు శంకరమ్;
వైరాగ్యకామో విద్వాంసం, వృష్టికామ శ్శచీపతిమ్. 35
ఏతా న్యాచరత శ్శ్రద్ధాభక్తిభ్యాం సహయత్నతః,
క్షీయంతే పాపకర్మాణి, క్షీయంతే చాస్య హి శ్రుతిః." 36

... ... ... ... ... ...

—శ్రీస్కాందపురాణము, సూతసంహిత, జ్ఞానయోగఖండము, అధ్యా. ౧

దీనితాత్పర్య మేమనఁగా:—"బ్రాహ్మణతేజస్సును గోరుమనుజుఁడు బ్రహ్మదేవుని బూజసేయవలయును. ఆరోగ్యమును గోరువాఁడు సూర్యు నారాధింపవలయును. అట్లే బలమును గోరువాఁడు వాయుదేవునిఁ, గీర్తిని గోరువాఁడగ్నిదేవుని, తెలివితేటలను గోరువాఁడు సరస్వతీదేవిని, జ్ఞానమునుగోరువాఁడు మహాదేవుని, గార్యములునెరవేరవలయునని గోరువాఁడు విఘ్నేశ్వరుని, భోగములు గోరువాఁడు చంద్రుని, నోర్పుఁ గోరువాఁడు శంకరుని, వైరాగ్యమును గోరువాఁడు విద్వాంసుని, సేవింపవలయును. శ్రద్ధాభక్తులతోఁ బ్రయత్నపూర్వకముగ నిట్లాచరించువానికిఁ బాపకర్మములు నశించును; నశించు; నని, ("భిద్యతే హృదయగ్రంథిః..."యను) వేదవాక్యముగూడఁ జెప్పుచున్నది."

ఈపైయర్థమునే మఱింత విపులముగవిస్తరించి బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యుఁడగు శ్రీశుకయోగిసార్వభౌముఁడు పరీక్షితునకు శ్రీమద్భాగవతపురాణముఖమున నీక్రింది రీతి నుపదేశించియున్నాఁడు:—

## శుకుఁడు పరీక్షితునకు భక్తిమార్గంబె ముఖ్యంబని తెలుపుట.

... ... ... ... ... ...

"క. మానుషజన్మమునొందిన,
మానవులకు లభ్యమానమరణులకు, మహా
జ్ఞానులకుఁ, జేయవలయు వి
ధానము నిగదింపఁబడియె ధరణీనాథా! 37

వ. వినుము; బ్రహ్మవర్చసకాముఁడైనవానికి వేదవిభుండగు చతుర్ముఖుండును, నింద్రియపాటవకామునకు నింద్రుండును, బ్రజాకామునకు దక్షాదిప్రజాపతులును, భోజనకామునకు నదితియు, స్వర్గకామునకు నాదిత్యులును, రాజ్యకామునకు విశ్వదేవతలును, దేశప్రజాసాధనకామునకు సాధ్యులును, శ్రీకామునకు దుర్గయుఁ, దేజస్కామునకు నగ్నియుఁ, వసుకామునకు వసువులును, వీర్యకామునకు వీర్యప్రదులగు రుద్రులును, నాయుష్కామునకు నాశ్విన దేవతలును, బుష్టికామునకు భూమియుఁ, బ్రతిష్ఠాకామునకు లోకమాతలైన గగనభూదేవతలును, సౌందర్యకామునకు గంధర్వులును,

గామినీకాముసకు నప్సరసయైన యూర్వసియు, సర్వాధిపత్యకాముసకు బ్రహ్మయుఁ, గీర్తికాముసకు యజ్ఞంబులును, విత్తసంచయకాముసకుం బ్రచేతసుండును, విద్యాకాముసకు నుమావల్లభుండును, దాంపత్యప్రీతికాముసకు నుమాదేవియు, ధర్మార్థకాముసకు నుత్తమశ్లోకుండగు విష్ణువును, సంతానకాముసకుఁ బితృదేవతలును, రక్షాకాముసకు యక్షులును, బలకాముసకు మరుద్గణంబులును, రాజత్వకాముసకు మనురూపదేవతలును, శత్రుమరణకాముసకుఁ గోణపాలకుండైన రాక్షసుండును, భోగకాముకుం జంద్రుండును, భజనీయుం లగుదురు." ... ... ... 38

... ... ... ... ... ...

—శ్రీమదాంధ్రభాగవతము, ద్వితీయస్కంధము.

ఇట్లు వేయివేయిదైవములనుఁ గొందఱు కొలుచుటకుఁ గారణము సంసారమందలి మేలుకోఱికేయని శ్రీమద్భాగవతపురాణము పైనగనఁబఱచినరీతిని దెల్పి, దైనప్పటికిని మోక్షమును గోరువారుకూడ నితరదైవములను నిందింపరాదనిమాత్రముబోధించియుండఁగాఁ, సంసారమందలి మేలుగోరువారికిమాత్రమేగాక కేవలమోక్షమునుగోరువారికిఁగూడ నితరదైవములసేవ చేయకతప్పదని శ్రీస్కాందపురాణ మీక్రిందిరీతిని జాటిచెప్పుచున్నది. చూడుఁడు, సూతసంహితలోని యజ్ఞవైభవఖండమున, "జ్ఞానోత్పత్తికారణ" మను పదునాఱవయధ్యాయము:—

## జ్ఞానోత్పత్తికారణమ్.

"శ్రీసూత ఉవాచ:—

శ్లో. అథాత స్సంప్రవక్ష్యామి జ్ఞానోత్పత్తేస్తు కారణమ్,
వినాయేన శివజ్ఞానం నజాయేత కథంచన. ౧
ముముక్షు రతిసంతుష్ట "స్సిద్ధ్యత్యేవ గతి ర్మమ"
ఇతినిశ్చయబుద్ధిస్తు ప్రతిబంధనివృత్తయే. ౨
దేవతా స్సకలా నిత్యం ప్రార్థయే న్మతిమ త్తమః.
"శ న్నో మిత్ర, శ్శం వరుణ, శ్శ న్నో భవతు చార్యమా; ౩
శ న్న ఇంద్రశ్చ వాగీశ శ్శ న్నో విష్ణు రురుక్రమః.
నమోఽస్తు బ్రహ్మణే; వాయో! నమోఽస్తు తవ శోభనమ్. ౪
త్వమేవ సాక్షాద్బ్రహ్మాసి; త్వాం వదిష్యామి శంకరమ్.
ఋతంచ సత్యం చాహం త్వాం వదిష్యామి సమాహితః. ౫
త న్మా మవతు కల్యాణం తద్వక్తారంచ శోభనం,
మాం భూయోఽవతు వక్తార మపిచావతు శోభనమ్. ౬

శాంతి శ్శాంతిః పున శ్శాంతి ర్దోషయత్రయనివృత్తయే."
కృత్వైవం ప్రార్థనా మాత్మజ్ఞానార్థం పున రాస్తికాః! ౭
జపే న్నిత్యం గురో ర్లబ్ధ్వా మంత్రం "యచ్ఛందసా"మితి,
"మేగోపా"యేతిపర్యంత మత్యంతం శ్రద్ధయాసహ. ౮
సంకోచో దేహయాత్రాయాం యది జ్ఞానార్థినో భవే
దుపక్షీణా భవే ద్బుద్ధి స్తత్ర తస్య నసంశయః. ౯
అత స్సంకోచహానాయ విద్యార్థంతు దినేదినే
ఆజ్యే నాన్నేన చోభాభ్యా "మావహం"తీతి మంత్రతః. ౧౦
జుహుయా చ్ఛ్రద్ధయాసార్థం బ్రహ్మచారీ, గృహీ, వనీ;
భిక్షుకస్తు జపే న్మంత్ర మనగ్ని శ్శ్రద్ధయాసహ." ౧౧

... ... ... ... ... ...

—సూతసంహిత, యజ్ఞవైభవఖం. అధ్యా. ౧౬.

దీనికి శ్రీమాధవాచార్యులవారీక్రిందిరీతిని వ్యాఖ్యవ్రాసియున్నారు:—

"ఏవం వేదాంతవాక్యజనితా త్పరశివస్వరూపసాక్షాత్కారజ్ఞానాదేవ ముక్తి; ర్నకారణాంతరా దితి ప్రతిపాదితమ్. తచ్చజ్ఞానం కథముత్పద్యత? ఇతి తదుత్పత్తేః కారణం వక్తుముపక్రమతే: 'అథాత'ఇతి. పరశివజ్ఞానస్య పరమపురుషార్థత్వా త్తత్రచ ప్రతిబంధకపాపనిమిత్తప్రత్యూహో జాయతే; తన్నివృత్త్యర్థం వక్ష్యమాణమిత్రాదిదేవతాప్రార్థనం ముముక్షుణా నిత్యం కర్తవ్య మిత్యర్థః. ౧.౨. ఉక్తవిధప్రతిబంధోపశమాయ తైత్తిరీయోపనిషది దేవతాప్రార్థనరూపమంత్రాత్మకో యోఽనువాక ఆమ్నాత, స్తదర్థప్రతిపత్తిసౌకర్యాయ శ్లోకేన నిబధ్నాతి: 'శన్నోమిత్ర'ఇత్యాదినా. మిత్రాదయోఽస్మాకం విద్యాప్రతిబంధాపనయనేన సంసుఖహేతవో భవంతు. ౩. 'వాగీశో' బృహస్పతిః, 'వాగీశో బృహస్పతి'రితిశ్రుతేః. 'ఉరుక్రమ'ఇతి: ఉరు=విస్తీర్ణం, క్రమత ఇత్యురుక్రమః; సర్వవ్యాపీత్యర్థః. మిత్రాదీనా మంతర్యామిత్వే నావస్థితం బ్రహ్మ; తస్మైనమోఽస్తు.........
'సంకోచ'ఇతి: జ్ఞానార్థిన శ్శుశ్రూషో ర్యదిదారిద్ర్యంస్యా త్తదా దేహయాత్రాయాంతస్య బుద్ధి స్తత్ర పరిక్షీణా స్యా; దత స్తన్నివృత్త్యర్థ 'మావహం'తీ త్యనువాకశేషేణ ప్రతిదిన మాజ్యే నాన్నేనవా సాగ్ని శ్చే దగ్నౌజుహుయా; దనగ్నిస్తు తా న్మంత్రాన్ ప్రతిదినం జపే దిత్యర్థః. ౯. ౧౦. ౧౧. ౧౨. ౧౩. ౧౪. ౧౫......................"

పై శ్లోకవ్యాఖ్యానములతాత్పర్య మేమనఁగా:—

దీనికిముందరి 'జ్ఞానయజ్ఞవిశేష'మనునధ్యాయమునందు, వేదాంతవాక్యములను

వినుటచేఁ బుట్టెడి పరబ్రహ్మసాక్షాత్కారస్వరూపమైన జ్ఞానమువలననేతప్ప వేఱొకరీతిగ మోక్షము లేదని తెలిపియున్నాఁడు. (అట్లు వేదాంతవాక్యములను వినుచునేయున్న వారికిఁ గూడఁ గొందఱికట్టిజ్ఞానము పుట్టకపోవుట కనబడుచున్నందున) నట్టిజ్ఞాన మెట్లుపుట్టునను ప్రశ్నకు సమాధానముగ, నదిపుట్టుటకుఁ గారణమును జెప్పుటకు, 'అథాతస్సం ప్రవక్ష్యామి' యనుశ్లోకముతోఁ బ్రారంభించుచున్నాఁడు. పురుషార్థములలో శ్రేష్ఠమగు మోక్షమే బ్రహ్మజ్ఞానమునకు ఫలమగుటచే నట్టిమోక్షమునకుఁ బ్రతిబంధకమైనపాపములమూలమున నట్టిజ్ఞానముపుట్టుటకు నాటంకము గలుగుచుండును; అట్టియాటంకమును దొలగించుటకై, యిటుపైఁజెప్పఁబోవు మిత్రుఁడు, వరుణుఁడు మొదలైన దేవతలయొక్క ప్రార్థనమును ముముక్షువు (అనఁగా మోక్షమును గోరువాఁడు,) నిత్యమును జేయుచుండవలయునని యర్థము. ఇట్టి వివిధదేవతాప్రార్థనయే మోక్షార్థులకు జ్ఞానముగల్గుటకుఁ గారణము; దానిచే వేఱువేఱు దేవతలయనుగ్రహమున వేఱువేఱువిధములగు పాపములునశించి వేఱు వేఱువిధములగు ప్రతిబంధములు (అనఁగా నాటంకములు) తొలఁగిపోయి బ్రహ్మజ్ఞానము సులభముగ నలవడును. కానిచో వేఱుగ నేవిధముగనుగూడ నట్టిబ్రహ్మజ్ఞానమలవడనేరదు. ౧. కావున మోక్షార్థియగువాఁడు, మిక్కిలి సంతోషపూర్వకమగు మనస్సుతో, "నాకు బ్రహ్మజ్ఞానసిద్ధి తప్పకకలుగు"నని నిశ్చయించుకొని, యందులకుఁగల పైవిధములగు నాటంకములు తొలఁగిపోవుకొఱకై, 'శన్నోమిత్ర శ్శంవరుణః' మొదలైన పైశ్లోకములచే సకలదేవతలను బుద్ధిమంతుఁడై యెల్లప్పుడును బ్రార్థింపవలయును. ౨. పైనదెల్పినరీతిగఁ బ్రతిబంధము లుపశమించుటకు (అనఁగా నాటంకములు తీరిపోవుటకొఱకుఁ దైత్తిరీయోపనిషత్తులో దేవతాప్రార్థనరూపములగు మంత్రములతోఁగూడియున్న యనువాకమును, దానియర్థము సులభముగఁ దెలియుటకై, పైనదెల్పిన 'శన్నోమిత్ర, శ్శంవరుణః' యనునది మొదలుగాగల శ్లోకములరూపమున నేకరువుపెట్టుచున్నాఁడు. సూర్యుఁడు, వరుణుఁడు, నింద్రుఁడు, బృహస్పతియు, సర్వవ్యాపియగు విష్ణుఁడు మొదలైనదేవతలు, నాకు బ్రహ్మజ్ఞానముగల్గుటకుఁ గలయాటంకమును దొలఁగించి నాకు సుఖముగల్గుటకు హేతువులగుదురుగాత! (యనఁగాఁ దోడ్పడుదురుగాత!) ౩. సూర్యుఁడు మొదలైన పై దేవతలయం దంతర్యామిగ పరబ్రహ్మముగలదు; అట్టిపరబ్రహ్మకు నమస్కారమని యర్థము. బ్రహ్మస్వరూపమగు నోవాయుదేవుఁడా! నీకు నమస్కారము. నీకు శుభమగునుగాత! నీవే సాక్షాత్పరబ్రహ్మవు; నీవే పరమేశ్వరస్వరూపుఁడవగు శంకరుఁడవు. నీవట్టివాఁడవని మనఃపూర్వకముగఁ దలంచి వాగ్రూపముగఁ బలుకుచున్నాను. వాయురూపముతోనున్న యట్టిపరబ్రహ్మము నన్ను గాపాడునుగాత! అట్టి బ్రహ్మజ్ఞానమును నాకుబోధించు నాగురువునుగూడ రక్షించునుగాత. మాకు శుభములొసఁగి మమ్ములను

రక్షించునుగాత; రక్షించునుగాత! ఆధ్యాత్మికము, సాధిభౌతికము, సాధిదైవికమనను మూఁడువిధములగు తాపత్రయములను బోవుకొఱకు 'శాంతిః, శాంతిః, శాంతిః,' యని శాంతిశబ్దము మూఁడుమార్లు పలుకవలయును. ఇట్లు బ్రహ్మజ్ఞానముకొఱకు దైవప్రార్థనమును జేసి, యటుపై గురువువలన నుపదేశమునుబొందిన "యచ్ఛందసాం" అనుమంత్రము నదిమొదలుకొని "మేగోపాయ" యనువఱకును మిక్కిలి శ్రద్ధతో నెల్లప్పుడును జపము చేయవలయును. (అట్లు పైవిధములగు వేఱువేఱు దేవతలను బ్రార్థించి వారియనుగ్రహము చేఁ బాపములను బోఁగొట్టుకొనకపోయినచో నట్టిపాపములచే మోక్షార్థియగు వానికిఁ గల్గుసాటంకముల కొకయుదాహరణమునుగూడ నిచటనే చూపియున్నాఁడు. ఎట్లనఁగా:) బ్రహ్మజ్ఞానమునుగోరి గురువునకు శుశ్రూషచేయుచుండు ముముక్షువునకు దారిద్ర్యము (పేదఱికము) సంభవించియున్నయెడల నందుచే వానికి జీవయాత్ర (అనఁగా బ్రదుకుఁదెఱవు) కష్టమై, వాఁడు చేయు వేదాంతవిచారణమునందు మనస్సు నెమ్మదిగ నిలువనేరక, యందుండి జారుచుండును. అందువలన నట్టిదారిద్ర్యమును దొలఁగించికొనినయెడలమాత్రమే వాఁడుచేయుకృషి నెరవేరి బ్రహ్మవిద్యయందుఁ గృతార్థుఁడు కాఁజాలునుగాని, లేనిచో వాఁడుపడునట్టిశ్రమము వ్యర్థమేయగును. అందులకై, 'ఆవహంతి' యను మొదలుగాఁగల యాయనువాకమందలి తక్కినమంత్రముతోఁ బ్రతిదినమును నేతిచేతఁగాని, యన్నముచేతఁగాని, కాక, యన్నమును నేతిని రెంటినిజేర్చిగాని, యగ్నియందు హోమము చేయవలయును. అట్లుచేయు జ్ఞానార్థి, బ్రహ్మచారిగాని, గృహస్థుఁడుగాని, వానప్రస్థుఁడుగాని యైయుండి, యగ్నిహోత్రము చేయఁదగినవాఁడుగనున్నచోఁ బైరీతిగ నగ్నియందు హోమము చేయవలయును. అట్లుగాక సన్న్యాసియైగాని, యగ్నిరహితుఁడై (యనఁగా నగ్నిహోత్రము చేయఁగూడనివాఁడై) గాని, యున్నయెడల నామంత్రములను బ్రతిదినము జపముమాత్రము చేయవలయునని యర్థము. (పైదారిద్ర్యముచేఁగల్గు ప్రతిబంధకమువలెనే, యనారోగ్యముచేతఁగాని, సంసారసంబంధములగు కార్యభంగములచేతగాని, యాప్తబంధువుల మరణములును గష్టములును మొదలగు నిబ్బందులచేతగాని, స్వశరీరదౌర్బల్యముచేతఁగాని, యిట్లే యెన్నియోవిధములగు సాటంకములచే జ్ఞానార్థియగువానియొక్క మనస్సునకు స్వస్థతలేకపోవుట కవకాశముగలదు. అట్టియాటంకము లెవ్వియులేనివానికిమాత్రమే బ్రహ్మవిద్య యలవడుట కవకాశముగలదు. అట్టియాటంకములన్నియుఁ దీరవలయునన్నచో నాయాదేవతల యనుగ్రహమును బొందవలయును. అందుల కాయాదేవతలను గొలువకతప్పదు. కావుననే బ్రహ్మవేత్తలందఱికిని నగ్రగణ్యుఁడగు శ్రీశుకమహర్షి గూడ సకలదేవతలను గొలుచుటకుఁ గలయావశ్యకతను మేము లోగడఁగనపఱచియున్నరీతిగ శ్రీమద్భాగవత

పురాణమూలమునఁ బరీక్షితునకు బోధించియున్నాఁడు. అట్లు సకలదేవతలను సేవించుటకుఁ గలయావశ్యకతను వేదమే బోధించియున్నదనిగూడఁ బైఁ దెల్పిన మాధవాచార్యుల వారి వ్యాఖ్యానమువలన దెలియవచ్చుచున్నది.)

ఇట్లే సర్వదేవతాసామరస్యమును బురాణములు బోధించినవనుటకుఁ బైన దెల్పిన శ్రీస్కాంద, భాగవతపురాణములు రెండింటినుండియే యింకను ననేకములగు నుదాహరణముల నెత్తిచూపవచ్చునుగాని గ్రంథవిస్తరభీతిచేఁ విరమింపవలసివచ్చుచున్నది. కావలసియున్నచో స్థాలీపులాకముగ, పైస్కాందమందలి సూతసంహితలో శివమాహాత్మ్యఖండమునఁ "గాలసంఖ్యాకథన" మను నెనిమిదవయధ్యాయమున ౨౭-వ శ్లోకము మొదలుకొని ౫౨-వ శ్లోకమువఱకును సవ్యాఖ్యానముగను, ముక్తిఖండమున, 'ముక్త్యుపాయకథన'మను మూఁడవయధ్యాయమున ౧౭-వ శ్లోకము మొదలు ౪౯-వ శ్లోకము వఱకును, నిట్లే యింక నచ్చటచ్చటను జూడనగును. ఆరీతిగనే శ్రీమద్భాగవతమందలి చతుర్థస్కంధమునఁ "గర్దమప్రజాపతిసంతతిని దెలుపుట" యనుశీర్షికక్రింద, నత్రిమహాముని సంతానార్థమై తపస్సుచేయఁగాఁ ద్రిమూర్తులును బ్రత్యక్షమైనతరిని, వారికిని నత్రిమహామునికిని జరిగిన సంభాషణసందర్భమునను, నట్లే, దక్షయజ్ఞానంతరమున "దక్షాదులు విష్ణువును స్తుతించుట" యనుఘట్టమున దక్షుఁడు విష్ణునిస్తుతించుసందర్భమునను, విష్ణుండు దక్షునకుఁ బ్రత్యుత్తరమొసంగు సందర్భముననుగూడఁ జూడఁదగును. ఇట్టివింకెన్నియైనను బురాణములనుండి యెత్తిచూపవచ్చును.

ఈపైన గనఁబఱచినవిషయములన్నియుఁ శ్రీస్కాంద, భాగవత, పురాణములలోనివి. ఇవిరెండును వేఱువేఱగుశైవ, వైష్ణవ, సాంప్రదాయములకు సంబంధించినవి. మనవైదికమతములోని భిన్నసాంప్రదాయములలో నీశైవ, వైష్ణవసాంప్రదాయములు రెండును నగ్రగణ్యములు. ఈరెండు భిన్నసాంప్రదాయములకును జెందినపురాణములలోఁ బైఁ దెల్పిన రెండుపురాణములును ముఖ్యములు. ఇట్లీ రెండుపురాణములును బైరీతిని సర్వదేవతాసామరస్యము బోధించుచుండుటచేతను, నట్టి సకలదేవతలనుసేవించి వారియనుగ్రహము సంపాదించుట వైదికమతములోని కర్మయోగులకుమాత్రమేగాక జ్ఞానయోగులకుఁగూడఁ దప్పని సరియని పైరీతిగఁ జాటుచుండుటచేతను, (నావిషయమును వేదముగూడ నారీతిగనే బోధించుచుండుటచేతను,) బురాణములవలన వేఱువేఱు సాంప్రదాయములును బక్షములును నేర్పడి పరస్పరనిందలకుఁ గారణముగల్గినదనుటకు నవకాశములేదని స్పష్టమగుచున్నది.

ఇట్లనినతోడనే నవనాగరకులుకొందఱు బయలుదేరి యీక్రిందిరీతిగ నాక్షేపింపవచ్చును:—

"పురాణములలో మీరుగన్పఱచిన వైసామరస్యమున్నప్పటికిని, దానితోఁ బాటుగ నొక్కొక్కపురాణ మొక్కొక్కదేవత నెక్కువగఁబొగడుచు, దానికి నితర దేవతలు సాటిరావనుచు, నా దేవతయే యన్నిఁటికి నెక్కుడనుచుఁ, బొగడియుండలేదా? అట్టిదేవతతో నితరదేవతలు సమానమనికూడ చెప్పరాదనుచు, నట్లుచెప్పినచోఁ బాప మును, నరకమును వచ్చుననుచుఁగూడ వర్ణించియుండలేదా? అది యితరదేవతలను ఖండనము చేయుటయు నిందించుటయుఁగాదా? దాని నాధారము చేసికొని వేఱువేఱు సాంప్రదాయములవారు గ్రుద్దులాడుకొని చావరా? అందులకుఁ గారణము పురాణములే యగుటలేదా?" యని వారు మనలను బ్రశ్నింపకపోరు.

అట్టివ్రాతలు పురాణములలో లేవని మేము చెప్పుటలేదు. వానితోఁబాటుగఁ బైవిధములగు సామరస్యములుగూడ బలవత్తరముగ వర్ణింపఁబడియున్నపుడు వానిని చూడకయో, చూచియును బయటఁబెట్ట నిచ్చగింపకయో, యందులకు విరుద్ధములగు నభిప్రాయములనుమాత్రమే గ్రంథస్థముచేయుట నిష్పక్షపాతియగు చరిత్రకారుని లక్ష ణముగాదనిమాత్రమే తెలుపుచుంటిమి. అట్టి యన్యోన్యవిరుద్ధాభిప్రాయము లున్నపు డారెంటిని నొకచోటఁజేర్చి విమర్శించి వానికి సమన్వయము గనఁబఱచుటయో, కాక యందేదియైనఁ బ్రక్షిప్తమని బుజువుచేయఁగల్గినచో బుజువుచేసి దానిని ద్రోసివైచు టయో న్యాయమగునుగాని, రెండవపక్షపుమాటయేయెత్తక యొకపక్షమునే వ్రాసివిడచుట పక్షపాత మనిపించుకొనకమానదు. ఈవిషయమున నట్టిన్యాయదృష్టితో 'హిందూదేశ కథాసంగ్రహ'కర్త లిచటఁ బ్రవర్తించియుండలేదు సరిగదా, వేఱొకచో నెచటనైనను బ్రవర్తించియున్నట్లూహించుట కేమియు నాధారమునుగూడఁ గనఁబఱచియుండలేదు!

"ఐనచో మీరుమాత్ర మట్టిసమన్వయమునుగాని, విమర్శనమునుగాని యొచటఁ గనఁబఱచియుంటిరి?"రని మన నవనాగరకసోదరులు మరల మనలను బ్రశ్నింపకపోరు. ఆవిషయమున విమర్శింపవలసిన పూర్వపక్షములును సిద్ధాంతములును బెక్కులుండుట చేతను, వాని నీగ్రంథముయొక్క రెండవభాగమున, "వైదికమతతత్త్వ"మను నెనిమి దవప్రకరణమునఁ "ద్రిమూర్తులలో నెవ్వరధికుఁ?"డను శీర్షికక్రింద విమర్శించి సమా ధానము లు చెప్పవలసినయవసర మచ్చుట నెక్కువగనున్నందునను, నాపని నచట గావింపనుంటిమనియు, సర్వదేవతలకును, సర్వసాంప్రదాయములకును, దుదకు సర్వమత ములకునుగూడ సామరస్యమును లెస్సగబోధించువాక్యములుగూడ మనపురాణములలోఁ బెక్కులున్నందున వానిని స్థాలీపులాకన్యాయముగ నిచటఁ జూపుచుంటిమనియు, నీవ్యాసముననే లోగడఁ దెలిపియున్నాము!

వైవిమర్శనముచేఁ, బురాణములనుగుఱించి ప్రాచీనచరిత్రలు బోధించువిషయములే నమ్మఁదగినవిగా నున్నవిగాని, విదేశీయచరిత్రకారులు కల్పించినవి వారిననుసరించి

స్వదేశీయులగు పైనవీనచరిత్రకారులును, వ్రాసినవిషయములు నమ్మఁదగినవిగాలేవని స్పష్టమైనది. ఈవిషయము నంగీకరించువారు విదేశీయులగు నవీనచరిత్రకారులలో సహితము కొందఱు గలరనుసంగతిగూడఁ బైనఁదెలిసికొంటిమి. వారేమివ్రాసిరో యావిషయమును గూడఁ జదివియేయుంటిమి. పైస్వదేశీయనవీనచరిత్రకారునివలెనే పురాణములనుగుఱించి దురభిప్రాయపడిన విదేశీయచరిత్రకారుల వ్రాతలకు మూలము వట్టియూహలుమాత్రమే. ఇట్టివ్రాతలే పైస్వదేశీయ చరిత్రకారునియూహలకుఁ గారణమైకూడ నుండవచ్చునని తోఁచుచున్నది.

ఈరీతిగ వట్టివట్టియూహల నొకటిపై యొకటియల్లి, పురాణములు మొదలగు మన ప్రాచీనచరిత్రగ్రంథములనుగుఱించి నవీనచరిత్రకారులు నవీనచరిత్రలను వ్రాసి యుండిరి. మన ప్రాచీనచరిత్రలనుజదివి నేర్చికొనుటలో మనపూర్వులు వారిబాల్యమును గడపినరీతిగ వీరు తమబాల్యమునునందుఁగడపక, దానినంతను విదేశీయవిద్యాభ్యాసమునకే ధారవోసినవారు. అందుచే వీరు మనప్రాచీనచరిత్రలందు విశ్వాసములేక, వానియందు విపరీతభావనలుగలవారై, వానిని జదువఁదటస్థించినపు డందలివిషయములను సమన్వయముచేసికొనలేక, యవి యర్థశూన్యములగు కల్పితవిషయములని భ్రమపడి, యందలి విషయములలోఁ దమయిష్టమువచ్చినవానిని నమ్ముచు, మిగిలినవి కల్పితములని వారి యిష్టమువచ్చినట్లూహించుచు, నాగ్రంథములనుగూర్చి తమ యిచ్చవచ్చినవిధముగఁ దాము వ్రాయుచరిత్ర పుస్తకములలోవ్రాసి వైచియుండిరి. మనదేశమున విదేశీయవిద్య నేర్పు పాఠశాలలం దిప్పటికాలమున విద్యనేర్చికొనిన విద్యార్థులకును విద్యావంతులకునుగూడఁ బై 'హిందూదేశకథాసంగ్రహము' వంటివేయగు నవీనచరిత్రపుస్తకములే నేర్పఁబడుచుండుటచే, వారిలో నెక్కువమంది పురాణములు మొదలగు మన ప్రాచీన చరిత్రలవిషయమై పైనదెలిపినట్లుగ విపరీతపుటూహలు గలవారే యగుచున్నారు. అందుచేఁ బురాణాదులందుఁ దెలుపఁబడిన వేదాంతవిషయములును, వేదధర్మములును, బ్రపంచముయొక్కయు నందలిజనులు మొదలగువారియొక్కయుఁ బుట్టుకమొదలైన చరిత్రవిషయములును, భగవంతునియొక్కయుం, నితరమహనీయులయొక్కయుం మహిమాతిశయములతోఁగూడిన చారిత్రకవిషయములును, మొదలగునవి పెక్కులు కల్పిత కథలని వారు భ్రాంతిచెంది, వానినిబాటింపక, యందలి ధర్మాచరణమునకును సదాచారములకును దూరులగుచు, స్వేచ్ఛగాఁ దిని తిరుగుచున్నారు. అట్టిస్వేచ్ఛ ననుభవించుచుఁ గూడ, నంతటితోఁ దనివిఁజెందక, తమకంటెభిన్నముగఁ బ్రవర్తించుచున్న పూర్వాచారపరాయణులయొక్క స్వేచ్ఛ నపహరింపఁగోరి, వారిసదాచారములను రూపుమాప నెంచి, విదేశీయులును బరమతస్థులునునగు బ్రభుత్వమువారికడఁ బలుకుబడినిసంపాదించి వారిసహాయ మపేక్షించుచున్నారు. ఆవివరములన్నియుం నీగ్రంథముయొక్క యేడవ ప్రకరణమున, "నవీనచరిత్ర లెట్లు పరిణమించెను" [illegible] ముందుముందు

తెలిసికొనఁగలము. వైవిధములగు నవనాగరకులయత్నములు సాగకుండుటకై పూర్వాచారపరాయణులు ప్రతిఘటించుచున్నారు. ఈయిరువురి యన్యోన్యసంఘర్షణ మైకమత్యభంగకరమును, దేశక్షేమనిర్మూలనహేతువు నగుచున్నది. ఇందులకు మూలకారణము మనదేశసంబంధమగు నవీనచరిత్రలేయని వైవిమర్శవలన మనము చక్కఁగ గ్రహించియుంటిమి. కావున దేశక్షేమమునుగోరు బుద్ధిమంతులు తమబిడ్డలకిట్టివైన నట్టిచరిత్ర గ్రంథములను నేర్పింపకుండుట యత్యంతావశ్యకమని రూఢియగుచున్నది.

## ఇతిహాసములు.

### ఇతిహాసములనుగుఱించి ప్రాచీనచరిత్రలు సామాన్యముగ నేమిచెప్పును.

పురాణములనుగుఱించి మనప్రాచీనచరిత్రలనుండి ప్రమాణముల నీప్రకరణము యొక్క ప్రారంభమునఁ దెలిసికొనియుంటిమిగదా! అందు, వేదములోని ఛాందోగ్యోపనిషత్తు, వసిష్ఠస్మృతి, శ్రీధరాచార్యులవారు వ్రాసిన శ్రీమద్రామాయణవ్యాఖ్య, మొదలగువానినుండి కనఁబఱచిన ప్రమాణములలోఁ బురాణములతోఁబాటుగ నితిహాసములుగూడ కలిపి వర్ణింపఁబడుటచే నవిగూడఁ బురాణములవలెనె వేదార్థమును బోధించునవియనియుఁ, గావున వానివలెనె గౌరవింపఁదగిన ప్రమాణగ్రంథములనియుఁ సులభముగ బోధపడుచున్నది. ఆప్రమాణము లీక్రిందిరీతిగఁ దెలుపుచున్నవి:—

"ఇతిహాసపురాణః పంచమో వేదానాం వేదః" ఛాందోగ్యోపనిషత్. అ. 7

శ్లో. "ఇతిహాసపురాణాభ్యాం వేదార్థ ముపబృంహయేత్,
బిభేత్యల్పశ్రుతా ద్వేదో మా మయం ప్రహరిష్యతి." వసిష్ఠస్మృతిః.

శ్లో. "ప్రాయేణ పూర్వభాగోఽర్థో ధర్మశాస్త్రేణ కథ్యతే,
ఇతిహాసపురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశతే."

శ్రీధరకృత రామాయణవ్యాఖ్య.

[ఈప్రమాణవాక్యములయర్థమును, లోగడ నీప్రకరణమున నే పురాణములను గుఱించిన సందర్భమునఁ దెలిపియుంటిమిగావున నచటఁజూచి తెలిసికొనఁదగును.]

పురాణములవలెనే, వేదములందలి వేదాంతవిషయమును ముఖ్యముగను, నందలి ధర్మాధర్మములను సామాన్యముగను బోధించుటయేగాక, యితిహాసము లొక్కొక్క రాజవంశచరిత్రమును విపులముగఁదెలుపుచు, నందు సందర్భానుసారముగఁ బ్రపంచ సృష్టికి సంబంధించినసంగతులను, భగవంతుని యవతారకథలను, నాదర్శప్రాయులగు కొందఱి పుణ్యపురుషులచారిత్రలను, ధర్మబోధకములును, నీతిదాయకములును, పాపహారములును, బుణ్యప్రదములును నగు మఱికొన్ని యితరపుణ్యకథలనుగూడ వర్ణించియుండుటచే, నించుమించుగఁ బురాణములకుఁగల పంచలక్షణములును నితిహాసములకుఁ గూడఁ గలవని విశదమగుచున్నది.

ధర్మాధర్మములను బోధించుటలోఁ బురాణేతిహాసములవలనఁగల్గు మఱియొక విశేషప్రయోజన మేమనఁగా: ధర్మశాస్త్రములందలి ధర్మాధర్మముల నన్నిఁటినిజదివి జ్ఞాపకముంచుకొని యనుష్ఠించుట సామాన్యముగ జనులకు సులభసాధ్యముగాదు; అట్టి ధర్మములనాచరించి సత్ఫలములొందిన వారిచరిత్రలును, నధర్మములాచరించి కష్టము లొందినవారి చరిత్రలును బురాణములందును నితిహాసములందును గేవల కథారూప ములుగనుండుటచే వారు వానినివిని జ్ఞాపకముంచుకొని, ధర్మాధర్మనిర్ణయమున కవసరము గల్గినపు డట్టికథలను జ్ఞాపకముతెచ్చికొని వానికనుగుణ్యముగఁ దా మపుడు ప్రవర్తిం చుట కెక్కువ యవకాశమున్నది. ఇందుల కుదాహరణముగ: దుర్మార్గవర్తనము గల వారిని, బరులను హింసించువారిని, దేవుఁడు శిక్షించునని యూరక పొడిమాటచెప్పినచో నది కొందఱి కంతగా మనసునకుఁ బట్టదు. కాని, యట్టిదుర్మార్గులగు రాక్షసులు మొద లగువారు చేసినచర్యలును, వానిచే లోకమునకుఁ గల్గినకీడును, నందులకుగాను దేవుఁ డవతరించి యట్టిరాక్షసులను సంహరించినవిధమును, గథగా వర్ణించిచెప్పినపు డది బాగుగ మనస్సునకెక్కి, యిట్టియిట్టి దుష్కార్యములు చేయుటచే నీయావిధములగు శిక్షలు జరుగునుగదాయనుసంగతి గాటముగ మనసున నాటును. ఇట్లే సత్ప్రవర్తనవిషయ మును, సత్ఫలముల విషయమునుగూడఁ దెలియనగును.

ఇతిహాసములలోని ప్రత్యేకగ్రంథములనుగుఱించి మనప్రాచీనచరిత్ర లేమివిశేష ములనుజెప్పునో యిఁకఁ దెలిసికొందము.

## ఇతిహాసములనుగుఱించి ప్రాచీనచరిత్రలుచెప్పెడి ప్రత్యేకవిశేషములు.

మన పురాణగ్రంథములలో మధ్యమధ్య సందర్భానుసారముగవచ్చెడి సామాన్య ములగు చిన్నయితిహాసములుమాత్రమేగాక, మనప్రాచీనచరిత్రలలో ముఖ్యములని చెప్పఁదగిన పెద్దయితిహాసగ్రంథములు రెండుగలవు. అవి, ౧. శ్రీమద్రామాయణము, ౨. శ్రీమహాభారతము. వీనిలో మొదటిది, శ్రీమహావిష్ణుదేవుని ముఖ్యమైన పదియవ తారములలో నేడవయవతారమై, క్షత్రియకులమందలి సూర్యవంశమునఁబుట్టిన శ్రీరామ చంద్రునియొక్క యవతారచరిత్రను బ్రధానముగఁగల్గిన గ్రంథరాజము. రెండవది, చంద్రవంశమునఁబుట్టిన కౌరవులును, పాండవులును నను రెండు క్షత్రియకుటుంబముల చరిత్రను బ్రధానముగఁగల్గి, యావంశముననే యవతరించి యాకుటుంబములతో బాంధవ్యముగల్గి వర్తించినట్టియు, శ్రీమహావిష్ణువుని యెనిమిదవయవతారమైనట్టియు, శ్రీకృష్ణభగవానుని దివ్యచరిత్రతోడ సంబంధించిన మహాగ్రంథము. కావున వీనిలో నొక్కొక్కదానినిగుఱించి విశేషములు నిదిగువఁ దెలిసికొందము:—

## ౧. శ్రీమద్రామాయణము.

దీనికిఁ గథానాయకుఁడు సూర్యవంశసముద్భవుఁడగు శ్రీరామచంద్రుఁడని పైనఁ జెలిసికొనియుంటిమి. ఇది వాల్మీకిమహర్షిచేఁ దొలుత సంస్కృతభాషయందు వ్రాయఁబడి "యాదికావ్య"మని పేరొందినది. నిరుపమానపాండిత్యధురంధరుఁడును, నాదికవియు నగు వాల్మీకిమహర్షి యనేకవేదమంత్రరహస్యముల నీగ్రంథమునఁ గూర్చియుండెనని యీక్రిందిశ్లోకముచేఁ దెలియవచ్చుచున్నది:—

"శ్లో. వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా."

అనఁగా: "వేదములచేఁ దెలియవచ్చెడి పరమపురుషుఁడగు శ్రీవిష్ణుభగవానుఁడు దశరథునకుఁ గొమారుఁడై పుట్టఁగాఁ, బ్రచేతసునిపుత్రుఁడగు వాల్మీకిమహర్షివలన సాక్షాత్తు వేదము శ్రీమద్రామాయణరూపమును బొందెను" దని యర్థము. అందుచే, వేదములను జదువుటకును వినుటకును నధికారములేని స్త్రీలును, శూద్రులును మొదలగువార లీగ్రంథమునువిని, వేదమునుజదువుటచే నితరులకుఁగల్గెడి మహాఫలములను దాముగూడఁ బొందుటకు వారి కవకాశము గల్పింపఁబడినది.

మఱియును, రామాయణము బ్రాహ్మణులచే మాత్రమేగాక, దేవతలచేఁగూడఁ జదువఁబడెడి యుత్కృష్టపావనగ్రంథరాజమని కవిశిఖామణియగు కాళిదాసమహాకవిచే నీక్రిందిచాటువున నభివర్ణింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది:

శ్లో. "కస్త్వం కిం తప?" "పుస్తకమ్;" "కి ముదకమ్?" "కావ్యార్థసారోదకమ్;"
"గంధః కిం?" "ఘనరామరావణమహాసంగ్రామరంగోద్భవమ్."
"పుచ్ఛః కిం?" "ఘనతాళపత్త్రలిఖితమ్;" "కిం పుస్తకం? హే కవే!"
"రాజన్! భూసురదైవతైశ్చ పఠితం రామాయణం పుస్తకమ్."

పైనదెల్పినవిధముగ వేదమంత్రములతో నిండినదియును, బరమపురుషుని యవతారకథయు, నగుటచేత నేకాఁబోలు నీగ్రంథము భారతవర్షమునఁ బండితపామరమనోరంజకమై, దానిమహిమయుఁ, బావనత్వమును, నీక్రిందిరీతిని గీర్తింపఁబడుచున్నవి.

"శ్లో. చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్."

అనఁగా, "శ్రీరామాయణమునందలి యొక్కయక్షరము నుచ్చరించినను మహాపాతకములుగూడ నశించిపోవు"నని భావము.

పూర్వరామాయణమునందు (అనఁగా, రామాయణములోని మొదటి యాఱు కాండలలోను) రామకథయే ప్రధానముగ వర్ణింపఁబడినను, బాలకాండమున, విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకు సందర్భానుసారముగఁ దెల్పిన మఱికొన్ని యితిహాసములును, శతానందుఁడు శ్రీరామభద్రునకు విశ్వామిత్రునిచరిత్రరూపమునఁ దెల్పిన మఱికొన్నికథలును, సీతాకల్యాణసందర్భమున వసిష్ఠుఁడును, శతానందుఁడును, వర్ణించిన సూర్యవంశక్రమమును, నిట్టివే సందర్భానుసారముగ నచ్చటచ్చటవచ్చు మఱికొన్ని కథలును గలవు. ఉత్తరరామాయణమున (అనఁగా నేడవదియగు నుత్తరకాండమున) నగస్త్యమహర్షి శ్రీరామచంద్రునకుఁ బ్రసంగవశమునఁజెప్పిన రాక్షసవంశచరిత్రమును, రావణాదులజననమును, రావణుని దండయాత్రలును, మొదలగు రావణునిచరిత్రయే విశేషభాగము నిండియున్నది; సీతావనవాసమును, కుశలవజననమును, శ్రీరామావతార పరిసమాప్తియుం, మొదలగుకథలను బ్రధానముగఁగల్గి, లవణాసురవధయును, శ్రీరామచంద్రుఁ డశ్వమేధయాగప్రశంసాపూర్వకమునఁ దమ్ములకు వినిపించిన కొందఱురాజన్యులచరిత్రలును, మొదలగు మఱికొన్ని యితిహాసములును, హనుమంతునిచరిత్రము, శంబుకవధ, దండకారణ్య, జనస్థానవృత్తాంతములు, మొదలగు ధర్మరహస్యబోధకములును, చారిత్రవిషయికములును నగు మనోహరములైన పెక్కుకథలచే నలరారుచున్నది. ఇందలి ప్రధానకథ జగత్ప్రసిద్ధమగుటచే నిచట వినిపించు టనవసరము.

ఈయితిహాసరాజముయొక్క విశేషముల నింకను నెఱుఁగగోరువారు శ్రీవావిలికొలను సుబ్బారావుగారువ్రాసిన "శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము"యొక్క పీఠికయును, శ్రీములుకట్ల నరసింహావధానులుగారు వ్రాసిన "రామాయణసారోద్ధార"మను గ్రంథముయొక్క పీఠికయును జదువఁదగును.

మఱియును, సంస్కృతభాషయందలి పురాణములు మొదలగుగ్రంథములలో నొక్కొక్కదానిని దెనిఁగించినకవు లొకరిద్దఱుకంటె నెక్కువగ లేకున్నను, శ్రీరామాయణమును దెనిఁగించినవారుమాత్రము పూర్వులలోను, నాధునికులలోనుగూడ సుప్రసిద్ధులగుకవులు పలువురుండుటయే యాగ్రంథరాజమునందుఁ బండితులకును, వారినాదరించి కృతులందికొనిన ప్రభువులకునుగల యాదరమును వేయినోళ్ళఁ జాటుచున్నది. స్త్రీలు పాడికొనుపాటలయం దనేకవిధములుగ రామకథయే వర్ణింపఁబడియున్నది. ఇఁక బల్లెలయందలి రామమందిరములును, వానిలోఁజేరి రామభజనలు సేయుంపామరజనులుపాడెడి రామకీర్తనలును, వారికిఁగల రామభక్తిని వేయినోళ్ళఁ గీర్తించుచున్నవి. ఈరీతిగ భరతవర్షమునఁ బండితపామరకీర్తనీయమగుకథ రామకథయును, నట్టిగ్రంథము రామాయణమును మాత్రమేయని చెప్పవచ్చును. ప్రాచీనసంస్కృతాంధ్రకవులలోఁ

బలువురు పలువిధముల రామకథాప్రాశస్త్యమును బ్రశంసించియున్నారు. గ్రంథవిస్తర భీతిచే నన్నింటి నుదాహరింపవీలుగాక యొకటిరెండుమాత్ర మిచటఁ జూపుచున్నాము:-

శ్రీమదాంధ్రభాగవతనిర్మాతయుఁ, రామభక్తాగ్రేసరుఁడు నగు బమ్మెరపోతనామాత్యుఁడు తనయాంధ్రభాగవతమున నీక్రిందిరీతిని రామాయణప్రశంస చేసియున్నాఁడు:—

"క. మంతనములు సద్గతులకుఁ, బొంతనములు ఘనములైన పుణ్యముల కిదా
నీంతనపూర్వమహాఘుని, కృంతనములు రామనామకృతి చింతనముల్." 363

శ్రీమదాంధ్రభాగవతము, స్కం. ౯.

ఉత్తరరామాయణమును దెనిఁగించిన కంకంటిపాపరాజప్రధాని యాగ్రంథమం దిట్లు కీర్తించియున్నాఁడు:—

మ. "వరుసం దిక్కనయజ్వ నిర్వచనకావ్యంబై తగం జేసె ను
త్తరరామాయణ; మందునన్ మఱిప్రబంధంబూని నిర్మించు టే
సరసత్వం?"బని ప్రాజ్ఞులార! నిరసించంబోకుఁడీ; రాఘవే
శ్వరుచారిత్రము నెందఱెన్నిగతుల న్వర్ణించినం గ్రాలదే! 14

"ఉ. మానుగఁ గర్మభూమిపయి మానవదేహముతో హితాహిత
జ్ఞానమెఱుంగుబ్రాహ్మణుఁడు చారుకవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపక యసత్కథ లెన్నిరచించెనేనియున్
వానివివేక మేమిటికి? వానికవిత్వమహత్త్వ మేటికిన్. 15

శ్రీమదుత్తరరామాయణము, ఆశ్వా. ౧.

కావుననే సుబ్రహ్మణ్యకవి తనయధ్యాత్మరామాయణకీర్తనలందు "రామకథా మాధురిసామాన్యమా?" యని గానముచేసియున్నాఁడు. ఇట్టి సర్వజనశ్లాఘ్యమగు రామకథకు మాతృకయైన మూలరామాయణము (వాల్మీకిరామాయణము) నిఖిలజనులకు నత్యంతాదరణీయమును, వేదశాస్త్రములతో సమానమగు ప్రమాణగ్రంథమునునై, 'శాస్త్ర' ముగఁ బరిగణింపఁబడుచున్నట్లు శ్రీమధ్వాచార్యులవారి 'బ్రహ్మసూత్రభాష్య'మందలి యీక్రిందివాక్యముచేఁ దెలియుచున్నది.

"శ్లో. ఋగ్యజుస్సామాథర్వాశ్చ భారతం పాంచరాత్రకమ్,
మూలరామాయణం చైవ శాస్త్రమి త్యభిధీయతే."

## ౨. శ్రీమహాభారతము.

చంద్రవంశసంజాతులగు కౌరవులయొక్కయుఁ, బాండవులయొక్కయుఁ జరిత్రమని పైన దెలుపఁబడిన యీగ్రంథరాజ మష్టాదశ మహాపురాణములనువ్రాసిన

వేదవ్యాసమహర్షిచే సంస్కృతభాషయందు రచింపఁబడినది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య జాతులలో నుపనయనసంస్కారమును బొందినపురుషులు మాత్రమేతప్ప, స్త్రీలును, నితరజాతులవారును, వేదమును జదువరానందున, వారికి దానియందలి విశేషములనెఱుఁగుట కవకాశములేకపోవుటచే నట్టియవకాశము గల్పించుటకై వేదవ్యాసమహర్షియే వారికొఱకు శ్రీమహాభారతమును నిర్మించెననువిషయమును 'సూతసంహితాతాత్పర్యదీపిక'నుండి యెత్తి, యీగ్రంథమననే మొదటిప్రకరణమున, "వేదమును గుఱించి నవనాగరకులకుఁగల కొన్నిసంశయములు; వానికిసమాధానములు" అను సందర్భమున, "వేదము మనుష్యులువ్రాసినది కానియెడల దానిలో ఋషులపేళ్లు కొన్ని యెట్లు వచ్చినవి?" అను శీర్షికక్రింద లోగడఁ గనబఱచియుంటిమి. ఆవిషయమునే వేదభాష్యమందలి 'ఐతరేయబ్రాహ్మణ' వ్యాఖ్యాప్రారంభమున వేదవ్యాఖ్యాత లీక్రిందిరీతిని దెలిపియున్నారు:

"........న స్త్వేవంసతి, స్త్రీశూద్రసహితా స్సర్వేఽపి వేదాధికారిణ స్స్యుః: 'ఇష్టం మే స్యా; దనిష్టం మాభూ' దిత్యాశిష స్సార్వజనీనత్వాత్; మైవమ్, స్త్రీశూద్రయో స్సత్య ప్యుపాయబోధార్థిత్వే, హేత్వంతరేణ వేదాధికారస్య ప్రతిబద్ధత్వాత్. ఉపనీతస్యై వాధ్యయనాధికారం బ్రువచ్ఛాస్త్ర మనుపనీతయో స్స్త్రీశూద్రయో ర్వేదాధ్యయన మనిష్టప్రాప్తిహేతు రితి బోధయతి. కథం తర్హి తయో స్తదుపాయావగమః? పురాణాదిభి రితి బ్రూమః. అతఏవోక్తమ్:

శ్లో. "స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా,
ఇతి భారతమాఖ్యానం మునినా కృపయాకృతమ్." ఇతి.
తస్మా దుపనీతైరేవ త్రైవర్ణికై ర్వేదస్య సంబన్ధః........"

దీనియర్థ మేమనఁగా: (ఈజన్మమునను, నీలోకమునను మనయింద్రియములకు గోచరింపక, జన్మాంతరములందును లోకాంతరములందును గనఁబడెడి ఫలములనుగల్గించు నదియు; సుఖము లిష్టములగుటచే నవి కల్గుటకును, దుఃఖము లిష్టముకానివగుటచే నవి తొలఁగిపోవుటకును సాధనములైనవియు, నగు నుపాయములను: బోధించుటయే వేదమందలి విషయమనియు, నట్టివిషయ మెఱుఁగగోరువారే యీవేదమును నేర్చికొనుట కధికారులనియు వేదభాష్యమున నింతకుముందుగఁ దెలుపఁబడినది.) ఇఁక నట్లైనయెడల, 'నాకు సుఖముకలుగవలయును; దుఃఖము వద్దు'అనుకోరిక సామాన్యముగ నందఱికి నుండుననగుటచే, స్త్రీలును, శూద్రులును, నందఱునుగూడఁజేరి వేదము నేర్చికొన నధికారులు కావలసివచ్చును; కాని, స్త్రీలకును, శూద్రులకును నట్టివిషయ మెఱుఁగఁ గోరికయున్నప్పటికిని, వేఱొకహేతువుచే వేదము నేర్చికొనుట కభ్యంతరమున్నందువలన, నట్లు కాజాలదు. (అనఁగా, వా రధికారులు కానేరరు.)

ఉపనయనసంస్కారమును బొందినవానికిమాత్రమే వేదమునుజదువుట కధికారముగలదని చెప్పెడిశాస్త్రమే, యుపనయనమేలేని స్త్రీలును, శూద్రులును, వేదమును నేర్చికొనుట వారి కనిష్టప్రాప్తిహేతువని (యనఁగా వారికి దుఃఖమునుగల్గించుటకుఁ గారణమగునని) బోధించుచున్నది. అట్లయినయెడల, (సుఖములుగల్గుటకును, దుఃఖములు తొలగిపోవుటకును వేదముచే నుపదేశింపఁబడు) నట్టి యుపాయములను బొందుటకు వారికి మార్గమెట్లు? పురాణములు మొదలగువానిచేతనే యని సమాధానము. అందువలననే "స్త్రీశూద్రద్విజబంధూనాం......" అనుశ్లోకమును జెప్పియున్నారు. (అనఁగా: "స్త్రీలకును, శూద్రులకును, ద్విజబంధువులకును, వేదము వినరానిదగుటచేఁ, గృపాళుఁడగు వేదవ్యాసమహర్షి భారతకథను రచించె" ననియర్థము.) అందువలన, నుపనయనసంస్కారమునుబొందిన(బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను) మూఁడువర్ణముల వారితో మాత్రమే వేదమునకుసంబంధము (అనఁగా, వారికిమాత్రమే వేదము నేర్చికొను నధికారము.)....................."

ఈయర్థమునే శ్రీమద్భాగవతపురాణముగూడ నీక్రిందిరీతిని బోధింపుచున్నది:—

"వ............మఱియును దీనవత్సలుండయినవ్యాసుండు స్త్రీశూద్రులకుం ద్రైవర్ణికాధములకు వేదంబులు విననర్హంబులుకావు గావున మూఢులకెల్ల మేలగునని భారతాఖ్యానంబుచేసియు నమ్ముని భూతహితంబునందుఁ దనహృదయంబు సంతసింపకున్న సరస్వతీతీరంబున నొంటియుండి హేతువువితర్కించుచుఁ దనలో నిట్లనియె. 84

"సీ. వ్రతధారినై వేదవహ్నిగురుశ్రేణి, మన్నింతు; విహితకర్మములఁ గొఱవ
పడకుండ నడపుదు; భారతమిషమునఁ బలికితి వేదార్థభావమెల్ల;
మునుకొని స్త్రీశూద్రముఖ్యధర్మము లందుఁ దెలిపితి నేఁ; జెల్లదీనఁ జేసి
యాత్మసంతసమంద; దాత్మలో నీశుండు సంతసింపకయున్నజాడ దోఁచె;
ఆ. హరికి యోగివరుల కఖిలక్షితంబైన భాగవతవిధంబుఁ బలుకనైతి;
మోసమయ్యెఁ; దెలివిమొనయదు; మఱచితి;" ననుచు వగచుచున్నయవసరమున."
శ్రీమదాంధ్రభాగవతము, స్కం. ౧.

వేదములందలి ధర్మములన్నియును శ్రీకృష్ణభగవానుని ప్రేరేపణమువలన భీష్మాచార్యులచే యుధిష్ఠిరునకుఁ బ్రశ్నోత్తరపూర్వకములగు సంశయనివృత్తిరూపమున నుపదేశింపఁబడి భారతమునందున్న విషయమును శ్రీమహాభారత మీక్రిందిరీతిని దెలుపుచున్నది:

"వ—............"చెప్పవలయువానినెల్లం జెప్పెదఁ; బాండవశుభకరం బైనదాని నీవేలచెప్పవు? నీతలంపేమి? సెప్పవే!" యనినఁ గృష్ణుండు గాంగేయున కిట్లనియె:

... ... ... ... ... ... ...

"క. పరమమగు యశము నీకును, ధరణిం గలిగింపఁబూని తాత్పర్యమునం
బురుషవర! నాదుబుద్ధి,స్ఫురణము నీమనమునందుఁ జొనిపితి నెనయన్. 147

తే. ధరణి యెందాఁకనుండు సుస్థిరత నీదు,కీర్తి యందాఁక నక్షయస్ఫూర్తిఁ దాల్చి
నడవఁగలయని; నీవుచెప్పెడి సువాక్య,ములును వేదతుల్యంబులై వెలయుచుండు.

క. ధర్మజునకు నీచెప్పెడి, ధర్మస్థితివాక్యసమితి తాత్పర్యముతో
నిర్మలులై కొనియాడెడు, ధార్మికులకు నుభయజగదుదాత్తత గలుగున్. 149

వ. కావున నిట్లు సేసిలి; భవదీయధర్మవేదిత్వంబును సవిశేషప్రకారంబుగ నీమనుమలు ధర్మజభీమార్జుననకులసహదేవులు భద్రభాజనంబులుగా,నీయున్నమహీపతులు విని కృతార్థజన్ములుగా, నఖిలధర్మప్రకారబోధకంబులగు వాక్యంబులు సెప్పు" మనుటయు, శాంతనువుం "డట్లుచేసెద" ననిపలికి యాదరభరితుండయి......" 150

శ్రీమదాంధ్రమహాభారతము, శాంతిపర్వము, (ఆశ్వా. ౧.)

దీనినిబట్టిచూడఁగా, భీష్మాచార్యునిచే నుపదేశింపఁబడిన మహాభారతములోని ధర్మములన్నియుఁ భీష్మాచార్యునినోటినుండి వెలువడినప్పటికిని, వానినుపదేశించినది శ్రీకృష్ణపరమాత్మునిబుద్ధియేగాని భీష్మాచార్యునిబుద్ధి గాదనియుఁ,గావుననే యవి భగవంతుని వాక్యములగుటచే నాయనయొక్క యాజ్ఞారూపమగు వేదమువలెనే ప్రమాణములై యలరారుచు, నాభగవంతునిచేతనే వేదతుల్యములని చెప్పఁబడినవనియు మనము బాగుగ గ్రహింపవలసియున్నది.

అట్లు భీష్మాచార్యునివలన ధర్మరాజువినిన ధర్మములయొక్కవివరములను శ్రీమద్భాగవతపురాణ మీక్రిందిరీతిని విశదీకరించుచున్నది:—

"వ......ఇట్లు...మునులందఱునువినుచుండ ధర్మనందనుండు మందాకినీనందనువలన నరజాతిసాధారణంబులగు ధర్మంబులును, వర్ణాశ్రమధర్మంబులును, రాగవైరాగ్యోపాధులతోఁగూడిన ప్రవృత్తినివృత్తిధర్మంబులును, దానధర్మంబులును, రాజధర్మంబులును స్త్రీలధర్మంబులును, శమదమాదికంబులును, హరితోషణంబులగుధర్మంబులును, ధర్మార్థకామమోక్షంబులును, నానావిధోపాఖ్యానేతిహాసంబులును, సంక్షేప విస్తారరూపంబుల నెఱింగె........." 215

శ్రీమదాంధ్రభాగవతము, (స్కం. ౧.)

శ్రీమహాభారతముయొక్క విషయానుక్రమణికను, నందు ముఖ్యముగ శాంతి పర్వానుశాసనికపర్వములలోని విషయములను మొదటినుండియుఁ జివరవఱకును జదివి చూచినచో బైన దెలిపిన నానావిధములగు వేదధర్మవిశేషములును నందుఁగలవనుసంగతి నిర్వివాదాంశమని గ్రహింపఁగల్గుదుము. ఆవిషయానుక్రమణిక మిక్కిలిపెద్దదియగుటచే దాని నిట నుదాహరింప మానితిమి. దానినిబట్టిచూచినచో శ్రీమహాభారతముయొక్క తాత్పర్యము వేదములోనిపూర్వోత్తరమీమాంసల (ననఁగాఁ గర్మకాండ, జ్ఞానకాండల)కు రెంటికిని సంబంధించినయర్థమును విశదీకరించుటేయని స్పష్టముకాఁగలదు. అందుఁ బూర్వమీమాంసలోనియర్థమంతయు వ్యాసాదిమహర్షులును భీష్మాచార్యులును యుధిష్ఠిరునకు సందర్భానుసారముగఁ జెప్పియుండఁగా, శ్రీకృష్ణభగవాను లర్జునునకు భారతయుద్ధప్రారంభమునఁ జెప్పినయుత్తరమీమాంసార్థ (మనఁగా నుపనిషత్తులలోని వేదాంతార్థ)మంతయు భీష్మపర్వమున 'భగవద్గీత'యను పేర గ్రంథస్థము చేయఁబడియున్నది. ఈభగవద్గీతోపనిషత్తు పరమేశ్వరుఁడగు శ్రీకృష్ణభగవానునిముఖమునుండి స్వయముగ వెలువడినదగుటచే వేదాంతశాస్త్రమునఁ బ్రధానగ్రంథములలో నొకటిగఁ బరిగణింపఁబడి, ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమతస్థాపకులగు శ్రీమధ్వాచార్య, శంకరాచార్య, రామానుజాచార్యులవారలచేఁ బ్రత్యేకములుగ వ్రాయఁబడిన భాష్యములతో నలరారుచున్నది. ఇట్లు మహాభారతము వేదమందలి పూర్వోత్తరమీమాంసలకు (నసఁగాఁ గర్మకాండ, జ్ఞానకాండలకు రెంటికిని) సంబంధించినవిషయములకు నెలవైయుండుటకు మాత్రమేగాక, యాగ్రంథమునురచించుటలో శ్రీవేదవ్యాసమహర్షికిఁ గలయుద్దేశమీక్రిందిరీతిని దానియందుఁ దెలుపఁబడియున్నది:—

"తే. ..........................................................
చతురవాగ్విలాసుండు నిస్తత్త్వవస్తువేది సాత్యవతేయుండు వేదమయుఁడు. 80

పాండవులకీర్తిం బ్రకటించుటకును, మఱియుం గొందఱు జనపతులచరిత్రంబులు జనుల కెఱింగించుటకును, దేవదేవుండగు వాసుదేవునిసంక్రీడావిశేషంబులు వివరించుటకును, సర్వదేవజాతులజన్మంబులును దదీయసాయుజ్యంబులును దేటపఱచుటకును, సకలధర్మంబులునుం దెలుపుటకునుగాఁ బంచమవేదంబయిపరఁగు నిమ్మహాభారతసంహిత యొనర్చె; నిమ్మహితేతిహాసంబు సంవత్సరత్రయకృతంబు......... 81

శ్రీమదాంధ్రమహాభారతము,స్వర్గారోహణపర్వము, (ఆశ్వా. ౧.)

భారతకథాప్రారంభమునకుఁ బూర్వము, శౌనకాదిమహర్షులు వినఁగోరుకథను గుఱించి వారికిని సూతునకును జరిగినసంభాషణమునఁ గూడఁ బైవిషయములే తెలుపఁబడి, యిట్లిన్నివిధములగు నద్భుతవిషయముల కాకరమైయున్నందున మహాభారతముయొక్క విశేష మీక్రిందిరీతి నభివర్ణింపఁబడియున్నది:—

.... ... ... ... ... ...

"వ. అక్కథకుండు వెండియు నమ్మునిసంఘంబునకు నమస్కారంబు సేసి" యనేక పుణ్యకథాకథనదక్షుండ; వ్యాసశిష్యుండైన రోమహర్షణునకుఁ బుత్త్రుండ; నావలన నెక్కథ వినవలతు రానతిం" డనిన నమ్మును లిట్లనిరి.

క. "ఏయది హృద్య, మపూర్వం, బేయది, యెద్దానివలన నెఱుక సమగ్రం
బైయుండు, నఘనిబర్హణ, మేయది, యక్కథయె వినఁగ నిష్టము మాకున్." 29

వ. అనిన నుగ్రశ్రవసుం "డట్లేని మీకునభిమతంబైన పుణ్యకథఁ జెప్పెద; దత్తావధానులరై వినుం" డని శౌనకాదిమహామునులకుం జెప్పందొడంగె. కృష్ణద్వైపాయనుం డను బ్రహ్మర్షి తొల్లి వేదంబు లేకీభూతంబులై యేర్పడకున్న ఋ, గ్యజు, స్సా, మాథర్వంబులుగా విభాగించి తనశిష్యులైన పైల, వైశంపాయన, సుమంతు, జైమినులం బంచి క్రమంబునఁ జతుర్వేదసూత్రంబులఁ జేయించి వేదవ్యాసుండై, నిజతపోమహత్త్వంబునం జేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుండై, యష్టాదశపురాణంబులును, ధర్మశాస్త్రార్థతత్త్వంబులును, జతుర్వేదవేదాంతాభిప్రాయంబులును, జతుర్వర్గవర్గానుబంధబంధుర కథేతిహాసంబులును, జతుర్యుగప్రసిద్ధమహర్షి, రాజర్షి, వంశానుచరితంబులును, జతుర్వర్ణాశ్రమధర్మక్రమంబులును, జతుర్ముఖప్రముఖ నిఖిలసురమునిగణపూజితుండైన శ్రీకృష్ణునిమాహాత్మ్యంబును, బాండవాది భారతవీరులగుణంబులును, దనవిమలజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడి వెలుంగుచుండ,

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్షణసంగ్రహ మనియైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ యంబని మహిఁ గొనియాడుచుండ

ఆ. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ, డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై, పరగుచుండఁ జేసె భారతంబు." 31

శ్రీమదాంధ్రమహాభారతము. (ఆదిపర్వము.)

ఇట్లిన్నివిధంబులగు విశేషవిషయంబులతో నలరారుచుండుటచేతనే శ్రీమహాభారతము 'పంచమవేద' మనియు, 'లేఖ్యంబైన యామ్నాయ'మనియు (వ్రాయఁదగిన వేదమనియుఁ) దొంటివిద్వాంసులచేఁ గొనియాడఁబడినది. నాల్గువేదములతోను సమానమగు వైదికప్రమాణగ్రంథమగుటచే నైదవవేదమనియు, వేదములు గ్రంథరూపమున వ్రాయ వీలుగానివగుటచేతను, నీపంచమవేదము మాత్ర మట్లుగాక వ్రాయుటకు వీలైనదగుటచేతను, వానికిని దీనికినిగల భేద మీయొక్కవిషయమే తప్ప యితరవిషయములందును, బ్రామాణ్యతయందును నెట్టి భేదమును లేదని యుఁ బై వాక్యములయొక్కభావము. ఈకారణముచేతనే శ్రీమహాభారతము తక్కినవేదశాస్త్రములతో సమానమగు ప్రమాణగ్రంథముగ మనప్రాచీనచరిత్రలం దీక్కిందిరీతినిగీ ర్తింపఁబడుచున్నది.

౧. శ్లో. "... ... ... ... ... ...
వేదాః ప్రమాణం ప్రథమం స్వతఏవ; తతఃపరం,
స్మృతయశ్చ పురాణాని భారతం మునిపుంగవాః! 3౬౫
అన్యాన్యపి మునిశ్రేష్ఠా! శాస్త్రాణి సుబహూనిచ,
సర్వం వేదావిరోధేన ప్రమాణం: నాన్యవర్త్మనా." 3౭౫
... ... ... ... ... ...

సూతసంహిత, శివమహాత్మ్యఖండము, అధ్యా. ౧. (శ్లో. 3౬౫, 3౭౫.)

అనఁగా, "నో మునీశ్వరులారా! వేదములు స్వతః ప్రమాణములు; అటుపై స్మృతులును, బురాణములును, మహాభారతమును, నితరములగు పెక్కుశాస్త్రములునుగూడ వేదమునకు విరుద్ధములుగానందున (వేదమువలెనే) ప్రమాణములు; వేదవిరుద్ధములగు శాస్త్రములు ప్రమాణముకానేర"వని తాత్పర్యము.

౨. మఱియును (స్కాందమహాపురాణములోని పై)సూతసంహితయే మహాభారతమునుగూర్చి యింక నిట్లు ప్రశంసించుచున్నది:—

శ్లో. "... ... ... ... ... ... ...
వ్యస్తవేదతయా 'వ్యాస' ఇతి లోకే శ్రుతో మునిః. ౪౬౫
అయం సాక్షాన్మహాయోగీ వ్యాస స్సర్వజ్ఞ ఈశ్వరః,
మహాభారత మాశ్చర్యం నిర్మమే భగవాన్ గురుః." ౪౭౫
... ... ... ... ... ... ...

పైశ్లోకములకు మాధవాచార్యులవారీక్రిందిరీతిని వ్యాఖ్య వ్రాసియున్నారు.

......"వేదవిభాగే వ్యాసస్య నామనిర్వచనమేవ ప్రమాణమాహ: 'వ్యస్తవేదత'యే త్యర్థేన. 'వ్యస్తవేద'ఇతి: వేదా న్విభజ్య సమంతాచ్ఛిష్యే ష్వస్యతీతి'వ్యాసః'; వి-ఆఙ్-ఉపసర్గా పచాద్యచ్; వ్యస్తా వేదా శ్శివేనేతి వా, ఆత్మనైవ కర్త్రా మహర్షిరూపేణ నిజేనై వావతారాంతరేణ కరణేనేతి కరణేచాద్యుఙ్. ౪౬౫.సార్వజ్ఞం ప్రథయితుం సాకల్యేన చతుర్విధపురుషార్థప్రకాశకస్య మహాభారతస్య తేనైవ ప్రణయనమాహ: 'అయం సాక్షాన్మహాయో'గీతి. ఉక్తంహి:

శ్లో. "ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ!
యదిహాస్తి తదన్యత్ర; యన్నేహాస్తి నతత్క్వచి"దితి.

ఇదమేవహి మహాభారతప్రణయనం సాక్షాద్విష్ణోరవతార ఇత్యత్రగమకమ్; యదాహ:

శ్లో. "కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్;
కో హ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృద్భవే" దితి. ౪౭౫

... ... ... ... ... ... ...

దీనియర్థ మేమనఁగా:

'వ్యస్తవేదతయా' యనువాక్యముయొక్క యర్థముచేత, వేదములను విభాగముచేయుటలో వ్యాసుని పేరుయొక్క నిర్వచనమే ప్రమాణమగుచున్నదని తెలుపుచున్నాఁడు. 'వ్యస్తవేదుఁ'డనగా: వేదములనువిభాగించి సమగ్రముగ శిష్యులయందుంచినవాఁడు 'వ్యాసుఁ'డని (వ్యాకరణశాస్త్రమునననుసరించి) యర్థము; పరమేశ్వరునిచేతనే వేదములు విభాగింపఁబడినవి యనియైనను నర్థముచెప్పవచ్చును; (పరమేశ్వరుఁడే) తనయొక్క వేఱొకయవతారమేయైన (వ్యాస)మహర్షి రూపమున వేదములయొక్కవిభాగమునకు దానే కర్తయాయెను. ౪౭౫. (వ్యాసమహర్షియొక్క) సర్వజ్ఞత్వమునంతను దెలుపుటకుఁ (ధర్మార్థకామమోక్షములను) నాల్గువిధములగుపురుషార్థములను బ్రకాశింపఁజేయునట్టి మహాభారత మాయనచేతనే రచియింపఁబడినదని, 'అయం సాక్షాన్మహాయోగీ' యను పైశ్లోకమునఁ జెప్పుచున్నాఁడు. (అనఁగా: వేదములను విభాగముచేయుటచే లోకమున 'వ్యాసుఁ'డని పిలువఁబడునట్టివాఁడును, సాక్షాత్తు గొప్పయోగియును, సర్వజ్ఞుఁడును, నీశ్వరస్వరూపుఁడును, గురువును నగు నావ్యాసమహాముని యాశ్చర్యకరమగు మహాభారతమునునిర్మించె' నని యర్థము.) అంతియగాక, 'ధర్మే, చార్థేచ, కామేచ,' యను (పైఁగనఁబఱచిన) శ్లోకమునఁగూడ భారతముయొక్క మహిమాతిశయము చెప్పఁబడియున్నది. (దానియర్థము నాంధ్రమహాభారతమీక్రిందిరీతి ననువదించుచున్నది:

తే. "అమలధర్మార్థకామమోక్షములగుఱించి, యొలయు తెరువెద్దియే నిందుఁగలుగునదియ
యొండెడలఁగల్గు; దీనలేకుండుచొప్పు, దక్కొకంటను లేదు; వేదజ్ఞులార!"
శ్రీమదాంధ్రమహాభారతము, స్వర్గారోహణపర్వము. ఆశ్వా. ౧.

అనఁగా: 'వేదవిదులగు నోమునీశ్వరులారా! ధర్మమునకుఁగాని, యర్థమునకుఁగాని, కామమునకుఁగాని, మోక్షమునకుఁగాని, సంబంధించినవిషయ మేదియైనప్పటికిని, నీమహాభారతముననున్నవిషయమే యితరగ్రంథములం దుండును. దీనియందు లేనివిషయమిఁక నేగ్రంథమునను నుండ'దని, సూతుఁడు శౌనకాదిమహామునుల కెఱింగించుచున్నాఁడు.)

ఇట్టి మహాభారతరచనయే (వ్యాసుఁడు) సాక్షాత్తు విష్ణునియొక్కయవతారమని తెలుపుచున్నది. ఆవిషయమే, 'కృష్ణద్వైపాయనంవ్యాసం' అను పైఁగనఁబఱచినశ్లోక

మునఁగూడ జెప్పఁబడియున్నది. (ఆశ్లోకముయొక్కయర్థ మేమనఁగాఁ, గృష్ణద్వైపాయనుఁ డనుపేరుగల వ్యాసమహర్షిని నారాయణదేవుఁడని యెఱుఁగుము; నారాయణుఁడుతప్ప వేఱెవ్వఁడు మహాభారతమునకు గ్రంథకర్త కాఁజాలును?') ౪౬౫..."

3. మఱియును, శ్రీమధ్వాచార్యులవారు తమబ్రహ్మసూత్రభాష్యమునఁ బ్రమాణగ్రంథములగు వేదశాస్త్రములలో మహాభారతమునుగూడ నొకటిగఁబరిగణించి యీక్రిందిరీతిని దెలిపియున్నారు:—

శ్లో."ఋ, గ్యజు, స్సా, మాథర్వాశ్చ, భారతం, పాంచరాత్రకమ్,
మూలరామాయణంచైవ, శాస్త్రమి త్యభిధీయతే."

అనఁగా: ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, నథర్వవేదము, భారతము, రామాయణము, బాంచరాత్రకము నివియన్నియు శాస్త్రమను పేర వ్యవహరింపబడునని యర్థము.

౪. లోగడఁ బురాణములసందర్భమునఁ గనఁబఱచినవిధముగ భారతము వేద శాస్త్రములతో సమానమగుప్రామాణ్యమని 'సాహిత్యరత్నాకర'మను గ్రంథముగూడ, నీక్రిందిరీతిని జాటుచున్నది:—

"పురాణ, భారత, వచనానాం వేదరూపత్వేన ప్రామాణ్యం నిర్వివాదమ్,
'పురాణం పంచమోవేదః; భారతం పంచమోవేదః;' ఇతి తయో ర్వేదత్వోక్తేః"

—సాహిత్యరత్నాకరము.

అనఁగాఁ: "'బురాణ. మైదవవేద'మనియు, 'భారత మైదవవేద'మనియుఁ, జెప్పఁబడియుండుటచే, బురాణములును, భారతమును, వేదముయొక్కరూపములేయై, వేదమువలెనే ప్రమాణములగుచున్న"వని తాత్పర్యము.

ఈపైవిమర్శనముచే, వేదశాస్త్రములందుఁగల పూర్వమీమాంసావిషయములును, నుత్తరమీమాంసావిషయములును, (నన:గాఁ, గర్మకాండకుసంబంధించిన యన్నివిధములగు వర్ణాశ్రమధర్మాధర్మవిషయములును, జ్ఞానకాండకుసంబంధించిన వేదాంతవిషయములును) మాత్రమేగాక, ప్రసిద్ధులగు మహాపురుషుల చరిత్రవిషయములును, శ్రీకృష్ణభగవానుని దివ్యచరిత్రవర్ణనమును, నర్థశాస్త్రము, నీతిశాస్త్రము (నన:గా, రాజనీతి, దండనీతి,) మొదలగు వివిధశాస్త్రవిషయములును, ధర్మార్థకామమోక్షములనియెడి చతుర్విధపురుషార్థములకుసంబంధించిన వివిధగ్రంథములలోని సర్వవిషయములును మహాభారతముననే కలవనియు, నందుచే నది ప్రామాణ్యవిషయమున సర్వవిధముల వేదశాస్త్రములతో

పరిసమాపమగుటయేగాక,వానికంటె నెక్కుడుగౌరవమును గల్గియున్నదనియు (నీక్రింది వాక్యమువలనఁ గూడఁ) దెలియవచ్చుచున్నది.

"చతుర్భ్య స్సరహస్యేభ్యో వేదేభ్యో హ్యధికమ్......"

అనఁగా, "రహస్యములతోఁగూడిన నాల్గువేదములకంటెనుగూడ (మహాభారతము) మిన్న"యని యర్థము.

**పురాణేతిహాసముల విషయమై నవనాగరకులకుఁ గలసంశయములు వానికి సమాధానములు.**

**పదునెనిమిది మహాపురాణములను, మహాభారతమును, వ్యాసుఁడొక్కఁడే యెట్లు వ్రాయఁజాలును?**

పదునెనిమిది మహాపురాణములును, మహాభారతమును, నొక్కొక్కటి పెక్కువేలశ్లోకములుగల్గిన మిక్కిలి పెద్దగ్రంథములగుటచేతను, నొక్కొక్కగ్రంథమందలివిషయములు లెక్కింప నలవిగానివగుటచేతను, నందొక్కగ్రంథమునుబోలినదానినైనను సమగ్రముగ వ్రాయఁజాలిన సామర్థ్యముగలవారు సామాన్యముగ నిప్పు డెచ్చటను గానవచ్చుటలేదు. ఇఁక నాగ్రంథములన్నిటిని జేర్చినచో నెంతటిమహాగ్రంథమగునో యూహింపుఁడు! అట్టిమహాగ్రంథమును వ్రాయఁజాలినంతటి ప్రజ్ఞావంతుఁడును, నది వ్రాయుటకుఁ గావలసినయంతటి దీర్ఘకాలముజీవింపఁజాలిన యాయుష్మంతుఁడును నగు పురుషుఁ డిపు డొకడుండునని యూహించుటకైన నిఁక నవకాశముండఁజాలదు. ఇది ప్రస్తుతకాలమందలి జనసామాన్యముయొక్క యనుభవవిషయము. దీనినిబట్టి యాలోచించి, యట్టివాఁడొకఁ డెప్పుఁడునుండఁజాలఁడనియుఁ, గావునఁ బైగ్రంథములన్నియు వ్యాసుఁడొకఁడేవ్రాసియుండుట యసంభవమైయుండుననియు, వేఱువేఱుకాలములం దెవరో వేఱువేఱుపురుషులు పైగ్రంథములనువ్రాసి, వానియందు లోకులకు భక్తిశ్రద్ధ లేర్పడఁగలందులకై వానిని వ్యాసుఁడువ్రాసినట్లుకల్పించి వానిలో వ్రాసియుండవలయుననియు, మన నవనాగరకసోదరులుకొంద ఱూహింపసాగిరి. ఇట్టియూహకు మూలకారణము పైనదెల్పినరీతిగ, నట్టి యసామాన్యమగు సామర్థ్యముగలవా రెవ్వరును గూడ నీకాలమున మనకుఁ గానరాకపోవుటయే.

కాని, యంతమాత్రముచే నట్టిప్రజ్ఞావంతులుండుట యసంభవమనిచెప్పరాదు. ఏమనిన, నట్టివారు సామాన్యముగ మనముచూచినవారిలోను, మనకుఁ దెలిసినవారిలోను, లేకపోయినప్పటికిని నితరులలోనుండిన నుండవచ్చును. ఏలననఁగా. లోకమున మనమెఱుఁగనివారును మనముచూడనివారును ననేకులుండవచ్చును.

ఎట్లనిన, మనము ప్రపంచకమంతటిమాటను నటుంచి,యందులోని ఖండములలో మనము నివసించుచున్న 'ఆసియా' (Asia) ఖండమునను, నందులో సహితము తక్కిన దేశములనువిడచి మన'ఇండియా' (India) దేశమున(భరతవర్షమున)ను,దానిలోఁగూడ నితరరాష్ట్రములనువదలి మనము నివసించుచున్న రాష్ట్రమున (Presidency) లోను, నందును దానిలోని యితరజిల్లాలనులెక్కింపక మనమునివసించు ప్రత్యేకపుజిల్లాలోను, నందుసహితము తక్కినతాలూకాలను (Taluks) విడచివైచి మనముండుతాలూకా లోను, దానిలోసహితము తక్కినగ్రామములను, బట్టణములను, బల్లెలనువదలిపెట్టి మనముకాఁపురమున్నయూరిలోను, నివసించుచున్న జనులనుగుఱించి విచారించితిమేని, నాయూరిలోని జనులందఱినిగూడ మనమెఱిఁగియుండవలసిన యావశ్యకతయు, నందుల కవకాశమును, గానరాదు. అట్టి యవకాశముగలదని వాదముకొఱకు మన మంగీకరించినను, నట్లెఱుఁగఁజాలువారు నూటికొక్కరో, కోటికొక్కరో యుందు రేమో! అదియును సందేహమే! ఉందురనిగూడ నంగీకరించినప్పటికిని, నట్టివారు తాము నివసించుగ్రామములోమాత్రమే యందఱుజనుల నెఱిఁగియుండవచ్చును. కాని యిరుగుపొరుగూళ్లలోని యందఱినిగూడ నెఱుఁగశక్యముగాదు. అట్లు శక్యమగునని వాదముకొఱకంగీకరించినను గూడఁ జుట్టుప్రక్కల నేయొకటిరెండూళ్లలోని వారిలో యావన్మందినిమాత్ర మెఱుఁగఁజాలియుందురేమోగాని యంతకుమించి యెఱుఁగఁ జాలియుండరు. అంతవఱ కెఱిఁగియుండుటగూడ నసాధ్యమేయని కొంచెమైనను లోకజ్ఞానముగలవారికి వేఱుగఁజెప్పనవసరములేదు. ఇఁక నాతాలూకాలోనివారిని యావన్మందినినెఱిఁగియుండుట మొదలే దుస్సాధ్యము; జిల్లాలోనివారిమాట యంత కంటెనుదుస్తరము. రాష్ట్రములోనివారిమాట యంతకునుబైనదుర్ఘటము. దేశములోని వారినందఱిని నెఱిఁగియుండుట కేవల మసంభవము.ఖండము (Continent)లోని వారి మాట యిఁకఁజెప్పవలసినదేలేదు. ప్రపంచకమందలి యందఱి నెఱిఁగియుండుటను గుఱించి యిఁకఁ దలఁపవలసినపనియేలేదు. అంతకునుగూడ సాహసించి, యట్లుప్రపం చకమందలి యావన్మందిని నెఱిఁగినవారు సహిత మెవరైననుండవచ్చునని గూడ వాదము కొఱ కంగీకరించినప్పటికిని, నట్టివారు ప్రతివ్యక్తియొక్క శక్తిసామర్థ్యములనుగుఱిం చియుఁ బ్రజ్ఞావిశేషములనుగుఱించియుఁ వివరముగ నెఱిఁగియుండవలసిన యవసరము గాని, యందుల కవకాశముగాని, గానరావు. అందులకునునొడిగట్టి, యట్లెఱుఁగఁజాలిన వారుగూడ మనలోఁగొందఱున్నారేమోయని వాదముకొఱ కంగీకరించినప్పటికిని, వారైనను వారిసమకాలికులగు యావన్మందిని (contemporaneous people)ను, వారి లోని ప్రతివ్యక్తియొక్క శక్తిసామర్థ్యములును బ్రజ్ఞావిశేషములును మొదలగు గుణ

గణముల వివరములను, మాత్రమే యెఱిఁగియుండఁజాలుదురుగాని, యంతకుముందు సృష్టిప్రారంభమునుండి యిప్పటికాలమువఱకును గడచిపోయిన కొన్నికోట్లసంవత్సరములకాలములోఁ (బ్రపంచమందలి) వేలువేలుమూలలలోఁబుట్టి, పెరిగి, నశించిపోయిన పెక్కుకోట్లవ్యక్తు లందఱినిగుఱించియు, వారివారి ప్రత్యేకప్రజ్ఞావిశేషములనుగుఱించియు, వేలువేలుశక్తిసామర్థ్యములవివరమును గుఱించియు నెట్లెఱిఁగియుండఁజాలుదురు ? అట్లెఱిఁగియుండఁజాలుట సర్వజ్ఞుఁడును, నిత్యుఁడును, (అనగా సర్వకాలసర్వావస్థలయందును నుండువాఁడును), నగు సర్వేశ్వరునకుఁదప్ప యితరులగు మనుష్యమాత్రులకు సాధ్యమా ? సాధ్యమని మనలో వివేకముగలవారెవరైనను జెప్పసాహసింపఁగలరా ? అట్టివా రెవరైననున్నచో, నేఁడే ముందునకురమ్మనుఁడు చూతము ! వారున్నయూరిలోనే, వారి సమకాలికులలోనే, వారికిఁదెలియక యితరులకుమాత్రమే తెలిసినవారెందఱులేరు ? అట్టివారిలో నొక్కనిగుఱించిన వివరములవిషయమై యామనుష్యుని బ్రశ్నించి, యతని సర్వజ్ఞత్వము నొక్కనిముసములోఁ బరీక్షించి, యదియసత్యమని ఋజువుచేయవచ్చును ! కావున, నట్లు ప్రపంచకమున సృష్టికాలమునుండియు గడచిచనిన యావన్మందివ్యక్తులయొక్కయుఁ బ్రజ్ఞావిశేషములనుగుఱించి యెఱుఁగఁజాలినవారు మనలో నొక్కరైనసుండుట కేవలమసాధ్యములో నసాధ్యమనియు, నసంభవములో నసంభవమనియుఁ జెప్పనక్కరలేదా ? చెప్పియేతీరవలయును ! అప్పుడిఁక మనకుఁగల యతిస్వల్పమగు లోకానుభవమును బ్రపంచకమున సృష్ట్యాదినుండియుఁ గడచిచనిన విషయములతోఁ బోల్చిచూచినచో నది యందెన్నవపాలుండునో యించుకనూహింపుఁడు. కాఁబట్టి, యట్టి యత్యంతస్వల్పమగు మనలోకానుభవమున మన మెఱిఁగియున్న కొలదిమందిజనులలో నెవ్వరికిని లేని సామర్థ్యము, లోకమునమిగిలియున్నవారిలో నిఁక నెవ్వరికినిగూడ నుండనేగూడదా ? మనకీనాఁడు గానరానంతమాత్రమున మనము చూచియెఱుఁగని విశేషవిషయ మేదియు లోకమున జరిగియుండనేగూడదా ? అట్లుజరిగియుండదనుట లోకజ్ఞానములేనిబాలుఁడు చెప్పఁదగినమాటగాని, ప్రాజ్ఞుఁ డట్లుచెప్పవచ్చునా ?

అంతియగాక, లోకమున నేవిషయమందైనను నసాధారణప్రజ్ఞగలవారు సహజముగ మిక్కిలితక్కువగనేయుందురు. అ ట్టిరుదుగనుండువా రేదేశముననో యేమూలనో యేకాలముననో మాత్రమే యుందురుగాని, యన్నిచోట్లను నన్నివేళలందును దఱచుగాఁగానరారు. అందుచే, నట్టివారిని జూచినవారు కొలదిమందియుఁ, జూడనివారు పెక్కుమందియునుండుట మిక్కిలిసహజము. అంతమాత్రముచే నట్టి ప్రజ్ఞావిశేషములు గలవారు లేరనియేచెప్పవచ్చునా ? ఇందులకు నిదర్శనముగఁ బ్రస్తుత

కాలమున శరీరదార్ఢ్యమున జగత్ప్రసిద్ధిగాంచి, యాశ్చర్యకరములగు నసాధారణ ప్రదర్శనము లొనర్చుచున్న పురుషులలో శ్రీ కోడి రామమూర్తినాయుఁడుగారిని; స్త్రీలలో 'లేడీ-శాండో' Lady-Sandow తారాబాయిగారిని; మఱియు గణితశాస్త్రమున నిరుపమానమేధాశక్తిని బ్రదర్శించి విదేశీయవిద్వాంసులను సహితము తలయూపునట్లు చేసి యిటీవలఁ గొంతకాలముక్రిందటఁ గీర్తిశేషులైనవారును, జెన్నరాష్ట్రవాస్తవ్యులును, నగు రామానుజముగారిని; నట్లే, ప్రకృతిశాస్త్ర పరిశోధనవైచిత్ర్యములచే విదేశీయపండితుల కచ్చెరువుగొలిపియున్న జగదీశచంద్రబోసుగారిని; నారీతిగనే కవిత్వనైపుణ్యమునఁ బేరెన్నికఁగన్న రవీంద్రనాథఠాకూర్‌గారిని; బ్రజాప్రబోధముచే దేశమును వశపఱచికొనుటలో నగ్రగణ్యులైన శ్రీ గాంధీగారిని; మనదేశమందుమాత్రమే గాక ప్రపంచకమందలి వేఱువేఱుమూలలఁగూడఁ బాముకఱచినవా రెంతదూరమున నున్నను వారియొక్క పేళ్లను, వారున్నయూళ్ల పేళ్లను, దంత్రీవార్త (Telegram-'టెల్లిగ్రామ్' లేక Telephone-'టెల్లిఫోన్')మూలముననే విని తెలిసికొని తోడనే మంత్రచికిత్సచేసి వేలకొలదిమనుష్యుల ప్రాణములనురక్షించుచు మంత్రసిద్ధులైయున్న పోలిరెడ్డిపాలెములోని 'రైల్వే-స్టేషన్-మాస్టర్' Railway Station-Master గారగు *వేమూరి నరసయ్యగారిని, జూచియెఱుఁగనివారు మనదేశముననే యీకాలముననే యెందఱులేరు? అట్టిజనులు పైప్రజ్ఞావంతులను జూడఁజాలకున్నను, వారియొక్క విచిత్రమగు ప్రజ్ఞావిశేషములనుగుఱించి వినుట తటస్థించినపుడు వారేమనితలంచుకొనవలయును? తాము చూచియుండకపోయినప్పటికిని నట్టివా రుండవచ్చుననియే తలంచినచో నది సత్యమునకు సంబంధించియుండునా? కాక, యట్టివారి నెచటను దమలోకానుభవమునఁ జూచియుండనందున నట్టివారుండుట ప్రత్యక్షలోకానుభవవిరుద్ధమనియు, నసంభవమనియుఁ దలంచినచో నది సత్యముకాఁజాలియుండునా? అట్టిది యసంభవమనితలంచినచో వారికి లోకజ్ఞానము శూన్యమని వేఱుగఁ జెప్పనక్కరలేకయే పైయుదాహరణములచేఁ జక్కఁగబోధపడుచున్నది. ఆరీతిగనే, వ్యాసమహర్షి

---

* వీరిని, వీరియత్యద్భుతమగు ప్రజ్ఞావిశేషమును, మేము పెక్కుమారులు స్వయముగఁ జూచుట తటస్థించియున్నది. అంతియగాక, యీక్రిందివార్త దానిని దృఢపఱచుచున్నది: "పోలిరెడ్డిపాళెము 'రైల్వేస్టేషనుమాస్టరు' శ్రీనరసయ్యగారు మంత్రశక్తివల్ల పాముకఱచినవారికి చికిత్సగావించువార్త 'లండను' (London) నగూడ వ్యాపించెను. 'లండను'నుండి తంతె రాగానే పాముకరచినవానికి నెమ్మదిగలిగెను. ఇప్పటికి 79,000 మందిబాధను వీరు ఈతీరున నివారించిరి."

—"త్రిలిఙ్గ"పత్రిక, (19-11-1934 తేదీ) సంపు. 15, సంఖ్య: 47, పుట 9.

యొక్క ప్రజ్ఞావిశేషముగూడ మనము ప్రస్తుతకాలమునఁ జూచియున్నకొలదిమంది జనులలో నెవ్వరికిని లేనప్పటికిని, నంతమాత్రముచే నది యసంభవమనియు, లోక విరుద్ధమనియు మనము తలంపరాదు. అట్లుతలంచినచో నది మనయొక్క లోకజ్ఞాన విహీనతనుమాత్రమే చాటునని పైవిమర్శనముచే విశదమగుచున్నది.

కాని, మననవనాగరకుల కిచట మరల నొకసంశయము గలుగవచ్చును. ఏమనినఁ: "దైనచెలుపఁబడిన యసాధారణప్రజ్ఞావంతులగు రామమూర్తినాయుఁడు గారును, తారాబాయిగారును, మొదలగువారిని జూడనిజనులు వారిప్రజ్ఞావిశేషములను నమ్మకున్నచో, నాజనులున్నచోటి కాప్రజ్ఞావంతులను దీసికొనివెళ్లియో, కావున్న, వారున్నచోటికి వీరినిదీసికొనివచ్చియో, యొకరికొకరినిజూపి వారిప్రజ్ఞావిశేషము లను బ్రదర్శింపఁజేసి, ప్రత్యక్షముగఁగనబఱచి, ఋజువుచేసి, యట్టిజనులను నమ్మింపఁ జేయఁగలము. కాని, వ్యాసులవారి కట్టిప్రజ్ఞగలదని పూర్వాచారపరాయణు లెట్లు ఋజువుచేసెద"రని మననవనాగరకసోదరులు మనలను బ్రశ్నింపవచ్చును. ఐనచో "దైనచెల్పిన కీర్తిశేషులగు రామానుజముగారివిషయమున మీరేమిచేయుదురు? వారున్నయెడకు వీరినిదీసికొనివెళ్లెదరా? కాక వీరున్నయెడకు వారినిదీసికొనివచ్చెదరా?" యని మనము మనసోదరుల నడుగవలసివచ్చును! అపుడు వారేమి బదులుచెప్పుదురు? "అట్టిప్రజ్ఞావంతులుండుట యసంభవ"మని రామానుజముగారిని జూచియెఱుఁగని జనులు చెప్పుమాటనంగీకరించెద మందురా? అది సత్యదూరముకాదా? కావున నట్టిజను లకు వారేమిసమాధానమును జెప్పి యొప్పింపఁజూచెదరు? "రామానుజముగారు (కీర్తి శేషులైయుండుటచే) నిపు డీలోకమునఁ గానరానప్పటికిని, గొందఱు వారినిజూడ లేనంతమాత్రమున నట్టివారుండుట యసంభవముగాఁజాల"దని సమాధానముచెప్పక తప్పదు! ఆసమాధానమే వ్యాసులవారివిషయమునఁ గూడ మనము మననవనాగరక సోదరులకుఁ జెప్పవలసియుండును!! ఎట్టిప్రజ్ఞావంతులైనను లోకమున నెల్లకాలము నుండఁబోరు. ఇందులకుఁ దైనచెల్పినరామానుజముగారే నిదర్శనము. అట్టివారు లోక మున నున్నంతవఱకే వారిప్రజ్ఞలను గొందఱుజనులు ప్రత్యక్షముగఁ జూడఁజాలియుఁ జూపఁజాలియునుందురు. కాని, యటుపై వారుమాత్ర మేమిచేయఁగలరు? ఆకాల మున జీవించియుండి యట్టిప్రజ్ఞావంతులను జూచినవారివాక్యములును, వారువ్రాసి యుంచిన వ్రాతమూలకములగు నాధారములును, నట్టివారినుండి బయలుదేరి వంశ పారంపర్యముగవచ్చుచుండు లోకప్రతీతియునుమాత్రమే యట్టిప్రజ్ఞావంతు లొకప్పు డుండిరనుటకు సాక్ష్యముకాఁజాలును. వ్యాసులవారివిషయమునఁగూడ సర్వవిధముల నట్లేయగుచున్నది. ఇందులకు వలసినప్రమాణములను లోగడఁ జూపియేయున్నాము.

ఇప్పటి ప్రజ్ఞావంతులు గడచిచనినపిదప వారియొక్క ప్రజ్ఞావైచిత్ర్యములను గుఱించి రాఁబోవు కాలమందలిజనులు, వానిని "ప్రత్యక్షప్రమాణములకు వ్యతిరేకము" లనియు "మూఢనమ్మకము"లనియు వాదించినచో నది యెట్లు వివేకమనిపించుకొనదో, యదేరీతిగ వ్యాసులవారి ప్రజ్ఞావిశేషము "ప్రత్యక్షప్రమాణములకు వ్యతిరేక"మనియు, "నట్టిది మూఢనమ్మక"మనియు, "లోకానుభవవిరుద్ధమనియు వాదించుటగూడ వివేకమనిపించుకొనఁజాలదని పైవిమర్శనముచే ఋజువగుచున్నది. ఇందువిషయమై యింకను విశేషము తెలియఁగోరువారీగ్రంథమందలి మొదటి ప్రకరణమునఁ, "ప్రాచీనచరిత్రకారుల గుణసంపదయెడఁ గలసంశయములు; వానికి సమాధానములు" నను శీర్షిక క్రిందఁ జూడవచ్చును.

అంతియగాక, పైనచెల్పిన వ్యాసమహర్షి వంటి యసాధారణమేధావంతులు పూర్వకాలమున నుండియుండుట యసంభవము కానేరదని వేఱొకకారణముచేతఁ గూడఁ జెప్పవచ్చును. ఏమనఁగాఁ, గాలముగడచిపోయినకొలఁదిని జనులయొక్క శరీరదార్ఢ్యములను, నింద్రియపాటవములను, గ్రమక్రమముగఁ దగ్గిపోవుచున్నసంగతి సామాన్యముగ లోకానుభవముగలవారు పెక్కుమంది యెఱిఁగియే యుందురు. ఇందులకునిదర్శనముగ, మనపూర్వులగు మనముత్తాతలకును, తాతలకును, దండ్రులకును గల శరీరసౌష్ఠవములను, నింద్రియపటుత్వములను, నోపికలను, మనకుఁగలశరీరబల సామర్థ్యములు మొదలగువానితోఁ బోల్చిచూచుకొనినచో, నీసంగతియందలిసత్యము బోధపడఁగలదు. ఆదేవిధముగ, వారికిగల తెలివితేటలను, బుద్ధిబలమును, జ్ఞాపకశక్తియుఁ, బుద్ధిసూక్ష్మతయు, మొదలగు మేధాసంపదను మనకుఁగల మేధాసంపదలలోఁ బోల్చి చూచినచో నదిగూడఁ గ్రమక్రమముగఁ దరములవెంట క్షీణించుచు వచ్చుచున్న సంగతి విశదముకాఁగలదు. ఇందువిషయమై శ్రీగోవర్ధనపీఠాధిపతులగు శ్రీపూరీ శంకరాచార్య (జగద్గురు శ్రీభారతీకృష్ణతీర్థ) స్వాములవారు 1933 సం॥ ఫిబ్రవరి నెల 14-వ తేదీన మద్రాసు 'పార్కు-టౌన్' లోని శ్రీస్కందస్వామివారి వసంతమంటప భవనమునఁగావించిన "భారతవర్షముయొక్క ఘనతలోనిరహస్య" మను నుపన్యాసమందలి యమూల్యవిషయములను ("ధర్మరాజ్య" పత్రికలోఁ బ్రకటింపఁబడినవాని) నీదిగువఁ జూడఁదగును:—

## THE SECRET OF INDIA'S GREATNESS.

*    *    *    *    *

### THE PHYSICAL ASPECT.

"All these facts considered, it is clear that, in spite of the marvellous achievements of Modern Science in this direction, the Progress that we have made has really and actually been in the

wrong direction. In short, we have been *advancing backward* all the time and seem to be in danger of even now not refraining from this kind of Advance and Progress."

—"Dharmarajya," Vol. 1, No. 26, pp. 7&8, (14-7-1934.)

## THE INTELLECTUAL ASPECT.

"In reply to all this detailed disquisition of ours in the nature of a comparison and contrast between India's Past and Present in respect of the *physical* aspect of life, the modern, pro-western and reformistic critic might retort: "Whatever may be the case in the *physical* side, we English - educated Indian young men of the Western type are, by virtue and consequence of the wonderful methods and system of Modern Education undergone by us, are, at any rate, *intellectually* superior to the old fashioned people of the ancient type in the land!" As we began this discourse by laying down the dictum that any inquiry into such matters must be of an absolutely unprejudiced character and based upon the strictest conceivable considerations of "the Truth, the whole Truth, and nothing but the Truth," we shall have, on this point too, to clear our minds of all prejudices and prejudiced impressions forced into our brains by the western *propagandists*' repeated process of continuous dinning of baseless falsehoods into our ears, divest our heads and our hearts of all the rubbish pumped there into by a Macaulay's historic—and in another sense, absolutely unhistoric—"India Past and Present" and other such falsehood manufacturing and pumping machinery, and go into a perfectly impartial and independent investigation of the real *fact* of the matter by instituting a careful, thoughtful and thorough comparison and contrast between India's past and present in the department of Mental, Intellectual, and Educational achievements too!

## THE ANCIENT LEARNING.

We need not go into a detailed analysis of comparative position as regards Ancient India's mastery over Sanskrit Literature, philosophy and Science in all their branches and departments and Modern India's pathetically attenuated position in all these respects! The actual Historical fact with regard to *our*

*forefathers, not merely of a very remote period but even of recent generations*, was that they were called upon to spend more than 12 out of each day's 24 hours over the performance of a huge lot of Karmakanda and Upasanakanda and, in addition thereto, to study the enormous and labyrinthic contents of the four Vedas,the four Upavedas,the six Vedangas,the six Shastras and a huge mass of other literature of a most recondite character ! And this, they did, to such tremendous purpose and with such splendid effect, that they achieved wonderful, nay, miraculous success therein to the extent that after daily performing all the elaborate Karmakanda prescribed for them by the Shastras and studying their Scriptures, they could and did write wonderful works in all the various branches of Knowledge (Religious, Philosophical, Scientific, Artistic, Political, Economic, Commercial and so forth) books which the greatest Literary, Philosophical, Scientific, and other authorities of the Western world to-day bow down before with the highest admiration and loftiest eulogy imaginable, and describe not as masterpieces but as the Highest Courts of Appeal in their respective departments !

## OUR PRESENT CONDITION.

Over against this picture, can you conceive of even a single Indian who will not be agonised and tortured by the contemplation of the other actual picture of the present-day life in India wherein, although we are not actually performing a hundred part of—nay, pride ourselves on our having shaken ourselves off from the thraldom of such elaborate Karmakanda and Upasanakanda—and can there fore naturally find more time and scope than our ancients could, for the purpose of our own intellectual improvement and educational progress, and although we are also having the additional advantage of having all the requisite Literature before us in the shape of printed books and have therefore not got to waste a lot of our time over the copying of voluminous text books with our own hand as our ancients have to do, yet the ugly fact cannot be gainsaid that, far from being able to make and leave our mark on the world's Intellectual life by means of original Literary and other such compositions deserving to be

described even as elementary first courts (let alone High Courts of Appeal) in their respective departments, the success which we are achieving even in respect of the mere study of the Shastras can only be described as *nil* or next to *nil*! Whereas it was an ordinary—nay, common place, for our forefathers to become masters of the *six* Shastras, it is difficult for us to find, at the present day, persons who are entirely up to the mark in respect of even *one* of them! ... ... ... ...

## MODERN SUBJECTS.

In reply even to this, our modern-educated and pro.western young men may retort: "Oh! these ancient subjects of yours (i. e., Indian Metaphysics, Psychology, and so forth) are things which we do not care for and therefore pay no attention to! Our inferiority in respect of such subjects can be no proof of our intellectual inferiority; but if we are taken and examined in our own particular line which we have a taste for, feel worth studying and have actually exercised our intellectual faculties in, we can then easily show our mental capacities, and our intellectual and educational achievements. And this alone would be a just and fair basis for a comparison calculated to lead one to a correct conclusion in the matter!".............let us test the capabilities and achievements of these educated young men of present day India in those very subjects, which they themselves express their taste and inclination for, and pride themselves on their mastery over, or at least progress in! And let us take for examination, not an abstruse or difficult branch of Knowledge but that preliminary subject which comes at the very commencement of our English education, viz., the study of English language and literature!

## ENGLISH LANGUAGE AND LITERATURE.

In English Literature too, there are such beautiful things as the works of Milton, Browning, Carlyle, Emerson, Wordsworth and other such great masters and memorable ornaments of English Literature. But what is the position of our students towards these masters and masterpieces of English Language and Literature? The simple and honest truth is, that we shall pay

lip-homage to those great writers and their works but we don't *read* them; nay, when in a certain year as occasionally happens, a poem like Browning's Rabbi Ben Ezra, Wordsworth's Excursion, Carlyle's Sartor Resartus or other such real gem of English Literature is prescribed as a text-book, not for the F. A. or the B. A. examination but for the M. A. degree itself, we find not merely the students but even the Professors bewailing their lots as unfortunate people because, during that particular year they have been called upon to study and to teach respectively, such masterpieces of English Literature! And what is the cause of all this sorrow and lamentation? Not that the books are really and intrinsically too difficult and stiff, but that the very trend thereof, namely of solid, serious and substantial thinking, is disliked by teachers and taught alike!

## OUR TEMPERAMENTAL PREDELICTION.

And what is the kind of subject which we, with our boasted superiority and keenness of intellect, feel congenial to our own frame of mind and intellectual bent, and take kindly to on account of our temperamental predeliction? There is no denying the fact that we look askance at, fight shy of, and as far as practicable, try to run away from all such solid matter and spend as much of our time as we possibly can, with what is called *light literature*, i. e., novels, story books and so on! But even here, the lamentable fact has to be placed on record for the edification of us all and for the humbling of the pride of us all, that although even among the novel-writers, we have such splendid masters as Sir Walter Scott, Charles Dickens, Thackeray, George Eliot, Charles Reade and others in the first rank of English Fictional Literature, most of us can only pay our lip homage to these writers, but we hate to have any of their works as text-books at our examinations! And, even while reading such English Literature, when we come across in the pages of Scott, George Eliot and other such writers, a beautiful description of a Natural Scenery (i. e., a forest, a sun-rise, a sun-set and so forth,) we quitely turn these pages over and push forward in search of the plot of the story! Is this the proof and token of our boasted

keenness of intellect? Or rather is it not the clearest and the most eloquent conceivable proof that as on the physical side, we have become dyspeptics, incapable of digesting solid stuff (which our aged parents even at the present day think nothing of,) exactly so on the intellectual side too we have become dyspeptics, incapable of digesting solid stuff and profiting by assimilation thereof! In other words, shallowness,—not profundity—of thought is the chief characteristic of our present day Intellectualism!

## DIVISIONS OF SCHOOL PERIODS.

It is unnecessary for us to go into further details of such matters for a correct analysis of the real position in this respect. A still simpler and a much clearer proof of our intellectual deterioration (including our incapacity to concentrate our mind even for a short while on matters of worth and of moment) is to be found in the fact that, whereas, during *our* own school and College days we used to have one-hour periods for each subject, and relief used to be given to us from the strain of continued attention to one subject, by change of subject after one hour, Educational "*progress*" has at the present day gradually reached the position that even one hour's attention to one subject has been found to be too great a strain for young brains, and therefore, 50 minutes, 45 minutes, and 40 minutes periods have begun to be gone in for as involving less strain to the brain!

## OUR PATHASALAS (पाठशालाः)

Along side of this,let us note and remember the actual fact of experience even of the present day, that, in our Sanskrit Pathasalas, we have the daily spectacle of young children studying for hours together at one sitting, such poems as Mahakavi Magha's Sishupalavadha (a study whereof requires intense intellectual concentration)! For example, the second canto of Magha describes the Cabinet Meeting, so to speak, of Shri Krishna, Shri Balarama and Uddhava resolving in favour of their attending Raja Yudhishthira's Rajasuya Yaga; and cantos 3 to 12 contain a detailed description of Shri Krishna's journey from Dwaraka to

Hastinapura! One canto is devoted to the description of the architectural and other beauties of Dwaraka city, one canto to the elaborate and beautiful description of sunset, one to the description of the beauties of the night, one to the description of sunrise, one to the description of forest scenery and lakes and tanks and so forth! Each one of these cantos contains between sixty to hundred shlokas in the nature of most poetic description full of *Utpreksha* and other beautiful Alankaras; and it is at the end of the 12th canto that the thread of the plot of the story is taken up again and we are told that Shri Krishna reached the banks of the Jumna. And little children are called upon to and do study such long, detailed, elaborate, and ornate poetry of the highest literary character without undergoing any such strain of the brain. Placing these two pictures side by side, any impartial person can infer for himself where the strength, solidity and keenness of intellect really is,—whether it is on the side of the despised persons of the old fashioned type, or in the self advertising specimens of modern Indian humanity!"

—'Dharmarajya,' Vol. 1, No. 32, pp. 7 to 9 (25-8-34.)

దీనియర్థ మేమనగా:—

"భారతవర్షముయొక్క ఘనతలోని రహస్యము."

*    *    *    *    *

"శరీరవిషయము."

...    ...    ...    ...    ...    ...

"ఈ (పై)విషయములనన్నిఁటినిబట్టి యాలోచింపఁగా, నీసందర్భమునఁ బ్రస్తుత కాలపు ప్రకృతిశాస్త్రమద్భుతమగు కృషిసల్పియున్నప్పటికినిగూడ,మనముపొందినయభి వృద్ధి నిజముగ నధోమార్గమును బొందియున్నది. వేయేల! యింతవఱకును మనమధో గతికిఁబోవుచు, నట్టియధోమార్గమునుండి యిప్పటికైనను మరలక యపాయమును బొందుచున్నట్లగపడుచున్నది."

"ధర్మరాజ్య"పత్త్రిక, సంపు. 1, సంచి. 26, పుటలు 7, 8 తే(14-7-1934) ది

"బుద్ధివిషయము."

జీవితవిషయమున శరీరస్థితినిగుఱించి భారతవర్షముయొక్క ప్రాచీన, నవీన పరిస్థితులను సరిపోల్చుచు మేముగావించియున్న విపులవిమర్శనమునకుఁ, బాశ్చాత్య

నాగరకతాభిమానియగు నవీనసంఘసంస్కారివిమర్శకుఁ డీక్రిందిరీతిని బదులుచెప్ప వచ్చును: "శరీరవిషయమున నెట్లున్నప్పటికిని, నింగ్లీషువిద్య నేర్చి, పాశ్చాత్యనాగరకతనవలంబించిన భారతీయయువకులమగు మేము, మాయభ్యసించిన యాధునికవిద్య యొక్క యద్భుతవిధానముల ప్రభావవిశేషముచేత, నీదేశమందలి పూర్వకాలపు ప్రాతనాగరకజనులకంటె నేవిధముగనైననుగూడ బుద్ధిబలవిషయమున మిన్న"యని బదులుచెప్పవచ్చును. మే మీయుపన్యాసమారంభించునపు డిట్టివిషయములనుగుఱించి చేయు నెట్టివిచారణయైననుగూడఁ, గేవలదురభిమానరహితముగ నుండవలయుననియు, సత్యముపైనను, గేవలసత్యముపైనను,యొక్కసత్యముపైనమాత్రమునే యాధారపడియుం డవలయుననియు నొకనిశ్చయము నేర్పఱచియుండుటచేఁ, బాశ్చాత్యప్రచారకులవలన మనచెవులలో నెడతెగకనింపఁబడిన నిరాధారములగు నసత్యబోధలచే మనమనస్సులలో నేర్పడినదురభిప్రాయములను, దురభిమానములను, నీవిషయముఁనఁగూడ మనమువిడనాడి, చారిత్రక సంబంధమైన—వేఱొకరీతిగఁ జారిత్రకసంబంధము కానే కానటువంటి— 'మెకాలే'దొరవారి "పూర్వకాలమందలియుఁ, బ్రస్తుతకాలమందలియు భారతవర్షము" మొదలగు నసత్యనిర్మాణములనుగావించి బోధించుసాధనములచే మనమనస్సులందును మనహృదయములందును నేర్పడినకలుషమును మనముతొలఁగించుకొనవలయును;పూర్వకాలమందలియుఁ బ్రస్తుతకాలమందలియు భారతవర్షముయొక్క మానసిక, బుద్ధివైభవ, విద్యాభివృద్ధులనుగూడ జాగ్రత్తగను, విచారణపూర్వకముగను నామూలాగ్రముగను సరిపోల్చిచూచి, శుద్ధనిష్పక్షపాతమును, స్వతంత్రమును నగువిచారణమునకు మనము దొరకొనవలయును.

... ... ... ... ...

## "ప్రాచీనవిద్యావిషయము."

సంస్కృతవాఙ్మయమునను, నాధ్యాత్మికవిద్యయందును (నసఁగా, వేదాంతమునను,) బ్రకృతిశాస్త్రములందును, వానికిసంబంధించిన సర్వశాఖలయందును, బ్రాచీనభారతవర్షమునకుఁగల సంపూర్ణసామర్థ్యముయొక్కయు, నట్టివిద్యలందుఁ బ్రస్తుతకాలపు భారతవర్షమునకేర్పడిన నీరసస్థితియొక్కయు వివరములను మనమిపుడు విడదీసి, సరిపోల్చి పరిశీలింపవలసినపని లేదు! అత్యంతపూర్వకాలపువారి మాటమాత్రమే గాక, యిటీవలితరములకుఁజెందిన మనతాతముత్తాతలయొక్క చారిత్రకస్థితిగూడ నెట్టిదనఁగాఁ, బ్రతిదినమందలియు నిరువదినాలుగుగంటలలోఁ బండ్రెండుగంటలకంటె నెక్కువకాలమును మిక్కిలివిస్తారమగు కర్మకాండ నాచరించుటయందును, నుపాసనకాండ ననుష్ఠించుటయందును వారు గడపవలసియుండెడిది;దానికిఁదోడుగ, నాల్గువేద

ములందలియు, నాలుగుపవేదములందలియు, నాఱువేదాంగములందలియు, షట్ఛాస్త్ర ములందలియు నసంఖ్యాకములగు చిక్కువిషయములను, నత్యంతకఠినములగు నితర శాస్త్రములను బెక్కింటినిగూడఁ జదువవలసియుండెడిది! దీనిని వా రత్యద్భుతముగను, నతిరమణీయమగు ఫలముగల్గునట్లును నాచరించియుండిరి; అందు వా రత్యద్భుతమును, మిక్కిలివిచిత్రమునునగు జయమునుబొంది, శాస్త్రముచేఁ దమకు నిధింపఁబడినవిస్తార మగు కర్మకాండనంతను ననుష్ఠించి, శాస్త్రములనెల్ల నభ్యసించి,పిమ్మట నన్నివిద్యాశాఖల లోను నద్భుతములగు వివిధగ్రంథములను వ్రాయఁజాలియు, వ్రాసియు నుండిరి; (మత సంబంధమైనట్టియు, వేదాంతసంబంధమైనట్టియుఁ, బ్రకృతిశాస్త్ర సంబంధమైనట్టియుఁ, గళలకు సంబంధించినట్టియు, రాజకీ, యార్థిక, వాణిజ్య సంబంధములైనట్టియు) వారు వ్రాసినగ్రంథములముందర, వాఙ్మ, యాధ్యాత్మిక, ప్రకృతిశాస్త్రములు మొదలగునితర శాస్త్రములలోఁ బాశ్చాత్యఖండమునఁ బ్రామాణికులగువా రత్యంతప్రశంసాపూర్వకము గను, నూహింప నలవికాని యున్నతస్తోత్రపూర్వకముగను దలలొగ్గియున్నారు. వా రాగ్రంథములను బ్రజ్ఞావిశేషములుగమాత్రమేగాక, యాయాశాఖలలో నత్యున్నత ప్రమాణములుగఁ బొగడుచున్నారు!

## మన ప్రస్తుతస్థితి.

దీనిముందరఁ, బ్రస్తుతకాలపుభారతవర్ష పరిస్థితినిగూర్చి తీవ్రముగ నాలోచిం చినయెడల మిగులఁబరితాపమునొందని భారతీయుఁడొక్కఁడైన నుండునని మీరు తలంపఁజాలుదురా? అట్టి యతివిస్తారమగు కర్మకాండలోను, నుపాసనకాండలోను, పసనము సరిగా నాఱవపాలయిననుగూడ నాచరించుచుండుటలేనప్పటికిని,అంతియగాక, యట్టికర్మకాండోపాసనకాండలయొక్క దాస్యమునుండి మనలనువదలించుకొనియుంటి మని మనము గర్వించుచున్నప్పటికిని,—నందువలన మనజ్ఞానాభివృద్ధికిని, విద్యాభివృద్ధి కిని, మనపూర్వులకంటె మనకెక్కువవ్యవధియు నవకాశమునున్నప్పటికిని, దానికిఁ దోఁడుగ మనపూర్వులవలె మనము శ్రమపడి పెద్దపెద్దగ్రంథములనుజూచి ప్రతులు వ్రాసికొని కాలమును వ్యర్థముచేయవలసినయగత్యములేక మనకుఁగావలసిన గ్రంథ సామగ్రియంతయు నచ్చుపుస్తకముల రూపమున మనముందర సిద్ధముగనున్నందున మన కాసౌకర్యమొకటి యెక్కువగలభించియున్నప్పటికిని, మనఖ్యాతిని లోకమునందలి విజ్ఞానజీవితమున నెలకొల్పఁజాలినరీతిని వాఙ్మయాదులగు నాయాశాస్త్రములందు (నత్యున్నతప్రమాణముల మాటఁబోనిచ్చి) సామాన్యప్రమాణములనియైనను జెప్పఁదగిన స్వతంత్రగ్రంథములను గొంచెముగూడ మనమువ్రాయఁజాలకపోఁగా, నట్టిశాస్త్రములను గేవలము జదువుటలోఁగూడ మనమొందుచున్న జయము శూన్యమనియో, నంతకంటెను

గ్రిందిదనియోమాత్రమే నుడువఁదగియున్నది! మనతాతముత్తాతలు షట్ఛాస్త్రముల లోను నిపుణులైయుండుట వారిలో సర్వసామాన్యమైయుండఁగా, వానిలో నొక్కదాని యందైనను బరిపూర్ణ పాండిత్యముగలవారి నొక్కరినైనను బ్రస్తుతకాలమున మనము గనుఁగొనుట కష్టమైయున్నది! ... ... ... ...

## "ప్రస్తుతకాలపువిద్యలు."

ఇందులకుఁగూడఁ, బాశ్చాత్యనాగరకతాభిమానులగు మన నవీనవిద్యార్థి యువకు లీక్రిందివిజబాబును జెప్పవచ్చును: "ఓహో! ఈ మీరాయొక్క ప్రాతకాలపువిద్య లలో (ననగా, భారతీయమానసికశాస్త్రము, నాత్మవిద్య మొదలగువానిలో) మాకుఁ బనిలేదు; కావున వానిని మేము లక్ష్యపెట్టము! అట్టివిద్యలలో మాకుఁ బాండిత్యము లేకపోవుట మాప్రజ్ఞాలోపమునకు సాక్ష్యముకాఁజాలదు. ఏవిద్యలందు మాకభిరుచి గలదో, వేనినిమేము చదువఁదగినవానినిగఁ బరిగణించుచుంటిమో, వేనియందుమాబుద్ధి బలమునుజొనిపి కృషిచేసియుంటిమో, యట్టిమావిద్యావిధానమున మమ్మునుబిలిచి పరీక్ష చేసినయెడల, నప్పుడు మేము మాబుద్ధిబలమును, జ్ఞానవైభవమును, బ్రజ్ఞావిశేషమును సులభముగఁ గనఁబఱచఁజాలుదుము. ఇట్టివిషయమున సరియైననిర్ణయమునకువచ్చుటకు నవసరమైనవిమర్శనమున కిదిమాత్రమే న్యాయమైన చక్కనియాధారము." ... ... ఈనాఁటి విద్యావంతులగు భారతీయయువకు లేవిద్యలందుఁ దమకభిరుచియు నభి లాషయుగలదని తామే తెలుపుచుండిరో, వేనియందుఁ దమకుఁగల పాండిత్యమునకును, గాక, తుదకు వేనియందుఁ దా మభివృద్ధిఁబొందుచుంటిమనియైనను గర్వించుచుండిరో, యావిద్యలందే వారిశక్తిసామర్థ్యములను, నభివృద్ధియుఁ బరీక్షింతము! అందును గఠిన మైన విద్యాశాఖనుగాక, యింగ్లీషువిద్యాప్రారంభమునఁ దొలుఁదొల్తనే యారంభమగు ప్రథమవిద్యయైన యింగ్లీషుభాషను, వాఙ్మయమునే పరీక్షకొఱకుఁ గైకొందము!

## "ఇంగ్లీషుభాషయు, వాఙ్మయమును."

... ... ... ... ... ... ...

ఇంగ్లీషువాఙ్మయమునఁగూడ, మిల్టన్, బ్రౌనింగ్-కార్లైల్, ఎమర్సన్, వర్డ్సువర్తు, మొదలగువారియొక్కయు, మఱియు స్మరణీయులును, నింగ్లీషువాఙ్మయమున కలంకారప్రాయులుఁనునగు నితరప్రముఖులయొక్కయు రచనములు మొదలైన రమణీయ గ్రంథములుగలవు. కాని, యింగ్లీషువాఙ్మయములోని యీవిద్వచ్ఛిఖామణులయెడను, వీరియుత్కృష్టరచనలయెడను మనవిద్యార్థులయొక్కస్థితి యెట్లున్నది? న్యాయమగు యథార్థమేమనిన, నాగ్రంథకర్తలకును వారిరచనములకును మనము వాగ్రూపమగు గౌరవమునుమాత్రమే కనఁబఱచుదుముకాని వానిని జదువము; అంతియగాక, యప్పు

డప్పుడు సందర్భపడుచున్నవిధముగ 'బ్రౌనింగ్'కవియొక్క 'రబ్బీ-బెన్-ఎజ్రా'వంటిది గాని, 'వర్డ్సువర్తు'కవియొక్క 'ఎక్స్‌కర్షన్'వంటిదిగాని, 'కార్లైల్'కవియొక్క 'సార్టర్-రిసార్టస్'వంటిదిగాని, యట్టిదేయగు నింగ్లీషువాఙ్మయమందలి కావ్యరత్నమును మఱిదేనినైననుగాని యొకసంవత్సరమున "ఎఫ్. ఏ." పరీక్షకుఁగాని "బి. ఏ" పరీక్షకుఁగానికాక, "ఎం. ఏ." పరీక్షకుమాత్రమే పఠనీయగ్రంథముగ నేర్పఱచినను గూడ, నాసంవత్సరమున నింగ్లీషువాఙ్మయమందలి యట్టియుత్కృష్టగ్రంథమును జదువవలసివచ్చినందులకు విద్యార్థులుమాత్రమేగాక, బోధింపవలసివచ్చినంను ఉపాధ్యాయులుగూడఁ దమతమదురదృష్టమునకు విచారపడుటను మనము గనుఁగొనుచుందుము! ఈవిచారమునకును, దుఃఖమునకును గారణమేమి? ఆగ్రంథములు నిజమునకుఁ జిక్కులమారివియుఁ, నతికఠినములును, దురవగాహములును నగుట చేఁగాదు; ఇఁకేమనిన, నందలిపద్ధతి, యనఁగా, విషయములను లోతుగనాలోచించి గట్టిగాఁ జదువవలసి వచ్చుట, చదువువారికినిఁ జెప్పువారికినిగూడ సమానముగ గిట్టదు!

"మనయొక్కమనఃప్రీతి"

ఇఁక, మనయొక్కబుద్ధిసూక్ష్మతకును శ్రేష్ఠతకునుగర్వించుచు, మనమనస్సునకును, మనబుద్ధితత్త్వమునకును ననుకూలమనితలంచుచు, ననుగ్రహముతో మనము మనఃప్రీతికరముగఁ బరిగణించువిద్యయెట్టివిధమైనది? అట్టిగట్టివిద్యలకు మనము పెడమొగము పెట్టి వానితోడిపరిచయము నెదిరించి, సాధ్యమైనంతవఱకు వానినిజూచి పాఱిపోవుదుమనుటయును, వీలయినంతవఱకు నవలలును, గథలపుస్తకములునులోనగు తేలికవాఙ్మయముతో మనకాలమును వెళ్లఁబుత్తుమనుటయును, నిర్వివాదాంశము! ఇందు విషయమునఁగూడ మనయందలి జ్ఞానాభివృద్ధికిని, మనయందలి గర్వభంగమునకును సంబంధించినవిచారకరమగు విషయమును వ్రాయవలసియున్నది; ఏమనిన, నవలలను వ్రాసినవారిలోఁగూడ 'సర్-వాల్టర్-స్కాట్,' 'చార్లస్-డికెన్స్,' 'థేకరే', 'జార్జి-ఎలియెట్,' 'చార్లస్-రీడ్' వంటిప్రముఖులును, మఱియును నింగ్లీషుభాషయొక్క కల్పితకథావాఙ్మయమున నగ్రస్థాన మలంకరించునితరులును నున్నప్పటికిని నిట్టిరచయితలకు వాగ్రూపగౌరవమును మాత్రమే మనలో నత్యధికసంఖ్యాకులు గనఁబఱచఁజాలుదురు గాని, మనపరీక్షలకు వారిగ్రంథములలో దేనినిగూడఁ బఠనీయగ్రంథములుగ నేర్పఱచుటను మనము ద్వేషింతుము! మఱియు, నట్టియింగ్లీషువాఙ్మయమును జదువునపుడు గూడ, 'స్కాట్,' 'జార్జి-ఎలియెట్', మొదలగు నట్టివారిగ్రంథములలో నొకప్రకృతిసౌందర్యముయొక్క యంశమగువర్ణనము వచ్చినపుడు (అనఁగా, నొకయరణ్యమో, యొకసూర్యోదయమో, సూర్యాస్తమయమో, యీమొదలగునవి వర్ణింపఁబడినపుడు)

మన మాపుటలను దిరుగవేయుచుఁ, గథాసందర్భమును వెదకికొనఁ బోవుదుము! మనము గర్వించుచున్న బుద్ధికుశలత కిదియేనా ఋజువును, లక్షణమును? అందులకు మారుగ, శరీరవిషయమున మన మగ్నిమాంద్యముకలవారమై (యీనాఁటి మనతల్లి దండ్రులుగూడ లక్ష్యపెట్టని) కఠినపదార్థములను జీర్ణము చేసికొనలేని దుస్థితిపాలై నట్లే, బుద్ధిబలవిషయమునఁగూడ నచ్చుగ నదేవిధమునఁ గఠినపదార్థమును జదివి యర్థము చేసికొనలేనట్టియుఁ దానిఫలితము ననుభవింపఁజాలనట్టియు దుర్బలస్థితికి మనము వచ్చి యుంటిమనుట కిది యత్యంతస్పష్టమును నూహింపఁజాలినంతటి చక్కని సరియైనట్టియు ఋజువు కాదా? అనఁగా, (నదియే త్రిప్పిచెప్పినచో,) నీనాఁటి మనబుద్ధికుశలతయొక్క ప్రధానలక్షణము హ్రస్వదృష్టియేగాని లోతైన యాలోచనశక్తిగాదు.

"పాఠశాలలలో (విద్యాభ్యాసమునకుఁ) గాలవిభాగము."

ఇట్టివిషయమున యథార్థస్థితిని సరియైనవిధమున వివరించుట కింతకంటె నెక్కువ వివరములను జర్చించుట మనకనవసరము. (ముఖ్యములును, నమూల్యములు నగు విషయములపై మనమనస్సులను నేకాగ్రముగ నిల్పియుంచుటలో మన యసామర్థ్యములోఁ జేరిన)మన బుద్ధి ల్బతీక్ష్ణతకు నింతకంటెను నెక్కువసులభమును స్పష్టమును నగు ఋజువీక్రిందివిషయమునఁ దెలియనగును: మేము పాఠశాలలలోను, గళాశాలలలోను జదువుకొనునాఁ డొక్కొక్కవిద్య కొక్కొకగంటకాల ముండెడిది; ఆగంటకాఁగానే యావిద్యమార్చుటచే, నొక్కటేవిషయమున నెడతెగని యేకాగ్రతచేఁగల్గు శ్రమలేక, విశ్రాంతికలుగుచుండెడిది; అదియట్లుండఁ, బ్రస్తుతకాల "విద్యాభివృద్ధి" క్రమముగ నెట్టిస్థితికి వచ్చినదనఁగా, నొక్కగంటకాల మొక్కటేవిద్యపై దృష్టియుంచి యభ్యసించుటగూడఁ, జిన్నవారిమెదడులకు దుర్భరమగుశ్రమగాఁ గనఁబడినది; కావున శ్రమనుదగ్గించుకొఱకై ౫౦ నిమిషములును, ౪౫ నిమిషములును, ౪౦ నిమిషములును వ్యవధులుగా నేర్పఱుప మొదలుపెట్టిరి.

"మన (సంస్కృత) పాఠశాలలు."

దీనితోఁగూడ, నీనాఁడుసహితము మనయొక్క యీక్రింది ప్రత్యక్షానుభవమునుగుర్తించి జ్ఞాపకముంచుకొందుముగాత! మన సంస్కృతపాఠశాలలలోఁ జిన్నపిల్లలు గంటలపర్యంతము నొక్కటేబిగువునఁగూర్చొని, మహాకవి మాఘుని 'శిశుపాలవధ'వంటి (గాఢమైన యేకాగ్రతయు, బుద్ధికుశలతయు నవసరమగు) కావ్యములను జదువుచుండుట మనము ప్రతిదినమును గనుఁగొనుచునేయున్నాము! ఇందుల కుదాహరణముగ మాఘకావ్యముయొక్క ద్వితీయాశ్వాసము, శ్రీకృష్ణునియొక్కయు, శ్రీ

బలరామునియొక్కయు, సుద్ధవునియొక్కయు సభాసమావేశమును, యుధిష్ఠిరమహారాజుయొక్క రాజసూయయాగమును జూడఁబోవుటకుఁ దీర్మానించుకొనుటయును, వర్ణించును; ౩-వ యాశ్వాసము మొదలు ౧౨-వ యాశ్వాసమువఱకును, ద్వారకనుండి హస్తినాపురమునకు శ్రీకృష్ణునియొక్క ప్రయాణవివరముల వర్ణనముగలదు. ఒక యాశ్వాసము ద్వారకానగరముయొక్క శిల్పచిత్రములు మొదలగు సౌందర్యవర్ణనమునకు వినియోగింపఁబడినది; యొకయాశ్వాసము సూర్యాస్తమయ సౌందర్యముయొక్క విపులవర్ణనమునకును, నొకటి రాత్రికాలముయొక్క రమణీయతావర్ణనమునకును, నొకటి సూర్యోదయవర్ణనమునకును, నొకటి యరణ్యప్రదర్శనము, సరస్సులుఁ, దటాకములు మొదలగువానివర్ణనమునకును వినియోగింపఁబడినవి! ఈయాశ్వాసములలో నొక్కొకటి యఱువది మొదలు నూఱువఱకును శ్లోకములనుగల్గి, 'యుత్ప్రేక్ష'యు నింకను నితరములగు రమ్యాలంకారములతోడను నిండిన యత్యంతకావ్యకళావర్ణనములతో నొప్పారుచుండును; ౧౨-వ యాశ్వాసముచివరనే కథాసందర్భము తిరిగి ప్రారంభింపఁబడును. శ్రీకృష్ణుఁడు యమునాతీరమును జేరెనని (యచటఁ) జెప్పఁబడినది. అట్టిదీర్ఘమును; వివరమును, విపులమును, నలంకారభూయిష్టమును నగుకావ్యశిరోరత్నమును జిన్నపిల్లలెంతమాత్రమును మానసికాయాసము నొందకయే, చదువ నాజ్ఞాపింపఁబడి చదువుచునే యున్నారు. ఈరెండువిధములగుప్రదర్శనములను నొకదానిసరస నొకటిపెట్టి చూచినచో, నేపక్షమున బుద్ధిబలమును, బటుత్వమును, బుద్ధిసూక్ష్మతయు నిజముగానున్నసంగతియును—నది, నిందాపాత్రులైన పూర్వకాలపుజనులపక్షమున నున్నదియుఁ, గాక, యాత్మస్తుతిప్రియులగు నవీనభారతీయజనములపక్షముననున్నదియు, నిష్పక్షపాతబుద్ధిగలయేమానవుఁడైనను దనకుఁదానే గ్రహింపఁజాలును!"

"ధర్మరాజ్య" పత్రిక, సంపు. 1., సంచి, 32, పుట. 7-9, (తేదీ 25-8-34)

దీనినిబట్టి యాలోచించినచో నిటీవలఁ గొలదితరములక్రిందటివారికిని నిప్పటివారికినే బుద్ధిబలమున నెట్టితారతమ్యముగలదో విశదముకాఁగలదు అట్టిచో నిఁక నిప్పటి కెన్నియోవేలయేండ్లక్రిందటివారికిఁగల బుద్ధిబల మిప్పటివారిబుద్ధిబలముకంటె నెన్నిమడుఁగు లధికముగా నుండవచ్చునో వేఱుగఁ జెప్పనవసరము లేదు. కావున దీనిని బట్టి యాలోచించిచూచినను గూడ, వేదవ్యాసునంతటి బుద్ధిబలముగల మహనీయు లీకాలమున లేకపోయినప్పటికిని వెనుకటికాలమున నుండుట కవకాశము లేకపోలేదనియు, నది యసంభవముకావలసిన యగత్యము లేదనియు విశదమగుచున్నది.

ఇచట మరల నొకసంశయము గలుగవచ్చును. ఏమనిన: "నట్టిమేధావంతు లుండుట యసంభవముకాకపోయినఁ బోవచ్చునుగాక! అంతమాత్రముచేతనే యట్టి

 

ప్రజ్ఞావంతుఁ డొకఁడుండెననియు, నాయనయే పైపురాణాదులను మహాభారతమును వ్రాసెననియుం ననుట కేమియాధారమున్నది? అసంభవముకాని విషయములన్నియు జరిగియేతీరెనని నమ్మవలసిన యగత్యమేమున్నది?'' యని సంశయము గలుగవచ్చును. సమాధాన మేమనిన: నష్టాదశపురాణములను వ్రాసినది వ్యాసమహర్షియే యనువిషయమును,

''అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః''

యనుశ్లోకముచే స్కాందపురాణము (నందలిసూతసంహిత) తెలిపియున్నసంగతి నీప్రకరణముననే, ''పురాణములనుగుఱించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పు?'' ననుశీర్షికక్రింద నష్టాదశపురాణములకును, నుపపురాణములకును, వేదములకును గలసంబంధమునుగుఱించి వినిపించుసందర్భమునఁ గనఁబఱచిరియే యుంటిమి. ఆవ్యాసమహర్షియే శ్రీమహాభారతమునుగూడ రచియించియుండె ననుసంగతినిగూడఁ బైపురాణమే,

శ్లో. ''వ్యస్తవేదతయా వ్యాస ఇతి లోకే శ్రుతో మునిః
అయం సాక్షా న్మహాయోగీ వ్యాస స్సర్వజ్ఞ ఈశ్వరః
మహాభారత మాశ్చర్యం నిర్మమే భగవా న్గురుః.''

అనుశ్లోకములచేఁ జెప్పియున్నవిషయమునుసహిత మీప్రకరణమున నింతకు ముందే, ''యితిహాసము''లనుగుఱించి చర్చించుసందర్భమున ''శ్రీమహాభారత'' మనుశీర్షికక్రింద సవ్యాఖ్యానముగను, సతాత్పర్యముగనుఁ జూపియుంటిమి. మఱియు నీయర్థమునే బోధించుప్రమాణములను శ్రీమద్భాగవతపురాణమునుండియు, మహాభారతమునుండియుఁ గూడఁ గొన్నిఁటి నెత్తియచటనే చూపియుంటిమి. ఇవియన్నియు, వ్యాసమహర్షి యొక్కఁడే యష్టాదశపురాణములను మహాభారతమునుగూడ రచించెనని సాక్ష్యమిచ్చుచున్నవి. ఇందులకు వ్యతిరేకముగ మన ప్రతిపక్షులు గనఁబఱచియున్న గట్టియాధార మేమియుఁగానరాదు! వ్యాసునియట్టి మేధాసంపన్నుఁ డుండుట యసంభవముకానేరదని యిపు డింతకుముందే ఋజువుపఱచియుంటిమి. ఇఁకఁ బైవిషయమును విశ్వసించుట కాక్షేపణ మేమున్నది.?

ఇది యిట్లుండఁగ, నింకొకహేతువుచేఁగూడ బైవిషయ మసంభవముకాదు. ఏమన, నట్టిమేధాశక్తియు, బుద్ధిసంపదయుఁ గల్గియుండుట జనసామాన్యమున కసాధ్యమైనను, దపస్సంపన్నుల కది యసాధ్యముగావలసిన యావశ్యకతలేదు. ఏలననినఁ, దపశ్శక్తి కసాధ్యమగువిషయ మీప్రపంచమున నేమియునుండనేరదని యీగ్రంథము యొక్క మొదటిప్రకరణమునఁ ''బ్రాచీనచరిత్రకారుల గుణసంపదయెడఁగల సంశయ

ములు; వానికి సమాధానములు" ననుశీర్షిక క్రింద నుదాహరణపూర్వకముగా విశదపఱి చియే యుంటిమి. వ్యాసమహర్షి యట్టితపస్సంపన్నులలో నగ్రగణ్యుఁడగుటచే నాయన కట్టిమేధాసంపదయుండుటలో నాశ్చర్యమును, నసంభవమును, సంశయనీయమును నేమియు నుండఁజాలవు!

ఇందువిషయమున నన్నిఁటిని ద్రోసి రాజనఁజాలిన యద్భుతమగుహేతువు మఱి యొకటి గలదు! ఏమనినఁ, బైవిధమగుమేధాసంపదయు, గ్రంథనిర్మాణమును, సామాన్యుఁడగుమనుష్యమాత్రున కసాధ్యమును, నసంభవమును నైనచోఁ గావచ్చునుగాని, కేవల మాపనికొఱకై యవతరించిన భగవంతుని కసాధ్యమును, నసంభవమును నేముండును? అందును దపస్సంపన్నునిమాట యిఁకఁ జెప్పవలసిన దేమున్నది? చిత్రవిచిత్రములగుచరాచరములతోఁగూడిన యీమహావిశ్వమునంతను సృష్టిచేయుసామర్థ్యముగల సర్వశక్తిసంపన్నుఁడగు సర్వేశ్వరునకుఁ జేయశక్యముగాని పనియేముండును? అట్టి సర్వేశ్వరుఁడగు శ్రీమన్నారాయణుఁడే వ్యాసుఁడై యవతరించి, మహత్తరమగు వేదముయొక్క యర్థము సులభముగ సామాన్యజనులకుఁ దెలియరానిదగుటచేఁ దానిని సులభముగఁ దెలియఁజేయుటకై పురాణములను వ్రాసియు, వేదమును విభాగము చేసియు నుండెనని, యీప్రకరణారంభమునఁ "బురాణములనుగుఱించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పు?" ననుశీర్షిక క్రింద, నష్టాదశపురాణములకును, నుపపురాణములకును, వేదమునకును గలసంబంధమును గుఱించి వినిపించునపుడు, స్కాందపురాణములోని సూతసంహితయందలి యీ క్రిందిశ్లోకములవలనను వానివ్యాఖ్యానమువలనను దెలిసికొనియే యుంటిమి.

శ్లో. " ... ... ... ... ... ...

విష్ణు ర్విశ్వజగన్నాథో విశ్వేశస్య శివస్యచ
ఆజ్ఞయా పరయా యుక్తో వ్యాసో జజ్ఞే గురు ర్మమ
స పున ర్దేవదేవస్య ప్రసాదా దంబికాపతే
స్సంక్షిప్య సకలా న్వేదాన్ చతుర్ధాకృతవా న్ద్విజాః."

... ... ... ... ... ...

వ్యాఖ్యా:—"..........వ్యాసేన పురాణానాం ప్రణయనం ప్రాగుక్తం; తస్యతు విష్ణో రవతారత్వ మిదానీ మాహ: 'విష్ణు' రితి. ౪౨౪. న కేవలం వేదోపబృంహణాయ పురాణప్రణయనం; మహతో వేదస్య అల్పబుద్ధిభి ర్దురవగాహత్వాత్, తత్తచ్ఛాఖావిభాగం కృత్వా సంప్రదాయప్రవర్తనమపి తేనైవ కృతమిత్యాహ: 'స పునర్దేవదేవస్యే'తి. ౪౩౫. ... ... ..."

దీనియర్థమును బైసందర్భమున లోగడఁ గనఁబఱచియేయున్నాము. కావున నచటఁ జూచి తెలిసికొనవచ్చును. ఇట్లే "మహాభారత" మనుశీర్షికక్రింద నాగ్రంథమునుగుఱించి లోగడ నీప్రకరణముననే మనము తెలిసికొనుసందర్భమునఁగూడ, వ్యాసమహర్షి విష్ణునియవతారమే యనువిషయమును బైసూతసంహిత యీక్రిందిశ్లోకవ్యాఖ్యానములద్వారా తెలిపియుండగా దానిని గనుగొనియే యుంటిమి:

శ్లో. "వ్యస్తవేదతయా 'వ్యాస' ఇతి లోకే శ్రుతో మునిః
అయం సాక్షా న్మహాయోగీ, వ్యాస స్సర్వజ్ఞ ఈశ్వరః
మహాభారత మాశ్చర్యం నిర్మమే భగవా న్గురుః.
... ... ... ... ... ..."

వ్యాఖ్యా:—...........................వ్యస్తా వేదా శ్శివే నేతివా ఆత్మనైవ కర్త్రా మహర్షిరూపేణ నిజేనై వావతారాంతరేణ కరణే నేతిచాద్యష్. 8.౬౪. సార్వజ్ఞం ప్రథయితుం సాకల్యేన చతుర్విధపురుషార్థప్రకాశకస్య మహాభారతస్య తేనైవ ప్రణయన మాహ: 'అయం సాక్షాన్మహాయోగీ'తి............ఇదమేవహి మహాభారత ప్రణయనం సాక్షాద్విష్ణోరవతార ఇత్యత్రగమకం, యదాహ:

శ్లో. "కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్;
కో హ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృ ద్భవేత్?"
... ... ... ... ... ...

దీనియర్థమునుగూడఁ బైనదెలిపినసందర్భమున లోగడఁదెలిపియే యుంటిమి గావున నచటఁ జూడఁదగును.

ఈయర్థమునే శ్రీమద్భాగవతపురాణముగూడ నీక్రిందిరీతిని దెల్పియున్నది:
... ... ... ...

వ. "అనియడిగిన శౌనకాదిమునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియెఁ: 'దృతీయంబయిన ద్వాపరయుగంబు దిరుగుసమయంబున నుపరిచరువసు వసువుపేర్యంబున జన్మించి వాసవినాఁదగు సత్యవతియందుఁ బరాశరునకు హరికళంజేసి విజ్ఞానియైన వేదవ్యాసుండు జన్మించి యొక్కనాఁడు......." 82

—శ్రీమదాంధ్రభాగవతము, ప్రథమస్కంధము.

(అర్థము సులభమగుటచేఁదాత్పర్యము చెప్పనవసరములేదు.)

మఱియు నాపురాణమే, యాస్కంధముననే, "భగవంతుని యేకవింశత్యవతారము"లను శీర్షికక్రింద, వ్యాసమహర్షి శ్రీవిష్ణుదేవుని పదునేడవయవతారమని యీక్రిందిరీతిని వినిపించుచున్నది:—

"...అర్ధేవుండు...పదునేడవదియైన వ్యాసగాత్రంబున నల్పమతులయిన పురుషులం గరుణించి వేదవృక్షంబునకు శాఖలేర్పఱిచె........." 63

శ్రీవిష్ణుండు వేదవిభాగనిమిత్తమై తనమనస్సునం 'దపాంతరతముం'డను కొమారుసిసృజియించి, యన్ని మన్వంతరములలో నవతరించునట్లును, వేదవిభాగ మొనర్చునట్లును నాజ్ఞాపించి, పరాశరునకుఁబుట్టుదువని" చెప్పినట్లు శ్రీవేదవ్యాసమహర్షియే వైశంపాయనాదులగు శిష్యులకు నెఱిఁగించినసంగతి శ్రీమహాభారతమునఁగూడ శాంతిపర్వమున, "వేదవ్యాసునకు నారాయణనందనత్వంబుగలిగిన ప్రకార" మనుశీర్షిక క్రిందఁ దెలుపఁబడియున్నది. దీనినిబట్టిగూడ శ్రీనారాయణుఁడే మొదట 'నపాంతరతముఁడు' గను బిమ్మట వేదవ్యాసమహర్షిగను నవతరించెనని విశదమగుచున్నది.

ఈ పై ప్రమాణములచే శ్రీవేదవ్యాసమహర్షి శ్రీమన్నారాయణుని యవతారమేగాని సామాన్యుఁడగు మనుష్యమాత్రుఁడుగాఁడని తెలియుచుండుటచే, సామాన్యులకు దుర్లభంబగు మేధాశక్తియు, బహుగ్రంథరచనసామర్థ్యమును, నాయనకుండుటలో నాశ్చర్యమును నసంభవత్వమును, నతిశయోక్తియు నుండఁజాలవు! ఉండినచో, సర్వశక్తిసంపన్నుఁడగు నీశ్వరునకును, నత్యల్పశక్తియుక్తుఁడగు సామాన్యమనుష్యునకును భేద మేమున్నది? పైయాధారములను ఖండించి యాయన నారాయణుని యవతారము కాదని యితరాధారములచే బుజువుచేయువారెవరును గానరారు.

## పురాణాదులందలి శైలిభేదాదులు కర్తృత్వభేదమును దెలుపుట లేదా?

అపుడు మననవనాగరకసోదరులు తిరిగి వేఱొకవాదమునకుఁ దిగవచ్చును. ఏమనిన: 'నట్టిసామర్థ్యము వ్యాసునకుండిన నుండవచ్చునుగాక! దానితో మాకుఁబనిలేదు. కాని, యష్టాదశపురాణములలోని వేఱువేఱుగ్రంథములందును, దుదకు మహాభారతమున నొక్కగ్రంథముననేగూడ వేఱువేఱుభాగములందునుగల రచనావిధానములును, గథాసరళియుఁ, గవిత్వధోరణియు, విషయపర్యాలోచనమును, భేదములుగల్గియుండుటచేతను, నొక్కటేపద్ధతిగ లేకపోవుటచేతను,నవియన్నియు నొక్కరేవ్రాసినవికాక, వేఱు వేఱుకాలములందు వేఱువేఱుమనుష్యులు వ్రాసినవై యుండి, వానియెడ జనులకు గౌరవమును, భక్తిశ్రద్ధలును గల్గుటకై విష్ణునియవతారమగు వ్యాసుఁడువ్రాసినట్లు వానికిఁ బేరు పెట్టియైన నుండవలయును; కానిచో, వ్యాసుఁడను పేరుగలవారే వేఱువేఱుమనుష్యులు వేఱువేఱుకాలములం దాగ్రంథములను వ్రాసియుండఁగా, నావ్యాసులందఱును జేరి యొకఁడేవ్యాసుఁడనుకొని జనులు భ్రమపడియైన నుండవలయును. దీనికేమిబదులు చెప్పెద?'' రని మనలను వారడుగవచ్చును!

ఇట్టివిధముగనే మననవనాగరకులలోఁ గొందఱు సామాన్యముగఁ గాళిదాసమహాకవివిషయమునఁ జేయువాదమునకు, లోఁగడ నీగ్రంథమున నచ్చటచ్చటఁ దెల్పఁబడి యున్న "భారతవర్షముయొక్క ఘనతలోని రహస్య" మను నుపన్యాసమున శ్రీపూరీ

శంకరాచార్య (శ్రీ భారతీకృష్ణతీర్థ)స్వాములవారు చక్కనిసమాధానమును జెప్పి యున్నారు. శ్రీ వేదవ్యాసమహర్షి విషయమున మననవనాగరకులు చేయునట్టి పైయాక్షేపణమునకుఁగూడ నాసమాధానమే యన్నివిధములను జక్కఁగవర్తించునుగావున, నందులకు వేఱుగ సమాధానమును జెప్పుటకంటె దానినేకనఁబఱచుట మంచిదనియెంచి యీదిగువఁ జూపుచున్నాము:—

... ... ... ... ... ...

## KALIDASA'S CASE.

For example, it would seem as though the Western Orientalists, out of mere petty envy and jealousy of the East, claimed intellectual superiority (both in quality and in output) for European authors but grudged to admit it in the case of ancient Indian authors; nay, even the very possibility of any capacity on the part of the latter to produce a large volume of first class Literature would seem to be denied! For instance, when we claim the great Indian Poet Kalidasa, as the doubted author of at least four poems (Raghuvamsha, Kumarasambhava, Meghasandesha and Rutusamhara) and of three Dramas (Shakuntala, Malavikagnimitra and Vikramorvashiya), the Western Orientalist comes down upon us with his *dictum* that there are such tremendous differences of matter, style, etc., in these compositions that one author could not possibly have written seven books of such varying merits all-round, that they must certainly be the works of different authors and so on! And some of them are so condescending too, mind you, as to acquit Indian Literary Historians of deliberate dishonesty and perversion, by adding the unctuous and seemingly feasible but really untenable and even insulting "explanation" that perhaps several different persons accidentally bearing the same name (i. e., Kalidasa), composed these different books and that literary men of later times (not having sufficient critical acumen, insight and discrimination for detecting these differences of manner, matter, metre, style and so forth and for uuravelling this secret of coincidence in the names of the various authors) must have mistaken them to be the works of the same author, and that the traditional ascription of all these works to one and the same Kalidasa's authorship was undoubtedly the result of such confusion!

## SHAKESPEARE'S CASE.

In dealing with such *Obiter dicta* and *Ipse dixits*, the only possible method for us to adopt is the one which the Euclidean Geometry has rendered famous in the world, to wit, the method of *reductio ad absurdam* ! Let us therefore, just for a moment and just for argument's sake, grant their व्याप्ति (major premise) i.e., that differences of ideas, of style and so on, must necessarily mean and indicate difference of authorship too; and, on this basis, let us ask these very gentlemen, whether, taking only one example, namely of Shakespeare in English Literature, there are no differences in these respects in his Poems and in his Dramas? Now as a matter of fact, it is well known that, leaving aside "Titus Andronicus" and "the Two Noble Kinsmen" (which all scholars agree in discarding from his works as not being his at all), Shakespeare is credited by the entire world of Literary critics with the undoubted authorship of 37 Plays and a number of minor poems ; and amongst these, you find not merely enormous differences in style, finish & literary beauty, but also still more enormous and tremendous differences of conception, intellectual calibre and spiritual outlook, ranging from rank obscenity and utter puerility of the most vapid description (as in his Rape of Lucrece, Venus and Adonis, the Passionate Pilgrim and so on) to the highest flights of Poetical fancy and Psychical richness of thought (as in his Macbeth, Othello, Hamlet, King Lear and the Tempest, the last of which all literary authorities agree in regarding as the last fruit of his ripe intellect in its highest stage) ! Shall we then, on account of these enormous and tremendous differences, be justified in ascribing the authorship of Shakespeare's well Known 37 plays and odd poems to 37 and more different people, who, perchance by an "*extraordinary accidental chance coincidence*", bore the same name (namely, Shakespeare)? !

## LAW OF GROWTH.

If and when they are interrogated in this manner, the Western Scholar, critic and Orientalist flare up with the perfectly correct and in every way justifiable remark:— "What a fool you are ! How silly of you to imagine that Shakespeare never grew but from infancy to death, remained always stationery in his thoughts, ideas, style, mastery over language and the like ? Do you not know that the chronological order of his poems and

dramas is in itself a veritable psychological history revealing to us the Evolution of Shakespeare's Mind, Intellect, and soul?" We must frankly admit that the answer is a most reasonable and altogether unxceptionable one; but we would also ask the same orientalists whether the Law of Growth and Evolution in mind, intellect, soul, literary proficiency and so forth is a monopoly of western writers alone and that there is any Devine Command or Law of Nature or curse of the sages or Act of Parliament or of the Indian Legislatures to the effect that Indian authors can never grow but must remain from birth to death on the same level in respect of their ideas, their literary capacity and so on?!"

... ... ... ... ... ...

— "Dharmarajya", Vol. 1, No. 5, pp. 7-8. (17-2-1934.)

దీనియర్థమేమనఁగా:—

... ... ... ... ... ...

కాళిదాసుని విషయము.

"ఇందుల కుదాహరణముగఁ బ్రాచ్యదేశీయవిమర్శకులు ప్రాచ్యదేశములందలి కేవల ద్వేషముచేతను, ననుమానముచేతను, బాశ్చాత్యగ్రంథకర్తలకు (గుణమునను, బాహుళ్యమునను, రెంటియందును) నాధిక్యత నాపాదించియుండిరిగాని భారతీయ ప్రాచీనగ్రంథకర్తలవిషయమున దానినంగీకరించుటకు ద్వేషించిరి; అంతియగాదు, వారికి (ప్రాచీనగ్రంథకర్తలకు) విస్తారమగు నుత్తమజాతివాఙ్మయమును నిర్మించుసామర్థ్య ముండుటకవకాశమునుగూడ వీరు నిరసించినట్లు తోఁచుచున్నది! ఇందులకు నిదర్శనముగ, గొప్పభారతీయకవియగు కాళిదాసుఁడు (రఘువంశముఁ, గుమారసంభవము, మేఘసందేశము, ఋతుసంహారము ననునట్టి) కనీసము నాల్గుకావ్యములకును (శకుంతల, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము నను) మూఁడునాటకములకును గ్రంథకర్త యని మనము సందేహించిపలికినచోఁ, బాశ్చాత్యనాగరకుఁడగు ప్రాచ్యవిమర్శకుఁడు బయలుదేరి, యీపైగ్రంథములందుఁ గథాసందర్భమునను, శైలిమొదలగువానిలోను నత్యంతములగు భేదములుండుటచే నన్నివిధములను నట్టిభేదములగు విశేషములతోఁ గూడిన యేడుగ్రంథములను నొక్కఁడేగ్రంథకర్త వ్రాసియుండఁజాలుట సాధ్యము కాదనియుఁ, గావున నవి వేఱువేఱుగ్రంథకర్తలు వ్రాసినవై తీరవలయుననియు, నీ మొదలగు తనసిద్ధాంతముతో మనపై దాడివెడలును! వారిలోఁ గొంద ఱంతకంటెను నీచమునకొడిగట్టి భారతీయవాఙ్మయచరిత్రకారులను వట్టికృత్రిమమునకును, నసత్యవాదిత్వమునకును బాలుచేసి, మెఱయుచు సత్యముగఁ దోఁచునట్టియు, నిజమునకు నిలువఁజాలనట్టియు, మీదుమిక్కిలి యవమానకరమైనట్టియు, నీక్రిందిసమాధానమును జెప్పవచ్చుటను మీరు గుర్తింపవలసియున్నది:—

ఏమనిన: నీవేఱువేఱుగ్రంథములనువ్రాసిన పెక్కుమంది వేఱువేఱుమనుష్యులకుఁ గాళిదాసుఁడనెడి యొక్క పేరేయుండుట దైవికముగఁ దటస్థించియుండునఁట; తరువాత కాలములందు వచ్చినవిద్వాంసులు (రచనావిధానముఁ, గథాసందర్భముఁ, గవితాసరణి, శైలి మొదలగువానియందలి పైఁదెల్పినభేదములను గనిపెట్టుటకును, నీవివిధగ్రంథకర్తలయొక్క పేరొకటియే యైయున్నరహస్యమును బహిరంగపఱచుటకును, దగినంత బుద్ధిసూక్ష్మతయుఁ, బూర్ణజ్ఞానమును, విచక్షతయు లేనందున) నవియన్నియు నొక్క గ్రంథకర్తయొక్క గ్రంథములేయని పొరఁబడియుండవలయునఁట; ఈగ్రంథములన్నిఁటిని గాళిదాసునియొక్క గ్రంథకర్తృత్వమునకే యంటఁగట్టెడివాడుక, నిస్సందేహముగ నావిధమైనభ్రాంతిచే నేర్పడిన ఫలితమేయఁట!

## 'షేక్స్పియర్'యొక్క విషయము.

ఇట్టియపసిద్ధాంతములను, నహంభావతీర్మానములను జర్చించుటలో మనమనుసరింప సాధ్యమైనమార్గము, 'యూక్లిడ్'యొక్క రేఖాగణితశాస్త్రము ప్రాజ్ఞలోకమునఁ బ్రసిద్ధినొందించిన 'రీడక్షియో-ఎడ్-ఎబ్సర్డమ్' (అనఁగా నసంభవమను నిర్ణయమునకు దారితీయు) విధానముమాత్రమే! కావున, నూహాభేదములును, శైలిభేదములును మొదలగునవి గ్రంథకర్తృత్వభిన్నత్వమును (ననఁగా వేఱువేఱుగ్రంథకర్తలయొక్క రచనములను) దెలియఁజేసియే తీరవలయు నను వారియొక్కవాదమును వాదముకొఱకించుకసేపు మన మంగీకరించి చూతము; ఈవాదమునే యాధారముగఁగొని, యింగ్లీషు వాఙ్మయమునందలి 'షేక్స్పియర్'కవిని దార్కాణముగ గ్రహించి, యాయనయొక్క కావ్యములందును, నాటకములందును నీపైవిషయములందు భేదములులేవా? యని మన మాపెద్దమనుష్యులనే ప్రశ్నింతము. నిజమునకు "Titus Andronicus" "The Two Noble Kinsmen," అను రెండుగ్రంథములమాట యటుంచి, (యివి యాయనయొక్క రచనలు కావని విద్వాంసు లందఱును నంగీకరించి త్రోసివైచిరి;) 37 నాటకముల యొక్కయు, నింకననేకములగు చిన్నకావ్యములయొక్కయు, నిస్సంశయమగు గ్రంథకర్తృత్వమునకు విద్వద్విమర్శకలోకము యావత్తును 'షేక్స్పియర్'ను బట్టముగట్టియున్నది; ఇఁక వీనిలోనిశైలి, పరిసమాప్తి, భాషారమణీయతలయందలి యపరిమితమగు భేదములుమాత్రమేగాక, యంతకంటెను నపరిమితములగు నద్భుతభేదము లూహలయందును, బుద్ధివైభవమునందును, నాధ్యాత్మికచింతనమునందును, (యాయనయొక్క "Rape of Lucrece," "Venus and Adonis," "The Passionate Pilgrim," మొదలగుగ్రంథములందువలె) నత్యంతరసవిహీనమైనట్టి యపరిమితానౌచిత్యముతోడను, బాల్యచేష్టితముతోడను బ్రారంభమై, (యాయనయొక్క "Macbeth",

"Othello," "Hamlet," "King Lear," "The Tempest" అను గ్రంథములందువలె,) సత్యున్నతకవితాశయములవఱకును, మేధాసంపదవఱకును వ్యాపించి కనఁబడుచున్నవి! (వీనిలోని కడపటిగ్రంథము నాయనయొక్క పరిపక్వమైన పరిపూర్ణప్రతిభాఫలితముగ ప్రసిద్ధవిద్వాంసులందఱును నంగీకరించియున్నారు.)—ఈయపరిమితములును, మహత్తరములునునగు భేదముల కారణమున, 'షేక్స్పియర్' కవియొక్క సుప్రసిద్ధములగు 37 నాటకములయొక్కయు, నితరకావ్యములయొక్కయు గ్రంథకర్తృత్వమును మనము 37 మందియో, యంతకంటె నెక్కువమందియో యగునితరులకు నంటఁగట్టి, యసాధారణమును, 'గాకతాళీయమును,' దైవికమును నగు సందర్భవశమున వారందఱును 'షేక్స్పియర్' అను నొక్కటేపేరునుగలవారై యుండుట తటస్థించియుండవచ్చునని వాదించినచో నది న్యాయసమ్మతము కాఁజాలునా?!

"అభివృద్ధిస్వభావము."

ఈవిధముగ వారినిప్రశ్నించినచోఁ, బాశ్చాత్యవిద్వాంసుఁడును, విమర్శకుఁడును, బాశ్చాత్యనాగరకతాభిమానియగు ప్రాచ్యదేశపరిశోధకుఁడును డెల్లబోయి, శుద్ధసక్రమమును, సర్వవిధముల న్యాయసమ్మతమును నగు నీక్రిందిప్రత్యుత్తరమును జెప్పవత్తురు:—"నీ వెంత వెఱ్ఱివాఁడవు! 'షేక్స్పియర్' ఎన్నఁడును బెరుగలేదనియు, శైశవమునుండి మరణాంతమువఱకును నాయనయొక్కయూహలు, నభిప్రాయములు, శైలి, భాషాజ్ఞానము, మొదలగువానియందొక్కతీరున నే మార్పులేకనిలువఁబడియుండెననియు, నీవూహించుట యెంతటియవివేకము? ఆయనయొక్క కావ్యములయొక్కయు, నాటకములయొక్కయు గాలక్రమానుసారమగు నేర్పాటే, 'షేక్స్పియర్' యొక్కమనస్సు, బుద్ధి, విజ్ఞానములలోని వికాసపరిణామమును మనకుఁ దెలియఁజేయుచరిత్రగ్రంథముగనుండుటను నీవెఱుఁగవా?" ఈప్రత్యుత్తరము మిక్కిలిసహేతుకమనియు, నిరాక్షేపణీయమనియు మనము నిష్కపటముగ నంగీకరించితీరవలసినదే; కాని, యట్లు మనస్సు, బుద్ధి, విజ్ఞానము, భాషాపాండిత్యము, మొదలగువానియందు నభివృద్ధినొందుస్వభావము పాశ్చాత్యగ్రంథకర్తలకుమాత్రమే సర్వస్వాధీనమైయున్నదా? యనియు, భారతీయగ్రంథకర్తలెన్నఁడును నభివృద్ధినొందఁజాలరనియు, వారియూహలు, వారిభాషాజ్ఞానసామర్థ్యము మొదలగువానియందుఁ బుట్టినదిమొదలు చచ్చువఱకును నొక్కటేస్థితియం దుండితీరవలయుననియు నేదియైన దైవాజ్ఞగాని, ప్రకృతిధర్మముగాని, ఋషిశాపముగాని, 'బ్రిటీషుపరిపాలకవర్గము' (పార్లమెంటు) వారిశాసనముగాని, భారతీయశాసననిర్మాణసభవారిచట్టముగాని, కలదా? యనియుఁ, బైపాశ్చాత్యనాగరకతాభిమానులగు ప్రాచ్యవిమర్శకులనే మే మడిగెదము!........."

—"ధర్మరాజ్య," సంపు. 1 సంచి. 5. పుట. 7-8 (తే 17-2-1934 దిః)

ఇట్లు కొలదికాలముజీవించి,కొలదిగ్రంథములను వ్రాసినవారివిషయముననే,గ్రంథ నిర్మాణకాలమునాఁటికి వారికిఁగల వయోఽభివృద్ధిననుసరించి వారివేఱువేఱుగ్రంథము లందు వేఱువేఱువిధములగు కవితాభేదము, శైలిభేదము, నూహాలభేదమును గల్గు చుండఁగాఁ, బెక్కుశతాబ్దములుజీవించి, పెక్కువేఱువేఱువిషయములతోఁగూడిన యపారమగు వేదమహాసముద్రమును మథించి, పూర్వోత్తరమీమాంసాసంబంధములగు పెక్కువిషయములను సంగ్రహించి, యష్టాదశమహాపురాణములవంటియు, మహా భారతమువంటియు సద్గ్రంథసముదాయమునురచించి, సంస్కృతవాఙ్మయసముద్రమును గల్పించినవేదవ్యాసమహర్షి యొక్కరచనలయం దచ్చటచ్చటఁ బైవిధములగు భేదము లుండుటలో నబ్బురమేమున్నది? అంతమాత్రముచే నవి భిన్నకర్తృత్వదోషమునకు గుఱిగావలసిన యగత్యమేమున్నది? అట్టియసామాన్యగ్రంథకర్తృత్వము జనసామాన్య మున కసంభవమైనను వేదవ్యాసమహర్షి క ట్లసంభవముగావలసిన యవసర మించుకంత యు లేదని సప్రమాణముగను, సహేతుకముగను, లోకానుభవానుసారముగను నీవ్యాస మునకు ముందఱివ్యాసమున నింతకుముందుగ బుజువుపఱచియుంటిమిగదా!

## పురాణేతిహాసములలోనివిషయములు కొన్ని యభూతకల్పనలు గావా?

పురాణేతిహాసములలో వర్ణింపఁబడిన కొన్ని యసామాన్యవిషయము లీకాలమున జనసామాన్యము చూచియుండఁజాలకపోవుటచే, నట్టివిషయము లసంభవములనియు, నబద్ధములనియు, నతిశయోక్తికొఱకును, గథాచమత్కారముకొఱకును గల్పించి వ్రాయఁబడిన విచిత్రకథలుమాత్రమేయనియు, వానిని యథార్థములగుచరిత్రవిషయము లుగఁ బరిగణించుట సరిగాదనియుఁ గొంద ఱభిప్రాయపడుచున్నారు. అవి సత్యములను భావము సన్నగిల్లినందున వానిలోనిధర్మములందుఁ బైజనులకుఁ బ్రామాణ్యబుద్ధియు శ్రద్ధయునుగూడఁ గ్రమముగసడలి, యట్టిధర్మాచరణమునందు నశ్రద్ధయును, నిర్లక్ష్య భావమును బ్రారంభమై, పెరిగి, వృద్ధినొంది, వానియందలిప్రమాణబుద్ధిచే నందలిధర్మా చరణముననుసరించునితరులయెడఁ బరిహాసభావమును, దృణీకరణభావమును, దుదకు విద్వేషభావమును, నట్టివారిని బరాభవించి దండింపవలయు ననుభావములునుగూడఁ జెలరేగి, క్రియారూపమును దాల్చియున్నవి.అది సంఘవినాశకరమగుటచే, దానిలోని సత్యమును గుర్తెఱిఁగి దానిని వృద్ధిగానీయకుండునట్లుచేయుట దేశాభ్యుదయమును గోరువారందఱికిని బరమవిధిగావున నందలిసత్య మించుకవిచారింతము.

వేదశాస్త్రములను, బురాణేతిహాసములను గుఱించిన మాయీగ్రంథమందలి విమర్శనమును మొదటినుండియుఁ సమగ్రముగాఁబరిశీలించుచు, నందలిచర్చలను వరుసగా

గ్రహించుచు వచ్చుచున్నయెడల, వానియుత్కృష్టతయును, వాని కసామాన్యమగు ప్రామాణ్యతగల్గుటకుఁ గారణములును జక్కఁగమనసున కెక్కి, వానియందలివిషయ మెట్టిదైననుగూడ, నందొక్కయక్షరమైననుగూడ నసత్యముకాఁజాలదని విశదమగును. కాని, తక్కినవిషయము లెట్లున్నను, ప్రత్యక్షవిరుద్ధములగు విషయములుకొన్ని వానియందుఁ గానవచ్చుచుండుటచే వాని నెట్లునమ్మవచ్చు ననుశంకమాత్రము సామాన్యజనులను సామాన్యముగ బాధింపకవిడువదు. కాని, బాగుగ నాలోచించిచూచినచో, నట్టి శంకగల్గుటకుఁ గారణము పైవిషయములను వారులెస్సగ నాలోచింపఁజాలకపోవుటచే నదివారిలోపమేగాని వేఱుగాదనుసంగతి బోధపడకపోదు. ఏమనఁగా: నసాధారణములగు ప్రజ్ఞావిశేషములుఁగలవారు లోకమున మిక్కిలితక్కువగనే యుందురనియు, నట్టి స్వల్పసంఖ్యాకులుగూడ లోకమున నన్నికాలములందును నుండక యేదోకొన్ని కాలములందుమాత్రమే యుందురనియు, నాకాలములందైననుగూడ లోకమందలి యేదోయొక దేశమున నేదోయొకమూలమాత్రమేయుందురుగాని లోకమందంతటను నన్నిమూలలను వెదజల్లియుండరనియుఁ, గావున నట్టివారిని జూచియెఱుఁగఁజాలినవారిసంఖ్య యత్యంత స్వల్పముగమాత్రమే యుండుననియు, దానికంటెఁ, జూచియెఱుగనివారిసంఖ్యయే యెన్నియోమడుగు లత్యధికముగా నుండుననియుఁ, నుదాహరణపూర్వకముగ, లోగడ నీప్రకరణముననే, "పదునెనిమిది మహాపురాణములను, మహాభారతమును, వ్యాసుఁడొక్కఁడే యెట్లు వ్రాయఁజాలె?" నను శీర్షిక క్రింద విశదపఱచియుంటిమి. అసాధారణములగు విశేషవిషయములసంగతిగూడ,నన్ని విధములచేతను నిట్టిదేయని యెఱుఁగవలయును. మఱియునొకకాలమునఁగాక, సృష్ట్యాదినుండియుఁ గడచిపోయిన పెక్కుకోట్లసంవత్సరములకాలములో, నొకయూరిలోఁగాక,యొక తాలూకాలోఁగాక,యొకజిల్లాలోఁగాక, యొకరాష్ట్రమునఁగాక, యొకదేశమునఁగాక, యొకఖండమునఁగాక, ప్రపంచకమందలి యన్నిమూలలలోను జరిగిన యావద్విషయములను నెఱిఁగియుండుట సర్వజ్ఞుఁడైన సర్వేశ్వరునకుఁదప్ప మనుష్యమాత్రునకెవ్వనికినిగూడ సాధ్యముకానేరదనిగూడ, నందే వివరముగావించియుంటిమి. అట్టి యావద్విషయములతో మనలోనివ్యక్తులయొక్క లోకానుభవములను (కాలపరిమితికిని, ప్రదేశపరిమితికిని లోనయిన యనుభవవిషయములను) బోల్చిచూచితిమేని, నట్టి లోకచరిత్రమహాసముద్రమున మన లోకానుభవబిందు వెన్నవపాలుండునో యూహింపసాధ్యమా? అందుచే నట్టియత్యంతస్వల్పమగు మనలోకానుభవకాలమున మన కీనాఁడు మనచుట్టుప్రక్కలఁ గానరానంతమాత్రమున మనము చూచియెఱుఁగనివిశేషవిషయ మేదియుఁ లోకమున నెచటను, సృష్ట్యాదినుండి నేఁటివఱకును జరిగియుండ నేగూడదని తలంచుట కేవల లోకజ్ఞానహీనతనుమాత్రమే చాటుననిగూడ నచటనే ప్రకటపఱచియుంటిమి.

దానికిఁదగినట్లే, మనలోకానుభవమునలేని యసామాన్యవిషయములన్నియు నస త్యములును, నసంభవములును గావలసిన యగత్యము లేదనియు, నట్టివి కొన్ని లోకమున నీకాలమునఁగూడ నప్పుడప్పు డచ్చటచ్చట జరుగుచునేయున్నవనియు, నిప్పటివార్తా పత్రికలను జాగరూకతతోఁ జూచుచుండినచో మనము గ్రహింపఁగల్గుదుము. ఇందుల కుదాహరణముగ, నీక్రింద స్థాలీపులాకన్యాయముగఁ జూపఁబోవు కొన్నిలోకవార్త లను గాంచనగును. ఇట్టివింకననేకము లెత్తిచూపవచ్చునుగాని, గ్రంథవిస్తరభీతిచే సంగ్రహముగఁ జూపుచున్నాము. (ఈకాలపునాగరకతయందును, విజ్ఞానమునందును, సమగ్ర మగు ననుభవముగల విలేఖరులచేతను, బ్రతికాధిపతులచేతను బ్రకటింపఁబడుచున్న వగుటచే వీనియందలిసత్యమును మనము శంకింపఁ బనియుండదు.)

అభూతకల్పన లనుకొనునవి యీకాలమునఁ గూడఁ గలవనుట కుదాహరణములు.

### సృష్టివైరుధ్యములు (FREAKS OF NATURE)

1. " The wife of Abdus Samad, a Civil Court Peon residing at Satarpur quarter of this town, has been delivered of a still-born twin—consisting of two females joined together from breast to abdomen. The twin has two heads, four hands and four feet and all the other organs fully developed.

The twin has been photographed and kept by the Bogra Medical School in the school laboratory, where many people are going to have a view of the "monster" as they call it."

"Dharmarajya," dated 24-11-1934, p. 3.

అనఁగా:—

"ఈపట్టణమందలి (పైసందర్భమునుబట్టి 'గౌహటి' (Gauhati) పట్టణమని తోఁచెడిని;) సతార్‌పూర్‌భాగమున నివసించువాఁడును, సివిల్‌కోర్టు (న్యాయస్థానపు) జవానునునగు 'అబ్దుస్-సమాద్' అనువానిభార్య, రొమ్మునుంచి పొత్తికడుపువఱకును నేకముగఁగలిసియున్న యిద్దఱుకవలపిల్లల నాఁడుబిడ్డలను గనెను. ఆకవలలకు రెండు తలలును, నాల్గుచేతులును, నాలుగుపాదములును, బాగుగనెదిగిన యితరములగు నన్ని యవయవములును గలవు.

ఆకవలబిడ్డలకు ఛాయాపటము (ఫోటో-గ్రాఫ్)ను దీసి, 'బోగ్రా' వైద్యపాఠ

శాలయందలి పరిశోధనగృహమున (లేబరేటరీలో) నుంచియున్నారు; ఆ"విచిత్ర రూపము"ను జూచుటకుఁ బెక్కుమందిజనులు పోవుచున్నారు.

"ధర్మరాజ్య"పత్రిక, (తే 21-11-1931, పుట 3.)

2. "ఢక్కాసమీపమున ఒకగ్రామమున ఒకస్త్రీకి ముగ్గురుశిశువులు జనించెను. రెండుశిశువులు చక్కగనున్నవి మరణించెను. రెండుతలలు అతుకుకొనియున్నబిడ్డ బ్రదికియున్నది."

—"త్రిలిఙ్గ"పత్రిక, (తే 29-10-1931, పు 10.)

(మనపురాణేతిహాసములలో వర్ణింపఁబడినరావణుఁడు మొదలగురాక్షసులకుఁ బెక్కుతలలును, గాళ్లుచేతులును నుండుటమొదలగువిషయము లసత్యముకావలసిన యగత్యములేదని పైవార్తలు చాటుచుండుటలేదా? అంతియగాక, యిట్టిసందర్భమున శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుపంతులుగారివాదమునకు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులవారొకతూరి త్రిలిఙ్గపత్రికలో వ్రాయించియున్న చక్కనిసమాధానము నిచట నుదాహరించుట యప్రస్తుతముకాదనియెంచి దాని నీక్రిందఁ గనఁబఱచుచున్నాము:-)

... ... ... ... ... ...

## రావణునితలలు.

3-A "లండన్పట్టణమెట్లున్నదో తాము ప్రత్యక్షముగఁ జూచియుండకపోయినను దానినిజూచినవారు చెప్పినదానింబట్టి యాపుర మట్లుండునని నమ్ముదుమనిన మనపంతులుగారు, రావణాదులకాలములో నుండి రావణుని బ్రత్యక్షముగఁ జూచినవాల్మీకిమహర్షి యారాక్షసేంద్రునకుఁ బదితలలు గలవనినప్పుడు వీ రేలనమ్మరు? ఇది ప్రకృతిశాస్త్రవిరుద్ధముకావున దీనిని నమ్మమందురా? ఇం దావైరుధ్య మేమున్నది? ప్రకృతిలోఁ బెక్కులగు తలలుగలిగియుండు జీవరాసులు లేవా? చాలకలవు. ఎట్లన—

## ప్రకృతిశాస్త్రములు, అస్వాభావికము.

## (MONSTERS.)

స్థావరములలో:—స్థావరములగు తాడి, కొబ్బరి, ఈత మున్నగుచెట్లు సాధారణముగ నొక్కటియే తలగలిగియుండును. కాని, యప్పుడప్పుడు బహుశిరస్సులుగలచెట్లక్కడక్కడ కలుగుచుంట మనకు గోచరమగుచుండును. మనతూర్పుగోదావరిమండలములోఁ గపిలేశ్వరపురముకడ నొకతాటిచెట్టు పదునొకండుతలలుగలది బయలుదేరినదని యాంధ్రపత్రికలో 26-8-1932-వ తేదీగలదానిలోఁ బ్రచురింపఁబడియున్నది. ఇట్టివనేకములుగలవు. ఇది మనవృక్షశాస్త్రము (బాటనీ) వలనఁ దేలినవిషయము.

సరీసృపములలో:—పెక్కులగుతలలు, కాళులు, చేతులుగలిగియుండుశరీరులు లోకములోఁ బుట్టుచుండురనియు, వారిని (Monsters) అందురనియుఁ బాశ్చాత్యుల

ప్రకృతిశాస్త్రములు చెప్పుచున్నవి. ఇట్టి 'మాన్స్టర్సు' సర్పాదులలో దఱచుగ గలుగు చుండునని "వెబ్స్టర్సు-నిఘంటువు" బోధించుచున్నది. ఇది జంతుశాస్త్రము (Geology) వలనఁ దేలుచున్న విషయము.

మానవులలో:—మానవులలోఁగూడ బహుశిరస్సులు, హస్తములు, మున్నగునవి గలవారలు పుట్టుటగలదు. "మాన్స్టర్" అనఁగా రెండుతలలశిశువని "బ్రౌను-నిఘంటువు"నందు వ్రాయఁబడియున్నది. అది యిట్లున్నది:

"The child is a monster=ఆబిడ్డ ప్రష్టాండమైనది; వికారాకారము గలది; వికారమైనది. అనఁగా రెండుతలలు, కోఱలు మొదలైన యవయవములు గలది." వీనినన్నింటిని బట్టిచూడ, మానవులందుఁగూడ రాక్షసాకారముగలవారు (Monsters) కలరనియు నప్పుడప్పుడు పుట్టుచుందురనియు నవగతమగుచున్నది. దాంపత్యశారీరశాస్త్రములో (Sexual Physiology) పెక్కులగు శిరస్సులు, బాహువులు మున్నగునవయవములు గలశిశువులు పుట్టుటకలదని వ్రాయఁబడియున్నది. మన శ్రీ పంతులవారివ్యాసముగల యాంధ్రపత్రికలోనే, "12-8-1932-వ తేదీ" గలదానిలో, బర్మాలో నాలుగుచేతులు, నాల్గుకాళ్లుగలబిడ్డపుట్టినట్లు వ్రాయఁబడియున్నది. ఇంతయేల? రెండుతలలు, నాల్గుచేతులు, నాల్గుకాళ్లు గలబాలద్వయసమావేశము గలదనువిశేషము గోదావరీపుష్కరసమయమునందు రాజమహేంద్రవరములోఁ బ్రదర్శింపఁబడియున్న సంగతి యందఱకును దెలిసినవిషయమే. ఇది మానవశరీరశాస్త్రముతో సంబంధించిన విషయము. ఇవన్నియు నిటులుండఁగా, భూగర్భశాస్త్రమునుబట్టిచూడఁ బూర్వకాలమునందు బహుశిరస్సులు, భుజములు మున్నగు నవయవములుగలదేహులు జన్మించుచు వచ్చినట్లు తేలుచున్నది.

కాన, శిశుజన్మాదులతో సంబంధించియుండు పాశ్చాత్యకృతప్రకృతిశాస్త్రములగు "బోటనీ, జూలజీ, ఫిజియాలజీ, జియాలజీ, సోషియాలజీ," మున్నగునవి రావణునివంటి యస్వాభావికదేహులు బయలుదేరుచుంట ప్రకృతిలో నస్వాభావికము కాదని రూఢిపఱచుచున్నవి. అనవసరమగు నవయవాధికతగలవారలు దుర్మార్గులగుదురని సోషియాలజీలోఁ బండితులగువారు చెప్పుచుందురు. తదనుగుణముగానే, రావణాదుల చర్యలు రామాయణాదులలో వర్ణింపఁబడియున్నవి. శాస్త్రములన్నియు నీవిధముగాఁ దెల్పుచుండ, నెప్పుడో పూర్వయుగములందు రావణుఁడను వికారదేహుఁడు (monsters) మున్నగువారు మిక్కిలియరుదుగగలరని మనశాస్త్రములుచెప్పుచుండఁగా, మనమేల దానిని నమ్మకుండవలయును? ప్రకృతిలోనసాధ్యమేది? ఏదియుచు లేనప్పుడును, బ్రత్యక్షముగాఁజూచిన వాల్మీకి,రావణునకుఁ బదితలలుగలవని వర్ణించినప్పుడును,మనము ప్రత్యక్షమునేగాక యాప్తవాక్యజనితమైన జ్ఞానము నేల త్రోసివేయవలయును?" ...

—"త్రిలిజ్ఞ," (19-9-1932 తేదీ, పుట, 3.)

## THE CRAWFISH.

3-B. "Crawfish has an eye in its tail. It is sensitive to light, but sees much more slowly than the eyes in the creature's head.

—" Dharmarajya (d, 7-12-1935, p. 3)

అనఁగా:—

"ఒకజాతిచేఁపకు దానితోఁకలో నొకకన్నుగలదు. దానితో వెలుతురు తెలిసి కొనునుగాని యాజంతువుయొక్క తలలోనున్న కండ్లతోకంటె నెక్కువ నెమ్మదిగాఁ జూడఁగల్గును."

—ధర్మరాజ్యపత్రిక, (తే 7-12-1935, పుట. 3.)

[మనపురాణాదులలో వర్ణింపఁబడిన భృగుమహర్షికి నడికాలిలోఁగన్నుండుటయు, శివునకు నొసట మూఁడవకన్నుండుటయు, నబద్ధములు కావలసినంతటి సృష్టివిరుద్ధములుకావని యీవార్త చెప్పుటలేదా? చేఁపకును మనుష్యునకును నేమిసంబంధమందురా? చేఁపలలోమాత్ర మన్నిఁటికిని దోఁకలోఁ గన్నుండుటను మనముచూడఁజాలియున్నామా! అట్టివెక్కడనో మిక్కిలియరుదుగానేకదా కనఁబడుచున్నవి! ఆరీతిగనే మనుష్యులలోఁగూడ నట్టివారెచటనో యరుదుగానున్నచో నందు విరుద్ధమేమున్నది?]

## RAIN OF JELLY FISH.

3-C. "A kind of fish called the 'Jelly fish' is said to have descended from the clouds during a rain-storm in Australia recently. The phenomenon is said to be exciting much interest."

Dharmarajya, (d, 7-12-1935, p. 3.)

అనఁగా:—

### చేఁపలవాన.

" 'జెల్లీ' చేఁపలనెడి యొకజాతిచేఁప లిటీవల 'ఆస్ట్రేలియా' ఖండమున నొకగాలివానలో మేఘములనుండి పడినట్లు తెలియవచ్చుచున్నది. ఈయద్భుతదృశ్యమువలన మిక్కిలి యలజడి పుట్టియున్నది."

—ధర్మరాజ్య, (తే 7-12-1935, పు 3.)

[రామాయణమున, రావణసంహారమైనపిదప దేవతలు రామునిపైఁ గురిపించిన పుష్పవర్షమును, నం దుత్తరకాండమున, శుక్రునిశాపముచే దండునియొక్కపట్టణముపైఁ గురిసిన మంటివానయును, భాగవతదశమస్కంధమున నందునిమందపై నింద్రుఁడు గురిపించిన రాళ్లవానయు, మహాభారతాదిపర్వమున దుర్యోధనుఁడుపుట్టినపుడు కురిసిన నెత్తురువానయు, మొదలగునవి, పైనదెల్పిన చేఁపలవానవంటివే యైయుండవచ్చునేమో!!]

## అత్యధికసంతానములు

## A FREAK OF NATURE IN CHINA.

4. "The 50 year old wife of a hnmble farmer named Li-Hsi-Wu, who lives near the mining town of Tangshan, China, has given birth to three boys and two girls at the same time."

—Dharmarajya, (d, 30-3 1935, p. 5.)

అనఁగా:—

### చైనాదేశమున నొకసృష్టివైరుధ్యము.

"లీ—హ్సీ—వూ అను పేరుగలట్టియుఁ, జీనాదేశమునందలి గనులుగల 'టాంగ్‌షాన్' పట్టణప్రాంతముల నివసించునట్టియు నొకపాలముకాపువాని యేబది యేండ్లయీడుగలభార్య ముగ్గురు మగబిడ్డలను, నిద్ద ఱాఁడుబిడ్డలను నొక్కసారిగఁ గని యెను."

ధర్మరాజ్య, (తే. 30-3-1935, పు. 5.)

5. "ఎటావాన ఒకబ్రాహ్మణస్త్రీకి ఏడుగురుబిడ్డలుపుట్టిరి. కాని అన్నిబిడ్డలు వెంటనే చనిపోయెనని తెలిసినది. తల్లి ఆరోగ్యముగనున్నది."

త్రిలిఙ్గ, (తే. 1-10-1934, పు. 10.)

## TWENTY CHILDREN IN 21 YEARS.

6-A. "Mr. & Mrs. Bernard Coe, farmers of Priests Bridge Marryland, take pride in the fact that they have brought forth twenty children in twenty one years of their married life. What do Birth-Control advocates say? Mrs. Coe has not become a wreck after bringing forth so many children."

—Dharmarajya (d, 22-6-1935, p. 3)

అనఁగా:—

### 21 సం॥రములలో నిరువదిమందిబిడ్డలు.

"మ్యారీలాండు" నందలి 'ప్రీస్టుస్-బ్రిడ్జి'లోని 'బెర్నార్డుకో' అను కాపువాఁడును వానిభార్యయును గాఁపురమునకువచ్చిన యిరువదియొక్క యేండ్లలో నిరువదిమందిబిడ్డలను గనినందులకు గర్వించుచున్నారు. 'సంతాననిరోధ'వాదు లిందు కేమిచెప్పెదరు? అంతమంది బిడ్డలను గనినపిమ్మటఁగూడ నాకాపువానిభార్య కారోగ్యము చెడలేదు.

ధర్మరాజ్య. (తే 22-6-1935, పు. 3.)

6-B మఱియును, "Man of 126 years old" అను నీక్రింది 13-A వ వార్తను గూడఁ జూడుఁడు.

(వీనిని బట్టిచూడ, మహాభారతమున గాంధారికి దుర్యోధనాదులగు నూరుమంది బిడ్డలుపుట్టుట మొదలగుకథ లస్వాభావికములుగాని, యసంభవములుగాని, కావలసిన యావస్యకత లేదనియు, నీకాలముననే యింతమందిబిడ్డలను గనఁజాలువారుగూడ నుండుటచే, నిప్పటి కెన్నియోవేలయేండ్లకుఁబూర్వ మున్నవా రిప్పటివారికంటె నెన్నియోరెట్లధికబలములు గలవారగుటచేఁ బైరీతిని వందలకొలది బిడ్డలను గనుటలో నాశ్చర్య ముండరాదనియు, బోధపడుటలేదా? కానిచో, నీక్రింది 13-A వ సంఖ్యగల విషయమునుగూడఁ జూడుఁడు!)

## చచ్చినవారలు బ్రదుకుట.

## MARVELS OF YOGA.

... ... ... ... ...

### 7. DEAD MAN LIVES AGAIN.

"One day, in a very lonely part of Eastern Bengal, one of our gardeners was bitten by a cobra. In spite of all efforts to save him, the poison took effect and he died.

Some hours later a Yogi called at the house and was given food and, incidentally was told about the gardener. He asked to see the man. Squatting alongside the string bed, he tied a piece of grass round the man's forefinger and muttered a string of religious incantations. Within a few minutes the man moved and after a while sat up. He worked for years with us after this experience.

(Pearson's Weekly.)

—"Dharmarajya" (d., 15-6-1935, p. 16.)

అరఁగా:—

## చచ్చినవాఁడు మరల బ్రదికెను.

"ఒకనాఁడు, తూర్పుబంగాళాదేశమునందలి యొకమారుమూలలో, మాతోఁట మాలులలో నొకనిని త్రాచుపాము కఱచెను. వానిని గాపాడుట కెన్నియోయత్నములు చేసినను విషమెక్కినందున వాఁడు మరణించెను.

అవతలఁ గొంతసేపటి కొకయోగి యాయింటికిరాగా, వాని కన్నముపెట్టి మాటల సందర్భమున నాతోఁటవానిమాటను జెప్పిరి. ఆయోగి వానిని జూడఁగోరెను. ఒక చిత్రాసనముపైఁగూర్చొని, యొకగడ్డిపరక నామనుష్యునియొక్క చేతి రెండవవ్రేలికిఁ (జూపుడు వ్రేలికిఁ)గట్టి, కొన్నిమంత్రములను లోలోన జపించెను. కొన్నినిమిషముల

కామనుష్యుఁడు కదలి, యటుపై మఱికొంతసేపటికి లేచి కూర్చొనెను. ఇది జరిగిన పిమ్మట వాఁడు మాతోఁగలసి కొన్నియేండ్లవఱకును బనిచేసెను."

... ... ... ... ... ...

('పియర్‌సన్స్'-అను వారపత్రికనుండి.)

ధర్మరాజ్యపత్రిక, (తే 15-6-1935 దీ, పుట. 16.)

## 8. A WOMAN DUG OUT ALIVE AFTER 3 DAYS.

"It is stated that in an Afghan village, a middle-aged woman was taken alive from her grave full three days after her supposed death. A relative of the woman who went to the grave to recite the Quoran for the peace of the departed soul, heard some sound coming up from the grave. He at once informed the villagers about the strange sound, and immadiately the grave was dug up, and the woman was found alive. When asked, the woman said that when she regained her consciousness, she found herself in the presence of a white-bearded holy person, who commanded her to shout for help."

—" Dharmarajya," (d., 30-3-1935, p. 5.)

అనఁగా:—

## మూఁడుదినములతరువాతఁ ద్రవ్వియెత్తఁగా బ్రదికియున్నస్త్రీ.

"ఆఫ్ఘనిస్థానమందలి యొకగ్రామమున నొక నడువయస్సుగలయాఁడుది చనిపోయినదని యనుకొనినపిదప మూఁడుదినముల కామెయొక్క గోరీనుండి ప్రాణముతోఁ దీయఁబడెనని తెలియుచున్నది. ఆమెయొక్కబంధువుఁ డొకఁడు, చనిపోయిన యామెయొక్క మనస్సునకు శాంతికల్గుటకై యాగోరీయొద్ద 'కొరాను' చదువుటకుఁ బోఁగా, గోరీలోనుండి యొకధ్వని పైకివచ్చుట వినఁబడెనఁట. వెంటనే వాఁ డాగ్రామస్థుల కావిచిత్రధ్వనిసంగతి తెలుపఁగా, వా రాగోరీని ద్రవ్విచూచిరఁట. ఆయాఁడుది యందులో జీవించియుండెనఁట. ఆమెను బ్రశ్నింపఁగాఁ, దనకు స్పృహావచ్చుసరికిఁ దనయెదుటఁ దెల్లనిగడ్డముగల యొకదివ్యపురుషుఁ డగుపించి, దనకుఁ దోడ్పడరమ్మని కేకలువేయుమని యాజ్ఞాపించెనని యాస్త్రీ చెప్పెనఁట."

ధర్మరాజ్యపత్రిక, (తే 30-3-1935, పు. ౫.)

9. "ఆడ్రియాన ఒకస్త్రీ ప్రసవించెనుగాని, శిశువు ప్రాణము లేకయుండెను. వైద్యులు గుండెదగ్గఱ ఇంజక్షనుచేయఁగానే ప్రాణమువచ్చెనఁట! శిశువు ఆరోగ్యముగ నున్నది.

త్రిలిఙ్గపత్రిక, (తే 18-2-1935 పు. 10)

10-A "ఆత్మహత్యగావించుకొన్న శవమును రష్యా వైద్యులు తెప్పించి నెత్తురు నెక్కించినమీదట శ్వాసకోశములనుండి యూపిరివచ్చుటకు ప్రారంభించెనట! త్వరలో ప్రాణమునుగూడ తెప్పింపవీలగునని యీడాక్టర్లు తలచుచున్నారు."

'త్రిలిఙ్గ' పత్రిక, (తే. 10-12-1934 పు. 11)

10-B "సోవియటురష్యాన సుప్రసిద్ధడాక్టరు ఒక చచ్చినకుక్కను బ్రతికించిరట! ప్రాణులచావునగూడ భేదములున్నవనియు, కొందఱు చచ్చిన అర్ధగంటలోగా వీరిని బ్రతికింపవచ్చుననియు పరిశోధనలవల్ల యీడాక్టరు నిరూపించిరి. వీరిపేరు 'బ్రూకనకా'వని ప్రచురించిరి.

త్రిలిఙ్గ, (తే 23-9-35 పు. 9)

10-C "గుండె కొటాలున ఆగిపోయినచో మనిషి చచ్చునుగావున యంత్రసాధనమువల్ల 'మాంచెస్టరు'-ఆసుపత్రిలో నూపిరితీయుటకు యేర్పాట్లుగావించిరి కావున రోగి కొన్నిగంటలు బ్రతికియుండునని వినుచున్నాము."

త్రిలిఙ్గ (7-10-1935, పు. 10)

(ఈపైవార్తలను బట్టిచూడఁగా, శ్రీమద్రామాయణమందలి యుద్ధకాండమున నింద్రజిత్తుయొక్క బాణవృష్టిచే మడిసిన వానరసేనలన్నియు హనుమంతుఁడు దెచ్చిన సంజీవనిచే బ్రదుకుటయు; రామరావణయుద్ధములోఁ జచ్చిన వానరులందఱును యుద్ధానంతర మింద్రునివరముచేఁ దిరిగి బ్రదుకుటయు; నుత్తరకాండమున, శూద్రుఁడగు శంబుకుఁడు తపస్సుచేయుటచే రామునిరాజ్యమునఁ జనిపోయిన బ్రాహ్మణబాలుఁడు శంబుకవధానంతరము తిరిగి బ్రదుకుటయు; మహాభారతమం దరణ్యపర్వమున మృతుఁడైన సత్యవంతుఁడు తనభార్యయగు సావిత్రియొక్క పాతివ్రత్యప్రభావముచే యమునిబారినుండి తప్పి మరల బ్రదుకుటయు; శాంతిపర్వమున "మ్రుచ్చులచేఁ జచ్చిన సువర్ణష్ఠీవి నారదువలనఁ బునర్జీవితుఁ డగుట"యు, నశ్వమేధపర్వమున బభ్రువాహనునిచేఁ జెగినయర్జునుఁ డులూపిచేతి సంజీవనమణిచే బ్రదుకుటయును; మార్కండేయపురాణమున మాండవ్యునిశాపముచేఁ మరణించిన కౌశికుఁడను బ్రాహ్మణుఁడు పతివ్రతయైన యనసూయయొక్క పాతివ్రత్యమహిమచే మరల బ్రదుకుటయు; నీవిధముగనే చనిపోయినవారనేకులు మణిమంత్రౌషధతపఃప్రభావాదులచే బ్రదికినట్లు మనపురాణాదులందు వర్ణింపఁబడిన యిట్టికథ లనేకములును, నబద్ధములు కావలసినపని లేదని ఋజువగుచుండుటలేదా?)

## పక్షులును, జంతువులును మాటలాడుట.

పశువులును, పక్షులును, మొదలైనజంతువు లొకప్పుడు తమలోఁ దామే మాటలాడుకొనినట్లును, మఱియొకప్పుడు మనుష్యులతో నవియు, వానితో మనుష్య

లును మాట్లాడుకొనినట్లును, (మహాభారతమున శాంతిపర్వమందలి "గృధ్రజంబుకో పాఖ్యానము"ను, "వ్యాఘ్రగోమాయుసంవాదంబు"ను, "లుబ్ధకపోతోపాఖ్యానము"ను మొదలగునవి) మన పురాణేతిహాసములందుఁ బెక్కుకథలు గన్పడుచున్నవిగదా! ఇట్లు పశువులును, బక్షులును, మనుష్యులును గలిసి మాటలాడుకొనుట లోకమున నిపుడెచ్చ టనుగూడఁ గానవచ్చుటలేనందున, నవి కేవలము కల్పితకథలై యుండవలయునని మన నవనాగరకసోదరులు కొందఱు తలంచుచున్నారు. కాని, కేవల పూర్వాచారపరాయణు లగు మఱికొందఱికిఁగూడ నట్టిసంశయము గల్గుట కవకాశ మున్నప్పటికిని, వారిపూర్వుల యందును, వారిమతాచారములందును, వానిని బోధించుమతగ్రంథములందును, వారికిఁ గల దృఢమగు భక్తివిశ్వాసములచే, నట్టిసంశయములకుఁ దమహృదయములందు నెడ మీయక, పూర్వకాలమున నప్పటిజీవుల కట్టి శక్తిసామర్థ్యము లుండినయుండవచ్చునని యుఁ, గానిచోఁ, బూజ్యులును సత్యవాక్యధురంధరులును, సర్వమునుద్యజించి లోక హితముకొఱకై పాటుపడినవారును నగు తమపూర్వు లట్టియసత్యముల ననవసరముగా వ్రాసియుండవలసినయగత్య మేమియు లేదనియు, నీకాలమున మన మట్టివి చూడఁజాల నంతమాత్రమున నవి యెన్నడును లోకమున నెచ్చటనుగూడ జరిగియేయుండరాదని తలంచుట యవివేకమనియు, మనస్సులను సమాధానపఱచికొని యూరుకొనుచున్నారు. మనమతమునందును, మతగ్రంథములందును, మనపూర్వులయెడలను, బైవిధములగు భక్తి విశ్వాసములను మననవనాగరకులు విదేశీయవిద్యావ్యామోహముచేఁ జిన్ననాఁడే గోల్పోవుటయేగాక, మన మతధర్మములును, వానికిమూలములగు వేదశాస్త్రములను నేర్పడిన విధానమునుగుఱించి సత్యమైనచరిత్ర నెఱుఁగక, యందులకుమారుగ నసత్యవిష యములను నేర్చికొని యవియే సత్యములను భ్రాంతితోనుండుటచే, బైనదెల్పిన పూర్వా చారపరాయణులయొక్క పైవిధములగు భక్తివిశ్వాసములను మూఢవిశ్వాసములనియు, మూఢభక్తియనియుఁ బరిహసించుచున్నారు. ఈకాలమున మన మతమునకుసంబంధించిన ప్రతిసమస్యసందర్భమునను, నవనాగరకులకును బూర్వాచారపరులకును నడుమనున్న పరిస్థితి కేవల మీవిధముగానే యున్నది. కావున నీవిషయమును గొంచెము చర్చించి సత్యమును దెలిసికొందము.

సామాన్యమగు లోకానుభవదృష్టితోఁజూచితిమేని, పశువులును, బక్షులును మొదలగునవిమాట్లాడుట యసత్యముగనే గన్పించును. కాని, దూరదృష్టితోఁ గొంచెము పాఱఁజూచితిమేని నట్టిప్రాణులందుఁగూడ, మనుష్యులందువలెనే యన్నివిషయములను గ్రహింపఁజాలిన జ్ఞానేంద్రియములు గలవనిగోచరించును. త్వగింద్రియము (చర్మము) ద్వారా స్పర్శసుఖము నవి యనుభవించుచున్నవనుటకు, గేఁదెలును, బందులును మొద

లసునవి నీళ్లమడుగులలోను, బురద (అడుసు) గుంటలలోనుబడి పొరలాడుటయేసాక్షి. చక్షురింద్రియముద్వారా చూచి తెలిసికొనుశక్తి వానికిఁ గలదనుటకు, నవి వానివాని యాహారపదార్థములను జూచినపుడావైపు పరుగెత్తుటయును, బిడ్డలను జూచినపుడు వానిని నాకి ముద్దాడుటయు,వానికిఁబాలిచ్చుటయును, శత్రువర్గములోని జంతువులను జూచినపుడు తమకంటెఁ దక్కువబలముగలవానిని (బిల్లులను గుక్కలుతరిమినట్లు) దాము తరుముటయుఁ, దమకంటెనెక్కువబలముగల శత్రుమృగములను జూచినచో భయపడి (కుక్కనుజూచిపిల్లిపరుగెత్తినట్లు) పరుగెత్తిపోవుటయును, బ్రొద్దుగ్రుంకుసరికి వానివాని యజమానులయిండ్ల కాయాపశువులు సరిగాఁ జేరుటయును, నీమొదలగువిష యములు సాక్ష్యములు. ఇట్లే జిహ్వచేతను, ముక్కుచేతనుగూడఁ దమకింపైనయాహార మును బరీక్షించి గ్రహించుటయు, నింపుగానిదానిని వదలివేయుటయుఁ, గూడఁజూచు చున్నాము. ఎలుకలున్నతావును వాసనచేఁ బిల్లిగ్రహించి యచటఁజేరి పొంచియుండుట యును, మూత్రమును విడుచుటకుముందు కుక్క యాయాప్రదేశములను బలుమారు ముక్కుతో వాసనచూచి పరీక్షించుటయును, లోకానుభవముగలవారికిఁ దెలిసినవిషయ ములే. ఇఁకశ్రోత్రేంద్రియము (చెవ్వు) విషయమునఁ బశుపక్ష్యాదులకుఁ గలజ్ఞానశక్తి, తక్కినజ్ఞానేంద్రియముల శక్తులన్నిఁటికంటె నాశ్చర్యకరముగ నున్నది. ఏమనినఁ, దక్కినజ్ఞానేంద్రియములశక్తిచే నవికేవలము తమతమమనస్సులకు సంబంధించిన విషయ ములనుమాత్రమే యెఱుఁగుచున్నవి. కాని, శ్రోత్రేంద్రియముచే నట్లుగాక, యవి మనుష్యునిహృదయములోని భావమునుగూడ గుర్తించి మెలఁగుచున్నవి. ఎట్లనఁగా: గేదెలు, నావులు మొదలగుపశువులును, గుక్కలుఁ, బిల్లులు మొదలగు పెంపుడు జంతువులును, "దా! దా!" యని పిలిచినతోడనే యజమానుని మాటనుగుర్తించి పరు గెత్తివచ్చుచున్నవి. అట్లే, "పో, పో!" యనియదలించినఁ బోవుచున్నవి. పెంపుడు జంతువులు కానివానిసందర్భమునఁగూడఁ గొంతవఱకిట్లేజరుగుచున్నది; "హుష్, హుష్!" అని మనుష్యుఁడు కేకవేయఁగా విని, కాకు లెగిరిపోవుచున్నవి. 'ఛా, ఛా!' యనుకేకవిని కుక్క పారిపోవుచున్నది. "ఇస్కా! ఇస్కా!" అనుసరికిఁ గుక్కలు పోరాటమునకుఁ దారసిల్లుచున్నవి! వేయేల! మనుష్యుఁడు నేర్పినమాటలనే విని నేర్చి కొని, చిలుకలు మనుష్యుఁడుపలికినరీతిగనే ముద్దులొలుకునట్లు పలుకుచున్నవి. మనుష్య భాషమును శ్రోత్రేంద్రియముచే గ్రహించి మెలఁగఁజాలిన యద్భుతజ్ఞానము తిర్యగ్జాతు లందుఁగూడఁ గలదనుటకు నింతకంటె వేఱేమిసాక్ష్యముగావలయును? వేఱువేఱు దేశములందు నివసించు పైజంతువులన్నియు, నాయాదేశభాషలను మాట్లాడునట్టి మనుష్యులమాటలనుగ్రహించియే మెలగుచున్నవిగాని, యొక్కభాషను నేర్చియుండుట చేతనే మెలఁగుటలేదు.

ఈపైనజెప్పినప్రాణులన్నియు నించుమించుగ మనుష్యబలమునకు సరిసమానమగు దేహబలమో, కాక యంతకంటెఁ గొంచెమెచ్చుతగ్గైనబలమో కలవిగా నున్నవి. వీని మాట యటుంచి, మనుష్యబలమునకుఁ బెక్కురెట్లెక్కువబలముగల యెద్దులు, గుఱ్ఱములు, లొట్టెలు, నేనుఁగులు మొదలైనజంతువులమాట యాలోచించినను, నవిగూడఁ దగినమనుష్యశిక్షణమునొంది, మనుష్యభాషచే మనుష్యభావమునుగ్రహించి మెలఁగఁ గల యద్భుతజ్ఞానముతోడనే యలరారుచున్నవి. ఇందుకు నిదర్శనముగ నెద్దులను, గుఱ్ఱములను మనుష్యుఁడు స్వాధీనముచేసికొని, తనకుసాధ్యముకానిబరువులను వానిచే మోయించుచుఁ, దనకు నడచుటకును, బరువెత్తుటకును సాధ్యముగానిదూరమును వానిచేఁ బరువెత్తించుచు, బండ్లులాగుట, యరకదున్నుట మొదలగుపనులను మాటసంజ్ఞచేతను, బగ్గములు మొదలైనవాని సంజ్ఞచేతను, నాయాజంతువులచేఁ జేయించుకొనుచున్నాఁడు. ఏనుఁగులు, నొంటెలు మొదలగువానిని మనుష్యుఁ డెక్కవలసివచ్చినపుడు తనభాషనే యుపయోగించి, "పండుకొను" మనియుం, "లేవు" మనియు, "నడువు". మనియుం, "నిలువు" మనియు, నీమొదలగుమనుష్యభాషనే మాటలాడుచుండుటయుం, నాభాషణములనువిని, వానిద్వారా చెప్పువానిభావమునుగ్రహించి, యాజంతువులు వాని యాజ్ఞానుసారముగ మెలఁగుచుండుటయును, నీనాఁడుగూడఁ జూచుచున్నవారు మనలో నెందఱులేరు!

ఇంతకంటెను నద్భుతమగు సమాచారమునుగూడ లోకమున మన మొకటి చూచుచున్నాము! ఏమనఁగాః 'సర్కస్' (Circus) ప్రదర్శనములలో మిక్కిలిభయంకరములగు క్రూరమృగములకుఁగూడ మాటలచేతనే యాటలు మొదఁగునవి నేర్పి, మాటలచేతనే వానిచే నాటలాడించుచుండుటనుగూడ మనలో ననేకుల మప్పుడప్పుడీనాఁటికినిగూడఁ జూచుచుండుటలేదా? ఇట్లే క్రూరమృగజాతిలోఁజేరిన యెలుఁగుబంట్లకును, గంగిరెద్దులకునుగూడ మాటలచే నాటలాడుటను నేర్పి, వీథులవెంట నాడించుచు, నామూలమునఁ బొట్టవోసికొను మనుష్యులనుగూడ మనమీనాఁడు చూచుచునే యున్నాము. మనుష్యభాషణములసంజ్ఞచే మనుష్యభావములనుగ్రహించి మెలఁగఁ జాలినసామర్థ్యము పశుపక్ష్యాదులగుతిర్యగ్జాతులందుఁగూడఁ గలదనుటకు నీపైన దెల్పియున్నవిషయములకంటె వేఱేమి నిదర్శనములు కావలయును? (మఱియు నీక్రింది (60-D) సంఖ్యగల విషయమునుగూడఁ జూడుఁడు.)

దీనినిబట్టిచూడఁగాఁ బశువులుఁ, బక్షులు లోనగుజంతువులందుఁగూడ, నొక్కొక జాతిలోనివి వానిలోని యన్యోన్యభావములను గ్రహింపవీలగునట్టిభాష లుండుటలో నాశ్చర్యముండరాదు. అంతియగాక, యొకయావును, దానిదూడను నొకదానికొకటి గానరాకుండునట్లు కొంచెముదూరముగఁ గట్టివైచినయెడల, నావుకొఱకై మొదట దూడ 'యంబా' యని యఱచుటయు, దానియఱపువిని, య ట్లఱచునది తన బిడ్డయేయని యావుగ్రహించి తిరిగి తానుగూడ నఱచుటయును, నావుయొక్క యఱ పునుగ్రహించి మరల దూడయఱచుటయును, మనము సామాన్యముగ లోకమున జూచుచునేయన్నాముగదా! పక్షులు తమపిల్లలయఱపువిని వానియాఁకలినిగ్రహించి మేతతెచ్చి వానిముక్కులోఁ బెట్టుటను గనుచున్నాము. పశువు లెదయైనపుడు తమ కామవాంఛను సూచించుట కెక్కువగ నఱచుటను జూచుచున్నాము. ఇట్టివిషయ ములనుబట్టి యాలోచింపఁగాఁ, బశుపక్ష్యాదులందుఁగూడ నన్యోన్యభావములను తెలుపుకొన వీలగునట్టిభాష లాయాజాతులం దుండుటలో నసంభవ మేమియు నుండఁజాలదని స్ఫురింపకపోదు.

ఇట్లు పశుపక్ష్యాదిజంతువులు వానివాని స్వీయజాతులలోని భావములను వ్యక్తపఱచుకొనఁజాలినభాషను నేర్చియుండుటయును, పైనదెల్పియున్నరీతిగా మనుష్యభావములను మనుష్యభాషచే నెఱిఁగి ప్రవర్తింపఁజాలియుండుటయును మాత్రమేగాక, మనుష్యభాషనేనేర్చి మనుష్యులవలె వర్తించుచుండుటసహిత మబద్ధము గాదని యాక్రింది విచిత్రవార్తలు చాటుచున్నవి:—

(11-A) "లండనున ఒకకోతి ఇంగ్లీషు: ఫ్రెంచి, జర్మను, రష్యను, లాటిను భాషలను మాటలాడుచు పిల్లలను కరచినమీదట కోర్టున కేసుపెట్టి జుల్మానావిధించిరి."

"త్రిలిఙ్గ" పత్రిక తే (18-2-1935) దీ, పుట 10.

## 11-B. A BIRD LINGUIST AT BRADFORD.

"Cocky", a bird owned by Mr. William Henry Thackaray of Bradford is said to speak several words in Latin, three sentences in English and three perfect phrases in German, French and Spanish. It is claimed that the bird picks up about 50 sentences a year in different languages.

—Dharmarajya, (d. 26-10-1935, p. 3.)

అనఁగా:—

### "బ్రాడ్‌ఫర్డు" లోని భాషలు నేర్చినపక్షి.

"బ్రాడ్‌ఫర్డు" లో 'సిల్లియం హెన్రీ త్యాక్రే' యనువారికి "కాక్కీ" యను నొకపక్షికలదు; అది 'ల్యాటిన్' భాషలోఁ బెక్కుమాటలను, 'నింగ్లీషు' భాషలో మూఁడువాక్యములను, జర్మన్, ఫ్రెంచి, 'శ్పానిష్' భాషలలో మూఁడుస్పష్టమగు నసంపూర్ణ వాక్యములను మాట్లాడునఁట. వివిధభాషలలో సంవత్సరమునకు 50 వాక్యములచొప్పున నాపక్షి నేర్చుకొనుచుండునని చెప్పుచున్నారు."

ధర్మరాజ్యపత్రిక, (తే. 26-10-35, పు. 3)

N. B. [మఱియు నీక్రింది 60-(D) సంఖ్యగల యంశమునుగూడ నీసందర్భమునఁజూడఁదగును.]

ఈవిషయములన్నియు నటుంచి యాలోచించినను, సామాన్యజనులకుఁ బశుపక్ష్యాదులభాషను గ్రహింపఁగలసామర్థ్యమును (దుదకుఁ బశుపక్ష్యాదులకు భాషలుండు ననువిషయమును గ్రహింపఁగల సామర్థ్యమునుగూడ) లేకపోయినప్పటికిని, దపస్విలగు మనప్రాచీనచరిత్రకారులవంటి మహనీయుల కది దుస్సాధ్యము కానేరదు. తపశ్శక్తి కసాధ్య మొకటియు నుండ నేరదని యీగ్రంథముయొక్క మొదటిప్రకరణమునఁ దెలిసికొనియుంటిమి. అట్టి తపస్సంపన్నులు పూర్వకాలమున మనదేశమునందు లెక్కకు మిక్కిలిగ నుంటచే, నాకాలమున వారు పశుపక్ష్యాదులసంభాషణముల నెఱుగుట తటస్థించినసందర్భములుగూడ లెక్కకుమిక్కిలిగ మనపురాణాదులందు వర్ణింపఁబడియుండవచ్చును. ఈకాలమున నట్టివారు మిక్కిలియరుదగుటచే నట్టిసామర్థ్యమును సామాన్యముగ మనము చూడఁజాలకున్నాము. అంతమాత్రముచేఁ బూర్వకాలమునఁగూడ నట్టి సమర్థులుండుట యసంభవమని చెప్పఁదగదనుసంగతి, "పదునెనిమిదిమహాపురాణములను వ్యాసుఁడొక్కఁడే యెట్లు వ్రాయఁజాలె?" ననుసందర్భమున నీప్రకరణమున నే లోగడఁ దెలిసికొనియుంటిమిగదా!

### అతిదీర్ఘమగు జీవితకాలములు.

### 12. MARVELS OF YOGA.

"Not long ago, a man named Alfred Arnold, aged 106, inserted an advertisement in the daily papers, asking for a job. Those who interviewed him stated that he looked no more than sixty years of age, and this youthful aspect Arnold attributed to a study of yoga during forty years in India.

... ... ... ... ...

—"Dharmarajya," (d., 15-6-1935, p. 16.)

అనఁగా:—

యోగవిద్యయొక్క యద్భుతములు.

"ఇటీవలనే, ౧౦౬ సం॥ వయస్సుగల 'ఆల్‌ఫ్రెడ్-ఎర్నాల్డు' అను నొకమనుష్యుఁడు, తనకొకపని నిప్పింపఁగోరుచు దైనికవార్తాపత్రికలలోఁ బ్రకటనగావించుకొని యుండెను. ఆయన యరువదిసంవత్సరములకు మించని వయస్సుగలవానివలెఁ గనుపించునని యాయననుజూచి మాట్లాడినవారు చెప్పిరి; ఇట్టిదియుండుటకుఁగారణము భారతవర్షమున నలుబదిసంవత్సరములకాలము యోగవిద్య నభ్యసించుటయే" యని 'ఎర్నాల్డు'గారు చెప్పుదురు. ... ... ... ...

ధర్మరాజ్యపత్రిక, (తే 15-6-1935, పు. 16.)

13—A. MAN OF 126 YEARS OLD.

"Eat well, be gay, be kind and walk a lot" is what Mr. Meshadi Gurban Ali of Iran who is 126 years old says to live long. He has a son who is 100 years and 300 grand children. In his youth he would eat 14 lbs. of bread and would walk 28 miles a day. But he has never been beyond his own district."

—Dharmarajya (d, 27-7-1935, p. 4)

అనఁగా:—

126 సం॥ వయస్సుగల మనుష్యుఁడు.

"బాగుగఁ దినుము; ఉత్సాహముగ నుండుము; దయగల్గియుండుము; లెస్సగ నడువుము," అనునదియే 126 సంవత్సరముల యీడుగల 'మేషాడి-గుర్బాన్-అలీ' యను 'ఇరన్'వాస్తవ్యుఁడు దీర్ఘకాలముబ్రదుకుటకుఁ జెప్పెడిబోధ. అతనికి 100సం॥ల యీడుగల కొడుకును 300 మంది మనుమలు మనుమరాండ్రునుగలరు. పడుచుఁదనమున నతఁడు దినమునకు 14 పౌనుల (అనఁగా సుమారు 5 వీశెల) రొట్టెను దినువాఁడట; 28 మైళ్లదూరము నడిచెడివాఁడట! కాని, తనజిల్లానుదాఁటి యాయన యెన్నఁడును నవతలికివెళ్లలేదఁట!" 'ధర్మరాజ్య'పత్రిక, (తే 27-7-1935, పు. 4.)

13-B. "అమెరికాయందలి జార్జియాసమీపమున'కుమీస'అనుగ్రామమున 150 యేండ్లవయస్సుగల వృద్ధుడున్నాడు. ప్రపంచమున ఎచ్చటను ఇంతవయస్సు జెల్లినవాడు లేడని ప్రచురించిరి. రష్యాచక్రవర్తిగారు 1801-వ సంవత్సరమున జార్జియాపై దండయాత్రకువచ్చినప్పటివివరముల నీవృద్ధుఁడు నేడు జ్ఞప్తియుంచుకొని వర్ణించుచున్నాఁడఁట! ఇండియాన ఇతనికన్నవృద్ధు లనేకు లున్నారు."

త్రిలిఙ్గ, (తే 3-12-1934, పు. 8.)

[ఇందువిషయమై యింకను గలవిశేషములను నీగ్రంథముయొక్క నాల్గవప్రకరణమున "సృష్టి యెపుడుజరిగెను?" దనుసందర్భమునఁ, "ప్రాచీనచరిత్రలందలి కాలసంఖ్యలు కల్పితములుకానిచో నంతపెద్దవిగ నెట్లున్న?" వనుశీర్షిక క్రిందఁ దెలిసికొనఁబోవుచున్నాము. వీనినిబట్టి యాలోచించితిమేని, గొందఱుమహాపురుషు లతిదీర్ఘకాలము జీవించియున్నట్లు మనపురాణేతిహాసములందు వర్ణింపఁబడినవిషయములు—(అనఁగాఁ గృతయుగమున ధ్రువుఁ డిరువదియాఱువేలేండ్లు రాజ్యమేలినట్లు భాగవతపురాణమునఁ గలవిషయమును, త్రేతాయుగమున శ్రీరామచంద్రుఁడు పదునొకండువేలేండ్లు రాజ్యమేలినట్లు రామాయణమునఁ గలవిషయమును, నంతియగాక, ద్వాపరయుగమునసున్న ద్రోణపుత్రుండగు నశ్వత్థామయుఁ, గృపుఁడును, బాదరాయణుఁడును మాత్రమేగాక, త్రేతాయుగమున శ్రీరామచంద్రుని సమకాలికులగు పరశురాముఁడును, ఋష్యశృంగుఁడునుగూడ, సూర్యసావర్ణియొక్క రాఁబోవు మన్వంతరమందు సప్తర్షులగుటకై యిప్పటికిని సజీవులై తమతమయోగబలములచే వారివారియాశ్రమములందుఁ జరియించుచున్నట్లు భాగవతపురాణమునఁ (నష్టమస్కంధమునఁ) గలవిషయమును మొదలైనవిగూడ)—నసత్యములు కావలసినయావశ్యకతలేదని బోధపడఁగలదు.

అంతియగాక, 13-A సంఖ్యగల పైవిషయమును బరికించినచో, నందుఁ జేర్కొనఁబడిన 300 మంది మనుమలును, మనుమరాండ్రును, మహాభారతమున గాంధారికిని ధృతరాష్ట్రునకును బుట్టిన 100 మంది బిడ్డలను జ్ఞప్తికిఁ దెచ్చెదరు!]

### స్వప్నవృత్తాంతములు నిజమగుట.

14. "A stone-built temple containing three images of the God "Siva" has been discovered in a village called Duramari, at a distance of about 50 miles from Gauhati, as the result of a dream. It is stated that the Goddess Bhagavati (the Mother Creatrix) appeared to a resident of the village in a dream and pointed out to him a place where there was a temple. The place was subsequently excavated, and true to the dream, the temple was discovered and 3 images and some iron spears were found. A temporary shed has been built there and influential resident of a neighbouring village is making arrangements to build a permanent temple on the site."

—Dharmarajya, (d, 24-11 1934, p. 3.)

అనఁగా:—

'గౌహటి'కి 50 మైళ్లదూరమున 'దురామరి' యనుగ్రామములో, 3 శివవిగ్రహములుగల యొకఱాతిదేవాలయ మొకస్వప్నముయొక్క ఫలితముగ బయలుపడినది. (సృష్టికర్త్రియగు)భగవతి యాగ్రామవాసునికొకని కొకస్వప్నమునఁ గనఁబడి యాదేవాలయమున్నచోటు వానికిఁ గనఁబఱచినదఁట. అటుపిమ్మట నాచోటు త్రవ్వఁగా,స్వప్నములోప్రకారము నిజముగా గుడి బయలుపడి, యందు 3 విగ్రహములును, గొన్ని యినుపశూలములును గనఁబడెను. తాత్కాలికముగ నచట నొకచావడి వేసిరి. సమీపగ్రామమందలి పలుకుబడిగల యొక కాపురస్థుఁ డచ్చట నొకస్థిరమగు దేవళమును గట్టించుటకు నేర్పాట్లు గావించుచున్నాఁడు." ధర్మరాజ్య (తే 24-11-1934, పు. 3.)

## 15. A HERMIT'S DREAM COMES TRUE.

"It was stated that Panchu Santa, who has been a hermit for years in the Puri District, had a dream in which a Goddess appeared to him and told him that if he dug at a certain place, he would discover ancient cannon. Accordingly the site was dug up and five ancient cannons were found."

—Dharmarajya, (d. 23-3-1935, p. 4.)

అనఁగా:—

### ఒకకల నిజమగుట.

"పూరీజిల్లాలో సంవత్సరములుగ సన్న్యాసియైయున్న 'పంచు-శాంత' యను వారికి స్వప్నమువచ్చి, యందు దేవిప్రత్యక్షమై యొకానొకచోటఁ ద్రవ్వినచోఁ బురాతనకాలపుఫిరంగులు బయల్వడునని చెప్పెనఁట. ఆప్రకారమే యాచోటు త్రవ్వఁగాఁ బురాతనకాలపు ఫిరంగు లైదు దొఱకెను."

ధర్మరాజ్య, (తే 23-3-1935, పు. 4.)

## 16—A. GOD REVEALS HIMSELF EVEN NOW!

"Kaviraj Kshetra Mohan Gupta, who has his dispensary in Balaram Ghosh's Street, in Shambazaar (Calcutta) had a severe attack of filarial fever. Medical treatment did him no good; and he had to spend sleepless nights for a week on end. One night at about 1-30 A. M., Baba (the Lord) Tarakanath appeared before him in a dream and said: "I have given your medicine to your aunt!" The Kaviraj could hardly realise what had happened and continued to toss in bed. In less than a dozen minutes, he

heard an anxious knock at the door; and his aunt called him aloud! He opened the door and met his aunt who said:—"I have been anxiously praying to Baba (the Lord) Tarakanath for your sake for the last few days. He has taken mercy on us at last, has appeared before me in a trance and has given this root tied to a red string and has shown me now to fasten to your neck!" She then tied the root to the Kaviraj's neck; and lo! all pain vanished in a moment! But the fever did not pass off still. At length the Kaviraj realised, that he should have performed pooja to Baba Tarakanath. Maha Mahimna Stotra was then read by a Pandit; and the fever also left off and the Kaviraj was completely cured!

The truth of the dream cannot be gainsaid, especially because, the aunt actually got a root in her dream of trance! These truths concern man more nearly than the truths of Modern Science, such as: "light travels in a straight line and cannot turn a corner; elecrtic current is due to a difference of potential; a heavy thing falls to the ground as an effect of universal gravitation;" & so forth. But MODERN SCIENCE CARES NOTHING FOR THE TRUTHS THAT CONCERN MAN THE MOST,—Man's destiny, his relation to his Maker, God's mercy, God's Will Absolute, man a mere tool, the nature of things, to name just a few.

("Truth.")

—" Dharmarajya " (d., 20-7-1935, p. 10.)

దీనియర్థమేమనఁగా:—

**ఇప్పటికినిఁగూడ దేవుఁడు ప్రత్యక్షమగుచుండును!**

"(కలకత్తాలో) 'షాంబజారు'నందలి బలరామ్-ఘోష్‌యొక్క-వీథిలో మందుల యంగడిపెట్టికొనియున్న 'కవిరాజ్ - క్షేత్ర-మోహన్-గుప్త'కుఁ దీవ్రమగు 'ఫిలేరియల్-జ్వరము' వచ్చినది. మందులు వానికేమియుఁ బనిచేయలేదు; చివరకొక వారమురోజులు రాత్రులందు నిద్రపట్టుట మానివేసినది. ఒకరాత్రి రమారమి యొంటిగంటన్నరవేళకు 'బాబా-తారకనాథుఁడు' (భగవంతుఁడు) కలలో వానికిఁ గనఁబడి, "నేను నీమందును నీ *మేనత్తచేతి కిచ్చితి"నని చెప్పెను! ఆ 'కవిరాజ్' జరిగినసమా

---

* ఇంగ్లీషులో 'aunt' (ఆంట్) అనియున్నందున, మేనత్త కానిచోఁ బెదతల్లియో పినతల్లియో యైయుండవచ్చును.

చారమును గుర్తింపఁజాలక ప్రక్కపై వేదనచే మునుపటివలెనే పొరలుచుండెను. పది పండ్రెండునిమిషములకు లోపుగనే యెవ్వరో యాతురతతోఁ దలుపుఁగొట్టుచున్న ట్లాయనకు వినఁబడెను; ఆయనయొక్క మేనత్త యాయన నెలుగెత్తి పిలిచెను! ఆయన తలుపుతెఱచి యామెనుజూచెను; ఆమె, "గడచిన కొన్నిదినములనుంచి నీకొఱకై నేను 'బాబా-తారకనాథుని (భగవంతుని) మిక్కిలియాతురతతోఁ బ్రార్థించుచుంటిని. తుద కాయనకు మనపైకరుణగల్గి, నాకు నిదురలోఁగనుపించి, యొకయెఱ్ఱదారముగట్టిన యీ వేరును నాచేతికిచ్చి, దానిని నీమెడలోఁగట్టుమని నాకుఁజెప్పె"నని తెలిపెను! అంతట నామె యావేరును 'గవిరాజ్' యొక్క మెడలోఁ గట్టెను; చూడుఁడు చిత్రము! ఒక్కక్షణములో బాధయావత్తును మాయమైపోయెను! కాని జ్వరముమాత్రము పూర్తిగఁబోలేదు. తాను బాబా-తారకనాథుని బూజించియుండవలసినదని 'కవిరాజ్' తుట్టతుదకు గ్రహించెను. ఒకపండితునిచే 'మహామహిమ్నాస్తోత్రము'ను జదివించిరి: జ్వరముగూడఁ బూర్తిగావదలిపోయి కవిరాజ్ కుఁ బూర్ణమగుస్వస్థత చేకురెను!

నిద్రలో స్వప్నమందు మేనత్తకిచ్చినవేరు ప్రత్యక్షముగఁ గనఁబడుచుండుటచే స్వప్నవృత్తాంత మబద్ధమనుటకువీలులేదు. ఇట్టిసత్యములు, "వెలుతురు తిన్నఁగాఁ బోవునుగాని మూలతిరుగుడు తిరుగఁజాలదనియు; భూమియొక్క యాకర్షణశక్తివలన బరువుపస్తువులు క్రిందపడు"ననియు, నీమొదలగు ప్రస్తుతకాలపు ప్రకృతిశాస్త్రసత్యములకంటె మనుష్యుల కెక్కువసన్నిహితసంబంధము గలవి. కాని, మనుష్యున కత్యంతముఖ్యములైన యిట్టిసత్యములను బ్రస్తుతకాలపు ప్రకృతిశాస్త్రవిద్య లక్ష్యము సేయదు. అట్టిసత్యములలోఁ గొన్ని:—మనుష్యుని పరమావధి; వానికిని వానినిబుట్టించిన సృష్టికర్తకును గలసంబంధము; భగవంతునికరుణ; భగవంతునియొక్క యిచ్ఛాస్వాతంత్ర్యము; మనుష్యుని పరతంత్రత; వస్తుజాలముయొక్క సహజస్వభావము, మొదలగునవి.—
('ట్రూత్'-పత్రిక.) ధర్మరాజ్యపత్రిక (తే 20-7-35, పుట. 10.)

## 16—B. "DEAD" RETURNS.

### MOVES JURY TO REAPPORTION ESTATE.

"A witness testifying at a will contest in Mocksville, N. C. (America) swore that his father's ghost had appeared to him in a dream and told him how to find a will that had been drawn a number of years after the one that was being challenged—and the jury believed him.

James Chaffin, a farmer who had lived in Davie Country, had a wife and four sons—but when he died several years ago, it

was found that his will drawn in 1905, left all his property to his third son, Marshall. ... ... ... ...

But shortly after Marshall's death, James went into court and·claimed that he had recently found another and later will which divided the estate equally between the four sons and instructed them to take care of their mother.

On the witness stand, Pinkney told an odd story:—

"... ... ... ... ... ...

"Some months ago I began to have vivid dreams in which my father appeared at my bedside.......In fact, the first few times I saw him like that in my dreams, I did not attach any importance to it. A fellow is liable to dream most any thing and usually it does not have'any meaning. But one night he appeared in a black overcoat he used to wear when he was alive. That time he came closer to the bed, and pulling back the overcoat, he pointed to the inside pocket and said: "You will find something about my last will in my overcoat pocket."

Then he disappeared, and when I woke up the next morning I was convinced that I had not just been dreaming. I was sure that my father's spirit had come back from the grave and spoken to me. .........When I examined the inside pocket, I found that the lining had been stitched to the coat. I cut the stitches, and inside the lining was a little roll of paper tied with a string......... In that pocket was my father's last will."

The paper wich Pinkney Chaffin contended as his father's last will, was then introduced as evidence.

... ... ... ... ... ... ...

No one remembered hearing the father mention the existence of a second will, but several witnesses testified that the paper introduced in Court was in his handwriting. The members of the jury were then told that although the second will had not been witnessed, if they were convinced that James Chaffin had written it, they must uphold it in accordance with the law of the State. So the jury returned a verdict annulling the first will and making the second one valid.

After the verdict, Pinkney Chaffin said:

"Many of my friends do not believe that it is possible for the living to hold communication with the dead, but I am convinced that my father actually appeared to me on several occasions—and I'll believe it to the day of my death!"

—(The American Weekly.)

"Dharmarajya, dated, 2-11-1935, P. 11

దీనితాత్పర్య మేమనఁగా:—

చచ్చినవాఁడు లేచివచ్చుట.

'ఎస్టేటు'ను మరల విభాగము చేయునట్లు కోర్టువారిచేఁ జేయించుట.

అమెరికాలో 'డేవీ' దేశమున 'జేమ్స్-చాఫిన్' అనుభూస్వామి కొకభార్యయు, నలువురుకొడుకులుఁ గలరు. పెక్కేండ్లక్రిందట నతను చనిపోవునపుడు తనయాస్తియంతయుం మూఁడవకొడుకైన 'మార్షల్'కుఁ జెందునట్లు 1905-వ సంIIలో మరణశాసనము (వుయిల్) వ్రాసిపోయెను. మార్షల్ కూడఁ జనిపోయిన కొద్దికాలమునకే 'జేమ్స్' న్యాయస్థానమునకెక్కి, తనతండ్రి దరిమిలావ్రాసిన రెండవమరణశాసనము తనకు దొఱకినదనియు దానిప్రకారము నల్గురుకొడుకులును ఆస్తినిసమముగాఁబంచికొని తల్లిని సంరక్షించుచుండవలయుననియు దావావేసి, తన కారెండవశాసనముదొఱకిన చిత్రకథ యాక్రిందిరీతినిజెప్పెను:—కొన్ని నెలలక్రిందట నాకు స్పష్టమగుకలలువచ్చి మాతండ్రి కనుపించుచువచ్చెనుగాని నేనంతగా లక్ష్యపెట్టలేదు. కాని, యతఁడు బ్రదికియున్నపుడు తొడిగికొనెడి యొకనల్లకోటుతొడిగికొని యొకనాఁటికలలోఁ గనుపించి, దానిలోపలిప్రక్క సంచిపైపునాకుఁజూపి, తాను రెండవసారివ్రాసిన'వుయిలు'కు సంబంధించుకాగిత మందున్నదనిచెప్పి వెడలిపోయెను.....నేను మేలుకొని యాకోటు జేబును బరీక్షించఁగా నది కుట్లతోమూయఁబడియుంటచేఁ గుట్లనుద్రెంచి తెఱచి చూడఁగా నొకకాగితపుచుట్ట దానిలోనున్నది...—మానాయనవ్రాసిన రెండవపత్రమాసంచిలోనున్నది." అపత్రము 'కోర్టు'లో దాఖలుచేయఁబడెను. దానిపై సాక్షిసంతకము లేకున్నను, దండ్రియొక్క స్వదస్తూరీలో వ్రాయఁబడినదనుటకుఁ బ్రబలనిదర్శనములుండుటచే న్యాయాధికారులు దానినినమ్మి యంగీకరించి మొదటిపత్రమును రద్దుచేసిరి. పిమ్మటఁ గొడుకిట్లుచెప్పెను:—"బ్రదికియున్నవారు చచ్చినవారితో వ్యవహరింపవచ్చునను సంగతి నాస్నేహితులనేకులు నమ్మరుగాని నాకుఁ దగినబుజువు కనఁబడుటచేఁ జచ్చువఱకును నమ్మెదను." (అమెరికావారపత్రిక) ధర్మరాజ్య, (తే, 2-11-35.)

ఈపైవార్తలను బట్టిచూడఁగా, మనపురాణేతిహాసములలో శ్రీమద్రామాయణమునందలి సుందరకాండమునఁ ద్రిజటాస్వప్నవృత్తాంతము నిజమగుటయును, శ్రీమద్భాగవతమున దశమస్కంధమున, నుషకు స్వప్నమునఁ గనఁబడిన యనిరుద్ధుఁడంతకుముం దాకన్య యెన్నఁడును జూచియెఱుఁగనివాఁడైనను బిదప నన్నిదేశముల రాకుమారుల చిత్రపటములలో నొకదానియం దాతనిరూప మచ్చుగా స్వప్నమున గనఁబడినలీరుననే యుండుటయును, రామాయణమం దయోధ్యకాండమున దశరథుని మరణవార్త వినఁబోవునాఁటి ముందటిరాత్రి భరతునకు దుస్స్వప్నము గల్గుటయును, యుద్ధకాండమున రావణునిశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛపోయియున్నతరి మరల భరతున కొకదుస్స్వప్నముగల్గుటయును, నసత్యములు గావలసినయవసరములేదని తేలుట లేదా?

## మంత్రప్రభావము

### (17) పాముకాటు, తన్నివారణము, బిట్రగుంటవృత్తాంతము.

"1932 మార్చి 22-వ తేదీనాఁడు ఉదయం బిట్రగుంటస్టేషన్‌లో కాపురముండు ఎం. ఎస్. ఎం. ఆర్. కంపెనీకి సంబంధించిన ఛీఫ్‌డ్రైవరు డబ్ల్యూ. జే. టేలరువారి 11 ఏండ్లకుమారుని పాము కఱచెను. కొంతసేపటి కాబాలుఁడు స్మారకముతప్పి క్రిందికి ఒరిగెను. శరీరమంతయు విషవ్యాపనచే నల్లఁబడిపోయెను. టేలరుగారు, "పాము కఱచి పిల్లవాఁడు స్మారకములేక పడియున్నాఁడు. శరీరమంతయు నల్లఁబడె" నను వృత్తాంతమును పోలిరెడ్డిపాళెం స్టేషన్ మాస్టరుకు 'టెలిఫోను'లోఁ దెలిపెను. ఈస్టేషన్ మాస్టరు విషవైద్యులనేసంగతిని త్రిలిఙ్గలో నిదివఱకుఁ దెలిపియున్నాము. వీరిది యద్భుతచికిత్స. వీరిపేరు శ్రీనరసయ్యగారు. సంగతి తెలియుచుండగనే టెలిఫోనులోనే కొన్నిమంత్రముల నుచ్చరించి, పాముకాటుతగిలిన చిన్నవాని నొకపవిత్రమైన పరిశుద్ధస్థలములోనుంచి యచ్చోటికి యితరుల నెవ్వరిని జేరనీయక చూచుచుండుమని శ్రీనరసయ్యగారు తెలియఁబఱచిరి. నాలుగుఘంటలకాలమునకు చిన్నవాఁడు నిదురనుండి మేలుకొన్నవానివలె లేచెను. ఇప్పుడు వాఁడారోగ్యముతోనున్నాఁడు. ఇది మంత్రమహిమ కాదా? ఇట్టిచికిత్సావిషయమై పాశ్చాత్త్యులగు ఘనవైద్యు లేమందురో?"

త్రిలిఙ్గ, (తే 11-4-1932, పు. 13.)

(18) "పోలిరెడ్డిపాళెము స్టేషనుమాస్టరు శ్రీపాముల నరసయ్యగారు యెంత దూరమున యెవరికి పాముగరచినను వీరికి తెలియజేసినచో మంత్రించుచున్నారు. ఎందరిప్రాణములనో వీరు కాపాడుచున్నారు." త్రిలిఙ్గ, (తే 1-10-1934, పు. 9.)

(19) "పోలిరెడ్డిపాళెము 'రైల్వేస్టేషనుమాష్టరు' శ్రీనరసయ్యగారు మంత్రశక్తివల్ల పాముకరచినవారికి చికిత్సగావించువార్త 'లండను'నగూడ వ్యాపించెను. 'లండను'నుండి తంతెరాగానే పాముకఱచినవానికి నెమ్మదిగలిగెను. ఇప్పటికి 79,000 మంది బాధను వీరు ఈతీరున నివారించిరి." త్రిలిఙ్గ, (తే 19-11-1934, పు. 9.)

(20) DOUBLE PNEUMONIA CURED BY AN EXORCIST APPLICATION OF "TULASI" WATER WITH MANTRAS.

Siliguri, June 6.

A curious account of how a man had an attack of double pneumonia and was cured in miraculous circumstances has been narrated by Bankim Chandra Roy, an inhabitant of Dabgram, about two miles from Siliguri town.

It is reported that a villager of Dabgram, Maheswar Thaker by name, was attacked with the disease and, being too poor, was unable to obtain any medical aid. He was convinced that he was possessed by an evil spirit which was responsible for his sufferings. He called an exorcist (ojha) named Khecho Das who assured him that he would bring about a complete and radical cure within a short time and added that the man was under the influence of an evil spirit.

On the first day of his visit, he gave Maheswar a quantity of water sanctified by "MANTRAS". On the next day he performed some pujas with "Tulasi" leaves. The most remarkable fact was that Khecho Das took two "Tulasi" leaves and, uttering some "Mantras" dipped them in water in an earthen pot before a huge gathering of men; and as soon as the leaves were taken out of the water by the exorcist, two marks resembling a semi circle were found on them ! This the exorcist said, was the sign that the disease of Maheswar would be cured and the spirit would set him free.

It is a matter of extreme surprise that Maheswar was in a fair way towards recovery from that day. On the expiry of the seventh day, he was fully cured and was allowed to take rice. He is now quite hale and hearty and is doing his daily work."

Dharmarajya, D. 20-7-1935 (p. 10)

దీనియర్థ మేమనఁగా:—

## (20) 'డబుల్-న్యుమోనియా' యను (శ్వాసకోశ)వ్యాధిని భూతవైద్యుఁడు కుదుర్చుట. తులసీతీర్థమును మంత్రించి యిచ్చుట.

సిలిగురి, జూన్ 6-వ తేదీ.

ఒకమనుష్యునికి 'డబుల్-న్యుమోనియా' వ్యాధివచ్చి విచిత్రమగువిధముగాఁ మాన్పఁబడిన యొకచిత్రవార్తను, సిలిగురిపట్టణమునుంచి సుమారు రెండుమైళ్లదూరములోనున్న 'డాబ్‌గ్రామ్' గ్రామకాఁపురస్థులగు 'బంకిమ్‌చంద్రరాయ్' యనువారు వినిపించియున్నారు.

డాబ్‌గ్రామ్‌నివాసియగు 'మహేశ్వర్-థాకేర్' అనువానికిఁ బై వ్యాధివచ్చి మిక్కిలి పేదవాఁడగుటచే వైద్యసహాయమేమియును బొందలేకుండెనఁట! వానికొక ఘాలి సోకియున్నదనియుం వానివ్యాధి కదియే కారణమనియుం వానికి నమ్మఁజెప్పిరఁట. ఆయన 'ఖేచోదాన్' అనునొక భూతవైద్యుని బిలువనంపెనఁట. అతఁడు మిక్కిలి తొందరగానే వ్యాధిని బూర్తిగా నయముచేయుదునని రూఢిగాఁజెప్పి, యాయనకు ఘాలి పట్టియున్నదనిగూడ చెప్పెనఁట.

ఆవైద్యుఁడువచ్చిచూచిన మొదటిదినమున నాయన మహేశ్వరునికిఁ గొంచెము మంత్రతీర్థమునిచ్చెనఁట. మరునాఁడు తులసీదళములతోఁ గొంతపూజ సల్పెనఁట. మిక్కిలి ముఖ్యమగువిషయ మేమన, ఖేచోదాన్ రెండు తులసియాకులనుదీసికొని, కొన్నిమంత్రములను జదువుచుఁ బెద్దగుంపుగూడియున్న జనులయెదుట నొక మట్టికుండలోనినీళ్లలో వానిని ముంచెనఁట; ఆభూతవైద్యుఁ డాయాకులను నీటిలోనుంచి తీసినవెంటనే, యర్థచంద్రాకారమునుబోలిన రెండుమచ్చలు వానిపైఁ గనఁబడెనఁట. అది మహేశ్వరునియొక్క జబ్బు కుదురుటకును ఘాలి వదలిపోవుననుటకును జిహ్నమని భూతవైద్యుఁడు చెప్పెను.

ఆనాఁటినుంచియుం మహేశ్వరుఁ డత్యాశ్చర్యకరముగ నానాఁటికిని నారోగ్యమును బొందఁజొచ్చెను. ఏఁడవదినము ముగియగనే యాయనకుఁ బూర్తిగ నెమ్మదించి యన్నముపెట్టిరి. ఆయన యిప్పుడు బాగా నారోగ్యముగనుండి తనపనిని జూచుకొనుచున్నాఁడు."

ధర్మరాజ్య, (తే 20-7-1935, పు. 10.)

## యోగప్రభావము.

[పైనదెల్పిన (7)-వ సంఖ్యగల విషయముగూడ నీసందర్భమునఁ జూడఁదగి నది.] మఱియును,

(21) "షుక్కూరున ఒకహఠయోగి ఒకపామును మ్రింగుటయు, గాజుపెంకుల నమలితినుటయుఁ అనేకుల కాశ్చర్యమును గలిగించెను."

త్రిలిఙ్గ, (తే 23-9-1935, పు. 10.)

## (22) MARVELS OF YOGA

"Not long ago, a man named Alfred Arnold, aged 106, inserted an advertisement in the daily papers asking for a job. Those who interviewed him stated that he looked no more than sixty years of age, and this youthful aspect Arnold attributed to a study of yoga during forty Years in India.

Most people who have no reason to study Yoga imagine it to be either a kind of magic employed by Indian mystics or a system of exercises, connected in some way with breathing. It is neither.

Yoga is one of the six orthodox systems of philosophy, and although practised by the "holy men" (Yogis) of India, it is not a religion, though a few religious practices are recommonded as a means of disciplining the soul, just as breathing exercises are performed as a means of attaining greater physical and mental perfection.

### SELF—HYPNOTISM

Briefly, and devoid of abstruse technical details, Yoga is a form of self-hypnotism. The exercises performed render the body immune from infectious and virulent diseases, the breathing and concentration clarifies the mind. Their control of breath is, to say the least phenomenal, and 1 have seen one immerse his head for more than seven minutes.

Their bodies are not muscular, like that of the Western athlete but extremely supple, and the exercises they practise could be performed only by contortionists. They sit for long periods in their eighty-four different postures, and never wear clothes, even in the most bitter weather.

The visitor or European resident in India sees little or nothing of the genuine Yogi, who is a dignified being. He neither cringes nor craves. Wealth, power and position affect him not at all. Because they have no worldly goods, Yogis are allowed to ask for food,—nothing else; and that only once a day. More often than not they are invited into the houses of the local people for food and shelter, in which case the first invitation must always be accepted, and the Yogi must never stay there another night unless specifically asked to do so. ... ... ...

Dharmarajya, (d. 15-6-35 p. 16)

దీనియర్థ మేమనఁగా:—

## (22) యోగచిత్రములు.

ఇటీవలనే, 106 సం॥ యీడుగల 'ఆల్‌ఫ్రెడ్-ఎర్నాల్డు' అను నొకమనుష్యుఁడు తనకొకయుద్యోగము నిప్పింపఁగోరుచు దైనికవార్తాపత్రికలలోఁ బ్రకటనము గావించుకొనియుండెను. ఆయనను జూచిమాట్లాడినవా రాయన కరువదియేండ్లకంటె నెక్కువయున్న ట్లగపడదని చెప్పియున్నారు. అట్లు పడుచుదనముతో నగుపడుటకుఁ గారణము భారతవర్షమున నలుబదిసంవత్సరములకాలము యోగవిద్య నభ్యసించుటయే యని 'ఎర్నాల్డు'గారు చెప్పుదురు.

"యోగవిద్యను జదివియెఱుఁగనివారిలోఁ బెక్కుమంది, యది భగవద్దర్శనము గలభారతీయులు కొందఱుచేయు నొకరీతి యింద్రజాలమనియో, ప్రాణాయామముతో నెట్లో సంబంధించిన పరిశ్రమలవిధానమనియో యనుకొనెదరు. అదిరెండునుగూడఁ గాదు.

యోగము ప్రాచీన వేదాంతవిద్యావిధానములగు నాఱింటిలో (ననఁగా షడ్దర్శనములలో) నొకటి; భారతీయులగు యోగీశ్వరులచే నభ్యసింపఁబడునప్పటికిని, నెక్కువ శారీరకమానసికాభివృద్ధిని బొందుటకుఁ బ్రాణాయామముల నభ్యసించురీతిగ నాత్మసంస్కారమునకై కొలదిగ మతనియమములు చెప్పఁబడినప్పటికిని, నది యొక మతముగాదు.

### తనకుఁదాను యోగనిద్రఁదెచ్చికొనుట.

కఠినములగు పారిభాషికవివరములను విడచి సంగ్రహముగఁ జెప్పినచో, యోగవిద్య యొకవిధమగు స్వీయయోగనిద్రావిధానము.— అందుఁ జేయఁబడుపరిశ్రమలు

శరీరము నంటువ్యాధులనుంచియు, విషవ్యాధులనుంచియు సంరక్షించును; ప్రాణాయామమును, నేకాగ్రచిత్తతయుఁ మనస్సును నిర్మలపఱచును. ఊపిరిబిగిఁబట్టుసామర్థ్యము వారికి సర్వసామాన్యము; ఒకఁడేడునిమిషములకంటె నెక్కువసేపు తనతలను (నీళ్లలో) ముంచియుండుటను నేను జూచియున్నాను.

వారిశరీరములు పాశ్చాత్యవస్తాదులయొక్క శరీరములవలె కండలుదిరిగియుండక, మిక్కిలి మెత్తగానుండును; వారుచేయుఁ వ్యాయామములు శరీరము నన్ని ప్రక్కలకును వంపఁగలవారుమాత్రమే చేయఁదగినవి. వారు వారి యెనుబదినాల్గువిధములగు నాసనములలోను జాలా సేపు కూర్చుందురు; మిక్కిలి చలిగాలిలోఁగూడ నెన్నఁడును గుడ్డఁ గట్టికొనరు.

ఘనుఁడైనయోగియందలి ఘనతను భారతవర్షమునకుఁ జూడవచ్చినవాఁడుగాని, యందునివసించు నైరోపియనుఁడుగాని కొంచెమైన గ్రహింపఁజాలఁడు. యోగియగువాఁడు యాచింపఁడు; దేబెరింపఁడు. ఐశ్వర్యమును, సామర్థ్యమును, నధికారమును వానినేమియుఁ జేయఁజాలవు. ఏమనిన, లౌకికప్రయోజనములు వారికిలేవు. యోగులన్నముమాత్రము యాచింతురు; ఇంకేమియును బనిలేదు. అదిగూడా దినమున కొక్కసారియే. తఱచుగా వారి కన్నోదకములిచ్చుటకై జనులు తమయిండ్లకు వారి నాహ్వానించుచుందురు; అట్టివారిని, మొదటియాహ్వానమును దప్పక యంగీకరింపవలెను. అటుపైనుండవలసినదని ప్రత్యేకముగఁ గోరిననేతప్ప యోగి మఱియొకదినమైనను నట నెన్నఁడును నిలువరాదు."

ధర్మరాజ్య, (తే. 15-6-35 పు. 16.)

## (23) శ్రీమదఘోరీబాబా.

"శ్రీమదఘోరీబాబాయను మహనీయులు సద్బ్రాహ్మణకుటుంబమునందు జన్మించినవారు. బ్రహ్మచర్యాశ్రమములో నున్నారు. సాంప్రదాయము కాపాలికమని తెలియుచున్నది. వీరిపూర్వనామము రామకృష్ణయ్యపంతులుగారట. ఇంటిపేరు ప్రాతూరివారు. తండ్రిపేరు నాగయ్యపంతులుగారు.

వీరి యద్భుతచర్యలనుగూర్చి కొన్నివింటినిగాని వానినన్నిటికంటెను బ్రత్యక్షముగజరిగిన యద్భుతచర్య యెల్లరకును వింతగ గన్పట్టకమానదని తలఁచెదను. వీరు సుమారు 2 మాసములక్రిందట అనగా జూన్ నెలలో దనపరిచయస్థులగు కొందఱితో "చిత్రకూటమున దేవతామహాసమావేశము కానున్నది. ఆసమావేశమునకు నేను వెళ్లుటకు దేవతల ఆజ్ఞ అయినది. నేను బయలుదేరి వెళలుటకు పూర్వము మీయందఱకును వర్తమానమంపెదను. గోమాంసభక్షకులును, స్త్రీలునుదప్ప తదితరులు నన్ను సాగనంప

వచ్చును.'' అని చెప్పిరి. తదుపరి ఒకవారమునకు "జూలై తే 1 ది శనివారమురాత్రి నాప్రయాణమును స్థిరపఱచితిని. గాన రాత్రి మీరు మీగృహములయందుండి నా వర్తమానమున కెదురుచూచుచు, వర్తమానమందినతత్క్షణమె నాదగ్గఱకురండు'' అని ఎల్లరకును మరల చెప్పిపంపిరి.

అట్లె జూలై తే 1 ది వచ్చినది. రాత్రి సుమారు 9 ఘంటలకు ఎల్లరకును వర్తమానముచేయబడెను. నిర్దేశింపబడిన శ్రీదుర్భా జగన్నాథముపంతులుగారి గృహమునకు అందఱునువిచ్చేసిరి. అందఱును తహతహపడజొచ్చిరి. శ్రీవారిదర్శనమున కెదురు చూచుచు గుసగుసలాడుచుండిరి. ఇంతలో శ్రీవారు ప్రేక్షకులనుగాంచి, "అయ్యలారా! ఇదిగో చిత్రకూటమునకు వెడలుచున్నాను.'' అని యొకగదిలోనికి బ్రవేశించి "ఇక కవాటములుబంధించి తాళములువేయుఁడు. ఒకగంటకాల మయినపిదప నొకపరితెఱచి మరల బిగింపుఁడు. రేపుఉదయము 7 ఘంటలకు మరల తలుపులను తెఱచివేయుఁడు.'' అని శ్రీవారు సెలవొసంగిరి. వెంటనే తలుపులుమూయఁబడి తాళములు బిగింపబడెను. పదినిమిషములుకాగానే "గణగణ'' మని ఘంటానాదము వినబడెను. ఉచ్ఛ్వాసనిశ్వాసములుసయితము వినబడెను. జనమంతయు నేమిజరుగుచున్నదోయని యుబ్బిటలూగుచు గుసగుసలాడుచు, ఎపుడెప్పుడు తలుఁపులు తెఱవఁబడునాయని చిందులుద్రొక్కుచుండిరి. ఇంతలో నశరీరవాక్కు "శ్రీవారు చిత్రకూటమునకుజేరిరి. గదితలుపులు తెఱవుడు'' అని వినబడెను. ప్రేక్షకులు తలుపులుదెఱచుటకు నివ్వెరపడి యెట్టకేలకు తాళములు తీసిరి. శ్రీవారు గదిలో గానరారైరి. "టార్చిలైటు'' తో అన్నిమూలలజూచిరి స్వామి వారి నిర్గమనరహస్యము బోధముకాలేదు. ప్రేక్షకులెల్ల రద్భుతానందనిమగ్నులై స్వామి వారియాజ్ఞానుసారము మరల తలుఁపులఁబిగించి, కొందఱ నట కావలియుంచి వారివారి గృహములకు వారువెళ్లిరి.

మఱునాడు ఉదయము 7 ఘంటలకు జనమంతయు గుమిగూడెను. తలుఁపులు తెఱచిచూచిన శ్రీవా రుందురు అని కొందఱును, ఉండరు అని కొందఱును, వారి వారికి దోచినరీతి మాట్లాడజొచ్చిరి. ఇంతలో తలుపులు తెఱవబడెను. శ్రీస్వామివా రందు గనుబడలేదు. అందఱును ఆశ్చర్యపడి శ్రీవారు ఒకవేళ ఆశ్రమమందు ప్రవేశించియుందురేమో యనియెంచి జనమంతయు శ్రీవారిఆశ్రమమువైపుకు మళ్లినది. శ్రీవారు సుఖముగా తనఆశ్రమమునందువేంచేసి, ప్రేక్షకులకు దర్శనమొసంగి యందఱిని యద్భుతానందతరంగములలో ముంచివైచిరి.

శ్రీవారు చిత్రకూటసమావేశమున కేతెంచి తిరిగి తనయాశ్రమమునకు జేరిరి. వీరు నిశ్చలభక్తులు, ఘటనాఘటనసమర్థులు, వైరాగ్యసంపన్నులు. వారి యద్భుతశక్తిని జూచితిరా?

సారహీనులగు నిరీశ్వరవాదులు ప్రబలియుండు నీకాలమున "దైవముకలదు; మంత్రశక్తి మంటఁగలియలేదు; భక్తిమార్గమె ముక్తిదాయకము; మహిమాన్వితున కధోగతిలేదు." అనునట్టి సిద్ధాంతములను బ్రత్యక్షప్రమాణముగ వెల్లడిచేయు "శ్రీ మదఘోరీబాబా" వంటిమహనీయులఁ నరుడుగనున్నారనిచెప్పుట సాహసముకాదు. పురాణపురుషావతంసులగు వసిష్ఠ వామదేవ విశ్వామిత్రాది తపస్సంపన్నుల కాలవాల మగు నీహిందూరమాసుందరి నేటికిని తపస్స్వాధ్యాయనిరతప్రభావంతులగు శుక్తిముక్తా ఫలములను బ్రసవించుచునేయున్నది. "సనాతనధర్మ మడుగంటలేదు," అనుట కీనిద ర్శనము చాలదా? నిరీశ్వరవాదులికనైనను మేలుకొందురుగాక.

శ్రీవారు గోదావరిజిల్లాలో పర్యటనముగావించినట్లు తెలిసెడిని. ఆప్రాంతమున నిట్టి శక్తిస్వరూపమైనకార్యములు జరిగినట్లు వినియున్నచో పత్రికాముఖమున తెలుప గలరని మనవిచేసికొనుచున్నాను." త్రిలిఙ్గ, (తే. 14-8-1933, పు. 10-11.)

## (24) శ్రీఅఘోరీబాబా.

(శ్రీకొంపల్లె వేంకటసుబ్బారావుగారు, బి. యస్. సీ.,)

"కడచిన తే 7-వ దీ సోమవారమురాత్రి సుమారు 8 గంటలకు అఘోరీ బాబాగారు ఇచ్చటకువచ్చి నాతోకలసి భోజనముచేసినారు. తరువాత మరియొక అర గంటసేపుపుండి వెంటనే తాతానగరంపోవలెనని వెళ్లిపోయిరి. తదుపరి అఘోరీబాబా గారు ఆనాటిరాత్రియే యిచ్చటకువచ్చినటయిముకు ఒకఅరగంట ముందునూ, ఒకఅర గంట వెనుకనూ, తాతానగరంలోవున్నట్లు తెలియవచ్చినది. శ్రీబాబాగారు ఆంధ్రదేశ స్థులు, వారితో నాకు పరిచయముకలదు. వారిదర్శనము లభించినపుడు మతసంబంధ మయినవిషయములను మాట్లాడుకొనెడివారము. అప్పుడప్పుడు వారు దివ్యదృష్టిరీత్యా యితరదూరప్రదేశములలో జరిగెడువృత్తాంతములను చెప్పుచుండెడివారు. దర్శిలాను ఆవిషయములును ధృవపర్చుచు ఆయాప్రదేశములనుండి వర్తమానములు వచ్చుచుండె డివి. ఇటీవలనే యీనెల 7-వ తారీఖున జరిగిన అత్యద్భుతవిషయమును బట్టిచూడ శ్రీ అఘోరీబాబాగారు సాధారణమానవులుగారనియు దేవతాసంభూతులనియు గ్రహింప వలసియున్నది. శ్రీ బాబాగారియొక్క యీదివ్యాద్భుతచర్యలను తమయొక్క వారపత్రికలో ప్రచురించుటకుగాను పంపడమైనది."

త్రిలిఙ్గ, (తే. 21-8-1933, పు. 12.)

## (25) శ్రీఅఘోరీబాబాగారి దివ్యాద్భుతఖేచరీపర్యటన.

"శ్రీవారు ప్రస్తుతము తాతానగరములో యునికియయ్యును గడచిన శని వారమురాత్రి (5-8-1933 రాత్రి) గం. 8-35 ని॥లకు కాకినాడలో మాయింటికి

కమండలముతోసహా వచ్చి తా మిప్పుడే సువర్ణముఖిలో స్నానమాడివచ్చిరనియు తమయొక్క రుద్రాక్షలును వెనుక యిక్కడయుంచిన నల్లఅంగీయును యిమ్మని అడిగినారు. ఆయాసామి హాజరులేనందున తిరిగివచ్చెదమనియు ఇప్పుడాగుటకు వీలులేదనియు తిరుగ వెంటనే వెళ్లిపోయినారు. ఆనాడే అంతకుపూర్వము అరగంటవరకు తరువాత వెంటనేయును శ్రీవారు తాతానగరులోనేయున్నట్లు తెలియవచ్చినది."

చేబ్రోలు రామమూర్తి.
పారుపూడి సత్యనారాయణ.
త్రిలిఙ్గపత్రిక, (తే. 21-8-1933, పు. 12.)

(26) శ్రీమదఘోరీబాబా

"తే 14-8-1933 దీని వెలువడిన మీత్రిలిఙ్గపత్రికను చూచితిని. అందు శ్రీమదఘోరీబాబాగారి ఘనతనుగూర్చి కొనియాడుచు, వారి అత్యద్భుతచర్యలను పేర్కొనుచు, వారు గోదావరిజిల్లావాస్తవ్యులనియు, వారచ్చటేదైననూ అద్భుత కృత్యముల జూపియుండిన పత్రికాముఖమున తెలియజేయవలసినదని వ్రాసినవ్యాసము జదివితిని. ఆ అఘోరీబాబాగారు చాలాగొప్పవారు. వారియందసమానమహత్తుగలదు. వారిపేరు స్మరించుకొనినంతమాత్రముననే సకలపీడలు పోవుననుటకు నిదర్శనములు గలవు. నాసోదరికి కడుపులో పోట్లు, మంటలు, మొదలైనవి ఒకనాటిరాత్రి పుట్టి బహుబాధ నొందుసమయమున నాకామె కబురుపంపగా అచ్చటికి వెళ్లితిని. ఏమిచేయుటకునుతోచక శ్రీఅఘోరీబాబాగారివిషయము ఇదివరకే తెలియుటచేత ఆమహాత్ముని పేరు స్మరించుకొనవలసినదిగా చెప్పితిని. అట్లామె పదినిమిషములు స్మరణచేయుసరికి బాధ నివారణయయ్యెను. అచ్చటనున్నవారందఱును ఆనామముయొక్క మహత్తును జూచి ఆశ్చర్యపడితిమి. ఆమహాత్మునియొక్క నామస్మరణయే యింతమాహాత్మ్యమును జూపిన శ్రీవారియందెంతమహత్తు ఉండియుండవలెనో సాక్షాత్తు ఆపరమేశ్వరునికి తప్ప ఎవరికిని తెలియదనుటలో సందేహ మేమియును లేదు. ఇటువంటివి యింకను తదుపరి ఎన్నెన్నో జరిగియుండెను.

పత్రికాధిపా! పైసంగతులను ప్రచురిస్తూ శ్రీవారియొక్క ప్రస్తుతపునికి తెలియపర్చవలసినదనియు, అట్లుచేసిన ఆమహాత్ముని సందర్శించుభాగ్యముకొఱకు అనేకమంది నిరీక్షించుచున్నారనియుకూడ వ్రాయవేడెదను. శ్రీబాబాగారినిగుఱించి పత్రికాముఖమున తెలుపవలసినదని వ్రాసితిరి. కాబట్టి ప్రచురణకొఱకు యీసంగతిని వ్రాయడమైనది."

ఇట్లు,
ఆకెళ్ల వేంకటశాస్త్రి, అంబాజీపేట.
త్రిలిఙ్గపత్రిక, (తే. 28-8-1933, పు. 15.)

## పాతివ్రత్యప్రభావము.

### (27) పాతివ్రత్యము—తత్ప్రభావము.

(.........పతివ్రతశరీరమునుండి స్వయముగా అగ్నిజ్వాలమండుచు బయలుదేరుట.)

[తే. 20-7-34 దీ, కాశీ-"పండితపత్రము" (హిందీ) నుండి యనువాదింపఁబడినది.]

"ఉత్తరఇండియా హరదోయిజిల్లాలో 'ఇకనారా'యనుగ్రామమునందు పండిత ఛోటేలాలుపాండే యనుబ్రాహ్మణుని పెద్దకూతురు రేశంకుమారివివాహము అదేజిల్లాలో కసరాతాయనుగ్రామమునందుగల పండితదీనదయాళమిశ్రకొడుకగు వంశీధరనితో జరిగినది. ఇప్పటికి పిల్లవయస్సు 16 సం॥లు. భర్తవయస్సు 20 సం॥లు. పోయిన'జూను'నెలలో భర్తకు చాలజబ్బుచేసి భార్యనుచూడగోరి వారిగ్రామమునకు కబురుచేసెను. భార్య బయలుదేరి భర్తయింటికి ఇంకాచేరకముందే భర్త మరణించెను. భర్తయొక్కశవమునైనను కడసారిచూచుటకుగాను భార్యవచ్చేవఱకు శవమును శ్మశానసమీపమునగల ఒకతోటలోనుంచిరి. భార్య భర్తయొక్కశవముపైబడి యేడ్చి ఆలింగనముచేసుకొని మొగముపైన కప్పియున్నవస్త్రమును తొలగించి ముఖమునుచూచి స్పృహతప్పిమూర్ఛపోయి, కొంతసేపటికి తెలివివచ్చినతర్వాత నేనుభర్తతోడ "సహగమనము" చేసెదనని ఘట్టిగా చెప్పినది. కాని బంధువులు ఆపిల్లను సహగమనముచేయనియ్యలేదు. 18-6-34 ఉదయమున అనగా మరునాడు బంధువులాపిల్లను బలాత్కారముగబండిలోకూర్చుండబెట్టి 'ఇకనారా'యను పేరుగల తండ్రియొక్కయూరికిపంపించిరి. ఆపిల్ల వెంటనే బావికిపోయి స్నానముచేసినది. సహగమనమువద్దని తనకు తెలుపవచ్చినవారితో నేను నిశ్చయముగ సహగమనము చేసెదను అనిచెప్పినది. గదిలోనికి పోయి పూజచేయుచుండెను. బంధువులు సహగమనము వద్దని బోధించుచునేయుండిరి. దానిపినతండ్రి ఆగదిగుమ్మమునకు అడ్డముగ కూర్చుండియుండెను. కొంచెము సేపయినతరువాత ఆమె, 'నాభర్తచితికి అగ్ని తగిలింపఁబడినది. నాశరీరముకూడ కాలుచున్నది. నన్ను విడిచిపెట్టండి. లేకపోతే యీయిల్లు మండిపోవును' అని కేకలువేయ మొదలిడినది. ఆమాటలువిని పినతండ్రి అక్కడనుంచిలేచెను. ఆమెకుడిచేతివ్రేళ్లనుండి దీపజ్యోతులతో సమానముగా జ్వాలలు బయటికివచ్చుచుండెను. ఆమె మరల ఇట్లన్నది.—'నన్నెవ్వరుతాకకండి. నన్ను తాకినవారికి కుష్ఠరోగముపచ్చును.' అంతట జనులుతొలగి దూరముగాపోయిరి. ఆమెచంకను చిత్రాసనమును, కుడిచేత పూజసామగ్రిగలపళ్లెముపట్టుకొని యింటినుండిబయలుదేరి తన

వివాహసమయమునందు పెండ్లివారుదిగినతోటకు పోయి ఆతోటలో పెండ్లికివచ్చినప్పుడు తనభర్త పెండ్లిపల్లకిదింపిన అశ్వత్థవృక్షముక్రింద చిత్రాసనముపఱిచి నిలుచుండిచేతులు జోడించి పూజపాత్రనుండి యేదోతీసి నలువైపుల చల్లినది. భర్తపేరుచ్చరించి తలమీద నున్న మేలిముసుగు తొలగించి సూర్యునిచూచుచు కూర్చున్నది. ఇంతలో నొకవెలుగు కనబడినది. క్రమముగా రావిచెట్టుకొనవఱకు అమంటలు వ్యాపించినవి. ఆచెట్టుఆకులు కూడా మాడినవి. ఆమంటలోనున్న ఆమె రామనామస్మరణచేసి తిన్నగాకూర్చున్నది. ఆ మంటలలో ప్రాణముపోయినది. తరువాత జనులు చందనము, నేయి, కర్పూరము, పిడుకలు, ఆమంటలలో వేయగా శరీరముభస్మమైపోయినది. పోలీసువారు వచ్చి విషయం భోగట్టా జేసిపోయిరి. ఆగ్రామజమీందారు అన్నకొడుకగు 'సయ్యదుమకబుహసన్' ఈ విషయమును ఆదినుండియు గమనించుచున్నాడు. కనుక అచట ఒకమంటపమును ఆ ప్రదేశమున కట్టింప నిశ్చయించెను.

ఇట్లు,

పుత్తూలాలు అగ్నిహోత్రపాండీహాం.

త్రిలిఙ్గ, (తే. 20-8-1934, పు. 15)

[శ్రీమద్భాగవతపురాణచతుర్థస్కంధమున దక్షునియజ్ఞమున దక్షపుత్రికయగు సతీదేవి యోగసమాధిచే నగ్నిని బుట్టించి, యందుఁ దనదేహమును దగ్ధముచేసికొనినకథ కల్పితముగావలసినపనిలేదని యీపైవార్త బుజువుచేయుచుండుటలేదా! శ్రీమహాభారతారణ్యపర్వమున నలోపాఖ్యానములో దమయంతి నరణ్యమున నవమానింపవచ్చిన కిరాతుఁ డగ్నిదగ్ధంబైనవృక్షమువలె నామెయొక్కశాపాగ్నిచే విగతజీవుఁడై కూలుటయు నిట్టిసమాచారమే.]

## 28—A. బాలిక బాలుఁడుగా మారుట

"20 యేండ్లకన్య యెట్లు నవయౌవనుడుగా మారెనో యిపు డొకదృష్టాంతరూపముగ దెలియవచ్చుచున్నది. ఈపిల్ల నంగునేరితాలూకాకుచేరిన సెల్వమగుదూరుగ్రామములో నొకగొల్లవానికి వాని ప్రథమభార్యయందు జనించెను. చిన్నతనమునుండియు నా శిశువు తన 20-వ యేడువఱకును స్త్రీగానే భావింపఁబడి పెంచబడెను.ఆపిల్లతల్లి ఈమధ్య చనిపోయినందున తండ్రి ద్వితీయవివాహముచేసికొనెను. మరియొకజిల్లావాసియగు భార్య లేనివా డొకడు వచ్చి తండ్రితో, తన కాపిల్లనిచ్చి పెండ్లిచేయుమని యడిగెను. ఆమెను గురించిన సత్యము నాతనికిఁ జెప్పినను గూడ నేమైననుసరే దానిని వివాహమాడుట కాతఁ డొప్పుకొనెను. అంతట వివాహము జరుపబడి వారిరువురును 10 నెలలు సుమారు కాపు

రముచేసిరి. అప్పుడు సహింపరానిబాధ కలిగినందున నామెకు జబ్బుచేసెను. దానిపై నామెకు మందిప్పించుటకు తండ్రియింటికి బంపిరి. గొప్పగొప్పవైద్యులు వచ్చి చికిత్స చేసినను నామెబాధ తగ్గలేదు. ఒకప్రఖ్యాతవైద్యునిచే నామెను పరీక్షచేయింపవలెనను కోరికతో నాగొల్లవాడామెను ఎడియంగాడికితీసికొనివెళ్లెను; అక్కడనామెను మొదట నొకమంత్రసాని పరీక్షించి రోగి పురుషుడేగాని స్త్రీగాదని యభిప్రాయపడెను. ఇక నాలస్యమేమియుఁ జేయక రోగిని నాగర్‌కోయిల్‌కు తీసికొనివెళ్లమని తండ్రికి సలహా యీయబడెను. అక్కడ మూడవపర్యాయము రోగి పరీక్షింపఁబడెను.తరువాత తగినశస్త్ర చికిత్సచేయగా రోగి యన్నివిధముల పురుషుఁడుగా మారెను. పొత్తికడుపుక్రిందిభాగమున తోలుపొర యొకటి యధికముగా లేచుటయే దీనికి గారణమని విస్పష్టమాయెను. శస్త్ర చికిత్సవలన స్త్రీయిట్లుపురుషుడుగ మారుట వైద్యప్రపంచమున అననుభూతసంభవముగా నిక్కడ చెప్పుకొనుచున్నారు. ఆపిల్ల యిపుడు 20 ఏండ్లవయసువాఁడు. అతనికి వివాహముగూడ త్వరలోజరుగనున్నదని తెలియుచున్నది.

(హిందూ.) త్రిలిఙ్గ, (తే. 8-9-1930, పు. ౩.)

28—B AHMEDABAD.

"Quite a new legal problem has arisen out of the apparent change of sex of a young girl in the Western Kathiawar States. The girl who was married some six years ago showed signs of complete change in the sex and her husband has sent her back to her parents. As her father died without a son to inherit his properties, her relatives are consulting lawyers, whether the girl, in view of her changed sex, could inherit the properties."

Dharmarajya (D. 2-11-1935, p. 3)

అనఁగా:—

అహమ్మదాబాదు.

"పశ్చిమకథియవార్‌సంస్థానములలో నొకచిన్నబాలికయొక్క స్త్రీపురుషజాతి భేదము (ఆఁడుదనము) మారిపోయినట్లు కనుపించుచుండుటవలన నొకక్రొత్తవ్యవహారిక ధర్మసమస్య బయలువెడలినది. ఆఱేండ్లక్రిందట వివాహమైనయాబాలికకు స్త్రీపురుష జాతిభేదలక్షణములు పూర్తిగామారిపోయిన చిహ్నములు కనుపించఁగా, నాఁమెభర్త యామెను బుట్టింటికిఁ బంపివేసెను. ఆమెతండ్రియొక్కయాస్తికి హక్కుగలపురుషసంతతిలేకయే యామెతండ్రి చనిపోయినందున, నిపు డామెయొక్క స్త్రీజాతిత్వము మారి

పోయినయూధారముచే నాయాస్తి కామె హక్కుదారు కాఁజాలదాయని యావెబంధువులు న్యాయవాదులతో నాలోచన చేయుచున్నారు."

ధర్మరాజ్య, (తే. 2-11-1935, పుట 3.)

[ఇట్టియసాధారణవిషయము లీకాలమునఁగూడ నెప్పుడో యొకప్పు డెక్కడనో యొకచోట జరుగుచున్నవిధముగనే, శ్రీమద్రామాయణమున నుత్తరకాండమున వాలి సుగ్రీవుల జననసందర్భమున వారిజనకుఁడగు ఋక్షవిరజుఁడు, పార్వతీదేవిచేశపింపఁబడినకొలనిలో నెఱుఁగక మునిఁగినందున స్త్రీయగుటయును; నావిధముగనే యిలోపాఖ్యానమునఁ, గైలాసప్రాంతమునఁ గుమారవనమును బ్రవేశించిన యిలుఁడనురాజు సపరివారముగా నాఁడురూపమును బొందుటయును; శ్రీమద్భాగవత నవమస్కంధమునఁ, బైయిలుఁడనురాజు తొలుతఁ గన్యకగాఁ బుట్టి, విష్ణువరముచే మగవాఁడై, పైకుమారవనము ప్రవేశించినందున మరలనాఁడుదై, శంకరునియనుగ్రహముచే నొకనెల యాఁడుదియు మఱియొక నెల మగవాఁడును, మరలనొక నెల యాఁడుదియు,నీరీతిగ జీవితాంతము వఱకును గడపునట్లు తీర్మానింపఁబడినకథయును; శ్రీమహాభారతమున నానుశాసనికపర్వమున, భంగాస్వనుఁడనురాజుగూడఁ బైనచెలిపిన యిలుఁడనురాజువలెనె వేఁటాడఁబోయి యడవిలో నొకానొకసరస్సున స్నానమాడినందున నాఁడుదైపోవుటయును;— నిట్టివిచిత్రము లేకాలముననో, యెచ్చటనో, మిక్కిలియరుదుగ జరిగియుండుటలో నాశ్చర్య మేమిగలదు?]

## (29) BACK TO THE APE (CALIFORNIA.)

"A rare disease which has attacked a man in California is said to be gradually turning him into a kind of "Human Ape. In seven years the man is said to have lost 5 inches in height and his head has grown steadily larger."

Dharmarajya, (D. 26-10-1935, p. 3)

అనఁగా:—

## (క్యాలిఫోర్నియాలో) మనుష్యుఁడు క్రోఁతిగా మారుట.

"క్యాలిఫోర్నియాలో నొకమనుష్యున కొకయసాధారణమగు వ్యాధివచ్చి క్రమముగా వానిని మనుష్యులలో నొకక్రోఁతి క్రిందికి మార్చివేయుచున్నదఁట. ఏడేండ్లలో నామనుష్యునియెత్తులో 5 అంగుళములు తరిగిపోయి వానితల క్రమముగాఁ బెద్దదిగఁ బెరిగినది."

ధర్మరాజ్యపత్రిక, (తే. 26-10-1935, పు. 3.)

[శ్రీమద్భాగవత దశమస్కంధమున (నుత్తరభాగమున)ను, శ్రీమద్రామాయణమున నుత్తరకాండమున (రాముఁడు లక్ష్మణునకుఁ జెప్పినట్లు)ను వర్ణింపఁబడిన నృగమహారాజు బ్రాహ్మణశాపముచే నూసరవెల్లియైనవిషయము మొదలగుచిత్రములు గూడ నిట్టివే!]

అచేతనములందుఁ జైతన్యము

## (30) MIRACLE PICTURE OF ALEXANDRIA.

"Great sensation has been caused in Alexandria by a picture "The miracle," as it mysteriously exudes moisture at regular intervals and is supposed to have wonderful healing powers. It is a picture of the Vergin Mary holding the child Christ in her arms. Hundreds of people mostly sick and maimed flock there to be cured by the picture. Police officials and priests who inspected the picture are unable to account for the phenomenon,"

Dharmarajya, (D. 23-3-1935 p 4.)

అనఁగా:—

అలెగ్జాండ్రియాలోని విచిత్రపుబొమ్మ.

"అలెగ్జాండ్రియాలో నొక 'తమాషా' బొమ్మ క్రమముగాఁ గొంతకొంత సేపటికి నుండియుండి చెమర్చుచు (చెమ్మగ్రక్కుచు) నున్నందునను, దానికి నద్భుతమగు వ్యాధినివారణశక్తి యున్నట్లు చెప్పుకొనుచున్నందునను నాపట్టణమున గొప్పయలజడి జనించి యున్నది. అది శిశువైనక్రీస్తును దనచేతులలో నెత్తికొనియున్న మేరీకన్యయొక్క బొమ్మ. మిక్కిలిజబ్బుగానున్నవారును, నంగవైకల్యమొందినవారును నందలకొలది జను లాబొమ్మవలన వ్యాధినివారణమును బొందుటకై యచ్చట గుంపుగూడెదరు. 'పోలీసు' అధికారులును, బురోహితులును నాబొమ్మను బరీక్షించిరికాని యావిచిత్రమునకుఁ గారణమును గనుఁగొనఁజాలకయున్నారు."

ధర్మరాజ్యపత్రిక, (తే. 23-3-1935, పు. 4)

31-A రాతివిగ్రహము కదలుట.

శ్రీసేపూరి యల్లమందయ్యశ్రేష్ఠిగారు,

బేస్తవారపుపేట, కర్నూలు.

"కర్నూల్ జిల్లా కంభంతాలూకా మదనపుల్లలచెరువు, బసినేపల్లె గ్రామముల సామీప్యమున గుండ్లమడుగునదీతీరమున వేంచేసియున్న శ్రీ వీరాంజనేయస్వామి

వారి క్షేత్రమునందు తే 5-6- 31 ది మొదలు, తే 11-6-31 ది వరకు శ్రీరామ సప్తాహము శ్రీరామభక్తులచే సంకల్పింపఁబడి జయప్రదముగ నెరవేర్పబడినది. ఈ మహత్కార్యమునందు మదనపుల్లలచెరువు, బదినేపల్లె, ఖాజీపురం, కోనపల్లె, బేస్త వారపుపేట గ్రామాదులవారున్నూ, హజరత్ గూడెం కర్ణం వాకిచెర్ల శేషయ్య గారున్నూ వారి అల్లుడు చినగానిపల్లె గ్రామం కర్ణం ఆకవీటి వోబయ్యగారు ఉభయులు జరిపిరి. బద్వీటి వెంకటసుబ్బయ్య కర్ణంగారున్నూ............... వెలిదండ సుబ్బారాయుడుగారు వగైరా రామభక్తులు కార్యములందు శ్రద్ధవహించి అఖండ వైభవముగా నడిపిరి.

... ... ... ... ... ...

సప్తాహము పరిపూర్తికాబడెను. పూర్ణాహుతి అఖండవైభవోపేతముగా పూర్తి చేయబడెను.

ఇటులజరిగిన ఘంటసేపటికి శ్రీజనమేజయులచే ప్రతిష్ఠింపఁబడిన శ్రీవీరాంజ నేయశిలావిగ్రహామునందు కదలిక జనించినదని ప్రజలు తండోపతండములుగా వచ్చి చూడ మొదలుపెట్టిరి. అది యేమిచిత్రమోకాని సుమారొక అరఘంటకాలము శిలా విగ్రహశిరోభాగచలనము ఎల్లరుగాంచగలిగిరి. శ్రీలింగమూర్తిగారు వెంటనే అరుదెంచి వీక్షించి తన్మయులై, 'దీనికై మీరేమిఆలోచింపపనిలేదు. శ్రీవారియందుగల మాహాత్మ్యమును ఎల్లరకుతెలియపరచుసూచనయిది. ఇకముందుఈక్షేత్రము శ్రీభద్రాద్రిక్షేత్రముతో తుల్యమగుపుణ్యక్షేత్రముగా ప్రకాశింపగలదు. అందుకై యిదియొకగొప్పశుభ సూచకముకాన మనమెల్లరమికముందు శ్రద్ధవహించి శ్రీస్వామివారిదేవాలయ ప్రాకార మంటపగోపురముల జీర్ణోద్ధారణమునకు శ్రద్ధవహించి నడుముగట్టవలయును.' అని జనుల నెల్లరిని ప్రోత్సాహపరచిరి.

... ... ... ... ... ...

బి వెంకటసుబ్బయ్య,
మదనపుల్లలచెరువు.

త్రిలిఙ్గ, (తే. 29-6-1931 పు. 3.)

## 31—B. A STRANGE PHENOMENON AT THE AGARAM FESTIVAL.

"A very strange phenomenon occured on 21—10—'35 at 11-30 a. m., during the famous Festival at Agaram celebrated annually in honour of Goddess Sri Muthalamman of Thadi-

kombu, six miles north of Dindigul. Every year the eye-opening ceremony used to be celebrated precisely at 11 a. m., but this year, since it was late by half an hour, before the very eyes of thousands of spectators and worshippers, the whole stone Mantapam that stands before the Temple actually rocked to and fro for a few seconds to the wonderment of all present, so that those who were engaged in worship and offering sacrifices fled away pell-mell terrified to notice the unnatural phenomenon. The rocking of the Mantapa ceased as soon as the Idol was carried in procession from that place after the usual eye-opening ceremony. It is reported that Mr. Lakshmana Mudaliar, the Trustee of Devasthanam, experienced a burning sensation during the tremour. This has become the general talk of the locality and it is thought that it portends something evil."

R. Balasubramanyam,
Dharmarajya, D., 9-11-1935 (p. 12)

అనఁగా:—

ఆగరం ఉత్సవసందర్భమున నొకవిచిత్రదృశ్యము.

"దిండిగల్‌కు నుత్తరమున నాఱుమైళ్లదూరముననున్న తాడికొంబులోని 'శ్రీ ముత్తలమ్మక్' అనుదేవతకుఁ బ్రతిసంవత్సరమును ఆగరంలోజరుగునుత్సవములో తే 21-10-35 దీ పగలు 11 గంటల 30 నిమిషములకు మిక్కిలియద్భుతమగు విచిత్ర దృశ్యమునడచియున్నది. ఏటేటను సరిగా 11 గంటలకే 'కన్నుతెఱచు'నుత్సవము జరుగుటవాడుక; కాని, యీయేడు ఒకయరగంట నేపాలస్యమగుటచేఁ, జూడవచ్చినట్టియుఁ, గొలువవచ్చినట్టియు వేలకొలదిజనులకట్టెదుట, గుడిముందరిశాతిమంటపము కొన్నిక్షణములసేపు వెనుకకును ముందులకును నూసులాడుచుఁ, జూచువారి కబ్బురముపుట్టించుచుండగాఁ, బూజలు సేయుచున్నవారును నైవేద్యాదులుపెట్టుచున్నవారును, నస్వాభావికమగు నైదృశ్యమునుజూచి భయపడి పారిపోయిరి. మామూలు కన్నుతెఱచునుత్సవము ముగిసి, విగ్రహ మూరేగుటకుబయలు దేరఁగనే మంటపమూసులాడుట యాగిపోయెను. ఊసులాడినసమయములో, నా దేవస్థానధర్మకర్తయగు లక్ష్మణస్వామి మొదలియారుగారికి మంటలు బయలుదేరినట్లు తెలియుచున్నది. అచ్చటివారంద ఱీసంగతియే చెప్పుకొనుచుండిరి; ఏదోయరిష్టమురానున్నందుకు నిదిసూచనయని యనుకొనుచున్నారు."

ఆర్. బాలసుబ్రహ్మణ్యము,
(ధర్మరాజ్య, తే 9-11-35.)

32.—A. "The authorities at the East Titen Hospital at Gjoervik are at present mistified by the behaviour of a table, which begins to jump about as soon as the lights are put out at night. The governing committee of the hospital sat up a whole night in the room where the table is, but were unable to find any explanation of its mysterious movements.

It was after the arrival of a little girl patient that the table "came to life". The table is between the bed of this girl and that of another.

As soon as the electric light was extinguished, it began jumping and causing such a noise that the whole hospital was awakened. When the light was turned on, the table remained quiet.

When this had been going on for some nights, the committee decided to investigate and spent a whole night in the ward. One of them got on the table but immediately the lights were put out, the table is reported to have jumped right across the room with the man seated upon it.

Two doctors, with professional scepticism, refused to believe the story of the table's antics, but after they had spent a night watching it, they too were convinced.

The walls, floor and ceiling of the ward have been carefully examined, but nothing has been found to explain the mystery."

Dharmarajya, (D. 20-10-1934 p. 3)

ఈపైవిషయమునే త్రిలిఙ్గపత్రికగూడఁ బ్రచురించియున్నందున దానినెత్తి యీఁదిగువఁ గనబఱచుచున్నాము:—

ఎగిరే బల్ల.

నార్వేఆసుపత్రిలో అమానుషదృశ్యము!

వైద్యులకు గారణము గోచరింపకపోవుట!!

విమానతపాల సమాచారము.

ఆస్లోపట్టణము, అక్టోబరు 6.

"గ్జోర్విక్ ఆసుపత్రి అధికారులు తమఆసుపత్రిలో రాత్రిళ్లు దీపములుమలిపి వేయుచుండగనే యొకబల్ల తనంతట ఎగురనారంభించుటచే నాశ్చర్యపడుచున్నారు.

ఈయాసుపత్రియధికారు లొకరాత్రియంతయు నీయద్భుతమునకు గారణము నెఱుంగు నిమిత్తము మేలుకొనియుండి యాబల్ల అవ్విధముగా నెగురుచుండుటకు గారణ మరయ లేకపోయిరి.

ఆసుపత్రి కొక ఆడుపిల్లరోగిని జేర్చుకొనినపిదప నాబల్ల కిట్లు చైతన్య మేర్పడినది. ఈబల్ల యీబాలికపడకకును దానిప్రక్కనను౦డు వేఱొకరోగిపడకకును మధ్య యున్నది.

రాత్రిళ్లఎలిక్ట్రిక్ దీపము లార్పబడగనే బల్ల ఎగురనారంభించును. ఆధ్వనికి ఆసుపత్రిలో నిదురించుచుండు రోగులందఱును మేలుకొనుచున్నారు. మరల మఱలద్రిప్పి విద్యుద్దీపముల రానిచ్చుచుండగనే నావెలుగుతో బల్ల ఎగురక నిలబడిపోవును.

ఇవ్విధముగ గొన్నిరాత్రిళ్లు జరుగగనే ఆసుపత్రిని నిర్వహించు కమిటీఅధికారులు దీనికారణ మరయుట కొకరాత్రియందు నిదుర గోల్పోయి వేచియుండిరి. కమిటీసభ్యులలో నొక డాబల్లమీద గూర్చుండి దీపముల నార్పమనెను. వెంటనే వానితోగూడ బల్ల ఎగురనారంభించి యాగదిలో నడ్డముగా దిరిగెను. బల్లపైనున్న వాని కేయపాయమును జరుగలేదు.

ఇరువురుడాక్టర్లు ఇట్టి పరిస్థితులను పాశ్చాత్యవిజ్ఞానులవలెనె నమ్మక యిది భ్రమయని చెప్పినవారు సైత మొకరాత్రియంతయు ఆసుపత్రిలో నుండి దీపములను మలిపింపగనే యాబల్ల యెగురుటను జూచి యద్భుతపడి, తమఅభిప్రాయములను మార్చికొనిరి.

ఆసుపత్రిగోడలు, కప్పు, తలప్రదేశము, వీటినన్నింటిని పరీక్షించిరి. కాని, యద్భుతమునకుగారణ మింకను మృగ్యము." త్రిలిఙ్గ, (తే 25-2-1935, పు. 14.)

[శ్రీమద్రామాయణ యుద్ధకాండమునను, నుత్తరకాండమునను బుష్పకవిమానము రాముని యుద్దేశమెఱిఁగి యెగురుటయుఁ, బిమ్మట రామునియొద్దకు స్వయముగ వచ్చుటయు, నాయనయనుజ్ఞపై తనయిచ్చవచ్చినయెడకుఁ బోవుటయు మొదలగు కథ లబద్ధముగాదని పైవార్తలు చాటుటలేదా ?]

## 32—B. BLOOD FROM A TOMB AT ELLORE.

"Hindus and Muslims are reported to be jointly worshipping a tomb in the above place of a Muslim saint who was said to have had miraculous powers of healing. The story goes that some people unaware of the tomb's sanctity tried to dig up the tomb to clear the ground for a new office. When the first crow-

bar blow fell on the tomb, blood gushed out from it and the person who used the crow-bar died immadiately. A peculiar feature of the tomb is that Hindus worship there in larger numbers than the Musalmans.

Dharmarajya (D. 2-11-1935 p. 3)

అనఁగా:—

ఏలూరుదగ్గఱ గోరీలోనుండి రక్తము కారుట.

"పైయూరియొద్ద నొక మహమ్మదీయపకీరుయొక్క గోరీని హిందువులును మహమ్మదీయులును బూజించుచున్నట్లు తెలియవచ్చుచున్నది; వ్యాధులు కుదుర్చుటలో నాఁగనకు విచిత్రములగు శక్తు లుండెడివఁట. జరిగిన కథ యేమనఁగా: ఆగోరీయొక్క మహిమ నెఱుఁగనిజనులు కొందఱచ్చట నొక క్రొత్తకచ్చేరీ కట్టఁదలఁచి, యందుకై యచట స్థలమును బాగుచేయుకొఱ కాగోరీని త్రవ్వివేయుటకై యత్నించిరఁట. పలుగుయొక్క మొదటిదెబ్బ గోరీపై పడఁగానే దానినుండి రక్తముచిమ్మి, యాపలుగుతోఁ బొడిచినమనుష్యుఁడు వెంటనే మరణించెను. ఆగోరీయందలి చిత్రమేమనఁగా, నచ్చట మహమ్మదీయులకంటె హిందువులే యెక్కువమంది పూజచేయుదురు."—

ధర్మరాజ్య, (తే. 2-11-1935 పు.3.)

## దయ్యములు, మంత్రశాస్త్రము.

### బళ్లారిలో గొప్పసభ.

33 "మాంత్రికచక్రవర్తి ప్రొఫెసర్ అంజన్‌గారు బెజవాడనుండి ఆదోనిపురమునకు వచ్చి ఒక గొప్ప వైశ్యకుటుంబమువారిని పిశాచబాధలనుండి తొలఁగించినారని విని మాపురప్రముఖులు వారి నాహ్వానించి మంత్రశాస్త్రమును, ప్రాణాయామమునుగూర్చి యుపన్యసింపవలసినదిగా కోరిరి. ఈనెల రెండవతేదీ సాయంకాలము అయిదుగంటలకు మరెప్ప సిద్దప్పగారి కల్యాణమందిరమున గొప్పపౌరసభ జరిగెను. పురములోని న్యాయవాదులు, పండితులు, ఉద్యోగులు, వర్తకులు మొదలగు ననేకులు సభకు విచ్చేసియుండిరి. సుప్రసిద్ధన్యాయవాదులును, సంస్కృతవిద్యాధికులును, సర్పెంటుపవర్ (కుండలినీశక్తి) అను గ్రంథమును ఆంగ్లభాషలో రచించినవారును నగు బ్రహ్మశ్రీ టి. యం. కృష్ణసామయ్య, బి. ఏ., బి. యల్., హైకోర్టు అడ్వొకేటుగారు సభాధ్యక్షులుగనుండ శ్రీ ప్రొఫెసరుగా రుపన్యసించుచు హంసలు, వానినడకలు, ప్రాణాయామ మెట్లు చేయవలసినది, షట్చక్రములను వానియధిదేవతలను, ఈశ్వరోపాసనవిధానమును, కుండలినీశక్తిని సహస్రారకమలమును గూర్చియు, మంత్రములను

వాని నభ్యసించుపద్ధతియు, ఉపాసనమహిమను, తత్ఫలమును, మొదలగు ననేక విషయములనుగూర్చి పెక్కుఉదాహరణములతో మిగుల మనోహరముగ రెండు గంటలకాల ముపన్యసించిరి. అనంతర మధ్యక్షులు తమసారాంశోపన్యాసమున ప్రొఫెసరుగారు ఈవిషయములందు బాగుగ పరిశ్రమచేసి యభ్యసించినవారనియు, ఇట్టి విద్యలకు దేశీయులు తగుప్రోత్సాహ మొసంగవలయుననియు మొదలగు విషయములు నుడివి ముగించిరి. అంతట బళ్లారి జాయింటుసబ్ రిజిస్ట్రారుగారైన శ్రీయుత వి. నాగలింగయ్యదేవరగారు, ఉపన్యాసకులకును, అధ్యక్షులకును సభ్యులకును వందనములు సమర్పించుటతో సభ విరమింపఁబడెను."

"ప్రేక్షకుడు"

త్రిలిఙ్గ, (తే. 11-5-1931, పు. 9.)

34. "రంగూనున దయ్యముపట్టిన మో అంటిన్ అనుయువతికి భూతవైద్యము చేయుచున్న వైద్యుఁడు దెబ్బలు అనేకము తగిలించుటలో యువతి ప్రాణమును వదలెను. భూతవైద్యుని పోలీసులు అరెస్టుచేసిరి."

త్రిలిఙ్గ, (తే 1-10-1934, పు. 10.)

35. "బెంగాలున తాను ఎన్నడోచంపినపులి తనకు రాత్రులలో గనపడుచు తన కుక్కనుగూడ కలవరపెట్టుచున్నదని ఇంగ్లాండుజేరిన కల్నలు ఒకరుచెప్పుచున్నారు. క్లబ్బునకువెళ్లినప్పుడుగూడ తన వెంబడి యీపులి వచ్చుచున్నదట!"

త్రిలిఙ్గ, (తే 5-11-1934, పు. 10.)

36. "కడపలో శ్రీపీ. సుబ్బారావుగారియింటిలో ఒకదయ్యముచర్యలవల్ల అందరిబ్బందిపడుచున్నారు. ఉదయమునుండి రాత్రి 9 గంటలవరకు విచిత్రపుచేష్టలు జరుగుచున్నవి." త్రిలిఙ్గ, (తే 18-2-1935, పు. 10.)

[పైన దెల్పిన 16-B. సంఖ్యగల విషయముగూడ నీసందర్భమునఁజూడఁ దగినది!]

కొమ్ములుగల మనుష్యుఁడు.

37. "విలాసపూరున ఒకనికి పశువులకున్నకొమ్ములవంటి కొమ్ములు ఏర్పడి క్రమేణ ఇవి పెరుగుచున్నవి. సర్జనుఒకరు ఈకొమ్ముల నీమధ్యకోసివేసిరి. చాలాకాలము ఇతను ఈకొమ్ములతో బాధపడెను." త్రిలిఙ్గ, (తే 24-12-1934, పు. 10.)

[శ్రీమద్రామాయణ బాలకాండమందలి ఋష్యశృంగమునికి మొగమునఁ గొమ్ముండుట యసంభవముకాదని యీవార్త చాటుచున్నది.]

## ఒకజాతిజంతువుకడుపున వేఱొకజాతి పుట్టుట.

38. "చైనాలో ఒకహోటలున ఒకచేపనుకోయగా నిందుశిశువుకనబడినమీదట వేలకొలదిజనము ఈచిత్రమును జూడవచ్చిరఁట!"

త్రిలిఙ్గ, (తే 10-9-1934, పు. 10.)

[శ్రీమహాభారతమున నాదిపర్వమున, వేదవ్యాసమహామునికిఁ దల్లియైనసత్యవతి (మత్స్యగంధి)యు, నామెయొక్కతోడబుట్టువైన మత్స్యరాజును, దాశరాజునకుఁ జేపయొక్క కడుపులో లభించినకథయును; శ్రీభాగవతపురాణమున దశమస్కంధమున (నుత్తరభాగమున) శంబరాసురుఁడు శిశువగు ప్రద్యుమ్నుని దొంగిలించుకొనిపోయి సముద్రములో వేయఁగా, నాశిశువు నొకచేప మ్రింగుటయు, జాలరులు దానిని బట్టికొని పోయి శంబరునకే యీయఁగా నతనివంటవా రాచేఁపను గోయుసరికి దానిగర్భమున నాశిశువు గానవచ్చుటయు; మొదలగుకథలు కల్లలుగావలసినపని లేదని పైవార్త చాటుచుండుటలేదా?]

మఱియును,

39. "కాంగ్రీసమీపమున 15 అడుగులపొడుగుగలసర్పమును కొందఱుకాల్చి చంపి దీనిపరీక్షింపగా దీనికడుపున ఒకజింక కనబడెనట! కాల్చుటకుముందు ఈజింకను సర్పము దిగమ్రింగెనట!!

త్రిలిఙ్గ, (తే 10-9-1934, పు. 9.)

40. "లండనున కడుపునొప్పితో చాలాకాలముబాధపడుచున్నస్త్రీని ఆపరేషను చేయగా కడుపున ఒకకత్తెర డాక్టర్లకు కనబడెనట! కత్తెరనుదీసివేయగానే స్త్రీ మరణించెను. ఈకత్తెర 13 సంవత్సరములక్రిందట ఆపరేషనుజేసినప్పుడు డాక్టరు మరచి కడుపున ఉంచెనని యేర్పడెను."

త్రిలిఙ్గ, (తే 10-9-1934, పు. 9.)

## మనుష్యునిశరీరమునుండి విద్యుచ్ఛక్తి వచ్చుట.

41. "లండనుసమీపమున ఒకహోటలునన్నునౌకరిని ఎవరుతాకినను ఎలెక్ట్రిసిటీ పుట్టుచున్నదట! చాలాకాలము ఇతను వేలకొలది మోటారుకార్ల తలుపుల తెరచుటవల్ల దేహమంతయు ఎలెక్ట్రిసిటీమయముగ నున్నదట!"

త్రిలిఙ్గ, (తే 10-9-1934, పు. 9.)

[శ్రీమద్రామాయణయుద్ధకాండమందలి ఖడ్గరోముఁడు, సర్పరోముఁడు, వృశ్చికరోముఁడు, విద్యుజ్జిహ్వుఁడు మొదలగువా రిట్టివారే యైయుందురేమో!!]

## (42) RATS MOTHERED BY CAT IN ZOO GARDENS.

"Professor P. Manteifel of the Moscow Zoological Gardens, is conducting an interesting experiment in which a cat is mothering several baby rats.

The cat had borne three kittens, and it was decided to place a litter of newly born rats with them to determine whether the cat would mother them along with her own brood. As was expected, when the mother cat smelt the rats she immadiately made a grab for them.

The rats were rescued, and then were together with the three kittens soaked in a tub of warm water and while drying were all rubbed together. They were then all put back in care of the mother cat, who accepted all of them. Professor Manteifel explains this by saying that animals are known to rely more on their sense of smell than of sight, and that after the bath the mother cat was unable to detect the difference."

Dharmarajya, (D. 6-7-1935 p 4.)

అనఁగా:—

### జంతుప్రదర్శనశాలతోటలలోఁ బిల్లి యెలుకలను బెంచుట.

"మాస్కోయందలి జంతుప్రదర్శనశాలతోటలలోని ప్రొఫసర్ పీ. మాంటీఫెల్ అనునాయన యొకపిల్లిచేఁ బెక్కెలుకపిల్లలను బెంచింపుచు నొకవిచిత్రపరిశోధనను గావించుచున్నారు.

ఆపిల్లి మూఁడుకూనలను గనెను; అప్పుడు క్రొత్తగాఁబుట్టిన కొన్నియెలుకపిల్లల నాకూనలతోఁ జేర్చిపెట్టి, వానితోఁబాటుగ వీనినిగూడఁ బిల్లి పెంచునో లేదో చూడవలయునని యాయన నిశ్చయించుకొనెను. అనుకొనినట్లుగనే, పిల్లి యెలుకపిల్లలను బసిబట్టగనే (యనఁగా వాసనఁజూడఁగనే) వానిని బట్టుకొనఁబోయెను.

ఆయెలుకపిల్లలను దానిబారినుండి కాపాడిరి; అంతట వానిని మూఁడుపిల్లికూనలతోఁగూడఁ జేర్చి యొకతొట్టిలో వేడినీళ్లతోఁగడిగి, యారుసమయమున నన్నిఁటిని గలిపి రుద్దిరి. పిమ్మట వానినన్నిటిని దల్లిపిల్లియొద్దఁ బెట్టఁగా నది వానినన్నిఁటిని జేరఁదీసెను. జంతువులు కంటిచూపుకంటె వాసనపై నెక్కువయాధారపడియుండుననియు, స్నానముచేయించినతరువాత (వాసనలోని) భేదమును దల్లిపిల్లి గ్రహింపఁజాలకపోయినదనియుఁ బైవిచిత్రమునకుఁ గారణమును ప్రొఫెసర్ మాంటీఫుల్ గారు విశదపఱచుచున్నారు."

ధర్మరాజ్య, (తే 6-7-1935, పు. 4.)

[ఈవిషయమును జదివినపుడు శ్రీమహాభారతమం దాదిపర్వమున దుష్యంతమహారాజచరిత్రలోఁ గణ్వమహామునియొక్క యాశ్రమవర్ణనసందర్భమున:

"సీ. ...........................................................

.........................కరికర, శీతలచ్ఛాయఁ దచ్ఛీకరంబు

కణములచల్లనిగా డప్పసడి వానిఁ, జెంది సుఖంబున్న సింహములయు

భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి, పెట్టునీవారాన్నపిండతతులు

తే. కడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు, చున్న యెలుకలపిల్లలయొండుసహజ

వైరిసత్త్వంబులయు సహవాసమపుడు, సూచి మునిశక్తికెంతయుఁ జోద్యమంది."

[యనువిషయము స్ఫురణకువచ్చి, యందంతయు స్వభావోక్తియేగాని యతిశయోక్తి యణుమాత్రమును లేదని తోఁపకపోదు.]

## (43) SEEING WITHOUT EYES.

"Mr. Kuda Bax of Kashmir aged 29, gave a demonstration before many prominent doctors in London, of his ability to read with his eyes shut. Even though his eyes were tied by thick layers of cotton and table napkins, Mr. Kuda read messages from the Books of which one was a sealed and limited edition. The doctors who saw this "miracle" remained sceptical and offered no explanation."

Dharmarajya, D., 6-7-1935 p. 4)

అనఁగా:—

## కండ్లులేకయే చూచుట.

"కాశ్మీరమున 29 యేండ్లయీడుగల 'కుదా బాక్స్' అనునతఁడు కండ్లుమూసికొని చదువఁగల తనసామర్థ్యమును లండనులోఁ బెక్కుమంది ప్రముఖులగు వైద్యులయెదుట బుజువుపఱచెను. దట్టమగు దూదిమడతలతోడను రుమాళ్లతోడను సతనికండ్లు కట్టివేసినప్పటికిని, కుదాగారు కొన్నిపుస్తకములలోనుండియు, వానిలో మూయఁబడి బందోబస్తుచేయఁబడిన యొకపుస్తకమునుండియుఁగూడఁ, గొన్నివిషయములను జదివెను. ఈచోద్యమునుజూచినవైద్యులు సంశయగ్రస్తులై యేమియు సమాధానముఁ జెప్పరైరి."

ధర్మరాజ్య, (తే 6-7-1935, పు. 4.)

[మనపురాణాదులందు వర్ణింపఁబడిన దివ్యదృష్టి యిట్టిదేయేమో!!]

44. "164 స్తంభములతో డెన్మార్కున ప్రపంచమంతటికిని గొప్పదగువంతెనను 6,250,200 వెచ్చించి నిర్మించుచున్నారు. దీనిపొడుగు 11 మైళ్లుండును."

త్రిలిఙ్గ, (తే 15-10-1934, పు. 10)

[తగినంత యంగబలమును నర్థబలమును నున్నచో నిట్టివం తెనలుమాత్రమే గాక యింతకంటెను బెద్దవిగూడఁ గట్టుటలోమాత్ర మసంభవమేమియుండును? అట్లే తగినంత యంగబలముగల వానరసేనయొక్క సహాయముతో శ్రీరామచంద్రుఁడు సేతునిర్మించుటయందుమాత్ర మాశ్చర్యమును, నసంభవతయు నేమియుండును? "క్రోతులువచ్చి మనుష్యులవలెఁ బరిచర్య సేయుటయు యుద్ధమొనర్చుటయు నసంభవముగాదా?" యందురా? ఐనచోఁ బైన (11—A) సంఖ్యగలవార్తను, నీక్రిందివార్తను దిలకింపుఁడు!]

45. "ఇండోరున ఒకపెంపుడుకోతి తనయజమానిపై నాగ్రహించి యితని తుపాకితోఁ గాల్చెను. ఇతను వెంటనే ఆసుపత్రిలో మరణించెను."

త్రిలిజ్గ, (తే 25-2-1935, పు. 12.)

(46) Mr. K. Kato, a Japanese Teacher and a globe trotter has covered 40,000 miles in six years, visiting Korea, Manchuria, Mongolia, Central and South China, Siam, Malaya States, Java, Sumatra, Burma, Afganistan, and Kandahar. He is now at Lucknow. He will shortly leave for Europe, via Persia, Iraq and Turkey. His tour will last till 1940. He says that he has found walking good for his health and that it affords ample opportunities to gain first hand knowledge of the people of the various countries." —"Dharmarajya (D, 8-12-1934, p. 2.)

అనఁగా;—

46 " 'కే. కాటో'గారను జపానుదేశీయుఁడైన యుపాధ్యాయుఁడు భూగోళ సంచారము చేయువాఁడై యాఱుసంవత్సరములలో 40,000 మైళ్లు తిరిగి, కొరియా, మంచూరియా, మంగోలియా, మధ్యచైనా, దక్షిణచైనా, సయాం, మలయాస్టేట్స్, జావా, సుమత్రా, బర్మా, ఆఫ్గనిస్థానము, కందహార్ దేశములను సందర్శించియుండెను. ఇప్పుడాయన లక్నోలోనున్నాఁడు. ఆయనత్వరలోనే పర్షియా, ఇరక్, టర్కీ దేశముల ద్వారా 'ఐరోపా'కు బ్రయాణముకానున్నారు. ఆయనప్రయాణము 1940 సంllవఱకును జరుగును. నడచుట తనయారోగ్యమునకు మంచిదిగ గనబడుచున్నదనియు, వివిధ దేశములలోని జనులవిషయమగుజ్ఞానమును బ్రత్యక్షముగ సంపాదించుటకు మంచియవకాశమును గల్పించుననియు నాయనచెప్పను." ధర్మరాజ్య (తే 8-12-1934, పు.2.)

[పాదచారులై భూప్రదక్షిణము చేయుఘను లెవరోకొంద ఱీకాలమునఁగూడ నుండుటచే మనపురాణాదులం దట్టివారు పూర్వకాలమున నున్నట్లు పేర్కొనఁబడిన వార్త లసత్యములు కావలసినపని లేదు.]

## పూర్వజన్మసంస్కారము.

## (47) A MATHEMATICAL PRODIGY.

"Decca has produced a Mathematical prodigy like Ramanujam of Madras. He is Mohini Mohan Kushari, the 12 year old son of a teacher in the Decca college School. The boy has not attended any school so far, but can solve any algebraic problem mentally besides knowing English, Bengali and Sanskrit. The Deccan University has permitted him to attend the M. A. (Mathematics class.) The Director of Public Health has sanctioned a grant of Rs. 100 to him for purchase of mathematical books."

Dharmarajya (D. 23-3-1935, p. 5)

అనఁగా:—

## గణితశాస్త్రవైచిత్ర్యము.

(47) "మద్రాసులోని రామానుజముగారివలెనే 'డక్కా' యొక గణితశాస్త్ర వైచిత్ర్యమును జనింపఁజేసియున్నది. అచిత్రము, డక్కా కాలేజీపాఠశాలయందలి యొక యుపాధ్యాయుని కొడుకగు 12 ఏండ్ల యీడుగల మోహినిమోహన్ కుషారియను బాలుఁడు. ఆబాలుఁ డింతవఱకును నేపాఠశాలయందును విద్య నేర్చియుండలేదు; కాని, వానికి నింగ్లీషు, బెంగాలి, సంస్కృతభాషలు వచ్చియుండుటయేగాక, బీజగణితసంబంధమగు నేలెక్కయైనను నోటితో గుణించఁగలఁడు. గణితశాస్త్రమున యం. ఏ. తరగతిలోఁ జేరుటకు డక్కావిశ్వవిద్యాలయము వాని కనుజ్ఞనిచ్చినది. గణితశాస్త్రసంబంధమగుగ్రంథములను గొనుటకు నారోగ్యశాఖాధికారి. వానికి రూ. 100 ధర్మమిచ్చియుండిరి."

ధర్మరాజ్య (తే 23-3-1935, పు. 5.)

(48) 8. "జయపురమునందు పుట్టుగ్రుడ్డివాఁ డొకబాలుఁ డున్నాఁడు. వీ డతి విద్యావంతుడయ్యెను. మిక్కిలిపసితనమునందే విద్యాభివృద్ధిబొందువాఁడని సూచించెను. అతిబాల్యమునందే మహమ్మదీయుల వేదగ్రంథమును (ఖురాను,) నంతటిని వల్లెవేసి ఒప్ప జెప్పుచుండెను. పిదప ఒకఅరబ్బీపాఠశాలం బ్రవేశించి అతికఠినగ్రంథములను రెండు మూడుసార్లు విని వాటిలో విషయములను తూ, చా, తప్పక వినువారి కద్భుతావహమగున ట్లొప్పజెప్పును. పంజాబువిశ్వవిద్యాలయపు అరబ్బీభాషలో హానర్సుపరీక్షకు దరఖాస్తునంపి విశ్వవిద్యాలయాధికారుల ఉత్తరువుప్రకారం ఒకలేఖరిగుండా ప్రశ్నకాకితములలోనుండు ప్రశ్నలను విని వాటికుత్తరములనుజెప్పి యాలేఖరిచే వ్రాయించి పరీక్షాధికారుల కంపెను. పరీక్షలో నత్యున్నతముగా నుత్తీర్ణుఁ డయ్యెను. వానికి విద్య

యం దాసక్తి మెండుగా నున్నందున వైద్యపరీక్షకు జదువునిమిత్తము టిబ్బియాకళాశాలయందు జేరియున్నాఁడు."
త్రిలిఙ్గ, (తే 15-10-1934, పు. 11.)

(49) శ్రీయల్. సంజీవరాయఁడుగారు.

"వీరు జాత్యంధులు. ప్రొద్దుటూరునివాసులు. వీరికి మంచిధారణాశక్తి గలదు. వీరు సూత్రములు దెలిసిన పెద్దపెద్దలెక్కలనయిన నోట లెక్కించి చెప్పగలరు."
'భారతి'పత్త్రిక, (సంపు. ౧౧. సంచి. ౧౨. పు. ౯౫౯.)

(50) "గణితశాస్త్రమునందు నిపుణులును, జాత్యంధులునగు శ్రీయల్. సంజీవరాయఁడుగారు మదరాసున తనప్రజ్ఞను సభలలో ప్రదర్శించి యాశ్చర్యమును గలిగించిరి."
త్రిలిఙ్గ, (తే. 10-12-1934, పు. 12.)

51—(A) AMAZING POWER OF A SEVEN YEAR OLD BOY.

"Master Ivan King, a seven year old boy of England, by his phenomenal brain powers, is taking the scientific world by surprise. At 18 months he was able to talk fluently and by the end of seven years he could read at the rate of one book a day. Recently he presented a logical argument why Income-tax is scientifically more sound than a sales tax. He is "A boy in a million" says Dr. Samuel B. Heckman of New York."

Dharmarajya, (D. 27-7-1935, p. 4)

అనఁగా:—

(51) ఏడేండ్లబాలుని యద్భుతశక్తి.

"ఇంగ్లండులో నేడేండ్లయీడుగల 'మాస్టర్-ఐవన్-కింగ్' అను బాలుఁడు తన యత్యద్భుతమేధాశక్తిచేఁ బ్రకృతిశాస్త్రప్రపంచకమున కచ్చెరువు గొలుపుచున్నాఁడు. 18 మాసములయీడున నతఁడు ధారాళముగ మాటలాడనేర్చెను; ఏడేండ్లువచ్చుసరికి దినమున కొకగ్రంథముచొప్పున నతఁడు చదువఁజాలియుండెను. విక్రయపుపన్నుకంటె రాబడిపన్ను ప్రకృతిశాస్త్రాధారములచే నెట్లులాభకారియో యొకతార్కికవాదము నిటీవల నాబాలుఁడు ప్రదర్శించెను. "అట్టిబాలురు కోటి కొక్కరుందు"రని 'న్యూయార్కు'లోని డాక్టర్: శామ్యూల్ బీ. హెక్‌మన్ అను వైద్యుఁడు చెప్పియుండెను."
ధర్మరాజ్య, (తే. 27-7-1935, పు. 4.)

## 51—(B) AMAZING GIRL PRODIGY IN AUSTRALIA.

"Perry Hart, a seven years old violinist, will, according to the critics, startle the world. In her fourth year when she could not even talk properly, she is said to have passed the highest examinations of the Australian Music Board."

Dharmarajya, (D. 9-11-1935 p 3.)

అనఁగా:—

### ఆస్ట్రేలియాలో నద్భుతశక్తిగల విచిత్రబాలిక.

"ఏడేండ్లయీడుగల 'పెర్రీ-హార్టు' అను వీణవాయించుబాలిక, ప్రపంచకము నాశ్చర్యచకితముగావించునని విమర్శకులయభిప్రాయము. ఆమె లిన్నఁగా మాటలుగూడ నేరని నాలుగేండ్లయీడున, నాస్ట్రేలియా సంగీతపరీక్షావర్గమువారి యత్యున్నతపరీక్షలో జయమొందినదని చెప్పుచున్నారు." ధర్మరాజ్య, (తే. 9-11-1935, పు. 3.)

[ఈపైయుదాహరణములలోఁ జేర్కొనఁబడిన ప్రజ్ఞావంతులు తా మాయా విద్యలందుఁ బ్రావీణ్యమును సంపాదించుటకు వలసినయభ్యాసము నీజన్మమునందుఁ జేయుటకుఁ దగినయవకాశమును వ్యవధియు లేకయే, యట్టిప్రావీణ్యమును బొందియుండుట విశదమగుచున్నది. ఇఁక నట్టి ప్రావీణ్యమేర్పడుటకుఁ గారణము, లోగడ మనవీ గ్రంథమున రెండవప్రకరణమున 'నితరజన్మము కలదనుటకు వేదశాస్త్రప్రమాణము' లనుశీర్షికక్రిందఁ దెలిసికొనియున్నరీతిగఁ, బూర్వజన్మములం దట్టిసాధనములను వారభ్యసించియుండుటయే యను నీక్రింది సూతసంహితలోని ప్రమాణశ్లోకము స్ఫురణకు రాదా?

"శ్లో. యేషామస్తి పరిజ్ఞానం వినైవజ్ఞానసాధనం,
కల్ప్యం తత్సాధనం తేషాం పూర్వజన్మసు సూరిభిః."

## (52) THE MAN WHO KNOWS FIVE HUNDRED LANGUAGES.

"Mr. George E. Hay of England has got a working knowledge of 500 languages. He has retired at the age of 81 after working for about 66 years. His greatest asset is his memory and of all the languages he found the Chinese language the most formidable. Even now he is as assiduous as any in the study of languages."

Dharmarajya (D. 22-6-1935, p. 3)

అనఁగా:—

ఐదువందలభాషలు నేర్చిన మనుష్యుఁడు.

"ఇంగ్లండులో 'జార్జి-ఈ-హేం' అనువారికి 500 భాషలలో వ్యవహారికజ్ఞానము కలదు. ఆయన సుమారు 66 సంగరములు పనిచేసినపిమ్మటఁ దనయొక్క 81-వ యేటఁ బనినుండి విరమించి విశ్రాంతిగైకొనెను. శేషించియున్న యాయనయొక్క మిక్కిలి గొప్పసామర్థ్య మాయనయొక్క జ్ఞాపకశక్తియే; అన్నిభాషలకంటెను చైనాభాషయే యాయనకు మిక్కిలి యెక్కువఘోరముగఁ గనఁబడినదఁట. ఇప్పటికిఁగూడ భాషలు నేర్చికొనుటలో నాయన యితరులెవ్వరికిని దీసిపోనిస్థితిలో నున్నాఁడు."

ధర్మరాజ్య, (తే. 22-6-1935, పు. 3.)

[అసాధారణమేధావంతు లీకాలమునఁగూడఁ గలరనుట కిది మఱియొక తార్కాణము.]

(53) సంవత్సరములకొలఁది నిద్రమానియుండుట.

"ఇంగ్లాండున ఒక మోటారుకారు విరుగుటచే దెబ్బలుతిన్నయువకుడు నాలుగు సంవత్సరములుగా నిద్రబోవుటలేదనియు, పడకలోపడుకొని నవలలు చదువుచున్నాడనియు తెలిసినది. మోటారుఆపదలో దెబ్బతగిలినపుడు పదిరోజులు తినను స్పృహలేక పడియుండి ఆమీద జబ్బునెమ్మదింపగానే నిద్రలేకయున్నాడు."

త్రిలిఙ్గ, (తే. 10-12-1934, పు. 9.)

(54) "బవేరియాన ఒక నేతగాడు 1933-వ సంవత్సరమునుండి నిద్రబోవుట లేదుగాని యితరులవలెనే అన్నిపనుల జేయుచున్నాడు. వీనికి నిద్రవచ్చునట్లుచేయుటకు వైద్యు లెంతో ప్రయత్నించిరికాని లాభములేకపోయెను."

త్రిలిఙ్గ, (తే. 23-9-1935, పు. 9.)

[శ్రీమద్రామాయణ బాలకాండమున సీతారాములు గంగాతీరమున నిద్రించిన రాత్రి లక్ష్మణుఁడు నిదురవోక వారికి కాపుండి, యరణ్యావాసమునల్లు పదునాలుగేడులును దానునిద్రమాని వారిని గాచియుండుటకుఁ బ్రతిజ్ఞవహించుట యసంభవము కావలసినపనిలేదని పైవార్తలు చాటుచున్నవి.]

(55) బాలికలు బిడ్డలను గనుట.

"అమెరికాన 11 ఏండ్లబాలిక 7½ పౌన్లు తూకముగలబిడ్డను కనినందుకు అంద రాశ్చర్యపడుచున్నారు. బాల్యవివాహములు అమెరికానగలవని దీనివల్ల తెలిసెను."

త్రిలిఙ్గ, (తే 22-10-1934, పు. 9.)

(౫6) "స్కాట్లాండునందలి కంబర్లాండున 'మిసస్ హాగ్గిన్సు' అను పండ్రెండు యేండ్ల వయస్సుగలయువతి ఆరుపౌన్లుతూకముగల శిశువునుకనెను. ఇండియానమాత్రమే యిట్టి అసందర్భములున్నవని సంఘసంస్కర్తలుతలచుట పొరపాటు."

త్రిలిఙ్గ, (తే 23-9-1935, పు. 9.)

[శ్రీమహాభారతాదిపర్వమునఁ గుంతీదేవి బాల్యమునఁ గర్ణునిగనుట మొదలగు కథలు బొంకులుగావలసినపనిలేదని యీపైవార్తలు చాటుటలేదా?]

(౫7) ఆకాశమునుండి రాళ్లుపడుట.

"అమెరికామ్యూజియములోనున్న ఆకాశమునుండి క్రిందపడ్డ కొన్నిరాళ్లను ప్రదర్శింప నేర్పాట్లుగావించిరి. ఇందు ఒకటి 6 వేలపౌన్ల బరువుగలదిగ నున్నది."

త్రిలిఙ్గ, (తే 23-9-1935, పు. 10.)

(౫8—A) పోయినకండ్లు వానియంతటనే వచ్చుట.

"లంకాషైరున ఒకస్త్రీ 13 సంవత్సరములు కండ్లుకనబడక బాధపడుచుండెను గాని యేమందులేకనే ఒకరోజున కండ్లచూపుకనబడెనని వినుచున్నాము."

త్రిలిఙ్గ, (తే. 29-10-1934, పు. 11.

## 58—(B) BLINDNESS CURED BY ACCIDENT.

Ionia.

"Virtually blind, Mrs. Floyd Husted of Ionia was able to see again because her 12 year old son, Richard, struck her in the eye with a comb.

Blind in one eye, Mrs. Husted began to lose the sight of the other some months ago when an apparent infection developed from her impaired eye. A film developed and several specialists whom Mrs. Husted consulted were unable to effect a cure.

Wednesday she walked up behind her son as he was combing his hair and the comb struck her in the eye. The injury proved painful for a time and required her handkerchief to stop the flow of tears.

Upon removing the handkerchief, Mrs. Husted found, she stated, that she could see clearly for the first time in months."

—The Indian Mirror (D. 3-11-1935, p. 1.)

అనఁగా:—

హఠాత్తుగఁదగిలిన దెబ్బచేఁ గ్రుడ్డితనము కుదురుట

"అరోనియాలో మొత్తముమీఁద గ్రుడ్డిదగు 'ఫ్లాయిడ్-హస్టెడ్' అను నామెకుఁ దనయొక్క 12 ఏండ్ల యీడుగలకొడుకగు రిచ్చర్డు అనువాఁడు దువ్వెనతోఁ గంటిలోఁగొట్టుటచేఁ దిరిగి చూపు కనుపించుచున్నది.

హస్టెడ్ అనునామెకు నొకకన్నుపోయి, యందలి యంటువ్యాధి రెండవకంటికిఁ గూడ వ్యాపించుటచేఁ గొన్ని నెలలక్రిందట దానిచూపుపోయినది. ఒకపొరయేర్పడఁగా, హస్టెడ్ విచారించిన ఘనవైద్యులెవ్వరును మాన్పఁజాలకపోయిరి.

బుధవారమునాఁడు తనకొడుకు తలదువ్వుకొనుచుండఁగా వానివెనుకగ నామె నడచిపోవుచుండెను; అదువ్వెనవచ్చి యామెయొక్కకంటిలోఁ బొడిచికొనెను. ఆ దెబ్బ కొంతసేపటివఱకును నొప్పిపుట్టి కన్నీరుగారుటచే దానినాపుటకు నామె చేతి రుమాలుతో తుడువవలసివచ్చెను.

ఆరుమాలు తీసినతోడనే, తాను గొన్ని నెలలకు మరల బాగుగఁ జూడఁజాలితి నని హస్టెడ్ చెప్పెను." ఇండియన్ మిర్రర్ పత్రిక, (తే. 3-11-35, పు. 1.)

## 59—(A) DEAF ENABLED TO HEAR.

"An American scientist has invented a special electromagnetic cigarette-holder, which when placed between the teeth, enables the deaf to hear. This device is also incorporated in an electro— magnet comb." — Dharmarajya (D, 23-3-1935, p. 5.)

అనఁగా:—

చెవిటివారు వినఁజాలుట.

"అమెరికాలో నొకప్రకృతిశాస్త్రజ్ఞుఁ డొక ప్రత్యేకమగు 'ఎలెక్ట్రో-మ్యాగ్నెట్'తో చేయఁబడిన సిగరెట్టుగొట్టమును గనిపెట్టెను; పండ్లసందున దానిని బెట్టినచో చెవిటివారు వినఁజాలుదురు. ఇట్టియేర్పాటునే 'ఎలెక్ట్రో-మ్యాగ్నెట్'తో చేసిన దువ్వెనలోఁగూడ నిమిడ్చియున్నారు." ధర్మరాజ్య, (తే. 23-3-1935, పు. 5.)

## 59—(B) LOST VOICE REGAINED.

"Some months ago a Manchestor fruit merchant lost hi voice through a shock, On medical advice, his vocal Chords were replaced by a Larynx composed of rubber and steel and the man has regained his voice with slightly metallic intonation."

Dharmarajya, (D. 23-3-1935 p. 5.)

అనఁగా:—

పోయినకంఠధ్వని మరల వచ్చుట.

"కొన్ని నెలలక్రిందట, 'మ్యాంచెస్టర్'లోని పండ్లవర్తకునికొకనికి విద్యుచ్ఛక్తి తాఁకుడుపలన కంఠస్వరము చెడిపోయెను. వైద్యులసలహామీఁద వానికంఠనాళములను డీసివైచి, యుక్కును, రబ్బరును, జేర్చిచేసిన యూపిరిగొట్టమును బెట్టిరి; కొంచెము లోహధ్వనితో గలిసిన కంఠధ్వని వానికిఁ దిరిగివచ్చెను."

ధర్మరాజ్య, (తే. 23-3-1935, పు. 5.)

(60 A) వివిధచిత్రములు. (Miscellaneous Miracles.)

"ఒక యెలిక్ట్రికుతీగెను విసరుటవల్ల శత్రుసైన్యమునంతటిని ఒకదెబ్బలో సంహారముగావింప వీలగునని లండనున శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈతీగెవల్ల పంటలను గూడ పాడుజేయవీలగునట! ఇకముందు యుద్ధములలో నష్టమునకు మేరయుండ నేరదు."

త్రిలిఙ్గ, (తే. 7-10-1935, పు. 9.)

[మనపురాణానులలో వర్ణింపఁబడిన బ్రహ్మాస్త్రము మొదలగు దివ్యాస్త్రముల ప్రభావముగూడ నిట్టిదేయేమో!]

అనగా:—

60—(B) THE UNSINKABLE SHIP.

" A new invention for rendening ships unsinkable was tested on the Seine the other day.

Before a huge gathering of the public, batteries of Press Cameres and new-steel apparatus, the inventor Julien Guilaume, entered a water-tight compartment on board a 40ft. yacht which was then flooded and sank.

As the minutes passed it looked as though one more inventor has sacrificed his life. Then the top of the mast appeared above the surface of the water and the yacht reappeared riding again on the Seine as though she had never been sub-merged.

The invention is being kept a close secret, but it is known that it can be carried in hand bag and weighs under 50 lbs".

—Dharmarajya (D. 16-3-1935, p. 4.)

అనఁగా:—

మునిఁగిపోనియోడ.

"ఓడలు మునిఁగిపోకుండుటకై క్రొత్తగాఁగనిపెట్టిన యొకయేర్పాటు సీనడుపు నొకనాఁడు పరీక్షించిరి.

పైయేర్పాటునుగనిపెట్టిన 'గైలాం' అనువారు 40 యడుగుల పడవనెక్కి, యందు నీరుచొరని యొకగదిలోఁ బ్రవేశించినపిమ్మటఁ, బడవలోనికి నీటినివదలి, నింపించి ముంచివైచిరి.

కాలము గడచిపోవుచున్నకొలఁదిని, క్రొత్తవిషయములను గనిపెట్టు మఱియొకఁడుగూడఁ బ్రాణములను ధారపోసినట్లు కనఁబడఁజొచ్చెను. అంతటఁ దెఱచాప కొయ్యయొక్క పైభాగము నీటిపైఁ గానవచ్చెను; పిదపఁ బడవ తిరిగికనుపించి, యెప్పుడును మునిఁగిపోయియుండనితీరునఁ గనఁబడఁజొచ్చెను.

ఆక్రొత్తయేర్పాటును బరమరహస్యముగా నుంచియున్నారు. కాని, యది చేతి సంచిలోఁబెట్టుకొని పోవచ్చుననియు, 50 పౌన్లకుఁదక్కువ బరువుండుననియుఁ దెలిసినది.'' ధర్మరాజ్య, (తే. 16-3-1935, పు. 4.)

[శ్రీమహాభారతారణ్యపర్వమున:—

''సీ. కాలకేయులు మహాకాయులు పగలెల్ల జలదుర్గబలమున జలధినుండి
రేలెల్లఁజని నలిరేఁగి మునీశ్వరాశ్రమముల సద్ధర్మచారులైన
బ్రాహ్మణప్రవరులఁ బాయకవధియింతు''......రని చెప్పినకథ యసత్యము కావలసిన యగత్యములేదనియు, నీటిలోమునిఁగి దీర్ఘకాలముండి యిష్టమువచ్చినపుడు పైకి వచ్చుట యసంభవముగాదనియుఁ, బైదృష్టాంతము చాటుటలేదా? శ్రీమద్రామాయణారణ్యకాండమున మందకర్ణిమహాముని, ''కుహరీకృత సలిలాంతర్గ్రహమున నచ్చరలతోడఁ గ్రీడాపరతఁ విహరించుచుండుట''యు నిట్టివృత్తాంతమే!]

(60 C) ''ఒకదేవత ఒకగ్రుడ్డివానితో పూరీసమీపమునందలి యడవిలో తుపాకులు, ఆయుధము లున్నవని రాత్రిపూట చెప్పినమీదట, యీసంగతిని జిల్లామేజస్ట్రేటునకు తెలియజేయగా ఇవి కనబడెను.'' త్రిలిజ్గ, (తే. 24-12-1934, పు. 9.)

(60 D) ''జర్మనీన ఒకకుక్క ఒకలాయరును కరచినందుకై దీనిచంపివేయుమని కోర్టుత్తరువుగావించెను. దీనియజమాని తనగొఱ్ఱెలసంరక్షించుకుక్క కాల్పబడుటకు ఇష్టపడక యెంతో అల్లరిచేసెనుగాని లాభములేకపోయెను. కుక్క యెట్లో యీ సందర్భము తెలిసికొని పారిపోయెనట!'' త్రిలిజ్గ, (తే. 30-9-1935, పు. 9)

[జంతుజాలమునకు మనుష్యభాషచే భావములను గ్రహించుశక్తికలదనుటకిది మఱియొకయుదాహరణము.]

(60 E) వార్తలు.

శ్రీ పునుగు సీతారామశాస్త్రిగారు, మైలాపూరు.

"అసోసియేటెడ్ స్పెషల్ సర్వీసుగా జూలై తే 12 న యీవర్తమానము తెలుపుచున్నది. ఇది లాహోరువర్తమానము. ఒకచిన్నఏటిగట్టున ఒకవనిత తనయేఁడాది బిడ్డను అక్కడనున్న ఒకచెట్టునీడయందు పరుండబెట్టి ఏటిలో దాహముతీర్చుకొనుటకువెళ్లి నాలుగుగుక్కలు నీళ్లుత్రాగివచ్చునప్పటికి తనబిడ్డశరీరమును నాగుపామొకటి పెనవేసి చుట్టుకొనియుండెను. వెంటనే ఆమె కుయ్యోమొఱ్ఱో అని కూఁతలిడగానే సమీపగ్రామమునజరుగు తిరునాళ్లకు ఆదారినిపోవుచుండినవారాబిడ్డచుట్టుమూగి యెంత అదలించినను పాము బిడ్డనువదలక తనపడగను పలుమా ఱాబిడ్డనోటియొద్దకు చాపుచును, ఆబిడ్డ తననోటిలోని కేదోపోవుచున్నదని దానిని తనచేతితో బట్టుకొనుటకు పోవుచును, ఆబిడ్డచేతికి పాము పడగ తగలనీయకుండుటను, జనులుచూచి ఆశ్చర్యపోవుచుండిరి. పాము నదలించినవారినిమాత్రము బుసకొట్టుచు భయపెట్టుచుండెను. ఇట్లు కొంతసేపుండి పాముఅలసి బిడ్డను తనంతటవదలి సమీపమునసుండిన చెట్టుక్రిందిపుట్టలోకేగెను. తల్లి బిడ్డను మరల బ్రదికినదిగాదలచుకొని యెత్తుకొని ముద్దాడుచు తనదారిఁబోయెను. "శివునాజ్ఞలేనిది చీమైనకుట్ట"దను సామెత యథార్థముకదా!"

త్రిలిఙ్గ, (తే. 6-8-1934, పు. 10-11.)

(60 F) "శ్రీ రమేషచంద్రరాయిగారిభార్య తనపిల్లతో రైలున ప్రయాణమగుచుండఁగా రైలుకిటికీనుండి పిల్ల జారి క్రిందపడెను. రైలు నాపమని తల్లి, యితరులు, కోరగా వినక రైలు అవతలిస్టేషనుకు వెళ్లెను. ట్రాలీమీదపిల్లను స్టేషనుచేర్చిరి. కాని చికిత్సకై మరల రైలు నాపమనిచెప్పి ఆమీద నిలిపి చికిత్స కవకాశమిచ్చిరి. ఈపిల్ల నెమ్మదిగనున్నదట!"

త్రిలిఙ్గ, (తే. 10-12-1934, పు. 9.)

[కర్మఫలమును, దానిననుసరించియుండు దైవకృపయు ననుకూలముగనున్నపుడెట్టియపాయములనుగూడ నెంతమాత్రమును హానిచేయఁజాలవనుట కీపైరెండును నుదాహరణములు. శ్రీ మహాభారతాదిపర్వమున వసిష్ఠమహర్షి పుత్రశోకముచే శరీరత్యాగము చేయనెంచి గావించికొనిన యాత్మహత్యాయత్నములు నిష్ఫలములై పోవుటయు నిట్టిదే! (వాని నీగ్రంథముననే రెండవప్రకరణమున, "ధర్మాధర్మములు మార్పువీలులేని ప్రకృతిధర్మముల(Laws of Nature)వలెఁ గఠినములా?" యను శీర్షికక్రింద లోఁగడనొకసందర్భమున దెలిసికొనియేయుంటిమి.)]

## (61) THE GIRL WHO KNOWS HER FORMER EXISTENCE ON EARTH.

" An eight year-old girl in Delhi claims to remember all about her former existence on earth.

It is said that the girl Shanta, a daughter of Lala Jang Bahadur of Delhi, used to say that she was married to a man, in Muttra in her previous life and she gave his address. Recently her people communicated with the husband of her past life. He sent his younger brother whom the girl identified immeditely she saw him. The husband himself came from Muttra and was recognised.

The girl related certain incidents known only to him and his late wife. Incidentally she said that she had buried Rs. 100 at a certain place as an offering to the Goddess to preserve the life of the child at whose birth she died. That child is now 11 years old. The girl explains that before being born in Delhi, she was born at another place and died when she was 2½ years old."

—Dharmarajya, (D. 30-11-1935, p. 9.)

పైవార్తనే త్రిలిఙ్గపత్రిక, తే 9-12-1935 దీ సంచికలో 13-వ పుటయందు విపులముగ బ్రకటించియున్నదిగాని, గ్రంథవిస్తరభీతిచే నందలిసారాంశములనుమాత్ర మిచట సంగ్రహించుచున్నాము:—

### పూర్వజన్మము స్మరింపఁబడుట.

### ఒక హైందవకన్యయొక్క మానవాతీతశక్తి

(అసోసియేటెడ్-స్పెషల్ సర్వీస్, క్రొత్తఢిల్లీ.)

అనువాదకుఁడు:-శ్రీపునుగు సీతారామశాస్త్రిగారు, మైలాపూరు.

"తనపూర్వజన్మస్థితిగతులను మానవాతీతశక్తితో తొమ్మిదిసంవత్సరములవయస్సు గల శాంతిదేవియనుకన్యక వెల్లడించుచుండుటను, క్రొత్తఢిల్లీ, మధురాపట్టణములలో ననేకుల కాశ్చర్యమును గొల్పుచుండుటచే నీప్రాంతప్రజనులు ఈకన్యకయొక్క చరిత్రనువినుటకు మిక్కిలి యువ్విళ్లూరుచున్నారు. ఈశాంతిదేవియను 9 ఏండ్లువయస్సు గలకన్యక చెప్పుమాటలను పరిశోధించునిమిత్తమును, వాటియొక్కయాథార్థ్యము నరయుటకును, ఆకన్యచు మిక్కిలికాపలాతో క్రొత్తఢిల్లీనివాసులు గొప్పవారు ముగ్గురు

నూరుమైళ్లదూరముననుండు మధురాపురికి గొంపోయిరి......క్రొత్తఢిల్లీనుండి మిస్టర్ జీ. సామ్సన్, హిందూపత్రికలో నిట్లు వ్రాయుచున్నారు:—8½ ఏండ్లు యీడుగల ఒకకన్యక తనపూర్వజన్మస్మృతిగలిగి ఢిల్లీలో తనపూర్వజన్మవృత్తాంతమును నిదర్శనములతోఁజూపి చెప్పుచుండుదాని దర్శనార్థము, ఢిల్లీలో ననేకులున్ను, ఢిల్లీపరిసరగ్రామాదులనుండి వేలకువేలజనులున్ను వచ్చుచుండుట మిక్కిలి వింతగొల్పుచున్నది. ఈకన్యక తనపూర్వజన్మపుచుట్టాలను, తానుండినపట్టణమును, తన అప్పటియింటిని, తనస్థితిగతులను చెప్పుచుండునపుడు వినువారికి మిక్కిలి చోద్యముగానున్నది......... మధురలోనుండు తనయింటిలో, (తాను పూర్వజన్మములోఁ జావఁబోవునపుడు పుట్టి యిపుడెసిగి 11 ఏండ్ల యీడుగలవాడుగనున్న బిడ్డయొక్క ప్రాణమును రక్షింపుమని యొకదేవతకుమ్రొక్కికొని ముడుపుగట్టిన నూరురూపాయల) నెచ్చటనో తాను పాతి పెట్టి దానిని దేవున కియ్యవలయునని తాను ప్రార్థనచేసికొనియున్నదఁట. ఆప్రార్థన అత్యావశ్యముగాఁ జెల్లించితీరవలయునని ఇట్లు శాంతిదేవి చెప్పిచెప్పి సదా దుఃఖించుచు ఢిల్లీలో నిప్పుడున్నది..." త్రిలిఙ్గ, (తే. 9-12-1935, పు. 13.)

[భాగవతపురాణ ప్రథమస్కంధమున, నారదుఁడు తనపూర్వజన్మవృత్తాంతమును వ్యాసునకుఁజెప్పుట మొదలగుకథలు బొంకులుగావని పైవార్త చాటుచుండుట లేదా?]

## (62) CURES SNAKE-BITES WITH SALIVA.

"Playing with fierce snakes as if they were dolls and applying his own saliva as a cure for snake poison is reported to be the strange behaviour of a ten-year-old boy in Dunka. Being constantly bitten by snakes, his whole body is full of scars, but he never gives up his play with the snakes. Having learnt no mantras or medicines, he applies his own saliva to the bitten parts of his body and laughs merrily.

Recently the boy having been bitten by a venomous cobra, it is repored that he reeled down without having time to effect his usual cure. His relations knowing this, hurried to the spot and saved him by applying his saliva to the wound."

—Dharmarajaya, (D. 30-11-1935, p. 3)

### ఉమ్మితో పాముకాటును మాన్పుట.

"భయంకరమగు పాములతో, బొమ్మలతోవలె నాడుకొనుటయు, పామువిషమునకుఁ దనయుమ్మినే మందుగా వాడుటయు 'డంకా'లోని యొకపదియేండ్లబాలుని

యొక్క విచిత్రచర్యయని తెలియుచున్నది. ఎడతెగని పాముకాట్లచే వానియొడలం తయు మచ్చలతో నిండియున్నదిగాని, వాఁడు పాములతోడి యాటల నెన్నఁడును మానఁడు. మంత్రములును మందులును దెలియనందునఁ, దనయొడలిమీఁది పాము కాట్లకుఁ దనయుమ్మినే రాచికొని సంతోషముతో నవ్వుచుండును. ఇటీవల వానినొక విషపుఁ ద్రాఁచుపాముకరువఁగా వానిమామూలుమందును వాడుటకు వ్యవధిలేక వాఁడు క్రిందఁబడిపోయెను. వానిబంధువుల కది తెలిసి యాఁచోటికిఁ బరుగెత్తి గాయమునకు వానియుమ్మినేరాచి వానిని రక్షించిరి."

ధర్మరాజ్య, (తే. 30-11-1935, పు. 3)

[మహాభారతాదిపర్వమున, దుర్యోధనుఁడు భీముని "ఘనవిషకృష్ణోరగములఁగఱపించఁగ," నతఁ డపాయమునొందకుండుటయు, భాగవత సప్తమస్కంధమున హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని విషసర్పములచేఁ గఱపించినను నతఁడు చలింపక జీవించియుండుటయుఁగూడ నిట్టివేయేమో.]

ఇట్టితార్కాణము లింకను వేనకువేలు వార్తాపత్రికలనుండి యెత్తిచూపవచ్చును గాని, గ్రంథవిస్తరభీతిచే నిలుపవలసియున్నది. కావున, నిఁక నిట్టిదృష్టాంతములతోఁ బాఠకులకు విసువెత్తించుట విరమించి, యీసందర్భమున గ్రహించవలసిన సారాంశమునుమాత్ర ముగ్గడించి, యావలివిషయమునకు బోవుదము.

ఏవియోకొన్ని యసామాన్యములగు చిత్రము లేదోయొక కాలమునఁ బ్రపంచకమునం దేదోయొకమూల నడచుచునేయుండుట సహజస్వభావమేయని పైవార్తలు చాటుచున్నవి. కాని, మహాసముద్రమువంటిదగు ప్రపంచచరిత్రతోఁ బోల్చినచో మిక్కిలి స్వల్పపరిమితిగల వ్యక్తులయొక్క యనుభవమున కగోచరములగు విషయములన్నియుఁ నభూతకల్పనలనియు, నసంభవములనియు నిరాకరించుట పట్టియజ్ఞానవిలసితముమాత్రమేయని పైవిమర్శనము ఋజువుచేయుచున్నది. అప్పుడప్పు డచ్చటచ్చట నట్టిచిత్రములు సాగుచుండుట సహజముగావుననే కేవల వైదికమతగ్రంథములుమాత్రమే గాక యితరమతగ్రంథములుగూడ నట్టివిషయముల నాయాసందర్భములందు వర్ణించియే యున్నవి. కాని, దూరదృష్టిలేని నవనాగరకులు కొందఱు వానిని గమనింపక, హ్రస్వదృష్టిలో వైదికమతముపై దాడివెడలుటమాత్రము వారికి వాడుకయైపోయినది. కావున నీసందర్భమును లెస్సగ వ్యక్తపఱచిన జగద్గురు శ్రీపూరీశంకరాచార్య శ్రీభారతీకృష్ణతీర్థస్వాములవారి "The secret of India's Greatness" ("భారతవర్షముయొక్క ఘనతలోని రహస్యము") అను నుపన్యాసమందలి యీ క్రిందివాక్యములిచ్చోట నుదాహరించుట యనవసరముగాదు:—

## " THE SECRET OF INDIA'S GREATNESS "

... ... ...

## THE CASE OF MIRACLES.

" The same explanation, namely, of *Raga* and *Dwesha* (i. e., partiality for the one side and hatred for the other) whether conscious or unconscious, matters very little from the point of view of the actual result—really accounts for the difference in attitude taken up by these Orientalists with regard to the "Miracles" described in our Scriptures and in the Bible ! When, for instance, the Mahabharatha tells us about Arjuna's uncontrollable grief over the death of Abhimanyu and Arjuna's consequent vow to kill Jayadratha before sunset (or immolate himself in the Sacrificial Fire) and Shri Krishna's throwing of His Chakra up into the sky, hiding off of the sun from people's visions and producing the illusion of the sun having set, these Western critics come and tell you that this is against the Laws of Nature, scientifically and inherently impossible and so on ! But when we confront them with the still more miraculous incident in the Bible narrative, wherein, for similar purpose, for Joshua's sake Jehovah (the Lord Almighty) makes the sun stand still at one spot in the heavens for a long while and point out that there is, at any rate, the physical possibility, nay our ordinary experience of the sun being wholly clouded out or even totally eclipsed and there is therefore nothing inherently unscientific or against Astronomy herein, but the sun's standing still at one place for a long time is beyond all possibilities of Astronomical Science and can only be described as a miracle pure and simple ! then these very critics who speak of our Scriptures as being full of *myths* will be found to turn round and retort:—"What a godless creature you are ! Do you not know that God is Omnipotent and therefore can do anything that he chooses or wishes to do ? " In reply hereto, we need only say that the explanation about God's Omnipotence is perfectly correct and we are one hundred per cent in total agreement therewith ; but we would all the same like to know whether God is Omnipotent for His prototype Joshua's sake only, but *impotent* in Ajuna's case ? !

## IPSE DIXITS.

We might refer, in a similar manner, to such incidents as Virgin Kunti's giving birth to Karna, the river Yamuna partsing itself in the middle and making way for Vasudeva to pass over with the new-born baby Shri Krishna and so forth, (which incidents the Western missionary and even the Orientalist scoffs at as being inherently impossible) and narrate parallel or still more miraculous incidents from the Bible (which he believes in and sees nothing inherently impossible about!) There is no need however to labour this point any further. Suffice it for our present purpose to point out that innumerable instances of this nature can be cited in support, nay, mathematical proof of our contention that, consciously or unconsciously the Orientalists as a general rule are found to have addressed themselves to their task of Oriental Research, with their judgments warped and distorted by preconceptions and so on of an *a priori* character and that, consequently, the earnest Seeker after Truth has to test their conclusions with the utmost care and allow a huge percentage of *discount* in the process! With these prefatory remarks as regards the mentality and methods of the great majority of Orientalists who have gone in for exegetical criticism of the Vedas and their contents, let us proceed to consider the pet theory formulated by them and blindly accepted, even by their Indian followers and incorporated as correct History, into school books too in India, Europe and America."

... ... ...

—Dharmarajya, (D. 17-2-1934, p. 8.)

అనఁగా:—

"భారతవర్షముయొక్క ఘనతలో నిరహస్యము."

... ... ...

విపరీతముల విషయము.

"మనశాస్త్రగ్రంథములలో'ను, బైబిల్ (అనఁగాఁ క్రైస్తవుల మతగ్రంథము) లోను వర్ణింపఁబడిన విపరీతవిషయముల సందర్భమునఁ బ్రాచ్యవిమర్శకులు గనఁబఱచు భేదబుద్ధికిఁ గారణము పైన దెల్పిన రాగద్వేషముల సంబంధమగు సమాధానమే; (అనఁగా

నొకప్రక్కఁ బక్షపాతమును రెండవప్రక్క నసూయతయును;) వానివలనిఫలితమునుబట్టి యాలోచించినచో నవి బుద్ధిపూర్వకములైనను నబుద్ధిపూర్వకములైనను నొక్కటే! ఎట్లనఁగా,నిందుల కుదాహరణముగ, నభిమన్యునిమరణమునకై యర్జునునకుఁగల్గిన యనివార్య దుఃఖమునుగుఱించియు, నందుపై సూర్యాస్తమయమునకులోపుగ జయద్రథుని వధించెద ననియుఁ (గానిచో హోమాగ్నియందు స్వశరీరత్యాగముఁ జేసెదననియుఁ) నర్జునుఁడు గావించినప్రతిజ్ఞయు, శ్రీకృష్ణుఁడు తనచక్రము నాకాశములో సూర్యునకు మరుగుగాఁ బెట్టి జనుల కగపడకుండునట్లుచేసి సూర్యాస్తమయమైనట్లు భ్రమపుట్టించుటయు, మహాభారతము చెప్పఁగా, నీపాశ్చాత్యవిమర్శకులు బయలుదేరి, యిది ప్రకృతిధర్మములకు విరుద్ధమనియుఁ, బ్రకృతిశాస్త్రముల ననుసరించియు స్వాభావికముగను నసంభవమనియు, నేమేమో మనకుఁ జెప్పవత్తురు. కాని, యింతకంటె నెక్కువవిచిత్రమగు వార్తను బైబిలుకథనుండి మనము వారికిఁ గనబఱచి, యందు నటువంటిప్రయోజనము కొఱకే జోషువానిమిత్తమై జిహోవా (సర్వసమర్థుఁడగు దేవుఁడు) సూర్యుని నాకాశములో నొక్కటేచోటఁ జాల సేపు గదలకుండ నిలువఁబెట్టినసంగతి నెత్తిచూపి, సామాన్యముగ మనలోకానుభవమున సూర్యునిఁ బూర్తిగ మేఘములావరించుటయుఁ, సంపూర్ణసూర్యగ్రహణముపట్టుటయు మొదలగునవి స్వాభావికముగ సంభవించుచుండుట గలదు గావున దీనియందు నస్వాభావికముగాని, బ్రకృతిశాస్త్రవైపరీత్యముగాని, జ్యోతిశ్శాస్త్రవిరుద్ధముఁగానిలేదనియుఁ, గాని, సూర్యుఁ డొక్కటేచోటఁ చాలసేపు గదలకనిలుచుట జ్యోతిశ్శాస్త్రమున కెల్లవిధముల విరుద్ధమనియు, నది వట్టియభూతకల్పనమాత్రమేయని చెప్పఁదగినదనియుఁ మనము తెలిపినచో, మనశాస్త్రగ్రంథములనిండ కల్పితకథలు గలవనిచెప్పు నీవిమర్శకులే తిరిగి దారికివచ్చి యాక్రిందిజబాబు చెప్పుదురు:—"నీవు దైవవిశ్వాసములేని యెంతటిపశువువు! దేవుఁడు సర్వసమర్థుఁడనియుఁ, గావునఁ దాను దలఁచినదానిని దేనినైననుగూడఁ జేయఁజాలుననియు నీకుఁ దెలియదా?" దీనికి మనము చెప్పవలసిన జబాబొక్కటియే; దేవుని సర్వసామర్థ్యమునుగుఱించిన సమాధానము సర్వవిధముల సరియైనదే; ఆవిషయమున నూటికి నూఱుపాళ్లను మేమంగీకరించెదము; కాని, దేవుఁడు తానుసృజించిన జోషువానిమిత్తమైమాత్రమే సర్వసమర్థుఁడా? యనియు, నర్జుననివిషయమున నసమర్థుఁడా? యనియు మే మెఱుఁగఁ గోరుచున్నాము!"

## నిశ్చితాభిప్రాయము.

ఆదేవిధముగఁ, గన్యయగుకుంతి కర్ణునిఁగనుటయు, యమునానది మధ్యలోఁ బాయయిచ్చి, క్రొత్తగాఁబుట్టిన శిశువగు శ్రీకృష్ణునితోడ వసుదేవుఁడు దాఁటివెళ్లుటకుఁ ద్రోవయిచ్చుటయు, మొదలగుసందర్భములను మనము గనఁబఱచవచ్చును;

(అట్టివార్తలన్నియుఁ నస్వాభావికములగు నసంభవములని పాశ్చాత్యమతప్రచారకుఁడును బ్రాచ్యవిమర్శకుఁడునుగూడ నిరసించెదరు: అట్టివారు నమ్మునట్టియు, వారిదృష్టిలో నసంభవవిషయములు లేక శుద్ధముగా నున్నట్టియు) బైబిల్ గ్రంథమునుండి పైవిషయములకు సరిపోలుకథలనుగాని, యంతకంటెను విచిత్రములగువిషయములనుగాని మనము వినిపింపవచ్చును! ఐనప్పటికిని నీవిషయము నింకనుబట్టికొని ప్రాకులాడఁబనిలేదు. ఎటులఁగ యోరోపియనులగు యోరోపా, ప్రాచ్యవిమర్శకులు, 'కారణమునుండి కార్యమును సాధించు'నట్టి ముందుగ నేర్పడిన యూహాలు మొదలగువానిచే వికటించి వికృతములైన బుద్ధులుగలవారై, తమంతటతామే ప్రాచ్యపరిశోధనకార్యభారమును బైనవైచికొనియుండుట వాడుకగాఁ గానవచ్చుచున్నదనియుఁ, నందుచే సత్యాన్వేషతత్పరులైన నిష్పక్షపాతులగు వారు పైవారినిర్ణయములను మిక్కిలి జాగ్రతతో బరీక్షించి, యట్లుచేయుటలో వానిలో విశేషభాగమును ద్రోసివేయవలసియుండుననియుఁ, మావాదమును సమర్థించుటకేగాక గట్టిగా, ఋజువుచేయుటకుఁగూడఁ బైనగనఁబఱచిన యుదాహరణములవంటి వాని నసంఖ్యాకములుగఁ గనఁబఱచఁజాలుదుమని తెలిపినచోఁ బ్రస్తుతమునకుఁ జాలును! వేదములను, వానియందలివిషయములను వ్యాఖ్యానపూర్వకముగ విమర్శించుటకు బయలువెడలిన ప్రాచ్యవిమర్శకులలోని యత్యధికసంఖ్యాకులయొక్క బుద్ధులను గుఱించియుఁ, వారి (విమర్శన) పద్ధతులనుగుఱించియు నీప్రారంభవాక్యములను వినిపించి, యిఁక వారిచేనిర్మింపఁబడి వారియొక్క యనుచరులగుభారతీయులచేఁగూడ యథార్థమగుచరిత్రయని యంధప్రాయముగ నామోదింపఁబడి, భరతవర్షమునను, యోరోపా, యమెరికా ఖండములలోను పాఠశాలలందలి పుస్తకములలోనికిఁగూడ నెక్కింపఁబడి, వారికి మిక్కిలి ప్రేమాస్పదమైయున్న సిద్ధాంతమునుగుఱించి విచారింపఁ బోవుదము."

... ... ... ... ... ...

ధర్మరాజ్య, (తే. 17-2-1934, పు. 8.)

పైనదెలిపినసారాంశమునే యీవిషయములు బలపఱచుచున్నవని విదితమగుచున్నది.

## పురాణేతిహాసములలోఁ బరస్పరవిరుద్ధములు (Contradictions)ను, ప్రక్షిప్తములు (Interpolations) ను, లేవా?

వేదమునందలి జ్ఞానకాండ, కర్మకాండలకు సంబంధించిన వేదాంతవిషయములను, ధర్మాధర్మములను, చారిత్రకవిషయములునే మనపురాణేతిహాసములందు వర్ణింపఁబడియున్నవని లోగడ నీప్రకరణముననే తెలిసికొనియుంటిమి. "ధర్మశాస్త్రములన్నియు

ధర్మాధర్మముల నొక్కరీతిగనే నిర్ణయింపుచున్నవా? వానిలో నభిప్రాయభేద మున్న పట్లు నేమిచేయవలయును?" అను శీర్షికక్రింద నీగ్రంథమున లోగడ రెండవప్రకరణమునఁ దెలిసికొనియున్నయంశములే, పురాణేతిహాసములలోఁగూడ ధర్మాధర్మవిషయములకు సంబంధించినభాగములలోఁ గల పరస్పరవిరుద్ధములసందర్భమున వర్తించును. అనఁగా, ధర్మశాస్త్రములందలి ధర్మాధర్మములకు మూలమయిన వేదమే పురాణేతిహాసములందలి ధర్మాధర్మములకుఁగూడ మూలమగుటచే, ధర్మశాస్త్రములలోని ధర్మాధర్మములందలి యభిప్రాయభేదములవిషయమున లోగడ రెండవప్రకరణమున బైఁదెల్పిన శీర్షికక్రిందఁ దెల్పియున్నయంశములే పురాణేతిహాసములలోని ధర్మాధర్మములందలి యభిప్రాయభేదముల విషయమునఁగూడ సమాధానములు కాఁదగియున్నవి. వాని నచటఁ జదివి తెలిసికొనవచ్చును గావునఁ దిరిగి యిచటఁ జర్చించు టనవసరము.

ఇఁకఁ, బురాణేతిహాసములందలి కథాసందర్భములందును, చారిత్రకవిషయములందును, వేదాంతవిషయములందును గలవిరుద్ధాంశములనుగూర్చి విచారింతము. వాస్తవమగు విరుద్ధాంశములేమైన వానియందున్నచో, నట్టియంశములసంఖ్య, విరుద్ధాంశములని సామాన్యముగ జనులు భ్రమపడు నంశములసంఖ్యకంటె నెన్నియోమడుంగులు తక్కువగానుండును. ఏలననినఁ, బండితులకును విమర్శకులకునుగూడఁ బరస్పరవిరుద్ధములుగాఁ గనఁబట్టినయంశములు సహితము గొన్ని పర్యాలోచనమీఁదఁ జూడఁగా, విరుద్ధములుగాక సామరస్యముతో నొప్పారుచుండుటగూడ నొక్కొక్కప్పుడు సామాన్యముగఁ గనఁబడుచున్నది! ఒకసందర్భమున నొకరీతిగ వర్ణింపఁబడినకథాభాగమే మఱియొకచో వేఱొకరీతిగ వర్ణింపఁబడినంతమాత్రమున నారెండువర్ణనలును భిన్నములుగానున్నందున నదిపరస్పరవిరుద్ధమని జనసామాన్యము తలంచుట సహజము. కాని, మొదటివిధమగువర్ణన సరియైనది కాదనియుఁ, గథాసందర్భ మావిధముగఁ జరిగియుండలేదనియు రెండవవర్ణనమునఁ జెప్పఁబడినరీతిగనే జరిగినదనియు, నదిమాత్రమే సరియైనదనియు స్పష్టముగా నాగ్రంథమునఁ దెలుపఁబడియున్నయెడలమాత్రమే యావర్ణనలురెండును బరస్పరవిరుద్ధములని మనము గ్రహింపవలసినదేగాని, యట్లు స్పష్టముగాఁ దెలుపఁబడనిసందర్భమున నవి విరుద్ధములనితలంచుట యొక్కొక్కప్పుడు సరికాఁజాలదు. ఎట్లనఁగా, నట్టితరి "ననుక్త మన్యతో గ్రాహ్యమ్" (అనఁగా నొకచోటఁ దెల్పఁబడనివిషయము వేఱొకచోఁ దెలుపఁబడియున్నచో, మొదటివిషయమునకుఁ దోడైనవిశేషముగా రెండవవిషయమునుగూడ గ్రహింపవలయును.) అనున్యాయము ననుసరించి, మొదటిసందర్భమున వర్ణింపఁబడినవిధముగ, రెండవసందర్భమున వర్ణింపఁబడిన విశేషాంశములతోఁ గూడఁ జేరి కథ నడచియున్నదనియే మనము గ్రహింపవలయును. ఇందుల కుదాహరణ

ముగ, రాముని గుఱించిన యొకసందర్భమున నతఁడు దశరథునికొమారుఁడని యచ్చోటఁ వర్ణించియుండఁగా, వేఱొకచోట లక్ష్మణునిగుఱించినసందర్భమున నతఁడు దశరథుని కొడుకని వర్ణింపఁబడియున్నచో, వివర్శనజ్ఞానమును దూరదృష్టియునులేని సామాన్య జనుఁ డాకెండువర్ణనలను గాంచి యొకచోఁజేర్చి, "దశరథునికొడుకు 'రాముఁ'డని యొకచోఁ జెలిపియుండఁగా 'లక్ష్మణుఁ'డని రెండవచోటఁ దెల్పియున్నదిగావున నివి రెండును బరస్పరవిరుద్ధము"లని నిరసించి గ్రంథమును ద్రోసివైచును. కాని, కొంచెము బుద్ధిమంతుఁడగువాఁ డట్లు తొందరపడక కొంచెము పర్యాలోచించి, దశరథునకు రాముఁడనుకొడుకొకఁడును, లక్ష్మణుఁడనుకొడుకొకఁడునుగూడ నుండ వచ్చుననియు, రెండుచోట్ల రెండు వేఱువేఱు పేళ్లు తెలుపఁబడియుండుటచే రెండు వేఱువేఱుపేళ్లుగల వేఱువేఱుకొడుకు లిద్దఱున్నారనియే మనము గ్రహింపవలయు ననియు నిర్ణయించుకొనును. కారణమేమనఁగా, 'దశరథునికొడుకు రాముఁడేగాని యితర మేమియుఁ గా'దనికాని కాక, 'లక్ష్మణుఁడేగాని యితరముగా'దనికాని యతఁడుతప్ప దశరథునకు వేఱేకొడుకు లెవరునులేరనిగాని, పైరెండుసందర్భములలో నెచ్చోటను స్పష్టముగ వర్ణింపఁబడియుండనందున నందొక్కదానినే, సత్యముగాఁ గ్రహించి రెండవ దానిని విరుద్ధమని త్రోసిపుచ్చఁదగినయవకాశ మేర్పడియుండలేదు. కావున మొదటి విషయమునకు రెండవవిషయము బాధకముగాఁజాలదు. అందుచే మొదటిదానికి రెండవ దానిని దోఁడుగ గ్రహింపఁదగునేగాని, యొకదానిచే రెండవదానినిగాని, రెంటిని గూడఁగాని, త్రోసివేయవలసిన యవసరములేదు. ఆదేరీతిగఁ, బ్రపంచసృష్టికై బ్రహ్మ దేవునిచే సృజింపఁబడిన పదిమంది ప్రజాపతులలో నేడవప్రజాపతిపేరు 'దక్షుఁ'డని కొన్నిపురాణములు వర్ణించియుండఁగాఁ, 'బ్రాచేతసుఁ'డని మఱికొన్నిగ్రంథములు పేర్కొనియున్నవి. సామాన్యజను లారెంటినిజూచి పరస్పరవిరుద్ధములని యనుకొను టలో నబ్బురములేదు. కాని యితరగ్రంథములను బరిశోధించుచుఁబోఁగా, దక్షప్రజా పతియే శివద్వేషముచేఁ గల్గినశాపవశమునఁ 'బ్రాచీనబర్హి'కొడుకులగు 'ప్రచేతసు'లను పదిమందిరాజకుమారులకు 'మారిష'యను భార్యయందుఁ బుత్త్రుఁడై పుట్టినకథ శ్రీమ ద్భాగవత చతుర్థస్కంధముచివరఁ గానవచ్చును. అందుచే దక్షునకే ప్రాచేతసుఁ డను నామాంతరము సార్థకమైయున్నదని యప్పుడు తెలియవచ్చును. కాని, యాపురాణ మును జదివియుండనివా రాసంగతి నెఱుఁగుటయెట్లు? అందుచేఁ వారు తొందరపడి పైరెండుపేళ్లను బరస్పరవిరుద్ధము లను భ్రాంతికి లోనగుదురు. కావున నట్టిసందర్భము లలో బుద్ధిమంతులగువారు తొందరపడక, యాయన కొక్కనికే రెండువేఱువేఱుపేళ్లుండ వచ్చుననియు, నట్లుండుటకుఁ గారణము వేఱొకగ్రంథమున నెచ్చోటనైనను జెప్పఁబడి

యుండవచ్చుననియు దానిని మనము చూచియుండకపోవచ్చుననియు సమాధానము చెప్పికొనుటయే సమంజసము. కాని యాయనకు దక్షుఁడనుపేరేతప్ప యితరమగుపేరు లేదనిగాని, (కాక, ప్రాచేతసుఁడనుపేరేగాని యితరనామము లేదనిగాని,) యంచె చటనుగూడఁ జెప్పఁబడియుండనందునను, నొకదానికిఁ దోఁడుగ రెండవదానినిగూడఁ జేర్చి రెండుపేళ్లను గ్రహించుటలో నొకదానికొకటి బాధకమేమియు గాఁజాలదు గావునను, నవి పరస్పరవిరుద్ధములనిమాత్రము భ్రాంతిపడరాదు! గ్రంథపరిశీలన మభివృద్ధియగుకొలఁదిని సంశయములు సన్నగిలుటయుఁ, బరస్పరవిరుద్ధములుగఁ దోఁచు భ్రాంతులు దూరమగుటయు, విరుద్ధాంశము లదృశ్యమగుటయుఁ గొందఱి కనుభవైకవేద్యము. కావున విరుద్ధాంశములుగఁ గన్పడినవన్నియు నట్టివేకాఁజాలక, యం దత్యధికభాగము సరియైనవిగనేయుండి, యత్యల్పభాగమే యొకవేళ విరుద్ధాంశములుగఁ దేలినచోఁ దేలవచ్చును.

పైవిధమగు విమర్శనజ్ఞానమును గ్రంథపరిశీలనానుభవమును లేకపోవుటచేఁ గొందఱుతొందఱపడి,పురాణేతిహాసములలోని పెక్కువిషయములు పరస్పరవిరుద్ధములని భ్రమపడి, యందుచే నవియన్నియు నర్థశూన్యములును నసత్యములునునగు కల్పితకథలై యుండవలయుననియుఁ, గానిచో నందుఁ గొన్ని ప్రక్షిప్తములై యుండవలయుననియుఁ దలచుచు, నట్లని ప్రచారముచేయుచు, బురాణేతిహాసములయొక్క ప్రాశస్త్యమునకుఁ గళంకమును గలిగించుచున్నారు. విమర్శనజ్ఞానములేని జనసామాన్య మామాటలనునమ్మి యాగ్రంథములయెడఁ గలప్రమాణబుద్ధిని గోల్పోవుచున్నందున వానిలోఁ దెలుపఁబడినధర్మముల ననుష్ఠించుటలో వారికిశ్రద్ధ సన్నగిలుచున్నది; చరిత్రవిషయములందు విశ్వాసము నశించుచున్నది. అందుచే వారిహాపరసుఖములకు దూరులు గావలసివచ్చుచున్నది. కాని, యీగ్రంథములోని రెండవప్రకరణముచివరున, "ధర్మశాస్త్రములందుఁ బ్రక్షిప్తములు (Interpolations) లేవా?" యనుశీర్షికక్రింద నిదివరలోఁ దెలిపియున్నవిషయములను బాగుగనాలోచించినచోఁ బ్రక్షిప్తములాగ్రంథములలోనికిఁ జొచ్చుట కెన్నియాటంకములుగలవో, కావున నది యెంత దుర్ఘటమో, విశదముకాఁగలదు! పురాణేతిహాసముల విషయమునఁగూడ నన్నివిధములగు నాటంకములును నుండుటచే వానిలోఁగూడఁ బ్రక్షిప్తములు చొచ్చుట మిక్కిలి దుర్ఘటమైయున్నది. ప్రక్షిప్తములనువాదము నాధారముగాఁగొని నవనాగరకులు వైదికమతధర్మముల నధిక్షేపించుటకుఁగలకారణములను, నందులోఁగలలోపములను,ధర్మశాస్త్రముల సందర్భమునఁ బైశీర్షికక్రింది యుపశీర్షికలలోఁ జర్చించి లోగడఁ దెలిసికొనియే యున్నాము. ఆవిషయమునే పురాణేతిహాసముల సందర్భమునఁగూడ నన్నివిధములను

పర్తించును. ఆవిషయముల నచ్చటఁజూచి తెలిసికొనవచ్చునుగావునఁ దిరిగి వాని నిచటఁ జర్చించుట యనావశ్యకమని గ్రంథవిస్తరభీతిచే విడచినాము. "ఐనచో నెన్నివిధముల విమర్శించిచూచినను సమన్వయింపవీలులేని పరస్పరవిరుద్ధాంశములు పురాణేతిహాసములలో లేనేలేవని చెప్పసాహసింతురా?" యనియు, "నట్లుసాహసింపఁ జాలనిచో నందేవియొకొన్ని ప్రక్షిప్తములేయని యంగీకరించితీరక తప్పునా? అపుడుమాత్రము మీ పురాణేతిహాసములవిఖ్యాతికి భంగము వాటిల్లుటలేదా?" యనియు మననవనాగరక సోదరులు మనపై ప్రశ్నలవర్షమును గుఱిపింపకమానరు.' సమాధానమేమనిన, నట్టివిషయములు వానిలో లేనేలేవని చెప్పసాహసింపము. కాని, గ్రంథములను జూచి ప్రతులువ్రాయు లేఖకులయజ్ఞానమువలనఁగాని, యజాగ్రత్తవలనఁగాని యితర కారణములవలనఁగాని యట్టిలోపములు కొన్నిగ్రంథములలో గొన్ని ప్రతులలో నేర్పడియుండిన నుండవచ్చునేమో! అందేవిసత్యములో, యేవిప్రక్షిప్తములో తెలిసినచో బ్రక్షిప్తములనువిడచి సత్యములనే గ్రహింపవచ్చునుగదా! కాని, యట్లు చేయనేరక యంతమాత్రముచేఁ దొందరపడి, పురాణేతిహాసములయొక్క ప్రామాణ్యతను, వానివలనిప్రయోజనమును గుర్తింపనేరక, యవి పరస్పరవిరుద్ధభూయిష్టములనియుఁ, బ్రక్షిప్తదూషితములనియుఁ, గావున నప్రామాణ్యములును నిష్ప్రయోజనములు నగు గ్రంథాభాసములనియుం నిరసించుట పట్టియవివేకవిలసితమని చెప్పవలసియున్నది. ఏలననఁగా, నీప్రకరణమునఁ బ్రారంభమునుంచియుఁ బురాణేతిహాసములను గుఱించి చర్చింపఁబడినవిషయములను జాగ్రతతోఁ గ్రమముగాఁ బరిశీలించుచువచ్చినచో, నాగ్రంథములయొక్క ప్రాశస్త్యమును, బ్రయోజనమును విశదముకాకమానదు. అట్టియుత్కృష్టగ్రంథములలో నెచటనో యేమూలనో నేవియొకొన్నిప్రమాదములు లేఖకులలోపముచేఁ గలిగియున్నచో, నట్లేర్పడినలోపములేవియో నిర్దుష్టమగు మూలవిషయమేదియో గనిపెట్టి, దోషములను విడనాడి మిగిలినవానిని గ్రహించి యాగ్రంథములవలని ప్రయోజనమును బొందుటకే బుద్ధిమంతుఁడగువాఁడు యత్నింపఁదగునుగాని, యేవియొకొన్నిలోపము లున్నవనునెపముచేఁ బ్రయోజనకరములగు నితరవిషయములనుగూడ విడనాడుట ప్రాజ్ఞలక్షణము కాఁజాలునా? "అట్లు మూలవిషయమేదియో ప్రక్షిప్తమేదియో కనిపెట్టుటకు సాధ్యము కానిచోనేమి చేయవలయు" నందురా? అపు డారెండువిషయములలోఁ బ్రామాణ్యమేదియో యప్రామాణ్యమేదియో నిర్ణయించుట కాధారము దొఱకలేదు గావున ననుమానముచే రెండును నప్రామాణ్యములని త్రోసిపుచ్చుటకంటె గ్రంథమునకుఁగల గౌరవాతిశయము నాలోచించి, యట్టియాధారము దొఱకునంతవఱకును రెండువిషయములనుగూడఁ బ్రామాణ్యములుగనే

గ్రహించుటే యుక్తము. "పరస్పరవిరుద్ధవిషయములను రెంటినిగూడఁ బ్రామాణ్యములుగ గ్రహించుట యెట్లుపొసగు"నందురా? లోఁగడ రెండవప్రకరణమున ధర్మశాస్త్రముల విషయమున, "ధర్మశాస్త్రములన్నియు ధర్మాధర్మముల నొక్కరీతిగనే నిర్ణయింపు చున్నవా? వానిలో నభిప్రాయభేదమున్నపట్ల నేమిచేయవలయు!" ననుశీర్షిక క్రిందఁ దెలిపియున్నట్లుగ, "తుల్యబలవిరోధే వికల్పః" (అనఁగా, "సరిసమానమగు బలముగల రెండుప్రమాణము లొకదానికొకటి విరుద్ధములుగ నున్నచో నం దిష్టమువచ్చినదానిని దేనినైన నొకదానిని గ్రహింపవచ్చును.") అను గౌతమధర్మశాస్త్రవాక్యము ననుసరించి, పురాణేతిహాసములలోఁగూడఁ బరస్పరవిరుద్ధవిషయములపట్లఁ బ్రామాణ్యమేదియో యప్రామాణ్యమేదియో నిశ్చయింప సాధ్యముగానిసందర్భములలో, నాత్మబుద్ధినుపయోగించి యోజించిచూచి యారెంటిలోఁ దనయిష్టమువచ్చినదానిని సత్యముగ గ్రహించి రెండవదానిని విడిచిపుచ్చవచ్చును. కాని, యంతమాత్రమునకై యాగ్రంథముయొక్క ప్రామాణ్యతకును బ్రతిష్ఠకును భంగము నాపాదింప నవసరము లేదు. కావున నట్లాపాదించుట యనవసరము, నజ్ఞానవిలసితము, ననుచితమును నని చెప్పవలసియున్నది. కావునఁ బురాణేతిహాసములుగూడ, శ్రుతిస్మృతులవలెనె నిర్దుష్టములగు ప్రమాణరాజములని తేలుచున్నది.

## పురాణేతిహాసములు పుక్కిటికథలు (Fables) కావా?

పురాణములు పుక్కిటికథలను దుర్వాదము ప్రస్తుతపు నవనాగరకులలో ననేకులందుమాత్రమే గాక, పూర్వాచారపరాయణులలోఁ గొందఱియందుఁగూడ నచ్చటచ్చట కొంచెము గనుపించుచున్నది. ఇందులకు హేతువు, పైయుభయులును బురాణాదులను సమగ్రముగఁజదివి తెలిసికొనక, యిష్టమువచ్చినభాగములనుమాత్ర మక్కడక్కడఁ జదివివిడచుటచే, వానియందలి విషయములన్నియు సరిగాఁ దెలియకపోవుటవలన నేర్పడిన హ్రస్వదృష్టియేగాని, వేఱేమియు లేదు. సామాన్యముగ నిట్టివారు పురాణాదులందలి కథాభాగములనుమాత్రమే చదువుటయం దెక్కువ రుచిమఱిగియుందురుగాని, యితరవిషయములు వారికిఁ గొంచెమైనను దలకెక్కవు. ఇందువలన వానియందలి యమూల్యములగు నితరవిషయములన్నియు వీరిదృష్టిలో మఱుగుపడియుండును. ఇందుల కుదాహరణముగ శ్రీమద్భాగవతపురాణవిషయ మాలోచింతము. ఈపురాణ మెవ రెవరి కేసందర్భమున నెచట నెపుడుచెప్పినదియు, వినువా రేమివినఁగోరి యడిగినదియుఁ, జెప్పెడివా రేమిచెప్పినదియుఁగూడ నెఱుఁగనివారు దానిని జదువువారిలో నెందఱో గలరు. "పరీక్షిత్తను రాజునకు శుకమహర్షి దానిని జెప్పె"నని యెఱిఁగినవారుగూడ వారిలోఁ గొందఱున్నను, వా రేమి ప్రశ్న యడిగినమీఁదట శుకులు దీనిని జెప్పిరో,

యావిషయ మెఱుఁగనివారుగూడ ననేకులుగలరు. అట్టివారు, కేవలము భగవంతుని కథలు చెప్పుమని రాజుకోరెననియు, శుకులుచెప్పిరనియుమాత్రమే యెఱుఁగుదురు. ఏలననఁగా, వారు భాగవతము నెపుడుచదువఁదలచినను, దశమస్కంధమున శ్రీకృష్ణావతారకథలనో, కానిచో సప్తమస్కంధమున ప్రహ్లాదచరిత్రమునో, తప్పినచో నష్టమస్కంధమున, గజేంద్రమోక్షమునో, వామనావతారచరిత్రనో, చతుర్థస్కంధమున ధ్రువోపాఖ్యానమునో, ఇట్టికథల నేమఱికొన్నిఁటినో మాత్రమేచదివి స్వస్తిచెప్పి గ్రంథమును మూయుదురేగాని, యాకథలకుఁ బూర్వాపరసందర్భములెట్టివో యని గూడఁ జూడనొల్లరు. కావున నేవో భగవంతునియొక్కకథలు చెప్పుమని రాజుకోరెననియు, యోగిచెప్పెననియుమాత్రమే తలంచెదరు.

కాని, నిజమాలోచింపఁగ నట్లులేదు. ఏమనఁగాఁ, బరీక్షిత్తు భగవద్భక్తశిఖామణియగుమాట సత్యమే. శుకులుగూడ, నట్టిభక్తాగ్రేసరశిరోమణులగుట మాత్రమే గాక, బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యులనుమాటయు యథార్థమే. రాజు భగవత్కథలు వినఁగోరినదియుఁ నిజమే. ఆట్టిభగవత్కథాశ్రవణమే ప్రాయోపవిష్టుఁడైన రాజునకుఁ బరమోత్కృష్టపదవి నొసంగునని యాయనకు శుకమహర్షి చెప్పినమాటయు వాస్తవమే. కాని, పైజనులు తలంచునట్లుగ నొకదానికిని వేఱొకదానికిని సంబంధములేని యట్టిభగవత్కథలుమాత్రమే వినఁగోరి రాజడిగియుండలేదు; శుకు లట్లు చెప్పియునుండలేదు. ఇఁకేమనినఁ, బ్రపంచసృష్టికిని బ్రపంచచరిత్రకును సంబంధించిన పెక్కువిషయములను, వేదములందలి సర్వధర్మములను, వేదాంతములందలి నిఖిలరహస్యములను, వేదశాస్త్రప్రతిపాదితమగు వైదికమతతత్త్వస్వరూపమును, మఱియుఁ బెక్కితరశాస్త్రవిషయములను (భూగోళ, భగోళ, ఖగోళశాస్త్రములు మున్నగువానిని)గూడ భగవత్కథలతోబాటుగఁ బరీక్షిన్మహారాజు సమగ్రముగా వినఁగోరి యడిగినట్లును, నట్టివిషయములన్నిఁటికిని శుకమహర్షి విపులముగను వివరముగను సమాధానముచెప్పినట్లును నీదిగువఁ జూపఁబోవు ప్రశ్నోత్తరములవిధానమునుబట్టి స్పష్టమగుచున్నది:—

## పరీక్షిత్తు శుకుని బ్రపంచోద్భవాదికంబు నడుగుట.

... ... ... ... ... ...

"వ. మఱియును భూతేశ్వరుండయిన సర్వేశ్వరుం డుత్పత్తిస్థితిలయకారణంబైన తనమాయనువిడిచి రమానాయకుండై యేయేప్రదేశంబుల శయనంబు సేసె? నదియునుంగాక పురుషావయవంబులచేఁ బూర్వకాలంబున లోకపాలసమేతంబులైన లోకంబులెత్తెఱంగునఁ గల్పితంబులయ్యె? నదియునుంగాక మహాకల్పంబులును, నవాంతరకల్పంబులును, భూతభవిష్యద్వర్తమానకాలంబులును, దేహాభిమానులై జనియించిన దేవపితృమను

షష్ఠ్యాదులకుం గలుగునాయుః ప్రమాణంబులును, బృహత్సూక్ష్మకాలానువర్తనంబున నేయే
కర్మంబులంజేసి జీవు లేయేలోకంబుల నొందుదురు? మఱియు నేయేకర్మంబులంజేసి
దేవాదిశరీరంబులు బ్రాపింతు రట్టికర్మమార్గప్రకారంబును, సత్త్వాదిగుణంబుల పరిణా
మంబులగు దేవాదిరూపంబులం గోరుజీవులకు నేయేకర్మసముదాయం బెట్టు సేయందగు?
నెవ్వనికి నర్పింపందగు? నవి యెవ్వనిచేత గ్రహింపబడు? భూపాతాళకకుబ్వ్యోమ
గ్రహనక్షత్రపర్వతంబులును, సరిత్సముద్రంబులును, ద్వీపంబులు నేప్రకారంబున సంభ
వించె? నాయాస్థానంబులం గలవారి సంభవంబు లేలాగు? వియద్బాహ్యాంతరంబులంగల్గు
బ్రహ్మాండప్రమాణం బెంత? మహాత్ములచరిత్రంబు లెట్టివి? వర్ణాశ్రమనిశ్చయంబులును,
ననుగతంబులై యాశ్చర్యావహంబులగు హరియవతారచరిత్రంబులును, యుగంబులును,
యుగప్రమాణంబులును, యుగధర్మంబులును, బ్రతియుగంబునందును మనుష్యుల కేయే
ధర్మంబు లాచరణీయంబు లట్టిసాధారణధర్మంబులును, విశేషధర్మంబులును, జాతివిశేష
ధర్మంబులును, రాజర్షిధర్మంబులును, నాపత్కాలజీవనసాధనభూతంబులగు ధర్మంబు
లును, మహదాదితత్త్వంబులసంఖ్యయు, సంఖ్యాలక్షణంబును, నాతత్త్వంబులకు హేతు
భూతలక్షణంబులును, భగవత్సమారాధనవిధంబును, నష్టాంగయోగక్రమంబును, యోగీ
శ్వరుల యణిమాద్యైశ్వర్యప్రకారంబును, వారల యర్చిరాదిగతులును, లింగశరీర
భంగంబులును, ఋగ్యజుస్సామవేదంబులును, నుపవేదంబులైన యాయుర్వేదాదులును,
ధర్మశాస్త్రంబులును, నితిహాసపురాణంబుల సంభవంబును, సర్వభూతంబుల యవాంతర
ప్రళయంబును, మహాప్రళయంబును, నిష్టాపూర్తంబులును, యాగాదివైదికకర్మజాలంబు
లును, వాపీకూపతటాక దేవాలయాది నిర్మాణంబులును, నన్నదానం బారామప్రతిష్ఠ
మొదలగు స్మార్తకర్మంబులును, గ్రామ్యంబులైన యగ్నిహోత్రంబుల యనుష్ఠానప్రకా
రంబును, జీవసృష్టియు, ధర్మార్థకామంబులనియెడు త్రివర్గంబుల యాచరణప్రకారం
బును, మలినోపాధిక పాషండసంభవంబును, జీవాత్మబంధమోక్షప్రకారంబును,
స్వస్వరూపావస్థానవిధంబును, సర్వస్వతంత్రుండైన యీశ్వరుం డాత్మమాయంజేసి సర్వకర్మ
సాక్షియయ్యు, నమ్మాయ నెడఁబాసి యుదాసీనగతిని విభుండై క్రీడించు తెఱంగును
గ్రమంబున బ్రపన్నుండనైన నాకు నెఱింగింపుము. "బ్రాహ్మణశాపంబునంజేసి శోక
వ్యాకులితచిత్తుండవై యనశనవ్రతుండవైననీవు వినుట యె"ట్లని సందేహింపవలవదు.
త్వదీయముఖారవిందవినిస్సృత నారాయణకథామృతపాన కుతూహలినైన నాకు
నింద్రియంబులు వశంబులై యుండు; నది గావున నేనడిగిన ప్రశ్నంబులకు నుత్తరంబులు
సవిస్తరంబులుగా నానతిచ్చి కృతార్థునింజేయఁ బరమేష్ఠితుల్యుండవగు నీవ, పూర్వ
సంప్రదాయానురోధంబున నర్హుండవగుదువని విష్ణురాతుండగున పరీక్షిన్నరేంద్రుండు

బ్రహ్మరాతుండైన శుకయోగి నడిగిన నతండు బ్రహ్మనారదసంవాదంబును నేకసంప్ర దాయానుగతంబును గతానుగతికప్రకారంబును నై తొల్లి సర్వేశ్వరుండు బ్రహ్మకల్పం బున బ్రహ్మకుపదేశించిన భాగవతపురాణంబు వేదతుల్యంబు నీకెఱింగింతు వినుమని చెప్పెనని సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.'' 222.

... . ... ... ... ... ...

పరీక్షిత్తు ప్రశ్నించిన యీపైవిషయములకు శుకమహర్షి చెప్పిన సమాధానము నే, యీప్రకరణము మొదట ''పురాణములనుగుఱించి ప్రాచీనచరిత్ర లేమిచెప్పు'' నను శీర్షికక్రింద భాగవతపురాణ లక్షణములనుగురించి ముచ్చటించుచోట వివరించి యుంటిమి. గ్రంథవిస్తరభీతిచే దిరిగి యిచట నుదాహరింప మానితిమి. కావున నచట దానిని జూడఁదగును.

ఈ పైప్రశ్నోత్తరములనుబట్టిచూడఁగా, భాగవతపురాణము పై ప్రశ్నలకన్నిఁ టికిని సమాధానముకాఁగలదని శుకులు దానినిజెప్పినట్లు విశదమగుచున్నది. కావున భాగవతపురాణము వైదికమతరహస్యములను ధర్మములను నామతచరిత్రమునుమాత్రమే గాక సృష్టిసంబంధములును ప్రపంచసంబంధములును నగు నితరచరిత్రవిషయములను గూడ బెక్కింటిని జరిగియున్నవానిని, జరుగుచున్నవానిని, జరుగనున్నవానినిగూడ మొట్టమొదటినుండియు వరుసగఁ బూసగ్రుచ్చినట్లు వర్ణించి చెప్పుచు, సందర్భానుసార ముగఁ జరిత్రవిషయమధ్యమునవచ్చిన భగవంతునియవతారకథలను,భగవదంశసంభూతు లును, భగవద్భక్తశిరోమణులను నగు మహనీయులమహిమాతిశయములను విస్తారముగ వర్ణించిచెప్పుచున్నది. కాని పూర్వాపరసందర్భశూన్యములగు పట్టివిడివిడికథలను జెప్పుట కేర్పడియుండలేదు. మైత్రేయులప్రశ్నలకుఁ బరాశరులసమాధానములతోఁగూడిన విష్ణుపురాణము మొదలగు నితరపురాణములుగూడ యించుమించుగఁ బైనదెల్పినట్టి విషయములనే కొన్నికొన్ని యితరవిశేషవిషయములతోఁజేర్చి ముచ్చటించుచున్నవి. కావునఁ బైవిమర్శనుబట్టిచూడఁగాఁ బురాణములు పుక్కిటికథలని యనుకొనుట పరమ ప్రమాదమనియు, వానియందలివిషయము లమూల్యములనియు బుద్ధిమంతులకు విశదము కాఁగలదు.

ఇచట నొకసంశయము గలుగవచ్చును. ఏమనఁగా: ''సర్వసంగములను బరిత్య జించి చావున కెదురుచూచుచు మోక్షమార్గ మన్వేషించుకొనఁ దలఁచియున్న పరీ క్షిత్తునకుఁ బ్రపంచచరిత్రవిషయములతోఁ గూడిన పైప్రశ్నములతోఁ బ్రమేయ మేమి'' యనియు ''నాయన యొకవేళ యట్టిప్రశ్నలడిగినను, బ్రహ్మనిష్ఠాగరిష్ఠులలో

నగ్రగణ్యుఁడై యితరులు పిలిచినను బలుకనొల్లని శ్రీశుకమహర్షి యట్టిప్రశ్నల నుపేక్షింపక యోపికతో సమాధాన మెట్లుచెప్పె'' ననియును గొందఱు సంశయింపవచ్చును. దానికి మేము సమాధానము చెప్పుటకంటెఁ బరీక్షిత్తుచెప్పిన సమాధానమును జూపుటయే మంచిదని యెంచి యీక్రిందఁజూపుచున్నాము; ఈక్రిందివచనమునఁ గ్రిందగీటుగల వాక్యమును జూడుఁడు.

"వ. మునీంద్రా! సూర్యరశ్మి యెందాఁకం బ్రవర్తిల్లు నక్షత్రయుక్తంబైన చంద్రకిరణంబు లెంతమేరఁ దిరుగు నంతదూరంబు ప్రియవ్రతుని రథనేమి ఘట్టనలచేత సప్తద్వీపంబులును సప్తసముద్రంబులు నయ్యె నని పలికితి; వాద్వీపసముద్రంబుల పరిమాణంబులు సవిస్తరంబులుగా నెఱిఁగింపుము. గుణమయంబును స్థూలరూపంబును నయిన శ్రీహరి శరీరంబగు నీలోకంబునందు నిలిపిన చిత్తం బగుణంబును సూక్ష్మంబును నాత్మజ్యోతియు బ్రహ్మంబును నైన వాసుదేవునియందు నిల్చుం గావున ద్వీపవర్షాది విస్తారంబు వినిపింపుమనిన శుకయోగీంద్రుం డిట్లనియె."

శ్రీమదాంధ్రభాగవతము, స్కం. ౫, ఆశ్వా. ౨, వచ. ౧౪.

## ఉపసంహారము.

ఈగ్రంథమునం దిప్పటివఱకును జర్చింపఁబడిన విషయములవలనఁ దేలిన సారాంశ మేమనఁగా: వైదికమతముయొక్కచరిత్రమును దెలిసికొనుట కాధారములగు ప్రాచీనచరిత్రలకును నవీనచరిత్రలకును, మన మతగ్రంథములును మతధర్మములును మొదలగు కొన్నివిషయములందుఁ బరస్పరవిరుద్ధములగు నభిప్రాయము లేర్పడియున్నందున వానివానిని విశ్వసించియున్న పూర్వాచారపరాయణులకును నవనాగరకులకును మఱివిషయములం దభిప్రాయభేదము లేర్పడి,నవనాగరకులు పూర్వాచారపరాయణులను వంచింప యత్నించుచుండుటచే, నది కలహకారణమై దేశముయొక్క నైకమత్యమునకు భంగకరముగానున్నదని యీగ్రంథముయొక్క మొదటిప్రకరణమునఁ దెలిసికొనియుంటిమి. అందుచే, నీరెండువిధములగుచరిత్రలలో నేవి తెల్పువిషయములు సత్యములనియు, నేవి తెల్పునవి యసత్యములనియుఁ బ్రశ్నించుకొని, చర్చించి, విమర్శించి, వానిలోఁ బ్రాచీనచరిత్రలే సత్యమును దెల్పునవనియు, నవీనచరిత్ర లట్లు కావనియుఁ దేల్చియుంటిమి. అట్టి ప్రాచీనచరిత్రలలో మొదటివగు వేదములనుగుఱించి యీగ్రంథముయొక్క మొదటిప్రకరణమునను, వానితరువాతవి యగు స్మృతులనుగుఱించి రెండవప్రకరణమునను, చిమ్మటివగు పురాణేతిహాసములనుగూర్చి యిపు డీమూఁడవప్రకరణమునను విపులముగఁ జర్చించి, వానియొక్కప్రాశస్త్యమును, ప్రాముఖ్యతయును, బ్రహ్మో

జనమును దెలిసికొనియుంటిమి. వానివిషయమున సామాన్యముగ నిప్పటి నవనాగరకులకుఁ గలసంశయములను, నాక్షేపణములనుగూడ నాయాప్రకరణములందే చర్చించి సమాధానములను దెలిపియుంటిమి. అందుచేఁ బ్రాచీనచరిత్రలయొక్క యుత్కృష్టత స్థిరపడియున్నది. కావున నిఁక మనవైదికమతమునకు సంబంధించిన మిక్కిలిముఖ్యములగు కొన్నిచారిత్రకవిషయములనుగుఱించి మనప్రాచీనచరిత్ర లేమిచెప్పియున్నవో, యందులకువిరుద్ధముగ నవీనచరిత్ర లేమిచెప్పినవో, యట్టివిరుద్ధవిషయములను మనదేశీయులగు నవనాగరకులు నేర్చికొనియుండుటచే నందుమూలమున మనమతమున కెట్టియెట్టియుపద్రవములు వాటిల్లి దేశమున కెట్టియనర్థములు సంభవించియున్నవో, విచారించి తెలిసికొనవలసియున్నది. అందు, "సృష్టి యెప్పుడుజరిగిన?" దనువిషయమును గుఱించి రాఁబోవునాల్గవప్రకరణమునందు విమర్శించి తెలిసికొనఁబోవుచున్నాము.

మూఁడవప్రకరణము సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1936

